ఓం శత్ సత్ ఓమ్

శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళి

# ఈశ్వరకృప

(రెండవ సంపుటము)



రచన:

శ్రీ మలయాళస్వాములవారు



ప్రకాశకులు:

శ్రీ వ్యాసాశ్రమము

1996

| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణ | 1946 వ సం॥రం | 1000 ప్రతులు |
| ద్వితీయ ముద్రణ | 1979 వ సం॥రం | 1000 ,, |
| తృతీయ ముద్రణ | 1996 వ సం॥రం | 2000 ,, |

వెల రూ. 50-00

ప్రకాశకులు :-
శ్రీ వ్యా సా శ్ర మ ము వా రు

దొరకు చోటు :-
మేనేజరు - శ్రీ వ్యాసాశ్రమము
వ్యాసాశ్రమము పోస్టు, 517 621, ఏర్పేడు మార్గము
చిత్తూరు జిల్లా (ఆం. ప్ర.)
S. T. D. 08574 ఫోన్ 68528

ముద్రణ:
శ్రీ పారాశర్య ముద్రాక్షరశాల, శ్రీ వ్యాసాశ్రమము.

ఓమ్ తత్ సత్.

# విషయసూచిక

ఓం తత్ సత్ ఓమ్.

# శ్రీ సద్గురు జీవిత చరిత్ర

తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాల సంస్కృతోపన్యాసలుకు శ్రీసముద్రాల లక్ష్మణయ్య M. A., గారిచే విరచింపబడిన మహోన్నత గ్రంథము 'శ్రీ సద్గురు జీవిత చరిత్ర'

శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు ఈ గ్రంథమునందు శ్రీ మలయాళ స్వాములు అని ఆంధ్రదేశమునందు ప్రసిద్ధిగాంచిన శ్రీ అసంగానందస్వాముల వారి జీవితచరిత్రను బాల్యమునుండి నిర్యాణస్థితివరకు జరిగిన సంఘటనలను చాల విపులముగా చక్కని గ్రాంధికశైలిలో ద్రాక్షాపాకపద్ధతిన కన్నులకు కట్టినట్లుగా వివరించియున్నారు.

శ్రీవారు పాదచారులై ఆసేతు శీతనగపర్యంతము పశ్చిమ సముద్ర ద్వారక పూర్వసముద్ర జగన్నాథములు మొదలుగాగల తీర్థక్షేత్ర పుణ్యా శ్రమము లనేకముల సేవించి ఏయే పుణ్యాశ్రమములలో నే యే ధర్మము లేలాగున జరుగుచున్నవియు, మహాత్ములయొక్కయు, ఆశ్రమముల యొక్కయు, ధర్మములయొక్కయు నిజస్వరూపమును దెలిసికొని అట్టి ఆశ్రమము నొకదానిని నిర్మింప సంకల్పించిరి.

ఆంధ్రదేశము జేసిన పుణ్యపరిపాకమున అట్టి ఆశ్రమము ఆంధ్రదేశ ఏర్పేడు సమీపమున శ్రీవారిచే నెలకొల్పబడి శ్రీవ్యాసాశ్రమముగా మహోన్నతిని పొందినది.

శ్రీవారు కుల వర్ణలింగభేదములు పాటింపక అధ్యాత్మిక క్షేత్రమున స్త్రీపురుషులను పక్షపాతరహితముగా సమానముగా ఉన్నతులను గావించిరి. సంస్కృత విద్యావ్యాప్తికి ఎనలేని సేవ యొనరించిరి. వేయేల శ్రీమద్భగ వద్గీతకు తమ జీవితమునే భాష్యము గావించిన శ్రీవారి జీవితచరిత్రను సర్వాంగసుందరముగా విరచించిరి శ్రీసముద్రాల లక్ష్మణయ్యగారు.

ఇయ్యది డెమ్మి 1/8 సైజులో త్రివర్ణముఖచిత్రముతో చాల ఆకర్ష ణీయ గ్రంథము. ప్రతివారు తప్పక చదువవలసిన పొత్తమిది. ప్రతి యొకటికి వెల 32-00 రూ. మాత్రమే. ప్రాప్తిస్థానము శ్రీవ్యాసాశ్రమము.

ఓమ్

# పీఠిక



ఈశ్వర కృపవల్లనే ఈ గ్రంథములను రచించడమైనది. అంతేగాక ఈ యుపాధివల్ల యే యే కార్యములు - లోకమున కుపయోగార్థముగా గలిగి యుండిన - అవియున్ను ఈశ్వర కృపవల్లనే కలిగినవి. ఇకను ఏదైన కలుగనుండిన, అదిన్ని ఈశ్వరానుగ్రహమువల్లనే కలుగనున్నదని నిశ్చయ బోధము కలిగి యుండుటవల్లనే ఈలాగున వ్రాయుటకు కారణమైనది. ఇపుడున్ను కలుగుచున్నదికూడ ఈ సర్వేశ్వరుని కరుణవల్లనే కలుగుచున్నదని దృఢమైననమ్మకము కలదు. ఇక యొకమెట్టు పై భాగమున కెక్కి చూచిన, ఈశ్వరుడే ఈ యుపాధియందుండి లోకమున కీలాంటి యుపయోగ కార్యములు చేయుచున్నాడని కూడ నమ్మకము కలుగవచ్చును. పై చెప్పినదానికన్న ఈ రెండవది మరింత ఎక్కువ స్థితిలో నిలుకడ కలిగి యుండును. ఈ రెండును బ్రహ్మవేత్తలు చెప్పుచున్న పరభక్తియున్ను, అపర భక్తియున్ను కలిగియుండునని గ్రహించుకొనవలయును. ఇట్లు వ్రాయుటచే అందరు చేయు కార్యములున్ను ఈశ్వరుడే చేయుచున్నాడని చెప్పకూడదా? యని సందేహము కలుగ నక్కరలేదు ఎవరి కట్టి భావము కలిగియుండునో వారికి మాత్రమే ఆ వాక్యము సఫలమగును. ఈ రెండు వాక్యములున్ను చాల హెచ్చుమార్గములోనే కలవు.ఈ స్థితిలో బంధము కలుగుటగాని అహంకారము జనించుటగాని యుండదు. అట్లు కానివారందరున్ను ఈశ్వరానుగ్రహమువల్లనే మనకు భవబంధ విముక్తి కలుగవలయునని తలంచుటయే బాగుండును. అట్లు తలంచుటవల్ల ఈశ్వర నియమమగు ధర్మమును అనుష్ఠించ వలయునేగాని విడువరాదను బుద్ధియే అతనికి కలుగును. ఇదే అహంకారము నశించుటకున్ను, ఈశ్వర రాజ్యమును పాలించుటకున్ను, శ్రేయస్సు గలుగుటకున్ను మంచి కారణమగును. ఇక ఈ విషయమై చెప్ప నక్కరలేదు. ఈశ్వరానుగ్రహమువల్లనే జీవులకు భవబంధవిముక్తి గలుగవలసి యుండునన్ని పరమఋషులున్ను శాస్త్రములున్ను చెప్పెడు సంగతులను కొంచె మిచట భక్తులకొఱకు తెలిపెద. ఇది ఆస్తికులందరికిన్ని సమ్మతమగును. శ్రీవ్యాసాది ఋషులందరున్ను భాగవతాది గ్రంథములున్ను శ్రీ గీతలో శ్రీ కృష్ణభగవా-

నులున్ను ఇదే ఉపదేశించియున్నారు. కేవల బ్రహ్మాత్మైక్యబోధముకలవారున్ను త్రిమూర్త్యాత్మకావతారులునగు శ్రీదత్తాత్రేయులుగూడ తానురచించిన అవధూతగీతలో ప్రప్రథమమున దీనినే యుపదేశించియున్నారు. అదేమనగా?

ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైత వాసనా।
మహా భయ పరిత్రాణా ద్విప్రాణామువజాయతే॥

అద్వైత జ్ఞానము యొక్కతలంపు, ఈశ్వరకృపవల్లనే జీవులకు కలుగు చుండును. రక్షకులు లేనివారిని జనన మరణమను మహాభయము నుండి జీవుల రక్షించునది ఈశ్వరానుగ్రహ మొకటియేయగును. శ్రీశంకర భగవత్పాదులుకూడ "ప్రశ్నోత్తరమణి రత్నమాల" యందును, ఇట్లే యుపదేశించి యున్నారు.

అసార సంసార సముద్రమధ్యే। నమ్మజ్జతోమే శరణం కిమస్తి।
గురో కృపాళో కృపయావదైతద్విశ్వేశ పాదాంబుజ దీర్ఘనౌకా॥

సారములేని సంసారమను దుఃఖసాగరములో మునుగుచుండు వానికి తరణోపాయమెద్దియని శిష్యుఁడడుగగా, సర్వేశ్వరుని చరణారవిందధ్యానమనెడు దీర్ఘముగాను, దృఢముగానుండు ఓడయే ముఖ్యసాధనమని సెలవిచ్చిరి. అద్వైతజ్ఞానసాగరులగు శ్రీదత్తాత్రేయులున్ను, శ్రీశంకర భగవత్పాదులున్ను ఇట్లుచెప్పుటవల్ల భగవత్కృపవల్లనే అట్టిఅఖండైక జ్ఞానము కలుగునని చెప్పుటకు కారణమైనది. కనుకనే ఈగ్రంథమునకు "ఈశ్వరకృప" అనిపేరు పెట్టుటకు కారణమైనది. నిజముగా విచారించిన నిర్మలమగు భక్తియనెడు తైలమే జ్ఞానమనెడు జ్యోతియై ప్రకాశించుచుండును. దీనిని చక్కగావిచారించిన చమురు వేరు వెలుతురు వేరుగాదని గోచరము కాగలుగును. తైలముయొక్క పరిణామమే జ్యోతియను జ్ఞానము కలుగును. అలాగున పుష్పమునుండియే ఫలమేర్పడును. పుష్పము వినా ఫలముకలుగదు. అదేరీతిగా భక్తివల్ల హృదయము వికసించినపుడు దానియందు నిగూఢమై సాక్షియై వెలుగుచుండెడు, ఆత్మజ్ఞానమనెడు ఫలము కలుగుచుండును. మరియు ప్రపంచములోగల ఏబీజమైనను, జలముయొక్క సహాయముచేతనే వృక్షమగునట్లు, బీజరూపముగా

నుండు జీవుడు దైవభక్తియను జలమువల్ల క్రమముగా వికాసము నొంది పూర్ణజ్ఞానమును పొందుచుండును.

యథా సమస్తలోకానాం జీవనం సలిలం స్మృతమ్ ।
తథా సమస్త సిద్ధీనాం జీవనం భక్తి రిష్యతే ॥

ఏలాగున సమస్తజీవకోట్లకు జలమే జీవనాధారముగానుండునో అలాగున జీవునకు కలుగవలసిన ఆధ్యాత్మిక జ్ఞానము మొదలగు సిద్ధులకున్ను భక్తియే ప్రాణమువంటిదగును.

యతః పాపార్ణవం త్రాతుం భక్తిర్నౌరివనిర్మితా ।

ఏలాగున క్షారోదకముగల సముద్రమును దాటుటకు నావఏర్పడి యున్నదో, అలాగున సంసారమనెడి పాపార్ణవము దాటుటకు భక్తియనెడు నావను సర్వేశ్వరుడు నిర్మించెను.

జ్ఞాన లభ్యం పరంమోక్షం ప్రాహుస్తత్త్వార్థచింతకాః ।
తద్జ్ఞానం భక్తిమూలం చ భక్తిః కర్మవతాం తథా ॥

ఆత్మ తత్త్వార్థచింతకులగు ఋషులు పరమమైనమోక్షము జ్ఞానమువల్లనే లభించునని చెప్పిరి. అయితే అట్టిజ్ఞానమునకు భక్తియే మూలమని యుపదేశించిరి. అట్టి దైవభక్తి సత్కర్మ పరులకే గలుగునని వచించియున్నారు.

కలికాలోరగాద్దంశాత్కిల్బిషాత్కాలకూటతః ।
హరిభక్తిసుధాం పీత్వా ఉల్లఙ్ఘ్యో భవతి ద్విజః ॥

కలికాలమనెడు నల్లత్రాచుకాటువల్ల కలిగెడు కాలకూటమనెడు పాపము గలవారు, భగవద్భక్తియను అమృతమును పానముచేసి తరించవలసియుందురు.

జ్ఞానతోఽజ్ఞానతో వాపి వాసుదేవస్య కీర్తనమ్ ।
తత్సర్వం విలయం యాతి తోయస్థం లవణంయథా ॥

జ్ఞానముతో అయినను లేక జ్ఞానములేక అయినను చేయుభగవత్సంకీర్తనము ఎటువంటిదనగా, జలములో నుంచిన లవణమేలాగున జలమయమై పోవునో,

అలాగుననే జీవులుకూడ భక్తియనెడు జలములో మునిగిన భగవన్మయులు గాగలరు. అనగా తెలిసిగాని తెలియకగాని భగవద్ధ్యానము గలవారు భగవంతునందైక్యము నొందగలరు. లవణము జలమయముగా చేయుమని జలమును ప్రార్థింప నక్కర లేదు గదా! జలములో లవణముంచిన జలమయమై పోవును జ్ఞానము లవణమున కక్కరలేదు అలాగున, జీవేశ్వరుల ఐక్యస్వరూపము తెలిసినను తెలియకపోయినను. దానియొక్క ఫలితము కలుగును.

సత్యం వచ్మి హితం వచ్మి సారం వచ్మి పునః పునః ।
అసారే దగ్ధ సంసారే సారం తత్ర శివార్చనమ్ ॥

నేను సత్యమును చెప్పుచున్నాను. లోకహితమును చెప్పుచున్నాను. మరల మరల సారమును చెప్పుచున్నాను. అదేమన? సారము లేనిదైన సంసార తాపత్రయములచే తపించెడు ఈ సంసారమునందు ఈశ్వరార్పిత హృదయముగల భక్తి యొకటియే సారమైనది.

అతో మద్భక్తి యుక్తస్య జ్ఞానం విజ్ఞానమేవచ ।
వైరాగ్యంచ భవేచ్ఛీఘ్రం తతోముక్తి మవాప్నుయాత్ ॥

భగవద్భక్తి యుక్తుడైన మనస్సుగలవానికి శీఘ్రముగా విషయములలో విరక్తి గలుగును. అందువల్ల అమానిత్వాది జ్ఞానమున్ను లేక పరోక్ష జ్ఞానమున్ను కలుగును. తరువాత అనుభవ సాక్షాత్కార జ్ఞానమున్ను లేక అపరోక్షజ్ఞానమున్ను సిద్ధించును. దానివల ముక్తియును పొంద కలుగును.

తావద్భ్రమంతి సంసారే దారుణే దుఃఖసంకులే ।
యావన్నోచ్చారయంతీమం మంత్రం. దేహభృతః సకృత్ ॥

దేహధారియగు జీవుడు ఎంతవరకు భగవన్నామోచ్చారణము ఒకసారి యైనను చేయలేదో, అంతవరకే దారుణమై దుఃఖసంకులమైన ఈ సంసారమందు జనన మరణముల పొందుచుండును.

# పీఠిక

వక్తుం శ్రమోనవాల్పోపి శ్రోతుమత్యంత సుందరమ్
తథాపి "రామరామేతి" నవదంతి దురాశయాః ॥

భగవత్స్మరణమన్నది; చెప్పుటకు కొంచమైనను ప్రయాసము లేనిది. వినుటకో మహాసుందరమైనది అట్టిదయ్యు, "రామరామ" యని ఈ జనులు ఉచ్చరించుటలేదే! ఓహో! వీరి దురదృష్టమేమని చెప్పవచ్చును.

హరేర్నామైకమప్యత్ర కలౌ వదతి యోనరః ।
కలిర్న బాధతే తంచ సత్యం సత్యం న సంశయః ॥

ఏమనుజుడైతే ఈ కలియుగమునందు, యొకసారియైనను భగవత్స్మరణచేయునో, అట్టివాని దగ్గఱకు కలివేరదు ఇది సత్యము ముమ్మాటికి సత్యము. దీనియందు సంశయము లేదు.

సర్వ పాపేషు నష్టేషు బుద్ధిర్భవతి నిర్మలా
సైవ బుద్ధి స్సమాఖ్యాతా జ్ఞానశబ్దేన సూరిభిః ॥

ఎపుడు భగవద్భక్తివల్ల పాపకర్మలన్నియు నశించునో, అపుడు బుద్ధి నిర్మలమగును అట్టి దోషరహితమై శుద్ధమైనబుద్ధి ఏదిగలదో, అట్టి బుద్ధియే జ్ఞానోపలబ్ధిని కలుగచేయునని మహనీయులు చెప్పిరి.

సంప్రాప్య భారతే జన్మ సత్కర్మసు పరాఙ్ముఖః ।
పీయూష కలశం త్యక్త్వా విషభాండ ముపాశ్రితః ॥

పుణ్యభూమియగు ఈ భారతమున జన్మించి ఎవడు సత్కర్మ పరుడై భగవద్భక్తి చేయడో, అట్టివాడు అమృతకలశమును త్యజించి విషకుంభమును ఆశ్రయించినవాడగుచున్నాడు.

శుభం కర్మ సముత్సృజ్య దుష్కర్మాణి కరోతి యః ।
కామధేనుం పరిత్యజ్య అర్కక్షీరం సమశ్నుతే ॥

ఈ పుణ్యభూమియగు భరతఖండమున జన్మించిన ఏమనుజుడు సుకృత కర్మమును చేయక దుష్కర్మలు చేయుచుండునో, అట్టివాడు అమృతమువంటి కామధేనువుక్షీరమును త్యజించి బాధాకరమగు జిల్లేడు పాలను పానము చేయుచున్నాడు.

అభక్త్యా యత్తపస్తప్తం కేవలం కాయశోషణమ్।
అభక్త్యా యద్ధుతం హవ్యం భస్మని న్యస్తహవ్యవత్ ॥

భక్తిలేని యేతపస్సుగలదో, అది కాయశోషణము మాత్రమే కలుగచేయును. భక్తిలేని ఏ హోమముకలదో, అట్టి హోమము చేసెడు హవిస్సు బూడిదయందు హోమించిన హవిస్సువలె వ్యర్థమైపోవును.

శ్రద్ధావాఌలభతే ధర్మం శ్రద్ధావానర్థమాప్నుయాత్ ।
శ్రద్ధయా సాధ్యతే కామః శ్రద్ధావాఌమోక్షమాప్నుయాత్ ॥

శ్రద్ధగలవాడు ధర్మార్థకామ, మోక్షములనెడు పురుషార్థ చతుష్టయము నిచటనే పొందగలుగును.

కలౌ కృతయుగం తస్య కలి స్తస్య కృతేయుగే ।
యస్య చేతసి గోవిందో హృదయే యస్య నాచ్యుతః ॥

ఎవని హృదయమందు భగవచ్చింతనగలదో వాడు కలియుగమందున్నప్పటికిని కృతయుగమునందున్నవాడే. కృతయుగమునందున్నవాడైనను ఎవనిహృదయమందు దైవచింతన లేదో వాడు కలియుగమునందున్నవాడే యగును. ఇదే యుగభేదములయొక్క రహస్యము.

ఈ గ్రంథమునందు భాషాదోషములేవైన యుండిన రాజహంసమేలాగున నీరమును విడచి క్షీరమునుగ్రోలునో భాషాకోవిదులాలాగున గ్రహింతురుగాక! అట్లు కలుగుట కేదైన కారణములున్నచో ఈ యుపాధియొక్క నామధేయమువల్లనే, ఆంధ్రదేశమున్ను భాషయున్ను కాదనితలంచి మన్నింతురుగాక! అట్టిదోషమేదైన ఉండినచో తెలుపువారికి కృతజ్ఞుడను. మరల ముద్రించునపుడు అట్టి దోషములేవియు లేకుండుటకు యత్నించెద. ఈశ్వరునికృపవలననే ఈ గ్రంథమును వ్రాయడమైనది.

లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు
తమ చరాచర సుఖాభిలాషి
శ్రీ మలయాళస్వామి.
హరిః ఓమ్ తత్సత్.

 

# శ్రీమద్భగవద్గీతా పారాయణకాలమున

## శ్రీసద్గురు మలయాళస్వాములవారు చెప్పిన బోధ.



భక్తులారా!

శాంతముగా చదువవలెను. జ్ఞేయభావములోనికి ప్రవేశించిన మాత్రమే శాంతి గలుగును. పండితులయొక్క పారాయణమునకును, భక్తులయొక్క పారాయణమునకును భేదము గలదు. పండితులు భాషలోను శబ్దార్థములోనే యుందురు. సాధువులు, భక్తులు, భగవద్భావములోనే వుందురు. ఇది అనాదినుండియు గలదు. అట్టి ధ్యానానుష్ఠానపరులు భావములోనికి పోయినచో శబ్దమున్ను,శబ్దములోనికి పోయినచో భావమున్నూ వదలిపోవును. ఆ సమయమున వుచ్చారణయు దైవభావమున్నూ కలిగియుండవలెను. ఇది జన్మ పరంపరలయొక్క అభ్యాస యోగబలమువలన గలుగును. గీత॥ 17-3 శ్లో సత్వగుణము గలవానికి శాంతమున్నూ, ఆహార నియమమున్నూ, సత్య సంభాషణయు, భగవద్ధ్యానము మొదలగువి గలిగియుండును. ఆయా ప్రవర్తన వలనను వారిని గనుగొనవచ్చును. కనుక ధ్యానము నిత్యముచేయు నియమముగల వారయినచో, క్రమక్రమేణ రజస్తమో గుణసంబంధమగు స్వభావము తగ్గి, సాత్వికశ్రద్ధగల వారగుదురు.నిత్యము ఒక వేయియో,రెండువేలో,మూడు వేలో జపముచేయవలెను.ఒక స్తంభమునకు పశువునుకట్టినచో అపఎట్లు తప్పించుకొని యెచ్చటికిన్నీ పోజాలదో, అదేరీతిగ, జ్ఞేయమను స్తంభమునందు మనస్సను పశువును కట్టివేసినచో ప్రశాంతము గలుగును. పడవనడుపుటకు చుక్కానిని చేతబట్టి యుంచవలెను. దానిని యెటుల త్రిప్పితే పడవ అటులనే తిరుగును. ఆచుక్కాని చేతిలో లేనిచో తెరచాపగడలు, తెడ్లు, మొదలగు ఎన్ని సామగ్రులున్నను సరిగా పోజాలదు. అట్లే జ్ఞేయమను చుక్కాని సరిగానుండినచో మాత్రమే ధ్యానపారాయణ జపయోగము మొదలగునన్నింటిచేతను, సంసారసాగరమునుదాటి, ఆత్మశాంతియను తీరమును చేరగలుగును. గాన యిదేరీతిగ శాస్త్రజ్ఞులకు, భక్తులకు, సాధువులకు ఇట్టి తారతమ్యములుండును. బహిర్ముఖము అంతర్ముఖము ఈరెండును సరిగా వున్నయెడల లోకములో ఒకధర్మమును నిలుపగలము దైవభావములో నుండిన శబమును విన

లేము. శాస్త్ర భావములోనుండిన దైవభావముండదుగాన ఈ రెంటిని చక్కగా గ్రహించి ప్రవర్తించ వలెను, గనుక శాస్త్రముకంఠతారాబట్టియు, దానిని చదువుచున్నను దైవభావము గలిగియుండినచో మాత్రమే ప్రయోజనము గలుగును. ప్రధమవాక్యము పరమాత్మను శరణుపొందుము, ప్రకృతిసంబంధమగు ప్రపంచవిషయాదులలో కాలము గడుపకుము. ధ్యేయమును శరణు పొందుము, ధ్యానములోనే కాలము గడుపకుము, కొందరు ధ్యానములో కాలముగడుపుచుండుటనియెదరు. ఈ విషయము ఇదివరలో చెప్పియుంటిమి. ఇప్పుడు ధ్యాతయొక్కధ్యానాకారమే ధ్యేయము. (సదేవసౌమ్యేదమగ్రమాసీత్) ఆచార్యుని సన్నిధిని అంతేవాసియై, బ్రహ్మవిద్యను అభ్యసించుకాలమున ప్రసన్నభావము: సమానభావము, శమదమాదులు గలిగి యుండువాడే మోక్షాధికారి.(ఓసౌమ్యుడా)సృష్టికిపూర్వము ఒకవస్తువేగలదు. ఆ సద్వస్తువు ఒకటియే తదుపరి సృష్టి లయమగునపుడున్నూ గలది. అది సర్వదా ఒకటిగానేయున్నది. ఆత్మనుండియే అవ్యక్తము, మహదాది పంచభూతములున్నూ, ఓషధులున్నూ దానినుండి అన్నము మొదలగునవన్నీ సృష్టిఅయినవని చెప్పుచుండుడు. మరల క్రమముగ సర్వము దానియందే లయమగును ఇది ప్రకృతి లక్షణము. తన అనుష్ఠానములో సర్వదేహేంద్రియాది వాసనలు తోచనివునికి యేదో అదియే మోక్షము. ధ్యానముచేయుచు రాగా రాగా, తద్ద్వారా క్రమ క్రమేణ వాసనలు నశించి ధ్యేయాకారమున నిలకడ గలుగును. (అల్పాక్షరమనంతార్థం) మహాఋతులగువారు చెప్పువాక్యములు అల్పాక్షరములు గలవైనను, అనంతార్థము గలిగియుండును. మీరుధ్యానమునుండి వచ్చినవెంటనే ఒకసంజ్ఞచేసినచో దానియందు యెంతోఅర్థముండును. ధ్యాత,ధ్యానము, ధ్యేయము, ఇవియేత్రిపుటి, ఈ త్రిపుటి రహితమునకొరకు ప్రయత్నము చేయవలెను. సర్వనదులు సముద్రములో చేరినమాత్రమున ఏకమగును. అలాగున ధ్యాత, ధ్యానము, ధ్యేయము క్రమ క్రమముగాధ్యానానుష్ఠానమువలన ధ్యేయాకారమగును.కనుకనే గీత 13. అధ్యా॥అమానిత్వాది జ్ఞానగుణములు 20 లక్షణములు గలిగి యుండవలెను. కనుక ధ్యాతయగు జీవుడు, ధ్యానముద్వారా ధ్యేయమగు పరమాత్మను శరణుపొందవలసి యుండును. సర్వమతములలోగల చైతన్యమే దైవమని చెప్పబడెను, అట్లుగాక దయ్యమగు ప్రపంచ వాసనయందు పడిపోవలదు. ధ్యేయమునకు పర్యాయపదములు పదహారు విధములు గలవు. అవి ఓంకార

గ్రంథములో చెప్పబడియున్నవి. ఎవరెవరికి ఏధ్యానము చెప్పిరోతద్వారా ధ్యేయముకొరకు ప్రయత్నించవలెను. మనస్సు స్వాధీనములో నుండుటయే అమనస్కము. ఆత్మ వీటికతీతుడగుటవలన వాటికి లోబడడు మనస్సునకు విలక్షణ మైనదొకటిగలదు అందువలననే నామనస్సు నాబుద్ధియని అనుచున్నాడు. కనుక మనస్సునకు విలక్షణమైనది ఒకటి వున్నదని స్పష్టపడుచున్నది ఉప్పు నీటిలో వేసిన నీరేయగును.ఇది సత్కార్యముగాన ప్రథమమున విషయాదులయందు శాంతిగలుగవలెను.

అ జీవింపకుము. ఈ శాంతిద్వారా, ప్రకృతిరహితమగు ఆత్మశాంతి బొందుము అట్టి లక్షణములు గ్రహించి విలక్షణమగు అంతర్ముఖములో తురీయదృష్టిలో,అపుడపుడు తోచు శుద్ధ సంకల్పమను ప్రకృతికి విలక్షణుడవగుము. సాధనానుష్ఠానము గలవాడవై శాస్త్రరీత్యా, క్రమక్రమేణ అనుష్ఠించి ధ్యేయమును బొందుము. కొందరు అమనస్కము చెప్పెదమందురు. చెట్టులేకనే పండు నిచ్చెదమందురు. (ఫలస్య కారణం పుష్పం) ఫలము కావలెనన్న చెట్టునుపెట్టి పోషించిన ఫలము సిద్ధించును.కొందరు అనాసపండును రంగు డబ్బాలపై చిత్రించి యుందురు. ఆరీతిని ధ్యానములేని వేదాంతముండును. ఇది అనుష్ఠానములేని వేదాంతము గనుక తప్పక పతనమై పోవును.

కావున ఎవరియందును కఠినత్వము పొందకుము. సర్వజీవులయందు దయగలవాడవగుము (గీత 13 అ "జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం") మొదట జ్ఞానముకొరకు ప్రయత్నింపవలెను. అటుల ప్రయత్నించిన తద్వారా జ్ఞేయాకారము పొందెదవు. ప్రథమమున పాఠము చదివి పరీక్షకావలయును, ఉద్యోగము కొరకు ట్రైనింగు అయిన తదుపరిగదా ఉద్యోగమువచ్చి సుఖింప గలవు. ఆ రీతిగ వేదాంతశాస్త్రమును విజ్ఞానశాస్త్రము చదివి, పెద్దల వలన ధ్యానానుష్ఠానము తెలుసుకొని అట్టి ధ్యానాదులను చిరకాల మభ్యసించి నచో జ్ఞేయమును పొందగలము. గమ్యమును చేరుము. గమనములోనే కాలము గడుపకుము. ప్రకృతి వస్తువులు తనకు తోచని అవస్థగలుగువరకు పునః పునః మననముచేయుచు అవి సంపూర్తి అయ్యేవరకు అతిశ్రద్ధతో అనుష్ఠించవలెను. కొందరు శ్రవణముతోనే సమాప్తము చేయుచున్నారు. కొందరు మననమువరకు వెళ్లుచున్నారు. (శ్రుతేశ్శతగుణం విద్యాత్ మననం)

శ్రవణముకంటె మననము నూరురెట్లధిక ఫలమును, నిదిధ్యాసనము అనంత మైన పలమును ఇచ్చును. కనుక గమ్యస్థానమును చేరుము

కాశీలో అందరు యాత్రికులు ప్రాతఃకాలమున స్నానములు, తర్పణలు, స్వామిదర్శనము, క్షేత్రములు మొదలగునవి చూచి, సాయంత్రము రుద్రాక్షలు మొదలగునవి బజారు అంగళ్ళలో కొనెదరు. వారిని సంధ్యాకాలములో కబీరుదాసుగారుచూచి యిట్లనిరి. "ఓ జనులారా! ఒకడు అడవిలో వెళ్ళుచున్నాడు. ఎవరు తోడులేరు. ప్రొద్దులేదు, చీకటికాలము ఆ అడవి యందు, మృగములు అనగా సింహములు, గ్రహములు గలవు. అది తెలిసి కొనక, అచెట్లు, తీగెలు, పువ్వులు మొదలగునవి చూచుచు కాలము గడుపు చున్నారే!".

అహా ఈ సంసారమను అరణ్యములో జీవితమను సూర్యుడు అస్త మించ బోవుచున్నాడు ఆశాపాశములు, కామాదులను మృగములు ఆటంక పరచనున్నవి, దుఃఖములను గలుగజేయు ద్వేషాదులను పులులు గలవు. కావున విరాగులై యుండుడు. అఖండమును చేరుడు, ఖండములో పడి యుండకుడు, బుద్ధిని దాటువరకు విషయాదులే ఉండును గనుక, దానిని దాటిన అఖండమగు దైవభావములో చేరగలరు. విద్యుచ్ఛక్తి యొకటియే, దానికి తీగలు, బలుబులు అనేకములు. నీరుటాంకి ఒకటియే. పంపులు గొట్టములు అనేకములు. ఆ గొట్టములు పెద్దవైన జలము విశేషముగ వచ్చును. చిన్నవైన జలము కొలదిగవచ్చును. ఆరీతి, మనస్సుగొప్పదైన సర్వశక్తిగలిగి, ప్రబోధనాస్వరూప దైవస్థితి గలుగును. సంకుచితమైన పూర్ణత్వము గలుగదు, (యదానద్యః స్యందమానాః సముద్రం) సర్వనదు లకు హెచ్చుతగ్గులు గలవు. సముద్రమునకు తగ్గుదల హెరుగుదలలేదు. నదులలో చిన్నఅలలు, సముద్రములలో పెద్ద అలలుండును. విశాల ఈశ్వర త్వము బొందినయెడల పెద్దపనిగల వారగుదురు.

సముద్రమునందు పేనతరంగము లుండును. అంతర్ముఖ దృష్టిలో చాలాలోతుకు వెళ్ళిన విషయాది తరంగములుండవు. నిస్తరంగ సముద్రము వలె జ్ఞేయాకారము పొందినవారికి మాత్రముండును. సముద్రమునకు పైనపే తరంగము లుండును. చాలాలోపలకు ప్రవేశించిన తరంగములుండవు అనేక జన్మాదులనుండి ధ్యానాదుల నభ్యసించుచు వచ్చినవారలే ఇట్టి జ్ఞేయాకారస్థితినొ

పొందియుందురు. సహృదయులయొక్క వ్యాపారము సమదృష్టిలోనే యుండును. శ్రీమహాత్మాగాంధీజీకి ఉన్న పని మనకు వున్నదా? కొన్ని మరములు మాత్రమే మనకుగలవు. వారికి భారతదేశమంతట, ఇతరదేశములలోను పనియుండియు భారముగా నుండలేదు. కనుక మనము మంత్రార్థమును పొందవలెను. మంత్రములోనే కాలముగడుపవలదు. ఆయామంత్రము దేనినిగురించి చెప్పినదో ఆ అధిష్ఠాన దైవమును చేరుము. ఒక బీజముంచిన అది వృక్షమై మారినట్లు మంత్రమును ధ్యానము చేయుచున్నకొలది ధ్యేయాకారమైపోవును. ఆధ్యాత్మిక విషయములో ఒకరికొకరు సహాయముచేయజాలరు. ఎవరికి వారే అనుష్ఠించవలెను. గురువులు మార్గములను తెల్పుదురు. వానియందు ఎవరికి వారే అనుష్ఠానము చిరకాలముచేయగ చేయగా జీవత్వమను బీజమును వదలి కేవలత్వమను ధ్యేయమును పొందుదురు. సర్వనదులు పరుగిడి పరుగిడి తుదకు సముద్రములోనే చేరును. కనుక అమనస్కమును మనము పొందవలసినచో, ధ్యానానుష్ఠానము గలవారమై యుండి అనుష్ఠించుచు వచ్చిననేగదా అట్టి బ్రహ్మానందరసమును గ్రోలగలము! (దత్తగురుదత్త) దత్తాత్రేయులకే గురుశబ్దముగలదు అది అవధూతగీతయందు గలదు.

త్వద్యాత్రయా వ్యాపకతా హతా తే ధ్యానేన చేతఃపరతా హతా తే।
స్తుత్యుక్తిభి ర్వాక్పరతా హతా తే క్షమస్వ నిత్యం త్రివిధాఽపరాధాన్॥

నేను మూడపరాధములు చేసితిని. ఏ క్షేత్రమునందో నీవున్నావని నీకొఱకై తీర్థయాత్ర చేయుటచే నీసర్వగతత్వమును పాడుచేసితిని. చిత్తమునందు నిలిపి నిన్నుధ్యానించుటచే మనస్సుకందని నీ స్థితిని పాడుచేసితిని. పరిమితార్థములైన స్తోత్రవాక్యములచే నిన్ను కొనియాడుటచే మాటలకందని నీ స్థితిని పాడుచేసితిని. కావున స్వామీ! నా యీ మూడపరాధములను మన్నింపుము.

"ఈశావాస్యమిదం సర్వం." "యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసాసహ"

అను వేదవచనముల సారమీశ్లోకమున నిరూపింపబడినది. ఇట్టిస్థితి యెప్పుడు కల్గునో అప్పుడే ప్రతివారును అమనస్కభావమును పొందగలరు

# ఆత్మబోధత్రయము

ఆత్మవిముక్తి విషయమై మూడుమార్గములు గలవు. అవి సామాన్య బోధ యనియు, విశేషబోధ యనియు, అతీతబోధ యనియు పేర్లుగలవి. వీటికి ఉత్తమబోధ యనియు, ఉత్తమోత్తమబోధ యనియు, అఖండబోధ యనియు నామాంతరములు గలవు. మఱియు వీటిని తారక మనియు, సాంఖ్య మనియు, అమనస్క మనియు జెప్పుదురు. జ్ఞాన బోధయనియు, విజ్ఞానబోధ యనియు సాక్షాద్బోధ యనియు, సంజ్ఞలు కలవు. ఇవి ప్రపంచ ములోగల సమస్తమతములలోను గనదగును. యోగము, దైవోపాసన, తపస్సు, వేదాంతవిచారణ మొదలగునవి యన్నియు వీటిలో నంతర్భూత ములు, పైజెప్పిన సామాన్యబోధ, విశేషబోధ, అతీతబోధ ముఖ్యములని గ్రహించిన చాలును.

1. రోగముగలవాడు దివ్యౌషధసేవయు, పథ్యమును గలిగియుండిన రోగమేలాగున క్షయించునో అలాగున భగవద్ధ్యానముచేగాని, తపస్సుచేగాని, యోగముచేగాని భవరోగమంత మొందునని చెప్పుటయు, దానికి గావలసిన నియమములు భక్తి, జ్ఞానము, వైరాగ్యము, శ్రద్ధ మొదలైనవన్నియు గలిగి యుండవలయునని చెప్పుటయు సామాన్యబోధ యగును. అలాగున మలిన వస్త్రమును చౌడుమట్టి, సబ్బు మొదలైన వానిచే శుద్ధిచేయునట్లు జనుల యాత్మలోగల ప్రకృతి దోషమును నశింపజేయ వలయుననియు చెప్పుదురు. మానవులందరిలోను సామాన్యస్థితిలో నుండువారే యధికమగుటచే ఇట్టి బోధలే లోకములో ఎక్కువగా నుండవలయును.

2. విశేషబోధ—దీనిలో బుద్ధియొక్క విచారణ యెక్కువగా నుండును. కాన అంతఃకరణ శుద్ధియును, చిత్తైకాగ్రతయు గలుగవలయును. అట్లైన మాత్రమే దీనియందు ప్రవేశము గలుగును. ఇది నావచే సముద్రమును దాటునట్లు, ఈశ్వర విచారముచేగాని, తత్త్వ విచారముచేగాని, ప్రకృతినుండి విముక్తిగలుగ జేసికొనవలయు ననుటయే. ఇంకను దీనిలో నీలాగునకూడా

చెప్పబడును. చీకటిలోగల వస్తువును తీసికొనుటకు దీపము కావలయును అలాగున అజ్ఞానమను చీకటిలోనుండు ఆత్మను జ్ఞానదీపముచే తీసికొనవలసి యుండును. మఱియు బీజమును సుక్షేత్రములోబెట్టి పోషించి వృక్షముగా జేసికొని ఫలమును భుజింపవలసియున్నట్లు బ్రహ్మనిష్ఠ వృద్ధి పరచుకొని జీవత్వమునుబాసి శివత్వము నొందవలసి యుండుననిగూడ చెప్పబడు చుండును. మఱియు పాలనుండి నెయ్యిని, నువ్వులనుండి నూనెను, చెరకు నుండి పంచదారను, పుష్పము నుంచి సుగంధతైలమును తీయునట్లు తపస్సు చేతను, వైరాగ్యముచేతను, బ్రహ్మవిచారణ చేతను ప్రకృతినుండి యాత్మను వేరుపరచుకొనవలయుననియు ఉపదేశింతురు.

మరికొందరు చీకటినూతిలో బడిన వానిని మరియొక డుద్ధరించవలసి యున్నట్లును, కాలుచేతులుగట్టి యడవిలో బడవైచినవానిని ఆ బంధనము నుండి నివృత్తిచేయుట కింకొకడు కావలసియున్నట్లును, పిచ్చిపట్టినవాని కాభ్రమ నివృత్తికొఱకు శ్రేష్ఠుడైన వైద్యుడు గావలసియున్నట్లును, దారి తెలి యక త్రోవదప్పి పోవువానికి మార్గమును జూపుటకు మఱియొక డుండవలసి నట్లును, గ్రుడ్డివానికి దారిజూపుటకు నేత్రముగల వాడొకండుడే తీరవలసి నట్లును భవబంధవిముక్తి గలుగుటకు బంధముక్తి గలిగిన గురువును, మంచి యనుష్ఠానమును గలిగియుండ వలయునని బోధించుటయు విశేషబోధలతో సంబంధించినదే. మరియు కృష్ణ, రక్త పీతవర్ణముల సాన్నిధ్యముచే స్ఫటిక మణి నల్లగాను, ఎఱ్ఱగాను, పచ్చగాను కానుపించినను యథార్థముగా నామణి యందట్టి దోషము లేలాగున లేవో, ఐనను విచారణ చేయకపోవుటచే మణి యందు కృష్ణ, రక్త,పీతవర్ణము లుండునట్లు ఎట్లు గోచరించుచున్నవో, అలా గున ఆత్మవిచారణ చేయనందుచే పరిశుద్ధాత్మయందు ప్రకృతిదోషములున్నట్లు కనుపించునేగాని వాస్తవముగా విచారించిన యేలాంటి దోషములును ఆత్మ యందులేవని తెలిసికొనుటయు విశేషబోధతో సంబంధించినదే. అయితే వీరికిని బుద్ధి శుద్ధమై నిశ్చలమై యుండవలయునని వచింతురు.

పొగచే నగ్ని మరుగుపడియున్నట్లు, లేక బూడిదచే నిప్పుకనబడనట్లు, మేఘముచేగాని, గ్రహణకాల రాహు కేతువులచేగాని సూర్యచంద్రాదులు కనబడనట్లు అజ్ఞానముచే జ్ఞాన మావరణమై పోయినది. దానిని తొలగించిన

అగ్ని సూర్య చంద్రాదులు గనుపించునట్లు దైవసాక్షాత్కారము, (జ్ఞానసాక్షాత్కారము) గలుగునని చెప్పుటయు విశేషబోధలోనిదేగాని యితరముగాదు.

3. ఇక అతీతబోధలోనికి ప్రవేశింతము. అత్తరి పైజెప్పినవన్నియు దూరీకరించబడును. ఆత్మయందు మఱియేవస్తువును చేరనందుచే సామాన్య బోధలో జెప్పిన రోగాది దృష్టాంతములు సరిగావు. ఆత్మ నిత్యశుద్ధ, స్వయం ప్రకాశమైనది. అది జ్ఞానస్వరూపమగుటచే అజ్ఞానము దానియందు నిలుప జాలదు ఆలాగున విశేషబోధలో జెప్పినదిగూడ సత్యముగాదు. ఏలన నది దాటి యావలనుండు వస్తువునుగాని స్థలమునుగాని పొందవలసి యుండినచో, లేక యిచ్చటలేని దచ్చట నుండిన మాత్రమే యొక స్థలమునుండి మఱియొక ప్రదేశమునకు పోవలసియుండును. ఆత్మ అచ్చటను, ఇచ్చటను, ఒకేవిధముగా సర్వకాలములలో నుండుటవలన పైజెప్పిన యుక్తులెవ్వియు సరిగా నుండజాలవు, ఆలాగున ప్రకాశమును చీకటి మరుగుపరచ జాలనట్లు జ్ఞానమును అజ్ఞానము మరుగు పరచజాలదు. ఆత్మ యన్నిటికి దృక్కైయుండుటచే తాను దృశ్యమును ప్రకాశింప చేయునదగుటచేతను, దీపమును పొగయు, అగ్నిని బూడిదయు, సూర్యచంద్రాదులను మేఘగ్రహణములును మరుగుపరచునట్లు చెప్పిన యుక్తులన్నియు సరియైనవిగావు.

అయితే ఈలాటి బోధలన్నియు శాస్త్రములో గనుపించుటకు కారణమేమని సంశయింప నక్కరలేదు. సామాన్య విశేష బోధలలో జెప్పిన యనుష్ఠానమువల్లనే యతీతబోధ కలుగును, పైజెప్పిన రెండు బోధలను దాటి యతీతబోధలోనికి రావలయునేగాని వేరు మార్గములేదు. ఈవిషయమై చెప్పనప్పుడు జీవునియొక్క సంసారసంబంధమైన సంస్కార మనేక జన్మలలోగలిగి ఘనీభూతమై యుండుటచే అది నివృత్తిగానిచో స్వబోధములోనికి రాజాలడు, మఱియు జీవునియొక్క సంస్కార మేరూపముగ నుండునో దానికి తగిన యోగ్యతయు బోధయు కలుగుననియే యోగులు వచింతురు. అతీతబోధలో నీవు (ఆత్మ) స్వయంప్రకాశకుడవై యెల్లప్పుడు ఒకే విధమగు జ్ఞానజ్యోతివై వెలుగుచుందువని మాత్రమే యాత్మజ్ఞులగు జ్ఞానులు వచింతురు.

అయితే ఆలాగున స్వయంప్రకాశమై యుండిన నేల యందరును ఆ దివ్యజ్ఞాన స్వరూపమును దెలిసికొనుటలేదని యడిగినచో దానికొరకు-నీవు

సరియైన ప్రయత్నము చేయలేదని మాత్రమే శాస్త్రము సమాధానమిచ్చును. అంతియేకాని మాయయనిగాని, కర్మయనిగాని, ప్రారబ్ధమనిగాని, అజ్ఞానమని గాని వేదాంతసారమగు ఉత్కృష్టశాస్త్రము సమాధానము చెప్పదు. ఈ యతీత మార్గమునే భావాతీతమనియు, ఇంద్రియాతీతమనియు, నవాఙ్మానస గోచరమనియు శాస్త్రము తెలుపుచుండును. ఎందుకనగా మనస్సు, వాక్కు మొదలైనవి జడములు. ఇవియన్నియు నాత్మవలననే చైతన్యవంతములై యున్నవి. కావున నివియన్నియు ఆత్మను ప్రకాశింప చేయజాలవు. దీపముచే వస్తువులు ప్రకాశించునేగాని వస్తువులచే దీపము ప్రకాశింప జేయబడదుకదా?

అది ప్రకాశించుటకు అనగా ఆత్మ బోధపడుటకు అట్టియాత్మ జ్ఞాన బోధగల మహనీయుల యుద్బోధముతప్ప వేరుమార్గములేదు. అట్టి బోధను గ్రహించుటకు తగిన శిష్యులయొక్క నిర్మల ప్రజ్ఞ మాత్రమే కారణమగు చున్నది. తంతివార్తనిచ్చువారును, దానిని తీసికొనువారును, దానిలో గలుగు చుండు ధ్వనియొక్క యర్థమును గ్రహింపగలిగిన మాత్రమే యది బోధ పడును. ఉభయులలో నొకరికి తెలిసి మఱియొకనికి తెలియనిచో విషయము స్పష్టముగా తెలియజాలదు.ఈ తత్త్వమును అలాటిదే.అచట సామాన్యముగా బోధపడుటకు రజ్జు సర్పన్యాయమును,శుక్తి రజతయుక్తిని,ఆకాశము నీలముగా నుండు ఉదాహరణమును విజ్ఞులు దెలుపుచుందురు. ఇదియును శుద్ధప్రజ్ఞ గలుగని వారికి బోధనార్థమై చెప్పవలసి వచ్చినదేగాని మఱియొకటిగాదు. మఱియు అట్టి స్వయంప్రకాశాత్మ యేల అందరకు బోధకాలేదని అడిగినచో దానికి అజ్ఞానమనియు,అవిద్యయనియు,నొకకారణమును గల్పించిరేగాని మఱి యేమియు గాదు. రెండవ వస్తువు మఱియొకటుండిన గదా! ఆత్మను మరుగు పరచుటకు కారణమగును. ఒకటియగు ఆత్మ, బ్రహ్మము, దైవము మాత్రమే యుండగా రెండవ దెచ్చటనుండి వచ్చును? అది దివ్యము, స్వయంప్రకా శము, సత్యమొకటియేగాని రెండుగా నుండగూడదుగదా? ఒక రాష్ట్రమునకు సార్వభౌము డొకడుగానుండునే గాని యిద్దరుగా నుండిన సార్వభౌముడను పేరు నిరర్థకమగునుగదా?

విశేష బోధలోచెప్పినట్లు ధూమ, భస్మ, మేఘ, రాహు కేతువులవలన దీప, అగ్ని, సూర్య చంద్రాదులు ప్రత్యక్షముగా గనబడకపోవుట గనుపించు

చుండగా, ఆత్మను అవిద్య, అజ్ఞానము, కర్మము, మలినమనస్సు మొదలైనవి యేల మరుగుపరచగూడదని సందేహము గలుగునేమో? దానిరహస్యమును జెప్పెద. ఇదే యతీంద్రియ జ్ఞానములోనికి, దేహేంద్రియ మనోబుద్ధ్యాదుల విలక్షణ స్థితిలోనికి దీసికొనిపోయెడు దివ్యవిమానమని గ్రహింపవలయును. ఈ యొక్క సత్యసారములో నిలకడగలిగిన ఒక క్షణములోనే ప్రకృతినుండి మరలి పరమపురుషుని లోనికి ప్రవేశింపవచ్చును. క్షణముగూడ అక్కర లేదు. కనురెప్పపాటు సమయముగూడ యధికకాల మని తోచును. ఇదే తమస్సునుండి ప్రకాశములోనికిని, మృత్యువునుండి యమృతత్వములోనికి త్రిప్పివేసెడు గురుకీలకమని తెలిసికొనవలయును. దీనికే విహంగన్యాయమని పేరు. తక్కినవన్నియు పిపీలికాన్యాయములో చేరినవి. ఇది విమానమార్గమ నము, ఇచటమాత్రము భూమిలోగల పల్లము, మెఱక, కాలువలు, నదులు, అడవులు, మార్గములు చూడనక్కరలేదు. అయితే బండ్లలోగాని, రైళ్ళలో గాని, మోటారులలోగాని లేక పాదచారిగాగాని ప్రయాణము వేయువారంద రును భూమిలోని మార్గముల నిమ్నోన్నతములను, కంటకములను, ఆటంక ములను, అన్నిటిని చూచుకొనియే నడువవలయును. ఇదే సామాన్య మార్గము నకును, విశేషమార్గమునకును కల భేదమని గ్రహింపవలయును.

పైజెప్పిన గురుకీలక మేమన నిప్పునకు, సూర్య చంద్రాదులకు గలి గిన బూడిద, గ్రహణము ఈ యడ్డుల కీవలనుండువారల కాటంకములేగాని వాటి కావల నున్నవారి కడ్డులుగావు. ఆత్మ మనోబుద్ధ్యాదులకు, ప్రారబ్ధాది కర్మముల కీవల నుండునని చెప్పినచో ముందుదాహరించిన దృష్టాంతములు సరిపోవునేగాని ఆత్మ బుద్ధ్యాదీంద్రియములకు విలక్షణమై సాక్షియై, స్వయం ప్రకాశమై, అమృతమై, శివమై, బ్రహ్మమై వెలుగుచుండుటవలన పైజెప్పిన యుక్తులు సరిగావని తెలుపవలసి వచ్చినది ఏలన సూర్యచంద్రాదుల కెన్నియో యోజనములదూరములో గ్రహణము గలుగుచుండును ఆగ్రహణ మేఘాదులనుగూడ సూర్యచంద్రులే ప్రకాశింపజేయుచున్నారు. అట్టిభావమే యిచ్చట చేసికొనవలయును. అట్లుగాక బుద్ధ్యాదులకు ప్రారబ్ధ కర్మాదుల కీవల ఆత్మ యుండునని జెప్పినచో అట్టి యాత్మ జడమునకన్న జడమయ్యే యుండును. ఏలన కర్మలును, బుద్ధ్యాదులును జడములే గదా? బ్రహ్మము,

ద్వైవము, ఈశ్వరుడు అని చెప్పుశబ్దము లన్నియు నొకే వస్తువును గురించియే గాని యనేకమును గుఱించి గాదు అయితే బ్రహ్మము తప్ప రెండవ వస్తువు లేదని చెప్పినచో ఈ కానుపించు నవన్నియు నేమిటివని యడిగిన నేత్రదోషముచే దృశ్యము చిత్ర విచిత్రముగా గనబడునట్లు నీ కాలాగున గోచరించు చున్నది. నేత్ర రోగికి వలె. నేత్రరోగము లేనివాని కట్టి దోషము గలదని మనమెట్లు చెప్పగలము? ఇదియు గ్రాహ్యార్థము జెప్పుటకొక యుక్తియేగాని అట్టి యాత్మవిషయములో ఈయుక్తు లన్నియు పనికిమాలినవే. ఏలన అప్పుడు రోగమొకటి యాత్మకు భిన్నము గాగలదని యంగీకరించ వలసి వచ్చును. అది వేదమాత కిష్టములేదు. అనగా శ్రుతి యంగీకరింపదు. బోధనార్థ మెన్నియో యుక్తులను గలుగజేసికొనవచ్చును. అది తప్పు గాదు, లేనిచో అట్టి దివ్యపదవిలోనికి సామాన్యజనులకు ప్రవేశము గలుగదు.

అట్టి శాశ్వత సత్యమునకు, స్వయంప్రకాశమునకు, ద్వైవమనియు, చైతన్యమనియు, దివ్యలోక ప్రాప్తియనియు, మోక్షమనియు, కైవల్యమనియు, పరమపదమనియు,అమృతమనియు, చైతన్యసారమనియు, అమృత ప్రవాహ మనియు నికనెన్నియో పేర్లుగలవు. పరిపూర్ణమనియు, అచల మనియు, నూతనముగా గల్పించిన నామములుగూడ దానివే. ఇవి నవీనముగా గనిపెట్టిన పేర్లని కొందరు తలంపవచ్చునుగాని యవి యనాదిగా నుండినవే. ఏలన నూతనముగా నొక వస్తువుగలిగినచో కొంతకాలమున కది ప్రాతదై పోవును. పురాతనమైనది జీర్ణించి కొంతకాలమునకు నశించి పోవును. అది ప్రకృతియొక్క యలంఘనీయ స్వభావధర్మము. నవీనముగా కనుగొనబడినదని జెప్పిన కొందరు హర్షించవచ్చును. కాని యావల వచ్చు కష్టనష్టములవారు జూచుటలేదు. ఏలన ఉండే వస్తు వొకటియే.దానికే పేరైన పెట్టవచ్చును. పేరులన్నియు అనాదియైనవని గాని, అంతము లేనివనిగాని, యెల్లప్పుడు నొకేరీతిగా యుండునవనిగాని, స్వయంజ్ఞానమయమైనవనిగాని, స్వప్రకాశములని గాని అనందఘనీ భూతములైనవని గాని చెప్పజాలము. ఎవరేపేరుపెట్టినను అభాషలో పై జెప్పిన యర్థమును నిరూపించి యుండిన చాలును. అట్లయిన నదిశివము. అది సనాతనము. ఓమ్.

ఈ యతీతబోధ శాస్త్రములలో రహస్యముగా నుంచ దగినదని చెప్పబడియున్నది. కనుకనే బ్రహ్మజ్ఞానము, రహస్యముగా నుంచ దగినదని చెప్ప

బడియున్నది. కనుకనే బ్రహ్మజ్ఞానము రహస్యమనియు, గూఢమనియు, గోప్యమనియు చెప్పుటకు కారణమైనది. అయితే అట్టి శాస్త్రములోనే తగిన యోగ్యతగల సర్వజనులకును పిలిచి పిలిచి చెప్పవలయుననిగూడ చెప్పక పోలేదు. పిలిచి చెప్పవలయునని చెప్పుటయేగాక అట్టి పరిపక్వ జీవులకు గావలసిన యన్నవస్త్రములను, స్థలముల నిచ్చి యుపదేశించ వలసినదని గూడ శాస్త్రములో జెప్పబడియున్నది. దానికంటె పుణ్యము మూడు లోకముల లోను మఱియొకటి లేదని గూడ వర్ణించియున్నారు. దాని నాలాగున రహస్య ముగానే యుంచవలయును, అనర్హుల కధికారముగాని, ధనముకాని దొరికిన పాడు చేయుదురు గదా? యోగ్యులకు దొరకిన లోకమున కెంతయో మేలు గలుగును. మఱియు చిన్నపిల్లవారలకు రత్నములు దొరికిన యప్పుడ్చుల కొఱకు దాని నిచ్చివేయుదురు. లేక పండ్లకొఱకైన దానిని ఖర్చు పెట్టుదురు. కావున రహస్యముగా నుంచవలసినదని చెప్పిరేగాని తాననుభవింపకయు, ఇతరుల ననుభవింపనీయకయు భూతమునకు దొరికిన ధనమువలె పాడై పోవలెనను అర్థము మాత్రము గాదని తెలిసికొనవలయును.

సూర్యభగవానుని యొక్క దివ్యప్రకాశము నందరు అనుభవించు లాగున పరమేశ్వరుడు భాస్కరుని నెట్లు సృష్టించెనో, అలాగున సర్వేశ్వరుని జ్ఞానమయమగు నాదివ్యజ్యోతి నందరును దర్శించి కృతార్థులుగావలయు ననియే భగవదాశయమైయున్నది. నేత్రరోగములేని వారందరు ఆదిత్యు నెట్లు చూడగలరో అలాగున అంతఃకరణములో గల జ్ఞానదృష్టి కాటుంకమైన తిమిరరోగమును రహిత మొనర్చుకొనువారందరు ఆ పరమపురుషుని, ప్రేమ స్వరూపుని దర్శింపగలరు. నేత్రవ్యాధి లేనివారేదేశీయులైన, ఏవర్ణస్థులైన, ఏ యాశ్రమములోనుండు వారైనను, స్త్రీలైనను, పురుషులైనను ఏలాగు జ్యోతిర్మయుడగు భానుని దర్శింతురో, నేత్రరోగము గలవా రేదేశీయులైనను, ఏ వర్ణస్థులైనను, ఏయాశ్రమమును స్వీకరించినవారైనను, ఆడువారైనను, మగవారైనను, బాలురైనను సూర్యు నెట్లుచూడజాలరో అట్టితత్త్వమునే ప్రస్తుతము ప్రపంచములో బోధింపవలయును. దీనిని గూర్చి యోగ్యతా యోగ్యతలు చెప్పబడినవేగాని మఱియొక యవస్థనుగుఱించి గాదని యందరు తెలిసికొనవలయును.

మఱియు సామాన్య బోధచేత పరిపక్వస్థితికి వచ్చినవారికి మాత్రమే ఈ యతీతబోధ యుపయోగపడును. రైల్వే ప్రయాణీకులలో మూడవతరగతి జను లధికముగా నున్నట్లు సామాన్యబోధకు తగినజీవులే ప్రపంచములో నెక్కువమంది యున్నారు. కావున వారికి తగిన యనుష్ఠానమునే బోధించవల యును. ఇది యెక్కువ యుపయోగమైనది. లేనిచో ఆకాశములోగల చంద్రుని తెచ్చి యిమ్మను చిన్నపిల్లవారి గతియే వీరికి గలుగును, కావున ఉత్కృష్టా చార్యుల కరుణగలవారికి, సర్వేశ్వరుని కృపలభించినవారికి, సత్యధర్మము లలో నిష్ఠగలవారికి, ఈ జన్మములోనే ముక్తిగలుగ వలయునని తీవ్ర ప్రయత్నముగలవారికి, ఉత్కృష్టమగు ఆచారము గలవారికిని అన్నిమార్గము లును కాలానుగుణముగా గలుగుచుండును. ఓంకారసారమగు పరమ పవిత్ర మగు, ఈశ్వరమయమగు, శాశ్వతానందమగునట్టి దివ్యసుఖమును, జీవన్ము క్తిని, ఆత్మసాక్షాత్కారమును జీవకోట్లందరును బొంది కృతకృత్యులగు దురు గాక!



# ఇంద్రియములను ప్రార్థించుట.



ఇంద్రియములారా! మీరు చాల సుకృతమును జేసిన వారలే, ఇది యాత్మస్తుతియనిగాని, అతిశయోక్తియనిగాని తలంపరాదు. అట్లు గానిచో తపస్సుచే పునీతముగాదగిన ఈ దేహములో జేరియుండరు. ఇదియు అహంకారమగు వాక్యమని తలంపకుడు. సత్య మాలాగుననే యున్నది. అయితే మీరందరు పద్మసరోవరములోగల కప్పలవలె నున్నారు. ఏలన కమలములలోగల మాధుర్యమును ఎచ్చటనో యుండు తుమ్మెదలు గ్రోలు చుండును. ఇది మీయొక్క దోషమని పూర్తిగా జెప్పతగదు. ఏలయన పట్టి వివేకముగల జ్ఞానులకుగూడ మాయతో గూడిన శరీరబుద్ధి యుండువరకు ప్రమాదము గల్గుచుండవచ్చును. అయితే వారు వివేకబుద్ధిగలవారగుటచేస్వయ ముగా లోపమును దెలిసి కొనిగాని, మఱియొకరు చెప్పుదానిని గ్రహించుకొని గాని వెంటనే తమ యొక్క స్వభావమును మార్చుకొందురు. అలాగున మీకును దేహమను యవయవిలో నమరియుండుటచే మైకము కలుగవచ్చును. కాని

తప్పుదారిలో బోయెడువారు, ఆప్తవాక్యముల వినిగాని, లేక స్వబుద్ధితో తెలిసికొనిగాని యెటుల వెంటనే మరలుచుందురో, ఆలాగున నేను చెప్పెడు వాక్యముల విని, మీయొక్క స్వభావమును మార్చుకొన గోరుచున్నాను. మీరెంతో పుణ్యవిశేషముచే ఈ శరీరములో జేరి యున్నారని యింతకు ముందే జెప్పబడినదిగదా!

1. కర్ణేంద్రియమా! నీవాకాశాంశమవు. ఆకసమెంత నిర్మలముగా నున్నదో, నీవును ఆలాగున నుండవలసినవాడవు గదా! కారణమునుండి గలుగు కార్యములన్నియు కారణవ్యతిరేకములు గావు. కనుక గగనమువలె స్వచ్ఛముగా నుండుము. నీవేల బాహ్యవిషయముల వినగోరుచున్నావు. శబ్దానందమునం దాసక్తిగలిగిన లేడి యేలాగున బోయవారి వలలో చిక్కుకొని చనిపోవుచున్నదో ఆలాగున చెడకుము! ఒకవేళ సంపూర్ణనిగ్రహము గలుగ నీకు ప్రయాసమని తోచినచో దైవ వాక్యములను, ధర్మవాక్యములను వినుము. లేక అంతర్ముఖుడవై ప్రణవనాదమును వినుచుండుము. అట్లు గానిచో స్వరూప స్వరముల నాలకించుచు స్వరూపానందములో నుండుము. అట్లైన చాల మేలు గలుగును. అప్పుడు నీకు గలిగెడు సుఖమింతంత గాదుసుమీ!

2. స్పర్శేంద్రియమా! నీయొక్క పూర్వవృత్తాంతమును మరచి పోయితివి. నీవు వాయువునుండి పుట్టినవాడవు, వాయు వేలాగున నిర్మలముగా నున్నదో నీవును ఆలాగున నుండవలసినవాడవే గదా? అయినను మాయయొక్క మహిమవే నిన్ను నీవు మరచియున్నావు. ఇప్పుడు మంచిమాటలను చెప్పుచున్నాను. స్పర్శసుఖమునకు వశపడిన యేనుగు గర్తములో ద్రోయబడి దుఃఖమును బొందుచుండును. బాహ్య స్పర్శ సుఖములకు వశపడితివా నీయొక్క గతియును ఆయేనుగు గతివంటిదే యగును. గొప్ప సుకృతవశమున ఈకాయములో వచ్చిచేరినావు. కావున దుర్గతినొందక సద్గతినొందుము. అట్లు పూర్తినిరోధము గలుగుట ప్రయాసమని తోచినచో భగవత్ప్రసాదము లగు చందన, విభూతులను ధరించుకొనుము. అట్లుగానిచో ప్రకృతిచే నిర్మింపబడిన శుద్ధములగు ఎండ గాలులచే సుఖింపుము. దీనిచే తృప్తిగలుగనిచో ప్రకృతియొక్క స్పర్శముగలుగని దైవములో నిలకడగలిగి యుండుము. అంతేగాని దుస్స్పర్శములకు లోబడి గజమువలె బంధమున జిక్కకుము.

3. ఓనేత్రేంద్రియమా! ఎంతయో పుణ్యవిశేషముచే ఈకాయము నాధారముగా గలిగియున్నావు. కాని నీయొక్క నైజస్వభావ మగ్ని తత్త్వము. అగ్నియేలాగున అన్నిటిని దహింపజేయునో, ఆలాగున పాపముల జూచునపుడు వానిలోగల దోషముల దహింపజేయుము. తనలోనికి ప్రవేశించిన సుగంధ దుర్గంధ వస్తువులన్నిటిని గాల్చి అగ్ని తన యొక్క నైజస్వభావముగు అగ్నిగా నేలాగున మార్చివేయునో, ఆలాగున కన్నులారజూచెడు అన్ని వస్తువుల యొక్క ప్రకృతిబుద్ధుల నశింపజేసి, చిన్మయ జ్ఞానస్వరూపముగ జేసికొనేలాగున చూడుము. ఆలాగున చేయక పురుషులైనచో స్త్రీలను, స్త్రీలైనచో పురుషులనుజూచి మోహము నొంది, దానిలోబడి పోయినచో అగ్నినిజూచి మంచిపదార్థమని భ్రమించి దానిలో బడిపోయిన మిడుతవలె దహించిపోదువు. పూర్ణనిగ్రహము చేయశక్తిలేనిచో పుణ్యాత్ములను, పుణ్యాశ్రమములను, పుణ్యస్థలములను జూచి సంతోషము నొందుము. అట్లుగానిచో సర్వేశ్వరునియొక్క ప్రకృతినిర్మాణమును జూచి యానందించుము, అట్లు గాకపోయిన అంతర్దృష్టి గలిగి లోపల జరుగుచున్న దివ్యోత్సవము నవలోకించి సంతోషము గలిగియుండుము. దీనివలన తృప్తినొందక పోయిన నిన్ను మొదలుకొని సమస్తమును ప్రకాశింపజేసెడు దివ్యుడగు దైవమును జూచి యానందించి యానందపరవశుడవై కట్టకడ కానందమయుడవై యుండుము. అంతేగాని, అగ్నిలో బడిపోయిన మిడుతవలె దృశ్యములగు చిత్రవిచిత్రములగు విషయములలో బడిపోయి వ్యర్థముగా చావకుము.

4. ఓ రసనేంద్రియమా! బహుకాల తపోమహిమవలన ఈదేహము లోనికి వచ్చి చేరినావు.

నీకు మంచి మంచి రుచులుగల వస్తువులను భుజింపవలయునని గదా కోరిక గలిగియున్నది? అది చాలా మంచిదేగాని, మోహము నొంది యేల విషసదృశములగు దృశ్యవిషయరసములను గోరుచున్నావు. వానివలన గలిగెడు విపత్తులు నీకు తె లి య క యు ం డ వ చ్చు ను. చెప్పెద సావధానముగా ఆకర్ణింపుము, నీయొక్క మూలము జలము. ఆజలమేలాగున అన్ని మాలిన్యములను తనలో నడుగు భాగమున నణచి వేయుచున్నదో, ఆలాగున ఏరసము వచ్చినను దానికి వశపడక యణచివేయుము. గాలమునన గల మాంసము నాశించినచేప లేలాగున ఘోరతమమగు మరణము నొందు

చున్నవో, అలాగున బాహ్యవిషయములగు మాంసాదిరుచులను, విషయ సుఖములను, దృశ్యరసములను, గోరుచుండిన నీకును అట్టి యవస్థయే గలుగును. కావున ఒకేసారి యన్ని రసములను త్యజింప ప్రయాస మనితోచిన భగవన్నివేదితములగు ప్రసాదముల బుచ్చుకొనుము. వానివలనను తృప్తి నొందక పోతివేని బ్రహ్మనిష్ఠ కను కూలమగు శుద్ధవస్తువుల గ్రహించుము. దాని పై భగవద్భక్తి రసామృతమును పానముచేయుము. అదేరీతిగా భగవద్జ్ఞానామృతమును, కారుణ్య పీయూషమును, శాంతిరసమును, ప్రేమ సుధను, పానముజేసి సౌఖ్యము గలిగియుండుము. మఱియు ఖేచరీ ముద్ర వలన గలిగెడు యోగామృతమును భుజింపుము. ఇది చాలా మంచిది, భవ రోగమును రహితమొనర్చును. కాని దీనివలన కృతార్థుడ నైతినని మాత్రము తలంచకుము. రసనేంద్రియమున కందని బ్రహ్మానంద రసమయుడవై బ్రహ్మ మయుడవై యుండుము. ఇదియే యంతిమస్థితియని తెలిసికొనుము. అంతేగాని మత్స్యమువలె దృశ్యవిషయములో మునిగి చెడిపోకుము.

౮: ఘ్రాణేంద్రియమా! ఇక నీయొక్క సంగతి కొంత చెప్పవలసి యున్నది. ఎంతో సుకృత విశేషమువలన ఈశరీరములో జేరితివి. నీకు మూలము పృథివి. అది యేలాగున ఎన్ని మాలిన్యములు వచ్చినను వానిని తనలో ఐక్యపరచి యేలాటి మాలిన్యము లేకుండ చేయుచున్నదో, యాలాగున ఎట్టి దృశ్యవిషయములు వచ్చినను నీలో రహితమొనర్చి, శుద్ధముచేయుము. అంతేగాని బాహ్య సుగంధములకు వశపడి పోయితివా? నీగతి దుర్గతియేసుమీ! ఏలన వాసనకు వశపడి తుమ్మెద యేలాగున చంపక పుష్పసుగంధము నాశించి దానిలోబడి నశించిపోవునో, అలాగున బాహ్యవిషయములకు లోనైనచో, ఆ తెలివిలేని తుమ్మెదవలె నశింపగలవు. కాని యేకకాలమున నిగ్రహశక్తి గలుగజేసి కొనుటకు ప్రయాసమని తోచిన భగవదర్పిత పుష్పచందనాదులచే తృప్తి నొందుము. ఆపైన యోగధారణచే గలిగెడు అంతర్ముఖ దివ్యసుగంధము నాఘ్రాణించుచుండుము. దీనితో పూర్తియైనదని తలంచక ఘ్రాణేంద్రియమునకు విలక్షణమై, అట్టి గంధ విషయమునకు సాక్షియైయుండు నిజాత్మలో నుండుము. దానివలన జన్మ రాహిత్యము గలిగెనని సంతసించుము. అంతేగాని విషయానందమునకు లోబడి చంపక కుసుమమునకు వశపడిన భ్రమరమువలె వ్యర్థముగా బాధితుడవు...

జ్ఞానేంద్రియములారా! ఇప్పుడు మీకు చెప్పవలసిన ధర్మము యొక్క మూలమును జెప్పితిని. ఇది సంగ్రహమైనను ధర్మముయొక్క సారముగలది. దీనియొక్క రహస్యమును దెలిసికొనిన జీవన్ముక్తులు గాగలరు. భవరోగ దుఃఖములో బడిపోరు.

కురంగాళిపతంగేభమీనాస్త్వేకైకశో హతాః ।
సర్వైర్యుక్తైరనర్థైస్తు వ్యాప్తస్త్వజ్ఞః కుతస్సుఖమ్ ॥

శబ్దముచేత లేడియు, గంధముచేత భ్రమరము, రూపము చేత మిడుత, స్పర్శముచే గజము, రసముచే మీనము ఇవి ఒక్కొక్క యింద్రియ విషయముచేతనే నశించుచున్నది. ఇట్లుండగా నీ యైదింద్రియముల విషయ ములతోను, గూడిన యజ్ఞుడైన మనుష్యునియొక్క స్థితిని గూర్చి యేమని చెప్పవచ్చును?

వేదాస్త్యాగశ్చయజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ ।
నైవాజితేంద్రియస్యేహ సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్ ॥

వేదములు కడవఅకు చదివినను, విరాగియై సమస్తమును విడిచినను, అశ్వమేధాది యజ్ఞము లన్నిటిని విధిప్రకారము చేసినను, నియమముల నన్నిటి నాచరించినను, కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సు లనేకములు చేసినను, ఎవనికి ఇంద్రియ నిగ్రహ మీ లోకమునందున్నపుడే గలుగదో, అట్టివానికి పై జెప్పిన క్రియలెవ్వియు, ఎప్పుడును సిద్ధిని గలుగజేయవు.

1. కర్మేంద్రియములారా! మీరును పై జెప్పిన జ్ఞానేంద్రియములవలె బాలా సుకృతవిశేషమువల్లనే ఈ తనువులో వచ్చి చేరి యున్నారు. కాని దానివలన గలుగవలసిన సౌఖ్యమును పొందక యున్నారు. మీలో వాగింద్రి యము మొదటివాడు. ఓ వాగింద్రియమా! నీవును శ్రేయస్సునే కోరు చున్నావు. కాని మాయాభ్రమచే దానికి భిన్నమైన కార్యములనే చేయు చున్నావు. ఇంత మంచి నివాసము దొరకియు ఏల చెడుమాటలు, క్రూర వచనములు, అనృతములు, దూషణములు, వ్యర్థవాక్యములు చెప్పుచు దుఃఖమునకు పోవుచున్నావు? కావున నాయనా! నీకు మంచి మార్గమును జెప్పెద, సత్యముగాను, శాంతముగాను, ప్రేమాన్వితముగాను మాట్లాడుము. ఇది యమృతమును గలుగజేయును. నాయొక్క వాక్యముల

నాలకించి మంచిమార్గమునకు రమ్ము, దైవవాక్యములను, ఉపనిషద్వాక్యము లను ఉచ్చరించు కొని యమృతత్వము నొందుము. అట్లైన నీకు ఈ కాయములో నమరి నందుకు తగినఫలము గలుగును. అసత్యవాక్యముల నాడి నందుచేగదా బ్రహ్మదేవుని శిరస్సునుగూడ ఈశ్వరుడు త్రుంచి పారవేయవలసి వచ్చినది సత్యవాక్పరిపాలనముచేగదా హరిశ్చంద్రుడు సద్గతిని బొందెను. కనుక నీరెండు సంగతులను జ్ఞాపకముచేసికొని మంచిమార్గమున నడువుము. బ్రహ్మనిష్ఠు లుండుస్థలమున నెమ్మదిగా మాట్లాడుము. వారి ధ్యానకాల ములో నిశ్శబ్దముగా నుండుము అట్టివారుండెడు స్థలములయందేగాక అలాటి పుణ్యప్రదేశములయం దెచ్చటనైనను ఎంగిలి నూయకుము. అది అట్టి పుణ్యపురుషుల కాళ్ళయందు దగులవచ్చును! కావున ఎల్లప్పుడు మెలకువ గల్గియుండుము. అట్లైన నీ కెచ్చటనైనను శ్రేయస్సే గలుగును.

2. ప్రాణేంద్రియమా! నీవును విశేషభాగ్యమువలననే యీ కళేబర ములో వచ్చిచేరియున్నావు. అయితే దానివలన పొందవలసిన పూర్ణ ఫలమును పొందకపోవుచున్నావు. ఈ కరములచే సుకృతకార్యముల జేయుము, భగవత్ప్రీతికరములగు పనులు, సాధుసేవయు దీనజన సంరక్ష ణయు, పరోపకారము నాచరించుచుండుము. అప్పుడే నీవు కృతార్థత నొందగలవు. అట్లుగాక దీనివలన హింస, పరప్రాణులకు బాధగలుగ జేయుట, ఏదైన తాకుటకు తగనివానిని పట్టుకొనుట మొదలగు దుష్కృత్య ముల నొనర్చితివా? మఱల దానివలన దుఃఖములే గలుగును. పుణ్యవతి యగు ద్రౌపదిని పట్టుకొనుటవలన దుశ్శాసనుడు పొందిన దుర్గతిని జ్ఞాపక ముంచుకొనుము. కరముచే నీశ్వరు నర్చించిన మార్కండేయాది మహర్షు లెంత యుత్తమమగు శివలోకమును బొందిరో ఆ సంగతులను యోచించు కొని సన్మార్గుడవు గమ్ము, కృతకృత్యుడవైన తప్ప కృతార్థత గలుగదు. అసత్యమగు చేవ్రాలు చేయకుము. ఒకరికి నొప్పి గలిగేలాగున ఉత్తరములు గాని గ్రంథములుగాని వ్రాయకుము.

3. పాదేంద్రియమా! నీవీ దేహమునంతయు ధరించుచున్నావు. కాని కృతార్థత చెందవలసిన కార్యమును మరచి పోవుచున్నావు. జన్మాంతర పుణ్యఫలమువలన నీకును ఈ దేహములో స్థానము దొరకినది. ఆ పుణ్యా విశేషమును వ్యర్థపరచకుము. మదించి కన్ను దెలియక నడవకుము,

అందువలన అనేక ప్రాణికోట్లకు బాధ గలుగవచ్చును మఱియు పాపస్థలము లోనికి వెళ్ళకుము. పుణ్యప్రదేశములోనికి సదా వెళ్ళుచుండుము. పుణ్య పురుషులుండు స్థానములకును, దీనజనుల సంరక్షించుటకు తగిన ప్రదేశము నకు మాత్రమే వెళ్ళుదునని యొక వ్రతమును సంకల్పించుకొనుము. నీవు ఆలాగున సంకల్పించిన, తక్కిన యింద్రియము లేమియు చేయజాలవు. నిన్నాశ్రయించియే యెవరైనను ఎచ్చోటికైనను పోగలరు. కావున సన్మార్గ ములో వెళ్ళుటకొరకు నిన్ను బ్రతిమాలుకొనుచున్నాను. శ్రీబుద్ధదేవుడు తన దివ్యపాదములచే మొదట అనేక పుణ్యాశ్రమముల, పుణ్యక్షేత్రముల సంచరించియే విజ్ఞానము నార్జించి ప్రపంచమంతటను జ్ఞానమును వెదజల్ల గలిగెను చూడుము, ఇంద్రుడు గౌతమాశ్రమమున చెడుకార్యము కొరకు సంచరించినందుచే శాపగ్రస్తుడై పాపము నొడిగట్టుకొనెను.

4. ఉపస్థేంద్రియమా! రహస్యేంద్రియమా! జననమరణముల యొక్కయు, ముక్తియొక్కయు, రహస్యమంతయు నీలోనే యున్నది, నీవు తెరువబడినచో నరక ద్వారము తెరవినట్లే యని తలంచుము. నీవు మూయబడిన నరకద్వారనిరోధము గలుగునదేగాక, ముక్తి ద్వారము తెరువబడినదనియే నమ్ముము. సృష్టియొక్క బీగము (తాళపు చెవి) నీ కరస్థమై యున్నది. నీవు సృష్టికి హేతువైన మార్గమును తెరచితివా, సంసార దుఃఖము తప్పదు. నీవు దానిని సదా తాళము వేసియుండిన ముక్తి యును కరస్థము, సందేహములేదు, నా తండ్రీ! ఎవరు ఏ సమయమున ఏ విధమైన ప్రోత్సాహముజేసినను తెరవకుము. సనకసనందనాది యోగు లును, సులభ, గార్గి, మైత్రేయి మొదలగు యోగినులును. ఈ సృష్టిద్వార మును తెరువక జాగరూకులై భద్రముగా చూచుటవల్లనే వారికి బ్రహ్మరంధ్ర పర్యంతముగల మోక్షద్వారము లన్నియు ప్రయాసములేక సులభముగా తెరవబడెను ఇది తెరచియుండు కాలపర్యంతము మనుజులకేగాక, దేవతల కేగాక, త్రిమూర్తులకు సహితము సంసారదుఃఖము గలుగుచునేయుండును. ఈ తత్త్వము నెఱింగియే ఋషులును, యోగులును, సృష్టిద్వారమును చక్కగ నిరోధించి యుండిరి, కనుకనే వారు అతీంద్రియజ్ఞానమును, ఈశ్వర సాక్షాత్కారమును కష్టములేక పొందిరి

అయితే ఇది చాలప్రయాసమైన సంగతియని తెలియక పోలేదు. అంతఃకరణములో గల జన్మాంతర దృశ్య సంస్కారము లుండుటవలన ఇది మూయుట కష్టతరము ఈశ్వరకృపయు, గురుకరుణయు విశేషపుణ్య సంస్కారమును గలిగినప్పుడే దీనిని మూయుటకు శక్తి గలుగును. ఈ విషయములో అనేకయోగులును, ఋషులు సయితము అనేక పర్యాయము లపజయమును బొందియున్నారు. అయినను వారనివార్య ప్రయత్నముచే కొంతకాలములోనే విజయము గలిగినవారలైరి. కనుకనే గృహస్థాశ్రమము నొకదానిని ఋషు లేర్పరచిరి: దానికి అనేకకాలనియమము లేర్పాటుచేసిరి. దాని యొక్క పరీక్షలో నెగ్గినవారికి వానప్రస్థ యత్యాశ్రమములం కర్తవ్యత గలదు. బ్రహ్మచర్యములో నుండిగాని, గృహస్థాశ్రమములోనుండిగాని, వానప్రస్థాశ్రమములోనుండిగాని ఈ సృష్టిద్వారము బాగుగా మూయబడెనని తోచిన అచ్చటనుండియే తురీయాశ్రమమును స్వీకరింపవచ్చునని ఋషులు తెలిపియున్నారు. దీనియందు జయముగలిగినచో ప్రకృతి యంతయు జయింపబడినట్లేయని తెలిసికొనవచ్చును.

ఇది తెరచిన గల విషయము విషమమే, విషమయమే, మూసిన చో గలుగునది నిర్విషయము, అమృతమయము. విషామృతముల సంధి యిచ్చటనుండియే మారుచుండును. ఇవే యీ జీవునికి ఊర్ధ్వాధో మార్గములు. అనగా నిరోధించిన యూర్ధ్వగతియు, నిరోధము లేక పోయిన అధోగతియు నీ జీవునికి గల్గుచుండును. ఈ విషయములో స్త్రీపురుష లుభయులును సమానులే. సృష్టికి హేతువైనందుచేతనే దీనియొక్క యధిదేవత ప్రజాపతి యని శాస్త్రము చెప్పుచున్నది. అనగా సృష్టికర్తయని యర్థము. దీనియొక్క సంయమము గలినవారు సృష్టి, స్థితి, లయములకు హేతువగు భవసాగరమున పడరు. జయించినవారు సృష్టికర్తనుగూడ జయించిన పరమశూరులనియు, ధీరులనియు, గ్రహించు కొనవలయును. అంతేగాదు చరాచరమగు జగత్తు నంతయు కాలచక్రముపైనిడి త్రిప్పుచుండు ప్రకృతినిగూడ జయించినవారగుదురు.

5, ఇంతవరకు వాగాదులగు నాలుగిం ద్రియముల గురించి సంక్షిప్తముగా జెప్పడమైనది. ఇప్పుడు పాయ్వింద్రియమును గురించి చెప్ప

వలసియున్నది అయితే యిది రహస్యేంద్రియము వంటి దారుణకృత్యము లను జేయదుగాని వివేకము తక్కువగుటవలన బంధనమునకు హేతు భూతములగు చిన్న చిన్న కృత్యములను చేయుచుండును. చిన్నదని తలంచి యూరకుండరాదు. అనేకములగు చిన్నచిన్న వస్తువులు చేరునప్పుడవి యన్నియు కలిసి యొకగొప్ప వస్తువగును. జలరేణు సముదాయముచేరి మేఘమైనప్పుడు అంత ప్రకాశమైన సూర్యుడుగూడ మరుగుపడు చున్నాడు. కనుకనే మహాత్ములు ఒక చిన్న పనినైనను చెడుదానిని చేయరు. విషము కొంచెమైనను అది గొప్ప విపత్తును గలుగ జేయును. అగ్ని యొక్క మిణు గురైనను ప్రజ్వలింప జొడగిన ప్రపంచము నంతయు గాల్చివేయును.

పాయ్వింద్రియమా! నీయొక్క జన్మసాఫల్యము వలననే యీ దేహములో వచ్చి చేరియున్నావు. కావున నీవుగూడ మంచికార్యముల జేసి తరింప జూడుము. నీవు చేయు చెడుకార్యములు నీకు తెలియకనే చేయుచున్నావు. అవి యెవ్వియనగా మార్గముయొక్క ప్రక్కనే మలవిసర్జనము చేయుట, దీనిని అనేక మహాత్ములు, పుణ్యపురుషులుచూచి యసహ్యాపడుదురు. అది యొక శాపమువలె నీకు తగులును. అంతేగాక పేడపురుగులు మలమును ఉండలుండలుగా జేసికొని దారిలోనికి తీసికొనివచ్చును. అది కొందఱి కాళ్ళలో తగులును. వారు దానివలన హేయపడుదురు. ఏనీచాత్మ డీలాగున చేసెను? లేక యేమృగప్రాయి డీలాటిపని జేసియుండును? అనితలంతురు. అదియు నొకవిధమగు శాపమువంటిదే! కనుక దారిప్రక్కన ఎచ్చటను ఆ లాటిపని జేయరాదు. దారికి దూరమైనను జాగ్రతపడనిచో మఱికొన్ని కష్టములు గలుగును. ఎవ్వియనగా చాలా మందికి ఏదో ఒక విధమగు వ్యాధిగల్గి యుండవచ్చును. మలములో నీగలు ప్రవేశించి జలము మొదలగు అనేక వస్తువులలో ఆవ్యాధిని ప్రవేశింపజేయును. అది మనుష్యులకుగూడ వ్యాపించును. మఱియు గాలిలోగూడ ఆ సాంక్రమికక్రిములు వ్యాపించి జనులకు అపాయమును గలుగజేయును. ఇంకొక రహస్యమును జెప్పెద, మలములో వ్రాలిన ఈగలు పుష్పములలోను, వీధులలో నమ్ముచుండు మిఠాయి మొదలగు పదార్థములలోను వ్రాలును. కావున నవియు వ్యాధిని గలుగజేయును. కనుకనే వీధిలో నమ్ముచుండు పిండివంటలు మొదలైనవి తినగూడదని పరిశుద్ధాత్ములు చెప్పెడు రహస్యము. భూమిపై మలవిసర్జనము జేసిన కొన్నిరోజులవఱకా ప్రదేశమున వాయుమండల మంతయు

చెడువాసన గల్గియుండును. అట్టి మాలిన్యముగల ఈగలు వ్రాలిన పుష్పము లను గదా భక్తులు భగవంతునికి పూజ చేయుచున్నారు? కాబట్టి యీలాటి దోషము లన్నిటిని దలంపక నీవు ప్రవర్తించుచున్నాడవు.

అట్లైనచో సాధారణ గ్రామములలోనుండు జనులు పురీష విసర్జనమును జేయక యెట్లు జీవింతురని తలంపనక్కరలేదు. పరమేశ్వరుడు దానికి తగినయేర్పాటు చేసియున్నాడు అది చిన్న మృగమైన మార్జాలము మనకు నిత్యమును ఉపదేశించుచున్నది పిల్లి మలవిసర్జనము జేసిన వెంటనే మట్టితో మూసివేయును. అందువలన రెండుమూడు రోజులలో మట్టిలో కలిసిపోవును. ఆలాగున మనుజుడును మట్టితో మలమును మూసివేసిన ఏలాటి దోషమును గలుగదు. మట్టియందొక విధమగు సూక్ష్మక్రిములు గలవు. అవి యెటువంటి దుర్వాసనగల వస్తువు నైనను మట్టిలో రహిత మొనర్చును. ఈక్రిములే యెరువును జీర్ణపరచి ఓషధుల కాహారమునుగా మార్చుచున్నవి. ఓహో! దీనినిజూచిన కరుణామూర్తియగు పరమేశ్వరుని యొక్క సృష్టిమహిమను, మనుష్యులయందు గల దయను యెంతయని వర్ణించగలము? ఈసూక్ష్మక్రిమియొక్క పనిని ప్రస్తుతము వ్యవసాయ శాస్త్రజ్ఞులు కనిపెట్టినను తెలిసియో, తెలియకయో, పూర్వమునుండియు జనులు వృక్షములకు యెరువును పెట్టునపుడు మట్టితో కలిపిపెట్టవలయుననెడు రహస్యమైయున్నది. కావున గుదేంద్రియమా! నీవీలాటి తెలివిలేని పనిచేయక జాగ్రతగలిగి జీవింపుము. అట్లైన నీకు మృత్యువువలన బాధగలుగదు. నీయొక్క యధి దేవతయు మృత్యువుగదా!

ఈ పైజెప్పిన విషయములన్నియు వినునప్పుడు సామాన్యజనులు ఏమైన తలంచవచ్చును, కాని దానివలన కలుగు మేలుకీడులను యోచించిన ఎంతయో యుపయోగకరముగా నుండును, దీనియొక్క రహస్యము విజ్ఞులకు బాగుగా తెలియును. ఓపాయ్వింద్రియమా! నీవు పై జెప్పిన పాపకార్యముల జేసినచో మృత్యువునకు లోబడి సంసారసంకటములోబడి విపత్తు బొంద గలవు. అట్లుచేయక దీనియొక్క నిగ్రహము గలిగి వర్తింపుము. ఇదియే నీవు చేయవలసిన యుపకారము. దీనినే పాయ్వింద్రియనిగ్రహమని మహనీయులు చెప్పుదురు. ఇంతవఱకు తెలియక యెంతమంది మహాత్ములకు అనిష్టమును గలుగజేసితివో దానిని తెలిసికొని పశ్చాత్తాపమును బొందుము.

ప్రాయశ్చిత్తమునగూడ జేసికొనిన మంచిది. పశ్చాత్తాపముచే పాపము నశించును. ప్రాయశ్చిత్తముచే పుణ్యము వృద్ధియగును పుణ్యాభివృద్ధివలన సత్వగుణముగల్గును. సత్వగుణమువలన అంతఃకరణ శుద్ధి గలుగును. అంతఃకరణ శుద్ధియగునప్పుడు వైరాగ్యమంకురించును. దానివలన ప్రకృతినుండి విముక్తిగలుగవలెనని దృఢసంకల్పము గల్గును. అందువలన నీశ్వరధ్యానము లభించును. ఈశ్వరభక్తివలన ప్రకృతిదోషము శమించును. ప్రకృతి దోషము క్షయమునొందగా పరమాత్మ సాక్షాత్కారమును జేసికొన వలెనను సంకల్పముదయించును. అట్టి సంకల్పము తీవ్రమైనపుడు బ్రహ్మవేత్తలగు గురువులను వెదకవలెనని విచారముగలుగును. అప్పుడు వారివలన బ్రహ్మతత్త్వజ్ఞానోపదేశమునుబొంది యేకాంత ప్రదేశములో నుండి గురువాక్య శ్రవణము దృఢము గలుగుటకొరకు మనన నిదిధ్యాసనముల జేయవలయుననెడు సంకల్పము గల్గును. ఏకాంతమున నిదిధ్యాసము రూఢిగా గల్గునప్పుడు సంకల్పములన్నియు నశించి శుద్ధమైన సాక్షాత్కారము జీవులకు గలుగును.

# అంతరింద్రియములను ప్రార్థించుట

ఇక చెప్పవలసినది అంతరింద్రియములను గురించినది. ఈయంతరింద్రియములు ఒకే బ్రహ్మదేవునికి చతుర్ముఖములవలె మనస్సనియు, బుద్ధియనియు, చిత్తమనియు, అహంకారమనియు నాలుగు విధములుగానున్నవి. వీరు నల్వురును, గొప్ప ప్రభువుదగ్గర నల్వురు మంత్రులవలెనున్నారు. వీరిలో బుద్ధి ప్రధానమంత్రిగా నుండినను మనస్సే సకలకార్యముల జేయుటలో ముఖ్యుడై యున్నాడు.

ఓమానసేంద్రియమా? నీవును అత్యధిక పుణ్యవిశేషముచేతనే ఈ హృదయములో చేరియున్నావు. కఠినులై క్రూరకృత్యముల జేయువారి హృదయములలో నున్నచో నీకు గలిగెడు సంకట మింతంత గాదుగదా? ఎన్నియో కష్టములకు లోబడి యనేకులు సంతాపమును బొందుట చూచుట లేదా? అట్లుగాక యిట్టిహృదయములో చేరియుండియు నీవేల దుఃఖకార్యముల

గూర్చి చింతించుచున్నావు. ప్రపంచములోగల ప్రాణులన్నియు సుఖమునే కోరుచుండును, నీవేల దుఃఖమును కోరుచున్నావు? నీకు మంచిమార్గమును జెప్పెద, నామాటవినుము, మిక్కిలి సౌఖ్యము గల్గును.

పక్షులను బట్టువారును, ఎలుకలను చంపువారును, విషముగలిపిన యన్నాదివస్తువులను తిననిచ్చి జంతువులను వధింతురు. తెలివిలేని యాప్రాణులు పదార్థములలోగల విషమును తెలిసికొనజాలక తిని చని పోవుచుండును. అలాగున నీవును విషయమను విషముతో గూడిన దృశ్యవస్తువును గోరుచుండినచో, తెలివిగల నీకును, తెలివిలేని యా క్షుద్రజంతువులకును ఏమిభేదము గలదు? నీవు మంచివాడవైనచో నీవు చేరిన యతని జన్మము మంచిది యగును. నీవు చెడ్డవాడవైనచో యతని జన్మము చెడ్డదేయగును నీవు మంచివాడవైనచో విషమును అమృతముగా జేయగలవు. నీవు చెడ్డవాడవైన యమృతమునుగూడ విషముగా మార్పగలవు. నీవు మంచివాడవైన శత్రువులందరును మిత్రులే. నీవు చెడ్డవాడవైన ప్రాణమిత్రులుగూడ పరమశత్రువులే. కావున ఓతండ్రీ! నీకు సుఖము గదా కావలసినది! బ్రహ్మాండములోగల సమస్తసుఖముల కాధార మాత్మ అనగా బ్రహ్మము. అది నీవుండు హృదయములోనే గలదు. నీయొక్క దృష్టిని పైకి మరలించిన దానిని కనుగొనగలవు. నీవు దృష్టిని క్రిందికి ద్రిప్పినందుచే దుఃఖములతోకూడిన యీప్రకృతి గనుపించుచున్నది. చేతిలోగల యద్దమును లోభాగమునకును, బయటికిని త్రిప్పిన తనను జగత్తును, యొక క్షణకాలములోనే యెట్లు కనుగొన గలుగుదురో, అలాగున ఆత్మముఖముగా తిరిగిన బ్రహ్మమును, జగన్ముఖముగా తిరిగిన ప్రకృతి కృతదుఃఖప్రపంచమును గనుగొనగలవు. కనుక యంతర్ముఖుడవు గమ్ము! అప్పు డనంతానందము గలుగును. ఈ ప్రపంచానందము గలిగినను అతిత్వరలోనే నశించును. అది యటువంటిది గాదు. అనంతకాల మనుభవించినను కొంచెమైనను తరుగదు. కావున నేను చెప్పువాక్యముల నాలకించి శాంతము గలిగి నిరంతరము ఆత్మలో గలిగెడు దివ్యసుఖమును అనంతకాలమువఱకు అనుభవించుచుండుము.

నీవు శాంతముగా నుండిన ఈలోకమంతయు పరమశాంతి మయమ్మే అట్లుగాక యశాంతిని గలుగజేసితివేని లోకమంతయు దుఃఖమయము. నీకు

కరుణ గలిగిన ప్రపంచ మంతటను కరుణారసప్రవాహము వెలువయె పొంగి ప్రవహించుచుండును. నీవు కాఠిన్యమును వహించిన స్వర్గలోకము గూడ నరకతుల్య మగును. నిజముగా విచారించిన స్వర్గలోకములను నరక లోకములను నీవే సృష్టించుచున్నావు. వెయ్యేల? బంధనమును, మోక్షమును కల్పించువాడవు నీవుతప్ప మఱియొక డేలోకములోను ఎవడును లేడు. ముక్తిద్వారముయొక్క బీగము నీచేతియందున్నది. మంత్రియొక్క చేతిలో లోకముయొక్క కీలక మేలాగున నమరియుండునో, ఆలాగున నీయొక్క యరచేతిలో లోకముయొక్క సుఖదుఃఖము లమరియున్నవి. నీయొక్క యధిదేవత చంద్రుడు. అతడేలాగున చల్లదనము గలిగియుండునో, తండ్రీ! నీవును అట్టి శాంతస్వభావము గల్గియుండుము నీవును బాగుపడ గలవు. నేనును నిత్యసుఖమగు దైవసుఖము నొందగలుగుదును నీవుదయించిన మూడులోకము లావిర్భవించును. నీవు లయ మొందినచో లోకత్రయమును లయించును కావున నోమానసమా! పుణ్య పురుషులేలాగున పరమ శాంతులై కరుణారసభరితులై వైరాగ్యనిధులై యున్నారో, ఆలాగున నుండుము. అట్లయిన ఛాలసౌఖ్యము గలదు.

ఓమనసా! నీవు చేయుపని సాధారణమైనదిగాదు. నీకిష్టమైన దేవతలను రాక్షసులనుగాను, రాక్షసుల దేవతలగాను జేయగలిగినంత శక్తి యున్నది. ఆలాగున నీకిష్టమైన, దేవతాస్త్రీలనుగూడ పిశాచములనుగా మార్పగలవు. పిశాచములను దేవతాస్త్రీ శ్రేష్ఠులనుగాను ఒక క్షణకాలములో జేయగలవు. మలిన వస్తువును నిర్మల వస్తువునుగాను, వికారమైనదానిని మిక్కిలి సుందరము గాను సృష్టింపగలవు. ఒక క్షణములో భూర్భువాదులైన యేడులోకములను తిరిగి రాగలవు. మఱియొక క్షణములోనే అతల, వితల, పాతాళాది లోకములను సంచరించి వత్తువు. నీకిష్టమైన, దినములు, వారములు, సంవత్సరములవఱకును ఒకేస్థలములో కదలక మెదలక యుండ గలవు. సంవత్సరములేమి, యుగములు కల్పముల పర్యంతము నీవు నిశ్చలముగా నుండ దలంచిన నిన్ను చలింపజేయు వారెవ్వరును లేరు. నీయొక్క మహిమ యట్టిది, ఇట్టి నిన్ను సృష్టించిన బ్రహ్మదేవునియొక్క మహిమ నేమని వర్ణింపవచ్చును? వెయ్యేల నీవు తలంచినచో అసాధ్యమగు పని మఱియొకటి లేదుసుమా? నిన్ను వర్ణింప నెవరి తరము? కావున ఈ దేహములో చేరినందుకు ఓ పుణ్యాత్ముడా! శాంతిగల్గియుండుము.

నిన్ను స్వాధీనములోనుంచుకొఱకే సనకాదిమహర్షులు యోగశాస్త్రముల రచించిరి. నిన్ను బాగుపరచుటకొఱకే నారదాది మహర్షులు భక్తి మార్గము నేర్పరచిరి. నిన్ను శుద్ధముగా జేయుటకొఱకే వ్యాసాది ఋషులు జ్ఞానమార్గమును సృష్టించిరి, నిన్ను ఋజుమార్గమున ప్రవేశపెట్టుటకొఱకే శ్రీకృష్ణ భగవానుడు నిష్కామ కర్మయోగమును నిర్మించెను. నీవు ఎవరిదగఱ శాంతము గలిగియున్నావో వారిజన్మము ధన్యము. వారు దైవసుఖమును బొందగలరు. ఎందరో భక్తులు నీవలన శాంతినొందక సంకటపడుచున్నారు. ఎందరో యోగులు నీయొక్క దుష్కృత్యమువలన మనశ్శాంతి నొందక పరితపించుచున్నారు. ఎందరో ధర్మాత్ములు నీయొక్క దుశ్చేష్టవలన పదచ్యుతులై పరితాపము నొందుచున్నారు. దీనివలన నీకు పాపము లేదా? పుణ్యాత్ములను నొప్పించుట మంచిదా? కావున ఇకమీద నట్టి దుష్కృత్యముల నెప్పటికి చేయకుము. సజ్జనులకు హితమును గలుగజేయుచుండుము, నీ జన్మము ధన్యమగును. ఓమ్.

2, బుద్ధీంద్రియము – ఓ నాయనా! మనస్సు చేయుచున్న కృత్యముల నింతవఱకు చెప్పినవాటిని నీవును వినియున్నావుగదా? నీవు మంచివాడవైతే మనస్సు ఏమియు జేయజాలదు. ఏలన మంత్రివర్గములో ప్రధానమంత్రి యనుమతి లేక తక్కిన మంత్రులేమియు చేయజాలరు. అదేరీతిగా జీవుని యొక్క ప్రభుత్వములో నీవు ముఖ్యమంత్రిగా నున్నావు. మనస్సు, ఔనా? కాదా?అను సంశయమే స్వరూపముగా గలవాడు. ఆయన నిశ్చల స్వభావము గలవాడు గాడు. ఎల్లప్పుడు చంచల స్వభావముతో గూడియుండును. నీ వట్టివాడవు గావు. నిశ్చయాత్మస్వరూపము గల్గియున్నావు. మనస్సు, ఔనా? కాదా? యని నీ దగ్గఱకువచ్చి యడుగుచుండును కావున అతనిచేత అన్నియు నీ స్వాధీనములుగా నున్నవి. నీవు విచారణకార్యములలో సమర్థుడవు. మనస్సు నొక పోలీసు ఇన్స్పెక్టరుగా వర్ణించుకొనవచ్చును. అతని యొక్క విజృంభణ మంతయు సూపర్నెంటు దగ్గఱకువచ్చి చేరునంతవఱకు మాత్రమే. అట్టి పై యధికారి సమీపమున ఆయిన్స్పెక్టరువంటి మనస్సు ఏమియు చేయజాలదు. సూపర్నెంటు ఇచ్ఛానుసారముగా ఇన్స్పెక్టరణగిపోవు నట్లు ఈ మనస్సుగూడ నీకు స్వాధీనపడిపోవును. కావున నీవు మంచి వాడవై యుండుము.

నీవుసు ఎంతో పుణ్యము చేసినందుచేతనే యీ దేహములో వచ్చి యున్నావు. లేనిచో శ్రేష్ఠమైన యీ మానవకాయములో నీకు స్థానము దొరకి యుండదు. నీయొక్క యధిదేవత బృహస్పతి. ఆయన దేవతల కందరికిని గురువు అట్టి యున్నతస్థితిలో నుండియు నీవు నిన్ను మరచిపోవుచున్నావు. మతాంతరమున బుద్ధియొక్క యధిదేవత బ్రహ్మయనిగూడ చెప్పబడియున్నది. అట్లయిన మిక్కిలి మంచిది గదా? అట్టి శ్రేష్ఠమైన వంశములోనుండు నీవు ఏల దుర్మార్గుడగు నీ మనస్సుయొక్క మాటలను విని చెడెదవు. మనస్సును లొంగదీయుటకు మఱియొక రహస్యమును జెప్పెద ఆతడు బృహస్పతి శాపముచే కృష్ణపక్షమున క్షయించుచున్నాడు. కనుక నీయొక్క యధిదేవత బృహస్పతియగుటచే నీవీసంగతిని తెలిసికొనియున్నావని మనస్సు ఎరింగె నేని నీదగ్గఱ చాల వినయము గలిగియుండును. ఎట్లన ఒకడు తప్పు కార్యము చేసియుండిన వాడు ఆ సంగతి నెఱింగియుండు వానిదగ్గఱ వినమ్రుడై యుండునట్లు ఈ మనస్సుగూడ ఉండగలదు. అప్పుడు నీ యాజ్ఞ ప్రకారము నిలువక తప్పదు. యోగ్యుడుగాని సూపర్నెంటైన, దుష్టుడైన యినస్పెక్టరు చెప్పెడు వాక్యములవిని చెడిపోవునట్లు నీవును ఒక్కొకప్పుడు ఈ మనస్సు చెప్పెడి మాటలను విని చెడుచున్నావు. ఇకమీద అట్లు చేయకుము. నీవును సౌఖ్యమునుగదా సదా కోరుచున్నావు! నీవు శుద్ధుడు గానిచో సుఖమెట్లు గలుగును?

ఒకవేళ మనస్సు విషయములచే బలము గలిగినదిగా నుండవచ్చును. అది నాయొక్క యాజ్ఞలో నిలుచునా? లేదా? అనిగూడ సందేహపడకుము. దేహబల మెంతయుండినను అధికారబలములేనిచో ఏమి చేయ గలుగును? నీ వధికారబలము గల్గియున్నావు. ఇన్‌స్పెక్టరు కాయబలము గల్గియుండినను బుద్ధిబలమును, అధికారబలమును గల సూపర్నెంటు దగ్గర అతనియొక్క బలమేమి చేయగల్గును? అలాగున అంతరింద్రియముల కన్నిటికిని నీ వధి కారివై యున్నావు. ఇన్‌స్పెక్టరే నీయొక్క యధీనములో నుండగా తక్కిన సార్జనులను, జవానులను గుఱించి మఱల చెప్పవలయునా? అలాగున బుద్ధి కధీనములై చిత్తాది అంతరింద్రియములును, జ్ఞానేంద్రియములును, కర్మేం ద్రియములును అణగియున్నవి. కావున నీవొకడవు శుద్ధుడవైతివేని తక్కిన యంతర్బాహ్యేంద్రియము లన్నియు ఋజుమార్గమున నడవగలవు. ఒకవేళ

నీకు బలము చాలదని తలంచెదవేమో! ఆ విషయమై సంశయింపనక్కర లేదు.

భక్తులగు కొందఱు జనులు తమకు గొప్పబుద్ధి బలము లేదని తలంచి బ్రహ్మవిషయమును తెలిసికొను సామర్థ్యము లేదని తలంచుచుందురు అట్లు తలంపనక్కరలేదు. బుద్ధి యెంత బలము గలదియైనను ఇంద్రియముల నిగ్రహించుటకు మాత్రమే సమర్థత గల్గియుండును. ఆత్మను కనుగొనుట కుపయోగపడదు. ఏలన బుద్ధివలన ఆత్మ ప్రకాశింపదు. ఆత్మవల్లనే బుద్ధి మొదలగు ఇంద్రియము లన్నియు ప్రకాశించుచున్నవి ఉపయోగములేని వస్తువెంత బలమైనదైనను లేక బలహీనమైనదైనను ఏమిప్రయోజనము? బుద్ధి శుద్ధముగా నుండిన చాలును. అట్టిది శాస్త్ర విషయములోగాని, బాహ్య కార్యనిర్వహణ విషయములో గాని, ధారణావిషయములోగాని గొప్పది కానప్పటికిని విరోధము లేదు. మలిన జలము ఎంత ఎక్కువగా నుండినను లేక తక్కువనుండినను సూర్యుడు దానియందు ప్రకాశించునా? లేక యట్టి మలిన జలము బంగారు పాత్రలో నుండినను ఏమి లాభము? సూర్య ప్రతి బింబము గలుగదు గదా? అదేరీతి మనస్సు చిన్నదైనను శుద్ధముగానుండిన చాలును. అట్టివారేకులములో జన్మించినను విరోధము లేదు జ్ఞానమును పొందగలరు. శుద్ధజలము మట్టిపాత్రలో నుండినను సూర్యప్రతిబింబము గనుపింపక పోవునా? కావున నీ యాత్మవిషయములో శ్రేష్ఠమైన కులమని గాని, లేక శ్రేష్ఠమైన యాశ్రమమని గాని తలంప నక్కరలేదు. శ్రేష్ఠమగు గుణముమాత్రము గల్గియుండిన చాలును. కల్మషముతోగూడిన యద్దము ఎంత పెద్దదైననేమి, ఆదిత్యుడు దానియందు కనుపించునా? నిష్కల్మష దర్పణమెంత చిన్నదైనను దానియందు భాస్కరుని ప్రతిబింబమేలాగున స్పష్టముగా గోచరము గాగలదో బుద్ధియొక్క స్థితియు అలాగున నుండును. కనుకనే కొందఱు అనేక శాస్త్రములను, అనేక ప్రపంచ కార్యములను, అనేక సూక్ష్మయంత్ర నిర్మాణములను గ్రహింప శక్తిగలవారైయుండియు, అనేక కర్మరహస్యములను గనిపెట్ట శక్తిగలవారై యుండియు, బుద్ధి నిర్విషయ స్థితిగలిగిశుద్ధముగానందుచే ఈశ్వరవిషయములోఅంధప్రాయులై యున్నారు. ఈ విషయము నింతటితో నిలిపి యే విషయమును ప్రారంభించితిమో దానిలో ప్రవేశింతము.

ఓ బుద్ధీ! ప్రపంచకార్యములలో గొప్పకార్యముల జేయ శక్తి లేదని తలంప నక్కరలేదు. శుద్ధముగా నుండిన చాలును. సన్మార్గనిష్ఠులైన మంత్రులయొక్క విధియేమి? ప్రభుత్వమును చక్కగా సంరక్షించుటగదా? ప్రభువునకు సుఖమును గలుగజేయుటగదా? అలాగున ఓ బుద్ధీంద్రియమా నీవును సన్మార్గవంతుడవై యుండుము. మఱియు శుద్ధత గలిగి యుండుము చాలును. అట్లైన నీవు నాకు చేయవలసిన కార్యములన్నియు చేసినవాడవే యగుదువు ఇదే గొప్పకృతజ్ఞత గలిగిన దానికి గురుతు. అట్లుగానిచో ననేక ద్రోహముల జేసినట్లే యగును అంతేగాదు. అది గొప్ప కృతఘ్నత యనియే తలంచవలసి యున్నది. సూపర్నెంటు కృతజ్ఞతగలవాడైనచో తక్కిన యిన్‌స్పెక్టర్లను గురించిగాని, జవానుల గుఱించిగాని యేలాటి విచారమును జేయ నవసరము లేదు. అలాగున ఓ బుద్ధీ! నీ వొక్కడవు శుద్ధముగా నుండిన మనస్సును గుఱించిగాని, ఇంద్రియ సమూహమును గుఱించిగాని విచారపడనక్కరలేదు. అన్నియు సాధువులే, సన్మార్గవంతములే, సందేహములేదు.

బుద్ధీంద్రియమా! జనులందరును దైవమునుగుఱించిగాని, జ్ఞానమును గురించిగాని నీవనెడి కొలత పాత్రచేతనే కొలుచుచున్నారు. జనులననేల మహాపురుషులు, బోధకులు, ప్రవర్తలుగూడ నీచేతనే సమస్తమును కొలుచుచున్నారు. గంగాజలము పొంగి ప్రవహించుచుండినను వారువారు తీసికొని వెళ్ళిన పాత్రములెట్టివో, యంతేజలమును తీసికొనివచ్చునట్లు నీయొక్క వికాస సంకోచముల ననుసరించి యేకార్యమునైన చేయుచుందురు. వీరియొక్కయాత్మవిషయకమైన జ్ఞానమును అట్టిదియే. ఒక పెద్దపాత్రలోగల నీటియందు సూర్యప్రతిబింబము గొప్పదిగా ప్రతిఫలించును. చిన్నపాత్రయైన చిన్నదిగా ప్రతిబింబించును. అలాగున నీయొక్క గొప్పతనము, చిన్నతనము ననుసరించి జేయమగు బ్రహ్మముగూడ గోచరము గాగలదు. మఱియు మతములయొక్కయు దైవముయొక్కయు విభేదములకు నీవే కారణము.

నీవేలాగున నుందువో మతమును, దైవమును జనుల కాలాగున గోచరించును. శుక్ల, కృష్ణ, రక్త, పీతములగు అద్దములద్వారా ప్రతిఫలించెడు సూర్యకిరణము లేలాగున అనేక రంగులుగా గనుపించునో, అలాగున, నీవేలాగున నుందువో జ్ఞేయమగు బ్రహ్మముగూడ అలాగుననే

బోధము గాగలుగును. సూర్యుడు తేజోమయుడైనను, దర్పణముల యొక్క రంగులవలెయైనట్లే జ్ఞేయమగు బ్రహ్మము జ్ఞానమయమైయుండినను ప్రవక్తల యొక్క బుద్ధి ననుసరించి యనేక ఆకారములును, గుణములును గలది యాయెను. అందువలననే మతవిషయమైయిన వైషమ్యములు, కలహములు గలుగుచున్నవి. కనుకనే యుపనిషతు లీవిధముగ చెప్పుచున్నవి - బుద్ధిని, మూలప్రకృతిని, దాటిన మాత్రమే యాత్మయొక్క సత్యమును తెలిసికొనను సాధ్యమగును. కావున నీవు నిర్మలముగా నుండుము. అంతమాత్రమైన యుపకారమును నాకొఱకు చేయుము. నీకు వందనములు ఆత్మనిశ్చలముగా నుండినను నీవు చలించిన తాను గూడ చలించినట్లే గోచరించును. చంద్రుడాకాశమునందు నిశ్చలముగా నుండినను నీటియొక్క కదలికచే కదలుచున్నట్లుండునుగదా! తెల్లనీరు, ఎఱ్ఱనినీరు, నల్లనినీరు, పచ్చనినీరు, ఉండిన దానియందు ప్రతిఫలించు సూర్యుడుగూడ ఆ రంగుల స్వభావముగా గనుపించునట్లు ఓ బుద్ధీ! నీ వేరూపము గలిగియుండిన బ్రహ్మముగూడ అదేరూపముగా నున్నట్లు గోచరించును. ఓహో! నీయొక్క మహిమ నేమని చెప్పవచ్చును? నీ వెవరియందు శుద్ధముగా నుందువో వారి జన్మధన్యము. అట్లుగాక మలినముగానుండిన అట్టివారి జన్మము నరకము. కావున పుణ్యాత్ముడా! నిర్మలత్వమును, నిశ్చలత్వమును, ప్రసన్నత్వమును, గల్గియుండుము. అట్లయిన నేనును నిత్యసుఖమును బొందగలుగుదును.

3. చిత్తమును గుఱించిగూడ కొన్ని ధర్మసందేహములు తెలుపవలసియున్నవి. ఓ చిత్తమా! నీకుగూడ జన్మాంతరములో జేసిన సుకృత విశేషము వల్లనే యీ శరీరములో వచ్చియుండెడు భాగ్యము గల్గినది. మంచి పుణ్యశాలివయ్యు, పుణ్యమువలన గలిగెడు మానవ శరీరములో జేరియు సౌఖ్యమును గోరుట సకల జీవుల స్వభావమైయుండియు నీవేల మంచి చింతనమును జేయక చెడు చింతనమును జేయుచున్నావు? నీకు నిశ్చింత గలిగిన లభించెడు సౌఖ్య మపారము. నీ వెల్లప్పుడు దృశ్యచింతనలోనికి ఏల పరుగెత్తిపోవుచున్నావు? దానివలన దుఃఖఫలితమేగాని సౌఖ్యము గలుగదుగదా? నిశ్చింతగా నుండుటకు నీకు సాధ్యముగానిచో సద్విషయముల గుఱించియైన చింతింపరాదా? చెడువిత్తనముకు చెడ్డఫలములు గలుగునట్లు, మంచి విత్తనమునకు మంచిఫలములే గలుగుచుండును. ఈసంగతిని తెలిసి

కొనియైన మంచిచింతన గలవాడవగుము. అయితే నిశ్చింతుడవై యుండుటకు ముందు చెప్పినను, దాని యందొక రహస్యము గలదు. చిత్తము నరికట్టి ప్రాణాయామముచే చలింపనీయక చేసినచో కొన్ని నిమిషములుగాని, గంటలుగాని, దినములుగాని, అలాగున వారములు, పక్షములు, మాసములు, ఋతువులు, అయనములు, సంవత్సరముల పర్యంతము నిశ్చింతుడవై యుండినను, తెలిసికొనవలసిన యాత్మవస్తువును, జ్ఞేయవస్తువును, దైవవస్తువును తెలిసికొనకపోయిన, దైవములో నిలకడ గలుగక పోయిన జ్ఞేయములో నైక్యము జెందకపోయిన, యేలాటి సౌఖ్యము గాని, పుణ్యము గాని కలుగదని మాత్రము నీవు జ్ఞప్తియందుంచు కొనవలయును. సంవత్సరములేల, యుగములు కల్పముల పర్యంతము నిశ్చింతుడవై నిశ్చేష్టుడవై యోగబలముచే నుండగలిగినను పరంజ్యోతియై, పరమజ్ఞానమై వెలుగుచుండు ఈశ్వరునిలో నైక్యము గలుగనిచో భవరోగము తొలగదు. అట్టిదిగాని నీయొక్క నిర్వికల్ప సమాధి మూర్ఛవంటిదనియు, గాఢనిద్రవంటిదనియు బాగుగా జ్ఞాపకము గలిగియుండుము. చిన్మయమై మహాజ్యోతియగు భావము గలిగిన మరల నెల్లప్పుడు అలాగున నిర్వికల్ప సమాధిలో నుండినను, లేక యాభావము గలిగినపిమ్మట దేహేంద్రియముల నాశ్రయించి లోకహిత కార్యములజేయు చుండినను, ఏలాటికష్టమును గలుగదు. ఏ కార్యమును జేయక సదా దానియందుండినను సుఖమెక్కువ గలుగుట గాని. యింద్రియ ములతో ధర్మకార్యముల నాచరించినందుచే దుఃఖము గలుగుటగాని, బంధనములో చిక్కుకొనుటగాని గలుగదు. ఏలన ఉడికిన విత్తనములు మరల నెప్పటికిని ఎచ్చోట నుండినను అంకురింపవుగదా! దహించినపాశము కట్టుటకు తగదుకదా? స్ఫుటము చేయబడి సువర్ణమైన తామ్రము, మఱల రాగిగాదుగదా?

కావున నో చిత్తమా! నీవట్టి దైవస్థితిలో నుండుట కష్టమని తలంచు చున్నావా! మొదట కొంత ప్రయాసముగా దోచినను అనుష్ఠానబలముచే నట్టి స్థితి నీకుత్వరలోనే గలుగును. అట్టిస్థితిలో నిరంతరము నిలకడ గలుగుట ప్రయాసమని తోచిన నెంతకాలమువఱకు ఉండగలవో యంతవఱకుండి తక్కిన కాలము నంతయు మంచికార్యములనే చేయుచుండుము. అంతేగాని

యాత్మజ్ఞానము గలుగని విశ్చింతయోగములో మాత్రముండకుము, నీయొక్క మూలమును తెలసికొనక పోవుటవలననే దుఃఖమునకు కారణమగు లోక చింతనలను, పాపచింతనలను జేసికొని సంకట పడుచున్నావు. నీయొక్క యధిదేవత వరుణుడు. ఏలన, చిత్తము జలతత్త్వమగుట చేతనే నెమ్మదిగా జలము ప్రవహించునట్లు చింతన కలుగుటకు కారణమగుచున్నది.

మతాంతరములో చిత్తమున కధిదేవత వాసుదేవుడనియు, జీవుడనియు చెప్పుట గలదు. ఇచ్చట వరుణుని గ్రహించడమైనది. ఆయన యెంతగొప్ప వాడో యోచించుకొనుము. జలమున కధిదేవత వరుణుడగుటచే నీవును సముద్రమువంటి విశాలస్వభావము కలిగియుండ వలసినవాడవే. ఎంత మలినమైన జలమైనను సముద్రలోనికి వచ్చిన యేలాగున మలినము నడుగంటజేసి గంభీరముగాను, శుద్ధముగాను ఉండునది చూచుటలేదా? అలాగున నీలోనికి ఏలాటి బాహ్యచింతనలు వచ్చినను వానివలన కల్మషము నొందక నీయొక్క గంభీరత్వమును, స్వచ్ఛత్వమును విడువకయుండుము. మఱియు సముద్రము తనలోనికి ఏయే వస్తువులు వచ్చినను, ఎట్లు వెంటనే యలలచేగొట్టి తీరములోనికి చేర్చివేయుచుండునో అలాగున నీలోనికిప్రపంచ సంకల్పములు వచ్చినను తక్షణమే వివేకకరములచే హృదయములోనుండి బయటికి నెట్టివేయుము. మఱియు నిప్పుడు నీయొక్క వృత్తాంతమును తెలిపితిని. దీనిని తెలిసికొని శుద్ధుడవు గమ్ము. చాల సౌఖ్యము గలుగును. వాసుదేవుడే చిత్తమున కధిదేవతయని చెప్పిన పక్షమున భగవంతుడు శయనించుచుండు క్షీరసాగరమెట్లు శుద్ధమై యుండునో, యాలాగున నోచిత్తమా! నీవును స్వచ్ఛమై నీలోపల భగవంతుడు శయనించులాగున చేసికొనుము. అప్పుడు నీవు ధన్యుడవు గాగలవు కారణమునకు భిన్నముగా కార్యముండ గూడదుగదా?

చిత్తమా! నీవు చింతనాశీలుడవు. సమస్తమైన వృత్తులను నీవు చిత్ర గుప్తునివలె లిఖించి మనస్సను ద్వితీయ మంత్రికిచ్చుచున్నావు. ఆయన తీర్మానింప శక్తిలేని విషయముల నన్నిటిని ముఖ్యుడగు బుద్ధికి సమర్పణ జేయుచుండును. కావున నీవు తృతీయమంత్రివంటి వాడవే యగుదువు. నీవు జలతత్త్వ మగుటవలననే నిదానముగ నొక్కొక దానిని చింతనజేయు స్వభావము గల్గియున్నావు. మనస్సైతే వాయ్వంశమువలన బుట్టినందుచే

చంచల స్వభావము గలిగియుండుటకు కారణమైనది. బుద్ధియో అగ్నికణము గలిగియుండి నందువలన దీపమన్నిటిని ప్రకాశింపజేయునట్లు కార్యాకార్యములను, ధర్మాధర్మములను నిశ్చయించు కొనుచుండును. అయితే నీవు మంచివిషయమునే చింతనలోనికి తీసికొనినయెడల మనస్సును, బుద్ధియును, దాని కనుకూలముగానె ప్రవర్తించుచుండును. కావున నాత్మమిత్రమా! చెడుచింతనలెవ్వియు నీలోనికి రాకుండజూడుము. అట్లైన చాల యుపకారమును జేసినవాడవే యగుదురు. భూమిలోగల మట్టిమొదలైన యన్నివస్తువులను జలము కొట్టుకొని వచ్చి తన యడుగున జేర్చుకొనునట్లు సమస్తవిషయములను నీయందే నిలుపజేయుచున్నావు. నీ వెవరియందు మంచి స్వభావము గలిగియుందువో, వారు దైవచింతనయం దుండగలరు. కావున నో నాయనా! నీ వీ హృదయములో మంచివాడవై యుండుము. అట్లైన నీ దేహము నుండి నందుకు తగిన ఫలము నొందగలవు.

ఓ చిత్తమా! నీయొక్క దృశ్యచింతనలే సంసార వృక్షములకు విత్తనముల వంటివి యగును. బీజములు నశించిన వృక్షము లేలాగున రహితములగునో, ఆలాగున నీయొక్క బాహ్యచింతలన్నియు నశించిన సంసారదుఃఖము మఱల గలుగదు. ఒక న్యాయస్థానములో విచారణ చేయవలసిన రికార్డు లెంతకాలమువఱకుండునో, అంతవఱకు న్యాయాధిపతికి పనియుండేలాగున నీ హృదయమను కోర్టులో అనేక చింతలను రికార్డుచు నిర్మించుచున్నావు. అందువలన నాత్మకు శాంతి గలుగక పోవుచున్నది. నీవు చేసిన యీలాటి చింతనలే సంసార వృక్షమునకు వేరులగుచున్నవి. వేరులుండువఱకు వృక్షమేలాగున చావదో, ఆలాగున నీవు చేయు కృత్రిమము లుండువఱకు నీ యజ్ఞాన వృక్షము క్షయము నొందదు. వేరులన్నియు తెగిపోయిన వృక్షమేలాగున ఎండిపోవునో, అట్లే నీయొక్క కల్పిత వేరులు క్షయించిన, ప్రకృతియను తరువుగూడ ఎండిపోయినట్లే తలంచవలెను. నీవు చేయు ప్రకృతి సంబంధమైన విచారములన్నిటిని చిత్తమను దారములో గ్రుచ్చి సంసార దుఃఖమును వృద్ధినొందించుచున్నావు. సూత్రము తెగిన మణులన్నియు నేలాగున భిన్నాభిన్నములైపోవునో ఆలాగున చిత్తమా! నీయొక్క యనాత్మచింతనలమానిన, యవిద్యా సంబంధ సమస్తదుఃఖములును పటాపంచలై పోవును. కావున నీవు అనాత్మచింతల నన్నిటిని విడిచి దైవ

చింతన మాత్రము గలవాడవై యుండుము. నీకును, నాకును సౌఖ్యమును గలుగజేసినవాడవే యగుదువు. అట్లు దైవచింతనలో నిలకడ గలుగుట ప్రయాసమని తోచిన, దుశ్చింతనల నన్నిటిని మాని సచ్చింతనా ప్రవృత్తి గలిగియుండుము. దానితోఁగూడ సత్పురుషుల సంసర్గము చేయుచుండుము. సద్వృత్తి రూఢిపడినపిమ్మట నిర్వృత్తిలోనికి ప్రవేశింపుము. అచ్చట నీయొక్క స్వరూపము లేకపోవును. అగ్నిలో వెలిగించిన కర్పూర మేలాగున రూపములేనిదై యగ్నిమయమైపోవునో, ఆలాగున దైవభావములో నైక్యమునొందిన కల్పితుడవగు నీవుగూడ లేనివాడవై దైవ మొకటిమాత్రమే మిగిలియుండును. అదియే బ్రాహ్మీ స్థితియని మరువకుము అదియే పరాకాష్ఠ, అదే వేదములయొక్క యంత్యావస్థ, దానికే కైవల్యమనియు, ముక్తియనియు, మోక్షమనియు, పరమపదప్రాప్తియనియు పేర్లు జెప్పుదురు. అది శివము, అమృతము, ఆనందము, అద్వైతము. ఓమ్.

4. ఇక అహంకారమును గురించి చెప్పవలసిన భాగము మిగిలియున్నది ఈ యహంకారముగూడ నాత్మయగు ప్రభువుయొక్క యంతఃకరణ చతుష్టయ మంత్రి వర్గమున చేరినవాడే. కావున నితడును మంత్రియే. అయితే యితడు పై జెప్పిన మువ్వురకంటే చాలా వివేకము తక్కువ గలవాడే. కనుకనే కడపటివాడైనాడు.

ఐనను పావనత్వమునకు హేతువైన యీ మానవజన్మలోను, ప్రత్యేకించి నాలోను ఉండినవాడవైనందుచే, ఓ యహంకారమా ! నీవును సుకృత విశేషముగల వాడవనియే గ్రహించుకొనవలయును. కొంత తెలివి తక్కువ వాడవైనను జ్ఞానముగల తల్లిదండ్రుల యుపదేశమువలన కుమారుడేలాగున మంచివాడగునో, ఆలాగున నీకు నేను మంచిమార్గము చెప్పుచున్నాను. నామాట లాలకించి మంచివాడవగుము. నీకు చాల మేలు గలుగును. నీవు దుష్టకార్యముల జేయుటచే నీకును నాకును కష్టమే గలుగుచుండును. అట్లు చేయకుము. పాపము నొడి గట్టకుము. అంతేగాదు, ఈ దేహములోనుండి కృతఘ్నుడవు గాకుము. ఓ యహంకారమా! నీయొక్క ప్రవర్తనలన్నియు ఉన్మత్తుని చేష్టలవలెనే యున్నవి. అట్లుగానిచో నీవీ మలమూత్రములతో గూడిన దేహమును గూర్చి యహంకరింతువా? నేను నీకు తెలియజెప్పుచున్నాను. సావధానముగా వినుము.

అహంకారము మూడు విధములతోగూడినది (1) దేహాహంకారము, (౨) జీవాహంకారము, (౩) ఆత్మాహంకారము, అనగా స్వరూపాహం కారము, దేహాహంకారము చాల నీచమైనది. ఇది బంధనమును గలుగ జేయును. జీవాహంకారము చాలాకాలమునకు ముక్తికి హేతువగును. ఇది కొంత యంతఃకరణ శుద్ధిగలిగిన విద్వాంసులకేగలిగియుండును. స్వరూపాహం కారము అనగా దైవాహంకారము బ్రహ్మజ్ఞానులకు మాత్రమే గల్గియుండును. ఇదియొకటి మాత్రమే యమృతత్వమును గలుగజేయునది. అనగా మోక్షము నిచ్చునది. నీయొక్కమూల మట్టిదైయుండియు ఆ పరమ పావనపదమును మరచి యీ మాలిన్య పూరితమైన దేహమును నీవని తలంచుట పిచ్చివాని చేష్టవంటిదేగాని మరేమని చెప్పవలయును మత్తు వస్తువులను తప్ప త్రాగి మది మరచిన పామరునివలె నట్టి మహత్తైన దైవపదమును గోల్పోయి ఈ నశ్వరశరీరమును నీవని తలంచుట యెంత వెఱ్ఱితనము? ఉన్మత్తుడు చేయు కృత్యముల నతడు గొప్పవని తలంచినను బుద్ధిమంతు లేమితలంతురు? అలాగున నీయొక్క యీ దేహమును గుఱించి యహంకరించుటగూడ నట్లుండుననియే వివేకులు తలంతురు. పిచ్చి గలుగజేయు వస్తువులను భుజించి దుమ్ములో పొరలుచు గంతులు వేయుచుండిన యతని కది మహానంద ముగా దోచినను విచారజ్ఞానము గలవారు ఏమని చెప్పుదురు? నీయొక్క దేహమును గుఱించియు, కులమును గుఱించియు, రూపమును గుఱించియు, విద్యను గుఱించియు, గలుగు భావమును గూర్చి లోక మాలాగున తలంచును.

ఓ యహంకారమా! నీయొక్క గొప్పతనము నేమని వర్ణించెదను? నీవు నిత్యశుద్ధ ముక్తస్వరూపుడై యుండియు అనిత్య, అశుద్ధ, బంధస్వరూప మగు దేహమును నీవని తలంచుచున్నావుగదా? ఓహెూ నీయొక్క ప్రజ్ఞ నేమని కొనియాడవచ్చును? నీవు శుద్ధబ్రహ్మజ్ఞానమయుడవైయుండియు, అశుద్ధ మాయామయుడవై యుండువాడనని యేల తలంచుచున్నావు. దీని కంటె మూఢత్వముగలదా? నీవు దేహేంద్రియాదులకు సాక్షిగానుండియు మల మూత్ర క్రిమిజాల సంకలుషితమైన దేహమే యనితలంచుట యెంత పొరబాటు! ఇది యుత్తమవంశములో బుట్టినవాడు నీచగ్రహావేశముచే తన్ను నీచుడని తలంచునట్టిదే గదా నీయొక్క చేష్టయును? మతిభ్రష్టుడమృత కలశము నొకపారవైచి యమేధ్య పదార్థమునుతిసికొనినట్లుగదా, ఆత్మభావమును

విడిచి దేహభావమును బొందుట! నీవు స్వయంజ్యోతి స్వరూపుడవై యుండియు నేమియు తెలియని యజ్ఞునివలె బ్రవర్తించుచున్నావే? ఇదియా నీయొక్క మహిమాతిశయము? ఇదియా నీయొక్క ప్రభావము? ఇదియా నీయొక్క ప్రతాపము? ఛీ సిగ్గులేదా? నీవు నీచభావమును బొంది నిన్ను నీచుడవనియు పాపివనియు దలంచుచున్నావు. ఇది మలిన జలములో ప్రతిబింబించు సూర్యునిచూచి తనను మాలిన్యము గలవానివలె తలంచినట్లేయుండును. నీవు స్త్రీయునుగావు,పురుషుడవుగావు,నపుంసకుడవును గావు. ఈ మూడును దేహధర్మములేగాని నీయొక్క యాత్మధర్మములుగావు నీవు దేహత్రయ విలక్షణుడవు. చిన్మయ స్వరూపుడవు పరంజ్యోతియగు పరబ్రహ్మవై యున్నావు.సార్వభౌముడైనవాడు మతిభ్రమగలిగి భిక్షకారులతో చేరి వీధిలో భిక్షమెత్తుట జూచిన అతని యొక్క బంధువులెంత ఖిన్నులై యుందురో, నీయొక్క దైవత్వమును మరచి దయ్యపు స్వభావమగు విషయములతో గూడియుండుటయు నా లాగుననే యుండును.

కావున చిత్తభ్రమ నివృత్తికొఱకు తగిన వైద్యునాశ్రయించి జనులు జాగుచేయించుకొనునట్లు బ్రహ్మవేత్తలగు భవరోగ వైద్యులను వెంటనే కనుగొని యాదుఃఖమును నివృత్తి జేసికొనుము. దుష్టగ్రహావేశము గలవాడు మాంత్రికునిచే భూతమును పారద్రోలించునటుల నీకుగలిగియుండు ఈదుష్టభావమును ఆత్మజ్ఞానుల సహాయముచే రహితమొనర్చుకొనుము అప్పుడే సౌఖ్యము కలుగును. పరమశాంతియు సిద్ధించును శాశ్వతమైన దైవపదము లభించును. అప్పుడు ఈ దేహమను రాజ్యములో రాజ్యమేలుచుండు ఆత్మయను ప్రభువునకు మంచిమంత్రులు హితమొనర్చి కృతజ్ఞతను గలుగజేసికొనినట్లు నీవును కృతజ్ఞుడవు గాగలవు.

ఓ మనోబుద్ధి చిత్తాహంకారములారా! మీనల్వురకును చెప్పవలసిన ధర్మవాక్యముల జెప్పితిని. మంచిది చేసినచో మేలు కలుగును, చెడుకార్యముల జేసిన కీడును సంభవించును. ఇక మీలోమీరే యోచించుకొని యేలాగు వర్తించవలయునో, అలాగునచేయుడు. ఈ దినమ్మున మీయొక్క దర్శికిని ఆలోచించుకొనుట కవధి యివ్వడమైనది రేపటి దినమ్మున మీయొక్క నిశ్చయమును మీకు తెలిపెద.

అహంకారమా! నీవు కఠినుడవని యందరు నందురు. కారణ మేమన నీవు పృథ్వీతత్త్వముచే నుత్పత్తియైన వాడవు. పృథివీతత్త్వమగు రాయి యినుము మొదలగువానిని జూచియే యాలాగున జెప్పుటకు కారణము. ఇది నీయొక్క దుష్టగుణమును జూచి చెప్పెదరేగాని నిజముగా యోచించిన నీకంటె మంచివాండ్రు లేరు నీవు పృథివివలె సహనము గలిగియుండవలసిన వాడవు. పృథివి యేలాగున అనేక సుస్వాదు ఫలమూలములను, దివ్యాన్నములను, శ్రేష్ఠమైన యోషధులను గలుగజేసి, ప్రజలను, జంతుకోట్లను రక్షించుచున్నదో, అట్లే నాయనా! నీవును మంచివాడవైన లోకమునకు అంత మేలుకలుగును. మఱియు నీయొక్క యధిదేవత రుద్రుడు. ఇది నీయొక్క రౌద్రాకారమునుజూచి లోకము నీకీలాటి పేరును బెట్టినది. నిజముగా విచారించిన రుద్రు డీశ్వరుడే. నీయొక్క దోషము రహితమైన నీవే శివుడవు గాగలుగుదువు! తండ్రీ! "రుద్ర" అను శబ్దమునకు అమరకోశ నిఘంటువుయొక్క వ్యాఖ్యానకర్త వివరించిన యర్థమును జూడుము. "స్థాణూ రుద్ర ఉమాపతిః ప్ర. కాం స్వర్గవర్గము. ద్రు-గతౌ అను ధాతువునుండి పుట్టిన శబ్దమగుటచే "రుదం ద్రావయతీతి రుద్రః" అనగా దుఃఖమును బోగొట్టువాడు. ఇదే నీయొక్క యధిదేవతా శబ్దమున కర్థము. కారణము నుండి పుట్టిన కార్యము, కారణమునకంటె భిన్నముగాగూడదు కదా? కావున నీవును దుఃఖరహితుడవై యితరులకు దుఃఖమును కలుగజేయక పోవుటయే గాక దుఃఖముగలవారి శోకమును రహితము జేయగలవాడవై యున్నావు.

రెండవదినము. ఓయంతఃకరణ చతుష్టయమగు మంత్రివర్గమా! మీరందరును నిన్నటిదినమున చెప్పిన ధర్మముల నన్నింటిని తెలిసికొంటిరా? ఈ దినము నాయొక్క నిజస్వరూపమును గుఱించి తెలుపుచున్నాను. మీరందరును ఎట్టివారలనగా సూత్రధారి సూత్రముల నాడించినపుడు చమత్కారముగా నాడెడు తోలుబొమ్మల వంటివారు. బొమ్మలయొక్క యాటలను జూచినపుడు జనులాశ్చర్యమును బొందుదురు అయితే యా రహస్యమంతయు సూత్రధారునిదియని తెలిసికొనజాలరు. అలాగున మీరు జడస్వరూపులైయుండి యాత్మయొక్క సాన్నిధ్యబలముచే నిట్టి మహిమ గలిగినదని తెలిసికొనలేకపోవుచున్నారు. ఆత్మయైన నేను మీయొక్క యోగ్యతను గనుగొనుటకొఱకు ఇంతకాల మూరకుండడమైనది, ఇప్పుడు నాయొక్క

నిజస్వరూపమును మీకు దెలుపుచున్నాను. ఇది యహంకారముగాదు. సోహంకారము. ఇట్టి తత్త్వమువల్లనే కైవల్యప్రాప్తి యందరికి గలుగును. వాస్తవముగా మీరుచేయు కృత్యములన్నియు యాత్మ చైతన్యమువలననే జరుగుచున్నవి. ఒక రాజస్థానములోనుండు మంత్రులు చేయుపని యంతయు స్థానబలముచే గలిగినదని తెలిసికొనక మదోన్మత్తులై ప్రవర్తించునది జూచిన ధర్మాత్ముడగు రాజు వారికిబుద్ధి గలిగేలాగున జ్ఞానమును జెప్పియు వారాచరింపక పోయిన వారిని పనినుండి తొలగించినను, మరురోజు వారు ఏలాగున సామాన్య మనుజునివలె నుందురో మీయొక్క స్థితి యటువంటిదే యగును. ఒక విద్యుచ్ఛక్తి యంత్రాలయములో అనేక చిత్రవిచిత్రములైన పనులజేయు నాయంత్రములజూచిన యాశ్చర్యముగా తోచినను నీమహిమంతయు విద్యుచ్ఛక్తివలననే జరుగుచున్నదని గ్రహింపజాలని వారివలె మీరును ప్రవర్తించుచున్నారు. జ్ఞానైక స్వరూపమగు నాత్మ వల్లనే మీరు మహిమ గలవారలైతిరి. విద్యుచ్ఛక్తిని నిలుపుదల చేసిన యంత్రములన్నియు నిశ్చేష్టితములై పోవునట్లు మీయొక్కగతియూ నుండును.

మీయందభిమాన ముంచినందున మీయిష్టానుసారముగా ప్రవర్తించుచున్నారు. ఇప్పుడు మీయందుగల మమత్వమును విడిచి నాయొక్క నిజస్వరూపమున నుండబోవుచున్నాను. అప్పుడు నన్ను కదలించు వారెవరు గలరు!ఈ కీలకము తెలియని వారివద్దనే మీయాట లన్నియు సాగుచుండును.

మీయొక్క స్థితినిగూర్చి యింకను వినుడు. ఒకటి సంఖ్యవేసి దాని వెనుక యొకపూజ్యమును అనగా పూర్ణానుస్వారమును బెట్టిన యాపూజ్యము పదియవ స్థానమును బొందుచుండును మఱల మొదటిదగు నేకసంఖ్యను తుడిచివైచిన నప్పుడా పూర్ణానుస్వారము పూజ్యమైపోవును. 1–10–0. మీయొక్క పూజ్యతయు నాలాగున నుండునుసుమా? ఈ రహస్యము తెలియనివారి సాన్నిధ్యమునమాత్రమే మీయొక్క చేష్టలన్నియు జరుగుచుండును. అలాగున విచారముచే మనస్సనియు, బుద్ధియనియు, చిత్తమనియు, అహంకారమనియు చెప్పుదురేగాని విచారణజ్ఞానము గలిగిన నవియన్నియు మిథ్యయే. సంశయములేదు. స్వశక్తిలేని, యేమియు చేతగాని రాజుల దగ్గర

నుండు ధర్మహీనులైన దుష్టమంత్రులవలె మీరు నాదగ్గఱనుండి యీలాటి దుశ్చేష్టల జేయుచున్నారా! వంచకులారా! మిమ్ముల నందరిని త్యజించడమైనది. బుద్ధియొక్క నిశ్చయాత్మకత్మము, మనస్సుయొక్క సంకల్పమును, చిత్తము యొక్క చింతనము, అహంకారముయొక్క యహంకృతియు లేనిస్థితిలో నాయొక్క దైవభావములోనే నేనుండిపోవుచున్నాను. తనకును తనయొక్క ఛాయకును ఎట్టి సంబంధము గలదో, అలాగున ఆత్మకును మాయకును తారతమ్యము గలదు. చిన్నపిల్లవారు రాత్రులలో దీపప్రకాశమున తమయొక్క నీడనుజూచి బేతాళమని తలంచి భయపడుదురు కాని బుద్ధిగల మనుజులెవరైన నాలాగున భీతినొంద గల్గుదురా! ఆత్మయొక్కయు, ప్రకృతియొక్కయు రహస్య మీలాగున నుండును. ప్రకృతియొక్క వికృతులే యీ మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములను నల్వురు సంతానములు, వీరియందభిమాన ముంచుట వలననే వీరిట్టి బలవంతులైరి. ప్రకృతి వంధ్యాస్త్రీవలె నుండగా దానియొక్క బిడ్డలగు మనస్సు మొదలగు మీనల్వురును లేనివారే యగు దురు. కనుక నేను స్వయంప్రకాశుడనై సమస్తమును ప్రకాశింపజేయు జ్ఞానస్వరూపుడనని బోధమును గలిగియున్నాను. కావున మీరందరు మిథ్యా స్వరూపులు. సూర్య, చంద్ర, నక్షత్ర, విద్యుత్, అగ్ని మొదలగు సమస్త మును ప్రకాశింపజేసెడు ఏదివ్య ప్రకాశముగలదో అదేయాత్మయై యీశ్వర మయమై పరబ్రహ్మమై యుండును. అట్టిదైవమే నాయొక్క ఆత్మయై వెలుగు చున్నదను తత్త్వమును తెలిసికొన్నాను. ఇక మీయొక్క కుతంత్రము లెవ్వియు జరుగువు.

ప్రభువైనవాడు బాల్యావస్థలో నుండగ దుష్టమంత్రులైనవో అట్టి తరుణమున మోసముల జరుపవచ్చును. యౌవనావస్థకువచ్చి పట్టాభిషిక్తు డైన తరువాత మంత్రులయొక్క మోసపుకృత్యములు జరుగునా? అలాగున నవిద్యలో చిక్కుకొని నిజస్వరూపమును తెలిసికొనక యుండు నంతవఱకు గదా మీయొక్క తంత్రములు జరుగును? ఇప్పుడు దైవకృపచేతను, గురు కరుణచేతను, వేదాంతశాస్త్రముయొక్క యనుగ్రహముచేతను నాయొక్క నిజస్వరూపమును తెలిసికొనడమైనది. ఇట్టి విచారణ జ్ఞానము లేనివారును, విషయమోహము లోబడియుండి తమ్ము దాదెలియనివారును, ఇంద్రియ పరవశులై యుండి విషయభోగముచే దానియందు మగ్నులై యుండువారును

నగు ఏప్రభువులుగలరోమీరచ్చటికివెళ్ళివారినాశ్రయించుడు. మీకుతర్పణము వేయడమైనది. మిమ్ముల నుపేక్షించడమైనది. విషమును తిని మైకముగలిగి యుండు వారివలె విషయము ననుభవించి యందువలన నాత్మజ్ఞానమును మరచియుండువారును, సుషుప్తియందుండునపుడు తనయొక్క స్వరూప జ్ఞానము లేనివారువలె మాయమైన మోహములో, అజ్ఞానమనెడు గాఢసుషుప్తి యందుండు వారలునగు ప్రభువు లెవరుగలరో వారి నాశ్రయించి మీరు బ్రతుకుడు. మిమ్ముల నేను త్యజించడమైనది. భోగపరవశులై యోగులమని చెప్పువారును, సాధనరహితులై యాత్మను సాధింపక సాధకులమని చెప్పు వారెవరు గలరో వారి నాలంబనముగా జేసికొని మీరు సుఖముగానుండుడు. నేనుమాత్రము మిమ్ముల నుపేక్షించడమైనది బుభుక్షువులై ముముక్షువుల మని చెప్పువారును, పరిశ్రమజేసి యాత్మయొక్క విశ్రాంతిని బొందకయుండు యాశ్రమవాసుల నాశ్రయించి విశ్రమించుడు.

నే నేమాత్రము ఇక మిమ్ముల నాశ్రయించను. సంసారములో గల సారమును తెలిసికొనక నిస్సారమైన విషయసౌఖ్యమును సారమని మదిలో దలంచి యట్టిదానిలో పడియుండువారును, సారాసార విచారమును చేయని వారునునగు సంసారులను నిరంతరము రంజింపజేసికొని మీరు నిరంతరము విశ్రాంతిని బొందియుండుడు నేను మిమ్ముల విసర్జించడమైనది, భక్తిపరులై భక్తులమనిగాని, ముక్తులమనిగాని చెప్పువారును అవిద్యలో మునిగి విద్వాంసులవలె నటించువారు నెవరెవరుగలరో వారందరిని ననుసరించు కొనుడు. వారితో రమింపుడు. నేనిక యేమాత్రము మిమ్ముల ననుసరింపను. కష్టములసహించి నిష్ఠచేయక యుండువారును శ్రేష్ఠుల యాచారమును విడచి నికృష్టకృత్యముల చేయువారు నెవరుగలరో వారిననుసరించి మీరు సుఖింపుడు. నేనిక యేమాత్రము మిమ్ములను ననుసరింప తలంపను అచలులమని చెప్పి చలనస్వభావముగలిగి యుండువారును, అతీతులమని చెప్పి మతిశుద్ధములేని వారెవరెవరు గలరో వారినవలంబించి చిరకాల ముండుడు. ఏమాత్రము మీరు నాదగ్గఱ నుండతగరు, ఉత్తమయోగులమని చెప్పి మత్తువస్తువుల నుపయోగించి చిత్తవిశ్రాంతినిగోరని వారును, ఎత్తైన యోగసిద్ధిని పొందనివారును ప్రపంచములో నెవరైన ఎచ్చటనైన నుండి నచో వారిపొత్తున మెత్తగా నుండుడు. నావద్ద నికయేమాత్రమైన నుండుట

కవకాశ ముండునని తలంపకుడు. నిర్వృతినొంది నిర్వాణము నొందక వృత్తులకు వశులై జంతుశవముల తినువారెవరుందురో వారి నాశ్రయించి చిరకాల ముండుడు. పగలుమాత్రము ధ్యానము చేయు వారివలెనుండి రాత్రిలో ధ్యానము చేయని వారెవరుందురో వారి నాశ్రయించుడు. కొంగలును, హంసలును చూచునపుడు చాల వఱకు ఒకే విధముగా నుండును. కొంగలు బురదనీరు, చిన్నచేపలు, కప్పలు నుండుస్థలములో నుండును. హంసలు స్వచ్ఛమైన నీరును, తామర పువ్వులును నుండు మానససరోవరాదులలో నుండును. అలాగున దుర్బుద్ధి గల మీరందరును మలినహృదయులై భోగపరులైన వారి దగ్గఱకు వెళ్ళుడు. శుద్ధాత్ములై జ్ఞానామృతముచే నిండిన హృదయ సరోవరముగల వారివద్ద మీరుండుట కర్హులుగారు. దొరకినదానితో సంతుష్టిగలిగి బ్రహ్మనిష్ఠ చేయక సత్తువైన పదార్ధములు దొరకవలెనని కోరికగలిగి యుండువారును, దానివలన ఎక్కువ బ్రహ్మనిష్ఠ చేయవచ్చునని తలంచు వారెవరుగలరో వారిదగ్గఱకు వెళ్ళుడు. విశుద్ధబ్రహ్మసాక్షాత్కారము గలుగక యుండువారును, జ్ఞానులకు శుచియాచారము లవసరములుగావని చెప్పు వారలగు మూర్ఖతాపసు లెవరుగలరో వారి దగ్గఱకు వెళ్ళుడు. అక్కడ మీకు సౌఖ్యము గలుగును. బ్రహ్మవిద్యా జ్ఞానము గలిగి యాత్మప్రకాశ మును బొందకయుండు వారును, విద్యాభ్యాసమును నిందించువారలెవరు గలరో అట్టి మూఢస్వభావముగల యోగుల దగ్గఱకు వెళ్ళియుండుడు. అక్కడ మీ కనుకూలము గలుగును. నిర్వృతి గలిగి నిర్వాణస్థితి గలుగని వారు వ్రతానుష్ఠానము లవసరము లేదనియు, పవిత్రములైన వ్రతానుష్ఠాన ముల నిందించువారునగు మూఢస్వభావముగల యోగులెవరుగలరో, అట్టి వారి నాశ్రయించి మీరు సుఖింపవచ్చును. అంతఃకరణశుద్ధిగలిగి విరక్తి భావము నధిరోహింప శక్తిలేనివారును, సంసారములో నుండిన మోక్షము గలుగదాయని చెప్పుచు విషయములకు వశులైయుండు వారును, ఏకాంత మగు పుణ్యప్రదేశము నాశ్రయించి బ్రహ్మనిష్ఠచేయుటకు నొల్లనివారెవరు గలరో వారి యవలంబనయే మీకు తగును. మంచి పరిశ్రమజేసి జీవితమును ఋజుమార్గములో గడిపి బ్రహ్మనిష్ఠ చేయుట కొల్లనివారును, సాధువుల క్రియానుష్ఠానమేమి? వారికి పనియేమి? అని చెప్పుచు తిరుగుచుండు మూర్ఖ స్వభావముగల వారెవరుగలరో అట్టివారి సేవయే మీకు తగును. అంతేగాని

సత్యనిష్ఠగలవారును, ధర్మ మార్గములో నడచువారును, నిత్యమైన బ్రహ్మము నందు నిలకడగల వారుసునగు పుణ్యాత్ముల దగ్గఱనుండుటకు మీకర్హత గలదా? పొండు! మీకొఱకు పైజెప్పినవారిని నిర్ణయించుకొనడమైనది. ఇకను ఒక మెట్టు పైకెక్కిచూచిన మీరందరును కల్పితులే. ఎండమావుల నీటి వలెను, ఆకాశనీలమువలెను లేనివారలే. సువర్ణమున కన్యముగా నాభరణములును, సముద్రమున కన్యముగా కల్లోలములును, మృత్తున కన్యముగా ఘటములును ఎట్లు లేవో, అలాగుననే ఆత్మదృష్టిలో మీరందరును కల్పితులే. వాస్తవముగా లేనివారలే. మీరును, దేహమును, జగత్తును, బంధమును సత్యముగా కల్పితములే. ఏకమై, అద్వితీయమై, శివమై,ఆనందమై, వ్యాపకమై, నిత్యమైయుండు యే సద్వస్తువు గలదో అదియొకటి మాత్రమే నిత్యముగా బ్రహ్మముగా, వెలుగుచుండును. అన్యముగా నేమియు గలిగి యుండలేదు. ఓం తత్ సత్ ఓమ్.

మనో బుద్ధ్యహంకార చిత్తాని నాహం,
న శ్రోత్రం న జిహ్వా న చ ఘ్రాణనేత్రే।
నచవ్యోమ భూమిర్న తేజో న వాయు,
శ్చిదానంద రూపశ్శివోఽహం శివోఽహమ్ ॥ 1

అహం నిర్వికల్పో నిరాకారరూపో,
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణామ్।
నచాఽసంగతం నైవ ముక్తిర్నమేయ,
శ్చిదానంద రూపశ్శివోఽహం శివోఽహమ్ ॥ 2

అఖండాకాశ రూపోఽస్మిహ్యఖండాకార మస్మ్యహమ్।
ప్రపంచముక్త చిత్తోఽస్మి ప్రపంచరహితోఽస్మ్యహమ్॥ 3

సర్వప్రకాశ రూపోఽస్మి చిన్మాత్ర జ్యోతిరస్మ్యహమ్।
కాలత్రయ విముక్తోఽస్మి కామాది రహితోఽస్మ్యహమ్ ॥ 4

కాయికాది విముక్తోఽస్మి నిర్గుణః కేవలోఽస్మ్యహమ్।
ముక్తిహీనోఽస్మి ముక్తోఽస్మి మోక్షహీనోఽస్మ్యహంసదా॥5

అవబోధైకరసోఽహం మోక్షానందైక సింధురేవాహమ్ ।
సూక్ష్మోఽహమక్షరోఽహం విగళితగుణజాలకేవలాత్మాహమ్॥ 6

నిరవధినిజబోధోఽహం శుభతరభావోఽహమప్రభేద్యోఽహమ్।
విభురహమనవద్యోఽహం నిరవధినిస్సీమసత్యమాత్రోఽహమ్॥ 7

శుద్ధోఽహమాంతరోఽహంశాశ్వతవిజ్ఞాన సమరసాత్మాహమ్।
శోధితపరతత్త్వోఽహం బోధానందైకమూర్తి రేవాహమ్॥ 8

ఓం తత్ సత్ ఓమ్.



# యతో ధర్మస్తతో జయః

ధర్మరహస్యము :— ధర్మముచే నూర్ధ్వగతియు, అధర్మముచే అధోగతియు గలుగుననియే ధర్మజ్ఞుల మతము. ఇప్పుడు చెప్పబూనిన ధర్మరహస్యము వర్ణాశ్రమముల గుఱించిన ధర్మమునకు సంబంధించినది గాదు. ధర్మస్థాపనముల గుఱించినదియు, ధర్మప్రవర్తకులను గుఱించినదియు మాత్రమే యగును. ఈ విషయములో నతిజాగ్రత నొందనిచో తమయొక్క ధర్మస్థాపనము లన్నియు, ధర్మప్రచారము లన్నియు, ధర్మకార్యము లన్నియు ధ్వంసము లగును. ఈ తత్త్వమును లెస్సగా విచారించక పోవుటే యనేక ధర్మకార్యము లడుగంటి పోవుటకును, ధర్మప్రచారకులపై జనులకు విశ్వాసము లేక పోవుటకును గారణమగుచున్నది. ఈ ధర్మతత్త్వము బాగుగా నిర్మలబుద్ధి గలిగియుండు వారికి మాత్రమే గోచరమగును.

జలములో కొంచెమైనను కల్మషముండినచో దానిలోగల వస్తువు లేలాగున కనబడవో, ఆలాగున హృదయములో కొంచెమైన మాలిన్యము గల్గియుండిన ధర్మతత్త్వ మెద్దియు దెలియదరము గాదు. ఇదియే దీనిలోగల రహస్యము.

ధర్మకార్యములు జరుగుచుండు కొన్ని స్థలములలోనికిని, ధర్మాత్ములని పేరుగాంచిన సాధువులుండు మఠములలోనికిని, బ్రహ్మనిష్ఠులుండు ఆశ్రమములలోనికిని, ధర్మసత్రములలోనికిని, ధర్మదేవాలయములలోనికిని అనేకులనేక విధములగు ధర్మోపయోగ వస్తువుల నంపుదురు. అనేక ధర్మకార్యముల కొఱకు ధర్మాత్ములు ధనము, ధాన్యము, వస్త్రములను, ఇతరజనుల కుపయోగములగు పప్పు, ఉప్పు, నెయ్యి, పాలు, పెరుగు, ఫలములు మొదలగు ననేక సాధనముల బంపుచుందురు. రాజు లన నేమి? రాజాధిరాజులు గూడ నీ విషయములో సహాయ మొనర్చుచుందురు. అట్లు సహాయము చేయుటకు కారణమేమన పై కార్యముల నిర్వహించెడు వారికిచ్చిన, వారు ధర్మబుద్ధితో సద్వినియోగము జేయుదురనియు, అట్టి సత్కర్మల వలన తమకు (దాతలకు) పుణ్యము లభించుననియు, అట్టి యవస్థవలన నీశ్వరకృప సిద్ధించుననియు దానివలన జన్మసాఫల్యము గలుగుననియు భావముతోనే చేయుచుందురు. అయితే అట్టి ధర్మకార్యముల దమకు తామే జేయకూడదా? మఱియొకరిపై నేల యాధారపడ వలయును? అని తలంచెదరేమో! అట్లు తలంచబనిలేదు. ఏలన సంసారములోనుండు వారికి తీరిక గలుగుటయును, సమయము లభించుటయును ప్రయాసము. అంతేగాక యేదైన దాన ధర్మాదుల జేయుటకును నెవరెవరి కెట్లెట్లు చేయవలయునో, ఎవరెవ రెట్లెట్లుందురో యెచటనుందురో యీలాటి కార్యము లన్నియు గృహస్థుడు దెలిసికొనుటకు సాధ్యముగాదు. సమయమును చాలదు. మఱియు పైజెప్పిన ధర్మకార్యములలో గొన్ని యొకరొకరిచే నిర్వహింపబడుటకును శక్యముగాదు. వాని కనేకుల సహాయము గలిగియుండవలెను. లేనిచో ఒకవేళ ధనము మాత్రము గలిగియుండి, జన సహాయము గలిగియుండినను నిర్వహింపబడుటకు సాధ్యముగాదు. కనుకనే భక్తులకును, భాగవతులకును, సన్యాసులకును, ధర్మకైంకర్య నిర్వాహకులకును, ధర్మాత్ములకును ఇచ్చుటకు కారణమగుచున్నది. అంతియేగాని వారు చేతగానివారగుటచేగాని, బుద్ధియోగ్యత లేనందుచేగాని, అమాయకు లగుటచే గాని అట్లుచేయుట గాదు. ఇక దీనిలో గల మర్మము దెలిసికొన దగినది.

అదేమన, కొందఱు దైవభక్తులై యుండు నపుడును, తపస్సు జేయు నపుడును, యోగనిష్ఠ గలిగియున్నపుడును ఇక నేదైన దైవ విషయములో

ప్రవర్తించునపుడును వారిపై జనులకు విశ్వాసము కలుగును. వారికిని కొంత జ్ఞాన మావిర్భవించును. దైవభక్తి కలుగును జీవకారుణ్య ముద్భవించును. వైరాగ్యముదయించును. పాపభీతి గలిగి యుండును. పుణ్య కార్యములలో ప్రీతి వృద్ధి నొందుచుండును. అట్టి దైవస్వభావమును జూచియే ఇతరులకు వీరియందు భక్తివిశ్వాసములు గలుగుటకును, ధర్మ కార్యములలో సహాయము జేయుటకును గారణమగుచున్నది. వీరిలో గొందఱికి ఇతఃపూర్వము జెప్పిన దైవగుణములు కొంత తగ్గిపోవుటకు కొన్ని కారణములు గలవు.

అదేమన నీలాటి ధర్మకార్యములలో ప్రవేశించుటకు ముందుగా వారికి నిరంతరము దైవనిష్ఠ గలిగియుండును అపుడు వారి మనస్సు నిప్పులో నుండునట్టి యినుమువలె జ్ఞానముచేతను, భక్తి చేతను, ఈశ్వర విచారముచేతను, వైరాగ్యము చేతను, జ్ఞానమయజ్యోతియై వెలుగుచుండును. ధర్మకార్యములో, లోకసేవలో ప్రవేశించినపుడు ధ్యాననిష్ఠలు తగ్గిపోయి నందుచే నిప్పునుండి బయటికిదీసిన యినుమేలాగున చల్లారి పోవునో యాలాగున వీరిలోగల దైవశక్తి తగ్గిపోవును. ధర్మజ్యోతి యొక్క వెలుగు శాంతము నొందును. అందువలననే యిట్టి హీనస్థితి గలుగుచున్నది. కావున నెట్టి ధర్మముల జేయుచుండినను, లోకోపకారములలో ప్రవర్తించుచుండినను ధ్యానము మాత్రము ప్రతిదినము తగ్గకుండునటుల జూడవలెను. అట్లయిన సదా నిప్పులో నుండెడి యినుమువలె వారి యాత్మజ్ఞానము సదా జ్వలించు చుండును. ఇదియే దీనిలో గల రహస్యము.

ఇక ధర్మకార్యములలోగల రహస్యమును జెప్పబోవుచున్నాను కఱవుకాలములో అనగా కాటకములు గలుగునపుడు కొందఱు ధర్మాత్ములు దీనజనులయొక్కయు, బీదజనుల యొక్కయు, రోగులయొక్కయు, అనాథులయొక్కయు సంరక్షణకొఱకు ప్రయత్నింతురు. సంఘము ఏర్పాటు చేయుదురు. వీరియొక్క ధర్మబుద్ధిని జూచి ధర్మాత్ము లనేకులు వీరికి సహాయముగానుండి ధన, ధాన్య, వస్త్రాదు లనేకముల నిచ్చుచుందురు. గవర్నమెంటువారును తగినంత సహాయము జేయుచుందురు. ఈ వస్తువు లన్నిటిని వీరు సరిగా వినియోగపరచుచున్నారా? యని యితరులు

జాగ్రతతో జూచుచుందురు. ధర్మార్థముగా వచ్చియుండు నాయా వస్తువుల నెవరెవరి కెంతెంత యివ్వవలయునో అలాగున పక్షపాతములేక యిచ్చు చుండిన, అందరును వీరిపై విశ్వాసముగలిగి యికను అనేక ధర్మకార్యము లకు సహాయము జేయుచుందురు ఆ ధర్మవస్తువుల దనవారికి హెచ్చుగా నిచ్చినను, తా మెక్కువగా భుజించినను, భేదబుద్ధితో కొందఱి కెక్కువ గాను, కొందఱికి తక్కువగాను ఇచ్చినను నదియు నధర్మమే యగును. అంతియే గాక తాము స్వయముగా కార్యముల జూచుటకు ప్రయాసమని తలంచి కొందఱు నౌకరుల నేర్పాటుజేసిన వారుగూడ నాయావస్తువుల సరిగా జూడక నేదైన చెడిపోయినను పాతకమే యగును. వ్యర్థముగా ఖర్చు బెట్టినను దోషమే కలుగును. సరిగా బంచి పెట్టక రహస్యముగా నుంచినను నధర్మమే యగును. ఇట్టి దుష్టసంకల్పములు జనులకు దెలిసిన మఱల నేమియు నెవ్వరును నివ్వజాలరు. అంతియేగాక గవర్నమెంటువారికి దెలిసిన గొప్ప శిక్షగూడ జేయుదురు. ఉద్యోగము లుండువారైనచో, ధర్మద్రోహము జేసినందుచే జీతమును తగ్గింతురు. లేక పనిలోనుండి తొలగింతురు. లేక జులమానా వేయుదురు. ద్వీపాంతరమునకైన పంపుదురు. యావత్కాల శిక్షనైన వేయుదురు, చూచితిరా? ధర్మములోగల రహస్యమును!

అలాగున మంచివారనియు, ధర్మకార్యములు లెస్సగా జేసిరనియు గౌర్నమెంటువారికి దెలిసిన ఉద్యోగిగా నుండినచో జీత మెక్కింతురు. ఇకను గొప్ప గొప్ప ధర్మకార్యములలో బ్రవేశపెట్టుదురు. ఉన్నతోద్యోగ ముల నిత్తురు. ధర్మముయొక్క రహస్యమును గ్రహించితిరా? ఇప్పుడీ విషయము నిచట చెప్పుటకు కారణమేమన కొన్ని మఠములకును, ఆశ్రమ ములకును, బ్రహ్మనిష్ఠులకును, భాగవతులకును అనేక భక్తులు, ధర్మా త్ములు, రాజులు మొదలైన వారందరును ధర్మముకొఱ కనేక వస్తువుల నంపుదురు. ఇవి యన్నియు ముముక్షువుల కొఱకును, భక్తుల కొఱకును, బ్రహ్మనిష్ఠులకొఱకును, బీదలకొఱకును, పరమకారుణికుడగు పరమేశ్వ రుండు పై జెప్పిన వారి ద్వారా బంపుచున్నాడని తలంచవలయును. అనగా వారి యంతరాత్మను బ్రేరేపించి వారివలన జేయించుచున్నాడని విశ్వాసము గల్గియుండవలెను.

అంతేగాని, తనయొక్క తపోమహిమవలనగాని, భక్తి ప్రపత్తుల ప్రభావముచేగాని, యోగమహిమచేగాని లభించినదని తలంచి గర్వించరాదు. అవి యన్నియు భగవత్ప్రసాదము లని దలంచి యెవరెవరికి నేయే వస్తువుల, నెంతమాత్రమియ్యవలయునో ఆలాగున నిచ్చుచు, ఏవస్తువును చెడిపోనీయక జాగ్రత్తపరచి భగవద్భక్తులకు బ్రహ్మనిష్ఠులకును నుపయోగ పరచవలయును. తనవారని తలంచిగాని, స్నేహితులని తలంచిగాని, ఏ వస్తువునుగాని నియమము నతిక్రమించి యివ్వరాదు. ఇవి యన్నియు తన నిమిత్తము జనులిచ్చిరని యెంచి తానును మితిమీరి తినరాదు, మితిమీరిన ఖర్చుచేయరాదు. అట్లయినమాత్రమే ధర్మము శాశ్వతముగా నిలువగలదు. అట్టివారికి జ్ఞాన మభివృద్ధి నొందుచుండును. ఉన్నతోన్నత స్థితిగూడ గలుగును. అటులగాక కొందఱికి శిష్యులుగూడ నేర్పడిన, ఏ వస్తువును సరిగా జూడక, సరిగా భక్తులకివ్వక చెడగొట్టిన పాపమే గలుగును, అట్టి యధర్మకార్యముల జేయువారికి కొంతకాలము బోయిన మరల నేమియు లభించదు. ఎవరును నేమియు నివ్వరు. వారికి జ్ఞానము గూడ కృష్ణపక్ష చంద్రునివలె క్షయించుచుండును. విషయములో బడి పోదురు. పవిత్రబుద్ధియు వైరాగ్యమును తిరోహితమగును. అజ్ఞానాభివృద్ధి గలుగును. దైవకృపకు దూరులగుదురు, వెయ్యేల? దైవనిష్ఠ లెవ్వరును వారిని దగ్గఱకు జేర్చరు. జను లసహ్యాపడుదురు. పాపము చుట్టుకొనును. ఆఖరున జీవితము గడపుటగూడ కష్టమగును. అందఱికి విరోధు లగుదురు. ఎంతయడిగినను నెవరును దేనిని ఇవ్వరు ఆహా? వారి జీవితము దుఃఖముతో గడుపవలసియుండును. ధర్మసొత్తును భుజించిన కొందఱికి మనోనిశ్చలత తప్పిపోవును. రోగముగూడ గలుగవచ్చును.

కావున నీ సంగతు లన్నిటిని గ్రహించి ధర్మమార్గమున వర్తించువారికి నిత్యసుఖము గలుగును. వారిని దైవ మనుగ్రహించును. ఎల్లప్పుడును దైవము వారికి తోడై రక్షణ జేయుచుండును? "ధర్మస్య ప్రభురచ్యుతః" అయితే పై జెప్పిన యుదాహరణమువలన మందబుద్ధులు ఒక సంగతిని దెలిసికొనగలరు. ధర్మకార్యములలో తాము జేయు కృత్రిమ మెవరికైన తెలిసినగదా ? జనులకు దెలుపుటగాని గవర్నమెంటువారి కెరుక జేయుట గాని గలుగును ? మనము జేయునదెవరికిని దెలియదుగదా ? ఎవరును

జూడలేదుగదా ? యని తలంతురు. అట్లు తలంచుటయే మాయయొక్క మహామోహముచే గలిగెడు అపాయము. సర్వేశ్వరుండు సర్వకాల సర్వావస్థలయందును, జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి భేదములేక పరమాణువునుండి పరమేశ్వరునివఱకు సర్వప్రాణికోట్ల హృదయాంతరాళము నుండి సమస్త సంకల్పములగూడ నెఱుంగుచున్నాడు. ఆ మహాత్ముడు కన్ను లేకనే సర్వ జంతువులయొక్క యంతరాళములోగల భావమును జూచుచున్నాడు. ఆ పరమపిత చెవిలేకనే పరమాణువుల సంకల్పములను స్పష్టముగా వినుచున్నాడు. కాళ్ళులేకనే యొకక్షణములో ననంతకోటి బ్రహ్మాండము లన్నిటియందును సంచరించుచున్నాడు. ఆ మహామహిమ గల సర్వేశ్వరుడు చేతులులేకనే యనంతకోటి ప్రాణికోట్లకేకకాలమున వాటివాటి కర్మానుగుణ్యమగు ఫలమును గలుగజేయుచున్నాడు. అతని దృష్టినుండి యొక పరమాణువు సహితము తప్పించుకొని పోజాలదు. అట్టి సర్వేశ్వర దృష్టిని మూసి పెట్ట జూచుచున్నారా? అట్లయిన నది మార్జాలపయః పానన్యాయము ననుసరించి యుండును. అనగా పిల్లిపాలను దొంగిలించి త్రాగునపుడు కన్నుమూసికొని యుండును. దాని భావమేమన నిపుడెవరును కనుగొనజాలరనియే. అట్టి బిడాలజీవితము గలవారే పరమాత్మ దృష్టినుండి తప్పించుకొనుటకు జూచుచుందురు. ఈవిషయమై యుపనిషత్తు జెప్పినదానిని జూడుడు.

అపాణిపాదో జవనో గృహీతా
పశ్యత్యచక్షుః సశృణోత్యకర్ణః ।
సవేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా
తమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్॥

దీనియర్థము పైనజెప్పబడినదే. అదే విధముగా శ్రీకృష్ణభగవానుడు గీతలో నుపదేశించిన దానిని జూడుడు—

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥ అ. 13–14

బ్రహ్మమంతట నిండిన చేతులుగలవాడును, పాదములు గలవాడును. నేత్రములుగలవాడును, ముఖముగలవాడును, చెవిగలవాడునునై యుండి సమస్తమును నెఱుంగుచుండును.

ఓహెూ ? అతని మహిమ నెవరు వర్ణింపగలుగుదురు. దీనికంటె ప్రబల ప్రమాణము గావలయునా ? అయ్యో జనులయొక్క యజ్ఞాన మేమని జెప్పవచ్చును? ఈతత్త్వమును దెలిసికొనజాలకనే అనేకులు హృదయములో కలంకము నుంచి పైకి నిష్కళంకులవలె వర్తించుచున్నారు. గీతను జూడుడు. "నాహంప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః" సర్వేశ్వరుండు స్వకల్పితమగువిష్ణుమాయా శక్తిచే నావృతుడై యుండినందుచే మూఢాత్ములు తెలిసికొనజాలక పోవుచున్నారు. పరదాలోపల నుండు అంతఃపురస్త్రీ తాను పరదా రంధ్రములద్వారా యితరులను జూచుచుండును గాని యితరులా మెను జూడ జాలరు. ఈశ్వరునియొక్కయు జీవునియొక్కయు స్థితి యీ లాగున నుండును, జనులారా! మీరు భూమిలో నొకవిధమగు విత్తన మును బెట్టి, జనులతో మఱియొకరకమగు విత్తనమని చెప్పినను మీరు బెట్టిన విత్తనముదప్ప మరియొకటి ఫలించునా? ఆలాగున మీఅంతఃకరణ ములో గల సంకల్ప మేలాగున నుండునో, దాని కనుగుణమగు ఫలము గలుగునేగాని వేరొకటి ఫలించదు. కావున కర్మలో దృష్టినుంచి జీవించ వలయును. అప్పుడే జీవితము పవిత్రమగును.

అధర్మప్రభవంచైవ దుఃఖయోగం శరీరిణామ్।
ధర్మార్థ ప్రభవం చైవ సుఖసంయోగ మక్షయమ్॥

ప్రాణికోట్లకు నధర్మపు వృత్తివలన నదా దుఃఖమే గలుగుచుండున్ను ఆలాగున ధర్మప్రవర్తకులకు నక్షయమగు సుఖము గలుగును.

ఫలంకతకవృక్షస్య యద్యప్యంబు ప్రసాదకమ్।
న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి॥

చిల్లగింజ మట్టినీటిని శుద్ధపరచునదైనను నీటిలో సరిగ దీయక పేరుమాత్రము చెప్పిన జలమేలాగున శుద్ధము గాజాలదో, ఆలాగున ననుష్ఠాన మును సరిగా జేయక ధర్మవాక్యముల నుచ్చరించినందుచే ఫల మిసుమంత యును గలుగజాలదు.

ధర్మచర్యయా జఘన్యో వర్ణః
పూర్వంపూర్వం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ ।
అధర్మచర్యయా పూర్వోవర్ణో
జఘన్యం జఘన్యం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ॥

ధర్మప్రవృత్తివలన క్రిందిస్థితిలో నుండువారుగూడ నున్న తోన్నత స్థితిని బొందుచుందురు. అత్యున్నతస్థితిని బొందినవారైనను అధర్మప్రవృత్తి యందు ప్రవేశించిన క్రమముగా నీచస్థితిలోనికి వచ్చి చేరుదురు. ఇట్టి పరమ సత్యమును జ్ఞప్తియందుంచి జీవించువారు పరమాత్మని గనుగొనగలుగుదురు.

అనఘకులంబు బలంబును
ధనము వయోరూపములును తపమును రాజ్యం
బును విద్యయిన్ని గూడి య
గ్నును నష్టమదంబులనియు గూఢాత్మలకున్॥

అష్టమదముల వివరణము. ఇవి తనలో లేశమైన గలుగకుండు నటుల జాడవలెను. 1. శ్రేష్ఠకులమను భావము 2. జన, ధన, అధికారము లచే గలిగెడి బలము 3. ధనము 4. యౌవనము 5. రూపము 6. తపస్సు అనగా తాను తపోబలము, యోగబలము, సదాచారము, జీవకారుణ్యము, వైరాగ్యము, సాత్వికాహారము శుచిత్వము గలవాడనని తలంచుట 7. రాజ్యము 8. విద్య (తాను విద్వాంసుడననియు, సమస్తము దెలిసినవాడ ననియు దలంచి యితరుల తూలనాడుట) ఇవియన్నియు దేహము అంతః కరణము మొదలగు వాటియొక్క ధర్మములేగాని ఆత్మ ధర్మములుగావు. కావున విడువదగినవి. అష్టపాశములు.

దయయును జుగుప్సయు మోహము
భయమును సంశయము కులము బలశీలము ల
న్నియుగూడ నష్టపాశము
లయి వెలయును వానినాత్మ డంటకయుండున్॥

(భారతము) అనుశాసనము 1. (దయ తనదేహ సంబంధులమాత్రము ప్రేమించుట), 2. అసహ్యపడు స్వభావము, 3. మోహము 4. భయము, 5 సంశయము, 6 కులము 7. బలము, 8. శీలము అనగా తాను శుచి యాచారము గలవాడనను నహంకారము. ఇవి యాత్మలో గలుగకుండు నటుల జూడవలయును.



# దృఢవ్రతము

సర్వదా శర్వ! సర్వేశ! సర్వోత్తమ! మహేశ్వర!
తవనామామృతం దివ్యం జిహ్వాగ్రే మమ తిష్ఠతు ॥

ఏకో వశీ సర్వభూతాంతరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్॥

టీ॥ ఏకః = (తనకంటె అల్పుడును అధికుడును తనతో సమానుడును అగువాడు) మఱొక్కడు లేనివాడును, వశీ=సర్వజగత్తు స్వాధీనముగా గలవాడును సర్వభూతాంతరాత్మా = సర్వభూతములకు అంతరాత్మస్వరూపుడును అగు, యః—ఏయాత్మ (పరబ్రహ్మము) ఏకంరూపం = శుద్ధవిజ్ఞానఘన రూపుని, బహుధా = అనేకవిధములుగా జేయువానినిగ, కరోతి = చేయుచున్నాడో, యే ధీరాః = ఏబ్రహ్మనిష్ఠులు, ఆత్మస్థం=స్వశరీరహృదయాకాశాంతర్గతమగు బుద్ధిగుహయందున్న, తం = ఆ పరమాత్మను, అనుపశ్యంతి = లెస్సగా దర్శించుచున్నారో, తేషాం = అట్టివారెవరైననువారికే, శాశ్వత సుఖం=నాశములేని సుఖములభించును, ఇతరేషాం=అట్టి ఆత్మావలోకనము గలుగనివారికి, న=అట్టి అక్షయమైన దైవసుఖము గలుగదు.

మానవుడు ఉన్నతస్థితికి రావలసియుండిన దృఢవ్రతము గలవాడుగావలయును. ఈదృఢత్వము లేనిచో ఎన్నివ్రతము లాచరించినను ఊర్ధ్వగతి గలుగజాలదు వ్రతమనగా నెట్టివిపత్తుగలిగినను తనయొక్క

నియమమునుండి చలింపక యుండునదని గ్రహింపవలయును. ప్రపంచములో శాశ్వతములగు సమస్తకార్యములును ఇట్టినియమము ననుసరించియే జరుగుచున్నవి. నది దాటుటకు వంతెన ఎట్టిదో మనుజు డున్నతస్థితిని గలుగజేసికొనుటకు దృఢవ్రతమును అట్టిది. వంతెన దృఢముగా లేనిదైనచో నేలాగున విరిగి పడిపోవునో యాలాగున దృఢవ్రతములేని మనుష్యుడు తనయొక్క గమ్యస్థానమునుండి జారిపడుట నిశ్చయము. వంతెననుండి పడిపోయిన వాడేలాగున ఏటిలో కొట్టుకొనిపోయి సముద్రములోబడి చనిపోవునో అలాగున తనయొక్క వ్రతము నుల్లంఘించిన వాడు గూడ జననమరణ ప్రవాహమగు ఏటిలోబడి సంసారసాగరములోపడి దుఃఖములబొందుట నిక్కము. ఇక చెప్పబోవు ప్రతి వ్రతశబ్దమునకు అచంచలమైన నియమమర్థని గ్రహింపవలయును.

చెరువుకట్ట దృఢముగాలేనిచో ఏలాగున తెగి జలము వెళ్ళిపోవునో, యాలాగున తనయొక్క పవిత్రతయంతయు దృఢవ్రతము లేనిచో నశించిపోవును. ప్రపంచములోగల జనులు యావత్తు వ్రతముల ననుష్ఠింపక, తమకు సాధ్యమైనదియు, ప్రీతిగలదియు, శుభమును గలుగజేయు నదియునగు ఒక్కవ్రతమునైనను యనుష్ఠించవలెను. ఏకాదశి, ప్రదోషము, చాంద్రాయణము, ఆత్మసంయమము మొదలగు నోములలో నేదైన ఒక్క దానినెట్లు నోచుచుందురో, అలాగున తమకు సాధ్యమైనదియు, ఆత్మను పరిశుద్ధము చేయునదియునగు ఒకవ్రతము నాచరణలో నుంచవలెను. ఇచ్చట చెప్పబడినది యేకాదశ్యాది వ్రతమని మాత్రము తలంపరాదు. తనయొక్క జీవితోన్నతికి తగిన నియమమని గ్రహించుకొనవలెను. పై చెప్పిన వ్రతములలోగూడ ఒక్కటియైన నుండుట మంచిది. దానిలో నెలాంటి లోపమును గలుగక యాచరణ గలిగియుండవలెను. అప్పుడు దృఢమగు వంతెనపై నేలాగున సుఖముగ నదిని దాటిపోవచ్చునో, యాలాగున సంసారసాగరమును సులభముగా దాటి పోవచ్చును. చెరువుకట్ట స్థిరముగా నుండ నీటికి ఎలాంటికొరతయు గలుగక పైరుయేలాగున పండించవచ్చునో, అలాగున మానవజీవితము యొక్క పరమలక్ష్యమును సుదృఢవ్రతనిష్ఠ గలవాడు పొందవచ్చును. ఎట్టి విపత్తులు వచ్చినను తనయొక్క వ్రతమును వెనబడరాదు. ఒకవేళ ప్రాణహానికలిగినను అది నిత్యమంగళమగు

ముక్తిని గలుగజేయును ఇక బహుకాలమునుండి సంపాదించవలసిన దైవకృపగాని ఆత్మజ్ఞానము గాని, యోగసిద్ధిగాని సంపాదించిన పొందవలసిన మోక్షమప్పుడే యతనికి లభించును.

ఒకవేళ పైజెప్పిన భక్తి, యోగ జ్ఞానాము లీజన్మములో అనుష్ఠించిన పూర్తియగునని చెప్పజాలము. వ్రతసంరక్షణవల్ల మరణము ప్రాప్తించినను ముక్తిగలుగుట నిక్కము ఇందుకు శ్రీగీతావాక్యమే ప్రమాణము "స్వధర్మే నిధనం శ్రేయః" దీనియర్థము పైనజెప్పినదే. రోగముగలవానికి ఆయుర్వేదములో జెప్పబడిన యౌషధము లన్నియు నేలాగున అవసరములుగావో, యాలాగున ధర్మశాస్త్రములో చెప్పబడియుండు ప్రయత్నము లన్నియు నొక్కరి కవసరము లేదు. రోగమునకు తగిన యౌషధమును దానికి తగిన పథ్యమును లేనిచో వ్యాధి యేలాగున కుదరదో, యాలాగున ఒక్క నియమము చక్కగ లేని మానవుడు భవరోగమునుండి విముక్తుడు గాజాలడు. లోకములో పండిన ధాన్యము లన్నియు ఒక్కరి యాకలి శమనమున కేలాగున పని లేదో: ఆలాగున శాస్త్రములో విధించిన వ్రతము లన్నియు ఒకరికవలసినది లేదు. ఏదైన ఒక అన్నము లేనిచో ఆకలిబాధ యెట్లు శమించదో ఆలాగున ఒక్క వ్రతములో మంచి నిష్ఠలేనిచో మనుజుని తాపత్రయమును శమింపబడు, ఇట్టి నిశ్చయము ముందుగానే చేసికొనవలయును. నియమము లేని మనుజుడును పశువును సమానముగా నుందురు. పశువులకు నియమము లేదు. ఆలాగున నియమములేని మనుజుడు పశువులతో సమానుడని లోకము చెప్పెడు రహస్యము ఒక్క రసాయన శాస్త్రజ్ఞుడు తానుచేయు రసాయనమునకు ఏయే పదార్థములు ఎంతెంత భాగములుండిన నది చక్కగపని చేయునని తెలిసియుండునో, వాటిలో నేదైన వస్తువులు కొరతగలిగిన అది చెప్పినట్టు ఎలా పనిచేయజాలదో, మానవునియొక్క వ్రతనియమములును ఆలాటివని గ్రహించుకొనవలెను. రసాయన శాస్త్రజ్ఞుని యాశయమెట్టిదో యౌషధముయొక్క యేర్పాటును అట్టిదే. ఏయేమందులు ఎంతెంతచేర్చి యెట్లు పక్వము చేయవలయునో, యాలాగున పాకముచేసిన మాత్రమేగదా రోగమును హరింపచేయును. వెయ్యేల ఒక పదార్థమును పచనము చేయునప్పుడు ఏయే వస్తువులు ఎంతెంత చేర్చవలయునను నియమముగలదో చేర్చినగదా భుజించుటకు యోగ్యముగాను, ఆరోగ్యముగాను

ఉండును. తనయొక్క వ్రతనియమములును ఆలాటివేయని మరువ కూడదు.

పూర్వీకులకట్టి నియమముండుటచేతనే వారు పవిత్రులగుటకును, అమోఘ కార్యముల సాధించుటకును సమర్థులైరి. ఈవిషయమై శ్రీగీతా చార్యులు నాల్గవ యధ్యాయమున వ్రతమును గురించి ఉపదేశించినది చూడుడు. ఇవియన్నియు వ్రతములే. దీనియందు మీకు ఏ యజ్ఞము (వ్రతము) అనుష్ఠించుటకు సాధ్యమగునో వానిలో ఒక్కటియైన తప్పక యుండవలెను. అట్లుగానిచో మానవకోటి తరింపజాలదు. ఇట్టి వ్రతము మానవుని వెన్నెముక వంటిదని దృఢనిశ్చయము గలిగివుండవలెను. ఇది స్త్రీల కైనచో సుమంగళీ స్త్రీల మంగళసూత్రము వంటిదని నిశ్చయము గలిగియుండిన మాత్రమే తరించగలుగుదురు. లేనిచో మాయ మీకు త్రోవ జూపదు. ఆమాయ యెల్లప్పుడును నీటిపైగల నాచువంటిది. చేతులతో తొలగించిన వెంటనే సందిచ్చినను హస్తము తీసిన అది తక్షణమే వచ్చి యెట్లుమూసికొనునో, ఆలాగున మీ వ్రతము దృఢముగలిగివుండు వఱకు మాయ మీయాత్మను ఆవరింపజాలదు. వ్రతభంగము గలిగిన అపుడే ఆవరించుకొనును.

అయితే మూర్ఖపుపట్టుదలగాని, నిషిద్ధకార్యములలో హఠముగాని, అధర్మవిషయములలో పిడివాదముగాని యుండరాదు. అది వివేకులకు తగదు. దానికి వితండము అనిగాని, మర్కటముష్టి అనిగాని పేరు గలదు. అది ఒక విధమగు క్రూరస్వభావము. దానివల్ల మీకార్యము సాధించినను గలిగెడు ఫలము దుఃఖమే యగును. ఇది పాపస్వభావము. అట్లుగాక పైజెప్పిన వ్రతనియమములన్నియు ధర్మయుక్తముగాను, దైవ ప్రీతికరము గాను, సజ్జనసమ్మతముగాను, ఆత్మాభివృద్ధికి హేతువుగాను, శాస్త్రానుసార ముగ నుండునవిగా నుండవలయును. ఈవిషయము ఇదమిత్థమని నిశ్చయిం చుటకు చాల వివేకజ్ఞానమును, విశాలభావమును గల్గి ధర్మశాస్త్రసార మెరింగియు నుండవలెను. లేనిచో ఇట్టి విషయములలో ధర్మసంకటముగాని, ధర్మసందేహముగాని గలిగినచో జ్ఞానసంపన్నులును ధర్మశాస్త్ర మెరింగిన వారును, మీయొక్క క్షేమమును కోరువారును, సత్యవ్రతము గలవారును నగు

వారి సలహాలను అవశ్యముగ తీసికొనవలెను. లేనిచో మార్యముచేగల పట్టు దలకు హానియేగలుగును. అట్లు గలుగనీయక బహుజాగరూకతతో యోచించు కొనవలెను.

దైవమేవాఽపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరేయజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥(గీత-4-25)

టీ॥ 4. అపరే = మరికొందఱు, యోగినః = యోగులు, దైవం = దేవతాసంబంధమైన, యజ్ఞమేవ = యజ్ఞమునే, పర్యుపాసతే = చేయు చున్నారు. 2. అపరే=మరికొందరు, (జ్ఞానులు) యజ్ఞేనైవ = ఆత్మకుసంబం ధించిన యజ్ఞ సాధనములచేతనే, యజ్ఞం = ఆత్మను, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మ మను అగ్నియందు, ఉపజుహ్వతి= హోమముజేయుచున్నారు.

ఈశ్లోకమునుండి జనులుచేయు వ్రతములను (యజ్ఞములను) శ్రీభగవాను లుపదేశించియున్నారు కొందఱు ఫలాపేక్షలతో దేవతల నుద్దేశించి కర్మకలాపముతో యజ్ఞమును చేయుచున్నారు. చిత్త శుద్ధిగలిగిన కొందఱు ఆత్మసంబంధమైనమనస్సు, ఇంద్రియములు మొదలగు వానివల్ల ఆత్మలోనే హోమ (యజ్ఞ)మును చేయుచున్నారు,. ఈ ఆత్మయజ్ఞవిషయమై ప్రారంభించినపుడే మలినబుద్ధిగలవాడు బాహ్యాగ్ని యందును, ఆత్మశుద్ధి గలవారు ఆత్మజ్ఞానాగ్ని యందును హోమము చేయుచున్నారని తెలుపడ మైనది,

శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥ (4-26)

3. అన్యే = మరికొందఱు, శ్రోత్రాదీని = కర్ణేంద్రియములు మొద లైన, ఇంద్రియాణి = ఇంద్రియములను, సంయమాగ్నిషు = నిగ్రహము లనెడు యగ్నులయందు, జుహ్వతి = హోమముజేయుచున్నారు. 4. అన్యే = మరికొందరు· శబ్దాదీన్ = శబ్దము మొదలగు, విషయాన్ = విషయములను ఇంద్రియాగ్నిషు-ఇంద్రియములనెడు అగ్నులయందు, జుహ్వతి = హోమము జేయుచున్నారు.

కొందఱు సంయమశీలురు కర్ణము, త్వక్ చక్షువు, జిహ్వా, ఘ్రాణము మొదలగు ఇంద్రియములను లెస్సగ నియమించుకొని తత్తద్విషయముల లోనికి పోనీయకున్నారు.ఇదియునొక యజ్ఞమే. మరికొందరు శబ్ద,స్పర్శ,రూప, రస, గంధములనెడు అయిదు విషయములను తత్తత్కారణములగు ఇంద్రియములలో లయమొందించుచున్నారు. ఇదియునొక యజ్ఞమే యగును.

సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మ సంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ (4–27)

టీ॥ 5. అపరే=మఱికొందురు, సర్వాణి=సమస్తములయిన, ఇంద్రియ కర్మాణి = జ్ఞానేంద్రియములయొక్కయు, కర్మేంద్రియముల యొక్కయు, వ్యాపారములకు. ప్రాణకర్మాణి=ప్రాణాపాన వాయువుల యొక్క వ్యాపారము లను, జ్ఞానదీపితే = ఆత్మజ్ఞానముచే ప్రకాశింపజేయబడిన, ఆత్మసంయమ యోగాగ్నౌ=ఆత్మయందు మనస్సును నిరోధించుటయే స్వరూపముగాగల యోగమనియెడు (స్వస్వరూపానుసంధానమనియెడు) అగ్నియందు, జుహ్వతి= హోమము జేయుచున్నారు.

మరికొందరు ఇంద్రియములును, ఇంద్రియవిషయములును పంచ ప్రాణములును వాటి వ్యాపారములను మొత్తము ఆత్మయందు వ్రేల్చు చున్నారు. ఇదియునొక యజ్ఞమే. పైజెప్పిన శ్లోకములో నిరూపించిన వారి కన్న వీరి కధికనిష్ఠ గలిగియుండును.

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః॥ (4-28)

టీ॥ 6. అపరే =మఱికొందఱు, ద్రవ్యయజ్ఞాః=ద్రవ్య దానమను యజ్ఞ మును చేయుదురు. అనగా కొందఱు భోజనము చేయుటకుముందు తమ శక్తికొలది కొద్దిమందికిగాని యెక్కువమందికి గాని అన్న, ధన, ధాన్యాది వస్తువులలో నేదైన నొకటి ఈశ్వరార్పణబుద్ధితో దానము చేయుదురు. వీరును యజ్ఞమును చేయువారే. పై జెప్పిన యోగాద్యనుష్ఠానములు చేయుటకు శక్తిలేనివారు ఇట్టి ద్రవ్యయజ్ఞమును చేసిన ఫాలును, ద్రవ్యదానయజ్ఞ

7. కొందరు తపోయజ్ఞాః=తపస్సు అను యజ్ఞముచేయుదురు. అనగా పరమేశ్వరునిగురించి హృదయము తపించేలాగున ధ్యానము చేయుదురు. ద్రవ్యయజ్ఞమునకు శక్తిలేనివారు ఇట్టి తపస్సనెడి యజ్ఞమును చేసినవాళ్ళున్నారు.
8. కొందరు యోగ యజ్ఞాః=ప్రాణాయామ ప్రత్యాహారాదులే స్వరూపముగా గల లేక చిత్తవృత్తినిరోధమే స్వరూపముగాగల యోగమనెడు యజ్ఞమును చేయుదురు.

9. కొందరు స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాః = నియమపూర్వకముగ ఋగ్వేదాదులలో కొన్ని భాగములగాని, యుపనిషత్తులలో కొన్నిభాగములను గాని శ్రీభగవద్గీతాదులలో కొన్నిభాగములుగాని, సహస్ర నామాష్టోత్తరాద్యర్చనలలో కొన్ని భాగములుగాని స్మరణ, కీర్తనల, భజనాదులలో కొన్నిటినిగాని ప్రణవ, గాయత్రీ, శివ, నారాయణాది మంత్రములలో కొన్నిటినిగాని జపము చేసెడు యజ్ఞమును చేయుదురు. లేక పై జెప్పిన వేదోపనిషత్తులయొక్కయు ప్రణవాది మంత్రముల యొక్కయు అర్థమును, అధిష్ఠానదైవతములను, నిధిధ్యాసము గలిగి యుందురు, వీరును యజ్ఞనిష్ఠాపరులే.
10. అపరే = మరికొందరు, యతయః = మోక్షమునుగురించి ప్రయత్నముచేయు సన్యాసులు, లేక జయింపబడిన యింద్రియములు గల వారు, సంశితవ్రతాః = తీక్ష్ణములైన వ్రతములే యజ్ఞముగాగల వారై యుందురు, యతయః, యత్నశీలాః, యతులనగా సదా ప్రయత్న పరులని యే యర్థము. లేక జయింపబడిన యింద్రియములు గలవారని గూడ యర్థముగలదు. ఇట్టి యతులుండిన కాలమునందు సదా మన లోకము స్వర్గలోకముగనుండినది. స్వర్గలోకమని చెప్పనేల? దేవలోకముగ నుండెననియే చెప్పవలెను. ఏలన! స్వర్గలోకము విషయభోగములతో గూడినది దైవలోకమో, జ్ఞానానందముతో కూడినది.

ఈశ్లోకమునందు శ్రీకృష్ణభగవానులే "యతయః సంశితవ్రతాః" అని తెలిపినారు. యతులనగా, సుతీక్ష్ణమైన వ్రతనిష్ఠ గలవారని యుపదేశించి నారు. ఇప్పుడుండు వారిలో ఇట్టి తీక్ష్ణమైన వ్రతములేక పోవుటచేతనే పదునులేని కత్తిచే నరుకబడిన చెట్లు తెగకయుండునట్లు వీరియొక్క అంతఃకరణములోగల దృశ్యవృత్తులనెడు తరువులు ఛేదింప బడకున్నవి. సునిశ్చిత వ్రతములుగలవారైనవో నుక్కుతో చేయబడి మంచిసానబెట్టబడిన గొడ్డలివలె

నుందురు. దానివల్ల యావత్తు వృక్షలతాదులను ఛేదింప శక్తి గలిగినట్లుం డును. ఇప్పుడుండు వారికేలాటి వ్రతనియమములు లేనందుచేతనే వీరి యొక్క ఆత్మశక్తి తగ్గిపోయినది. సమిధలు నశించిన అగ్నిహోత్రుడు ఏలాగున చల్లారునో వ్రతనియమ నిష్ఠలులేనివారి ఆత్మశక్తిగూడ అట్లే క్షీణించిపోవును. అగ్నిహోత్రునియందు కట్టెలును, నేయియును, వేయు వారెవరైనను నేలాగున నది ప్రజ్వరిల్లునో, ఆలాగున మనుష్యమాత్రులలో నెవరైనను ఆత్మసంయమమను హోమముచేసిన, జ్ఞానాగ్ని ప్రజ్వరిల్లును. సంశయములేదు. సుతీక్ష్ణమగు వ్రతనిష్ఠలు గలిగియుండువలకు సన్యాసులకు అపారమగు మహిమయు, పూజ్యతయు గలిగియుండెను. ఎప్పు డట్టి నిష్ఠ తగ్గనో అపుడే ఆత్మశక్తియు, పూజ్యతయు అస్తమించినవి.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః॥ 29

టీక॥ 11. అపరే = మరికొందఱు, ప్రాణాయామ పరాయణాః = ప్రాణాయామమునందాసక్తి గలవారై, ప్రాణాపానగతీః = ప్రాణాపాన వాయువులయొక్క గతులను, రుద్ధ్వా = అడ్డుపరచి, (కుంభకమునుజేసి) అపానే = అపానవాయువు వ్యాపారమునందు. ప్రాణం = ప్రాణవాయువు వ్యాపారమును (పూరకమును) తథా = ఆవిధముగానే, ప్రాణే = ప్రాణ వాయు వ్యాపారమునందు, అపానం = అపానవాయు వ్యాపారమును, (రేచకమును) జుహ్వతి=హోమమును చేయుచున్నారు.

వీనియందు ఒకటి బాహ్యకుంభకముగాను, ఒకటి అంతర కుంభకము గాను, ఒకటి మామూలు కుంభకముగాను నుండును.

అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషుజుహ్వతి।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥ 4–30

టీ॥ 12. అపరే = మరికొందఱు, నియతాహారాః = నియమితమగు శుద్ధాహారము నియమప్రకారము నియమితకాలములో భుజించు వారగుచు, ప్రాణాన్ = ప్రాణవాయువులను, ప్రాణేషు = ప్రాణవాయువులయందు జుహ్వతి = హోమమును జేయుచున్నారు, ఏతే = ఈచెప్పబడిన, సర్వేపి = అందఱును;

యజ్ఞవిదః = యజ్ఞములను చేయ నెరిగినవారే యగుదురు. యజ్ఞక్షపిత కల్మషాః=యజ్ఞములచే పోగొట్టబడిన కల్మషము గలవారగుదురు.

అదేమన! ఇట్టి నిష్ఠలచే సమస్తపాపములు నశించి ఆత్మశుద్ధి గలుగును. పైశ్లోకములో మూడు విధములగు ప్రాణాయామములు చెప్ప బడెను. అట్లయిన మొత్తము పదునాలుగు విధములగు యజ్ఞము లగును. ఆమూడును ఒకటిగాతలంచిన పండ్రెండు విధములగు యజ్ఞములను చేసిన వారై యుందురు, ఈశ్లోకములో కేవలకుంభకమును గుఱించి తెలుపడమైనది. దీనియందు "నియతాహారాః" అనగా ఆహారనియమము గలవాడుగూడ యజ్ఞమునుచేసిన వాడేయగును. ఏలన! ఆహార నియమము గలవాడు ధర్మమునకు వశపడియుండును.

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్।
నాయం లోకో స్త్యయజ్ఞస్య కుతోన్యః కురుసత్తమ॥ 4–31

టీక॥ యజ్ఞశిష్టామృతభుజః = పైజెప్పిన ఆత్మీయములగు దైవ కార్యములు అనగా అనుష్ఠానములు అయిన తరువాత భుజించెడి అన్నము, అమృతము వంటిదియగును. దానికి అంత పావనత్వము గలదు. దానిని భుజించువారు సనాతనం =శాశ్వతమగు, బ్రహ్మ = బ్రహ్మమును, యాంతి = పొందుచున్నారు. పైజెప్పిన నిష్ఠలచే ఆత్మపరిశుద్ధ మగుటవల్ల అట్టివారు పరబ్రహ్మ సాక్షాత్కారము పొందుచున్నారు. అయజ్ఞస్య = పైజెప్పిన వ్రతములలో నొకటైన చేయనివానికి, అయం = ఈ, లోకః = లోకమైన, నాస్తి=లేదు. ఇట్టి పుణ్యము చేయనివానికి ఇహలోకమందైన సుఖము గలుగదు హేకురుసత్తమ!=కురువంశపు రాజులలో నుత్తముడవైననోఅర్జునా అన్యః= (ఈలోకముకంటె) వేరయిన, లోకః = పుణ్య లోకము, కుతః = యెక్కడిది? ఈలోకములో సత్కర్మానుష్ఠానముచేయని వానికి పరలోకగతి గూడా లేదుగదా! పైరుపెట్టుకాలములో వ్యవసాయము చేయనిచో కోత కాలమున పనియుండదుగదా! ఈమానవ లోకమే ఏకర్మనైన చేయుటకు తగినది. తక్కిన లోకము లన్నియు కర్మఫల మనుభవించుట కేర్పడినవి.

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్విద్ధితాన్సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥ 4-32

ఏవం = ఈవిధముగా, బహువిధాః = అనేక విధములైన, యజ్ఞాః = యజ్ఞములు, బ్రహ్మణః=వేదముయొక్క ముఖే = ద్వారమునందు వితతాః = విస్తారముగా నేర్పడినవి. అనగా వేదముఖముద్వారా ప్రకాశితములై యున్నవి. లేక బ్రహ్మముఖమునుండి యేర్పడినవి. సర్వాన్=సర్వములైన, తాన్ = ఆ యజ్ఞములను, కర్మజాన్=మనుజులచే మనోవాక్కాయ కర్మలచే చేయదగిన వాటినిగా, విద్ధి = తెలియుము, ఏవం =ఈవిధముగా, జ్ఞాత్వా = తెలిసికొని, విమోక్ష్యసే=సంసారబంధము నుండి విడువబడగలవు,

"ఏవం బహువిధా యజ్ఞా" అని ఉపదేశించుటచే నింతవఱకు చెప్పినవేగాక ఇంకను అనేకవిధములగు ధర్మనిష్ఠలు గలవని తెలిసికొని వానిలో నేదైన నొక అనుష్ఠానము గలిగియుండిన తప్పక పరమేశ్వరుని పొందవచ్చును. ప్రపంచములోగల ఏదైన నొక నది నాశ్రయించి కడవఱకు వెళ్ళిన అది సముద్రములోనికి చేర్చునుగదా! 28 వ శ్లోకములో "స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ" అనుదానికి అధ్యయనమును గుఱించి రుద్రగీతయందు ఇట్లు చెప్పబడియున్నది,

వేదాంతశతరుద్రీయప్రణవాదిజపం బుధాః।
సత్త్వశుద్ధికరం పుంసాం స్వాధ్యాయం పరిచక్షతే॥

ఉపనిషత్తులుగాని. వేదములలో కొన్ని భాగములుగాని, ప్రణవము, గాయత్రి, శ్రీరామ, శివ నారాయణాది మంత్రజపములు గాని, గీతాపఠన ములుగాని, ఇవన్నియు అధ్యయనమునకు సంబంధించినవనియు, వీనిలో నేదైన ఒకదాని యనుష్ఠానమువలన మానవుల పాపమునశించి ఆత్మశుద్ధి గలుగుననియు, బ్రహ్మవేత్తలు వచించిరి.

స్తుతిస్మరణపూజాభి ర్వాఙ్మనఃకాయకర్మభిః।
సునిశ్చలా భవేద్భక్తి రేతదీశ్వరపూజనమ్॥

కీర్తనము, స్మరణ, పూజాదుల మనోవాక్కాయకర్మలచే జేయుట యజ్ఞములో జేరినవే, వాటివల్ల పాపములు నశించి అచంచలమైన దైవభక్తి గలుగును. పైజెప్పినవన్నియు సర్వేశ్వరునియొక్క పూజయని తెలిసికొన వలయును. అట్టివ్రతము సంకుచితభావము గలదిగా నుండరాదు. అతివిశాల

మైనదిగాను, విశుద్ధమైనదిగా నుండవలయును. అనగా కొందరుభక్తులు తాముపాసించెడు దేవతల పేరుమాత్ర ముచ్చరించెదరేగాని మఱియొక దేవునిపేర్ల నుచ్చరించరు, ఆలాగున ఇతర దేవతాస్థలములకును వెళ్ళరు. అట్లే యితరదైవభక్తులతో గలవారు. ఇట్టి క్షుద్రహృదయభావము గలిగియుండరాదు. ఇదియు నొక విధమగు వ్రతమైనను శ్రేష్ఠమైనను బుద్ధితో గూడినదిగాదు. ఒకవేళ యితరుల అనుష్ఠానములను తాను చేయకపోయినను, విరోధము లేదుగాని, అనిష్టము గలిగించెదరు అదిమాత్రము కూడదు. పతివ్రతయైన నారీమణి పరపురుషుని చేరునా! అట్లుచేరుట వ్యభిచారగుణము గల స్త్రీయొక్క స్వభావముగదా! అని యడుగుదురు. ఇదిసరియైన సమాధానముగాదు. ఇట్టి దుష్టోపదేశముల చేతనే, సోదరప్రేమయు, సంఘబలమును క్షయించుటకు కారణమగుచున్నది. పతివ్రతయైన స్త్రీకి అతిథిసేవయు, వృద్ధుల శుశ్రూషయు, బ్రహ్మనిష్ఠుల పరిచర్యయు. దీనులు, రోగులు ఇట్టివారినిఆదరించుటయు కూడదని చెప్పువారు గలరా!

ఇది పాతివ్రత్యమునకు తప్పు అని తలంచువారుందురా! అయితే దీనియందుగల రహస్యమేమన వీరియొక్క క్షుద్రములును, నీచములును నగు గూఢవిషయములేవైన యుండినచో ఇతరులు తెలిసికొనెదరన్న విచారము మాత్రమేగాని మఱియొక్క మర్మముగాని, కర్మముగాని ధర్మముగాని దీనియందులేదు అంతేగాక వీరిలోగల క్షుద్రభావముకన్న పరిశుద్ధభావము ఇతరులయందు కనుగొనిన తనయందు భక్తి తగ్గిపోవునోయేమో యని తలంచి ఇట్టిపన్నాగములు పన్నిరేగాని మఱియొక గూఢ తత్త్వము దీనియందు ఎంత వెదకినను గనుపడదు. ఇది స్వార్థముచే గలిగిన దోషదూషితమైన హృదయస్వభావమేగాని మఱియొకటిగాదు. ఇది మనుష్యులయొక్క అభివృద్ధిని అరికట్టునేగాని క్షేమమును గలుగ నీయదు. ఇట్టిదాని వల్ల ఉన్నతస్థితికి వెళ్ళుటకు అడ్డు గలుగుచుండును.

సత్యమును వెదకుటకును, అనుష్ఠించుటకును, బోధించుటకును సర్వజనులకు స్వాతంత్ర్యముండవలయును. అయితే ఈ విషయములో నిండు జాగరూకతగలవారే ప్రవేశించవలయును. లేనిచో నొక్కొక్క చోట పతనము గూడ గలుగుట కవకాశము గలుగును. శాస్త్రములకు తాను వశపడక శాస్త్రములను తాను వశపరచుకొనవలెను. అనగా తనకు ఇంతవరకుండిన

యుండవలయును. పుణ్యకర్మలు వృద్ధినొంది రాగా రాగా శుక్లపక్ష చంద్రుడు వృద్ధినొందుచుండగా చీకటి నశించునట్లు పాపములు క్షయించుచు వచ్చుచుండును. పుణ్యకర్మలతో సహ ఈశ్వరోపాసనయు, విషయ వైరాగ్యముగూడసంపాదించుకొనవలయును.అపుడుమంచి దివ్యరసాయనముచే దారుణమైన వ్యాధియైనను శమనము నొందునట్లు నీయొక్క అజ్ఞానమును. కర్మయు పాపమును, విఘ్నములును, శమనము నొందుచుండును.

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వంద్వ మోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః ॥
(గీత. అ. 7-28)

టీక॥ పుణ్యకర్మణాం = పాపక్షయమునకును, ఆత్మశుద్ధికిని తగిన పుణ్యకర్మల జేసెడు, యేషాం = యే, జనానాం = జనుల యొక్క, పాపం= పాపము అంతగతం = నాశము నొందినదో, తే = అట్టివారు, ద్వంద్వ మోహనిర్ముక్తాః = రాగద్వేషము వలన గలిగిన మోహమను అజ్ఞానమునుండి విడువబడినవారై, దృఢవ్రతాః = అచంచలమైన వ్రతనిష్ఠగలవారై , మాం= నన్ను, భజన్తే=ధ్యానించుచున్నారు,

ఈ యుపదేశ శ్లోకముచే పాపము గలిగినందుచేతనే తాను ప్రారంభించిన అనుష్ఠానములన్నిటికిని విఘ్నములు గలుగుచున్నవనియు, అట్టి పాపము నిష్కామబుద్ధితో నాచరించెడు పుణ్యకర్మలచే మాత్రమే నశించుననియు, పాపము నశించిన మాత్రమే యేలాటి విఘ్నములు గలుగక నిరాటంకముగ బ్రహ్మనిష్ఠ, జప ధ్యాన తపోయోగాదులు జరుగ గలవనియు శ్రీ భగవాను లుపదేశించిరి. అట్టి పుణ్య విశేషము లేనిచో రోగముచేతగాని, దారిద్ర్యముచేతగాని ఇతర విఘ్నములచేత గాని బ్రహ్మనిష్ఠకు పతనము గలుగును. మఱియు నీ విషయమై శ్రీజగద్గురు శంకర భగవత్పాదులు ఆత్మబోధయందుపదేశించినదానిని చూడుడు.

ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతివాసనా ।
హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥

టీక॥ ఏవం = ఈ ప్రకారముగాను, అహం = నేను, బ్రహ్మైవ = సర్వ పరిపూర్ణవస్తువే, అస్మీతి = అయితినని, నిరంతరకృతా = నిరంతర

ఎల్లపుడును, కృతా = చేయబడిన, వాసనా = సంస్కారము, (అనగా = వినినదానివల్లను, చూచినదానివల్లను కలిగినదై స్మృతిని పుట్టించడమునకు మనస్సునందుండు ధర్మము) రసాయనం = మంచియౌషధము, రోగానివ= వ్యాధులను పోగొట్టు క్రమముననే. అవిద్యావిక్షేపాన్ = అవిద్యా, మాయ వలన గలిగిన, విక్షేపాన్ = ఆవరణవిక్షేపశక్తులను, (అనగా తనను చూచుచున్నప్పటికిని దానిని తెలియకుండచేసి భేదమును తనయందు తాను లయపరచుకొని తిరుగ భేదమునకు గారణముగా నుండునది, ఆవరణశక్తి. ఇందుకు దృష్టాంతము నిద్రయే, విక్షేపశక్తి యనగా = జాగ్రత్స్వప్నముల యందు భేదబుద్ధిని గలుగజేసెడిశక్తి) హరతి = నశింపజేయుచున్నది. అనగా నిరంతరము బ్రహ్మాత్మైక్య సంధానపరుడై నిష్ఠసలిపెనేని అజ్ఞానము నశించి విజ్ఞానము దయమగును.

ఇచ్చట ఒకరహస్యము భక్తులు గ్రహించవలెను. అదేమన! ఎంత శ్రేష్ఠమైన మందైనను, పథ్యము సరిగలేనిచో రోగము శమింపనిరీతిగా గొప్ప బ్రహ్మోపదేశము పొందినను ఆచరణ సరిగలేనిచో అజ్ఞానము నశించి, విజ్ఞానము ఉదయముగాలేదని తెలిసికొనవలెను ఇతరగ్రంథములు. గూడ ఈవిషయమునే చెప్పుచున్నవి.

యథా న క్రియతే జ్యోత్స్నా మలప్రక్షాళనాన్మణేః ।
దోషప్రహాణాన్నజ్ఞాన మాత్మనః క్రియతే తథా ॥

మణియందలి పైముఱికి కడుగగానే దాని స్వతేజస్సుతో నది ప్రకాశించుచున్నది. అటులే దోషము పోగొట్టినంత మాత్రముననే తన యొక్క నిజమైన యాత్మజ్ఞానజ్యోతి స్పష్టముగ వెలుగుచుండును. అయితే ఇది నూతనముగా గలిగినదికాదు. అనాదిగ నుండినదే, మఱియు నెక్కువ ప్రకాశముతో వెలుగుచుండు ఎలక్ట్రిక్ దీపముగాని, గ్యాస్లైటుగా నియుండినను అవిమ్నిపై పలుచని తెల్లవస్త్రము. దానిపైదుప్పటి, దానిపై నల్లకంబళి, దానిపై తారుపట్ట మొదలైనవి ఒక్కొక్కటి చుట్టి చుట్టి కట్టినచో నేలాగున వెలుతురు గనపడదో, అలాగున ఆత్మస్వయం ప్రకాశజ్ఞానస్వరూపమై యుండినను సత్త్వ, రజ, స్తమోగుణాదులచే అంతఃకరణ మావరణమై యుండిన నిజ స్వరూపము ప్రకాశింపదు. తమోగుణ రజోగుణములు

నల్లనికంబళి, తారుపట్ట, దుప్పటి, లేక యెఱ్ఱనిశాలున వంటిదనియు గ్రహించ వలెను. ఇవి రెండును గలిగియుండు వఱకు నాత్మయొక్క స్వరూపము కొంచమైనను తెలియదు. సత్త్వగుణము, నిర్మలత్వము, ప్రసన్నత్వము గలదగుటచే సూక్ష్మమైన తెల్లని మల్లువస్త్రముతో, లేక తెల్లని, సన్నని దుకూలమువంటి దగును. ఇట్టివారి హృదయములో నాత్మప్రకాశము నిర్మలమైన దైవసుఖము గలుగుచుండును. అయితే యిదియు నొక యుపాధి యగుటచే పుణ్యలోక ప్రాప్తినే గలుగజేయును. ఇంతవఱకు వచ్చిన జీవులు వాలయుత్కృష్టులే. అయితే సత్త్వగుణముగూడ వదలిపోవునప్పుడు మాత్రమే కేవలదైవ సాక్షాత్కార ప్రాప్తిగలుగును.

యత్కర్మ సుకృతం ప్రోక్తంమనో వాక్కాయ సంభవమ్।
తత్తు కర్మాంతరం హన్తి మనోవాక్కాయసంభవమ్"

మనోవాక్కాయములచే జీవుడు ఎట్టిదుష్కర్మమును చేసి యుండినను, అట్టి దురితము మనోవాక్కాయ కర్మములచే జేసెడు సుకృతకర్మలవలన నశించును. ఇది ప్రకాశము చీకటిని లయమొందించునట్లు జీవునియొక్క పాపమును రహితమును చేయును.

తపసా దగ్ధపాపస్యపక్వచిత్తస్య యోగినః ।
చతుర్థ ఆశ్రమః కాలే స్వయమేవ భవిష్యతి॥

తపస్సుచేత దహింపబడిన పాపముగలవాడును, పరిపక్వమైన హృదయముగలవాడు నగు యోగనిష్ఠునకు తురీయ సాక్షాత్కారజ్ఞానము పరిపక్వస్థితి గలుగునపుడు స్వయముగ గలుగును.

ద్వాభ్యామేవ హి పక్షాభ్యాం యథావై పక్షిణాం గతిః।
తథైవ జ్ఞానకర్మాభ్యాం ప్రాప్యతే బ్రహ్మ శాశ్వతమ్॥

ఏలాగున పక్షులకు ఆకాసములో సంచరించుటకు రెండు రెక్కలు అవసరములో, ఆలాగున నీ జీవుడు చిదాకాశములో ప్రవేశించి శాశ్వతమైన బ్రహ్మప్రాప్తిని గలుగజేయవలసి యుండిన, ఆత్మచింతనయు, నిష్కామ బుద్ధితో పుణ్యకర్మానుష్ఠాన మవశ్యముండే తీరవలయును.

తపో విద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరమ్ ।
తపసా కిల్బిషం హన్తి విద్యాఽ-యామృత మశ్నుతే॥

బ్రహ్మనిష్ఠుని కుత్కృష్టమైన కైవల్యపదవిని గలుగజేయునవి. (1) తపస్సనియు, (2) బ్రహ్మవిద్యయనియు తెలియవలయును. తపస్సువల్ల మాలిన్యములన్నియు నశించును బ్రహ్మవిద్యచే మోక్షము, గలుగును. మఱియు ఈవిషయమైన శ్రీకృష్ణ భగవానులు గీత. 4. వ అధ్యాయమునందు పదేశించిన దానిని చూడుడు.

అపిచేదసిపాపేభ్యః స్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥

టీక॥ సర్వేభ్యః=సమస్తమైన, పాపేభ్యః = పాపమును చేసిన వారల కంటె, పాపకృత్తమః = అధికపాపాత్ముడవు, అపిచేదసి=అయియున్న వాడవైనను, త్వం = నీవు, జ్ఞానప్లవేనైవ = జ్ఞానమనియెడు తెప్పచేతనే, సర్వం=సమస్తమైన, వృజినం =పాపసముద్రమును, సంతరిష్యసి = లెస్సగ దాటగలవు, దీనియందు "తరిష్యసి" అని ప్రయోగింపక "సంతరిష్యసి" అని యుపదేశించుటచే పరమాత్మయొక్క కరుణను వెల్లి విరిసినట్లు చూపు చున్నారు. ఏలన ఎన్నియో పాపములు చేసితిని. ఈపరమాత్మ ధ్యాననిష్ఠచే దాటగలుగుదునా యని సందేహపడు నేమో యని తలంచి నిస్సంశయముగ దాటగలవని దృఢపరచుచున్నారు.

యథైధాంసి సమిద్ధోగ్నిర్భస్మసాత్కురు తేర్జున!
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥

టీ॥ హేర్జున = ఓ అర్జునా, సమిద్ధః = లెస్సగ ప్రజ్వలించుచున్న, అగ్నిః = అగ్నిహోత్రుడు, ఏధాంసి = కట్టెలను, యథా = యేప్రకారముగ, భస్మసాత్ = భస్మమునుగా, కురుతే = చేయునో, తథా = ఆ ప్రకారముగ, జ్ఞానాగ్నిః = జ్ఞానమనియెడునగ్ని, సర్వకర్మాణి = సమస్తకర్మములను భస్మసాత్కురుతే = భస్మమునుగ జేయుచున్నది మండుచుండునగ్ని యేలాగున కట్టెలను భస్మముచేయునో ఆలాగున జ్ఞానమనెడు అగ్ని పాపకర్మల నన్నిటిని కాల్చివేయును.

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥

టీక॥ ఇహ = ఈలోకమునందు, జ్ఞానేన = జ్ఞానముతో, సదృశం = సమానముగా, పవిత్రం = పావనమైనది. నవిద్యతేహి = లేదుగదా! తత్ = అజ్ఞానమును, యోగసంసిద్ధః = యోగధ్యానము పరిపక్వత పొందినవాడు, కాలేన = కాలము పరిపక్వమగు నపుడు, ఆత్మని - తన యందు స్వయం=స్వయముగానే, విందతి=పొందుచున్నాడు.

బ్రహ్మనిష్ఠ చేసికొని కాల పరిపక్వావస్థ గలుగునప్పుడు దైవ సాక్షాత్కార జ్ఞానము తన హృదయములోనే స్వయముగ పొందుచుండును. కావున అట్టి జ్ఞానము గలుగువఱకు బ్రహ్మనిష్ఠచేయు చుండవలయును. కాలము వచ్చునప్పుడు వృక్షము లేలాగున పుష్పించునో, ఫలములను గలుగచేయునో అలాగున అనుష్ఠానము పరిపక్వ స్థితికి వచ్చునప్పుడు భగవద్ధ్యానము గూడ స్వయముగానే గలుగును.

పరేషాముపదేశాయ క్షేమాయ చ మనీషిణః ।
పక్వాశ్చ కర్మ కుర్వన్తి భయాన్నా దేశశాస్త్రతః॥

పుణ్య కర్మానుష్ఠానములు, తపోధ్యానాదులు చేయనిచో సామాన్య జనుల పాపమునశించి అంతఃకరణశుద్ధి గలుగదని తలంచియే జీవన్ముక్తులగు మహాత్ములుగూడ తమ కవసరము లేనప్పటికిని యితరుల కుపదేశప్రాయ ముగ, పుణ్యకర్మానుష్ఠానములు, దైవకార్యములు, తపోధ్యానాదులు, స్నాన పానఆహారాది నియమములు గలవారై యుందురు. అట్లుండుట యాత్మజ్ఞానము గలుగక పోవుటచేగాని, లేక కలిగిన జ్ఞానము నశించునని భీతిచేగాని, లేక శాస్త్రరీతిగ నడువక పోయిన ప్రత్యవాయముగాని, పతనము గాని గలుగునని భయముచే గాని కాదు. గీతాచార్యులు 3 వ అధ్యాయమున ఈలాగున నుపదేశించి యున్నారు.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత!।
కుర్యాద్విద్వాం స్తథాऽసక్తశ్చికీర్షుర్లోక సంగ్రహమ్॥

టీక॥ హేభారత = ఓయర్జునా! అవిద్వాంసః = పామరులు, కర్మణి = కర్మమునందు సక్తాః = ఆసక్తికలవారై, (అనగా కర్మఫలము కావలయు ననియెడు తలంపుగలవారై) యథా = ఏప్రకారము, కుర్వన్తి = (కర్మము. లను) చేయుచున్నారో, విద్వాన్ = ఆత్మజ్ఞానముకలవాడు, తథా = ఆప్రకారము, అసక్తస్సన్ = ఫలాభిలాష లేనివాడగుచు, లోకసంగ్రహం = లోకక్షేమమును, చికీర్షుః = చేయనిశ్చయించినవాడై కుర్యాత్ (= కర్మములను) చేయవలయును.

ఏలన జనులలో స్వభావముగ ఏమియుచేయక ఊరక యుండు గుణము చాలమందికి గలిగియుండును. అట్టివారికి ప్రబోధము గలిగించవలెను జ్ఞానిచేయనిచో, వారసలే చేయరు అయితే యీశ్వరాంశలో జన్మించిన పరిశుద్ధ జీవులుమాత్రమే యిట్టి వర్తన గలిగియుందురు. ఏలన ధర్మ సంస్థాపనము కొరకుగదా భగవదవతారములు గలుగుచుండును. కనుక అట్టి అంశములో, భగవదాజ్ఞచే జన్మించెడు మహాత్ములుగూడ నాలాగే యుందురు.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్।
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తస్సమాచరన్॥

టీక॥ విద్వాన్ = ఆత్మజ్ఞానము గలవాడు, కర్మసంగినాం = కర్మ ఫలమందాసక్తిగల, అజ్ఞానామ్ = ప్రాకృతజనులకు, బుద్ధిభేదం = బుద్ధిలో చలనమును, న జనయేత్ = పుట్టింపకూడదు, (కింతు = ఇకనేమనిన) యుక్తః = సమాహితచిత్తుడై, (స్వయం = తాను) సమాచరన్ – చక్కగ ఆచరించుచు, సర్వకర్మాణి = అన్నికర్మములను, జోషయేత్ = చేయించ వలయును.

ఈశ్లోకమునందు "ఆచరన్ అని కాక "సమాచరన్" అని యుపదేశించుటచే లెస్సగ తాను చేయుచు పరిపక్వస్థితి గలుగుటకు నితరుల చేతను చేయించవలెను ఓహో! యెంత యమోఘమైన యుపదేశము. ఇక విస్తారముగ గనదగువారు ఈ మూడవయధ్యాయమున చూడవచ్చును. అట్లుగానిచో లోకమేలాగున తరించును? విఘ్నములుగాని, పతనములుగాని, కష్టములుగాని కలిగినను మనము ఎప్పుడో చేసిన కర్మఫల మోలాగున

పరిణమించినదనియు, ఇవియన్నియు మనము దాటిపోవలసిన వారలమనియు తలంచవలెను. పర్వతదుర్గములలో ప్రయాణము చేయువారు ఒక్కొక కొండను లోయను దాటు నప్పుడు, ఏలాగున కఠిన మార్గములుదాటి పోవుచున్నా మనియు, తాము చేరవలసిన గమ్యస్థానము సమీపమునకు వచ్చుచున్నదనియు సంతోషించుచుందురో, మనస్సున హాయి గలుగజేసి కొందురో ఆలాగున ఒక్కొక్క కష్టమును, పతనమును గలుగునపుడు మనము పాపకర్మ కాననములను దాటి పోవుచున్నామని గ్రహించుకొన వలసినదేగాని క్లేశము నొందగూడదు మనము ఉత్తరాభి ముఖముగ కాశీక్షేత్రమునకు ప్రయాణమై పోవుచుండిన యెన్ని యడుగులు ముందుకు సాగుచున్నామో అన్నియడుగులు పుణ్యక్షేత్రమగు వారణాశికి సమీపించు చున్నామనియు, దక్షిణమునకు దూరులమగు చున్నామనియు జ్ఞాపకములో నుంచవలసియున్నట్లు. ప్రతిబంధములు వచ్చిపోవునప్పుడును దైవమునకు సమీపించుచున్నామని యెంచవలయును. అంతఃకరణములో గల యనేక జన్మములలో నుండి యుండు ప్రాకృతసంస్కారములు నశించువఱకు విఘ్నములును పతనములును గలుగుచునేయుండును. అంతవఱకు కేవలాత్మ యందు నిరంతరము నిలకడగలిగి యుండదు. మనశ్శాంతియు, నిత్య తృప్తియు నిర్విషయమున్నా, సిద్ధింపదని సాధకుడు మనస్సులోనుంచి దృఢప్రయత్నము గలవాడై యుండవలెను. లేనిచో ఒకొక్క ప్రతిబంధము వచ్చునపుడు మనోవ్యాకులతయు, చంచలతయు, పట్టరాని దుఃఖములుగూడ గలుగుచుండును. శరీరములో వ్యాధి యుండువఱకు దానియొక్కస్వభావము కనుపర్చుచునుగదా! అప్పుడు మనము ఏమి చేయవలయును. మఱింత శ్రద్ధతో వైద్యునిచెంతను పృచ్ఛ కొని సరియైన పథ్యము గలిగియుండవలసినదే. అట్లుజేయకమందు తినకయు పథ్యముండకయు నుండిన రోగమేలాగున సౌఖ్యమును గలుగజేయును? మీయొక్క యాధ్యాత్మిక మార్గముగూడ యీలాటిదని జ్ఞాపకముంచుకొనుడు అంతవఱకు భగవంతునిపై భారముంచి నీవు చేయవలసిన యనుష్ఠానములు తప్పక చేయుచుండుము. నీకు జయమ్ము గలుగును.

అయితే నీయొక్కమార్గము సవ్యముగ నున్నదా! లేదా! యన్నిగూడ నీవు విచారణలో పెట్టుకొని చూచుచుండవలెను. అట్లుచేయకయుండినట్లు గూడ

నొకవిధమగు లోపమని గ్రహించుకొనుము. ఆలాటి కార్యములలో సందేహము గలిగిన యావిషయములో మంచిజ్ఞానము గలవారి నడిగి తెలిసికొనవలసియుండును. అయితే యెవరిని యడుగతలంచితివో అత డనుభవము గలవాడగను, మంచినిష్ఠగలవాడుగను, ధర్మాత్ముడుగ నుండవలయును. లేనిచో నీకు మఱింత చిక్కులు గలుగును. స్వార్థబుద్ధియు, అధర్మ స్వభావము గలవాడైనచో తన కుటిలవలలోనికి నిన్ను చిక్కించుకొనును సుమా! ఇదియు మఱింత జాగ్రత్తతో యోచించుకొనవలసినపనిగా నుండును. రోగమును ఔషధమును చక్కగ తెలియని వైద్యులు కొందఱు మందుల కొఱకెంతో డబ్బును ఖర్చు పెట్టించుచున్నారు. దయ్యము పట్టిన వారును నాలాగున దుష్టమాంత్రికులచే నెన్నియో యిడుముల పెట్టబడుచున్నారు. అంతేగాక ప్రాణిహింసలకూడ నెన్నిటినో చేయింతురు. ఆలాగున గురువులలో కొందఱుగూడ క్రొత్తగ యెచ్చట నుండియో సందేహము గలిగి వచ్చిన భక్తులచే నెన్నియో ఖర్చులు చేయింతురు తమ కనుభవములేని కఠినమైన సాధనలను చేయించెదరు. ఇదియు నీవు జ్ఞాపకముంచుకొనుము. అయితే నీకు పుణ్య సంస్కారమును, సర్వేశ్వర కృపయును, సజ్జనుల యనుగ్రహమును గలిగియుండిన ఆలాటి తప్పుమార్గములో పోనీయక నిన్ను మంచి మార్గములోనే యాసుకృత విశేషము తీసికొనివెళ్ళును. ఉత్కృష్టమైన ధర్మనిష్ఠయు, జ్ఞానమును గలవారివద్దకే యాసుకృత విశేషము నిన్నులాగుకొని పోవును. ఇదే సుకృతము యొక్కయు, నీశ్వరానుగ్రహముయొక్కయు ఫలితమని తెలిసికొనుము

1. ఇపుడు దృఢవ్రతులై యశఃకాయులైన పుణ్యచరిత్రుల దివ్యమూర్తుల కొందరిని పేర్కొనెద. అట్టి యుదారచరితులలో పరమ పావన మూర్తులలో బలిచక్రవర్తి యొకడు. ఇతనియొక్క వ్రతనిష్ఠ యమోఘమైనది. ఇతడు చెప్పినటుల చేయువాడు. చెప్పినమాటలు తప్పి బ్రతుకుటకన్న నిప్పులో కాలుట సౌఖ్యముగ సత్యనిష్ఠులు తలంతురు. ఆడినమాటల నిర్వహించుటలో గలుగు కష్టమును తలచి విడిచిపెట్టి యతిశీతలమగు చందనము పన్నీరు పుష్పములతో అలంకరింపబడినవాడై సర్వసౌఖ్యముల ననుభవించుస్థితి సత్యాత్ములకు, ధర్మనిష్ఠులగు దృఢవ్రతులకు నిప్పులో గాగుటకన్న తీవ్రమగు మనోఖేదన గల్గించును. శ్రీ వామనమూర్తికి

మూడడుగుల భూమి నిచ్చెదనని చెప్పిన తరువాత తన కులగురుడగు శుక్రాచార్యుడు నివారింపజూచినను గురు వాక్యమును గూడ నతిక్రమించి బలిచక్రవర్తి తన దృఢవ్రతమును నిల బెట్టినాడు. దీనివల్ల నేమి తేలుచున్న దనగా సత్యవ్రతుడు, ధర్మనిరతుడు అచంచలమగు నియమముగల శిష్యుడు నియమమునకు, సత్యమునకు, ధర్మమునకు దూరుడైన గురువుయొక్క వాక్యమును తిరస్కరించుటలో పాపములేదు. దానివల్ల దోషమును గలుగదు చారిత్రశుద్ధి గల వారికి నాత్మయొకటి శాశ్వతమని, నిత్యసుఖమని తలంపు గలిగియుండుటచే నద్దాని ప్రాప్తించుటలో ప్రతిబంధము గలుగ జేసెడి దేహధనాదులు గొప్పవని తలంపు గలుగదు. ఎందుకనగా నవి యన్నియు నశాశ్వతములని యతని మనస్సులో నిశ్చలమగు నిశ్చయము గలిగియున్నది. అంతేగాక యవియన్నియు నిలబెట్టచూచినను కాలక్రమముగ వీటినుండి విడుదల గలుగును అట్లుగాక అవియన్నియు తన్ను వీడిపోవుట గూడ తటస్థించవచ్చును. అపుడు తాను ఎంతప్రయత్నించినను నిలకడ చేసికొనుటకు శక్తుడుగాడు. మఱియు నొకవేళ దేహాంతమువఱకు సర్వసౌఖ్యముల ననుభవించుచుండినను అపకీర్తియస్సు గలిగి జీవించుట విషమున కన్న దారుణముగ సత్యాత్ములకు బాధగలిగియుండును. విజ్ఞులయొక్క సుఖమును తమయొక్క నూతనమగు జీవితముచే గలిగియుండును వీరు మనస్సుఖము ననుభవించెడివారు. అసత్య ప్రవర్తకులగు జడమతులు బాహ్యవస్తువులలో సుఖముగలదని భ్రమ నొందినవారలుగా నుందురు. ఇది భ్రాంతిమాత్రమే గాని నిజముగాదు. ఇదే ధర్మముయొక్క రహస్యము. శ్రీమద్భాగవతము సప్తమస్కంధమునందు శుక్రాచార్యుండిట్లనియె :—

దనుజేంద్ర యీతడు ధరణీసురుడు గాడు
దేవకార్యంబు సాధించుకొఱకు
హరివిష్ణు డవ్యయుం డతిది గర్భంబున
గశ్యపసూనుడై కలిగె నకట
యెఱుగ కీతనికోర్కి నిచ్చెద నంటివి
దైత్యసంతతి కుపద్రవము వచ్చు
నీలక్ష్మి తేజంబు నెలవు నైశ్వర్యంబు
వంచించి యిచ్చు దా వాసవునకు

మొనసిజగములెల్ల మూడుపాదంబుల
నఖిలకాయుడగుచు నాక్రమించు
సర్వధనము విష్ణుసంసర్జనము సేసి
బడుగుపగిదినెట్లు బ్రదికెదీవు॥

అర్థమునకు ధర్మయశముల కాశ్రిత
బృందములకు సమత బెట్టునట్టి
పురుషు డిందు నందు బూర్ణుడై మోదించు
దన్నుమానిచేత దగవు గాదు॥

ఈలాటి యర్థములను దెలుపు వాక్యము లనేకములు శుక్రాచార్యుడు శిష్యవాత్సల్యముతో బలిచక్రవర్తి కుపదేశించెను, అయినను బలిచక్రవర్తి మనస్సు సత్యములో తగుల్కొని యుండుటచే సత్యము యొక్క యపార మగు మహిమాతిశయమును ఎఱింగిన వాడగుటచేతను అసత్యము నంగీకరింపలేదు. అసత్యముచే గలిగెడు భాగ్యభోగ్యము లన్నియు విషముకలసిన మధురాన్నము వంటివని యతనికి తెలియును, మఱియు శుక్రాచార్యులీ క్రిందివాక్యము నుపదేశించిరి.

వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్తమాన భంగమందు
జకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము బొందదధిప॥

ఈపద్యమును సాధారణముగ సామాన్యజనులు ఎల్లప్పుడును చెప్పుచుందురు. ఇది సిద్ధాంతవాక్యముగాదు. ఇది పూర్వపక్షము. సిద్ధాంతము గ్రాహ్యముగాను, పూర్వపక్షము అగ్రాహ్యముగను ఎన్ను కొనుట శాస్త్ర నియమముగ నున్నది. బలిచక్రవర్తి చెప్పినది సిద్ధాంత వాక్యము. ఇదియే యంగీకార్యము. మఱియు శుక్రాచార్యుడు చెప్పినది యసురధర్మము. ఏలన! ఆయన యసురుడు. అసురధర్మము దైవధర్మము గలవారికి అగ్రాహ్యము. గీతయందు దైవాసుర సంపద్విభాగయోగమగు షోడశాధ్యాయమున ఈవిషయము శ్రీకృష్ణభగవానులు విస్తారముగ తెలిపియున్నారు.

"దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా" అనగా! దైవగుణము గలవారే దైవప్రాప్తికర్తులనియు, అసురగుణము గలవారు నరకగాములై బద్ధులగుచున్నారనియు తాత్పర్యము.

మఱియు శిష్యుడగు బలిచక్రవర్తియొక్క మనస్సును పరీక్షించుట కొరకు ఈలాగున చెప్పినట్లును కొందఱు పండితులు తలచుచున్నారు. "నశౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే" అని గూడ గీతాచార్యుడగు భగవంతుడే యీ యధ్యాయమున నుపదేశించెను, బాహ్యాంభ్యంతరశుద్ధియు, సదాచారప్రవృత్తియు, సత్యబుద్ధియు లేనిది యసురస్వభావమని తాత్పర్యము గనుక పైజెప్పిన "వారిజాక్షులందు" అను పద్యము సజ్జనులకు భగద్భక్తులకు దైవకృప నభింపించు వారికి తగినదిగాదు. అసత్యపురుషులకు, అధర్మ ప్రవర్తకులకు, అసుర స్వభావముగలవారికి సంబంధించినదని గ్రహించవలయును. సిద్ధాంత వాక్య మెద్దియన! ఈక్రిందవ్రాసెడు బలిచక్రవర్తి యొక్క వచనములని విజ్ఞులు గ్రహించుకొనవలయును. బలిచక్రవర్తి యీధర్మసందిగ్ధ సమయములో చాలసేపు ఆత్మలో నగాధమగు దీర్ఘచింతన చేసికొనిన తరువాత సత్యమే నిత్యమగు సౌఖ్యమని తలంచియే ధర్మకార్యము లోనికి దిగెను. గురువులవారి వాక్యమును త్రోసివేయుటకు తటస్థించుట, ఆడిన వాక్యము లేదని చెప్పుటకు తటస్థించుట, రాజ్యములు బంధువులు సర్వమును వీడిపోవునని గురుడు చెప్పుటయేగాక దేహముగూడ అపహరింపబడునను వాక్యము వినునప్పుడు ఎట్టివారి మనస్సైనను తకతక లాడక యుండునా? ఇట్టి విషమస్థితిలో ధర్మమును నిర్ధారణ మొనర్చి ప్రవర్తించిన బలిచక్రవర్తియొక్క పవిత్రతనేమని కొనియాడవచ్చును. పైవిధముగా పోతంబు బలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీలిత లోచనుడై బలి యిట్లనియె—

నిజమాన తిచ్చితి నీవు మహాత్మక
మహిని గృహస్థ ధర్మంబు నిదియ
యర్థంబు గామంబు యశమును వృత్తినియు
నెయ్యది ప్రార్థింప నిత్తుననియు

నర్ధలోభంబున నర్ధిబొమ్మనుటెట్లు
పలికిలేదనుకంటె బాపమెద్ది
ఎట్టిదుష్కర్మునినే భరించెదగాని
సత్యహీనుని మోయజాలననుచు
బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరముననుండి తిరుగక చచ్చుకంటె
బలికి బొంకక నిజమున బరుగుకంటె
మానధనులకు భద్రంబు మఱియు గలదె?

ధాత్రిని హాలికునకును సు
క్షేత్రము బీజములు నొకట జేకురుభంగిం
జిత్రముగ దాత కీవియు
బాత్రము సమకూరు నట్టి భాగ్యముగలదే?

కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరి మూటగట్టుకొని పోవంజాలిరే భూమిపై
బేరైనంగలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కెలు వారలన్ మరచిరే యిక్కాలమున్ భార్గవా!

నిరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనంబైన దు
ర్మరణంబైన గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ముపో
హరుడైనన్ హరియైన నీరజభవుండభ్యాగతుండైన నా
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య! వేయేటికిన్?

మేరువుదలక్రిందైనను బారావారంబులింకబాఱిన లోలో
ధారుణి రజమైపోయిన దారాధ్వము బద్ధమైన దప్పకయిత్తున్ ॥

అని యిట్లు సత్యపదవీ ప్రమాణతత్పరుండును, వితరణ కుతూహల సత్వరుండును, విమలయశస్కుండును, దృఢమనస్కుండును, నియత సత్యసంధుండును, నర్థిజనకమలబంధుండును నైన బలింజూచి శుక్రుండు

కోపించి మదీయశాసనం బతిక్రమించితివి గావున శీఘ్రకాలంబున బదభ్రష్టుం డవు గమ్మని శాపంబిచ్చె, బలియును గురుశాపతప్తుండయ్యు నసృతమార్గం బున కభిముఖుండు గాకుండెనప్పుడు.

బ్రదుకవచ్చుగాక బహుబంధనములైన
వచ్చుగాక లేమి వచ్చుగాక
జీవధనములైన జెడుగాక బడుగాక
మాటదిరుగలేరు మానధనులు

ఇట్టి బలిచక్రవర్తి చెప్పిన వాక్యములే పుణ్యజీవు లంగీకరింతురు గాని మాయా మోహభ్రమలో చిక్కుకొని యీప్రపంచమే సత్యమని తలంచెడి యజ్ఞుల వాక్యముల నంగీకరింపరు. దృఢవ్రతము నలుప నిశ్చయించెడి వారు ఈక్రింది నియమములను ఆత్మలో సదా జ్ఞాపకముంచు కొనవలయును అట్లైన మాత్రమే నిర్విఘ్నముగ తమయొక్క వ్రతము నెరవేరగలదు.

(1) వినరాని వాక్యములనుండి కర్ణేంద్రియమును మరల్చి వాటిని విననీయకూడదు. (2) స్పర్శింపరాని వానిని స్పర్శింపరాదు. (3) చూడరాని వస్తువుల చూడరాదు. (4) భుజింపరాని వస్తువులను భుజింపరాదు. (5) వాసన చూడరాని వస్తువుల వాసన చూడరాదు. ఇవి అయిదున్నూ జ్ఞానేంద్రియము లనబడును. వీటియొక్క నిగ్రహమే జ్ఞానేంద్రియ నిగ్రహమనబడును. అలాగున (6) చెప్పరాని వాక్యములను వచింపరాదు. (7) తాకరాని వస్తువులను తాకరాదు. (8) పోరాని స్థలములోనికి పోరాదు. ఈకర్మేంద్రియములలో పాయూపస్థలను రెండింద్రియములుగూడ గలవు. వాటియొక్క నిగ్రహముగూడ గలిగిన కర్మేంద్రియ నిగ్రహము సిద్ధించినటుల తలంచ వలెను. (9) తలంపరాని తలపుల తలపరాదు. (10) చింతింపరాని విషయములను చింతింపరాదు ఇవి రెండును నంత రింద్రియములు. వీటిలో నహంకారమును బుద్ధియు నంతర్భూతములై యున్నవి. వీటియొక్క నియమనము గలిగిన యంతరింద్రియనిగ్రహము సిద్ధించినట్లగును. దీనిని శమమనియు పైజెప్పిన దశేంద్రియనియమనము దమమనియు విజ్ఞులు దలంతురు. ఇవిరెండును నిగ్రహింపబడినచో మరల నతనికి మోక్ష మార్గమునకు అడ్డులు ఏమియు గలుగవు. ఈపుణ్యజీవికి యూర్ధ్వగమనము

సులభము: మంచి గుఱ్ఱములును, బుద్ధిమంతుడగు సారధియు గలిగిన రధికుని ప్రయాణ మేలాగున యనుకూలముగాను సౌఖ్యముగానుండునో అదియునట్టిదే. అయితే యిప్పుడు చెప్పిన బాహ్యాభ్యంతర నియమములు గలిగినను దానితో తృప్తి నొందరాదు. పరమార్ధ విషయములో నివియన్ని యు నంత గొప్పవి గావు. అన్నిటికన్న గొప్పదేమన సర్వేశ్వరుని మరచి కొంచము కాలమైనను జీవింపరాదు. ఇది యొక్కటియే అన్నిటిలోను ప్రాణము గలిగియుండునది.

అదియొకటి లేనిచో తక్కిన వన్నియు గలిగియుండినను మీజీవి తము ప్రాణములేని దేహము నలంకరించిన యెట్లుండునో అట్లుండునని మరు వకుడు. ఈనియమములన్నియు నాచరణలో మీపెట్టినమాత్రమే జీవితము పవిత్రమగును. అట్టి యాత్మశుద్ధిగలిగిన మాత్రమే మీరు ఈశ్వరదర్శ నమున కర్హులు గాగలరు. దానివల్లనే మీరు తరించవలసియుందురు. ఒకవేళ యనివార్యకార్యములు గలిగికావి, ప్రమాదవశమునగాని, పై పేర్కొన్నవానిలో దేనియందైన తప్పిదము గలిగినవెంటనే ప్రాయశ్చిత్తము జేసికొని శుద్ధాత్ములు గావలెను. అట్లుగానిచో మీజన్మము వ్యర్ధమగును. ఈలాగున నాచరించెడు వారినే యార్యులని మనశాస్త్రము చెప్పుచున్నది.

కొందఱు ఈలాగున చెప్పదురు. అది యేమన పైనుదాహరించిన భేదముల హృదయములో స్ఫురింపనీయక యంతయునేకమై అద్వయమై అభేదమైయుండు బ్రహ్మముగా జూచుటయే గొప్పదగు దృఢవ్రతమని తలంచవలెననియే. అది యొక విధముగ సత్యమైనను నట్టి యనుభవముగల మహనీయులు ప్రస్తుతము లోకములో గాన్పించుట దుస్తరము. అలాటి స్థితిలోనుండిన, దత్తాత్రేయ, శుకాది మహనీయులే పైజెప్పేలాగుననుండి వ్రతనిష్ఠ నలుపవలెనని సెలవిచ్చియున్నారు. లేనిచో నట్టిసితికి రాజాలరని బాగుగా తెలియును. సమాధి స్థితికిని, గాఢ సుషుప్తికిని శాస్త్రములో సామ్యము చెప్పబడియుండినను నీయుభయములకునెంత తారతమ్యముగలదో అలాగున నిప్పుడభేదము చెప్పువారికిని, నిజమైన బ్రహ్మజ్ఞానముచే గలిగెడు యభేదమునకును తారతమ్యముగలదు. కావున ముందుజెప్పిన దృఢవ్రతమే యాచరణీయముగాని ప్రమాదముచే గలిగెడు యభేదస్థితి మంచిదికాదు. ఈవిషయమై శాస్త్రము చెప్పిన దానిని చూడుడు.

అకర్తవ్యం న కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి।
కర్తవ్యమేవ కర్తవ్యం ఏష ధర్మస్సనాతనః॥

ప్రాణము కంఠగతముగ గలిగెడు ప్రమాదము గలిగినను చేయరాని కార్యములు చేయుటగాని, చెప్పరాని వాక్యములు చెప్పుట గాని, తలంపరాని విషయమును తలంచుటగాని చేయరాదు, పైజెప్పిన మనోవాక్కాయ కర్మలచే కర్తవ్యమును మాత్రమే యాచరింపవలయును. ఇదే సనాతనమగు ఈశ్వరధర్మము. ఈలాగున నాచరించువాడే సనాతనుడని చెప్పదగినవాడు. మఱియు నీవిషయమై జ్ఞానవాసిష్ఠములో వసిష్ఠభగవాను లుపదేశించినదానిని చూడుడు. ఆర్య లక్షణము.

కర్తవ్యమాచరన్ కామ మకర్తవ్యమనాచరన్ ।
తిష్ఠతి ప్రకృతాచారో యస్స అర్యఇతి స్మృతః ॥

ఎవడు చేయదగు దానినిచేయుచు చేయదగని దానిని జేయక ఆవశ్యకానుష్ఠానపరుడై యుండునో వాడార్యుండని చెప్పబడుచున్నాడు.

యథాచారం యథావిత్తం యథాశాస్త్రం యథాస్థితమ్।
వ్యవహారముపాదత్తే యః న అర్య ఇతి స్మృతః ।

ఎవండు, ఆచారమును, శాస్త్రమును, తాననుష్ఠించవలసిన స్థితిని అనుసరించి లోకమున వ్యవహరించుచుండునో వాడు ఆర్యుండని చెప్పబడును.

వచించిన వాక్యమును నిర్వహించుటయందు దృఢవ్రతముగల బలిచక్రవర్తి యొక్క చరిత్రము సంక్షిప్తముగ వినడమైనది.

(2) ఇప్పుడాలాగున దైవవిషయములో దృఢవ్రతము గలిగి యనుష్ఠించిన వారిలో నొకరగు ప్రహ్లాదుని జీవితసారాంశము నందఱు గ్రహించులాగున తెలుపుట కుపక్రమించుచున్నాను. ఈయన భగవద్విషయములో నిరంతరము జీవితము గడిపి యట్టి భగవద్విషయమును జనులందఱికి బోధించుటలో శ్రద్ధగలవాడు. ఇట్టి దైవవిషయమున కడు గలుగు జేసినందుచే తండ్రియొక్క మాటనుగూడ నతిక్రమించవలసివచ్చెను. సామాన్య దృష్టితో చూచిన

పితృవాక్య పరిపాలనము ధర్మముగ గాన్పించును. అయితే ఇది ధర్మయుక్త మైన దైవాజ్ఞకు లోబడి యుండు పితృవాక్యములకు మాత్రమే సంబంధించును.

ధర్మవిరుద్ధమై యీశ్వరాజ్ఞకు భిన్నమైన పితృశాసనమైనచో నాచరింప నవసరములేదని యీచరిత్రము తెలియజేయుచున్నది. ఏలన! ఈశ్వరాజ్ఞకును ధర్మమునకు భిన్నమైన కార్యముచేసినచో దానివలనపితరులు దైవకృపకు దూరులై నరకములో బడవలసియుండుటచే ప్రహ్లాదుడు దీర్ఘవిచారము గలవాడగుటచేతను, తండ్రికి గలుగబోవు విపత్తును దెలిసికొన్న వాడగుట చేతను తానుజేసినది యొకవిధమగు పితృభక్తియనియే చెప్పవలసియున్నది.

ఏలన! సత్యధర్మములతో రాజ్యపరిపాలనముచేసెడు రాజాజ్ఞను నతిక్ర మింపప్రేరణజేయు వానికిని, శాసన మతిక్రమించిన వానికిని దండనగలుగును. ప్రహ్లాదు డిట్టి ధర్మరహస్య మెఱింగిన వాడగుటచేతనే యాలాగున చేయడమైనది మఱియు దైవదృష్టినుండి చలింపకయుండవలెనని తలంపుగలిగి దృఢవ్రతము ననుష్ఠించిన ప్రహ్లాదు డెన్ని బాధలకు లోబడినను భగవచ్చింతనకు దూరుడుగాకయు, ధర్మబోధను విడువకయు నెట్లువర్తించెనో ఆలాగున దృఢవ్రతము గలిగినమాత్రమే ప్రకృతి శృంఖలనుండి జీవుడు తప్పించుకొని పోగలుగును. పరీక్ష యొకటిలేనిచో జదివినవానిని, చదువనివానిని తెలిసికొనుట కవకాశములేనట్లు సత్యధర్మములలోను, ఈశ్వర విషయములోను, అలాటి పరీక్షలేనిచో వీరియొక్క యాత్మ సంస్కారము, దైవవిశ్వాసము. ధర్మనిష్ఠ యేలాగున తెలిసికొన సాధ్యమగును? మఱియు నెన్నివిధములుగ ప్రహ్లాదుని బాధించినను మనస్సులో క్లేశముగాని, సంకటము గాని, గలుగక మామూలుగ ప్రసన్నచిత్తుడై, ద్వేషము గలుగక భగవచ్చింతన ధ్యానాదుల నెలాగున చేయుచుండెనో, యుత్తమసంస్కారమును. ధర్మములో దృఢమైన విశ్వాసమును గలవాడాలాగుననే యుండును, మఱియు దీనియందొక రహస్యము దెలిసికొన దగినదియున్నది. అదేమన? ధర్మబోధకులు, సత్యనిష్ఠులు, దృఢవ్రతులు ఎల్లప్పుడు నొకేవిధమైన బుద్ధి గలిగియుందురు. ఎల్లప్పుడు నొకేవిధమగు వాక్యములనే వచించుచుందురు. దైవమునకు ధర్మమునకు, భిన్నమైన కార్యములలో ప్రాణవినాశము గలుగజేసెడు సమయము గలిగినను మార్పుజెందరు. ప్రహ్లాదుడు సామాన్యముగ జనులందఱికిని నెట్టిధర్మమును బోధించుచుండెనో ఆ వాక్యములనే

దండనాధికారి వద్దను, మరణశిక్షను విధించెడు హిరణ్యకశిపుని సన్నిధిలోను చెప్పుచుండెను ఇదే దృఢవ్రతము గలవారి లక్షణము. అట్లు గాక జనుల హితము జూచి తనలాభము గనుకొని ఒక్కొక్కరితో నొక్కొక్క విషయము నాయా సమయానుకూలముగా మాట్లాడుటయు కార్యముల జేయుటయు సత్యధర్మనిష్ఠగలవారిస్వభావము గాదు. వ్రతపరిపాలనము గలవారికి తమయొక్క వ్రతమును చెడనీయక చూచుటలో లక్ష్యము నిలచియుండునేగాని, ప్రాణ, ధన, మానావమానములలో మనస్సు నిలకడ గలియుండదు. కనుకనే శాస్త్రజ్ఞు లీలాగున చెప్పుచున్నారు.

ప్రాణానపి పరిత్యజ్య మానమేవాభిరక్షయేత్ ।
ప్రాణాస్తరంగచపలా మాన మాచంద్రతారకమ్॥

దృఢవ్రతులు ప్రాణమును త్యజించియైనను తనయొక్క ధర్మమునే రక్షింతురు. ఏలన! ప్రాణములు నీటిలో అలలవంటివి. లేక బుద్బుదముల వంటివి అతిచంచలములైనవి. ఈనిమిషమునగాని మరు నిమిషమునగాని నశించును. అధర్మమునకులోబడి ప్రపంచభోగముల కధీనుడై యుండ జూచినను ప్రాణము శాశ్వతమైనది గాదు. అది నశించుట నిక్కము. ధర్మమైనచో; సూర్య చంద్ర నక్షత్రాదులుండు వఱకు ప్రపంచములో నిలుచునదే గాక, పరలోకమున నెల్లప్పుడు వెలుగుచుండును. ఇపుడు ప్రహ్లాదుడు బడినపాట్లను గుఱించి కొంచము శ్రీమద్భాగవతమును తెలిపెద. సప్త స్కంధము హిరణ్యకశిపుని వాక్యములు.

పంచాబ్దంబులవాడు తండ్రినగు నాపక్షంబునిందించి, య
త్కించిద్భీతియులేక విష్ణునహితుం గీర్తించుచున్నాడు. వ
ర్ధించుంజెప్పినమాన డంగమున బుత్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్ వీనివధించిరండుదనుజుల్ మీమీపటుత్వంబులన్
అంగవ్రాతములో జికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి, శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ నీయజ్ఞుం గులద్రోహి, దు
స్సంగుంగేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతి జరించెదం గులము నిర్దోషంబు గావించెదన్,

పలుపురు దానవుల్ పొడువ బాలుని దేహము లేశమాత్రము
న్నొలియదు లోపలన్ రుధిరముబ్బదు కందదుశల్యసంఘమున్
నలియదు దృష్టివైభవము నష్టము గాదు ముఖేందుగాంతియుం
బొలియదు నూతనశ్రమము పుట్టదు పట్టదు దీనభావముల్

తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుడు మాటిమాటికో
పన్నగశాయి! యోదనుజభంజన! యోజగదీశ! యోమహా
పన్నశరణ్య? యోనిఖిలపావన! యంచు నుతించుగాని తా
గన్నుల నీరు దేడు భయకంపనమేతుడు గాడు భూవరా!

పాఱడులేచి దిక్కులకు బాహువు లొడ్డడు బంధురాజిలో
దూఱడు ఘోరకృత్యమని దూఱడు తండ్రిని మిత్రవర్గముం
జీరడు మాతృసంఘము వసించు సువర్ణ గృహంబులోనికిం
దాఱడు కావరే యనడు తాపము నొందడు కంటగింపడున్

శూలములన్ నిశాచరులు గ్రుక్కక దేహము నిగ్రహింపగా
బాలుడు నేలపైబడడు పాఱడు చావడు తండ్రినైన నా
పాలికి వచ్చి చక్రధరు పక్షము మానితి నంచు బాదముల్
ఫాలముసోకమ్రొక్క డనపాయత నొందుటకేమి హేతువో?

ఒకమాటు దిక్కుంభి యూథంబుదెప్పించి
కెరలి డింభకుని ద్రొక్కింపబంపు
నొకమాటు విషభీకరోరగశ్రేణుల
గడువడి నర్భకు గరవబంపు
నొకమాటుహేతి సంఘోగ్రానలములోన
విసరి కుమారుని వ్రేయబంపు
నొకమాటు కూలంకషోల్లోలజలధిలో
మొత్తించి శాబకు ముంపబంపు

విషము బెట్టబంపు విదళింపగాబంపు
దొడ్డకొండచరుల ద్రోయబంపు
బట్టికట్టబంపు బాధింపగా బంపు
బాలు గినిసి దనుజపాలు డధిప!

ఒకవేళనభిచార హోమంబు సేయించు
నొకవేళ నెండల నుండబంచు.
నొకవేళ వానల నుపహతి నొందించు
నొకవేళ రంధ్రంబు లుక్కబట్టు
నొకవేళ దనమాయ నొదవించి బెగడించు
నొకవేళమంచున నొంటినిలుపు,
నొకవేళబెనుగాలి కున్ముఖుగావించు
నొక వేళబాతించు నుర్వియందు

నీరు నన్నంబు నిడనీక నిగ్రహించు
గళలనడిపించు బువ్వించు గండశిలల
గదలద్రేయించు వేయించు ఘనశరముల
గొడుకు నొకవేళ నమరారి క్రోధియగుచు,

మనంబున—

ముంచితివార్ధులఁ గదలమొత్తితి శైల తటంబులందు ద్రొ
బ్బించితి శస్త్రరాజి బొడిపించితి మీద నిభేంద్రపఙ్త్తి, ద్రొ
ప్పించితి ధిక్కరించితి శపించితి ఘోరదవాగ్నులందు ద్రో
యించితి బెక్కుపాట్లనలయించితి జావడిదేమిచిత్రమో!

ఎఱుగడు జీవనౌషధము లెవ్వరు భర్తలు లేరు బాధలం
దరలడు నైజతేజమున దథ్యము జాడ్యములేదు మిక్కిలిఁ
మెరయుచు నున్నవా డొకనిమేషము దైవ్యమునొందడింకనే
తెఱగున ద్రుంతువేసరితి దివ్యము వీని ప్రభావమెట్టిదో.

(ప్రహ్లాద వచనము) :—

మందారమకరంద మాధుర్యమునదేలు
మధుపంబుబోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికలదూగు రా
యంచ చనునె తరంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు
బూర్ణేందుచంద్రికా స్ఫురిత చకోరకం
బరగునే సాంద్రనీహారములకు

నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృత పానవిశేషమత్త
చిత్తమేరీతి నితరంబుజేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయునేల.

కంజాక్షునకుగాని కాయంబుకాయమే
పవనగుంభిత చర్మభస్త్రిగాక
వైకుంఠు బొగడని వక్త్రంబువక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనము లేని హస్తంబుహస్తమే
తరుశాఖనిర్మిత దర్విగాక
కమలేశు జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములుగాక

చక్రిచింత లేని జన్మంబు జన్మమే
తరళసలిలబుద్బుదంబుగాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి పశువుగాక॥

సంసారజీమూత సంఘంబు విచ్చునే
చక్రిదాస్య ప్రభంజనములేక
తాపత్రయాభీల దావాగ్నులాఱునే
విష్ణుసేవామృత వృష్టిలేక
సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే
హరిమనీషా బడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధ కారంబు లడగునే
పద్మాక్షనుతి రవిప్రభలులేక

నిరుపమాపునరా వృత్తినిష్కళంక
ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙకోదండ చింతనాంజనము లేక
తామరస గర్భునకునైన దానవేంద్ర!

(ప్రహ్లాదుని సుగుణములు):–.

ఆకారజన్మ విద్యార్థవరిష్ఠుడై
గర్వసంస్తంభ సంగతుడు గాడు
వివిధమహానేక విషయసంపన్నుడై
పంచేంద్రియములచే బట్టువడడు
భవ్యవయోబల ప్రాభవోపేతుడై
కామరోషాదుల గ్రందుకొనడు
కామినీప్రముఖ భోగములెన్ని గలిగిన
వ్యసనసంసక్తి నావంకబోడు

విశ్వమందుగన్న విన్నయర్థములందు
వస్తుదృష్టిచేసి వాంఛయిడడు
ధరణినాథ! దైత్యతనయుల్లెత్తు హరిపర
తంత్రుడై హతాన్య

పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచుః హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచుః లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మ యుగళీచింతామృతాస్వాదనం
ధానుండై మఱచెన్ సురారి సుతుడేతద్విశ్వమున్ భూవరా!

వైకుంఠచింతా వివర్జితచేష్టుడై
యొక్కడు నేడుచు నొక్కచోట
నశ్రాంతహరి భావనారూఢచిత్తుడై
యొద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణుడింతియకాని వేఱొండులేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుడను నిధానము గంటినేనని
యుబ్బిగంతులు వైచు నొక్కచోట

బలుకునొక్కచోట బరమేశుగేశవు
బ్రణయహర్ష జనిత బాష్పసలిల
మిళితపులకుడై నిమీలితనేత్రుడై
యొక్కచోట నిలచి యూరకుండు

ఓహో! యీ మహనీయునియొక్క చరిత్రమెంత పుణ్యమైనది? ఎటువంటి దృఢవ్రతము! యెంత అనన్యభక్తి! ఇంద్రియ నిగ్రహము ఏమని చెప్పవచ్చును! శారతము నెంత కొనియాడినను చాలక పోవుచున్నది. ఎంత సాధుమూర్తి! ఎటువంటి పరమభక్తుడు. అట్టి మహనీయునికి గూడ నిట్టి బాధలు గలిగినపుడు సామాన్యజనుల గురించి మరల వేమి చెప్పవలయును?

ప్రహ్లాదునికి గలిగినట్టి నిరంతర అనన్యభక్తియను ద్రావకములో హృదయమును గఱిగిన మాత్రమే ఆత్మలో చిరకాలమునుండి గలిగియుండు మాయాకల్మషము నశించి శుద్ధచిన్మాత్ర దైవసాక్షాత్కార జ్ఞానము గలుగు నని వాసిష్ఠములో శ్రీరామచంద్రులకొఱకు వసిష్ఠ మునీంద్రులచే నుపదేశింపబడెను.

తండులస్య యథా చర్మ యథా తామ్రస్యకాళిమా।
నశ్యతి క్రియయా పుత్ర పురుషస్య తథా మలమ్॥

స్వాభావికంబగు మలము పురుష ప్రయత్నముచేత నెటుల బోవు నంటివేని వినుము. తండులము (బియ్యము) యొక్క పైనున్న పొట్టు తవుడు దంపడము మొదలగు దానిచే నెట్లు పోవుచున్నదో, పులుపు మొదలగు రసములచే రాగియొక్క సామాన్య చిలుమున్నూ, స్ఫుటముచే విశేష చిలుమున్నూ ఎట్లుపోవుచున్నదో, అట్లు శ్రవణము, మననము మొదలగు బ్రహ్మనిష్ఠాది క్రియలచే పురుషునియొక్క అజ్ఞాన రూపంబగు మలమును బోవుచున్నది.

జీవస్య తండులస్యేవ మలం సహజమప్యలమ్ ।
నశ్యత్యేవ నసందేహ స్తస్మాదుద్యమవాన్ భవ ॥

పుత్రా! జీవునియొక్క మలము (అజ్ఞానము) సహజ సిద్ధంబైనను, తండులముయొక్క మలమువలె ప్రయత్నముచే నశించుచున్నది. ఇందుకు సందేహములేదు. కావున ప్రయత్నవంతుడ వగుము.

ఆత్మాక్షేత్రజ్ఞసంజ్ఞోయం సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।
తైరేవ విగతశ్శుద్ధః పరమాత్మా నిగద్యతే॥

ఈ జీవాత్మ ప్రాకృతములగు గుణములతో గూడియుండు వఱకు జీవుడనియు, క్షేత్రజ్ఞుడనియు పేరు గలిగియుండును. అట్టి ప్రకృతి గుణము లైన త్రిగుణములనుండి విముక్తి గలుగునప్పుడు శుద్ధాత్మమై పరమాత్మ యని పిలువంబడును. లేక పరమాత్మనొందుట కర్హత గలుగును.

అగ్నిసంగా ద్యథాలోహ మగ్నిత్వ మధిగచ్ఛతి।
ఆత్మసంగా త్తథాగచ్ఛత్యాత్మతా మింద్రియాదికమ్॥

అగ్ని సాన్నిధ్యమువలన ఇనుము మొదలగు లోహము లేలాగున అగ్నిమయమై మారుచుండునో యాలాగున ధ్యానబలముచే నాత్మ సాన్నిధ్యము గలుగునపుడు బుద్ధ్యాదీంద్రియములన్నియు నాత

లగును. ధ్యానమునందు చిత్తము లగ్నముగా గలిగిన జ్ఞానికి నింద్రియము లన్నియు దివ్యజ్ఞానమయములై యుండును

మనస్యేవేంద్రియాణ్యత్ర మనస్స్వాత్మని యోజయేత్ ।
సర్వభావవినిర్ముక్తం క్షేత్రజ్ఞం బ్రహ్మణి న్యసేత్ ॥

బహిర్ముఖానీంద్రియాణి కృత్వాచాభి ముఖాని వై ।
ఏతద్ధ్యానం తథా జ్ఞానం శేషస్తు గ్రంథవిస్తరః ॥

అని దక్షస్మృతి.

బహిర్ముఖములుగ నుండు ఇంద్రియము లన్నిటిని యంతర్ముఖములుగ జేసికొనియట్టి బాహ్యాభ్యాంతరిక ఇంద్రియములను మనస్సులో నైక్యపరచి యట్టిమనస్సును బుద్ధ్యాత్మయందు చేర్చి సర్వ భావములనుండి. నిశ్శేషముగ విముక్తిజేసికొని యట్టి బుద్ధ్యాత్మను క్షేత్రజ్ఞుడగు ప్రత్యగాత్మలోనికి నైక్యపరచి యట్టి ప్రత్యగాత్మను పరబ్రహ్మమునందు లయ మొందింపవలయును. ఇదే నిజమైన ధ్యాన యోగమనియు, సరియైన జ్ఞానయోగమనియు దెలియవలయును. విస్తారములగు ఇతర గ్రంథములన్నియు నీయొక విషయమునే చెప్పుచున్నవి. అనగా సమస్త వేదాన్త శాస్త్రముల యొక్కయు, యోగ శాస్త్రములయొక్కయు సార మిదియే. ధ్యానకాలములో ముముక్షువైన యభ్యాసి యిట్టి యభ్యాసము ననుభవములోనికి దెచ్చుకొనవలయును. ఇది యింద్రియముల కేకాగ్రత గలిగి స్వరూపపానుసంధాన నిష్ఠ గల వారికి స్పష్టముగ గోచరము గాగలుగును.

అయమాత్మా స్వయంజ్యోతి ర్మహానందమయశ్శివః।
అయోగినః పరోక్షస్స్యా దపరోక్షస్తుయోగినః ॥

ఈ యాత్మస్వయముగ జ్యోతిర్మయమైనది. మహానందమైనది. శివము [మాలిన్యరహితము మంగళ స్వరూపము]. అట్టి యాత్మ స్వరూపము యోగ్యులుగాని వారికిని, కుయోగులకును, అప్రత్యక్షముగ నుండును యోగ్యులైన వారికిని, జ్ఞానయోగ్యులకును ప్రత్యక్షముగ నుండును, అని జ్ఞాన తంత్రము.

బ్రాహ్మణో క్షత్రియో వైశ్యో శూద్రశ్చండాల ఏవచ ।
దృఢాభ్యాసపరో నిత్యం పునర్జన్మ న విందతి ॥

ఇట్టి యాత్మలాభ విషయములో దృఢవ్రతులై యనుష్ఠానము చేయువారు బ్రాహ్మణులైనను, క్షత్రియులైనను, వైశ్యులైనను, శూద్రులైనను, స్త్రీలైనను, చండాలురైనను, నిస్సంశయముగ పునర్జన్మ రహితమగు మోక్షము నొందగలరు. ఔషధసేవ పథ్యముగ చేయువారెవరైనను రోగమునుండి విముక్తు లగుదురు గదా!

శ్రద్ధావినయసంయుక్తః శాంతిదాంత్యాదిసంయుతః ।
యావజ్ఞానోదయస్తావద్వేదాన్తార్థం నిరూపయేత్ ॥

ఎంతవఱకు నాత్మజ్ఞానోదయము గాలేదో, అంతవఱకు శమదమాదులతో గూడినవాడై శ్రద్ధావినయ సంపన్నుడై వేదాన్తార్థమగు పరబ్రహ్మమును ధ్యానముచేతను, జ్ఞానముచేతను, అనుష్ఠింపవలయును. అనగా స్వరూపమును నిరూపణము జేసికొనవలయును. రోగవిమోచనము గలుగువఱకు సరియగు నౌషధము, తగినపథ్యమును, అనుకూలమగు వలమును గలిగియుండవలయును గదా!

సర్వధర్మసమోపేతాశ్శివ భక్తి పరాయణాః ।
ప్రసాదా దేవ రుద్రస్య జానంతి జ్ఞానవైభవమ్ ॥

సత్య, జ్ఞాన, ధర్మ, దయ, శాంత, విరక్తాదులతో గూడి ఈశ్వర భక్తియందు నిరంతరము కాలము గడిపెడు భక్తులకు పరమేశ్వరుని కరుణ వలన జ్ఞానమాహాత్మ్యము గోచరము గాగలుగును. ఈశ్వరభక్తి లేనిచో ప్రకృతి దోషములు నశించవు. ప్రకృతి దోషములు నశించనిచో మోక్షమార్గము లెస్సగ గోచరము గాదు.

త్యజ శోకమమంగల్యం మంగళాని విచింతయ ।
చిదానందఘనం స్వచ్ఛ మాత్మానం చ విభావయ ॥

నీవు అమంగళమగు శోకమును విడిచిపెట్టి శుభవిషయముల చింతించుచున్నవాడవై చిదానంద ఘనంబును శుద్ధంబునునగు ఆత్మను భావింపుము. అటిజ్ఞానము గలుగుటకు నీక్రిందివిధిని అనుష్ఠించవలయును.

దేవద్విజగురుశ్రద్ధా భరబంధుర చేతసామ్ ।
సదాగమప్రమాణానాం మహేశానుగ్రహో భవేత్ ॥

దేవతలయందును, విప్రులయందును గురువులయందును ఆసక్తిగల చిత్తముగల వారికిని, ఎపుడును శాస్త్ర ప్రామాణ్యము ననుసరించి యాచరించు వారికిని పరమేశ్వరానుగ్రహము గలుగుచున్నది యని జ్ఞానవాసిష్ఠము. నిర్వాణ ప్రకరణము.

3. ఓం ఇపుడు వీరుడును, శూరుడుననగు శ్రీ భీష్ముల గూర్చి చెప్పెద. ఈయన క్షత్రియవంశములో జన్మించినవాడైనను తనయొక్క యాచరణానుష్ఠానములవలన నాచార్యపదవి నలంకరించెను. కనుకనే భీష్మాచార్యులని పేరువచ్చినది. ఇప్పు డేలాగున వ్యాకరణ. న్యాయ, సాహిత్య, వేదాన్త, ఆచార్య పరీక్షలు గలవో యాలాగున నప్పుడుగూడ నుండెను. ఈయన గొప్ప కర్మయోగియు, బ్రహ్మనిష్ఠుడును, అస్ఖలిత బ్రహ్మచారియుగా నుండెను. భారతీయు లందఱును ఈ మహాపురుషుని దివ్యజీవితమును స్మరించి యిప్పుడు తరించవలసి యున్నారు. ఇట్టి శ్రేష్ఠపురుషుడుగూడ మనభారతదేశములో జన్మించినవాడే. ఈయన బ్రహ్మచర్యవ్రతమును నిల బెట్టుటలో చూపిన దృఢవ్రతము ప్రతి బ్రహ్మచారులును, ముముక్షువులును స్మరణలో నుంచుకొనతగినది. ఆపరమపురుషునికి గల్గిగిన దివ్యశక్తు లన్నియు, మహాధీరత్వమున్నూ బ్రహ్మచర్యవ్రతము వలననే సిద్ధించినవి. ఇట్టి పరమపవిత్రమగు వ్రతము ననుష్ఠించుటలో తనయొక్క గురుడగు శ్రీపరశురామునిగూడ తిరస్కరించవలసి వచ్చెను. అంతియే గాక తల్లి మాటను గూడ కడగ ద్రోసివైచి తాను పట్టిన దివ్యవ్రతమును చెడనీయక చూచుకొనెను. ఇట్టివానికే దృఢవ్రత మని పేరు. ధర్మ యుక్తమై యధ్యాత్మ జ్ఞాన సంరక్షణార్థమై లోకోద్ధారక విషయమై ఈశ్వరానుగ్రహము గలుగ జేసికొను విషయమై యడ్డుగలిగినచో తల్లి, తండ్రి, గురువు, వీరల వాక్యముల నైనను అతిక్రమింప వచ్చును. అయితే యిది యతీత విషయములందు మాత్రమే చెల్లును. అట్లుకాని విషయము లన్నిటియందును, మాతా, పితృ, గురువుల వాక్యములను శిరసావహించవలెను. ఈ భీష్మాచార్యుల చరిత్రము భారతమున విస్తారముగ గనందగును. ఇచ్చట సంక్షిప్తముగ్గా చెప్పెదను. ఆదిపర్వము చతుర్థాశ్వాసము.

వ॥ అత్యంత శోకార్ణవమున మునిగిన తల్లిని, మరదండ్రను, నాశ్వాసించి, యరాజకంబైన రాజ్యం బకలంకంబుగా బ్రతిపాలించుచున్న కొడుకు నఖిల ధర్మవిదు గాంగేయుంజూచి సత్యవతి యిట్లనియె.

శంతనుసంతానంబున
సంతతకీర్తియును బిండసంస్కృతియును న
త్యంతమహీభారమును బ
రంతప నీయంద చిరతరంబై నిలిచెన్.

జననుత సర్వధర్మవులు సర్వజగత్ప్రవర్తనక్రమం
బును మఱిసర్వవంశములుబుట్టిన మార్గమునీవనిక్కవం,
బనఘయెఱుంగుదున్నత గుణాఢ్యుడవుꣳ భరతాన్వయావలం
బనుడవు నీవనిన్నొక్కడు పంచెదజేయుము మత్ప్రియంబుగాన్॥

ఇక్కురు వంశంబున నీ
వొక్కరుడవ యున్నవాడ వుర్వీరాజ్యం
బెక్కటి సేకొని తేజము
దిక్కులవెలిగింపు సంతతియు మొగిꣳ

నిరతంబు బ్రహ్మ మొదలుగ
వరుసన యెడతెగక యిట్లువచ్చిన వంశం
బురుభుజ నీవుండగ నీ
తరమున విచ్ఛిన్నమగుట ధర్మవె యనినన్.

విని భీష్ముడనియె మీకి
ట్లనియానతి యీగదగునె యమ్మెయినాప
ల్కిన పల్కులు గుఱి నాతా
ల్చినవ్రతమును జెఱుప నంత చిఱుతనె చెపుడా'

హిమకరుడు శైత్యమును న
ర్యముడు మహాతేజమును హుతాశనుడుష్ణ

త్వము విడివిరేని గుర్వ
ర్థము నాచేకొన్నిన సద్వ్రతంబు విడతునే.

పృథివ్యాది మహాభూతంబులు గంధాది గుణంబుల నెట్లు విడువనట్లు యేనును గురుకార్యంబున మీ శల్కార్థంబుగా సర్వజన సమక్షంబున నా చేసిన సమయస్థితి విడువను.

అని దృఢవిషయమై భీష్ముడు జెప్పిన గంభీరవాక్యాక్షరముల భారతదేశమునబుట్టిన ప్రతి స్త్రీ పురుషులును ననుష్ఠింపదగినవారేగదా! చంద్రుడు చల్లదనమునువిడిచియు, సూర్యుండు ప్రకాశమును, అగ్ని యుష్ణమునువిడచియు నేలాగున యుండజాలరో, యాలాగున వ్రతనిష్ఠుడు తన నియమమును విడిచి జీవింపజాలడని భీష్ముండు తల్లితో జెప్పి మఱియు గంధమునువిడచి పృథివి యెటులుండదో, రసమును పేక్షించి జల మేలాగున నిలువదో, ఉష్ణము నుపేక్షించి యగ్ని యేలాగున నుండదో, స్పర్శను పేక్షించి వాయువు ఏలాగున నిలువదో. శబ్దమును త్యజించి, ఆకాశమేలాగున నుండదో, యాలాగున దృఢవ్రతుడు నిశ్చయాత్మకమగు తనవ్రతమును పరిత్యజించి జీవింపజాలడు. ఓహో! యెటువంటి ప్రతిజ్ఞ. ఆ మహాత్ముని హృదయ నిశ్చయ మెంత పావన మైనది?

ఇక ఈ విషయమై యుద్యోగపర్వమున చతుర్థాశ్వాసమున గనందగిన విషయము గలదు. కాశీరాజు కుమార్తెలలో పెద్దదియగు అంబయను పేరు గలది భీష్ముని వివాహము జేసికొను విషయమై యెన్నియో ప్రయత్నముల జేసియు, విఫలమైనందుచే అందరును భీష్మాచార్యుల గురువగు శ్రీపరశు రాముని వద్దకు బంపి యాయన జెప్పినచో శిష్యుడగు భీష్మాచార్యుడు తప్పక వివాహముంగీకరించునని జెప్పినందుచే యాలాగున నాకన్యక యత్యధిక భక్తివినయభావములతో శ్రీపరశురాము నాశ్రయించినందుచే శ్రీపరశు రాముడు రాచకుమార్తెనుకూడ తెచ్చి భీష్మునితో జెప్పిన విషయ మిచట యను సంధేయము. గ్రహించవలెనని తాత్పర్యము.

అనిపలికి పరశురాముడు,
శస్త్రమెంతైనను మునిజనంబు సమ్మదమునదో

జనుదేర గురుక్షేత్రం,
బునకుద్ధతి గాశి రాజ పుత్రిం గొనుచుఞ్.

వచ్చి సరస్వతీ తీరంబున విడిసి తనరాక నాకెఱింగించిన నేను ఋత్విక్పురోహిత ప్రభృతి విశిష్ట బ్రాహ్మణ సమేతంబుగా, బూజా ద్రవ్యం బులగొని తత్ప్రదేశంబున కరిగిన నమ్మహాత్ముండును మదీయ భక్తి వినయ సంభ్రమంబులు సంప్రీతి నభినందించి యర్చనలు గైకొని కాశిరాజ కన్యకం జూపి నాతో నిట్లనియె.

బలిమి మున్నేల తెచ్చితిప్పడతి మగుడ
ద్రోచి పుచ్చంగ దగునయ్య నీచవృత్తి
వచ్చె దీనిదమ్మునికి వివాహమింక
నైన జేయుము చెలుచుట యనుచితంబు.

అనుటయు ననఘా తెలియఞ్
వినుమిది నాతోడ సాళ్వ విభునకునేగూ
ర్చిన బానసతని పాలికి
ననుపుము నన్నినగాదె యనిచితి మగుడఞ్.

ఇంక నాతమ్మునికి దీని నెట్లు పెండ్లి
సేయనేర్తుతు ననుడునా చెప్పినట్లు,
సేయవైతేని నిన్నునీ చెలులఁజుట్ట
ములన్నుజంపుదు ననియె నమ్మునివరుండు.

ఏనువినయంబు వదలక వినతుండనగుచు వివిధవాక్యంబు లంతెఱుప నంతకంతకు నతనికి గోపంబగ్గలంబైన వెండియు,

గురుడవై సమగ్ర కోదండవిద్యామహత్త్వమిచ్చినాడ వలుగదగునె?
కారణంబు లేక యారసమెత్తియిట్లనిన బరశురాముడాగ్రహమున

గురుడనినన్నెరుంగు దనఘుండవు నావనరంబునం దనా
దరణము సేసి తెన్నియు విధంబులబత్కొటు భక్తితోడ నీ

వెరవులు కు్కమీయబల వేగమ పెండిలి సేయుమంతతో
మరలుపదియకోపశిఖి మానదు వేరొక వేయుజేసినన్.

అనిన విని ధర్మాచరణంబున కింతవట్టి పెనంగనగునె. పరానురక్త చిత్తయగు మగువ నిల్లాలింజేయువారుంగలరె, యిట్టి యకృత్యంబాచరించు కంటె నీచేత నెట్లయినను లెస్సతొల్లి పెద్దలు సెప్పినచొప్పునపధరింపుమని యిట్లంటి.

గర్వియైకార్య మిట్టిద కార్యమిట్టి
దనియెఱుంగక లోకంబు చనుపథమున,
దిరుగకున్మద వృత్తివర్తించునట్టి
వాని గురువైన దండింప వలయునండ్రు.

అనుమాటకు గాలానల
మునుబోలెను మండికయ్యమున కాయితమై
మొనలేర్చి వేగయిచటికి
జనుదెమ్మని భార్గవుండు సంరంభమునన్

శ్రీ పరశురాముడు వివాహము చేసికొనెదవా లేక యుద్ధమునకు సిద్ధముగనున్నావా యనిభీష్ముని కోపముతోనడుగ యుద్ధములో ప్రాణములను గోల్పోయినను తాబట్టిన వ్రతమును విడువతలంచుట లేదని సమాధానము చెప్పెను. ఓహో! యెటువంటి పరిశుద్ధహృదయము. ధర్మములో గల దృఢ విశ్వాసమేమని చెప్పవచ్చును. అయితే పరశురాముల వారి కోపోజ్జ్వలితవాక్యముల వినునపుడు భీష్ముని మనస్సుగూడ కొంచెము అశాంతి గల్గినట్లు ఈ పద్యముచే గోచరమగుచున్నది. లేనిచో "గర్వియై కార్యమిట్టి దకార్యమిట్టిదని" చెప్పియుండడు. అయినను భీష్ముడు తర్తరి రాజ్యపరిపాలనమునుగూడ చేయుచుండువాడగుటచే ధర్మాధర్మముల నతిక్రమించి స్వేచ్ఛాప్రవర్తకుడై యుండు వారిని తల్లి, దండ్రి, గురు వను అభిమానముంచక ధర్మబద్ధముగ సర్వజనులకు నేదండన ధర్మశాస్త్రమున విధింపబడియున్నదో యాలాగున చేయుటయే సత్యధర్మ నిష్ఠగలరాజుయొక్క విధియని ధర్మశాస్త్రములో గలదు. గాన అట్లు చెప్పియుండును. అయినను మనుస్మృతి యందు ఈ విషయమై మనువు విధించినది చూడందగును.

ఆచార్యంచ ప్రవక్తారం పితరం మాతరం గురుమ్ ।
న హింస్యాద్బ్రాహ్మణాన్ గాశ్చ సర్వాంశ్చైవ తపస్వినః॥

వేదాధ్యాపనము చేయు నాచార్యుని, వేదభాష్యము మున్నగువాని యర్థమును బోధించెడు ప్రవక్తను, తండ్రిని తల్లిని, ఆత్మజ్ఞానము నుపదేశించెడు గురువును, బ్రహ్మనిష్ఠులగు బ్రాహ్మణులను, గోవులను తాపసులను బాధింపరాదు. ఒకవేళ ప్రమాదముచే కొంచెమైన తప్పిదము పైవారిలో గలిగిన హితమగు నీతిని చెప్పవలసినదేగాని దండింపరాదు. భీష్మాచార్యులకు గలిగిన శక్తి బ్రహ్మచర్యవ్రతము చేతను బరిశుద్ధమగు వ్రతనిష్ఠచేతను సిద్ధించినది.

ధర్మ్యం యశస్యమాయుష్యం లోకద్వరయరసాయనమ్ ।
అనుమోదామహే బ్రహ్మ చర్యమేకాంతనిర్మలమ్॥

బ్రహ్మచర్యమహిమ చెప్పబడు చున్నది. ధర్మము లన్నిటికిని యాధారమైనట్టియు, యశస్సుకు మూలమైనటువంటియు, దీర్ఘాయుస్సునకు హేతువైనట్టియు, పవిత్రతను గలుగచేయునదియు, ఇహలోకమునను పరలోకమునను దివ్యరసాయనమువంటిదియు అనగా దేహశుద్ధికిని ఆత్మశుద్ధికి కారణమగు బ్రహ్మచర్యము బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమున కాధారమైనదని గ్రహించవలయును.

బ్రహ్మచర్యమున కిట్టి మహిమగలదని మనువుపదేశించెను:-

అబ్ధివద్ధృతమర్యాదా భవన్తి విగతాశయాః।
నియతిం న విముంచన్తి మహాన్తో భాస్కరా ఇవ॥

మహనీయులు ఎంత మహిమగల వారైనను తమ నీతి నతిక్రమించి యే కార్యమును చేయరు, ఎట్లన సముద్రము అతి మహిమగలదైనను తన హద్దులోపల నిలచునేగాని కట్టదాటి భూమిని ముంచుటలేదు. అలాగున సూర్య, చంద్ర,బృహస్పతులు మొదలగు గ్రహములు కూడ మహాప్రభావము గలవైనను తమయొక్క జ్యోతిశ్చక్రరేఖనుండి తొలగుటలేదు. ఈలాగున మహాయోగశక్తిగాని, తపశ్శక్తిగాని గలిగిన మహాత్ములైనను తమ ధర్మము నతిక్రమించి యే కార్యమును చేయరు.

వ్రతయజ్ఞతపోదాన హోమస్వాధ్యాయవర్జితమ్।
సత్యశౌచపరిభ్రష్టం సంన్యాసం నైవ కారయేత్॥

వ్రతము, దైవయజ్ఞము. తపస్సు, శక్తికొలది దానము, హోమము, వేదము, ఉపనిషత్తు, భగవద్గీత మొదలైనవాటి యధ్యయనము, సత్యనిష్ఠ బాహ్యాభ్యంతరశుద్ధి మొదలగు యాత్మశుద్ధికి హేతువులైన యుత్కృష్టానుష్టానములు లేనివారికి, బ్రహ్మనిష్ఠ సిద్ధింపనందున, అట్టివారికి సంన్యాసమును కలుగచేయరాదు. అనగా పైజెప్పిన యనుష్ఠానము లేనివారికి అంతఃకరణాదీంద్రియములు శుద్ధములు గానిచో బ్రహ్మనిష్ఠయందు నిలకడ కుదరదు. అయితే వ్రత, స్వాధ్యాయ, తపస్సులు మితముగ నుండవలసినవేగాని, శరీరమును మిక్కిలి శుష్కింపజేయులాగుననుండరాదు. ఏలన! కొన్ని దారుణములగు ఔషధములు రోగమును రహితముజేయ శక్తిగలవైనను, శరీరబలమునకు నిర్వహింప శక్తిలేని (మించిన) యౌషధమైనచో నది రోగమును రహిత మొనర్చుటకు ముందుగా శరీరమును రహితము చేయును. అలాటి మూర్ఖత్వము అవివేక స్వభావమున్నూ ఉండరాదు. కనుకనే యీ విషయమై శాస్త్ర మీలాగున నుపదేశించుచున్నది.

భయం క్రోధమథాలస్య మతిస్వప్నాతి జాగరమ్।
అత్యాహారమనాహారం నిత్యం యోగీ వివర్జయేత్ ॥

భయము, కోపము, సోమరితనము, ఎక్కువనిద్ర, అతి జాగరణము, మితిమీరిన భోజనము, నిరాహారము మొదలగునవి ధ్యాననిష్ఠులచే విసర్జింపదగినవి.

ఉదయతి యది భానుః పశ్చిమే దిగ్విభాగే,
ప్రచలతి యది మేరుః శీతతాం యాతి వహ్నిః।
వికసతి యది పద్మం పర్వతాగ్రే శిలాయాం
నభవతి పునరుక్తం భాషితం సజ్జనానామ్॥

సూర్యుడు పశ్చిమదిగ్భాగమున నుదయించినను, మహా మేరువు స్వస్థానమునుండి చలించినను, అగ్ని శీతలత్వము నొందినను, పర్వ

తాగ్రమున కఠినశిలలపై తామరపువ్వులు పూసినను, సజ్జనులైన దృఢ వ్రతులు తాము జెప్పిన వాక్యము నతిక్రమింపరు.

విషయేంద్రియయోర్యోగే భవతి సుఖంయన్నిమేషసమయేన
విషయే నష్టే దుఃఖం యావజ్జీవంచ తత్తయోర్మధ్యే॥

వ్రతనిష్ఠకు భంగము గలిగి యల్పసుఖమగు ప్రపంచ సుఖములో బడిపోయినచో గలిగెడు కష్టములు ఈశ్లోకముచే తెలిసికొనందగినవి. ఇంద్రియములకు విషయములతో సంబంధము గలుగునప్పుడు ఒక నిమిష సమయములో గలిగెడు సుఖములకు వశపడినచో ఆవిషయములనుండి విడుదలనొందిన యుత్తరక్షణములోనే దుఃఖము గలుగుచున్నది. అట్టి దుఃఖమో, జీవితాంతము వఱకు నీయాత్మను పీడించుచుండును. అనగా విషయములచే నొక నిమిషము సుఖము గలిగినను మరల గలిగెడు దుఃఖము ప్రాణాంతమువఱకు బాధించుచుండును.

ఉదారస్య తృణం విత్తం శూరస్య మరణం తృణమ్।
విరక్తస్యతృణం భార్యా నిస్పృహస్య తృణం జగత్॥

ఉదార స్వభావము గలవారు ధర్మకార్యము తటస్థించునప్పుడు ధనమును తృణముగ తలంచి వ్యయపరచుదురు. శూరుడైన క్షత్రియునకు యుద్ధములో మరణము తృణముగా నుండును. వైరాగ్యశీలుడగు మహాపురుషునకు భార్యతోగల విషయభోగము తృణముగ నుండును. నిస్పృహుడైన వానికి నీజగత్తంతయు తృణప్రాయముగ నుండును.

క్రోధ ఏవ మహాన్ శత్రుస్తృష్ణా వైతరణీ నదీ।
సంతోషో నందనవనం శాంతిరేవహి కామధుక్॥

శత్రువులందఱికంటె కోపమే తనయాత్మకు గొప్పశత్రువు. పాప భూయిష్ఠమై నరకాగ్నిగ ప్రజ్వలించుచుండు వైతరణీ నదికన్న తృష్ణ (విషయేచ్ఛ) అతి దారుణమైనది. సంతోషముకన్న మించిన స్వర్గములేదు. కోరికల నెల్లనిచ్చు కామధేనువుకన్న శాంతము ఉత్కృష్టమైనది.

ఆచారాద్విచ్యుతో విప్రో నవేద ఫలమశ్నుతే।
ఆచారేణతు సంయుక్తః సంపూర్ణఫలభాగ్భవేత్॥

వేదములను కడవఱకు చదివి, వేదార్థములను చక్కగ గ్రహించిన వాడైనను, ఆచరణలేనిచో కొంచమైనను ఫలము గలుగదు. మంచి యాచరణతో గూడి యనుష్ఠానముగల వాడైనచో ననుష్ఠానము లన్నిటి యొక్క పూర్ణఫలము ననుభవింపగలుగును.

పరాన్నేనతుభుక్తేన మైథునం యోఽధిగచ్ఛతి।
యస్యాన్నం తస్య తేపుత్రా అన్నాచ్ఛుక్రం ప్రవర్తతే॥
అన్నాత్తేజో మనః ప్రాణశ్చక్షుశ్శ్రోత్రం యశో బలమ్।
ధృతిస్స్మృతిస్తథా శుక్రం పరాన్నం వర్జయేద్బుధః॥

పరాన్నముచే గలిగెడు దోషము ఈరెండు శ్లోకములచే చెప్పబడు చున్నది. అదియు నపవిత్ర మార్గముతో వచ్చెడు పవిత్రాన్నమైనను పాపాన్నముచే గలిగెడు దోషమే గలుగును. మఱియు నీవాహారమైన నది మఱింత యాత్మను చెఱచును. ఏలన? మనుజుడు ఏయన్నమును భుజించునో యదియే రక్తమై, శరీరమై, ఇంద్రియములై మనస్సై మారుచుండును. పరాన్నము భుజించెడు స్త్రీపురుషులకు ఆ యన్నమువల్లనే శుక్రశోణితము లేర్పడుచున్నవి. దానివలన గలిగెడు సంతానములు గూడ నట్టి స్వభావము గలవియైయుండును. కావున తల్లిదండ్రులు ఉత్కృష్ట సంతానమును గని వంశపావనముచేయ తలంచిన నాహారమున జాగ్రత్తను సంపాదించు కొనవలయును. అన్నము చేతనే తేజస్సు, మనస్సు, ప్రాణము, చక్షువు, శ్రోత్రాదీంద్రియములు, యశస్సు, బలము, ధారణాశక్తి, (గ్రహణ) మహిమ, అస్థి, మజ్జ, శుక్లము మొదలగునవన్నియు నేర్పడుచున్నవి. కావున బుద్ధి మంతుడు పరాన్నమును, పాపాన్నమును, దుష్టాన్నమును విడువవలయును. లేనిచో మనశ్శాంతియు, సత్యబుద్ధియు, ఇంద్రియనిగ్రహమును గలుగవు.

4. ఇప్పుడు భారతదేశమునకు గౌరవము, నశియింపని యశస్సునూ ప్రత్యేకముగ నారీమణులకు అచంచలకీర్తియు తెచ్చిన వీరవనిత లలో నొకతెయగు శ్రీ సావిత్రీచరిత్రను చెప్పెద. ఈనారీమణియు దృఢ

వ్రతనిష్ఠగలవారి చరిత్రలలో పేరెన్నికకు వచ్చినది. రాచకుమార్తెయయ్యు బాల్యకాలములోనే వనములో తపంబొనర్చుచుండు పతిసాన్నిధ్యముజేరి భర్తృశుశ్రూషయు, దైవభక్తియు, తపశ్చర్యయు, వ్రతనిష్ఠయు గలిగిన పుణ్యవతి. భారతమున అరణ్యపర్వములో శ్రీ మార్కండేయ మహర్షి ధర్మరాజునకు నీపావనచరిత్రమును తెలిపెను. అచ్చోట నీ చరిత్ర విస్తారముగ గనందగును ఇచ్చట సంక్షిప్తముగా దెలిపెద.

ఇట్టి పుణ్యవతులెందరో జన్మించిన మన భారతదేశ మిప్పటి కిట్టి దీనావస్థకు వచ్చుట చూచిన నెవరిమనస్సు నీరుగాకుండును? దైవచింతనము, తపస్సు, బ్రహ్మచర్యాది వ్రతనిష్ఠలు, క్షయించి పోయినందుననే యిట్టి దీనావస్థకు లోకము జారిపోయినది· మరల లోకోద్ధరణము గావలసియుండిన బ్రహ్మచర్యాద్యాశ్రమములును, వానప్రస్థుల తపోవనములును, సన్యాసుల ధర్మబోధలును ఏర్పడవలయును. ఈ చరిత్రలో సామాన్య జనులకు గలిగియుండు ఒక కుశంకనివృత్తిగాగలదు. అదేమన! స్త్రీలు చేయుచుండు దైవకార్యములచే గలిగెడు ఫలితము భర్తలకు చెందదనియు, అదిభార్యలకు మాత్రమే ఫలమిచ్చుననియు జెప్పుచుందురు. ఇందువలనగాబోలు స్త్రీలు బ్రహ్మనిష్ఠాది దైవకార్యము లాచరించుటకు పురుషులు సహింపకున్నారు. పురుషులుజేసిన పుణ్యములో నొకభాగము భార్యలకు లభించుననియు, అందువలన భర్తలుచేయు దైవకార్యములలో భార్యలు పాల్గొన్న బాలు ననియు నిర్బంధింతురు. ఓహో; యెంత యంధవిశ్వాసము చేయువారికిని చేయించెడి వారికిని,ప్రేరేపించెడి వారికిని, చూచి సంతోషించు వారికిని కర్మఫలము సమానముగ గలుగునని చెప్పెడు శాస్త్రవాక్యమును వినుటలేదే. ఇట్టి సందేహము ఈ సావిత్రీ చరిత్రముచే తొలగిపోవును. సావిత్రి యనియు! గాయత్రియనియు, సరస్వతియనియు చెప్పెడు ఈమూడు పేర్లును నొకటియే.

మార్కండేయుడు ధర్మరాజునకు సావిత్రి ఉపాఖ్యానంబు సెప్పుట.

కలడు మద్రదేశంబు ఘను డశ్వపతియను
ధరణీశు డతడు సంతానకాంక్ష
నెంతయు ధృతి బదునెనిమిది యేడులు
సావిత్రి గ్రొల్చె నజ్జనవిభునకు

నద్దేవి ప్రత్యక్షమై వరమడుగుము
నావుడునతడు వినమ్రుడగుచు
నాత్మజు గోరెద నవపుడు గన్నియ
పుట్టు నీకనియె నాభువనమాత

యనుడుదేవి భవత్కృపనస్మదీయ
వాంఛితము సఫలంబు గావలదెయని నృ
పోత్తముడు విన్నవింప నయ్యోగమూర్తి
గాఢకారుణ్యవికచ హృత్కమల యగుచు.

ఏను నీమనోరథంబు తెరంగు మున్ను చతుర్ముఖున కెఱింగించిన నతండు గన్నియగ నిర్దేశించె, అద్దేవుని యానతి యమోఘంబు వినుమక్క న్నియ కారణంబున నీకు నొక్కవిధంబున వంబిడప బుత్రశత లాభంబునగు సంతసిల్లుమని యనుగ్రహించి యద్దేవి యంతర్ధానంబు నొందె నయ్యశ్వపతి యును సావిత్రీ ప్రసాదంబున నిజధర్మ పత్నియయిన మాళవియందు సావిత్రియను కూతుంగని యక్కన్నియ నతి గౌరవంబునం బెనిచెనంత.

ఆవనజాక్షి పరిస్ఫుట
యౌవనయై సిద్ధసాధ్యయ క్షామరక
న్యావళి దనసౌందర్య
శ్రీవిలసనరేఖ నపహసించుచు నొప్పెన్.

కోరి జనపతి దన కూర్మికూతుజూచి
గుణవయోరూపముల కనుకూలుడైన
భర్తనెమ్మెయిదీనికి బడయువాడ
నొక్కొయని యెడ్డదడవుచు నుండెనెలమి.

అదియును సాళ్వపతియైన ద్యుమత్సేను కొడుకు సత్యవంతుండు రూపవంతుండనియు, గుణవంతుండనియును విని వానియందు జిత్తంబు దగిలియున్నను సిగ్గు పెంపున నెవ్వరికి నెఱింగింపకుండె. నంత నొక్క

నాడమ్మద్రపతికడకు నారదుండరుగు దెంచిన నతండమ్మహాముని నుచిత సపర్యాపరితోషితుం జేసి సద్గోష్ఠి విశేషంబు సలుపుచున్నయెడ న త్తరి దాసీజనులతో సావిత్రివచ్చి తండ్రికి నమస్కరించి భయభక్తి గలిగియుండ, నారదుం డమ్ముద్దియంజూచి యశ్వపతితోడ నిక్కన్నియందగినవరున కొసంగక యిట్లేల యునిచినాడ వనిన నతండు గూతున కిట్లనియె.

తల్లి నీగుణరూప వృత్తములకెందు
దగినవరు గాంచనై తిని దడవి కొన
నీమనస్సున కెక్కిన నృపకుమారు
గోరి వరియింపు మిదియ నాకును బ్రియంబు.

అనిన నదియు గొండొక లజ్జించి కోర్కె పెంపున సిగ్గు దొలగంద్రోచి ప్రకట కౌతూహల తరళితాంతరంగయగుచు దండ్రికి నల్లన యిట్లనియె.

చిరకీర్తిసాళ్వభూవరు
వరతనయుండయిన సత్యవంతుడు నాకుఁ
వరుడుగ గోరుదు మదిలో
నరవర యాతనికి నిమ్ము నను బ్రీతిమెయిన్.

సాళ్వపతి యిప్పుడ దైవయోగంబునంజేసి విగతచక్షుండయి తన రాజ్యంబు వైరులచేతం గోల్పడి పుత్రదార సహితంబు వనంబున నున్న వాడెట్లయినను సత్యవంతునే వరియింతుననిన మద్రేశ్వరుండు నారదుంజూచి మునీంద్రా! మీ యెరుంగని వారులేరు. సావిత్రిచేత వరియింపబడున కుమారుండెట్టివాడు. వాని గుణరూప శీలంబు లెఱింగింపుడనిన నారదుం డిటనియె—

సత్యంబు పలుకుట సత్యవంతుండన
నతడొప్పు మఱియు జిత్రాశ్వుడనగ
నామాంతరంబు నన్నరనాథసుతునకు
గలదు తేజంబున గమలమిత్రు

బుద్ధి నింద్రాచార్యు బురుడించు శూరత
వాసవు దాలిమి వసుధబోలు
గాంతి జంద్రునకైన గాదగు రూపున
నాశ్వినేయుల నరియన దలిర్చు

దపము శమము దమము దానంబు బ్రాహ్మణ
భక్తియును మహాప్రభావతయును
నతనియందకాని యన్యులయందు లే
దింత నిక్కువము మహీతలేశ!

వానియందు[illegible] గీడు నొక్కటియు గలదు. నేడు మొదలుగా నొక్క సంవత్సరంబునకు మృతింబొందు నిది నీకు జెప్పవలయుటం జేసి చెప్పితిననిన నతండు గూతు మొగంబు సూచి తల్లీ యిమ్మహాత్ముండు దేవరహస్యంబు లెఱుంగు నీతనివచనం బమోఘంబు నీకు నట్టివరుండేల యొండొక్కవరుని వెదకికొమ్మనిన నక్కన్నియ దండ్రి కిట్లనియె.

వినుము మనోవాక్కాయము
లన మూడు దెఱంగులందు నంతఃకరణం
బనఘ ప్రధానము గావున
మనమునగైకొన్న భర్త మానందగునే?

సత్యవంతుండెట్టివాడైన నగుంగాని యేనింకనొరుల వరియింప నొల్లననిన నశ్వపతి నారదు దెస చూచుటయు నతండిట్లనియె.

గొనముల ప్రోక నీయనుగు గూతురు దీని తలంపు మాన్పగా
మనకు నశక్యమింక ననుమానములేల నరేంద్రయింతి జ
య్యన నృపసూతికిమ్ము కమలాసన చేసిన పుణ్యగౌరవం
బున నయినం బ్రియుండు పరిపూర్ణచిరాయురుపేతుడయ్యెడున్,

అనిన నమ్మహీపతి యమ్మునిపతికి మ్రొక్కి నీవు మాకుం బరమగురుండవు. నీయానతిచ్చినట్ల చేసెద ననిన నారదుండు వారిదీవించి దివంబునకుం జనియె నంత.

అమరబుణ్యదినంబునందు బాంధవమంత్రి
వృద్ధపురోహితవితతతితోడ
సావిత్రి దోడ్కొని జననాయకుండు వై
వాహికమహనీయ వస్తుకోటి
గొనుచు బుణ్యారణ్యగోచరుండై తప
స్విరుడైన యాద్యుమ త్సేనుకడకు
జనిన నారాజుచు సంభ్రమంబున నశ్వ
పతికి నర్ఘ్యాది సంభావనంబు

లాచరించి సముచితాభిమతాలాప
పూర్వకముగ సుజనపూజ్యు డతని
యాగమననిమిత్త మడిగిన మద్రే
శు డెలమి సాళ్వపతికి నిట్టులనియె.

ఈకన్నియనాకూతురు
మాకులమునకెల్ల దేవమనుజోత్తమ ని,
వీకన్నియ గోడలుగా
గైకొనుము మదీయవచనగౌరవబుద్ధిన్.

అనిపలికి సావిత్రి నతనికి నభివందనంబు సేయించి మౌళియు[illegible].

నీకొడుకు సత్యవంతున
కీ కన్నియదగు నరేంద్ర యీకన్నియకున్
నీకొడుకుదగు ననన్యగు
ణాకరు లియ్యరువురును సముచితమూర్తుల్.

అనిన నతనికి ద్యుమత్సేనుండిట్లనియె.

విగతరాజ్యులమై ఘోరవిపినములకు
వచ్చియిమ్మెయి దపమున్నవారమేము

బాలసుకుమారి యిది జనపాల యడవి
నుండి మాతోడియిడుమకు నోర్చునయ్య

అనిన నశ్వపతి యతని కిట్లనియె.

కలిమియు లేమియుఁ సతముగావవి సెందినచో జెలంగుచుం
గలగుచునున్కి ధీరుల ప్రకారమేలెస్సగ నింతపట్టునే
దెలియుదుజెప్పెదఁ వసుమతీవర! పిన్నయనంగనేలనే
కొలదియుగాదు ధీరమతి గూతురు పేర్కొన జాలబెంపునన్.

నీతోడవియ్యమందం
జేతోగతి నాసజేసి చెచ్చెరనిట్లే
నేతెంచితి మత్ప్రార్థన
ప్రీతిగజేకొనగయునికి పాడియె నీకుఁ.

—: సావిత్రి సత్యవంతుని వివాహంబగుట :—

అనుటయు నయ్యంధ నృపతి తత్సంబంధమునకు సంతసిల్లి నిజాశ్రమ వాసులైన మునులంగూర్చికొని శుభలగ్నంబున సత్యవంతునకు సావిత్రిం బరిణయంబు సేసె నయ్యశ్వపతియునుం గూతునకు నల్లునకు వివిధాంబరాభరణాది వస్తువిశేషంబు లొసంగి నిజపురంబున కరిగె బదంపడి

పడతి రమణీయభూషణాంబరవిలాస
ముజ్జగించి వనాంతరయోగ్యలీల
వల్కలాజినవసనయై వదలకధిక
భక్తి భర్తృశుశ్రూషణపరత నుండె.

అమెలతి సేయు సవినయ
సామకథల మృదుగభీరసంభావనలఁ
మామయున త్తయు సంతో
షామృతమునదేలిరంతరంగములదగన్

సావిత్రియు దనమగని యాయుఃప్రమాణంబు నారదముని చెప్పిన దినంబు మొదలుగా ననుదినంబును లెక్క యిడుకొనుచుండె నిట్లు వర్తిల్లుచుండ నాలుగు దినంబులు గొరంతగా నొక్క సంవత్సరంబు గడచినది.

నాలవదినంబు పతిమృతి
కాలంబని మదినెరింగి కడునిష్ఠమెయిం
జాలభరంబుగ బూనెను
బాల త్రిరాత్రోపవాస పరమవ్రతముఖ్.

దానికి విస్మయంబంది ద్యుమత్సేనుండు గోడలింబిలచి తల్లీ! యిట్లేల దుస్తరంబగు వ్రతంబు దొడంగితివనిన నమ్మద్రరాజ తనయ వినయంబుతో నిట్లనియె.

మీరుమదీయంబగు వ్రత
భారమునకు వగవవలదు పరమశుభంబుల్
గోరి యొనరింపబూనితి
గారణమును మీకెఱుంగగా నగు మీదఖ్.

అనిన నతండట్లేని మేలుగాక యనియెనంత జతుర్థదివసంబున.

కడురేపకడయ మేల్కని నిజభర్తకు
మరణదినంబని మానసమున
దద్దయు శోకసంతాపంబు గదురంగ
దిన ముఖోచితవిధుల్ దీర్చిభక్తి
బతికి సమంచిత పావనపరిచర్య
యప్పుడు కడు వేడ్క నాచరించి
యత్తకు మామకు న చటివిప్రులకును
వేర్వేరప్రణమిల్లి వేడ్కవారు
దనకు సౌభాగ్య భాగ్యవర్ధనముగాగ
నిచ్చుదీవన మదిలో గ్రహించి యూన.

ప్రొద్దుజా మెక్కుటయు బూవుబోడి బిలిచి
మామయిట్లని పలికెనమ్మాన మెసగ.

కడునుగ్రంబగువ్రతమిది
దొడగితి దివసత్రయంబుతో నది సెల్లెం
బడతీ యెంతయుడస్సితి
దడయకపారణ యొనర్పదగదే యింకన్.

అనిన సావిత్రి యతని కిట్లనియె.

అధిపప్రొద్దుగ్రుంకునంతకు నేడును
గుడువదగదు నాకు గోరియిట్లు
గాగవ్రతము బూనుకాలంబు నేమున్న
నిశ్చయించుకొనిన నియమ మదియు.

అనియెనప్పుడు సత్యవంతుడు సమిత్కుశ ఫలాహరణార్థంబు వనమునకుం గదలినంజూచి సావిత్రియతని జేరంజని వనంబున కేమను నీతోడ జనుదెంతు దోడ్కొని పోవలయుననిన నతండు నీవు త్రిరాత్రోప వాసంబునంజేసి యెంతయు డస్సిన దానవు, రానోపవనిననది వానికిట్లనియె.

ఉపవాసశ్రమ మప్పుడించుకయు నాయుల్లంబునం దోపదీ
విపినం బుజ్జ్వలపుష్పపల్లవ ఫలావిర్భూతినానాలతా
గ్రపరీతంబనవిందు జూడగ మదిం గౌతూహలంబయ్యె న
న్నుపరోధింపకు మింతవట్టు చనవీయుక్తుండవెబ్బంగులన్.

అనిన నతండట్లకాక చనుదెమ్మనుటయు సావిత్రి చయ్యనంజని భార్యాసహితుండయియున్న తన మామకుం బ్రణమిల్లి మీ కొడుకు వనంబు నకు నగ్నిహోత్రార్థంబై సమిధలుదేర నరిగెడు నాకును నతని తోడన చని వనంబునూడ వేడ్కయైనది. మీరు నాకివ్వరంబు గృపసేయ వలయుననిన నాతండిమ్మగువ యెన్నండును నెయ్యదియును, నడుగది త్తెఱంగు దీనికిం బ్రియమైయున్నది. నాకు నివారింపనేలయని తలంచి యనుమతించిన నయ్యిరువుర యడుగులంబడి వీడ్కొని, ఇట్లా దంపతులు మందగమనంబున

పరిసరారణ్యంబు దఱియం జొచ్చిరి. తదనంతరంబ యారాజర్షి నందనుండు మధురంబులగు ఫలంబులు గోయుచు గరిడియ నిండించి యొక్క యెడ బరశు పాతంబునంజేసి కాష్ఠదళనంబు సేయదొడంగి శ్రమంపడి యొల్లంబోయిగొడ్డలి పుడమి పై వైచి నిరంతర నిశ్శ్వాసవేగ వివర్ణవదనుం డగుచు సావిత్రిం గనుంగొని (ఈసాధ్వీమణియగు సావిత్రీచరిత్రను చదివి స్త్రీలకు పతి సేవతప్ప వ్రతములు, జపములు, తపస్సులు, ధ్యానములు, యోగములు వేదాన్త విచారణలు, ఏటికవి చెప్పెడు మనపురుషులు కొంతవఱకైన జ్ఞానము తెచ్చుకొనగలరు)

ఒడలు వశంబుగాదు భ్రమనొందినయట్లు మనంబు దూలెడిం
గడగి శిరంబు శూలవిశిఖ ప్రకరంబున నొంచినట్టి ద
య్యెడు నిలువంగనోర్వ నొకయించుక సేపు శ్రమంబుదీఱ నీ
యెడ శయనింతు నావుడు సితేక్షణమెత్తని సంభ్రమంబుతోఁ.

తనయంకతలమ ప్రియుశిర
మ్మున కుపధానముగ జేయ భూపతనయ డొ
య్యన ద్రావలి సోలి నిశ్చే
తనుడైనట్లుండె గొంత తడవున కెదురన్.

కనియెం గోమల నీలమేఘవిలసత్కాలాంజనాకారు ఘో
రనిశాతోత్కట దంష్ట్రునుజ్జ్వల చలద్రక్తాక్షు బ్రత్యగ్రకాం
చనవర్ణాంబరు నంత్యకాల దహనజ్వాలా ప్రచండుఁ జగ
జ్జనసంత్రాసను నొక్క దివ్య బటుపాశ ప్రౌఢ హస్తోద్ధతున్

అప్పురుషుండును నధికసంరంభంబున సత్యవంతుంగదిసిన నయ్యింతి యంతయు భయంబునొంది ప్రియుని శిరంబొయ్యన దిగువంజేర్చి నిల్చి కృతాంజలియై యయ్యా మీరెవ్వరియెడకు నెయ్యది సేయం దలంచి విజయం చేసితిరనిన నతండిట్లనియె.

కాలుండజువ్వే యే గమలాక్షి నను నీవు
త్వ మహిమజేసి

కానంగజాలితి కాన రాదన్యుల
కిదె నీదు భర్తకు నిపుడుకాల
మగుటయు వీడు మహాపుణ్య నిధిగాన
యితరుల బనుపక యేనవీని
గొనిపోవగా గ్రచ్చర జనుదెంచితి
నని యుగ్రభంగి నయ్యంతకుండు

ధరణినాథతనయు తనువున బ్రాదేశ
పరిమితాత్ముడగుచు బ్రజ్వరిల్లు
జీవువెడల దిగిచి చెచ్చెర నతిదీర్ఘ
భయదపాశ నికరబద్ధు జేసి,

కొనివేగంబున దక్షిణాభిముఖుడై ఘోరంపు మార్గంబునం జనగాజొచ్చెననంతరంబ మదిలో సావిత్రి శోకంబుపై కొన బ్రాణేశ్వరు దేహమొక్క యెడనంగు వంబు గావించి యా తనిపజ్జందగ దానునేగె బదపద్మంబుల్ వడిందొట్రిలన్.

దానిజూచి కరుణ ధర్ముండు నీవేల
వచ్చెదవు లతాంగి వలదు నిలువు
మింతి నీకగమ్య మిటమీది తెరువెల్ల
ననిన నతని కిట్టు లనియె బోలతి

పతులెందు జనిన నచటికి
సతులకు జనవలదె నీప్రసాదమునను మ
త్పతి భక్తి కతనమునను నం
నుత గుణ నాకరుగ రానిచోటులు గలవే,

సకల మార్గంబులందును ధర్మమార్గంబు ప్రధానంబట్టి ధర్మంబునకు నాధారంబు సజ్జనుల యని వినంబడునట్టి సజ్జనసందర్శనం బెప్పుడు వృథాగాదు గావున సజ్జనశేఖరుండ వగుంజనుడ నీ దైవ సందర్శనంబునం బరమ

శుభంబులం బొందక యేసురి త్తజనంబుల తెఱంగున నారకయెట్లు మగుడుదు ననినదాని ప్రగల్భవచనంబులకు నద్భుతంబంది ధర్ముండిట్లనియె.

తనులతాంగి భవదుదార వాగ్భంగికి
మెచ్చువచ్చె నాత్మ నిచ్చువాడ
వేడు మొక్కవరము విభుని జీవిత మొక్క
టియును దప్పనేది యయిననొండు.

—: సావిత్రి యమునివలన నభీష్టవరంబులు వడయుట :—

అనపుడు మద్రరాజ సుత ప్రాంజలియై సమవర్తితోడ ని
ట్లను రిపుకోటిచే నపజయంబును బొంది వనాంతరంబునం
దనవరతవ్రతాభిరతుడైన మహాత్ముడు సాళ్వభూవిభుం
డనఘుడు లబ్ధచక్షుడగునట్టులుగా గరుణింపవే దయన్.

నావుడు నట్టుల యయ్యెడు
నీవిటరావలదు మగుడు నెమ్మినని వెసం
బోవదొడంగెను బితృపతి
యా వెలదియు నంత నిలువకరిగె బిఱుందన్,

ఇట్లు సనిచని మఱియు నిట్లనియె.

ఎడపక వాఙ్మనః క్రియలనేరికి నెగ్గొనరింపబూన రె
య్యెడలను దీనులలం గరుణ యేర్పడబ్రోవన చూతు రిచ్చుబో
గడమవడంగనీ కెదిరికాంక్షితముల్ దుదిముట్టదీర్తురె
క్కుడుమదికూర్తురాశ్రితులకున్ వినుమిన్నియునార్యధర్మముల్

నీవెరుగనియది యెయ్యది
దేవోత్తమధర్మగతుల తెఱగెల్లభవ
ద్భావాధీనమగుటగా
దే వెలసితివీవు ధర్మదేవత యనగాన్

సమబుద్ధితోడద త్త
త్సముచిత కర్మ ఫలమఖిల జంతుతతులకుఁ
సమకూర్చుట నీకయ్యెను
సమవర్తి యనంగబేరు జగదభినుతమై,

యముడం(డు నిన్నునార్యులు
యమింతు భూతముల నెల్లనట్లగుట దగున్,
శమనుండవై తి కల్మష
శమనంబునజేసి నీవు జలజాప్తసుతా!

అనినం బ్రేతపతి యాపుణ్యసతి కిట్లనియె.

తృషితుడగు వానిబరిలఘు
తుషారతోయములు మోదితుని జేయుగతిన్
హృషితాంగు జేసెనను గ
ల్మషహరణములైన నీసమంజస ఫణితుల్,

కావున సత్యవంతు ప్రాణంబులు దక్కం దక్కిన కోర్కి యెయ్యది యైనం జెప్పుము. సఫలంబు సేసెద ననినసావిత్రి దేవా! వైరులచేత నపహృతంబైన రాజ్యం బెప్పటియట్ల ద్యుమత్సేనుండు ప్రాపించునట్లుగా ననుగ్రహింపవేయని వేడుటయు వైవస్వతుండట్ల యగునని పలికి యిట్లనియె.

వలదు నిలువు మింక వదలక నీభక్తి
మగనికెక్కె దుర్గమంపుద్రోవ
యిదికృతంబులయ్యె నెల్లయు నీవిట
వచ్చు సెలవులేదు వనజనయన,

అనిన నమ్మహాభాగ యతని కిట్లనియె.

ధర్మాత్ములు దమసలిపెడు
ధర్మక్రియదప్పరెట్టి దశలందును మో
హార్మియు దాపము బుట్టవు
ధార్మికహృదయముల ప్రథమధర్మాధ్యక్షా!

కావున బతియనుగమనం
బేవిధమున విడువదగునె యెట్లయినను మో
హావేశము బొందక ధ
ర్మావస్థితి నలుపవలదె యవహిత బుద్ధిన్.

అనిన నంతకు డిట్లను నతివ నీవు
ప్రకటధర్మవిశేష తత్పరవుగాన
యింక నొకవరమిత్తు ప్రాణేశుబ్రదుకు
వలదుగాని యొండడుగుము వలయుదాని

అనుటయు నక్కాంత గృతాంజలియై మాతండ్రి మద్రేశ్వరుండపుత్రకుండతనికి బుత్రశతలాభంబగునట్లుగా బ్రసాదింపుమని యభ్యర్థించినట్ల కానిచ్చితినని పల్కిధర్మరాజు నేడు నీవు గడుదూరంబువచ్చి డస్సితింక మగుడుట లెస్సయని పలికిన నప్పతివ్రత యిట్లనియె.

నాకు డప్పియెక్కడిది మనంబు భర్తృ
చరణపంకజాసక్తమై కరము భక్తి
నలరుచున్నది సతులకు నన్య మెట్టి
దియును ధర్మమె భర్తృసంశ్రయమకాక,

మఱియు నొక్కవిన్నపంబు సేసెద.

ఆత్మధర్మనిరతులైన పుణ్యాత్ములు
దుర్లభులు సమస్తదురితములును
శాంతిబొందువారిసంసర్గమున దీర్ఘ
పూతమతులు వారు భూతలమున.

వారలపేర్మిగాదె శశివారిజమిత్రులు నిర్వికారసం
చారతనల్లసిల్లెదరు సర్వపయోనిధులున్ నిరాకులా
కారతగ్రాలెడుం గులనగంబులు నిశ్చలరూఢిజాల నొ
ప్పారెడు భూతధాత్రినిఖిలైక ధురీణత పేర్మిబొందెడున్.

అని పలికి మరియు నిట్లనియె మిత్రమనోరథంబవశ్యకర్తవ్యంబుగా జిత్తగింపుమనిన నమ్మహానుభావుండబ్బామిని దెసంగనుంగొని నీకుం బ్రసన్నుండనైతి నభీష్టంబైన వరంబొక్కటి యిచ్చెద వేడు మనిన నమ్మానినియు నిట్లయె.

మదిసత్యవంతుజీవిత
మది యిమ్ముగవొలగబెట్టి యన్యంబులని
చ్చెద నని పలుకుదు మును నీ
వదియిప్పుడు లేదయింకనడిగెద భ్రీతిన్

పతిరహితంబుదుస్సహము భర్తృవినాకృతియైన కాంత దూ
షితయగు సర్వమంగళవిశేషములందునుగాక మత్ప్రియుం
డతులితకీర్తి శాలి సుగుణాఢ్యుడు సాళ్వసుతుండు లబ్ధజీ
వితుడుగనిమ్ము ధర్మపదవీ పరిరక్షణ పుణ్యవీక్షణా!

అనిన నట్లచేయుదునని యాక్షణంబ కృతాంతుడు సత్యవంతు నవగత పాశుంజేసి యాసుందరి కిట్లనియె.

కొనుమిదె నీమనఃప్రియుడు గోమలి వీడు చతుశ్శతాబ్దముల్
మను నిటమీద బుత్రుల గ్రమంబున నూర్వురగాంచు కీర్తి వ
ర్ధనుడగు సంతతాధ్వరవిధానములం బరితుష్టి సేయున
య్యనిమిష కోటికెల్లను నిజాన్వయమౌళివిభూషణుం డగుఁ;

అని యాదేశించి యాతండంతర్హితుండయ్యె నక్కాంతయు గ్రమ్మతి చని యెప్పటియట్ల జీవితేశ్వరుం దనతొడలపై నిడికొని కూర్చున్న యెడం గొండొకవడికి లబ్ధచేతనుండై సత్యవంతుడు దెలిసి నిజవల్లభంజూచి యిట్లనియె.

కడుదడవు నిద్రవోయితి
బడతీ నను దెలుపవలదు బలియు డొకరుడె
క్కడు జవమున బట్టి బలం
బెడలగ ననుదిగిచెనాత డెవ్వడు సెప్పుమా.

అదికలగాదు నిక్కమమ యైనటులున్నది నాకు నెంతయున్
మదివెఱవుట్టె నావుడును మానిని యిట్లను నీకు నంతయున్
ముదమున రేపు సెప్పెద దమోమయమై యిదెశర్వరీముఖం
బొదవె విలంబనం బిచట నొప్పదు లెమ్ము నరేంద్రనందనా!

తపశ్శక్తివల్లనే యమధర్మరాజును జూచుభాగ్యము గలిగినది. దీనికే దివ్య దృష్టియని పేరు,బాలిక తపస్సుచేత భర్తృప్రాణములనుసంరక్షించుటయేగాక మామకు నేత్రములు గలుగుటయు, కోల్పోయిన రాజ్యము లభించుటయు, తండ్రికి సంతానప్రాప్తియు, వీటినిన్ని సిద్ధింపజేసినది. కనుకనే సాధ్వీమణు లుభయవంశముల నుద్ధరించెదరని పెద్దలు చెప్పెడు రహస్యము. ఎప్పుడు నారీమణులకు వ్రతములు, దైవ చింతనలు లేకపోయినవో, అప్పటినుండియే వారి గర్భములో జన్మించెడు బిడ్డలు గూడ జ్ఞానహీనులై పోవుట ప్రారంభి వినది. కుంతీదేవి తపస్సంపన్నుడగు దూర్వాసమహర్షి సేవచేతనేగదా! లోకోద్ధారకులగు ధర్మరాజ భీమార్జున నకులసహదేవాది పుత్రులగనగలిగినది. ఈలాటి చరిత్రము లెన్నియో గలవు. మనుస్మృతియందు ఆర్యుల కాలములో స్త్రీలు ఎంతపూజ్యత గలవారై యుండిరో చెప్పబడినది చూడుడు

యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః ।
యత్రైతాస్తు న పూజ్యన్తే సర్వాస్తత్రాఫలాః క్రియాః ॥

ఏకుటుంబమునందు నారీమణులు పూజింపబడుచుందురో, యా కుటుంబమును జూచి దేవతలు సంతుష్టిగలవారై యుందురు. ఏ యింటిలో స్త్రీలు దుఃఖితలై తపింతురో, యాగృహస్థుడు చేసెడు సమస్త క్రియలు

ఈలాగున చూచిన దైవభక్తిగలిగి సత్త్వగుణముతో ప్రసన్న చిత్తలగు స్త్రీలు చాల యరుదుగనున్నారు గదా! కనుకనే సంసారము దుఃఖసాగరమై నది. సత్త్వగుణముగలిగి దైవభక్తిగల స్త్రీలలో నీక్రిందనిరూపించేలాగున సంతానము గలుగును.

రూపసత్త్వగుణోపేతా ధనవంతో యశస్వినః
పర్యాప్తభోగా ధర్మిష్ఠా జీవంతీహ శతం సమాః॥

మంచిరూపము, మంచిబలము, సంపూర్ణ గుణసంపద వీనితో గూడిన వారలై, ధనవంతులై, పేరెన్నికగలిగి నిండుభోగంబులు గలిగినవారైన పుత్రులు పుట్టుదురు. మఱియు వారు నూరేండ్ల ఆయుస్సుగలవారై యుందురు. అట్లుగానిచో కుయుక్తులుగలవారు, కురూపులు, అల్పాయుస్సు గలవారు, దైవద్వేషులు, మాతాపితృ ద్రోహులు, దుష్టులు, దుర్గుణ భూయిష్ఠులు, సాధునిందకులు, ధర్మఘాతకులు మొదలగు వారేగలుగు దురు. నారీమణులయొక్క పవిత్రతను గుఱించి శ్రీ కృష్ణభగవాన్ముల్లు విభూతియోగమున నుపదేశించిన దానిని చూడుడు.

"కీర్తిః శ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా"

స్త్రీలలోగల లక్ష్మియు, కీర్తియు, మంచి వాక్కును, జ్ఞాపక శక్తియు, పరిశుద్ధబుద్ధియు, ధర్మకార్యములందు ధీరతయు, ఓర్మియు నేనైయున్నాను. ఈ గుణము లన్నియు నేస్త్రీలలో గాన్పించునో యట్టి నారీమణులు లక్ష్మీ దేవితో సమానలగుదురు. అవి యన్నియు భగవదంశము లని భగవాను డుపదేశించెను.

సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యాతథై వచ ।
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్॥

ఏ కులంబున భార్యచే భర్తయు, భర్తచే భార్యయు, సంతసము గలిగియుందురో, ఆకుటుంబమున శుభము ఎల్లప్పుడు తాండవ మాడు చుండును.

స్వాధ్యాయేనార్చయేతర్షీన్ హోమైర్దేవాన్ యథావిధి ।
పితౄన్ శ్రాద్ధైశ్చనౄనన్నైర్భూతాని బలికర్మణా ॥

వేదాధ్యయనములచేత (ఉపనిషత్తు భగవద్గీత ప్రణవాది మంత్ర జపములచే) ఋషులను, హోమములచే వేల్పులను, శ్రాద్ధముల చేత పితృదేవతలను, అన్నముచేత నతిథులను, అన్నము మొదలగు వానిచే భూతకోట్లను శాస్త్ర ప్రకారము యథాశక్తి పూజింపవలయును.

అఘం న కేవలం భుఙ్క్తే యః పచత్యాత్మకారణాత్ ।
యజ్ఞశిష్టాశనం హ్యేతత్సతామన్నం విధీయతే ॥

ఎవరు తననిమిత్తముమాత్రము అన్నము వండి భుజించి, యభ్యాగతులకు బెట్టరో, అట్టి యన్నము పాపహేతువుగాన నతడు పాపమునే భుజించుచున్నాడు. కాన గృహస్థుడు శక్తికొలది బ్రహ్మయజ్ఞ, ఋషియజ్ఞ, అతిథియజ్ఞేత్యాది కార్యములు చేసినతరువాత భుజించవలయును. అట్టి యన్నము పవిత్రమైనది. పాపరహితమైనది. పుణ్యమును వృద్ధిపరచునదిగా నుండును. ఈయర్థమునే గీత 3, 4 అధ్యాయములో శ్రీ కృష్ణభగవాను డుపదేశించినారు,

స్త్రీధనానితు యే మోహా దుపజీవన్తిబాంధవాః।
నారీయానాని వస్త్రం వా తే పాపా యాంత్యధోగతిమ్॥

వారసులెవరైనను, స్త్రీలకు ఏర్పడియుండు ధన, గృహ, పశు, భూమ్యాదులను వారసుభవించుటకు నుపయోగపరచక యపహరించు కొన్నచో నట్టివారు పాపము లొనర్చినవారై యధోగతి పాలగుదురు. అని మనుస్మృతి.

ఇది ఇప్పుడు లోకములో వితంతువులగు నారీమణులు అనుభవించెడు కష్టములను జూచిన గోచరమగుచుండును.

తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాప్యం సురాలయమ్।
ఆరామకృతికూపాని సప్తసంతానసంజ్ఞకాః ॥

కొందఱు పుత్రసంతతిలేని స్త్రీలు తమకున్నతల్లోక ప్రాప్తి గలుగదని బహువిధముల దుఃఖితు లగుచున్నారు. సంతానమునకు పుత్రు లొకటేయని యర్థముగాదు. సంతానము ఏడువిధములైనది. దానిలో నొకటి గలిగి యుండినను చాలును దానివలన సంతానముచే గలిగెడు ప్రాప్తిగలుగును. వీనికే సప్తసంతానము అని పేరు. అవియేవి యనగా! (1) చెరువుత్రవ్వించుట, (2) శాశ్వతధర్మముకొఱకు ధనము నేర్పరచుట. (3) బ్రహ్మనిష్ఠులకు మఠాశ్రమాదులను నిర్మించుట, (4)దేవాలయముల నేర్పరచుట, (5) ధర్మార్థము వనము వేయించుట, (6) ఉత్తమగ్రంథముల నచ్చొత్తించుట, (7) జనుల యుపయోగార్థము బావుల త్రవ్వించుట మొదలగునవియని గ్రహించవలయును.

వీటి యన్నిటికన్న దైవజ్ఞానము గలిగియుండుట మిక్కిలి శ్రేష్ఠమైనది ఏల్లన! తక్కినవాటిచే నన్నిటిచేతను పుణ్యలోక ప్రాప్తిగలుగునేగాని జన్మ రాహిత్యమగు మోక్షము, దైవజ్ఞానముచే నొకదానిచే మాత్రమే గలుగును. అద్ది పుత్రులవేగాని, మిత్రులవేగాని, భర్తలవేగాని ధనముచేగాని, విద్యచే గాని గలుగునదికాదు. జ్ఞానమొకదానిచే మాత్రమే గలుగును.

మృతే భర్తరి సాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా।
స్వర్గంగచ్ఛత్యపుత్రాపి యథా తే బ్రహ్మచారిణః॥

వేలకొలది నారీమణులు సంతానములేనివారై భర్తలు గతించిన వారైనను బ్రహ్మచర్యము నవలంబించి యీశ్వర విషయముతో కాలము గడిపినేని వారుగూడ మోక్షమున కర్హులగుదురు.

అధర్మప్రభవం చైవ దుఃఖయోగం శరీరిణామ్।
ధర్మార్థప్రభవంచైవ సుఖసంయోగమక్షయమ్॥

జీవాత్మలకు నధర్మమువలన జన్మించుదుఃఖమును ధర్మ ప్రవర్తన వలన గలుగుసుఖమును చక్కగ నాలోచించుకొని యధర్మకార్యములలో ప్రవర్తింపక సదాధర్మకార్యములనే చేయుచుండవలెను.

ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయమకృతాత్మభిః
ధ్యానయోగేన సంపశ్యేద్గతి మస్యాంతరాత్మనః॥

ఉత్కృష్టములైన దేవయోనులందును, నీచములైన పశ్వాదియోను లందును, నీజీవుడెవ్విధంబున బ్రవేశించునదియు, మూఢు లెరుగజాలరు. అట్టి జీవుని ప్రవేశమును ధ్యానయోగముచే జక్కగా యతి యెరుగవలయును. అన్నగా దేవజన్మము, మనుష్యజన్మము, పశు జన్మము మొదలగునవన్నియు, పుణ్యపాపకర్మల తారతమ్యముచే గలుగును. గావున సదా సత్కర్మపరులై యుండవలయును.

అహింసయేంద్రియా సంగైర్వైదికైశ్చైవ కర్మభిః।
తపసశ్చరణైశ్చోగ్రైస్సాధయంతీహ తత్పదమ్॥

16

మనోవాక్కాయకర్మలచే హింసగలుగ చేయకుండుటచేతను, ఇంద్రియములను విషయములందు చేరనీయకుండుటచేతను. వేద విధిప్రకారము అనుష్ఠానముల జక్కగజేయుటచేతను, శ్రేష్ఠములగు తపస్సుల నాచరించుట చేతను, ఈలోకంబున ఈ దేహముతో గూడి యున్నపుడే బ్రహ్మప్రాప్తి యను పదవిని బ్రహ్మనిష్ఠులు పొందుదురు.

ప్రియేషు స్వేషు సుకృత మప్రియేషు చ దుష్కృతమ్।
విసృజ్య ధ్యానయోగేన బ్రహ్మాభ్యేతి సనాతనమ్॥

బ్రహ్మవేత్తయగువాడు తన ప్రియులందు దనపుణ్యమును అప్రియులందు బాపమును వీడి, ధ్యానసిష్ఠగలవాడై బ్రహ్మముతో నైక్య మొందుచున్నాడు. అనగా దూషించువారు పాపమును, ప్రేమించువారు పుణ్యమును, పంచుకొనుచున్నారు.

యదా భావేన భవతి సర్వభావేషు నిస్పృహః!
తదా సుఖమవాప్నోతి ప్రేత్య దేహ చ శాశ్వతమ్ ॥

అనేన విధినా సర్వాం స్త్యక్త్వా సంగాన్ శనైశ్శనైః।
సర్వద్వంద్వవినిర్ముక్తో బ్రహ్మణ్యేవావతిష్ఠతే॥

ఎప్పుడు మనస్సున సకలవస్తువులం దభిలాష లేనివాడగునో యపుడీ లోకమున దృప్తి. సుఖజన్మంబును. బరలోకంబున నశ్వరముగాని మోక్షరూప సుఖంబునొందును. ఇత్తెరంగున బుత్రకళత్ర క్షేత్రాదులందు దన వియున్నట్టి సకలసంగములను, వీడి, మానావమానాదు అగు ద్వంద్వముల నుండి తొలగి మున్ను జెప్పిన జ్ఞానకర్మముల యనుష్ఠానమువలన బునరావృత్తిరహిత మయిన మోక్షము నొందుచున్నాడు.

ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచమింద్రియనిగ్రహః।
ధీర్విద్యాసత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్॥

1. నిర్మలహృదయము, 2. ఆపత్తులయందుగూడ తన ధర్మమును వీడనియోర్మియు, 3. వికారములకు హేతువున్నను వికారము గలుగని, బాహ్యేంద్రియ నిగ్రహమును, 4, పరులవస్తువు నపహరింపకుండుట

5. బాహ్యాంభ్యంతర శుద్ధిగలిగియుండుట, 6. విషయములనుండి యింద్రియ ములు మరల్చుట, 7 శాస్త్రవాక్యములను, గురువాక్యములను, మరువక యుండుటయు, 8 ఆత్మజ్ఞానపరమగు విద్యయు, 9 సత్యమును బలుకుట, 10. కోపములేమి యను నీపదియు ధర్మమునకు గుర్తులు ఇదే ధర్మనిష్ఠుని యొక్క చిహ్నము.

చతుర్భిరపిచైవైతైర్నిత్యమాశ్రమిభిర్ద్విజైః ।
దశలక్షణకో ధర్మః సేవితవ్యః ప్రయత్నతః॥

నాలుగు ఆశ్రమస్థులును పైజెప్పబడిన పదితెఱంగులగు ధర్మములను ప్రయత్నపూర్వకము ఆచరణలో నుంచవలెను. అటులైన మాత్రమే యక్షయమైన మోక్షము గలుగును.

ఇప్పుడు దృఢవ్రతమును ధరించినవారిలో నొకడగు కర్ణుని చరిత్రము చెప్పెద. ఈశూరపురుషుడు బ్రహ్మనిష్ఠుడు కాకపోయినను ధర్మనిష్ఠుడగుటచే నీచారిత్రమున్నూ పరమపవిత్రమైనదే. ఏలన! ధర్మ మన్నిటికన్న ఉత్కృష్ట మైనది ధర్మహీనుడు బ్రహ్మనిష్ఠ సలిపినను, తపస్సుచేసినను, యోగము వలంబించిన శ్రేష్ఠగతి నొందజాలడు ఈ పుణ్యపురుషుని జీవితమునుండి కృతజ్ఞతయొక్క స్వరూపమున్నూ, ఆత్మ విశ్వాసముయొక్క నిజస్థితియు మనము గ్రహించుకొనవచ్చును. ధర్మముయొక్క స్వరూపము అతి సూక్ష్మ తమ మగుటచే నెట్టివారికైన తెలిసికొనుటకు దుస్తరముగ నుండును. అయినను ధర్మవేత్తల యాశయము లోతుకు దిగి చూచినచో తానేకార్యములో నియుక్తుడై యున్నాడో, దాని కనుగుణమగు అనుష్ఠానములో లోపము గలుగ నీయక యాచరించుటయే ధర్మమనదగును. అట్లుగానిచో నీసమస్యను పరిష్కరించుట కడుంగడు ప్రయాసము. అంతేగాక యదియొకటి తక్క తక్కినవన్నియు ననేకముఖములుగ గన్పట్టుచుండును అదియొకటి మాత్రము ఏకముఖముగ గోచరమగును. శ్రీకృష్ణభగవానుడు కర్ణునికి పరమాదరముతో నతనియొక్క జన్మవృత్తాంతమును తెలిపెను. పాండవులలో చేరుటకుపదేశిం చెను. (ఉద్యోగపర్వము చతుర్థాశ్వాసము)

తనతోడన గదలివచ్చిన ధృతరాష్ట్రాదుల నిలువంబనిచి రథారోహణంబు సేసిగోవిందుడు కర్ణుదెసంగనుంగొని నన్నునిచివత్తుగాని రమ్మనికరంబు

సాచి చేయిపట్టి తనయరదం బెక్కించుకొని సాత్యకి వేసరినెక్కి కెలసంజను దేరం గదలి చని యనుపవచ్చిన కృతవర్మ నుచిత ప్రకారంబున సస్నే హంబుగా నిలిపి యరుగునవసరంబునం బౌరలోకంబు

అక్కట వాసుదేవు పనుపాదరణంబున జేయరైరి వీ
రెక్కడిబుద్ధిమంతులని నిందును నందును లోకమెల్ల బే
రుక్కున ప్రగ్గుటందలప నొల్లకపాయము సేసిరట్టె యీ
యుక్కివు లెందునుంగలరె యొప్పరువో ధృతరాష్ట్రనం
దనుల్.

అనిమరియు ననేకులనేక ప్రకారంబుల బలుకుచు నిరుగెలంకులరో జూచుచుండ బుండరీకాక్షుండు పురంబునిర్గమించె నిట ధృతరాష్ట్రుండును మగిడి కొలువుకూటంబునకు వచ్చి యెప్పటివారలు పరివేష్టింపనుండ కృష్ణునివలని మాటలాడుచున్న సమయంబున సుయోధనుతో భీష్మ ద్రోణ

పలుకునె యిట్లు గొంతి విని బమ్మెరపోయితి మింతబెట్టిదం
బులగునె మాట లయ్యమయు బుణ్యుడు గృష్ణుడు కార్యవాదముల్
పలికెడు వారలిట్లు దెగ బాటిరి ధర్మజవారిరాశికిం
జెలియలి కట్టవా సె మనచేనగు కర్జముచంద మెట్టిదో,

అనిపలికె వెండియు.

మాకుంజూడగబోలు కార్యమిది ధర్మప్రీతి నీవేగి స
శ్లోకుండైన యుధిష్ఠిరుంగని జనస్తుత్యంబుగా శాంతిమై,
నీకౌరవ్యుల నెల్లగాచికొనవే యేపొప్పదెందుందుదిన్
శోకంబొందక వేగమై గదలికృష్ణుంగూడ బోవే నృపా

అనిన విని దుర్యోధనుండు మొగంబురాజుచుండ నూరకుండె గాంగేయుండు దిగ్గనలేచి యతని నవలోకించి,

కురునృప విను సంసారము
దరిద్రాక్కినవార మింక దలకెదమే సం
గరమునకు నేము నీకై
పొరలితి మెట్లయిన నగును బోయెద మనుచున్.

అరిగిరి రాజును నభ్యం
తరమునకుం జనియె రాజతనయుండు బహిః
పరివారము బొమ్మని మిత
పరిజనుడై యేగెనాత్మ భవనంబునకున్.

అంత నక్కడ నచ్యుతు డరిగి యరిగి
యధికసంప్రీతి దలకొన నర్కతనయు
నాననంబు వీక్షించి యిట్లనియె నెమ్మి
నన్యులెవ్వరు వినకుండ సతనితోడ.

నీవు వృద్ధజనోపసేవివి ధర్మసం
వేదివి తెలియంగ వినుము సిద్ధ
మంత్రబలంబున మార్తాండువరమున
గన్నియతఱి గొంతిగన్నవాడ
వగుడ బాండునృపాలు నగ్రసుతుండవు
ధర్మమార్గంబిది ధర్మతనయు
డాదిగాగల తమ్ములందఱునా చేత
నెఱిగి నీయడుగుల కెఱగి సకల
పుత్రమిత్రబంధుభూరి సేనానమ
న్వితముగాగ గొలిచి నిన్ను రాజ్య
భారవహనమునకు బట్టంబు గట్ట
నుజ్జ్వలుడ వగుదు రమ్ము వారికడకు॥

ఏను నిన్ను సామ్రాజ్యంబునకు నభిషిక్తుం జేయుదు నీవు దొలుత
చెతలు నప్పటి మహోత్సవంబునకు యువరాజై యుధిష్ఠిరుండు

నీ రథంబుననుండి నీకు ధవళచామరంబులువైచు, వాయుపుత్రుండు సిత ఛత్రంబు పట్టు, సవ్యసాచి సారథ్యంబుసేయు, మఱియు పాంచాల యాదవ పాండ్యమాత్స్యులులోను గాగల రాజలోకంబుతోడ గవలునభిమన్యు ప్రభృతి కుమారులు బెరయ నేమెల్లంబలసి పరివేష్టించి వత్తు మిట్టి మహేంద్ర విభవంబున మహనీయుండవగుచు చక్కంబేలుమని మఱియును.

పాంచాల రాజపుత్రియు
నంచితముగ నిన్ను బొందు నార్వురవరుసన్
నంచితపుణ్యుడ వీవొక
యించుకయును వేఱు సేయకేతెమ్మెలమిన్.

ఇట్లయిన గుంతికి సమస్తబంధుమిత్రులకు బ్రియంబగు ననిన విని రహస్యంబుగా రాధేయుండు మాధవున కిట్లనియె.

—: కర్ణుడు శ్రీకృష్ణునకు దగిన యుత్తరంబు లిచ్చుట : —

వెడవెడ యేను దొల్లియిది వింటి ననుంగని కుంతి యెంతయుం
జెడనదివైచిపోయె గృప జేకొనిసూతుడు దెచ్చితానుమున్,
కొడుకులగానకున్కి బ్రియకుం దగనిచ్చిన జేపె జన్నుల
వ్వడతియు నప్పుడాదిగ శుభస్థితి బెంచె బ్రయత్నశీలయై,

మూత్ర పురీషాదులు దమ
గాత్రములందింక వారు గారవ మెసగం
బుత్రుండని సంవర్ధిత
గాత్రునిగా జేసి రింతకాలము గూర్మిన్,

నేడింక నెఱిగి యొరువుల
వాడగదా యనుచు నేను వారిదొరగినం
బోడిమి సెడదే మదిగడు
వాడిగలదె నీకు నకట వారిజనాభా!

వృద్ధోపసేవనంబును, ధర్మసంవేదనంబునుంగల వాడవని నన్ను నీవ చెప్పితివి. రాధయు నధిరధుండును నాకు జాతకర్మాది సమస్త సంస్కారంబులు నిజకులోచితంబుగ నాచరించిరట్టి తల్లిదండ్రులకు బుత్ర కృత్యంబులు నిర్వర్తింపక వారలంబాసి యేనువచ్చుట ధర్మంబగునే యని వెండియు,

సోదరులు బ్రియులు ననుజులు
నాదెసబెక్కండ్రు వారినందఱ విడువం
గాదని యూహింపక దా
మోదర! నన్నిట్లు పిలుచుటుచితమె చెప్పుమా.

అదియునుంగాక.

సూతసుతుండు వీడనక సూనుల తమ్ములకంటెనాకు సం
ప్రీతియొనర్చి తేజమును బెంపును నాటికినాటికగ్గలం
బై తనరార నన్నుదన యంతటిమానిసిచేసియుండ నే
నేతగవూది యాకురుకులేశ్వరు బాయుదు ముట్టవచ్చినన్.

నను నయ్యర్జుననకు నెదు
రని పెద్దయు నమ్మియుండు నక్కట దుర్యో
ధనుడా నమ్మికవమ్ముగ
జనునే పాండవులగలయజన నాకనఘా!

ఏను నర్జునుండు నెక్కటెక్కటి దల
పడకయున్న నగరె పుడమిజనము
లందునాదువచ్చు టతనికి నపకీర్తి
యనిన నావు వేఱె యడుగ నేల?

హిత ముపదేశించితి నీ
వతినిర్మలబుద్ధివగుటనై నసునిది నా
మతిసొరదు రహస్యము ర
క్షితముగబాటింపుమయ్య చిత్తములోనన్॥

అది యేమిటీ కంటేని.

ధర్మతనయుండు దాను నా తమ్ముడగుట
యెరిగెనేనియు సామ్రాజ్య మేలపూను
నట్టిధార్మికు డాధిపత్యంబు జేయ
వలవదే శాశ్వతంబుగ వసుధకెల్ల.

(కుంతీదేవి కర్ణునియొక్క జన్మవృత్తాంతమును దెలుపుటకొఱకు నేకాంతస్థలమునకు వెళ్ళి రహస్యముగ నుపదేశించుట. అట్టి కుంతీదేవి వాక్యము సత్యమని సూర్యబింబమునుండి దివ్యవాక్యము గలిగినను కర్ణుడు తనయొక్క కృతజ్ఞతను విడువజాలనని కుంతీదేవితో తెలిపినపుడు కుంతి యుద్ధములో తనబిడ్డలగు ధర్మరాజాదులను వధింపరాదని యభయమును గోరుకొనుట, తల్లితో నతడాలాగున బ్రతిజ్ఞ జేయుటయు జరిగెను. కనుకనే యనేకసార్లు యుద్ధములో ధర్మరాజ, భీమ, నకుల, సహదేవాదు లాయుధము లన్నియు నశించి వారలై రథతురగాదులు క్షయించినవారలై యేమియు జేయజాలక స్తబ్ధులై యుండునపుడు కర్ణుడు ఏమియు జేయక వారిని శిబిరము నకు బంపివేసెను.)

అని యిత్తెరంగున బెక్కులు చింతించి తలంచుకొని కర్ణునకుం బుట్టువు దెలిపి సహోదర స్నేహంబావహించెద, నట్లయిన నాహ్వానంబువలని కడంకయుడుగకుండునేయని విచారించి యతని పొలికింబోవ నిశ్చయించి యుచిత ప్రకారంబున వెడలి యతం డనుష్ఠానార్థంబు భాగీరథికిం జనుట విని తత్ప్రదేశంబున కరిగి యతనికి జపకాలంబయిన యునికింజూచి వెనుక వలన గూర్చుండ గొండొకసేపునకు జపంబుదీరి గలయం గనుంగొని యమ్మహాదేవింగాంచి కానీనుండు సంభ్రమ వినయంబులతోడం జేరి 'సూత గోత్రంబును రాధేయనామంబునుం జెప్పి యభివాదనంబుసేసి నీకు విజయం వేసిన కార్యంబేమి నాకుం జేయంగలపని యెయ్యది యానతిమ్మనిన గుంతి యేకాంతంబుగ నిట్లనియె.

—: కుంతీదేవి గర్ణునకు నతండు తనపుత్రుండగుట దెల్పుట :—

వినుము సూతాన్వయంబున నీవు పుట్టుట
బొంకేను మాకుంతి భోజునింట

గన్నియనాడు భాస్కరుని రావించితి
వరమంత్రబలమున వచ్చి యతడు
సంప్రీతి నొసగంగ జన్మించినాడవు
నాకు గావున బాండు నందనుండ
వగుదు ధర్మస్థితి నట్టి నీవితరుల
గొలువనేటికి గురుకులవరేణ్య!

ధర్మతనయాదు లైన నీతమ్ములకును
ధార్తరాష్ట్రులకును నీవతగు విభుండ
వేలు మీలోక మెల్ల నీకేల రాధ
కొడు కితండను తక్కువ కొడుకుగుట్టు!

అనిపలికిన యవసరమున
నినబింబములోననుండి యిది నిజ మిబ్బం
గిన నెగడ వన్నమేలగు
నను వాక్యము వెడలె గర్ణుడాకర్ణింపన్.

దానివినియును నపుడు రాధాసుతుండు
దిరుగబడని మనంబుతో ధీరవృత్తి
దల్లికిట్లను నీమాట తథ్యమగున
యైన నొక్కటి సెప్పెద నవధరింపు

క్షత్రియ సంస్కారమునకు
బాత్రముగా నీవు నన్ను బాటింపవిహా
ముత్రఫలములకు నీకే
బుత్రుడ నని వచ్చుటింక బొసగునె చెపుమా.

మూర్ఖ్యానుగ్రహంబునజేసి నింద్యంబుగాక తక్కెనేనియు నాజన్మంబు పరమరహస్యంబునై యున్న యది దీని ప్రకాశంబు సేయుట మనకెంత మేలట్లుండగాక.

విజయువిక్రమంబు విఖ్యాతమైయుండ
నేను గుంతికొడుక భానుజుండ
ననుచు నతనిజేర నరిగిన నతనికి
వెలివిపోయె ననరె వేయునేల?

కడిదిపగలు నేదెప్పగ
గడవంగా నీదదలచు కౌరవనాథుం
జెడుగాక యంచు నిత్తటి
విడువదగునె యతనివలన వెలసినవాడ౯.

కౌరవులచేత గుడిచిన
వారికినిది సమయమెట్టి వారును సంగ్రా
మారంభమున బాయుదు
రే రాజులు మనల దిట్టరే యట్లయినన్.

ఏనవశ్యంబును దుర్యోధనునకై నీకొడుకులతోడం బెనంగుదు.

నీవలుకెంత వోలినను నిర్ణయమిట్టిద కానియొండులే
దీపనిమీదిభారమున నీవిటవచ్చితిగాన పాండవుల్
నేపడిరేనిజంప నలు సేయక చెప్పెద సవ్యసాచిపై
గోపము పెద్దనాడు సమకూరిన బిట్టులజంపుదుంజుమీ!

సవ్యసాచిచేత జచ్చుటయును కీర్తి
కరమ యతడులోను గాగసేవు
రేను లోనుగాగ నేవురు గానినీ
కొడుకు లార్వురనుట విడువు మింక.

అనుటయు నప్డుగొంతి హృదయంబున శోకమునివ్వటిల్లని
ట్లనునిది దైవసంఘటన మక్కట యెట్లును దప్ప నేర్చునే
యనుపమసత్య విస్ఫురణ నాడినమాట మరాకుమన్ననే
యనుజుల నల్వురంగడపు మర్జునుజేతకు సమ్మతించితేన్.

అనుచు గౌగలింప నర్కజుండట్లుగా
కని ప్రియంబుమెఱయ వినతుడైన
నరిగె సదనమునకు వద్దేవి యతడును
జనియె నిజనివాసమునకు బ్రీతి॥

(ఓహో యెంతయాత్మ విశ్వాసము. దుర్యోధనుని పైగల కృతజ్ఞత యేమని చెప్పవచ్చును: భీష్మాచార్యులు శరతల్పము నందున్నపుడు కర్ణుడు ప్రత్యేకముగ యేకాంతమున వెళ్ళి మాట్లాడునపుడు భీష్ములుగూడ కర్ణుని జన్మరహస్యమును దెలిపి పాండవులతో గూడి యుండునటు లుపదేశించిరి. తనయొక్క కృతజ్ఞతాధర్మమును విడువజాలననియు, నమ్మకద్రోహము చేయననియు కర్ణుడు దెలిపెను. శ్రీకృష్ణభగవానులు కర్ణునిసార్వభౌమునిగ చేసెదననియు ధర్మరాజాదులను సేవకులనుగాజేసి పాంచాలికి నారవభర్తగ నేర్పరచెదననియు, తెలిపియు, కర్ణుడు వాటినన్నిటిని తిరస్కరించుటంజాచి యాఖరుయుద్ధములో జయము గలుగదనియు, మృతుడ వగుదువనియు, చెప్పినను కర్ణుతు ధర్మమును విడువజాలడయ్యెను. శూరులును, పరిశుద్ధులును నగువారికి ప్రపంచము తృణప్రాయముగ నుండును. ధర్మమునువిడవి. ప్రపంచసుఖము ననుభవించుచుండినను, నధర్మముచే గలిగెడు దారుణ మగు నపయశస్సనెడి యగ్నిజ్వాలలో దహింపజాలరు. వారు దేహమును తుచ్ఛముగ దలంచి ధర్మమార్గమున ప్రాణముపోయినను శాశ్వతమగు స్వర్గ సుఖమును, లేక దైవసుఖము ననుభవింతురేగాని మఱియొక కార్యము చేయనొల్లరు.

నీయుదయము దైవికగ
ర్భాయత్తము నీకు మర్త్యులసదృక్షులు గొం
తేయుడవుగాని విను రా
ధేయుండవుగావు నీవు ధీరవిచారా!

ఇది కృష్ణద్వైపాయనుండు నాకు నేకాంతంబున నెఱింగించె నీతను భవదీయతేజో విశేషంబువలనను గనుంగొనియుండుదు. పాండుతనయుండ వగుటంజేసి నీయెడ వాత్సల్యంబకాని మాత్సర్యంబులే దొక్కటి సెప్పెద

వినుమేను గురుపాండవుల వైరంబుడిపి పుచ్చితి నప్పాండవేయులజయ్యు లప్రమేయుండగు కృష్ణుండు వారికి విధేయుండు గావున వారలతోడి విరోధంబొప్పదు. నీవును నొండుదలవుదక్కియ కౌంతేయులం గలసి యుండు మనిన గర్ణుండతనికిట్లనియె.

కౌంతేయుండనగుదు నిది
యంతయు దొల్లియును వింటినార్యులచే ని
ట్లింతయు నెఱిగిన గుంతీ
సంతానముతోడి పొత్తుసనునే నాకున్.

వారు మహాబలుల్ హరియు వారికిబ్రాపుగలండు వారలం
బోరజయింపరామియును బుద్ధినెఱుంగుదు నైన గౌరవ
క్ష్మారమణుండు సేయుతగు మన్ననలెల్లదలంచి చూచినన్
భూరివివేక! యేవిడిచి పోవుట ధర్మమె వీరకర్మమే?

అదియునుంగాక.

మాటలు పెక్కులాడి యనుమానము లేక సభంగడంగి వ
ల్మాటుబరాభవించితి జలంబున బాండవకోటి కెప్పుడుం
జేటుదలంచియేబలువు సేసితి వైరమునాకు నింక నీ
వీటికి వారివీటికిని వెక్కన మయ్యెడు కయ్యమొప్పగన్.

దైవాధీనము సర్వమున్ మనమతిం దప్పింపగావచ్చునే!
నీవింకన్ననునొండువల్కక పరానీకంబుపై బంపు మ
త్సేవాధర్మము నిర్వహించెద బలోత్సేకంబులోకంబు నం
భావింపన్ విహరించెదన్ మురరిపుంబార్థుందలంకించెదన్.

అని కర్ణుండు జెప్పెను—మఱియు వ్రతనిష్ఠులు, శూరులును నగువారి లక్షణము నీలాగున నుండునని శ్రీభర్తృహరి తెలిపెను.

నిందంతు నీతినిపుణా యదివా స్తువంతు
లక్ష్మీస్సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్ ।

అద్యైవవా మరణమస్తు యుగాన్తరే వా
న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః॥

నీతిశాస్త్రమునందు నేర్పుకలవారు నిందను చేయుదురుగాక! ఇట్లుగా దేని స్తోత్రమును చేయుదురుగాక! సంపద ప్రవేశించుగాక! ఇష్టానుసారముగా నైనను పోవుగాక! ఇప్పుడైనను వేరొక యుగమునందైనను మరణమగుగాక! ధీరపురుషులు న్యాయమార్గము నుండి అడుగైనను చలింపరు.

ప్రారభ్యతే నఖలు విఘ్న భయేన నీచైః
ప్రారభ్య విఘ్న నిహతా విరమన్తి మధ్యాః।
విఘ్నైర్ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజన్తి॥

నీచులగువారు విఘ్నములు వచ్చుననియెడు భయము చేత నే కార్యమును ప్రారంభింపరు. మధ్యములైనవారు కార్యములను ప్రారంభించి విఘ్నములు వచ్చినపుడు భయమునుపొంది కార్యములను చాలించెదరు, ఉత్తమగుణములు గలవారు విఘ్నములచేత మాటిమాటికి కొట్టబడినవారైనప్పటికిని ప్రారంభించిన మంచి కార్యములను వదలక తుదముట్టించుదురు.

కదర్థితస్యాపిహి ధైర్యవృత్తేర్న శక్యతే ధైర్యగుణః ప్రమాష్టమ్।
అధోముఖస్యాపికృతస్యవహ్నేర్నాధశ్శిఖా యాంతి కదాచిదేవ॥

నానావిధములగు సంకటములచేత బీడింపబడినవాడైనప్పటికిని ధైర్యవ్యాపారము గలవాడు తన ధైర్యగుణమును విడిచి పెట్టడు. అగ్నిహోత్రుడధోముఖముగా పెట్టబడిన వాడైనప్పటికిని ఆయగ్నియొక్క జ్వాలలు క్రిందుగా ప్రసరింపవుగదా! ఇటులనే ధైర్యవంతుడుగూడ తన ధైర్యగుణమును వదలి యధోముఖుడై యుండడు.

వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసిచ।
న విప్ర దుష్టభావస్య సిద్ధిం గచ్ఛన్తి క్వ

వేదాధ్యయనము దానము, యజ్ఞము, యమనియ మాద్యష్టాంగ యోగములు. తపస్సులు ఇవియన్నియు చెడు మనస్సుగల వాని కెట్టి సంసిద్ధిని నెచ్చటను గలిగింపజాలవు అని మనుస్మృతి.

ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు।
సంయమే యత్న మాతిష్ఠేద్విద్వాన్ యంతేవ వాజినామ్॥

బుద్ధిమంతుడు సకల గుణాపహారులగుచు, విషయము లందిరుగు నింద్రియములను, సారధి గుఱ్ఱములనుబోలె గట్టిపట్టుటకు ప్రయత్నించవలయును. సారథి దోవతప్పి వెళ్ళుటకు ప్రయత్నించెడి గుఱ్ఱముల కళ్ళెముపట్టి లాగి సరియగు మార్గములో నడుపునట్లు, బుద్ధిమంతులు సన్మార్గమునుండి వఱించెడు ఇంద్రియము లనెడు గుఱ్ఱములను, బుద్ధి బలముచే స్వాధీనపరచు కొనవలెను.

ఇంద్రియాణాం తు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియమ్।
తేనాస్య క్షరతి ప్రజ్ఞా దృతేః పాత్రాదివోదకమ్॥

ఇంద్రియము లన్నిటి లోపల నొకయింద్రియమైనను విషయాసక్తమైన యెడల నట్టివాని జ్ఞానము బెజ్జముపడిన పాత్రములోని యుదకము కారిపోవునట్లు నశించిపోవును ఒక రంధ్రము పడిన నీరు క్రమముగ నశించునపుడు, అనేక రంధ్రములు పడిన పాత్రలో గల జలము విషయమై వేఱుగల చెప్పవలెనా? ఒక ఇంద్రియము వశము గానిచో నంత యపాయము గలుగుచుండ ననేకేంద్రియములు విషయములలో ప్రవర్తించువాని జ్ఞాన విషయమై మరల నేమి చెప్పవలయును?

6. ఇపుడు సీతాదేవియొక్క దృఢవ్రతమున్నూ తెలిసికొనదగినది. తనయొక్క పాతివ్రత్య మహిమచేగదా రావణుడేమియు చేయజాలడాయెను. పాతివ్రత్యమునకును మహామహిమగలదు. జానకీదేవి దృఢవ్రతమును గురించి శ్రీమద్రామాయణ యుద్ధకాండమున గనందగును. ఇచట నీ విషయము సంక్షిప్తముగ మాత్రము వ్రాయబడుచున్నది. ఈలాటి ధర్మ రహస్యములు గ్రహించినమాత్రమే స్త్రీ పురుషులు తమయొక్క ధర్మమును చక్కగ నిర్వహింప గలుగుదురు. దానివలన వారి యాత్మ శుద్ధమగునదియే

గాక ప్రపంచములోగల జనులుగూడ ధర్మనిరతు లగుదురు. అదియునుగాక ఆత్మశుద్ధి గలుగునపుడు నిత్యసుఖమగు దైవప్రాప్తి గలుగుట కవకాశము సిద్ధించును, అది పునరావృత్తి రహితమగు మోక్షమని గ్రహించుకొన వలయును. మానవుని శ్రేయస్సంతయు ఆచరణలపై నాధారపడియున్నది. శ్రేయస్సు మాత్రము గాదు. నిశ్శ్రేయస్సు (మోక్షము) గూడ దృఢతర వ్రతనిష్ఠలపై నిలకడ గలిగియుండును. అట్టి దృఢవ్రతము లేనిచో నతని యనుష్ఠానము లన్నియు శక్తిరహితములైనవని తప్పక గ్రహించవలయును. శ్రీ జానకీదేవియేగాక యెందరో నారీమణులు పాతివ్రత్య మహిమచేఅనేకము లగు అమోఘమహిమగల కార్యములజేసినట్లు మన శాస్త్రములలో విను చున్నాముగదా! ఇట్టి పుణ్యచారిత్రము మన భారతదేశములో తప్ప, ఇంతటి మహిమలు మఱియొక రాజ్యములోగూడ వినుటలేదు. కావున మన నారీమణులకు గల ప్రాణములన్నియు తమయొక్క పతివ్రతా ధర్మముపై నాధారపడి యున్నవని మరువకుందురుగాక!

అయితే యిట్టి పతివ్రతా ధర్మము నాచరించుటలో సద్విద్యకుగాని, దైవజ్ఞానమునకుగాని, బ్రహ్మనిష్ఠకుగాని, పవిత్రవ్రతానుష్ఠానమునకుగాని అది యడ్డుగాబుగజేయునదిగా నుండరాదు. పతివ్రతా ధర్మమునకు దైవ భక్తియు, పుణ్యవ్రతనియమములును, ఆత్మజ్ఞానమున్నూ, బంగారము స్ఫుటముజేసిన నేలాగున మరింత ప్రకాశము గలదగునో, అలాగున మిక్కిలి ప్రకాశమును గలుగజేయును. ఈ విషయమై సత్యభామ కొఱకు ద్రౌపది చెప్పిన వాక్యములను వినుడు. అరణ్యపర్వము, పంచమాశ్వాసము.

అత్తకు భక్తిగల్గి మది నాయమ సెప్పిన మాడ్కిజీవికా
వృత్తము లావహింతు గురు విప్రజనాతిథి పూజనంబు ల
త్యుత్తమభక్తి నేన తగ నోపి యొనర్తు బ్రియంబు దాల్మియు
న్మైత్త్రిదనంబుసన్మతియు మేలుగ దాల్తు సమస్తభంగులన్.

విను ప్రద్యుమ్నాది భవ
త్తనయులయెడనైన నేకతంబున నేకా
ననమునమనుండుట దూష్యం
బని యెరుగుము సతులచరిత లతిదుష్కరముల్.

కులవతులును సతులును ని
ర్మలమతులును నయినయట్టి మగువలతోడం
జెలిమియొనరించునది దు
ర్విలసితవనితాభియుక్తి విడువుము తరుణీ!

ఈ విషయమై భారతమున విస్తారముగ గనందగును.

–: వ్యాసు లనుష్ఠానముయొక్క మహిమను ధర్మరాజున కుపదేశించుట :-

క్షమయు నహింసయు సత్యము,
సమతయు నింద్రియజయంబు శమము బరిత్యా
గమును దపోలక్షణములు
గ్రమమున నిన్నియును నూర్ధ్వగతి కారణముల్.

ఇందుజేసిన బుణ్యంబ యందు గుడుచు
మీదిజన్మంబునకునది మేలు జేయు
గాన తనశక్తితోగూడ దాన ధర్మ
చిరపరోపకారంబులు సేయవలయు.

ద్రౌపదిని బట్టుకొనుటకువచ్చిన సైంధవునితో నామె పాతివ్రత్య ధర్మమును చెప్పుట—

నను బేలవని తలచందం
బుననవమానింప నీకు బోలదు మత్పా
వనపాతివ్రత్య మహిమ
ననిశము నేకీడు నెందు నందదు నన్నున్.

ఎవరైనను వ్రతనిష్ఠ గలిగియుండినచో వారిని ఎవరును ఏమియు చేయజాలరు. ఈ విషయమై కుమారస్వామి మార్కండేయ సంవాదము జూడందగును—

నియతిగలిగి యింద్రియముల
జయించి శుచులైన కాంతిసంపన్నులకున్,

భయమొనరింపగ లేవ
వ్యయపుణ్యగ్రహము లేయవస్థలయందున్.

పురుషుల ప్రయత్నము అవశ్యమునుండిన మాత్రమే పరమపురుషుని యనుగ్రహము గలుగునని కృపాచార్యుడు అశ్వత్థామకు నుపదేశించెను. తాను చేయవలసిన కృత్యము ఈశ్వరాజ్ఞయని తలచి యాచరించువారికి మాత్రమే ఈశ్వరకృప గలుగును. అనేక ఋషులు యోగులు నిష్ఠాపరులై తపోధ్యాన యోగాదుల నాచరించినపుడుగదా ఈశ్వరానుగ్రహముగలిగి సాక్షాత్కారము నొందిరి. సౌప్తికపర్వము :—

ప్రారంభములకెల్ల బౌరుషమ్మును దైవ
మును సాధనమ్ములు వినుము వాని
లోననొక్కటిచేత గానేర దనఘ త
త్ఫలసిద్ధులెట్లన్న దరచు వాన
కారు పొలంబున గల్గెనేనియుగొల్చు
గావింపనేర్చునే యేవిధమున
వలనేర్పడగ దున్న బొలములోనైన వ
ర్షంబులేకున్న ధాన్యంబు లగునె

కాపు లావు వెరవుగల్గి కర్షణము సే
యంగవృష్టిదగిన యట్లుగలుగ
ఫలము గల్గునట్లు పౌరుషంబునకు దై
వంబుతోడు పాటువలయు నెందు.

మఱియును గాక,

తగుపని కుద్యోగించుచు
దగవెఱిగెడు హితుల కనుమతంబుగ జేయన్
జగతీసుర వరకార్యము
లగువారికి గలుగు విఫలహోయత్వంబున్.

ఇప్పుడు శ్రీసీతాదేవి తనయొక్క పాతివ్రత్య దృఢబుద్ధిచే నగ్ని ప్రవేశము చేయుచున్నది. అపుడు చెప్పిన దివ్యవాక్యములే మహామంత్రములు, ఇవే దృఢవ్రతముయొక్క గుర్తులు. శ్రీమద్భాస్కర రామాయణమున యుద్ధ కాండమున విస్తారముగ గనందగును. ఇచ్చట క్లుప్తముగ తెలుపబడును.

విభీషణుడు సీతనుదెచ్చి రామునకు సమర్పించుట.

దేవరపంపునఁ వరసతీ తిలకంబగు సీత దెచ్చితిం
గావున నీదుదర్శనము కాంతకు నీదగు వేడ్క నావుడుఁ
భూవరు డంతదైన్యమును మోదము గోపము నొంది జాతచిం
తావిలమానసుండయి రయంబునజానకి బిల్వబంచినఁ.

—: శ్రీరామ వాక్యము :—

ఇంతి వినుము బురుషు డెట్టివా డయినను
బరుని యింట నున్న బడతి మగుడ
బ్రాకృతుండపోలె జేకొననేర్చునే
యింతకంటె నింద యెద్ది గలదు.
మానంబరయగ బ్రాణస
మానము మానంబు నఖుడు మానమె ధనముఁ
మానము విడుచుటకంటెను
మానుగ బ్రాణములు విడువ మంచిది తలపఁ.

శ్రీ సీతాదేవి వచనము

పురుషులు నమ్మరేని దమ పొల్తుల చేష్టితచిత్తవర్తనం
బరయుట దప్పుగాదు మనుజాధిప యుక్తమ కాన నీవొగిం
బరువని పల్కుపల్కవిన బాలయితిఁ సభలోన నక్కటా
శరములబోలు వాక్యములు సైతురటే సతు లింతకోర్తురే?
నరవర నీవుచిత్తమున నమ్మినవాడవయేని మున్నున
న్నరయగ మారుతాత్మభవు నంపినయప్పుడ నీతలంపుచొ

వ్వరుదుగ నాకునేర్పడగ నాతనిచే నెఱిగింతు వేనినే
నెరియుచుఁబ్రాణముల్ విడుతు నిప్పుడునన్నిటులాడఁగూడునే।

పరవృత్తచేష్టిత భావేంగితంబులు
సూచితెలియుదీవు శుద్ధచరిత
యౌదార్యగంభీర తౌన్నత్యధైర్యాది
గుణములనెంతయు గొమరుమిగిలి
యాగమలౌకిక వ్యవహారములయందు
నరయనీ వెఱుగని యదియుగలదె
నను నీవు దగ జిన్ననాటినుండియు జూచు
చుండుదు విటయెగ్గు లున్నవయ్య
యోగిమహీపతి యప్పటినుండి పలుకు
ననుచితంబులు మాన్పంగ ననువులేదె
పరుషదుశ్శ్రవభీషణ భాషణములు
నీవు దయమాలి యననెట్లు నేర్చితయ్య॥
మీరింత నమ్మకున్నను,
గౌరవమేపారనన్ను గరుణించి మహా
దారంబగుసోద బెట్టుడు,
ధీరమతింజొత్తునందు దిరమగు కడకన్

సీత యగ్నిప్రవేశము చేయుట.

కలఁగకజాతవేద సుముఖంబుననెంతయు శుద్ధురాలనై
నిలువయు శాలియున్హరియు నన్ను వెనంగొనియాడునట్లుగా
జొలవకమీరుమెచ్చఁగతి జొచ్చెదజిచ్చు మదీయభర్తక
న్నెలవగునంతమీద శుభశీలత ధారుణి నాశ్రయించెదన్॥
అనినందఱ్ఱడమంది లక్ష్మణుడు దైన్యాయత్తచేతస్కుడై
తనలోనం దలపోసిఖేద మొదవన్ ధాత్రీపతింజూచి భూ

జనస్థాలాగ్రణి నన్న చేసిన నుదంచద్వేగ మేపార్తనే
విడమంటల్ మొగిమిన్నుముట్టసౌద సేర్చె సీత మోదింపగాన్.

పరమ పావనియగుసీత పలగనేడు
వెలగినాయందు జొచ్చుట జేసిమిగుల
ననఘశీలుండనద్యోద నని ముదంబు
బొందుకై వడి మిన్నంది పొదలె నగ్ని,

తదనంతరంబ,

తలవాల్చి యున్నభాస్కర
కులపతికి ప్రదక్షిణించి గురుతరకీలా
కులమగు సౌదచేరంగా
సలలితగతి నేగుదెంచి జానకి యంతన్.

వినయముతోడ మ్రొక్కి యరవిందనిభానన వేడ్కప్రీతి హో
త్రునకు బ్రదక్షిణంబు ననుదెంచి కృతాంజలియైత్రిలోకపా
వనగతసర్వభావన! నివారితకల్మష! సర్వనిర్జరా
ననసకలక్రియాధికరణ ప్రవణాభిని వేశపావకా!

స్థిరమతులార! యోసకల దిక్పతులార! సురేంద్రులార! కి
న్నరవరులార! సర్పకుల నాయకులార! మునీంద్రులార! ఖే
చరవర్యులార! యక్షగణచారణగుహ్యక సాధ్యులార! వి
స్ఫురదధినవ్యచంద్రులార !వరభూతములార! యెఱింగియుండుడా!

మీరిందఱు దగుగుటిగా
గోరుచునేనున్నదాన గురుహితమతినా
చారిత్రంబేచందం
బేరూపము దానిమీర తెలుగుదు రరయన్

కావున వాఙ్మనః కాయకర్మ బుద్ధీంద్రియ తదర్థంబులం జేసి నిమేష కాష్ఠాకళాక్షణ ఘ. హూర్తయామ సంధ్యాహోరాత్ర పక్షమాసర్త్వయన వత్సర పరిగణితంబులగు కాలంబులు సాక్షిగ స్వప్నాద్యవస్థలయందును జ్ఞానాజ్ఞానంబులయందును మద్వల్లభుండగు రఘునాథునకుం దప్పుటలేదు.

ఛాయగతి వాదుచిత్తము
పాయకరఘునాథునంద పరగునయేనిన్,
న్యాయము దప్పక దహనుడు
ధీయుక్తిన్ నన్నుగాచు ధృతి యొడగూడన్.

దుష్టకల్మషబుద్ధినై దోషమునను
జనకులాధీశునకు దప్పి నచ్చరిత్ర
మెడలినడుచుట గలిగిన నీక్షణంబ
వెలిగి నను నగ్ని భస్మంబు సేయుగాత!

అనుచున్ నిశ్చలచిత్తయై రఘుకులేంద్రాయత్త చింతావశం
బున దాత్పర్యము గల్గి నిర్మల లసద్బుద్ధిప్రసాదంబు పెం
పున నభ్రంకషకీలుడై కనలుచున్ భూరిప్రభుండైన య
య్యనలుండుప్పతిలంగజొచ్చెనిరపాయస్నేహరాగంబునన్

అనఘమంత్రపూతమైన యాజ్యాహుతి
పగిది ధరణిపుత్రి పడియెనంత
దేజమెసగ నగ్ని దేవుండు మిన్నంది
మహితశిఖలు గలిగి మండజొచ్చె.

లోలవిలాస ఖేలనవిలోచన మీనములాననాబ్జమున్
లాలితబాహువల్లరి మృణాలములుం బృథుకేశభారశై
వాలము నొప్పసీత యనవద్య పవిత్రచరిత్ర విస్ఫుర
ల్లీల కృశానునందు సరసీగతి జాడగ నొప్పెనెంతయున్.

పవడపురాశిలోని నవభర్మశలాకయుబోలె జారుప
ల్లవములకుప్పలోనిడినలాలిత చంపకదామమట్లు ర
క్త వనజరాజిహంసియనగా నరుణాభ్రములోననున్నయా
నవశశిరేఖబోలె దహనస్థిత యయ్యె విదేహకన్యదాన్.

అప్పుడు పతివ్రతాశిరోమణియగు సీత దహన శిఖావృతయై యున్నం గనుంగొని దానవాంగనలు శోకింప. నిశాచరులు దుఃఖింప, గవులు సమాక్రందనములుసేయ, సుగ్రీవుండు బెగ్గిల, విభీషణుండు పారవశ్యంబు నొంద, నంగదుండు విన్నదంబుసెంద, హనుమంతుడు ఖేదింప,లక్ష్మణుండు వగలంబొగుల, రాఘవుం డవాఙ్ముఖుండై నిర్వేదింప సుర, లనుచితంబన, సాధ్యులన్యాయంబన, యక్షులమనపేక్షణీయంబన గంధర్వు లద్భుతంబన, మహోరగంబులు తగదన, జరాచరంబులు దృశ్యాదృశ్యంబుననగు భూతంబులు దల్లడిల్ల, మహాభూతము లాక్రోశింప, నకోలాహలంబు లొక్కపెట్టనొదవిన.

సీ. ప్రమథులు సనుదేర బాలేందుధరుడైన
మూడుగన్నుల వేల్పు మున్నుగాగ
జగములసృజియింప జాలియాద్యుండైన
చతురాస్యుడగు పద్మసంభవుండు
గమనీయవికసిత కమలపత్రములన
వేయిగన్నులుగల వేల్పుఱేడు
వహ్నికాలాసుర వరుణానిలశ్రీద
శూలహస్తులుగూడి సురుచిరముగ

గరుడసిద్ధసాధ్యగంధర్వఖేచర
యక్షపక్షినాగయాతుధాను
లాదిగాగపుష్ప కారూఢులయి రాము
ధీరు జూడ నేగుదెంచి రెలమి.

ఇంద్రాది దేవతలు రాముని స్తుతించుట

పాతివ్రత్యగుణంబు సుస్థిరమతిం బాటించి కల్యాణ స
చ్చేతోవృత్తిదనర్చి లక్షణములం జెల్వొంది శుద్ధక్రియో
పేతప్రక్రియ యైన జానకి భవత్ప్రేమానురూపంబుగా
బ్రీతింబుట్టిన యాదిలక్ష్మి దలపం బృథ్వీతలాధీశ్వరా!

అకటయుపేక్ష సేయదగునయ్యరఘూద్వహమండుచున్నపా
వకమున దత్పతీత్వగుణ వైభవమొప్పగనుండునట్టి జా
నకినిటు చూచుచుండదగునా పిలిపింపగదయ్యసాధ్వినూ
రక చెడనాడనేల యనురాగదయామృత దృష్టిజూడవే.

వనజేక్షణ నారాయణ
నిను నీవిటమఱవదగునె నిర్దయమతివై
జనకసుత నుపేక్షింతురె
మనుజేశ్వరమమ్ము నెలమి మన్నింపగదే.

అను నయ్యవసరంబున విశ్వమయుండును, విశ్వైక సాక్షియు, విశ్వపావనుండునగు వైశ్వానరుండు సముత్తాలాభీల జ్వాలా వలీదహ్యమానంబులగు నింధనంబులు పాయద్రోచి యస్వేదబిందుజాలాంచితయు, నమ్లాన వదనపంకజయు, నక్లిష్ట తనువల్లికయు. నతాంతల తాన్త మాలికయు, నవవసన్నాంగ రాగయు, ననాహతదుకూలయు, ననిర్ధూతకేశకలాపయు, నకంపనమూర్తియు, నవిచ్ఛన్నహారాద్యలంకారయు, నవిహాయా వసూయాదత్త పుణ్యాంగరాగ గంధబంధురమూర్తియునై తొంటిక్రియనున్నంగ నుంగొని కపులు, నసురులును, సబాష్పనయనులై నృపతికిప్పురంధ్రీర త్నంబు నిన్ని యెగ్గులాడందగదన వసుమతీ దుహితయగు సీతను, రఘునాథు సన్నికర్షంబునకు నెత్తికొని తెచ్చి ముందఱ నిల్పి యిట్లనియె.

—: అగ్ని దేవుడు సీత మహత్త్వము చెప్పి రాముని కొప్పించుట —:

రఘుకులదుగ్ధవారినిధిరాజ భవత్పతి దూషితక్రియా
లఘుచరితానుశక్తిమెయి లౌల్యము దాల్చి చరింపనేర్చునే

యఘములు జానకిందలచినంతనె నాశమునొందు నీకు ని
ట్లఘనతరాగ్రహంబున గడుం జెడ నాడుట జూడయుక్తమే॥

పసచెడవుమేని మెఱుగులు
గసుగందవు క్రొవ్విరులును గనుగవధూమ
ప్రసరమున నెఱ్ఱబారదు
వేసదలచీరయునునట్ల వెలయుట గంటే॥

దైవముప్రాణమిత్రుడును దాత సఖుండును జీవితార్థముల్
నీవుగ వాఙ్మనఃకరణనిశ్చయబుద్ధి శరీరదృష్టిసం
భావితవృత్తి నేమఱక పన్నుగ నిన్నె తలంచు నన్యుదు
ర్భావనలేదు భూమిసుత భవ్యచరిత్ర పవిత్ర భూవరా!

శుచినై జగములకు బరమ
శుచిత్వమొనరింతునే వసుమతీతనయా

శుచినైతి గృతార్థ భావసుభగుడనైతిన్.

మందారభూజంబు మరగినభృంగికి
పిచుమందశాఖిపై ప్రేమ గలదె
[illegible]సనంబున మెలగెడు హంసికి
వెలియ బల్వలము పైపేడ్కగలదె
మలయద్రుమంబున మలయు భుజంగికి
బర్బూరతరువు పై వలపుగలదె
భాస్కరోదయమున భాసిల్లు పద్మిని
కిందుకరస్పృష్టి నెలమిగలదె

రాజితానేక సద్గుణారామరామ
కర్మపాలన [illegible]

యైన సాధ్వికి సీతకు నన్యునందు
గూర్మి యేచందమున నమకూడునయ్య!

కావుననీవునాపలుకుగై కొన గాదగు గాదు నాక సం
భావనతోడ సచ్చరితభాసురయైన మహీసుతక్ దిగీ
శావలి సంతసిల్లగ బ్రియం బొదవంగ బరిగ్రహింపు రా
జీవహితాన్వయాభరణసింధుగభీరగుణైకభూషణా!

7. దృఢవ్రతులలో జేరిన మఱియొకడగు ఏకలవ్యుని పావనచరితముగూడ వినదగినది ఇతడు కిరాతకులమున జన్మించినవాడైనను, తన దృఢవ్రతముచేతను గాఢవిశ్వాసముచేతను, అచంచలభక్తిచేతను ధనుర్విద్యయందు గురుసహాయములేకయే యద్వితీయమగు నైపుణ్యమును సంపాదించెను. ఇతడు ధనుర్విద్యా పిపాసగలవాడై ద్రోణాచార్యుని యడుగ నతడు క్షత్రియులకును బ్రాహ్మణులకును తప్ప నితరులకు జెప్పుటలేదని నిరాకరించిన నంత నేకలవ్యుడు గురుభక్తియందు మఱింత మనస్సును దృఢపరచి యేకాగ్రబుద్ధిగలవాడై యేకాంతమున ద్రోణాచార్యుల విగ్రహమును మట్టితోజేసికొని, తదేకభావముతో నా విగ్రహమునే ద్రోణాచార్యులుగ నెంచి యస్త్రవిద్య నభ్యసించుచుకొనుచుండెను. అతని భక్తికిమెచ్చి ఈశ్వరుండ తనికి ధనుర్విద్యకు గావలసిన జ్ఞానమునంతయు ననుగ్రహించుచుండెను.

ఈకథలో నిట్టి విషయము మనము తెలిసికొనదగినది. దీనివలన మనము తెలిసికొన వలసినదేమన సరియైన గురుభక్తిగలిగి యుండిన జ్ఞానసిద్ధి గలుగు ననియు, అట్టి సరియగు గురువు లభింపనిచో ననన్యభక్తిగలిగి ఈశ్వర ధ్యానముచేయుచుండిన నీశ్వరానుగ్రహముగలిగి జ్ఞానము సిద్ధించుటకు సందేహములేదు. అట్లుగానిచో సరియైన గురువు లభించేలాగున సర్వేశ్వరుం డనుగ్రహమునైన చేయును. మానవుండు ఏకార్యమునైనను సాధించుటకు, మనస్సు ఎంతకెంత కట్టి కార్యముపై యేకాగ్రతపడుచుండునో, అంతకంతకు నాకార్యము వానికి సమీపించి వచ్చుచుండును. అంతేగాక దానియందుగల రహస్యములన్నియు హృదయములో గోచరమగుచుండును. విజ్ఞాన శాస్త్రజ్ఞుడు కనుగొనిన తత్త్వములన్నియు నీరహస్యముపై నాధారపడి యున్నవి. అలాగున నీశ్వరకార్యములలో గూఢ

మానవుని మనస్సు ఎంతకెంతకు మగ్నమగునో, అంతకంతకు దైవతత్త్వము గూడ నతనికి బోధపడగలదు. ఈవిషయమైగీతావాక్యము—

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేనమాముపయాంతి తే
(10–10)

ఎల్లపుడును నాయందు ఆసక్తి గలిగి తదేకధ్యానముతో నుండెడు బ్రహ్మనిష్ఠులకు (భగవద్భక్తులకు) నాలో నైక్యమునకు గారణమైన జ్ఞాన యోగమును నేనిచ్చెదను.

తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

అట్టి తదేకనిష్ఠగలిగి ధ్యానము చేసెడు భక్తులపై అనుగ్రహము గలవాడనై అంతర్యామియైన నేను వారిహృదయములలో ప్రకాశించి యనేక జన్మములనుండి వచ్చెడు నజ్ఞానావరణమనెడి చీకటిని నశింపజేసి, య్యే నిర్మలజ్ఞానముచే భగవత్సాక్షాత్కార జ్ఞానము గలుగునో అట్టి దానిని ప్రకాశింపజేయుచున్నాను. అనగా నా యనుగ్రహముచే వారి యజ్ఞానము తొలగి నిజమైన ఈశ్వర సాక్షాత్కార జ్ఞానము గలవారగుదురు.

ఈలాటి తత్త్వముల దెలిసికొనియే విగ్రహారాధన యేర్పరచిరి. అనన్యభక్తిగలిగి యారాధించువారి కేకలవ్యునికి గలిగిన జ్ఞానమువంటి దైవ జ్ఞానము గలుగును. మార్కండేయ ప్రభృతులకును ఈలాగుననే ఈశ్వర సాక్షాత్కారము గలిగినది. గురుభక్తియు నాలాగుననే యుండును. అయితే యట్టి యున్నతగుణములు గురువునయం దుండవలయును. లేనిచో శిష్యులకు గాని, భక్తులకుగాని యున్నత భావము గలుగుట దుస్తరము. ఇదే దీక్ష యందుగల రహస్యము. ఇపుడు భారతము ఆదిపర్వము, పంచమాశ్వాసమున నేకలవ్యుని చరిత్రము చెప్పబడినది, చూడదగును.

—: ఏకలవ్యుడనువాడు ద్రోణునారాధించి విలువిద్యగఱచుట :—

మఱియు గదాకార్ముక ప్రాసాసితోమర కుంతశక్త్యాది వివిధాయు ధంబులయందును గుమారుల నందర జితశ్రములంజేయుచున్న ద్రోణాచార్యుల

మహాప్రసిద్ధి విని హిరణ్యధన్వుండను నెఱకురాజుకొడుకు కేవలవ్యుండనువాడు ధనుర్విద్యా గ్రహణార్థియయి వచ్చిన వాని నిషాద పుత్రుండని శిష్యుంగా జేకొనకున్న వాడును ద్రోణు ననుజ్ఞవడసి చని వనంబులోన—

వినయమున ద్రోణురూపు మన్నున నమర్చి
దాని కతిభక్తితోడ బ్రదక్షిణంబు
జేసి మ్రొక్కుచు సంతతాభ్యాసశక్తి
నస్త్రవిద్యారహస్యంబు లర్థిబడసె.

ఇట్టు పాండవ కౌరవు లొ
క్కొటనందరు గురుననుజ్ఞ గొని మృగయాలం
పటులై వనమున కరిగిరి
పటుతరజవసారమేయ భటనివహముతోన్.

మఱియు నందొక్క భటుని కుక్క తోడుదప్పి పఱచి యొక్కడ నేకతంబ యభ్యసించుచున్న నేకలవ్యు సమీపంబున మొఱింగిన నయ్యేలుంగు విని దాని ముఖంబునం దేడుబాణంబు లొక్కట దొడిగి యక్కజంబుగా హస్తలాఘవంబున వాడేసిన నది శరపూరిత ముఖంబై కురుకుమారుల కడకుం బాఱిన దానిం జూచి విస్మయం బంది యట్లేసిన వాడెవ్వడో యని ఱోయుచు వచ్చువారు ముందఱ.

తేజితబాణహస్తు దృఢదీక్షు మలీమస కృష్ణదేహు గృ
ష్ణాజినవస్త్రు వస్త్ర విషయాప్తవిషాదు విషాదుజూచి యా
రాజకుమారు లందఱు బరస్పరవక్త్ర విలోకనక్రియా
వ్యాజమునం దదీక్షణ నివారితులై రతిమత్సరంబునన్.

అక్కుమారులు వాని శరలాఘవంబునకుమెచ్చి నీవెవ్వండ వెవ్వరిచేత విలువిద్యగఱచితని యడిగిన వారికి నయ్యెఱుకు కిట్లనియె.

వినుడే హిరణ్యధన్వుం
డను వనచరనాథు కొడుకన్ నాచార్యుడు ద్రో

డునకుఁ శిష్యుడ నెందును
ననవద్యుడ నేకలవ్యు డనువాడ మహిన్.

అనిన విని కురుకుమారులందరు మగుడివచ్చి ద్రోణున కంతయుఁ జెప్పిరంత నర్జునుం డేకాంతంబ యొక్కనా డాచార్యున కిట్లనియె.

విలువిద్య నొరులు నీక
గ్గలముగలేకుండ నిన్ను గఱపుదు నని మున్
బలికితిరి నాకకాదీ
త్రిలోకముల కధికు జూచితిమి యొకయెఱుకున్.

నాకంటెను మీకంటెను
లోకములో నధికు డతిబలుండు ధనుర్వి
ద్యాకౌశలమున నాతడు
మీకుం బ్రియశిష్యుడటె యమిథ్యావచనా.

అనిన విని ద్రోణుం డదరిపడి వానింజూతము రమ్మని యర్జునుం దోడ్కొని యనవరత శరాసనాభ్యాస నిరతుండయియున్న యేకలవ్యకడకే గిన నెఱిగి వాడు వెదురుపఱతెంచి ద్రోణునకు మ్రొక్కి తనశరీరంబు సర్వ స్వంబును నివేదించి యేను మీ శిష్యుండ మిమ్మారాధించి యివ్విలువిద్య గఱచితినని కరంబులు మొగిచియున్నంజూచి ద్రోణుడట్లేని మాకు గురు దక్షిణ యిమ్మనిన సంతసిల్లి వాడిట్లనియె.

ఇదె దేహంబిదె యర్థం
బిదె నాపరిజన సమూహ మిన్నిటిలోనె
య్యది మీకిష్టము దానిని
మ్ముదమొదవగ నిత్తు గొను డమోఘంబనినన్.

నెమ్మినినీదక్షిణ హా,
స్తమ్మున పెనుప్రేలు దునిమి దక్షిణ యిమ్మి
ష్టమ్మిది నాకనవుడు విన,
యమ్మునవా డిచ్చెదాని నాచార్యునకున్.

దక్షిణాంగుష్ఠ మిచ్చినదాన జేసి
బాణసంధాన లాఘవభంగమయిన
నెఱుకు విలువిద్య కలిమికిహీనుడయ్యె
బారునకు మనోరుజయును బాసెనంత॥

విలువిద్య నొరులు నీక
గలముగ లేకుండ నిన్ను గఱపుదునని మును.
బలరిపు సుతునకు బలికిన
పలుకప్పుడు గురుడు సేసె బరమార్థముగన్.

భూపనందను లివ్విధంబున భూరిశస్త్రమహా వి
ద్యోపదేశపరిగ్రహస్థితి నున్న నందఱయందు వి
ద్యోపదేశము దుల్యమైనను సత్తమోత్తము డయ్యె వి
ద్యాపరిశ్రమకౌశలంబున దండితారి నరుండిలన్ ॥

అనిలాత్మజు బలమును న
ర్జును కార్ముకకౌశలంబు శూరగుణంబుల్
మనమున సహింపనోపక
వనరుచు ధృతరాష్ట్రసుతులు వందిరి తమలోన్ ॥

ఓం తత్ సత్ ఓమ్.

~~~~~~~~~~~~~~~~

# హరిశ్చంద్రచరిత్రము



ఇపుడు మన మతిపవిత్రమైన సత్యమును గురించిన ఒక యితిహాసమును వినబోవుచున్నాము. ఇది పాపరహిత మొనర్చునదే గాక పుణ్యమును గూడ వృద్ధిపరచును. దృఢవ్రతులలో నగ్రేసరుడగు హరిశ్చంద్రుని చరిత్రమిది. నేటికిగూడ సత్య హరిశ్చంద్రుడని యే పుణ్య చరిత్రుని కథ వినుచున్నామో అట్టి శుద్ధాత్ముని గురించియే తెలిసికొనబోవుచున్నాము.
~~~~~~~~~~~~~~~~

ఆయన రాజాధిరాజై యుండియు, చక్రవర్తియైయుండియు సత్యమునే వ్రతము గాను, దానినే ముఖ్యముగాను, జీవితోద్దేశ్యమును కైవల్యమునుగా నెంచి వ్రతము సలుపువాడు, ఈ మహాపురుషుని గుఱించి యెంతవ్రాసినను చాలకనే పోవుచున్నది. ఇపుడీయనను గుఱించి క్రొత్తగా నెవరును చెప్ప నక్కరలేదు. పూర్వ ఋషులును, కవులును, పండితులును ఈ మహాను భావునెంతో కొనియాడియున్నారు. డ్రామాలను, సినిమాలను ఈ పుణ్య పురుషుని చరిత్రము పావనముల నొనర్చుచున్నవి. అంతేగాక భాగవతోత్త ములు సయితము ఈ మహాత్ముని సత్యమును గుఱించి హరికథా రూపముగా చెప్పుచు జనులను పావనుల నొనర్చుచున్నారు. దీనివలన నేటికిని యెందరో రాజులు, రాజాధిరాజులు, భాగవతులు, గృహస్థులు, పండితులు గూడ పవిత్రు లగుచున్నారు పైజెప్పినవారలే గాక పామరులు సయితము ఈపుణ్యచరిత్రుని దృఢవ్రతమునుగూర్చి విని విస్మయము నొందుచు పరిశుద్ధాత్ములగుచున్నారు.

అయితే సత్యమును గుఱించి వ్రతము సలుపువారికింత శ్రమయేల గలుగవచ్చునని జనులకు సంశయము గలుగవచ్చును. ఈలాగున కష్టముల వహించి మనము అట్టిసత్యవ్రతమును నిర్వహింపగలమా? యని సందేహపడ నక్కరలేదు కష్టసుఖములు బాహ్యములో జరుగుచుండు కృత్యములవే గలుగునని సామాన్యజనులు తలంచినను నిజముగా విచారించిన సుఖదుఃఖము లకు మనస్సే కారణముగాని బాహ్యవిషయములు కారణములు గావు. ఏలన? సుఖదుఃఖముల కాధారము మనస్సే కనుకనే యొకరికి నీరసమైన విషయము మఱియొకరికి రసవంతమగుచున్నది. ఒకరికి హేయమైనది మఱియొకరికి పరమాదేయమగుట గనుపించుచున్నది. ఒకరికి శత్రువైన వాడు, ఇంకొకరికి మిత్రుడగుచున్నాడు. ఒకరి కరుచియైనది వేరొకరికి ఎక్కువ రుచికరముగా గనుపించుచున్నది. ఒకరికి దేవుడైన వానిని వేరొకడు ధర్మముగా దల్లించుచున్నాడు. ఒకరికి పుణ్యమని తలంపు గలిగినది యింకొకరికి పాపమని విచారము గల్గుచున్నది. ఒకదానికి ప్రకాశముగా నుండునది వేరొకదానికి జీకటిగా గనుపడును. ఒకదానికి చీకటిగానుండునది వేరొకదానికి వెలుతురుగా నుండును. ఆలాగున నెన్నియో విషయములు ప్రపంచములో వారివారి మనస్సునను సరించి కనబడుచున్నవి. నీతికన్నిటికి

కారణము మనస్సే. కావున యెవరిమనస్సు స్వచ్ఛముగా నుండునో వారి కంతయు సుఖమునే గలుగజేయును, ఎవరి మనస్సు శాంతినొందియుండునో అతనికి యావత్తును పరమశాంతి మయముగానే గోచరించును. కావుననే యోగులు, సిద్ధులు, ఋషులు మనశ్శుద్ధి గలుగజేసికొనవలయునని తెలుపు టకు కారణము.

అయితే యావిషయమై యిప్పుడు జెప్పబూనలేదు. మనము ప్రారం భించినది దృఢవ్రతమును గుఱించిన విషయము దానికి ఈచక్రవర్తియగు నుదార శీలుడును, పరమభక్తుడును, సత్యవ్రతనిష్ఠగలవాడును నగు హరి శ్చంద్రుడు ప్రకాశమును గలుగజేయువాడు అతడు ఎన్ని కష్టములు గలిగినను తనయొక్క వ్రతమునకు భంగమును గలుగనీయక సంరక్షించు కొన్నాడుగదా? యని మాత్రమే యీవలన మనము గ్రహించుకొనవల యును. అట్టికష్టముల పడనిచో అతనిచరిత్రము ఇంత పవిత్రముగా ఆ చంద్రార్క ముండజాలదుగదా!

పాఠశాలలో జదువుచుండు విద్యార్థులకు పరీక్షయొక్కటి లేనిచో జదివినవానిని గుఱించియు జదువనివానిని గుఱించియు నెట్లు తెలిసికొన గలము? తానభ్యసించెడు విద్య యెంతగొప్పదో దాని కేర్పడియుండు పరీ క్షయు నంత పెద్దదిగానే యుండును. రత్నమైనను సానబట్టనిచో నాభరణ మున కుపయోగపడదుగదా? పుటము వేయనిచో బంగారమైనను సొబ గు రంజి కాజాలదుగదా? ఆలాగున నిట్టివ్రతనిష్ఠలచేతనే జీవుండు మాలిన్య రహితుడు కావలసియుండును. ఇది ఈశ్వరనియమము. సుఖదుఃఖములకు మనస్సే కారణమగుటచేతనే గదా హరిశ్చంద్రచక్రవర్తి యెన్నియో విప త్తులు వచ్చియుండినను సంతోషముతో వాటినన్నిటిని సహించుచు నోర్చు యుండెను సహించుట యేమి, కొంచమైనను దుఃఖమును పొందకపోవుట కును కారణమదియే. దుఃఖమును పొందకపోవుట మాత్రమేగాదు, ఎల్ల ప్పుడు తనయొక్క వ్రతమును నిర్విఘ్నముగా నిర్వహింపగలిగినందుకు గలిగిన పరమానందములోగూడ సదా మునుగుచుండెను.

మఱియు మనుజులకుగల విషయములన్నిటిలోను నేది ముఖ్యముగా నుండునో దానికొఱకు తక్కినవాటినన్నిటిని ఒక్కొక్కదానినిగా క్రమముగా

విడువగలరు ఇది ప్రతివారియొక్క యనుభవము. ఈవిషయమై చెప్పబూనుటలేదు. అదేయొక గ్రంథముగాగలదు. కావున నోజనులారా! మీకు దేనియందు మిక్కిలి విశ్వాసముగలదో దానిని సంరక్షించుకొనుడు: అది యెల్లప్పుడు నశింపనిదిగాను, సదా సౌఖ్యమును గలుగ జేయునదిగాను, లోకపావనము నొనర్చునదిగాను ఉండవలయును. అదేదియో మీరే యోచించుకొనవలయును. కానిచో నిజము నెఱిగిన బ్రహ్మనిష్ఠులను గనుగొనవలయును. వారుతప్ప మఱెవరును దానిని తెలుపజాలరు. తెలిసికొనజాలరు.

ఈషణత్రయముచే నీజీవుండు సంసారమున బద్ధుడై యుండును ఈ బంధమును ఛేదింపుటకొరకు శ్రీవిశ్వామిత్రు డిట్టి పన్నాగమునుబన్నెను. రాజ్యముపోవుటచే ధనేషణయు, ధర్మపత్ని పోవుటచే దారేషణయు, కుమారుడు పోవుటచే బుత్రేషణయు నివృత్తి నొందును. ఇట్టి యవస్థ హరిశ్చంద్రునకు గలిగినదా? లేదా? యనివిశ్వామిత్రమహర్షి చక్కగ పరీక్ష చేసెను. మఱియు మనుజునికేది ముఖ్యమనితోచునో దానిని సాధించుటకు ప్రతిబంధకములైన ఇతరములను విడచుట స్వభావమైయున్నది. కావున హరిశ్చంద్రుడు సత్యస్వరూపమగు పరబ్రహ్మము ముఖ్యమని దృఢమైన నమ్మకము గల్గినవాడా? లేక యముఖ్యములగు రాజ్యము, ధనము, భార్య, పుత్రులు, ముఖ్యములని నిశ్చయముగలవాడా? యని పరీక్షించుటకొఱకు నిట్టికార్యమ్మును జేసియుండును. "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అని దృఢాపరోక్షజ్ఞానము గల్గిన మాత్రమే కైవల్యప్రాప్తి గల్గునని, శ్రుతి చెప్పియుండుటచే హరిశ్చంద్రుడట్టి దివ్యలోకప్రాప్తి గలుగుట పరిపక్వము గల్గువాడాయెనా, లేదాయని తెలిసికొనుటకొఱకు ఋషిసత్తముడగు విశ్వామిత్రు డీలాగున జేయుటకు కారణమైనది. అట్లుగాక అల్పులవలె ధనము కొఱకు, రాజ్యముకొఱకు, భార్యకొఱకు, పుత్రుమును విడనాడి, ధర్మము నుపేక్షించి కేవలము నీచులవలె నున్నాడా? లేదా యని తెలిసికొనుట కొఱకిట్టి తీక్ష్ణతరమగు పరీక్షచేసెను. ఇక నాచరిత్రము సంక్షిప్తముగ వ్రాయబడును. పుణ్యపురుషులెవరును, నిజానిజముల నెరిగిన వారెవరును, ధర్మవేత్తలగు వారెవరును నశ్వరమైన దృశ్యసౌఖ్యముల కొఱకు శాశ్వత సౌఖ్యమును గలుగజేయు సత్యమును, ధర్మమును, జ్ఞానమును విడువనొల్లరు.

పూర్వము హరిశ్చంద్రుడను మహారాజుండెను. అతని తండ్రి పేరు త్రిశంకుమహారాజు. భార్య చంద్రమతియను సతీమణి. లోహితాస్యు డాతని పుత్రరత్నము. ఆతడు నిత్యసత్యవ్రతుడు. అతనికి కలయందైనను కల్లయను పది లేకుండెను. దానదయాదుల కాటపట్టయి యుండెను. ఈతడయోధ్యా నగరమును ప్రధానపట్టణముగా జేసికొని కోసలదేశముల బాలించు చుండెను. జనుల పుత్రసమానముగా బోషించుచుండెను

ఇట్లుండ నొకనా డింద్రసభయందు పాకశాసను డీలోకత్రయంబున నిత్యసత్యవ్రతు డెవ్వేని గలడా? యని ప్రశ్నించెను. మునిబృందము తెల్ల బోయి యొకరి మొగ మొకరు చూడసాగిరి. ఇంతలో సకలగుణ గరిష్ఠుడగు వసిష్ఠుడు నిలువబడి "ఓ దేవేంద్రా! కలడు కలడు. భూలోకమున హరిశ్చంద్రుడను నరేంద్రుడు అతడెన్నడును అసత్యమును జెప్పని వాడు," అని పలికిన కోపించి వసిష్ఠబద్ధవైరుండగు విశ్వామిత్రుడు "ఓహో రాజు లెందైన సత్యవ్రతులై యుందురా? ఇవేటి మాటలు? వసిష్ఠా! పందెమేమి? నేనారాజు నసత్యమాడించెదను." అనిపలికిన విని వసిష్ఠుడు "నీవా రాజేంద్రు నసత్యమాడించితివేని నేను శిరమును గొరిగించి, తపశ్శీలములమాని, మనుజ కపాలంబుతో మద్యము నుగ్రోలుచు నుత్తరాభిముఖుండ నయ్యెదను" అని ప్రతిజ్ఞజేసెను విశ్వామిత్రుడును నేనా హరిశ్చంద్రుని బొంకింపజాలనేని హిమవత్పర్వతమున నీశ్వరునిగూర్చి సలిపిన తపఃఫలంబున నర్ధంబతని కి ధారవోసి యనేక మహాయుగంబులీ యింద్రసింహాసనాసీనుని

ప్రతిన బట్టెను. అంతనాసభ ముగిసెను.

విశ్వామిత్రుడాతక్షణమే యయోధ్యాపురి కరిగి హరిశ్చంద్రునిగూర్చి రాజేంద్రా! నేనొక యాగంబొనర్ప దలంచితిని. తగిన ధనసహాయం బొసలింపుము. అనిన నారాజశేఖరుడా ముని సర్వపాద్యార్ఘ్యములచే బూజించి దండప్రణామంబు లాచరించి మహాత్మా! తాముకోరిన యట్లొసంగెదను. అనుగ్రహింపుడు" అని విన్నవించెను. అంత విశ్వామిత్రుడు "యువకుడే నుగనెక్కి రత్నమును మీటిన నదెంత దవ్వేగగలదో అంత ధనమొసంగు" మని యడిగెను, హరిశ్చంద్రుడు "విత్తము మహాత్మా యట్లే యొసగ్చెద" నని పలుక నింతలో "రాజకులాగ్రణీ! యిప్పుడీ ధనమును నేనెచ్చోట

20

దాచుకొందును. ప్రస్తుత మిచటనే యుంచుము, అవసర సమయమున గొని పోయెదను." అని విశ్వామిత్రుడు వచింప చిత్తమట్లే యొనర్చెదనని హరిశ్చంద్రు డంగీకరించెను.

తరువాత విశ్వామిత్రుడు నిజాశ్రమమునకు జని పలువిధంబులగు క్రూర మృగంబుల సృజింపజేసియు, నయోధ్యా పట్టణమునందలి సస్యభరితంబులగు పొలంబుల నుగ్గునూచము గావించుచుండెను. పౌరులును నష్టముల కోర్వజాలక రాజునకు విన్నవించుకొనిరి మరునా డుదయమున హరిశ్చంద్రుడు సైన్యసమేతుడై యడవికి జని యా పలువిధంబులగు మృగంబుల హతంబొనర్చి మధ్యాహ్న మగుటచే నొక చెట్టుక్రింద విశ్రమించియుండెను. ఇంతలో విశ్వామిత్రుడు గానకళా కౌశలంబుగల ఇద్దరు మాతంగ కన్యకల సృషించి "బాలికలారా! అదిగో యాచెటు క్రింద విశ్రమించియున్న రాజు దగ్గఱకు వెళ్ళి పాడి యాడి మమ్ము పెండ్లి జేసికొను"మని కోరుడు అని జెప్పి వారిని పంపెను. వారట్లే యొనర్చి మమ్ము వివాహమాడు మనిర్రి. హరిశ్చంద్రు డందులకు గోపించి వెళ్ళనందువలన బెత్తముచే విసరెను. అప్పుడు వారేడ్చుచు వెళ్ళి విశ్వామిత్రునికి జెప్పుకొనిరి.

అప్పుడా తపోనిధి కోపావేశమున వచ్చి హరిశ్చంద్రుని కిరీటంబు నెగురదన్నిన నతఁడోర్చి యుపచరింప దొడంగెను. కాని విశ్వామిత్రుడు విడల్చివైచి నిర్దయుడవై యేల నాకూతుల గొట్టితివి? వారిని పెండ్లి యాడితివా సరే! లేదేని తప్పక దండింపబడుదువని" పలికెను. అంత హరిశ్చంద్రుడు "నారాజ్యమైన నిచ్చెదనుగాని నేనేక పత్నీవ్రతమును వీడి నీకూతుల బెండ్లి యాడ"ననెను. అట్లయిన రాజ్యము నిమ్మని కౌశికు డడిగెను. ఇచ్చితినని చెప్పి యాసత్యవాది పురంబున కరిగి విశ్వామిత్రుని పట్టాభిషిక్తునిగావించి భార్యాపుత్రులతో దానరణ్యమున కేగుట కుద్యుక్తుడగుచుండ నింతలో విశ్వామిత్రుడు నిలు నిలు హరిశ్చంద్రా! పూర్వము యజ్ఞార్థ మిచ్చెదనని చెప్పిన పైకము నిచ్చి కదలుము. అనిన త్రిశంకునందను డేమియు దోచనివాడై తుదకు నెలదినములు గడువిమ్మని కోరెను. "అట్లయిన నీ వెచ్చటికి వెళ్ళెదవో పైకమిచ్చెదవని నాకేమి నమ్మకము. ఇదిగో నాప్రియ శిష్యుడగు నక్షత్రకుని బంపుచున్నాను గడువునకు సరిగా పైకమునిచ్చి పంపుము" అనెను. చిత్తమట్లేయొనర్చెదనని చెప్పి హరిశ్చంద్రుడు

డందతిని వెంటనిడుకొని యరణ్యమున కరిగెను. అచ్చట నక్షత్రకు డతనిని కన్నయిడుములపాలొనరించి తుదకు కాశికి చేరునప్పటికి గడువు సమీపించినందున ధన మిమ్మని హరిశ్చంద్రుని నిర్బంధించెను. అప్పుడు హరిశ్చంద్రుడు తెల్లబోయి చూచుచుండ, పతివ్రతా శిరోమణియగు చంద్రమతి భర్తను జూచి "నాథా! యేల విచారించుచున్నారు. నన్ను తెగనమ్మి యా పైకము నీ మునిపుత్రున కిచ్చి మీ సత్యవ్రతమును రక్షించుకొను"డనిన నత డాసాధ్వి పలుకులకు మిక్కిలి సంతసించి యాదేవి నొక కాలకౌశికుడను బ్రాహ్మణునకమ్మి యాధనమిచ్చిన, గైకొని నక్షత్రకుడు ఇది యిన్ని దినములనుండి నేను నీతోడ దిరిగినందుకు తగిన కూలికి సరిపోయినది. ఇక మా గురువుగారి కివ్వవలసిన దానినిమ్మని పల్కెను. అంత హరిశ్చంద్రుడు చేయునది లేక తానొక మాలవాడను వీరబాహున కమ్ముడుబోయి యివ్వవలసిన యా ధనమునంతయు నిచ్చెను. అంత నక్షత్రకుడు సంతసించి,

ఇనకులాధీశ నీవు మాకియ్యకొనిన
విత్తమంతయునేడు ప్రవేశమయ్యె
శంకరుడు విశ్వనాథుండు సాక్షిగాగ
నిలుపుకొంటివి సత్యంబు నిత్యముగను.

(హరిశ్చంద్రోపాఖ్యానము)

అని పల్కి ధనమును గైకొని గురుసన్నిధి కరిగెను. హరిశ్చంద్రుండును వీరబాహుని యాజ్ఞప్రకారము కాటికాపరియై యుండెను. ఇట్లుండ చంద్రమతియు దర్భలకొఱకు నరిగి విశ్వామిత్రునిచే నాజ్ఞాపితుడైన తక్షకునిచే గఱవబడి చచ్చిన లోహితాస్యుని దీసికొని కాటికేగి దుఃఖించుచు కాల్ప నుద్యమించుచుండ నింతలో హరిశ్చంద్రుడే తెంచి మాడనివ్వక నచ్చట గాల్ప వీలుపడదనిన "స్వామీ? నేనొకరింటి దాసిని. దరిద్రురాలను, మాడ నెక్కడదెత్తునని చంద్రమతి బలుక "అదిగో నీమెడలో మంగళసూత్రమున్నది. దానినమ్మి మాడనుదెమ్ము" అని యా పురుషుడు పలికిన చంద్రమతియు పూర్వము వసిష్ఠుడు అమ్మా! నీ మంగళసూత్రము నీ భర్తకు దప్ప మరెవ్వరికి గనుబడదని వరమిచ్చి యుండుటను దలంచి, యతనిని తన భర్తనిగా నిశ్చయించి యేడ్వసాగెను. హరిశ్చంద్రుడును ఆ పతివ్రతను

దనపతీమణినిగాను, బాలుని తనపుత్రరత్నమునుగాను నెఱింగి కొంతవడి దుఃఖించి "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అను సూక్తిని స్మరించి శోకము నణచుకొని:—

ఆకాంతతోడనిట్లనియె నోరాకేందు
    ముఖి స్వామికార్యంబు ముఖ్యమరయ
నేలికఘనమున కెడసి సత్యము దప్పి
    యిప్పనికొడ బడ నెట్లువచ్చు
నికనొండుమాని నిన్నేలినయట్టి ధా
    త్రీదేవునడిగి యేరీతినైన
మాడయొక్కటిదెమ్ము మసలకవేగంబ
    తగవునౌచిత్యంబు దలవుమనిన

ప్రాణవల్లభు సత్యప్రభావమునకు
మిగుల నచ్చెరు వంది యమ్మీననయన
యాత్మజుని భర్తకడ నిడి యప్పగించి
యధికభక్తిప్రణామంబు లాచరించి.

(హరిశ్చంద్రోపాఖ్యానము)

తరువాత మాడ దెచ్చుటకొఱకు కౌశికు గృహంబున కరుగుచుండ, నింతలో విశ్వామిత్ర మాయాకల్పితుడగు నొకచోరుడు కాశీరాజు పుత్రుని యొక్క యాభరణ సహితమైన శిరస్సును దెచ్చి యా చంద్రమతి యొడిలో బడవైచెను. ఇంతలో రాజభటులు తేతెంచి యా యమాయకురాలిని చెత్తమునే బాధి నిందించుచు రాజుదగ్గఱ కీడ్చుకొనిపోయిరి. రాజును కోపావిష్టుండై యీ నాతిని గొనిపోయి శిరశ్ఛేదంబొనర్చ నా యాజ్ఞయని వీరబాహునకు దెల్పుము, అని యొక సేవకునకా మహాదేవి నొప్పగించెను. అతడును చిత్తము ప్రభో! అట్లే యొనర్చెద నని తెలిపి యా చంద్రమతిని వీరబాహున కప్పగించెను. వీరబాహుడును తన దాసుడగు హరిశ్చంద్రున కాజ్ఞాపించెను. అతడు అన్యాయమును గూర్చి చింతించుచు నిర్దోషిణియగు భార్యను జంప

చేతులు రాక దుఃఖించుచుండెను. అప్పుడు చంద్రమతి "నాథా! ఏల విచారించుచున్నారు? నా శిరంబును త్రెంచి మీ సత్యవ్రతమును సంరక్షించుకొనుడు. ఇదిగో కడసారి వందనమును గైకొనుడు. దైవమా! కరుణింపుము నాకు ప్రతిజన్మమునందును నీ హరిశ్చంద్రుడే పతియగు నట్లనుగ్రహించుము" అని పలుక హరిశ్చంద్రుడును ధైర్యమును దెచ్చుకొని కరవాలంబు జళిపించి చంద్రమతియొక్క కంఠమును గురిజూచుచుండ నింతలో విశ్వామిత్రుడు "నిలు నిలు హరిశ్చంద్రా! స్త్రీహత్య యొనరింపకుము, ఇప్పటికైనను నా ముద్దుకూతుల పెండ్లియాడుము. నీ రాజ్యము నీకిచ్చెద"నని పల్కెను. అంత హరిశ్చంద్రుడు "మునీంద్రా! యిది నీబోధ నాకర్ణింప సమయముగాదు. తొలగిపోవ ప్రార్థన" యని పలికి చంద్రమతి కంఠమునందు ఖడ్గమును విసరెను. అది పుష్పమాలయై యా మహాదేవి గళము నలంకరించెను. అప్పుడత డాశ్చర్యపడి "యేమి నాకు బలము తగ్గిపోయెనా! లేక సత్యమార్గచ్యుతుడ నైతినా? దైవమా! నేను సత్యవ్రతుండనైతినేని, సత్యముకొఱకు రాజ్యభ్రష్టుడనైనను దుఃఖింపక సంతసించుచున్నే యుంటినేని, సత్యము కొఱకు నా వంశమంతరించినను ప్రమోదమేయని తలంచుచుండుట నిక్కమే యగునేని యీ వ్రేటున కీ సాధ్వీమణి కంఠము తెగిపోవుగాక" అని పల్కి గుఱిచూచుచుండ నింతలో నిలు నిలు హరిశ్చంద్రుడా! యని పల్కుచు శ్రీ కాశీవిశ్వనాథుడు పార్వతీదేవి సహితంబుగా ప్రత్యక్షమై హరిశ్చంద్రుని చేతి ఖడ్గము బట్టుకొనెను అంత హరిశ్చంద్రుడు, చంద్రమతియు వారికి నమస్కరించిరి. అనంతరము పార్వతీదేవి లోహితాస్యుని, కాశీరాజ పుత్రుని బ్రతికించెను. తరువాత విశ్వామిత్రుడు "హరిశ్చంద్రా! నీ సత్యవ్రతమును బరీక్షింప నేనిన్ని కష్టముల గల్గించితిని. ఎన్నియోపన్నాగముల బన్నితిని గాని యవియన్నియు నీ సత్యానలమున కింధనము లయ్యెను. ఇది కాడు కాదు, యజ్ఞవాటిక. ఇతడు వీరబాహుడుగాడు. యమధర్మరాజు అతడు కాలకౌశికుడుగాడు శనైశ్చరుడు. మాలవానికి సేవయొనర్చితివిగాన నేనపవిత్రుడనైతిని నా భార్యయు నీచమగు దాసీకృత్య మొనర్చినదని తలంచకుము. నేనేయోడితిని. నీ గురువే గెల్చితివిక నీ రాజ్యమును నీవు గైకొనుము. మఱియు.

మిగులబ్బియాసము నొందితి
వగణితసూనృత వచస్సమంచితసీధై
ర్యగుణప్రాగల్భ్యంబులు
జగదాశ్చర్యంబు లార్యసంస్తుత్యంబుల్.

నిత్యమై యొప్పు భవదీయ సత్యమహిమ
దెలియగోరి మనంబున దలకకేను
వితతకపటక్రియావృత్తి సతిని నిన్ను
బాధ నొందించి కడు నపరాధినైతి.

క్షమియింపుము నాయపరా
ధము లన్నియు దయదలిర్ప దావకసామ్రా
జ్యముగై కొనియేలుము పూ
జ్యముగా నిక బ్రోవు భూప్రజలసిరి దొలకన్.

అని పలుక "మహర్షిసత్తమా! నాకేల రాజ్యము పూర్వమే మీకు సమర్పించితిగదా!" యని హరిశ్చంద్రుడు నుడువ నతనికి పరమేశ్వరుం డిట్లనియె.

భూపకులాగ్రగణ్య నినుబోలు నృపాలురులేరు చూడగా
నీపదునాల్గులోకముల నెంతయు మేలు నితాంతసూనృతా
లాపవిశేషధైర్యగుణలక్షణ సాహస వైభవక్రియా
దీపితమయ్యె నీనడత దివ్యమునీశ్వర వర్ణనీయమై.

మఱియు సత్యనిధీ! విశ్వామిత్రుడు నీ సత్యవ్రతమును బరీక్షించు టకే యట్లొనర్చెనుగాని రాజ్యమేల వలయునను బుద్ధిచేగాదు. గావున నీ రాజ్యమును నీవు గైకొనుము. దోషమేమియు లేదు. చిరకాలము రాజ్య మును పాలింపుము. అనంతరము నీకు కైవల్యప్రాప్తి కలుగును" అని వచించి హరిశ్చంద్ర, చంద్రమతీ, లోహితాస్యుల దీవించి పార్వతీ సహిత ముగా వాదేవదేవుండదృశ్యుడయ్యెను. హరిశ్చంద్రుడును భార్యాపుత్ర

నయోధ్యకరిగి యథాపూర్వముగా రాజ్యమేలుచు సత్యముచే కైవల్యమును బొందెను. ఓమ్.

జనులారా! హరిశ్చంద్రుని దృఢవ్రతమును దెలిసికొంటిరా? తొలుత పతివ్రతా శిరోమణియగు చంద్రమతి గళముపై ఖడ్గమును విసరినను అది పూలమాల యయ్యెను. అప్పుడు సత్యవ్రతమగు దివ్య మంత్రము నుచ్చరించి అనగా నేను సత్యవ్రతుడనైనచో ధర్మమునకు లోపము గలుగక ప్రజలను పాలించియుండినచో, శ్రేష్ఠమైన క్షత్రియ ధర్మమును చక్కగ నాచరించియుండినచో ఈ వ్రేటునకు చంద్రమతి కంఠము తెగిపోవును గాక యని ఖడ్గమునెత్తగా సాక్షాత్పరమేశ్వరుడగు శంకరు డావిర్భవించి హరిశ్చంద్రుని కరమును బట్టుకొనెను. ఓహో దృఢవ్రతముయొక్క మహిమ త్రిమూర్తులను గూడ మించినదిగదా!

ఓం తత్ సత్ .

## శిబిచక్రవర్తి కథ కొంచము తెలిపెద.

ఎంతమాంసము కోసి పెట్టినను కపోతపక్షియంత భారము లేక పోవుటచే ఖిన్నుడై శిబితన దేహమునుండి కారుచుండు రక్తమంతయు తట్టలో నుంచి చూచెను అప్పుడా మహాధీరునియొక్క సాహసమునకు సంతసించి దేవేంద్రుడును, అగ్నిదేవుడును దివ్యములగు శరీరములతో ప్రత్యక్షమై నీయొక్క శరణాగత త్రాణపరీక్షా నిమిత్తముగా ఈ పక్షి రూపములతో వచ్చితిమని తెలిపి చాలసంతసించి కావలసిన వరములను కోరుమని యడిగి రాజుశరీరమును యథాప్రకారముగా నుండేలాగున జేసిరి. ఈశ్వర కృపగలిగి తనయొక్క జీవితాంతము వఱకు శరణాగత త్రాణవ్రతము నిర్విఘ్నముగా జరిగిన జాలునని చెప్పగా, అలాగేయని వరమునిచ్చి యాశీర్వదించి దేవేంద్రుండును, అగ్నిదేవుడును నంతర్ధానులైరి.

కావున ముముక్షువులారా! వ్రతము గలిగియుండిన దానికి పరీక్ష గలుగునని తలంచి యెల్లప్పుడు ఎల్లరును జాగరూకత గలిగి వర్తింపవలెను. శిబిచక్రవర్తి యెచ్చట? క్షుద్రమగు పావుర మెచ్చట? ఇట్టి చిన్న కార్యములలో గూడ తనయొక్క ధర్మమును సంరక్షించుటలో చూపిన త్యాగమెట్టిదో

యదే మనము తెలిసికొనవలసినది. శిబి యెంత సాహస కృత్యమొనర్చెనో చూడుడు. దీనివలన తేలిన సారమేమన యెంత చిన్న కార్యముకొఱకైనను ఎట్టి విషమస్థితిలోనైనను తనయొక్క ధర్మమును విడువరాదు. అట్టి ధర్మమే వానిని రక్షించును. అగ్నియును, ప్రకాశమును వేఱుకానట్లు ధర్మమును ధర్మమున కాధార భూతుడగు ఈశ్వరుడును వేరుకాదు. పంచదారయు, మాధుర్యము రెండుకానట్లు సత్యమును దైవమును వేఱువేఱుకాదు. ఎచ్చట ధర్మము గలదో అచ్చట నుద్ధారకము గల్గును. ఎచ్చట సత్యముగలదో అచ్చట నిత్యమైన సౌఖ్యమున్ను కలుగును. ఎచ్చట భక్తిగలిగియుండునో అచ్చట ముక్తియు స్వయముగా వచ్చిచేరును. ఎచ్చట కరుణ కలిగి యుండునో అచ్చటికి కరుణామూర్తియగు నరేశ్వరుడును వెదకి కొనివచ్చి చేరును.

(శ్రీమదాంధ్ర మహాభారతము అరణ్యపర్వము తృతీయాశ్వాసము)

ఇక్ష్వాకులనం జైత్రమాసంబునందు మహామునుల చేతంబూజితుండై యుమాసహితుం డీశ్వరుండువారికిం బ్రత్యక్షంబగుటయు నరుంధతీ సహితుండై వసిష్ఠుండిందుల వసియించెనిది భృగుతుంగంబను పర్వతంబిం దును శ్రీనరపతి శిబియనువాడు దొల్లి యజ్ఞంబు చేయుచున్న నింద్రాగ్నులు వాని మహాగుణంబులెఱుగ వేడి యింద్రుండు శ్యేనంబైన నగ్నికపోతంబై శ్యేనభయంబున బఱి తెంచి శిబిమఱుఁగు సొచ్చిన దాని నెగిచికొనివచ్చి శ్యేనంబు శిబి కిట్లనియె.

విను నుత్యధర్మ నిర్మలుగా విందు
నతనీకంబు బాడి యయ్యే యిచ్చ
డతిబుభుక్షితుండనై యున్న నాకునా
హారవిఘ్నమిట్టు లాచరింప.

సర్వభూతంబులు నాహారంబున జీవించివర్ధిల్లు నిది నాకు భక్ష్యంబు గ్గానివాడు బుభుక్షా వేదనంజేసి ప్రాణవియోగంబగు. నట్లయిన నా పుత్రులు భార్యయు జీవింపనేరరొక్క గపోతంబు రక్షించి పెక్కు జీవంబులకు హింస జేయుట ధర్మవిరోధంబు.

ధర్మజ్ఞులైన పురుషులు
ధర్మువునకు బాధ సేయు ధర్మువునైనన్
ధర్మముగా మదిదలపరు
ధర్మువు సర్వంబునకు హితంబుగ వలయున్.

కావున దీని నాహారంబుగా నిమ్మనిన దానికి శిబి యిట్లనియె

ప్రాణభయమున వచ్చి యిప్పక్షినన్ను
నాశ్రయించె నాశ్రితుడెట్టియధముడయిన.
విడువడనినను నే నెట్లువిడుతుదీని
నాశ్రితత్యాగమిది ధర్మువగునె చెపుమ.

నీవు పక్షివయ్యును ధర్మమెఱింగినట్లు పలికితి. శరణాగత పరిత్యాగంబు సేయుటకంటె మిక్కిలి యధర్మంబొండెద్ది నీ యాకలిదీనన కాని యొంటనునుపశమింపదే! నీ యత్నంబాహారార్థంబేని యిప్పుడివ్వనంబున మృగమహిష వరాహ ఖగమాంసంబులు దీనికంటె మిక్కిలిగా బెట్టెద నిక్కపోతంబువలన యా గ్రహంబుడుగుము. దీనినేనెట్లును విడువ ననిన శ్యేనం బిట్లనియె.

నాకువిహిత భక్షణంబిది యిప్పక్షి
బూనికావనీకు బుద్ధియేని
యవనినాథ దీనియంత నీమాంసంబు
దూచినాకు బెట్టుతొలంగకిపుడు.

అనిన ననుగ్రహించి మహావిహగో త్తమయందు నంతసం
బున శిబితక్షణంబ యసిపుత్రిక నాత్మశరీర కర్తనం
బనఘుడు సేసిచేసి తనయంగములంగల మాంసమెల్ల బె
ట్టినను గపోతభాగమ కడిందిగ డిందుచు నుండెనత్తులన్.

దానికి నచ్చెరువడి ధర
ణీ నాథుడు తనువునందు నెత్తురుదొరుగం,

దాన తుల యెక్కెనంతట
వానిగుణోన్నతికిమెచ్చి వాసవదహనుల్.

శ్యేన కపోతరూపంబులు విడిచి తమ నిజరూపంబుల జూపి నీధైర్యశౌర్యాది గుణంబులనన్య సాధారణంబులు గావున నీకీర్తి నిత్యంబై శబ్ద బ్రహ్మంబు గలయంతకాలంబును వర్ధిల్లుచు నుండెడుమని శిబికి వరంబిచ్చి యింద్రాగ్నులు చనిరి

ఓం తత్సత్ ఓమ్.

# శ్రీ బుద్ధ దేవుడు

మహాత్ముడును కరుణాస్వరూపుడునగు శ్రీ బుద్ధదేవుడు ఈ దృఢ వ్రతములో నిశ్చయబుద్ధి గలిగినవాడు. ఈపుణ్యావతారుని గూర్చి యింతకు ముందు భావశుద్ధియందు సంగ్రహముగా వ్రాయబడియుండుటచే మరల నిచట తెలుపబూనలేము. రాజాధిరాజగు శుద్ధోదన మహారాజునకు ఏకపుత్రుండై యుండు ఈ పరమోదారచరితుని, లోకగురుని, యవతార పురుషుని గురించి యెరుగనివారులేరు. దృఢవ్రతమును గురించి యీ యుగ్రతపస్వి నిర్వాణసిద్ధి గలుగుటకొరకు ఆరుసంవత్సరములు లనేక పర్వతపంక్తులలోను, గిరిగహ్వరములలోను, నిర్జనప్రదేశములలోను, పుణ్య తీర్థములలోను. పుణ్యాశ్రమములలోను. అనేక విధములగు అనేకాగాధ ధ్యానముల, అష్టాంగ యోగముల, తపస్సుల, సమాధినిష్ఠల నభ్యసించు కొనుచు నిర్వాణము(నిర్వికల్పసమాధి-ఈశ్వరసాక్షాత్కారము-ఆత్మలాభము-బంధవిముక్తి), గలుగక మనస్సులో ననేక విధములగు పరితాపముల నొందుచు నాత్మశాంతి గలుగక నాఖరున నీలాగున సంకల్పించుకొనిరి. దీని వలననే యీ మహాపురుషునియొక్క దృఢ సంకల్పము గోచరము గాగలదు. కావున ప్రతివారికి నొకానొక కాలమున పరిపక్వదశ గలుగునపుడు ఇట్టి దృఢసంకల్పము గలుగవలసియుండును. లేనిచో ప్రకృతినుండి విమోచనము కల్పాంత పర్యంతమెవరికిని గలుగదు. ఇది సత్యము. ఇంతవరకు లోకములో నున్నటువంటి మహనీయులందరకు ఆత్మశాంతి గలుగు నిమిత్తము బంధవిచ్ఛేద

నివృత్తి నిమిత్తము అటువంటిట్టి దృఢవ్రతముచేతనే ప్రకృతినుండి విమోచనము నొందిరి. ప్రకృతి కతీతమగు నట్టి మహోన్నత స్థితిలోనికి ప్రవేశించినపుడు సామాన్య ధర్మములును, సామాన్యపుణ్యములును, సామాన్య శాస్త్రములును, సామాన్య లోకమర్యాదలును, సామాన్య వంశ స్వభావమును, తండ్రి తాత ముత్తాతలనుండి వచ్చుచుండు ధర్మముల నతిక్రమించి పోవలసియుండును. పోవలసియుండునని చెప్పనేల పోయియే తీరవలయును.

శ్రీబుద్ధదేవులునిర్వాణపేక్ష్యర్థము నిర్జన ప్రదేశమున నాసనమును వేసి కూర్చుండుటకు నిశ్చయించినపు డీశ్లోకమును సంకల్పించి ధ్యానా రూఢత్వమును బ్రవేశించిరి.

ఇహాసనే శుష్యతు మేశరీరం
త్వగస్థిమాంసం ప్రళయం చ యాతు
అప్రాప్య బోధిం బహుకల్పదుర్లభాం
నైవాసనాత్కాయమతశ్చలిష్యతే॥

ఈ యాసనమునందు నాశరీరము ఎండి భస్మమైపోవుగాక! త్వక్, అస్థి, మాంసము మొదలగునవన్నియు శిథిలములై పోవుగాక! అనేక కల్పములకును బొందుటకు శక్యముగాని బోధితత్వమును అనగా నిర్వాణమును బొందక ఈయాసనమునుండి యీ దేహమును గదలింపను. అనగా లేవను. అని దృఢసంకల్పముజేసి ధ్యానసమాధిలో బ్రవేశించిరి, ఓహో? యెంత గంభీరభావము! ఎంత దృఢవ్రతము. ఎంత యమోఘమగు దృఢ సంకల్పము! ఇట్టి తీక్ష్ణమగు, దృఢతరమగు బుద్ధియనెడు ఖడ్గముచేత మాత్రమే యనాదిగా వచ్చుచుండు విషయములను సంసార పాశములను ఛేదింపే గలుగుదురు. కనుకనే గీతయందు "అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా" అని 15 వ యధ్యాయములో శ్రీకృష్ణభగవాను లుపదేశించిరి.

ఉదయతి యది భానుః పశ్చిమేదిగ్విభాగే
ప్రచలతి యది మేరుః శీతతాం యాతి వహ్నిః।
వికసతి యది పద్మం పర్వతాగ్రే శిలాయాం
న భవతి పునరుక్తం భాషితం సజ్జనానామ్॥

సూర్యభగవానుడు పశ్చిమమున నుదయించిన నుదయించుగాక! మహా మేరుపర్వతము స్వస్థానమునుండి చలించిన చలించుగాక! ఉష్ణ స్వభావముగల యగ్ని తనస్వభావమును విడిచి శీతలత్వము నొందినను నొందునుగాక! నీటిలో వికసించెడు పద్మము పర్వతాగ్రమందు రాతిపై వికసించినను వికసించుగాక! సజ్జనులగువారు తమ సంకల్పము నెపుడును మార్చుకొనజాలరు. ఇచట సజ్జనులని చెప్పినందుచే వారి సంకల్పము లుత్కృష్టములుగాను, పుణ్యవంతములుగాను దైవ భావము గలవిగాను నుండునని భావము ధర్మవైరుద్ధ్యము. పాపసంకల్పము, దుర్జనులకే గలుగును. వారుమాత్రము దుష్ట సంకల్పముల మార్చుకొనవలయునని భావము.

శ్రీబుద్ధదేవుని గురించి యింత మాత్రమే యిచ్చట చెప్పబడినది.

ఎప్పుడైనను, ఎవరైనను ప్రకృతినుండి విముక్తిగలుగు కాలము గలుగునపుడు ఇట్టి దృఢవ్రతము నవలంబించియే తీరవలయును, అట్లు గానిచో నెన్ని జన్మములకైనను ప్రకృతినుండి విముక్తి గలుగదు. ఎంత కెంతకు తన వ్రతమునందు దార్ఢ్యము గలుగుచుండునో అంతకంతకు ప్రకృతినుండి విముక్తిగల్గి యీశ్వరసమీపమునకు చేరుచున్నట్లు గ్రహించు కొనవలయును. అట్టి దృఢవ్రతములో నెంతమాంద్యము గలుగుచుండునో అంత దైవమునకు దూరముగాను, ప్రకృతికి దగ్గఱగాను తనయొక్క స్థితియున్నట్లు తెలిసికొనవలయును. ఇదే దీనియొక్క పరమార్థరహస్యము పర్వతోపరి భాగమునకు జేరదలంచువారు సోపానముల నిర్మించునట్లు మానవులయొక్క తురీయ స్వరూపమగు నీశ్వర సాక్షాత్కారమునకు నిట్టి దృఢవ్రతము సోపానమని తెలిసికొనవలయును. ఇంతకు ముందెవరైన, ప్రకృతినుండి విముక్తిగలవారై యుండినచో నిప్పుడుండి యుండినచో నికపై యుండబోవుచో నాఖరుననిట్టి దృఢ నిష్ఠగల్గినవారలైన, కలుగవలసిన వారలై యుందురు.

దృఢవ్రతము సంపూర్ణము.

ఓం తత్సత్

~~~~~~~~~~
~~~~~~~~~~

# శ్రీగీతాశాస్త్రమును గుఱించి

శ్రీభగవద్గీతా కల్పవృక్షము దినదినమునకు నవీన కోమల పల్లవ శాఖలచే ప్రపంచమంతటను వృద్ధినొందుట ముదావహము అనేకులు ఉచితముగాను, స్వల్ప వెలకుగాను గీతను ప్రచారములోనికి తీసికొని వచ్చుట భారతదేశ ఔన్నత్యమునకు బాలసహాయ భూతమగుచున్నదని తలంపవలెను. ఈగీతాశాస్త్రములోని ప్రతివచనమును, తేనెవంటిమాధుర్యము గల్గియున్నది.

అయితే నాగరికత అభివృద్ధినొంది సత్యసూర్యుడు ప్రకాశమునకు వచ్చుచున్న ఈకాలములో ఈపావన గ్రంథమునకు ఒకప్రక్క మూల శ్లోకమును, ఒకప్రక్క తెనుగు వచనమును ఉండిన ప్రస్తుతము లోకమున కెంతో ఉపయోగకరముగ నుండెడిది. భాషయెంత మధురముగా నున్నను మూలశ్లోకములేనిచో తృప్తినొందెడు కాలము దాటి పోయినది. కొందరు శ్రీభగవద్గీతకు తెనుగు వచనమును, తెనుగు పద్యములను వ్రాయుచు సంస్కృతము తెలియనిస్త్రీ బాలురకు ఉపయోగార్థముగా తామట్లు చేసినట్లు ప్రస్తావింతురు. మరికొందరు మూల శ్లోకము చదువుట కర్హతలేని శూద్రాదు లకు పుణ్యము కలుగుట కొరకు తామట్లనుగ్రహించినట్లు ప్రకటింతురు. అయితే అట్టి మూఢాంధ విశ్వాసము కాలగర్భములో కలసిపోయినందుచే ఇపుడు దానిని గూర్చి యేమియు చెప్పదలంచలేదు. మాఆశయమేమన, మూలశ్లోకము చదివి అర్థము గ్రహించుటకు శక్తిలేనివారు భాషలో వ్రాసిన వచనముగాని, పద్యములుగాని, చదువుకొని సారము గ్రహించిన బాగుండు ననిర్తా. ఇదే ఉత్తమపక్షముగా నుండును. సంస్కృతమూల శ్లోకము చదువక భాషమాత్రము చదువుకొనిన గలిగెడు విషయమై బ్రహ్మాండ పురాణము, మాత్స్యపురాణములో శ్రీఅగస్త్యసంహితయందు అగస్త్య మునీంద్రులచే చెప్పబడిన వాక్యములను వినుడు. అయితే ఇతి శ్రీమద్వాల్మీకి ప్రణీత రామాయణమును గూర్చిన దైవను మొత్తము సంస్కృత శ్లోకము లన్నింటికిని సంబంధించినదే యగును గాన యిచ్చట తెలుపబడినది.

సంస్కృతం రామచరితం పరిత్యజ్య నరాధమః।
యతవ్ భాషాంతర కృతం మృగతృష్ణాజలం పిబేత్॥

అనగా, సంస్కృత భాషావిరచితంబైన గ్రంథమును విడచి పెట్టి భాషాంతరీ కరణంబులను జదివెడు నొకమనుష్యాధముడు జలము లేని యెండమావులందు జలముగలదని గ్రోలబోవు వానివలె నల్లాడుచున్నాడు. మఱియు,

యస్తు సాంస్కృతికం త్యక్త్వాఽన్యత్కర్తు మిహేచ్ఛతి।
సురూపాం స్వస్త్రియం త్యక్త్వా కుష్ఠిమిచ్ఛ త్యరూపిణీమ్॥

న రాజ్య సంపదం త్యక్త్వా నరకం గంతు మిచ్ఛతి।
నయాగీయం పశుం త్యక్త్వా పితరం హంతుమిచ్ఛతి ॥

యస్తు రామాయణం త్యక్త్వా భాషాంతరం మిహేచ్ఛతి।
న గోక్షీరం విహాయాశు గార్దభీక్షీర మిచ్ఛతి।

అమృతస్య సర స్త్యక్త్వా విషం పాతు మిహేచ్ఛతి।
న దేవత్వం పరిత్యజ్య పిశాచత్వ మభీచ్ఛతి ॥

అనగా, సంస్కృత భాషయందలి గ్రంథములను విడిచి కేవల భాషాంతరీ కరణంబగు నితర గ్రంథములను కోరెడువాడు సౌందర్యవతియగు తన భార్యను బోనాడి, కురూపిణియగు కుష్ఠుగాత్రిని వరించిన వానివలెను, రాజ్య ప్రాభవంబులు వదలి నరకంబునకు బోవనిచ్ఛగించు వానివలెన్ను,యాగ పశువును విడిచి తన తండ్రినే చంపబూనెడువానివలెను. ఆవుపాలను బోనాడి గాడిదపాలను త్రాగ నపేక్షించువానివలెను. అమృతపు సరస్సును త్యజింపి విషము గ్రోలనుంకించువానివలెను, దేవత్వమును వదలిపెట్టి పిశాచత్వమును గోరు వానివలె నగుచున్నాడు - ఇత్యాదిగా పార్వతీదేవికి, పరమేశ్వరు డెఱింగించినట్లుగ ఉమాసంహితయందుగలదు. మఱియు నిట్టి ప్రమాణంబులను గూర్చి అగ స్త్యసంహితాదులును బాహాటంబుగ బ్రతిపాదించుచున్నవి.

మేఘజలమెంత శుద్ధమైనను భూమిపై బడుటచే అయాస్థలమ్ము ననుసరించిన స్వభావము కొంతవఱకైన ఏలాగున గల్గునో ఆలాగున భగవత్ప్రోక్తమగు వాక్యములు మానవాంతః కరణము ద్వారా భాషాంతరీ కరణ మొనర్చబడినప్పుడు తత్తద్ధృదయ స్వభావముకూడ వానియందు కొంత

కలియుచుండును. మఱియు వ్రాయువారి యూహననుసరించి లేనిదానిని కల్పించుటయు. ఉన్నదానిని విడచుటయు సంభవించుచుండును.

పాశ్చాత్యులగు అమెరికా, జర్మనీ మొదలగు దేశీయులు శ్రీ భగవద్గీతను ముఖ్యగ్రంథముగా పఠించెడు ఇక్కాలమున గీతాకామ ధేనువున, మాతృభూమియందలి భారతీయులందఱును స్త్రీ పురుషులును యీ పుణ్య గ్రంథమును పారాయణముచేసి పునీతులు కాకపోవుట కడుంగడు శోచనీయము. అకటా! ఇట్టి దురవస్థ యీ లోకమునుండి యెపుడు తొలగి సర్వజీవరాసులు ఈశ్వర సంతానమను జ్ఞానము గలిగి జనులెపుడు సుఖింతురో తెలియకున్నది. గీతను భగవద్భక్తిగలవారి కుపదేశించిన కలిగెడు ఫలమునుగుఱించి శ్రీకృష్ణభగవానులు గీత 18 వ అధ్యాయమందు 68, 69 శ్లోకములందు చెప్పినది చూడుడు.

య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥

అతిరహస్యమగు ఈ గీతాశాస్త్రమును నా భక్తుల కెవండుపదేశించునో అతఁడు నాయందు శ్రేష్ఠమైన భక్తిగలవాడై సమస్తసందేహములను నివర్తి చేసికొని నన్నే పొందగలడు. ఇందు సందేహము లేదు.

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి ॥

మనుష్యులలో నా భక్తులకు గీతార్థము జెప్పువానికంటె నితరుఁడు నాకు మిక్కిలి ప్రియుఁడు కలుగబోడు. భూత భవిష్యద్వర్తమాన కాలములలోను ఈ భగవద్గీతను జనుల కుపదేశించువానికన్న శ్రేష్ఠుడు నాకు మరొకడు ఉండియుండలేదు! ఉండుటలేదు. ఉండబోడు.

స్త్రీ శూద్రులకు ఈ గ్రంథాధ్యయనమున కర్హతగలదా లేదా యని కొంచెము యోచించెదము.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిమ్ ॥

ఓ పార్థా! నన్ను ఆశ్రయించి పాపజన్మము గలవారెవ్వరైన యుండిన వారున్ను, ఇక స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను, పాపవిముక్తులై ఉత్తమగతియగు మోక్షమును పొందుచున్నారు. అట్లుండ తక్కిన బ్రాహ్మణ క్షత్రియులగూర్చి వేఱు చెప్పవలెనా! అని భగవంతు డుపదేశించి యున్నాడు.

మఱియు నరనారాయణాంశ సంభూతులగు శ్రీకృష్ణార్జునుల సంవాదములో ఈ జ్ఞానోపదేశమును మొట్టమొదట భూలోకములో ధృతరాష్ట్రుని కొఱకు సంజయుం డుపదేశించెను. సంజయుండు సూత వంశోద్భవుడని మహాభారతమం దనేక స్థలములలో చెప్పబడినది సూతవంశీయులు శూద్ర జాతికి జెందినవారని లోక ప్రసిద్ధము. దీనినిబట్టి చూచిన శూద్రులు చదువవచ్చునా, చదివింపవచ్చునా యను సందేహము తొలగిపోవును.

ఇక స్త్రీల విషయముగూర్చి విచారింతము. ప్రారబ్ధకర్మ ననుభవించి సంసారదుఃఖమున తపించెడు జీవకోట్లకు భగవంతుని యెడ అనన్యభక్తి యెట్లు కలుగును? పాపవిమోచన మెట్లగును? మోక్ష మెట్లుసిద్ధించునని శ్రీవిష్ణు భగవానుని భూదేవియడిగెను. అట్లడిగిన భూదేవికొఱకు, ప్రారబ్ధమను భవించుచు పాపపంకములో మునిగిన జీవులకు గీతాపారాయణమే పాప విమోచనము కొఱకును, ముక్తికిని ముఖ్యసాధనమని విష్ణుభగవానుఁ డుపదేశించెను. ఇవ్విధముగ విచారించినను, గీత సోదరీమణులగు నారీ మణుల సౌమ్మని స్పష్టముగ తెలియుచున్నది. ఇట్లుండ వారికి దానియందు హక్కులేదని తిరస్కరించుట యెంత అపచారమో యూహించుకొనవచ్చును. గీతా మాహాత్మ్యము చూడుడు.

ధరోవాచ :—

భగవన్ పరమేశాన ! భక్తిరవ్యభిచారిణీ ।
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హేప్రభో! ॥

విష్ణురువాచ :—

ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।
స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్య తే॥

ఓం తత్ సత్ ఓమ్.

# ఋష్యాది న్యాసక్రమః



ఋషిచ్ఛందోఽధిదైవం ధ్యాయేన్మంత్రస్య సత్తమే।
యస్తు గార్గి జపేన్మంత్రం తదేవహి ఫలప్రదమ్॥ 1

భవేద్వీర్యవతీ విద్యా గురువక్త్ర సముద్భవా।
అన్యథా ఫలహీనా స్యా న్నిర్వీర్యాప్యతిదుఃఖదా॥ 2

ఓ గార్గీ! మంత్రధ్యానమునకు ముందుగా ఋషి, ఛందస్సు, దేవతలను, ధ్యానముచేసి యెవడు ధ్యానించునో, (జపించునో) ఆ మంత్రము మాత్రమే త్వరలో ఫలసిద్ధిని గలుగజేయును. అనగా మంత్రమునకు ఋషి, ఛందస్సు, దేవత, బీజము, శక్తి, కీలకము అను షడంగములు గలవు. ఇంకను అంగన్యాసము, కరన్యాసము మొదలగునవియు గలవు. ఇవన్నియు అంత అత్యావశ్యకములు కావుగాని ఋషి, ఛందస్సు, దేవత మాత్రము తప్పక యుండవలెను. కొన్ని మంత్రములకు ఇవి మూడు మాత్రమే యుండును. అధిక మంత్రములకును పైజెప్పిన ఆఱు అంగములుండును. ఈ ఋష్యాది న్యాసములు ఏదైన ఒక దేవత నుద్దేశించి యేర్పడు మంత్రములకు మాత్రమే యుండును. కొన్ని బీజాక్షరముల మాత్రమే జపము చేయువారలకు ఇట్టి ఋష్యాది న్యాసము లుండవు. ఆ బీజాక్షరములు ఒక్కొక్కటిన్ని ప్రత్యేక ప్రత్యేక ఫలములను గలుగజేయునవిగాను కొన్ని పైజెప్పిన దేవతా మంత్రములతో కలిపి జపించునవిగాను నుండును, ఈ ఋష్యాది న్యాసములు ముఖ్యములు. అంగన్యాస కరన్యాసములు అంత అత్యవసరములుకావు. ప్రత్యేక ఉపాసనాక్రియల ననుసరించువారికే అవి యుండవలసియుండును.

కేవలము భక్తితో ధ్యానము చేయువారలకు పైజెప్పిన ఋష్యాది న్యాసములుకూడ అవసరము లేదు. ఏలన, పవిత్రమైన భక్తి, శుద్ధమైన జ్ఞానమున్ను అమృతమువంటిది. అమృత సేచనముచే ఎటువంటి కాలకూట విషమైనను శమించునట్లు పవిత్రమైన భక్తి చేతను, నిర్మల జ్ఞానముచేతను ఎటువంటి దోషములైనను నశించును. వారికేలాటి విఘ్నములు గలుగవు. ఏలన, వారు సర్వభూతములలోగల ఆత్మను ప్రేమించువారగుటచే అన్ని

ప్రాణికోట్లను వీరల ప్రేమించును. అయితే శాస్త్రరీత్యా అభ్యాసికి అవి యుండుటయే మేలు, ఏలన కొన్ని విఘ్నములును, ఆపత్తులును, దుష్ట సంకల్పములును గలుగనీయక యీ మంత్రతేజస్సు అనగా మంత్రశక్తి సాధకుని సంరక్షించుననియే శాస్త్రకర్తలగు ఋషులమతము. కొన్నిటికి కవచము. అస్త్రము మొదలైనవిగూడ గలవు. ఇవి హృదయాది న్యాసము లలో కలసి వచ్చుచుండును. మంచి ఆచరణ, నిష్ఠ, కరుణ గలవారలై, తా ముపదేశించెడు మంత్రము, తాము జపించి సిద్ధిగలిగినదిగా నుండవలెను. అది యెక్కువ ఫలమును గలుగజేయును. అట్లుకాని మంత్రములు ఫల హీనముగాను, ప్రాణశక్తి లేనివిగాను నుండును. కామ్య కర్మపరునికి పైః చెప్పినవన్నియు సరిగా లేనిచో దానివలన కొన్ని ఆపత్తులకూడ కలుగ వచ్చును. ఫలాపేక్షలేక జ్ఞానప్రాప్తి నిమిత్తము దైవభక్తితో చేయు మంత్రమునకు ఇట్టి నియమము లేవియునులేవు. ఇట్లు యాజ్ఞవల్క్య మహర్షి శివసంహితయందు గార్గికొఱకు ఉపదేశించిరి.

మనశ్శుద్ధి గలుగుటకు, పాపములు నశించుటకు, జ్ఞేయమగు ఈశ్వరునియందు నిలకడ కలుగుటకు, నియమములను పాటించుటయే మేలు, సాధకుని భంగపఱచువారు భూతప్రేత పిశాచములేగాక విఘ్న దేవతలున్ను గలరు. ఎక్కువ ఉన్నతస్థితిని పొంది జీవన్ముక్తి పదమునకు వెళ్ళెడు యోగులను తపస్సులనుగూడ దేవతలు భంగపఱుప జూతురు. ఇటువంటి విపత్తులనుండి ఋష్యాది న్యాసములు కవచములు, దిగ్బంధ ములు రక్షించుననియే పరమఋషుల యభిప్రాయము. వేదాంతశాస్త్రములలో గురుశిష్యుల లక్షణము చెప్పేలాగున దివ్యమంత్రముల నుపదేశించెడు గురువుయొక్కయు, ఉపదేశము పొందెడు శిష్యునియొక్కయు లక్షణములు గూడ 'మంత్రరత్నమంజూష' యను గ్రంథములో చెప్పబడినవి చూడుడు. మంత్రము ప్రాణమువంటిదనియు, ఋషి, ఛందస్సు, దేవతాదులు నేత్ర ఘ్రాణకర్ణ జిహ్వాకర చరణాద్యంగముల వంటివనియు నభిప్రాయము. కనుకనే షడంగములు గల్గియుండుట మిక్కిలి మేలని చెప్పడమైనది.

గురులక్షణము :–

శాన్తో దాన్తః కులీనశ్చ వినీతః శుద్ధవేషవాన్ ।
శుద్ధాచారః సుప్రసిద్ధః శుచిర్దక్షః సుబుద్ధిమాన్ ॥

ఆశ్రమీ ధ్యాననిష్ఠశ్చ మన్త్రతన్త్రవిచక్షణః।
నిగ్రహానుగ్రహే శక్తో గురురిత్యభిధీయతే॥ 2

1. గురువు శాంతుడును, దాంతుడును అనగా శమదమములు గలవాడును, (బాహ్యేంద్రియ నిగ్రహము దమమనియు అంతరింద్రియ నిగ్రహము శమమనియు గ్రహించవలెను. అనగా బాగుగా ఇంద్రియ నిగ్రహము గలవాడని తాత్పర్యము). శ్రేష్ఠులవంశములో పుట్టినవాడును, మిక్కిలి వినయముగలవాడును. శుద్ధములగు వస్త్రాదులు ధరించువాడును, శుద్ధమగు ఆహారములు గలవాడును ప్రసిద్ధికెక్కినవాడును, బాహ్యాభ్యంతర శుద్ధిగలవాడును, కార్యనిర్వహణ సమర్థత గలవాడును, అనగా, అనుష్ఠానము నందు సమర్థుడును, మిగుల నిర్మలమైన బుద్ధిగలవాడునునై యుండవలెను.

2. వారువారు ఆచరించెడు ఆశ్రమములో గల నియమముల నన్నింటిని చక్కగ పాలించువారును, ధ్యానమందు సర్వదా నిష్ఠగలవారును, మంత్రతంత్రము లెఱింగినవారును నిగ్రహానుగ్రహ శక్తిగలవారును నగువారే గురుస్థానమున కర్హులగుదురు.

శిష్యలక్షణము :—

శాన్తో వినీతః శుద్ధాత్మా శ్రద్ధావాన్ధారణక్షమః।
సమర్థశ్చ కులీనశ్చ ప్రాజ్ఞః సచ్చరితో ధనీ॥ 1
ఏవమాదిగుణైర్యుక్తః శిష్యో భవతి నాన్యథా।
గురుతా శిష్యతా వాపి తయోర్వత్సరవాసతః॥ 2

1. శాంతచిత్తుడును, వినమ్రుడును, పరిశుద్ధమైన మనస్సుగల వాడును, అన్ని కార్యములలో మంచి శ్రద్ధగలవాడును ధ్యానధారణాదులు గలవాడును, మిక్కిలి క్షమగలవాడును, కార్యదీక్షగలవాడును, మంచి వంశములో పుట్టినవాడును, మంచి ప్రజ్ఞ గలవాడును శ్రేష్ఠమైన ఆచరణ గలవాడును, విజ్ఞానధనము గలవాడును నగువాడే శిష్యత్వమున కర్హుడ గును ఇట్టివానినే శిష్యునిగ గ్రహింపవలెనని అర్థము.

2. "గురుతా శిష్యతావాఽపి తయోర్వత్సరవాసతః" :— సంవత్సరా వధి గురువు శిష్యుని శిష్యుడు గురువును, చక్కగా పరిశీలించుకొని మాత్రమే

గురువు శిష్యుని అంగీకరించుటయు, శిష్యుడు గురువును గ్రహించుట ము తగును. అనగా ఒక సంవత్సర మొకే స్థలమునసుండి యోగ్యతాయోగ్యత లను తెలిసికొనవలసియుండునని యర్థము.

శ్రీభగవద్గీతలోగల ఋషిచ్ఛందాదుల గుఱించిమాత్రము దీనియం దు వ్రాయడమైనది. అనేకులు ఋషి అనగా నేమి! ఛందస్సననేమి? దేవత యననేమి? బీజ మనగా నేమి? శక్తియన నేమి? కీలక మననేమి - ఈ మున్నగు విషయముల లడుగుచుందురు. సామాన్యగ్రంథములలో నిది విశదముగ వ్రాయబడనందునను. తెలియ నభిలాషగల వారలనేకు లుండుట చేతను ఇపుడది వ్రాయదలంచితిమి.

"ఓం అస్యశ్రీ భగవద్గీతా శాస్త్రమహా మంత్రస్య - కొన్నిటిలో మాలామంత్రస్య అనియును కలదు. ఇది తప్పిదముకాదు. గ్రంథాంత రములలోను దేశాంతరములలోను ఆలాగున నుండును. రెండును ఒకే యర్థము సూచించును.

1. 'శ్రీవేదవ్యాసో భగవాన్ ఋషిఃఅనగా ఈగీతాశాస్త్రము నకు శ్రీవేదవ్యాస భగవానులు ఋషి. ఎవరిద్వారా భూలోకమునకు ఆయా మంత్రములుగాని, ఆయా శాస్త్రములుగాని ప్రప్రథమమున ఆవిర్భవించినవో వారే దానికి ఋషి యనంబడుదురు. వేద ఋక్కులను కనిపెట్టినవారే ఋషులు. ఇంద్రియముల కతీతమగు ఆత్మను దర్శించినవారు ఋషులు. ఉపాసనాదేవుని దర్శించినవారు ఋషులు. ఈ మూడును ఋషిశబ్దమునకు ముఖ్యార్థములు. అయితే గీతాశాస్త్రమును, శ్రీకృష్ణభగవానులు ఉపదేశించి యుండ శ్రీకృష్ణద్వైపాయనులు ఎట్లద్దానికి ఋషికా గల్గునని సందేహింప నక్కరలేదు. శ్రీకృష్ణార్జున సంవాదమగు సూత్రవాక్యములను వ్యాసభగ వానులే గ్రంథరూపముగ నిర్మించినారు. కనుకనే దానికి వేదవ్యాసులు ఋషి కాగలిగిరి.

ఋషియను శబ్దము పూర్వకాలపు ఋషులకు మాత్రమేగలదని తలంపరాదు. అతీంద్రియ జ్ఞానము గలవారలకు అది ఒక బిరుదముగ నున్నది. అనగా ఉన్నతమైన పరీక్షలలో ఉత్తీర్ణులగు నప్పుడు జడ్జి, వకీలు, డాక్టరు, ఇంజనీరు, మహోపాధ్యాయ, ఇత్యాది బిరుదములు లభించు

విధముననే ఋషియను బిరుదముయొక్క వ్యుత్పత్తియు నెఱుంగవలెను. అతీంద్రియ జ్ఞానముగలిగి దైవసాక్షాత్కారము గలవారల కిప్పుడు కూడ ఋషిశబ్దము వర్తించును. ఇపుడుకూడ ప్రసిద్ధమైన జ్ఞానముగల వారిని ఋషులని పిలుచుచున్నారు పైజెప్పిన డిగ్రీలు ఎట్లు విద్యాభ్యాసములచే సంపాదించుచున్నారో, బ్రహ్మనిష్ఠ, తపస్సు మొదలైన వానిచే ఋషిత్వముకూడ సంపాదించుకొనవచ్చును. ఇట్టి లక్షణములు గల్గినపుడే ఋషి యనంబడుదురు.

ఊర్ధ్వరేతా తపస్యుగ్రో నియతాశీచ సంయమీ।
శాపానుగ్రహయోశ్శక్తః సత్యసన్ధోభవేదృషిః॥

ఊర్ధ్వరేతస్సు గలవాడు, ఉగ్రమైన తపస్సు గలవాడు, నియమితమగు ఆహారము నియమిత సమయమున భుజించువాడు ఆత్మ సంయమము గలవాడు శాపానుగ్రహములందు శక్తిగలవాడు, సత్య సన్ధుడు— ఇట్టి గుణములు గలవాడే ఋషి యనబడును.. పూర్వకాలములో కూడ పుట్టినవారందరును ఋషిత్వమును పొందియుండలేదు. శ్రీవాల్మీకి, శ్రీవిశ్వామిత్రుడు, శ్రీజనకుడు, శ్రీసత్యకాముడు మొదలగు పురుషులున్ను,* మైత్రేయి, గార్గి సులభ, విశ్వవర, కాత్యాయని మొదలగు నారీమణులున్ను పుట్టుకలో సామాన్య మానవులవలెనుండి బ్రహ్మచర్యము, తపస్సు వేదాధ్యయనము నాశ్రయించి ఋషిత్వము నొందిరి. పరిశ్రమ చేయని వారెవరును ప్రపంచములో పవిత్రులై యుండలేదు.

2. అనుష్టుప్ ఛందః (క్వచిన్నానాఛన్దాంసి) సామాన్యముగ గీతాశాస్త్రమంతయు అనుష్టుప్ ఛందస్సుతో గూడినది. అచ్చటచ్చట కొన్ని శ్లోకములు మాత్రము ఇతర చ్ఛందస్సుతో కూడినవియు గలవు. అనుష్టుప్ ఛందస్సునకు నాల్గుపాదములున్ను, ఒక్కొక్క పాదమునకు ఎనిమిది అక్షరముల చొప్పున మొత్తము 32 అక్షరములున్ను కలిగియుండవలెను. కావున 8, 8 అక్షరములయిన పిదప పదములను నిలిపి చదివిన, సామాన్యముగా సంస్కృతము తెలియనివారలకుకూడ గీతను, చదువుట కలవాటు గల్గును, ఛందస్సుగూడ దైవీకమగు శక్తి గల్గియుండును.

3 శ్రీ కృష్ణపరమాత్మా దేవతా'— మంత్రముయొక్క అధిష్ఠాన దైవమును దేవత యందురు. శ్రీకృష్ణభగవానులు సాక్షాత్ దైవ స్వరూపుల గుటచే గీతాశాస్త్రమునకు వారు దేవతగా నున్నారు, అనగా గీతయొక్క ప్రతిశ్లోకము పఠించునపుడు దైవస్వరూపులగు శ్రీకృష్ణ భగవానుని ధ్యాన మందుంచుకొనవలయును. ఇట్లే ఒక్కొక్క మంత్రమునకును ప్రత్యేక ప్రత్యేక దేవతలు కలరు,

4. 'అశోచ్యానన్వశోచ స్త్వమితి బీజం' గొప్పదగు మఱ్ఱిచెట్టు సన్నని విత్తనములో ఎట్లిమిడియుండునో, అలాగున మంత్రార్థము యొక్కయు, లేక శాస్త్రార్థము యొక్కయు సారమంతయు బీజమందిమిడియుండును. మొదట బీజ మతిసూక్ష్మముగ నున్నను వృక్షమై పరిణమించునపు డెంతయో మహత్తరముగ నుండునట్లు మంత్రమున్ను అలాగున పరిపక్వమై ఫలము నకు వచ్చునపుడు అంత మహిమాతిశయము గల్గియుండును. 'అశోచ్యానన్వ శోచ స్త్వమితి బీజం'- అని కొన్నిటియందు ఒక్కపాదముగాను, కొన్నిటిలో రెండుపాదములుగాను కొన్నిటిలో శ్లోకము పూర్తిగను నుండును ఇదియు తప్పిదమని తలంపరాదు. పాఠాంతరమనియే తలంపవలెను 'అశోచ్యా నన్వశోచ స్త్వమితి' అనునదే ఈ గీతాశాస్త్రమునకు బీజము. ఈ శాస్త్రసార మంతయు ఈ ఒకేశ్లోకములో నిమిడియున్నది. అంతేగాక, ఈశ్లోకారంభము నుండియే గీతాశాస్త్రమును శ్రీ కృష్ణభగవానులు ఉపదేశింప ప్రారంభించి యున్నారు. ఈశ్లోకమును అ. 2, శ్లో॥ 11 లో గనందగును. ఇది ప్రారంభ మగుటచేతనే బీజమను పేరు గల్గియున్నది. దీనికిముందున్న శ్లోకములన్నియు కురుక్షేత్రములో జరిగిన విషయమును గురించి చెప్పబడినవేగాని గీతార్థ మును గూర్చి కాదు.

5. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజేతి" శక్తిః — దేనియందు ఏ తేజస్సు, ఏ ప్రభావము, ఏ మహిమ, యే చైతన్య ముండునో అది దానియొక్క శక్తి యనంబడును పైజెప్పిన యీ నాల్గుశక్తులున్ను ఈశ్లోకములో నుండుటయే దీనిని శక్తియని జెప్పుటకు కారణమైనది. గీతయొక్క దివ్యశక్తియంతయు దీనియం దిమిడి యున్నది. ఇది అ. 18-66 శ్లోకమున గలదు.

6. 'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ' ఇతికీలకం-ఇది పైశ్లోకములోని రెండవపాదమై యున్నది. (అ. 18, శ్లో॥ 66,) ఈ శ్లోకములోనే శక్తిన్ని కీలకమున్ను అమరియున్నవి: కీలకమనగా రహస్యమని యర్థము. సాధారణ జను లెవరికిని తెలియక గూఢముగా నుండునదగుటచే దీనికి కీలకమని పేరు వచ్చినది. ఇది అనుభవజ్ఞులగు మహనీయుల కరుణ వలననే తెలియదగును ఎట్లన మనకేదైన యంత్రము దొరికినదానిని ఉపయోగపఱచెడి పద్ధతియు, దానివలన నేమేమికార్యములు చేయవచ్చునను సంగతియు, ఎచ్చటెచ్చట మన్త్రిప్పిన ఏమేమిపనిచేయునో అదియు అనుభవజ్ఞులవలన నెట్లు తెలిసికొనవలసియుండునో మఱియు, అది యేలాగున అతిరహస్యముగ నుండునో అలాగున గీతాశాస్త్రముయొక్క రహస్యమంతయు, పరమనిగూఢ తత్త్వమంతయు ఈ శ్లోకమున గలదు. కనుకనే శ్రీరామానుజాచార్యులు మొదలగు మహనీయులందఱును ఈ శ్లోకమును చరమ శ్లోకమని యుపదేశించిరి. ఈ ఒక్క శ్లోకమునకు శ్రీభాష్యకారులు విస్తారముగా అర్థమును వ్రాసియున్నారు. వైష్ణవ సంప్రదాయములో శ్రీఅష్టాక్షరీమంత్ర మెటువంటిదో యీ చరము శ్లోకముగూడ అటువంటిదే. వారిద్దానిని అంత పవిత్రముగ భావించి పఠింతురు. నిజముగ ఇది పరమ రహస్యముగాను పరిపక్వజీవులు గ్రహింపతగినదిగాను, దైవసాక్షాత్కారము పొందిన గురువులవలననే గ్రహించ దగినదిగను నున్నది. కీలకపదమునకు ఎవనికి తెలియని నిగూఢమర్మమనియు అర్థము గలదు. శ్రీకృష్ణపరమాత్ముని అంతరంగ రహస్య మంతయు దీనియందు గలదు. దీనికి కీలకమని పేరు కలుగుటకు కారణ మిదియే.

ఋషి అను మంత్ర ముచ్చరించునప్పుడు శిరస్సుపైనను, ఛందస్సు అని యుచ్చరించునపుడు ముఖముపైనను, దేవతయని చెప్పునప్పుడు హృదయముపైనను, బీజమని చెప్పునపుడు వక్షస్థలముయొక్క దక్షిణ భాగమునను, శక్తియని చెప్పునపుడు వామభాగమునను, కీలకమనియుచ్చరించునపుడు నాభి (బొడ్డు) యందును, హస్తమునుంచుట శిష్టాచారమై యున్నది. వీనికి షడంగములని పేరు. ఈ విషయమును గూర్చి పైన వ్రాయబడియున్నవి. సామాన్యమంత్రము లన్నిటికిని ఈ షడంగములే యుండును.

7. "మచ్చిత్తస్సర్వ దుర్గాణిమత్ప్రసాదాత్తరిష్యసీ" తికవచం — కవచమనగా ఆత్మరక్షణయని అర్థము. యుద్ధమునకు వెళ్ళునపుడు కవచమును ధరించుట గలదు. దానికే వజ్రకవచమను పేరున్ను గలదు. దీనిని మిక్కిలి కఠినమైన లోహముచే నిర్మింతురు. శత్రువులు ప్రయోగించెడు శస్త్రములేవియు దేహమందు తగులనీయక చేయునది కవచమనబడును, ఈ మంత్ర ముచ్చరించునపుడు వజ్రాయుధమునకైన భేదింపనలవికాని యొక తేజోమయమగు కవచమును తానుధరించినట్లు భావింపవలెను. అరణ్యప్రదేశములలోను, పర్వత గుహలలోను, ఏకాంత ప్రదేశములలోను యోగ ధ్యాన సమాధితపస్సుల జేయువారు మంత్ర పూతమగు నిట్టి కవచమును భావనారూపముగ ధరింతురు. అట్టిన భూత ప్రేతపిశాచాదులుగాని, దుష్టగ్రహములుగాని బాధింపవనియు, మనస్సును మాలిన్యపఱచెడు చెడు సంకల్పము లుదయించవనియు అంతేగాక దుష్టమృగముల వలన బాధయు గలుగదనియు మంత్రవేత్తలగువారి విశ్వాసమైయున్నది. ఇదిన్ని ఒక విధమైన భావనావిశేషమే, కాని ఆ మంత్రము నుచ్చరించనిచో ఆ సమయములో అట్టి భావనచేయుట దుర్లభమగునని తలంచి యిట్టి ఏర్పాటు చేయబడినది. ఈశ్లోకము 18 అ 58 శ్లోకమున గలదు.

8. 'కిరీటినం గదినం చక్రహస్త మిత్యస్త్రం' —అస్త్రమనగా శర— పంజరమని అర్థము అనగా శరములతో చేయబడిన ఒక గూడు వంటిదని భావము. తపస్సు, యజ్ఞము, యోగము మొదలగు వానిని భంగపఱచెడు రాక్షసులు పిశాచములు మొదలైన దుష్టగ్రహములు గలవు. లేక కొందఱి మానవులకు తన యనుష్ఠానమును భంగపఱచెడు దుష్టక్రియలుగాని, ఘారణములుగాని, విఘ్నములుగాని యొనర్చే మాంత్రిక ప్రయోగము కూడ నుండును. అట్టి దోషము లన్నింటిని ఈ అస్త్రమను యంత్రము ఖండించి వేయును. నాగాస్త్రమును, గరుడాస్త్రమున్ను, అగ్నేయాస్త్రమును వారుణాస్త్రమున్ను, యెట్లు శమింపచేయునో ఆలాగున వైరులయొక్క ప్రయోగములన్నియు దీనిచే ఖండింపబడును. ఇది అ 11-17 శ్లోకమున గలదు,

9. 'అనాదిమధ్యాన్త మన న్తవీర్య మితిధ్యానం' — ధ్యాత అనగా ధ్యానించువాడు. సాక్షాత్ కృష్ణపరమాత్మయొక్క స్వరూపము నేలాగు

ధ్యానించవలెనో అది దీనిలో చెప్పబడినది ఈశ్లోకములో చెప్పేలాగున ధ్యానకాలమున తప్పక హృదయములో ధ్యానించవలెను. ఇది పరమాత్మ యొక్క అనంతశక్తిగల అనంత స్వరూపముయొక్క ధ్యానమని గ్రహించవలెను.

ఇక అంగన్యాసములో దిగ్బంధ మొకటిగలదు. పై జెప్పినవానిలో ఈ భావ మిమిడియున్నందువేతను, అంగన్యాసములో నిది యుండుట చేతను ప్రత్యేకముగ యిట దీనిని చెప్పలేదు. దిగ్బంధమనగా అష్టదిక్కులనేగ్వర్గ ఆకాశ పాతాళములు రెండునుజేరి దశదిక్కులను బంధించుట యగును. అనగా శత్రువులను నిరోధించుట యని భావము. రాజులు కోట గట్టి శత్రువుల నిరోధించుటకొఱకు భటులను ఏర్పఱచేలాగున ఏకాంత ప్రదేశములో ఎక్కువకాలము మంత్ర పునశ్చరణచేసి దేవతా సిద్ధిని పొంద తలంపుగలవారున్ను, తపస్సువలన గొప్ప సిద్ధిని బడయ గోరువారున్ను మంత్రభావముతో నిట్టి దిగ్బంధముల జేయుదురు. ఇదిన్ని పై జెప్పే లాగున దుష్టగ్రహాదుల బాధలేకుండుటకొఱకు ఏర్పడినది. ఇవన్నియు చాలవఱకున్ను కర్మకాండములతోను, భేద భావములతోను కూడినవనియే చెప్పవచ్చును. అయితే దీని రహస్యము పైన చెప్పబడియే యుండెను.

సర్వ జీవరాసులయెడ కరుణగల్గి సమస్తచరాచర ప్రాణికోట్ల యందు వెలుగుచుండు పరమాత్మను తన ఆత్మలో ధ్యానించువారి ధ్యానము ఒక్క ప్రాణికికూడ కీడు గలిగింపదు. కీడు గలుగజేయకుండుటయేగాక బహు విధముల మేలునుగూడ గలుగజేయును. అట్టివానికి తనయొక్క పరిశుద్ధభావనయే బ్రహ్మాండకవచమును, దశదిక్కుల బంధనముగాను నగుచుండును, కనుక పరిశుద్ధమైన హృదయముకంటెను, జీవరాసుల యెడ కరుణకంటెను. అనన్యమగు యీశ్వరభక్తి కంటెను మించినదిమూడు లోకములందును యుండియుండలేదు. ఉండుటలేదు నుండబోదు. సత్యముయొక్క శక్తి అపారమైనది. దానియొక్క మాధుర్యమును, మహిమయు, ప్రత్యక్షఫలమున్ను అనుభవజ్ఞులే యెఱుంగగలరు. సత్యముయొక్క మహిమనుగూర్చి యిట్లు వర్ణింపబడినది—

శ్లో॥

సత్యం ధర్మ స్తపో యోగః సత్యం బ్రహ్మ సనాతనమ్।
జ్ఞః పరః ప్రోక్త। సర్వం సత్యేప్రతిష్ఠితమ్॥

ఇప్పుడు ఋష్యాదిన్యాసములలోగల బీజము మొదలుకొని అని శ్లోకములును పూర్తిగ ఈక్రిందవ్రాయబడుచున్నవి—

అశోచ్యానన్వశోచ స్త్వంప్రజ్ఞావాదాంశ్చభాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచ న్తి పండితాః॥
అ, 2 శ్లో 11, బీజము

సర్వధర్మాన్‌పరిత్యజ్య మామేకంశరణంవ్రజ—శక్తి
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥
కీలకము అ· 18, శ్లో, 66

మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి।
అథచేత్త్వమహంకారా న్నశ్రోష్యసివినజ్ఞ్యసి॥
అ. 18 శ్లో 58. కవచము.

కిరీటినంగదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తాత్
దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్॥

అ. 11 శ్లో 17 అస్త్రము

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే॥

అ. 11 శ్లో, 18, ధ్యానము

ఓం తత్ సత్ ఓమ్.

# పురోవృద్ధిని గోరువారు పూర్వవృత్తాంతమును మఱువగూడదు.



ఈ విషయమును గుఱించి మనము గ్రహింపుకొనవలసిన సంగతులు నాలుగు కలవు. అనగా దీనికి నాలుగువిధములగు అర్థములు గలిగి యున్నవి. ఈవాక్యము చాల తత్త్వబోధతో కూడినది. ఇది ధర్మమును తెలిపెడు వేదవాక్యము వంటిది. దీనియందు శ్రద్ధనుంచకపోయిన మనుజుని యితర ప్రయత్నములన్నియు మూలము చెడిన వృక్షమువలె నష్టములై పోవును. అంతేగాక, అతడు ఎన్నిఎన్ని కార్యములు చేసినను అనేక అంతస్తులతో గట్టినసౌధము పునాది భిన్నమైనచో ఒకదానిపై మఱియొకటి కూలిపోవులాగున, చేసిన కార్యములన్నియు నష్టములై పోవును, సామాన్య దృష్టితో జూచిన యిది కృతజ్ఞతను జూపెడు విహ్నము గలదిగా నుండును. అనగా సదా కృతజ్ఞతకలవాడై యుండవలెను. కృతజ్ఞతయే ధర్మమునకు మూలము. కృతజ్ఞతగలవాడే ధర్మాత్ముడు. దీనిలో సామాన్యజనులకు తగిన యిహసంబంధ అర్థముకూడ గలదు. విశేషబుద్ధిగలవారికి, పరమునకు సంబంధించిన అర్థముతో గూడియుండును.

1. మొదటిది మామూలుగా చెప్పెడి యర్థము. అనగా ఒక్కడు సామాన్యస్థితిలో నుండునపుడు ఎవరెవరు తనకు సహాయపరులై యుండిరో, విశేషస్థితి గలుగునప్పుడు అట్టి సంగతి మఱచి ప్రవర్తించుట యగును. ఇది కృతఘ్నుల స్వభావము. కృతజ్ఞత కలవాడు తనకెంత ఉన్నతస్థితి కలిగినను తన పూర్వస్థితిని మఱచి ప్రవర్తింపడు. ఇది ధర్మ స్వభావము గలవారలయొక్క ముఖ్యగుణమై యుండును. ఇట్టివారిని సజ్జనులనదగును. తక్కినవారలు దుర్జనులతో సమానులు. కొందరు కడుబీదలై యుండునప్పుడు ఎవరెవ్వరి సహాయము గలిగియుండెనో విశేషస్థితి గలుగునప్పుడు ఆ సహాయపడిన వారిని మఱచిపోవుటయు, వారిని అశ్రద్ధతో జూచుటయు సంభవించుచుండును.

అట్లు కూడదని యీవాక్యము మన కుపదేశించుచున్నది. మామూలుగ తందరున్ను అట్టివారిని చూచిన ఏమి పూర్వ వృత్తాంతమును మఱచి పోయుంటివా! అని అడుగుట కూడగలదు. ఈవాక్యమును లోకముతో

చెప్పనీయక చూచుకొనవలెను. మఱియు, కొందఱు పేదరికముతో నుండు వారుకూడ మహాత్ముల దగ్గరజేరి వారి కార్యములలో ప్రవర్తించి, అచ్చట వారితో కలసియుండునపుడు, తమయొక్క పూర్వ సంగతిని బొత్తిగ మఱచి పోయి ప్రవర్తింతురు. ఇదిన్ని చాల తక్కువ స్వభావమని మఱువకూడదు ఆలాగున బీదరికములో నుండి కొందఱు ధనవంతులయిన తరువాత పూర్వముండిన తమ సొంతజనులనుకూడ చాల తక్కువబుద్ధితో చూచు వారుకూడ గలరు. మఱికొందఱు చాల తక్కువ స్థితియందుండి దైవకృపచే గొప్ప ఉద్యోగస్థితి గల్గినను, పైజెప్పిన వారిగుణములు గల్గియుందురు ఇది కృతజ్ఞతా స్వభావములేని వారిగుణమని మఱవకూడదు ఇట్టివారికి గలిగియున్న పదవులేవియు శాశ్వతముగ నిలువజాలవు. ఏలన, ధర్మస్వభావము గలవారిని మాత్రమే ఈశ్వరుడు సంరక్షించును. పైజెప్పిన స్వభావముగల వారందరును స్వల్పబుద్ధిగలవారు, అల్పబుద్ధితో కూడియున్నవారు. ఇట్టివారు ఎక్కువ ఆడంబరముతో కూడియుందురు. అది వారి ఆత్మను మరుగుపరచుచున్నదను సంగతిని వారు తెలిసికొన జాలకున్నారు. ఇట్టి దోషము గలుగ నీయక చాలజాగ్రతతో బుద్ధిమంతులు చూచుచుండవలెను. వీరికి పతనము గలుగదు. ధర్మదేవత వీరిని సదా సంరక్షించుచుండును.

ఈ యర్థమందు మరియొక విషయముగూడ గలదు. అదేమన, ఒకడు ఉన్నతస్థితిలోనికి వచ్చినపుడు, తనయొక్క నిమ్నస్థితిలోనుండు స్వభావములనుమఱచి, ఉన్నతస్థితిలోని స్వభావము గలిగియుండవలెను, ధనముగల్గిన, దానికి తగిన ఉన్నతగుణమున్ను, ఉద్యోగమువచ్చినదానికి తగిన ఉదార స్వభావమున్ను, భక్తిగాని, జ్ఞానముగాని, యోగసిద్ధిగాని గల్గినవానికి సంబంధించిన శాంత శమదమాదులున్ను, జీవరాసులలో కరుణయున్ను, విశాలబుద్ధియున్ను, అగాధబోధమున్ను గల్గియుండవలెను వీరందరున్ను, తమలో ఏదైన చిన్నగుణముగాని, దృశ్యవృత్తులుగాని, యింతవరకు గలిగియుండిన వాటినన్నిటిని మఱచిపోవలెను. ఇప్పుడు తానవలంబించిన వృత్తికి తగిన యోగ్యత గల్గియుండవలెను. ఇదియొక యర్థము. ఇచట పూర్వవృత్తాంతమును మఱచిపోవలెను. ఈరెండర్థములున్ను ఒక్కదానినే తెలుపుచున్నవి. కనుక యిదిన్ని మొదటి అర్థముతో

చేరియున్నది. ఈభావములో పురోవృద్ధిని గోరువారు పూర్వ వృత్తులన్నిటిని మఱచిపోవలెను. నూతన జన్మమేర్పడవలెను. చెట్టునుండి ముదిరిని ఆకులు రాలిపోయి, ఎట్లు క్రొత్త చిగురులు పుట్టుచుండునో అలాగున జీవితమంతయు దివ్యమై, శోభాయమానమై మారవలెను.

2. ఇపుడు రెండవ అర్థమునుగూర్చి విచారించెదము. ఇది మనకు సదా పురోవృద్ధికి మార్గమును చూపుచుండును, గమ్యస్థానము చేరువర కున్న విశ్రాంతిని పొందగూడదని యెల్లప్పుడు మనలను ప్రేరణ చేయు చుండును అదేమన,మొట్టమొదట మనము ఏఉద్దేశముతో బ్రహ్మనిష్ఠా మార్గము నవలంబించితిమో, ఏ ఉద్యమముతో విరక్తి నాశించితిమో, ఏకారణముచే గురువు నాశ్రయించి సాధనలజేసితిమో, ఏ హేతువువల్ల ధ్యాననిష్ఠలోదిగితిమో, ఏకారణమువలన గురువుచే మంత్రోపదేశ మందితి ఏతాపత్రయాగ్నిని చల్లార్చుటకొరకు ఆత్మ విచారములోనికి ప్రవేశించి తిమో, ఏహేతువువల్ల సాధువృత్తి నవలంబించితిమో, దేనివలన తపో భూమిలోనికి నరిగితిమో, ఏపరిశుద్ధ విచారముచే సమస్తము త్యాగ మొనరిం తిమో· ఏఈశ్వరకరుణ గలిగి జన్మసాఫల్య మొందవలచి యిల్లువిడిచితిమో ఏఆత్మ సాక్షాత్కారము గల్గి ప్రపంచములో తాపత్రయాగ్నిచే తపించెడు జీవకోట్ల తాపము చల్లార్పనెంచితిమో, ఏఆత్మజ్ఞానామృతమందు మగ్నులై తన ఆత్మను నిత్యానందపదవిలోనికి జేర్పతలంచితిమో, ఈలాటికార్యము లన్నిటిని మఱుపుగలుగనీయక, సదా వానియందు ప్రయత్నముగల్గి యుండుటయే రెండవ మార్గమగును. మధ్య, మనము సంసర్గదోషము వల్ల, లేక శరీరబంధ జాడ్యము వల్లనో అట్టి పరిశుద్ధమగు సంకల్పమ మండి జారిపోయితిమా! పూర్వముండిన నిర్మలభావము మనకు సదా గలిగియుంటు న్నదా? లేక యిక యేదైన మార్గములోనికి మనస్సు దిగిపోయినదా, యని చూచుకొనుచు పైకార్యములన్నిటిని సదా జ్ఞప్తిలోనుంచి జాగ్రతగల్గి వర్తింప వలెను· ప్రపంచ వ్యామోహము వలనగాని, దృశ్యవిషయములచేగాని, బాహ్యసౌఖ్యములచేగాని మనస్సు బహిర్ముఖమైమాలిన్యమునందినదా? పూర్వముండినంత వైరాగ్యము గలిగియున్నదా? పూర్వముండిన తీవ్ర ధ్యాననిష్ఠగలగియున్నదా లేక మందగించినదా? శాంతికి భంగముగల్గినదా? సత్యము నుండి మనస్సు దూరముగ పోవుచున్నదా? కారుణ్య స్వభావము

సన్నగిల్లినదా? రుచికరములగు భోజనాది వస్తువులు గావలెనని మనస్సు కోరుచున్నదా? శయనము, భవనము, సుందరములుగా నుండవలెనని మనసు ఏదైన ఆలోచన చేయుచున్నదా? అని ఈ మొదలగు కార్యము లన్నియు జ్ఞాపకములో నుంచుకొని, పూర్వాధిక ధ్యాననిష్ఠ గలిగియుండే లాగున చూచుకొనవలెను.

అట్లు ఏదైన మనస్సు మాలిన్యము గలిగియున్నదని తోచినచో ప్రాయశ్చిత్తము చేసికొని పశ్చాత్తాపపడి, దైవప్రార్థనగాని, గురుధ్యానము గాని చేసికొని నిష్ఠప్రారంభించుకొనవలెను. మనస్సు మాలిన్యము గలుగుటకు నివాసస్థల దోషమని తలచిన, అట్టిస్థలమును వెంటనే మార్చుకొనవలెను. సంసర్గలోపమువలన గలిగెనని తలంపుయున్న, అదిన్ని మార్పు చేసికొన వలెను. ఏవిధమైనను, ఈశ్వరసాక్షాత్కారము గలుగువరకు, నిలుకడ కలుగ నీయక, ధ్యాననిష్ఠ చేయుచుండవలెను. ఆహారదోషము కంటె నివాసదోషము మిక్కిలి అపాయము కలుగచేయును. ఏవిధమైన విషయము స్ఫురించే స్థలములో నుండరాదు. ఇదేదానిలో ముఖ్య కారణము. నాకు తెలిసిన వారిలో ఆహారదోషముచే చెడినవారు తక్కువ గాను, నివాసస్థల దోషముచే పతితులైనవారు పెక్కండ్రును గలరు, నిష్ఠయందు తైలధారవలె అవిచ్ఛిన్న ముగ, ధ్యానము జరిగేలాగున చూచుకొనవలెను, ఇదే ఉత్తమాధికారి యొక్క గురుతుగా నుండును. మనోగతి తప్పినదని తోచినవెంటనే కాలువలు తెగి జలము కుమార్గములో పోవుచుండిన ఏలాగున వెంటనే కట్టలు బాగుగాగట్టి సన్మార్గములో నీటిని పోయేలాగున - వేయుదురో ఆలాగున సాధకుడు సదా చూచుకొనుచుండవలెను. లేక సోమరితనము వృద్ధినొందినదని తోచిన అది ఆహారదోషముచేతనే గలిగియుండునని తలంచి ఆహారముయొక్క నిశ్చలనియమము చేసికొనవలెను. ఉపవాసములు కొన్ని చేయవలెను. అనుకూలముండిన ప్రాణాయామమున్ను కొంత శీలించవలెను. దీనివలన సోమరితనము పారిపోవును. నిశ్చిత సమయమున నియమిత ఆహారము తప్ప యితర వస్తువులుగాని యితరకాలములోగాని ఏమియు తీసికొనరాదు. అదే దీనిలోగల రహస్యము.

మనస్సు ఏదైన విషయముచే మాలిన్యము పొందినదని తోచిన, మలిన వస్త్రమును చవుడుమట్టిలో ఉడుకపెట్టి ఎండతోమంచి

నీటితో తడిపి యేలాగున చాకలివారు శుద్ధముగ చేయుదురో, అలాగున తపస్సుచేతను, మంత్రవ్రతముచేతను, ధ్యానము మొదలగువానిచేతను ఆత్మను శుద్ధిపరచుకొనవలెను. ఈ కార్యములో ఏలాటి అభిమానముగాని, అహంకారముగాని గలుగనీయక చూడవలెను. అట్లైన, చుక్కాణిగల పడవ ఏలాగున గమ్య స్థానము తప్పక పోయిచేరునో, అలాగున మీయొక్క ఉద్దేశ్యముకూడ నెరవేరగలదు. లేనిచో చుక్కాణి చేతినుండి జారిపోయిన పడవ యేలాగున గమ్యస్థానము చేరలేక గాలివలనగాని, ప్రవాహ వేగము వలనగాని, అచ్చటికి, ఇచ్చటికి కొట్టుకొనిపోయి శిథిలమైపోవునో, అలాగున జీవితముకూడ గమ్యస్థానమునుండి పతనముగల్గి వ్యర్థమైపోవును. వ్యర్థమై పోయినను పోనీ అంతమాత్రముకాదు. అనర్థముకూడ గల్గును పుణ్యపురుషులు. పరిశుద్ధాత్ములును, దైవకృపయు. గురుకరుణయుగలవారలు, తమయొక్క నైజగుణమును ఎట్టి విపత్తులలోగూడ విడనాడరు. వారికి ప్రాణహాని గలుగునాయని యేలాటి విచారము గలుగదు గాని, తమయొక్క వ్రతభంగము గలుగునాయని మాత్రము సదా భయము గలిగియుండును. వ్రతనియమము గలిగియుండిన ప్రాణభయము గలుగదు. ఏలన, వారి వారిధర్మము వారివారిని సదా సంరక్షించుచుండును. అట్టి ధర్మదేవత ఎల్లప్పుడున్ను వారిని కనిపెట్టి రక్షించుచుండును. అగ్ని ఏలాగున తనయొక్క ప్రకాశము విడిచియుండుట లేదో, జలమేలాగున తనయొక్క ద్రవత్వమును విడుచుటలేదో, వాయువేలాగున తనయొక్క చలనత్వము ద్యజించియుండుటలేదో, ఆకాశ మేలాగున తనయొక్క స్వచ్ఛత్వము నుపేక్షించియుండుటలేదో, అలాగున పుణ్యపురుషులు తమయొక్క ధర్మమును విడిచియుండరు, సూర్యు డేలాగున తన ప్రకాశము వీడియుండుట లేదో, చంద్రుడేలాగున తన శీతలత్వమును విసర్జించి యుండుటలేదో, శక్కెర యేలాగున తనయొక్క మాధుర్యమును వదలియుండుటలేదో, అలాగున నిర్మలజీవులు తమ యొక్క పావనత్వమును త్యజించియుండరు. ఇదే దీనికి గురుతు. తీవ్ర ముముక్షత్వమున్న వారందరును ఈలాటి స్వభావముగలవారైయే యుందురు. ఈజన్మములోనే, ఈశ్వరసాక్షాత్కార జ్ఞానము గలుగవలయును, మనశ్శాంతి పొందవలయును, అజ్ఞానమును నశింపచేయవలెను. తాపత్రయాగ్నిని శాంతి నొందించవలెను. జన్మసా

ఫల్యమును చేసికొనవలెను. జన్మము సార్థకము కావలెను. వంశమును పావన మొనర్పవలెను. కన్నందులకు. తల్లిదండ్రులనుకూడ పావనుల నొనర్చ వలెను. లేనిచో మరణించుటయే మేలను స్వభావము గలిగియుండవలెను ఏమి, భూలోకములో జనులకు కొరత గలిగియుండలేదు: ఎన్నియో కోట్ల జనమున్నారు: వీరందరును చనిపోయెదరు: మనమున్ను అలాగున పోవలసినవారమే. ఇట్టి యవస్థ సార్థకజీవులకున్ను, నిరర్థక జీవులకున్ను, అనర్థజీవులకున్ను సమానధర్మమైయున్నది: అట్లుండగా ఏల నిరర్థముగా చావవలెను: మరణమును లక్ష్యము పెట్టకయుండిన మాత్రమే అమృత మును గ్రోలగలము: అయితే మూఢబుద్ధితో ఆత్మను నంశిపచేయరాదు: అది ఆత్మహత్యలో చేరిపోవును: అది పాతకము: ధర్మనిర్మహణములో. ఈశ్వరధ్యానములో, బ్రహ్మనిష్ఠలో మాత్రమే ఈపుణ్యవాక్యము సమన్వ యించును. శ్రద్ధ గలిగి వర్తింపనందుచే మనము దుఃఖమునకు వశులగు చున్నాము. ప్రతివారున్ను గురూపదేశము పొందుటకు ప్రారంభించునపు డును, తపస్సు నుద్దేశించి ఇంటినుండి బయలు దేరుటకు ముందుగాను, బ్రహ్మ విచారము నారంభించుటకు పూర్వమును, సోమరితనమను పెను భూతమునకు తర్పణ మొనర్చియే బయలుదేరవలెను. అట్లైన అన్నియు నిర్విఘ్నముగ సాధింపగలము, కాయకష్టమును సహించుకొన వలెనని నిశ్చయించుకొనవలెను. ఇంద్రియచాపల్యము నరికట్టవలెనని తీర్మానించుకొన వలెను. జిహ్వాయొక్క రుచికోరెడు గుణమును కట్టివేయవలెను. అట్లైన మాత్రమే మీరు సుఖముగ, ప్రసన్నముగ, ప్రశాంతముగ గమ్యస్థానము చేరగలరు.

న సౌఖ్యాల్లభతే పుణ్యం కాయక్లేశాదవాప్యతే।
మథనేన యథా క్షీరా న్నవనీతం ప్రజాయతే ॥

మర్దనాదిక్షుదండానాం రసో యద్వత్ప్రజాయతే ।
తద్వచ్ఛరీరదండేన మహాధర్మః ప్రజాయతే॥

శరీరసౌఖ్యమునకు లోబడినవారికి (సోమరితనముగల వారికి) పుణ్య ప్రాప్తి గలుగదు. శరీరక్లేశమును సహించి పరిశ్రమచేయు స్వభావము గలవారికి లభించును. ఏలన, పాలను తఱచకపోయిన వెన్న బయలు

పేరునా? నూరించుటచేతనే లభించును, వెఱికును గానుగలో వేసి నలపక పోయినచో రసముత్పన్నమగునా? అలాగున శరీరములో వ్యాపించియుండు. ఈశ్వరస్వరూపము లభించుటకూడ ప్రయత్నము వలననే సిద్ధించును. మహాధనమగు జ్ఞానము హృదయమును మథించుట వలననే పుట్టును. క్షీర సాగరమును మథించనిచో అమృత ముత్పన్న మగునా? శుద్ధసత్త్వమగు హృదయమను క్షీరసాగరమందు నిశ్చల బుద్ధియగు మందరపర్వతము నుంచి ఈశ్వరానుసంధానమను వాసుకిని కట్టి ధ్యానమను మథనము చేయ వలెను. అప్పుడే దైవామృతము లభించును. దానివలన జననమరణరూప మగు దుఃఖ ముపశమించును.

సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా
సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్।
అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో,
యం పశ్యంతి యతయః క్షీణదోషాః ॥

అనగా "నశించిన పాపములుగలవారలును సన్న్యాసులు (పరమాత్మ స్వరూపాను సంధానమునకు ప్రయత్నించుచున్నవారలు) ఏ ఆత్మస్వరూప మును చూచుచున్నారో, ఈ తేజోరూపమును, పరిశుద్ధమును అగు ఆత్మ స్వరూపము, ఎల్లప్పుడున్నూ సత్యముచేతను తపస్సు చేతను, బ్రహ్మస్వరూప సాక్షాత్కార జ్ఞానముచేతను, బ్రహ్మచర్యముచేతను హృదయపుండరీకమందు పొందదగినది." మొదట కొంతకాలము, పై గుణములు గల్గియుండి తరువాత అవసరములేదని శుష్క వేదాంతులు కొందరు చెప్పెడి వాక్యము సరికాదని నిరూపించుటకొరకు ఇచ్చట నిత్యశబ్దము ప్రయోగించియున్నారు. కాన, పైజెప్పిన గుణము లన్నియు దేహపతనమువరకు గల్గియుండవలెను.

తిలమధ్యే యథాతైలం క్షీర మధ్యే యథా ఘృతమ్।
పుష్పమధ్యే యథా గంధః ఫలమధ్యే యథా రసః ।
కాష్ఠాగ్నివత్ప్రకాశేత ఆకాశే వాయువచ్చరేత్ ॥

నువ్వులందు నూనెవలెను పాలయందు నేయివలెను, పుష్పములయందు పరిమళమువలెను, ఫలములయందు రసమువలెను కట్టెయందు అగ్ని

వలెను, ఆకాశమందు వాయువువలెను ఈ ఆత్మ దేహమందు ప్రకాశించు చున్నది. కావున పుష్పమునుండి సుగంధమును, నువ్వులనుండి నూనెను. పాలనుండి వెన్నను, ఫలమునుండి రసమును, అరణినుండి అగ్నిని ఏలాగున తగిన యుపాయములచే వెలువరచుకొనవలెనో, అలాగున ఈ దేహములో గల దేహిని అనగా ఆత్మజ్ఞానమును పై జెప్పిన తపస్సు, బ్రహ్మచర్యము, సమ్యక్ జ్ఞానము మొదలైనవానిచే ప్రత్యక్షము చేసికొనవలెను.

పరిశ్రమను గురించి ఒక సంగతి చెప్పెద, ఒక ఇంటిలో పదిమంది యుండిన ఒక్కరుగాని లేక యిద్దరుగాని మాత్రము సంపాదించు దానిని అందరును భోజనము చేయుచు, తక్కినవారెవరు ఏమియును చేయక యుండిన అట్టి సంసార మేలాగున వృద్ధి నందగల్గును? పది మందిన్ని పనిచేయువారై యుండిన ఏలాగున అట్టి కుటుంబము వృద్ధి నొందగల్గునో ఆలాగున ఈ దేహములో అన్ని యింద్రియములున్ను పనిచేయునవిగా నుండిన, ఎంతో జ్ఞానధనమును సంపాదించుకొనవచ్చును. విజ్ఞానశాస్త్రపరి శోధకులు మెదడును పరిశోధించుటచే ఒక్క కోటి పదిలక్షల జవసత్వ అణువులు అందుగలవనియు, వాటిలో మంచి పరిశ్రమ చేయగలవారిలో మాత్రము ఏదో ఒక వందగాని రెండువందలు గాని మెళకువగలిగి పని చేయుచున్నవనియు తక్కినవన్నియు నిద్రపోవు చున్నవనియు తెలుపు చున్నారు. ఇది శ్లోకములు చెప్పుటగాని శాస్త్రములలో గలదని అట్టహాసము చేయుటగాని కాదు ప్రత్యక్షముగ సైన్సు అనగా విజ్ఞానశాస్త్రము ఋజువు చేయుచున్నది. చూడతలంచువారు అట్టి పరిశోధకుల నవలంబించి చూచు కొనవచ్చును. కనుకనే యోగవాసిష్ఠమున సోమరితనమును గూర్చి యీలాగున చెప్పుటకు కారణము.—

సీమానం సర్వదుఃఖానామాపదాం కోశముత్తమమ్।
బీజం సంసారవృక్షాణాం ప్రజ్ఞామాంద్యం వివర్జయేత్ ॥

సమస్త దుఃఖములకు పొలిమేరయు, ఆపదలన్నింటికి నిలయమును సంసారవృక్షము లన్నింటికిని ఆకరమునునగు ఈ ప్రజ్ఞా మాంద్యమును అనగా సోమరితనమును, ప్రయత్నముచేత విడచిపెట్టవలెను.

ఇట్టి నిద్రపోవుచున్న జీవాణువులను మేలుకొలుపుటకు మన పూర్వీకులు యోగశాస్త్రమును కనిపెట్టిరి కనుకనే యోగముచే దివ్యశక్తి గలుగుననియు, గూఢతత్వము బయలుపడుననియు చెప్పెడు రహస్యము దీనిలో ప్రాణాయామము చాల ముఖ్యమైనది, అయితే మంచి అనుభవజ్ఞుల దగ్గర నుండి అభ్యసించుకొనవలెను తపస్సున్ను అట్టి అణువులను నిద్రావస్థనుండి జాగ్రత అవస్థలోనికి వచ్చునదే. నిర్మలమైన అనన్యభక్తియున్ను దీనిలో నిరంతర దైవ చింతయు అటువంటిదే యగును.

అయితే అన్నిటికిన్ని ఆహారనియమమున్ను, అనుష్ఠాననియమమున్ను తప్పక యుండవలెను. ఇదే దీనిలో గల పరమరహస్యము. ఎవరైనను ఒక మూడు నెలలకాలము ప్రాణాయామము చేసి చూచుచు ఎంత నిర్మలత్వము. ఎంత చురుకుతనము, ఎంత ఉత్సాహము గలుగుచుండునో, మీరే గ్రహించుకొనవచ్చును. కాని స్థలమున్ను ఆహారమున్ను సరిగా నుండవలయును. అయితే ఈ యానందములో, ఈ సుగుణసంపత్తిలో, ఈ యుల్లాసములో మునిగి పోయి ఆత్మను తెలిసికొనకపోయిన జన్మసాఫల్యము గలుగదు ఈశ్వర కరుణ సంపాదించకపోయిన యా సంతోష మంతయు నష్టమగును. ఇదే యోగములో గల కీలకము, కావున దైవజ్ఞానములో దృష్టినుంచి యోగ మభ్యసింపవలెను. లేనిచో భర్తృవియోగముగల స్త్రీకివలె నీకున్ను దైవమునుండి ఆత్మనుండి వియోగముగలిగి దుఃఖించెడి కాలమొకప్పుడు కలుగును. ఇది జ్ఞాపకములో నుంచుకొని యోగములో దిగవలెను. అట్లుకాని యోగికాని, యోగినికాని అయినను చక్రవాక పక్షులలో భార్యావియోగము గలిగిన మగపక్షియు. భర్తృవియోగము గలిగిన ఆడపక్షియు ఏలాగున దుఃఖముతోకూడి కాలముగడుపవలసియుండునో దైవసాక్షాత్కారము గలుగని యోగులగతియు నటువంటిదేయని జ్ఞాపకములో నుంచుకొనవలయును. అట్టి సాక్షాత్కారము దైవభక్తిచేతను, జ్ఞానముచేతను, తపస్సుచేతను, ధ్యానముచేతను మాత్రమే గల్గును. దానికి యోగము చాల సహాయపడును. యోగము బుద్ధ్యాది ఇంద్రియములను శుద్ధపరచి ఆందము యశోశమువరకు వెళ్లును అవి ప్రకృతియొక్క శుద్ధభాగములు కాన వానికి శాశ్వతత్వము గలుగదు. ఈరెండవవానిలో మీయొక్క గురువు జీవితమున్ను మీ పూర్వీక ఋషులజీవితమున్ను జ్ఞాపకములోనికి తీసికొనిరావలెను.

వారియొక్క పరిశుద్ధ ఇంద్రియనిగ్రహము, శాంతము. కరుణ, నిరంతర పరిశ్రమ తపస్సు సాధుభావము, పుణ్యబుద్ధి మొదలగు అమూల్య దైవ గుణములను మఱపుగల్గక హృదయములో నుంచుకొనవలెను ఇదిన్ని మీ పురోభివృద్ధికి చాల ఉపయోగము గల్గజేయును.

కుచేలమహాముని‌కి మహదైశ్వర్యము గల్గినను తనయొక్క పూర్వ వృత్తాంతము మఱువక బీదరిక జీవితమున్ను తపశ్చర్యయును నిరంతర శ్రీమన్నారాయణ చరణారవింద అనన్య భక్తియున్ను మఱుపు కలుగ నీయక వర్తించినందుచే, ప్రకృతి అమ్మహాత్ముని ఆత్మను ఆవరించక యుండుటచే నాతడు జీవన్ముక్తి పదవినందెను. నహుషు డను రాజు స్వర్గలోకమున ఇంద్రుని స్థానము గల్గినపుడు తన పూర్వపు ధర్మబుద్ధియు, సౌశీల్యమున్ను మఱచి ప్రవర్తించినందుచే ఋషుల శాపమువలన స్వర్గ లోకమునుండి భూలోకములోనికి అజగరమై పడిపోయెను. ఈ కథలను జ్ఞాపకము చేసికొనిన ఎవరికిని ఎప్పుడున్ను పతనము గల్గదు. ఇప్పుడున్ను తక్కువబుద్ధిగల కొందరు ఉన్నత ఉద్యోగము వచ్చినను, లేక ఉన్నతమైన మఠాధిపతుల పీఠము లభించినను, తమయొక్క పూర్వసంగతిని మఱచి ప్రవర్తించుటచే పతన మొందుచున్నారు.

ఇట్టి దురవస్థలు కొన్నిటిని ప్రత్యక్షముగ చూచుచున్నాము. ఆత్మ విషయములో నీవు శూరుడవై, ధీరుడవై, శుద్ధుడవై యుండిన మాత్రమే నిన్ను మోక్షలక్ష్మియు, వైరాగ్యలక్ష్మియు, జ్ఞానలక్ష్మియు, యోగలక్ష్మియు, ముక్తి కాంతయు వరింతురు అట్లైనమాత్రము నీవు మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుడవై ప్రకాశింపగలవు. ఈ చెప్పినవారికే పంచకన్యకలని పేరు. పట్టాభిషిక్తుడు కావలసియున్న రాజ్యలక్ష్మి వరించవలెను. అట్లు కానివారికి పట్టాభిషేకము గలుగదు. కావున పైజెప్పిన పంచకన్యకలుగాని లేని వారిలో యొకతెగాని నిన్ను వరించవలసియుండిన నీకు ధీరోదార విరాగగుణములు గలిగియుండవలెను. ఆ కన్యలు సామాన్యలుకారు సుమీ! మహావీరశూర గుణోపేతుడగు చక్రవర్తికొమార్తె పిరికిపందను వరించునా? మహోదార శూరధీర గుణములుగల రాచకొమరుని మాత్రమే వరించునను సంగతి నీవు జ్ఞాపకములో నుంచుకొనవలెను. లేనిచో ముక్తికాంత నిన్ను వరింపజాలదు.

ఆ దివ్యకన్యక వరించబోవునప్పుడు మోక్ష పట్టాభిషేకము జరుగును. కాన, దానికి తగిన ధీరోదార విరాగము లన్నిటిని గలుగ చేసికొనుము తీవ్ర వైరాగ్యమున్ను నిరంతర ఈశ్వర నిష్ఠయున్ను గలిగియుండేలాగున చూచుకొనుము. అది స్వయంవరము, మీయొక్క సుగుణము లన్నియు, తపస్సు లన్నియు, వైరాగ్యము లన్నియు ఆకాశవీదిలో శరచ్చంద్రికవలె ప్రకాశించవలెను మీయొక్క శాంతము కరుణ, ప్రసన్నత, వనములో వసంతకాలమువలె శోభించుచు సుగంధ పుష్ప వాసనలవలె వ్యాపించు చుంతటను వ్యాపించుచుండవలెను, మీయొక్క నిర్మల జీవితమును గురించి రాజగృహములలోను. అంతఃపురములలోను, పల్లెలందును, పట్టణము లందును బీదలువసించు స్థానములందును వసంతకాలములో కోయిల కూయుచున్నట్లు లోకము గానము చేయవలెను ఈవిషయమై నీవేమియు చేయనక్కరలేదు, నీయొక్క దైవ భావము మఱువక శమదమాది గుణము లను విడనాడక గురుభక్తియు దైవభక్తియు సదా గలిగియుండిన చాలును. ఇట్టిస్థితి నీవు గోరనక్కర లేదు అప్పుడు పుష్పములో గల సుగంధవాయువు దశదిశలు వ్యాపించునట్లు అవ్యక్తమగు అప్రకృతిమాతయే అంతయు వ్యాపకము చేయును. అప్పుడు మోక్షరాజ గృహాంతరాళముననుండు ముక్తికాంతల కర్ణపుటములలో నీయొక్క శాంతశమదమాది గుణములను జ్ఞానమున్ను, వినవచ్చును. అచ్చటనుండి ముక్తికాంత, జ్ఞానలక్ష్మి మీస్వయం వరమునకై, మీయొక్క తపోవనములోనికి రావలసియుండును సుమీ!

3. ఇంతవరకు చెప్పిన విషయము లన్నియును పురోవృద్ధియొక్క బహిరంగములు, అయితే బహిరంగములని తలంచి అవి నిస్సారములని యుపేక్షించరాదు. దేహమునకు ఆరోగ్యము లేనిచో దేహి యేలాగున సౌఖ్యము నొందజాలదో, అలాగున సమస్త విషయములలోను బహిరంగ ములుకూడ మనకు ముఖ్యములని తలంచవలెను. ఇపుడు పురోభివృద్ధిని గోరువారు గ్రహించవలసిన సంగతిలో మూడవస్థితిలోనికి ప్రవేశింతము. ఇది అనాదియగు జీవునిగురించిన విషయము ఇదే పురోవృద్ధిని గోరుజీవులు గ్రహించుకొనవలసిన సంగతులలో ముఖ్యమైనది. దీనిని మఱచి నందుచేతనే జీవకోట్లు అజ్ఞాన మోహానముద్రములో మునుగుటకు కారణమగుచున్నవి.

ఈజీవచైతన్యము ఆనందస్వరూపము, శివము, ప్రకాశము, జ్ఞానము, అట్లుండియు అజ్ఞానము ఆవరించినందుచే ఏలాగున నాచుచే ఆవరింపబడిన సరోవరముయొక్క స్వచ్ఛజలము కనుపించక పోవుచున్నదో, ఈ ఆత్మ యొక్క స్థితియు అటువంటిదే అగుచున్నది. నాచును తీసివైచిన నిర్మలోదక మేలాగున కనుపించునో. అలాగున ఆత్మను ఆచ్ఛాదించుచుండు ఆవరమును తొలగించిన శివమై, జ్ఞానమైయుండు స్వరూపమును జూడగలము. శ్రుతి స్మృతులన్నియు ఆత్మ. దేహేంద్రియ మనస్సులకు విలక్షణమై, స్వయం ప్రకాశమై ఉండుననియే చెప్పుచున్నవి. అట్టిస్వరూపము తెలిసికొనునపుడు గలుగు ఆనందమున్ను, ధైర్యమున్ను అపారమైనదే.

'తదేతత్సత్యం యథా సుదీప్తాత్పావకా
ద్విస్ఫులింగా స్సహస్రశః ప్రభవం తే సరూపాః।
తథాఽక్షరాద్వివిధా స్సోమ్యభావాః
ప్రజాయన్తే తత్రచైవాపి యన్తి॥

అనగా, "ఈచెప్పబోవు అక్షరవిషయము సత్యమయినది. బాగుగా మండుచున్న అగ్నినుండి వేలకొలది సమానరూపములు గల అగ్నికణములు ఎట్లుపుట్టుచున్నవో అట్లే ఓ శౌనకుడా, నాశరహితమగు పరబ్రహ్మమునుండి నానావిధములైన జీవులు పుట్టుచున్నారు మరల వాయక్షరమగు పర బ్రహ్మమునందే లీనమగుచున్నారు—

— అని ముండకశ్రుతి చెప్పుచున్నది. దీనియందు మనము తెలిసి కొనదగిన విషయ మొకటి కలదు. అదేమన అగ్నిగుండమునుండి వెడలు చుండు ఒక్కకణమును దూదిమొదలగు వానిలోనుంచి వెలిగించుటకు మొదట చిన్నచిన్న పుల్లలువేసి తరువాత పెద్దకట్టెలు వేసిన ఏలాగున కార్య రూపమగు ఈమిణుగురు కారణరూపుడగు అగ్ని హెూత్రునివలె ప్రకాశించునో, అలాగున సాక్షిచైతన్యమగు ఆత్మను బ్రహ్మచర్యము తపశ్చర్య మొదలగు వానిచే వృద్ధిపరచిన పూర్ణస్వరూపమగు ఈశ్వరసాక్షాత్కారావస్థను పొంద గలము. ఇందువలన జీవకోట్లన్నియు ఈశ్వరాంశము లని సిద్ధమగుచున్నది ఓహెూ, ఇట్టిజ్ఞానము గలిగిన యెంతయో ధైర్యమున్ను, ఆత్మ వికాసమున్ను గలుగుచుండునుగదా! ఈ అర్థమునే శ్రీకృష్ణభగవానులు గీతయందును

"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానంమతం మమ॥

అను శ్లోకమున తెలియబరచిరి. అనగా ఓ అర్జునా! సమస్త జీవకోట్ల, యందు వెలుగుచుండు ఆత్మవస్తువు నాయొక్క స్వరూపమని తెలిసికొనుము. ఈశరీరముయొక్కయు, సాక్షిచైతన్యమగు ఆత్మ యొక్కయు, యథార్ధ స్వరూపము తెలిసికొనుటయే జ్ఞానమని భగవానులుపదేశించిరి. ఇకను, "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" అని భగవంతుడు ఘోషించెను, ఓఅర్జునా! ఈజీవకోట్లన్నియు నాయొక్క అంశములు. నేనేలాగున సనాతనస్వరూపము గల్గియున్నానో అలాగున ఈజీవకోట్లన్నియు సనాతన ములే కావున పురోవృద్ధిని గోరు వారందరున్ను తమయొక్క ఆత్మను తెలిసికొన యత్నించవలయును, తండ్రి యగు రాజు చనిపోయిన బాలుడగు యువరాజు మైనరుకాలమున రాజ్యపరిపాలన చేయువారు సరిగా లేనందు చేతను, మంత్రులు మొదలగువారు చక్కగా చూడకపోవుటచేతను రాజ్య మేలాగున హీనస్థితికి వచ్చునో; ఈపంగతులన్నియు తెలిసిన రాకొమరుడు. మైనరుకాలము పోయినవెంటనే రాజ్యమును స్వాధీనపరచుకొని చక్కగ పాలించునో, అందువలన రాజ్యమేలాగున అభివృద్ధినొందునో, జీవునియొక్క స్థితియున్ను అటువంటిదే. కావున నిత్యమై, శుద్ధమైయుండు ఆత్మస్వరూపమే మన అందరి స్వరూపమని తెలిసికొనవలెను· ఒకవేళ కర్మలచే మాలిన్యము నందినను, మురికిబటను ఏలాగుగ చాకలివారు శుద్ధముచేయు చుందురో అలాగున తపస్సు, దైవవిచారము, ధర్మప్రవృ మొదలగు వానిచే ఆత్మను శుద్ధపరచుకొనవలెను. ఇదే మీఅందరియొక్క పూర్వ వృత్తాంత మును తెలిసికొనవలెనని చెప్పినదానికర్థము. అప్పుడు పైభాగమున త్రువ్వ గలిగియుండు రత్నమును సామాన్యమగు రాయిగాతలించి యుండునపుడు, ఆప్తవాక్యముచే "అది రాయికాదు. మాణిక్య రత్నము. పైభాగములోగల మాలిన్యము, శుద్ధపరచిచూడు"మని చెప్పిన తరువాత, అలాగునచూచునపు డెంత మార్పు గలుగునో, అట్లే ఆత్మయొక్క యథార్థజ్ఞానము గల్గునపుడు అంతమాహాత్మ్యము, మహిమయు. ఆనందమును గలును. లేక మట్టిలో పడియుండిన బంగారు ముద్దనుజూచి అదియేమోయని తలంచి చూడక

యుండునపుడు అష్ట పురుషుడు అని మట్టిముద్దగాను. సువర్ణకుని తెలిపిన తరువాత కడిగి శుద్ధపరచి చూచినపుడు బంగారుగనే యుండును. అలాగున ఈ దేహమున్ను, కులమున్ను, గోత్రమున్ను చూచి ఆత్మయొక్క మహిమను తెలిసికొనజాలక జీవులు నిజస్వరూపము నెఱుంగకయున్నారు. కావున పూర్వవృత్తాంతమును తెలిసికొనుట యిటువంటిదేయగును. ఇట్టి ఆత్మ మాహాత్మ్యమును తెలిసికొను అవస్థ యొకనికి గల్గిన, భిక్షకారుడైనవాని నొక్క రాజ్యమునకు ప్రభువుగజేసిన యెంత మార్పుగల్గునో, ఈకించిజ్ఞుడగు జీవునకున్ను అట్టి అవస్థగల్గును ఇట్టి స్థితి గలుగుటకు గురువున్ను, శాస్త్ర మున్ను, ఈశ్వరుడున్ను నిమిత్తమాత్ర కారణములేయగుదురు. జీవుడు తనయొక్క పరిశుద్ధమైన నిరంతరప్రయత్నము చేతనే అట్టిస్థితికి రాగల్గును ఈయాత్మ స్త్రీయున్ను, పురుషుడున్ను, నపుంసకుడున్ను గాదు, స్త్రీ పురుషాది భేదములన్నియు ఈస్థూల దేహమునకు మాత్రమే గలుగుచుండును. సూక్ష్మ శరీరమగు లింగదేహమునకుగాని, కారణదేహమగు అవిద్యాదేహమునకుగాని యట్టిభేదములేదు. అప్పుడు ఈమూడింటికీ విలక్షణమైయుండు స్వయం ప్రకాశాత్మను గూర్చి మరల చెప్పవలెనా? పురుషశబ్దము కూడ ఈఆత్మకు అష్టపురీక మందుండుటచేతనే వచ్చినది. లేక, ఆత్మ పూర్ణస్వరూపుడై యుండుటచే అట్టిపేరు వచ్చినదేగాని, స్త్రీ పురుషభేదము గలిగినందులచే గాదు.

వాగాదిపంచ శ్రవణాదిపంచ
ప్రాణాదిపంచాభ్రముఖానిపంచ।
బుద్ధ్యాద్యవిద్యాపి చ కామకర్మణీ
పుర్యష్టకం సూక్ష్మశరీరమాహుః॥

అనగా వాగాదికర్మేంద్రియములైదును, శ్రవణాది జ్ఞానేంద్రియ ములున్ను, పంచప్రాణములున్ను, పంచతన్మాత్రలున్ను, బుద్ధియు అవిద్యయు. కామము, కర్మము అను ఈ యెనిమిదిన్ని కూడియుండు సూక్ష్మశరీరమును పుర్యష్టకమని చెప్పుదురు: ఆత్మ దానియందుండుట వలన పురుషుడని పేరు వచ్చినది. ఆత్మయొక్కబోధ గల్గునపుడు మానవ జీవితముయొక్క పరిణా మము మారుచుండును. అప్పుడే సోపర వాక్యము సార్థకమగును. అప్పుడు

ఆత్మ ఈశ్వరాంశమని చెప్పెడు శ్రుతివాక్యము సఫలత నొందగల్గును. అప్పుడు మాత్రమే తాను శుద్ధుడనియు, స్వయంప్రకాశుడనియు చెప్పెడు వేద వాక్యము సాధువగును. సువర్ణమునుండి యేర్పడిన అణువులు సువర్ణముగా నుండునేగాని అన్యముగానట్లు ఈశ్వరాంశ సంభూతులగు జీవులుగూడ ఈశ్వరగుణము గలవారను జ్ఞానము, జ్ఞాపకములోనికి వచ్చును. గొప్పదగు వటవృక్షము నుండి యుద్భవించిన సన్నని బీజము లేలాగున మరల మహత్తరములగు వృక్షములగుచుండునో, అలాగున సూక్ష్మరూపముగా నుండు ఈ యాత్మయు అనుష్ఠానముచే పూర్ణత్వము నొందగల్గును అపుడే, 'పూర్ణత్వాత్ పురుషః' అను వేదమాతయొక్క వాక్యమును సాఫల్యము నొందించిన సుపుత్రులము మనము గాగలము. అపుడే తల్లిదండ్రుల యొక్క ఋణమును తీర్చిన సుపుత్రులవలె వేదమాతయొక్క ఋణమును నివర్తింపజేసిన సత్సంతానము కాగలము. అపుడు దుఃఖములేని నిరతిశ యానందము గల్గును. బీజము వృక్షమై పరిణమించుటకు పృథివ్యాది పంచభూతములు అనుకూల్యమేలాగున నుండవలెనో, అలాగున ఈ జీవుడు గూడ బంధమునుండి విముక్తిని పొంది తనయొక్క పూర్వ సౌఖ్యమును పొందగల్గుటకై పంచశీలమను అనుష్ఠానపంచకము నభ్యసించుకొనవలయును అది 2 నిరంతర ఈశ్వరవిచారము. 2. ఆత్మ యొక్క యాథార్థ్యము తెలిసికొనుట 3 హృదయము నెల్లప్పుడును నిర్మలముగా నుంచుట. 4. బ్రహ్మచర్య వ్రతమును చక్కగ ఆచరణ యందుంచుట. (ఇది గృహస్థబ్రహ్మచర్యమైనను సరే) 5. ఆహారనియమము గలిగియుండవలెనను టయే పృథివి. అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశమనెడు పంచభూతము లలో దేనియందైన కొరతగలిగినచో తరువులేలాగున పెరుగజాలవో, అలాగున యీ పంచ శీలములలో దేనియందైన లోపము గలిగిన, జీవుడు తన పూర్ణావస్థను బొందజాలడు మరల ఎప్పుడు అనగా ఈ జన్మలోగాని మరి యొక జన్మలోగాని ఈ శీలపంచకము సమావస్థకు వచ్చునపుడు మాత్రమే జీవునకు ముక్తియు, పూర్ణత్వమున్ను గలుగును. అంతవరకు సంసారమను కాలచక్రములో పుణ్యపాపకర్మల ననుసరించి ఉచ్చ, నీచజన్మలనంది ఇహపర లోకములను ఘటీయంత్రమువలె తిరుగుచుండవలెను. ఎచ్చటను అంత వరకు నిలకడ అనునది గలుగదు. దుఃఖములేని స్థితికూడ సిద్ధింపదు. ఇత్తరి

దైవ భక్తి యొక్కటి మాత్రమే జీవునకు రక్షకమై యుండును. కావున ఇట్టి పరిశుద్ధమగు దైవభక్తిని సంపాదించుటకు చూడవలయును. అట్టి భక్తియను తైలమే ఆనందమను, బ్రహ్మజ్ఞాన ప్రకాశమును గలుగజేయును. అట్టి భక్తియను సుగంధ శోభాయమాన కుసుమమే బ్రహ్మజ్ఞానమను పరిపక్వఫలము నుద్భవింపజేయును. అప్పుడు మీరు ఆనంద స్వరూపులనియు, అమృత స్వరూపులనియు చెప్పెడు వేదవాక్యము యొక్క అర్ధమును తెలిసికొన గల్గుదురు.

ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్
ఆనన్దాద్ధ్యేవఖల్విమాని భూతాని జాయన్తే।
ఆనన్దేన జాతాని జీవన్తి
ఆనన్దం ప్రయన్త్యభిసంవిశన్తీతి ॥

అనగా, ఆనందము బ్రహ్మస్వరూపమని తెలిసికొనెను. ఈ భూతములు ఆనందమునుండియే పుట్టుచున్నవిగదా! పుట్టినభూతములు ఆనందముచేత బ్రతుకుచున్నవి. ఆనందమునుగూర్చి పోవుచున్నవి. అంతట ఆనందస్వరూ రూపమే యగుచున్నవి.

సైషా భార్గవీ వారుణీ విధ్యా పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా।
య ఏవం వేద ప్రతిష్ఠతి అన్నవానన్నాదో భవతి॥
మహాన్ భవతి ప్రజయా పశుభి ర్బ్రహ్మవర్చసేన
మహాన్కీర్త్యా॥

అనగా వరుణునిచేత జెప్పబడినదియు భృగువుచే దెలిసికొనబడి నదియు ప్రసిద్ధమునగు ఈ బ్రహ్మవిద్య శ్రేష్ఠమగు ఆకాశమందు (హృదయాకాశమందు) ఉంచబడియున్నది, ఎవడు ఈ ప్రకారము తెలిసికొను చున్నాడో. వాడు ఆ పరబ్రహ్మమందు ప్రతిష్ఠింపబడు చున్నాడు. అన్నము గలవాడును, ప్రకాశమగు అగ్నిగలవాడును అగుచున్నాడు. శిష్యులచేతను. గవాశ్వాది పశువులచేతను బ్రహ్మ తేజస్సు చేతను గొప్పవాడును, ఖ్యాతిచేతను అధికుడును అగుచున్నాడు.

ఈపై దెల్పిన తైత్తిరీయశ్రుతి వాక్యమువలన బ్రహ్మనిష్ఠులకు అదృష్టమగు మోక్షఫలము మాత్రము గలుగునదియేగాక దృష్టమగు

సర్వసౌఖ్యములుకూడ, అప్రయత్నముగ గల్గునని నిరూపింపబడమైనది. ప్రత్యక్షఫలము కనుపించనిచో అప్రత్యక్ష స్వర్గసౌఖ్యముగాని, దైవ లోకప్రాప్తిగాని, ముక్తిగాని కలుగగలదను నమ్మకము లేకపోవచ్చును. అయితే స్వర్గఫలముకలె మోక్షసౌఖ్యము అదృష్టముగాదు అది జీవించి యున్నప్పుడే అనుభవించెడు ప్రత్యక్షఫలము. అట్లు కానిచో పరోక్షజ్ఞానమని శ్రుతి చెప్పునేగాని అపరోక్షజ్ఞానమని చెప్పజాలదు ఇట్టి శాశ్వతమగు దివ్య సుఖము భక్తిచేత గలుగవలసి యుండును.

"నాఽయమాత్మా ప్రవచనేనలభ్యో
న మేధయా న బహునా శ్రుతేన ।
యమేవైష వృణుతే న లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్॥

అనగా ఈ ఆత్మస్వరూపము వేదశాస్త్రాధ్యయనా ధ్యాపనములచేత గాని, గ్రంథార్థధారణా శక్తి రూపమగు మేధచేతగాని, అనేక శాస్త్రశ్రవణము చేతనైననుగాని పొంద శక్యమయినదికాదు. ఈ విద్వాంసుడు ఏ పరమాత్మను పొందుటకు ఇచ్ఛించుచున్నాడో, ఆ ఇచ్ఛచేతనే పొందదగినవాడు. ఈ ఆత్మ స్వకీయమైన స్వరూపమును వానికి ప్రకాశింపజేయుచున్నది అనగా నిరంతర ఈశ్వరధ్యాన మొక్క దానిచే మాత్రము జ్ఞాన ప్రాప్తిగల్గును. ఈ విషయ ములో చదివినవారును, చదువులేని వారున్ను సమానులే అని ముండకో పనిషత్తు చెప్పుచున్నది: ఇట్టి వాక్యమునే శ్రీకృష్ణభగవానులు గీతయందు తెలిపియున్నారు.

నాహం వేదైర్నతపసా నదానేన నచేజ్యయా ।
శక్య ఏవం విధోద్రష్టుం దృష్టవానసి మాం యథా॥
భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప! ॥

అనగా "ఓ అర్జునా! నన్ను ఏ విధముగ నీవు చూచితివో, ఇట్టి స్వరూపము గలవాడనగు నేను ఇతరులచే వేదములచేతను (వేదాధ్యయనము సేన వారిచేతను) ఘోరతపస్సుచేతను, దానములచేతను, యజ్ఞాదికర్మముల

చేతను సాధ్యుడనుకాను. ఇట్టి విశ్వరూపియైన నేను స్థిరమైన భక్తిచేతనే (భక్తికలిగిననే) యథార్థముగ శాస్త్రములనుబట్టి తెలిసికొనుటకును చూచుటకును. నాలో నైక్యము నొందుటకును శక్యుడను అగుచున్నాను" అని తాత్పర్యము, ఈ శ్లోకమువలన, నిరంతర సర్వేశ్వరధ్యానమొక్కటియే ఈశ్వరదర్శనమునకును, ఈశ్వరజ్ఞానమును పూర్తిగ తెలిసికొనుటకును, ఈశ్వరైక్యస్థితి గలుగుటకును కారణమైనదని తెలుపడమైనది. అట్టి అనన్యమగు దైవభక్తి యొక్క స్వభావము, భర్తృహరి యీలాగున వర్ణించియున్నాడు.

స్ఫురత్ స్ఫారజ్యోత్స్నా ధవళితతలే క్వాపి పులినే
సుఖాసీనా శ్శాంత ధ్వనిషు రజనీషు ద్యుసరితః।
భవాభోగోద్విగ్నా శ్శివశ్శివశివేత్యుచ్చవచనః
కదా యాస్యామోఽన్తర్గత బహుళబాష్పాకులదశామ్॥

అనగా, "విరామమును పొందిన పక్షులయొక్క ధ్వనులు కలిగినట్టువంటి రాత్రులయందు ప్రకాశించుచున్నదియును, మిగుల నధికముగ వృద్ధి పొందినదియును అయిన వెన్నెలచేత తెల్లగా జేయబడిన ఆకాశగంగయొక్క యొకానొక ఇసుకతిన్నెయందు సుఖముగా గూర్చున్నవారమై మేము శివశివశివయని ఉచ్చైస్స్వరములో ఉచ్చరించుచున్నవారమై అంతఃకరణమునందలి నియమవశమువలన అణగిన కన్నీళ్ళచేత వ్యాకులమైన స్థితిని యెప్పుడు పొందుదుమో!" మరియు,

కిం వేదైస్స్మృతిభిః పురాణపఠనై శ్శాస్త్రైర్మహావిస్తరై
స్స్వర్గగ్రామకుటీనివాసఫలదైః కర్మక్రియావిభ్రమైః।
ముక్త్వైకంభవదుఃఖభారరచనా విధ్వంసకాలానలం
స్వాత్మానందపదప్రవేశకలనం శేషైర్వణిగ్వృత్తిభిః॥

అనికూడ భర్తృహరి చెప్పియున్నాడు. అనగా, "వేదములను చదువుటవలనగాని, స్మృతుల నాలోచించుటవలనగాని, పురాణములను పఠించుటవలనగాని, మిగులవిస్తారములగు తర్కవ్యాకరణాది శాస్త్రములను అభ్యసించుటవేగ్గాని, స్వర్గవాసము, గ్రామనివాసము పర్ణశాలలయందు నివసించుట

మొదలగు వానిచేతను, కర్మలచేతను, విలాసములచేతను, ప్రయోజనములేదు. అవిఅన్నియు వర్తకవ్యాపారముల వంటివి. సంసారదుఃఖమును నశింపచేయు నట్టిదియు, ఆత్మానుభవమును గలుగజేయు నట్టిదియును అయిన బ్రహ్మనిష్ఠ చేతనే సకల లాభములు నిరాటంకముగ గల్గునని తాత్పర్యము. అనగా నట్టి బ్రహ్మనిష్ఠయొక్క దాని చేతనే ముక్తిసిద్ధించును.

ఇక మనము దీనియొక్క నాల్గవ అర్థములోనికి ప్రవేశించవలెను. అప్పుడు మాత్రమే పురోభివృద్ధిని గోరువారు పూర్వవృత్తాంతము తెలియవలెనను అర్థము లెస్సగ తెలిసికొనగలము. అట్టిస్థితికి వెళ్ళినప్పుడు ఇంతవరకు చెప్పినవన్నియు సామాన్యములేగాని విశేషములని తోచవు. అపుడే "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" ఏకమేవాద్వితీయం", అను శ్రుతివాక్యము బోధక మగును. ఈసృష్టికిముందుగ నామరూపరహితమైన సద్వస్తువగు బ్రహ్మము మాత్రమే యుండెను. అందరియొక్క ఆత్మయు, ఆసద్వస్తువగు బ్రహ్మమయముగానే యున్నది, అనేకపాత్రములలో ప్రతిబింబించిన సూర్యచంద్రుల బింబమేలాగున ఒకే విధముగనుండునో ఆలాగున అందరి హృదయాంతరాళములో వెలుగుచున్నది ఆసద్వస్తువగు బ్రహ్మమేగాని వేఱుకాదు, ఇట్టి జ్ఞానము బోధము గల్గునపుడే మృత్యువుతో కూడిన ఈమర్త్యులు అమృతులుగా గల్గుదురు, సముద్రమునుండి గల్గిన కెరటములు, బుడగలు, తుంపరలు మొదలగునవన్నియు సముద్రజలమున కన్యముగానట్లు ఈజీవకోట్లన్నియు ఈశ్వరస్వరూపమున కన్యములు కానేరవు, ఇట్టి తత్త్వబోధము గల్గునపుడే మీరు ఈశ్వరజ్ఞానమున పొందుట కర్హులను ధీరత్వము గలవారగుదురు. అట్టిబోధము గానిచో డ్రామా (కంపెనీ) లలో మానవుడు ఏయే వేషములు ధరించునో అప్పుడు మానవత్త్వము మఱచి, వేషముయొక్క ఆకృతిననుసరించి వర్తించునట్లు దైవభావము మరుగుపడి దయ్యపుభావము మొదలగు వానిచే నావేశితుండై మాయకు లోబడుచున్నాడు. అనగా ప్రకృతియొక్క వికృతికివశుడై, తన ఆశ్రమమో, నామమో, రూపమో కులమో గ్రహించి యిట్టి అవస్థలకు అధీను డగుచున్నాడు.

సువర్ణమునుండి కల్గిన అభరణము లన్నియు సువర్ణరూపముగనే యున్నట్లు ఈశ్వరస్వరూపమునుండి గల్గిన ఈజీవులందరు ఈశ్వర

మయులైయున్నారు. ఇట్టి బోధము కలిగినమాత్రమే భవబంధము నుండి విముక్తిగల్గును, అంతవరకు బోనులోపడిన సింహమువలె దుఃఖము నొంద వలసినదే. వలలో చిక్కుకొనిన పక్షులవలె తాపము ననుభవింప వలసినదే. ఇట్టి సంకటమునుండి విముక్తి కలుగజేయు నదియే ఆత్మబోధము, లేక ఆత్మజ్ఞానము, లేక బ్రహ్మవిద్యయని మనము తెలిసికొనవలెను. ఒకకొయ్య నుండి చేయబడిన అనేక రకముల బొమ్మలు పక్షులు, మృగములు, దేవతలు, మొదలైనవన్నియు ఆదారువునకు అన్యముగానట్లు సద్వస్తువగు పర బ్రహ్మము నుండి గలిగిన బ్రహ్మాది దేవతలు, ఇంద్రాది దేవగణములు, అసురులు, మానవులు మొదలగు వారందరును అసద్వస్తువగు దైవమునకు అన్యులుకారు. ఒక్కలోహముచే అనేక చిత్రవిచిత్రములగు యంత్రములు; ఆయుధములు మొదలగునవి చేయబడునపుడు, వేలువేలుగా కనుపించినను, విచార బుద్ధితో జూచిన ఏలాగున లోహమయముగా నుండునో ఆత్మదృష్టితో శుద్ధాంతఃకరణముతో, జ్ఞానభావముతో చూచిన ఈజగత్తంతయు చిత్ర విచిత్రములుగా కనుపించినను ఏకైకవస్తువు దైవమయముగా నుండును, అపుడు నాయందును, మీయందును, మనముపాసించు దైవమునందును ఒకే సద్వస్తువును గనుగొనగలము లవణమున కాధారమగు సముద్రము నందు, ఉప్పుకల్లు పరిశోధనార్థము ప్రవేశించిన, ఏలాగున తనరూపమును వదలి జలమయమగునో, అలాగున ధ్యాతయగు జీవుడు ధ్యేయమగు దైవము లోనికి ప్రవేశించిన, ధ్యాతృత్వము నశించి ధ్యేయమగు భగవన్మయమై మారిపోవును· అంతవరకు అగాధ ధ్యానములోనికి వెళ్ళకపోవుటే ఏకత్వము నందకపోవుటకు కారణమగుచున్నది. అగ్నిలోనికి ప్రవేశపెట్టిన తైలము గాని కర్పూరముగాని, మైనపువత్తిగాని ఏలాగున అగ్నిమయమై కొంచెమైన శేషింపక, జ్వాలా కారముగ రగులుచుండునో, అలాగున పరంజ్యోతియై వెలుగుచుండు పరశివ వస్తువులోనికి శుద్ధాత్ములగు జీవులు ధ్యానముచేత ప్రవేశించిన, జీవత్వమునశించి స్వయంప్రకాశమగు శివత్వము నొందుదురు. అట్టి ఆ ప్తవాక్యమును గ్రహింపనందుచేతనే ఈశ్వరైక్యమగు ధ్యానములో ప్రవేశింపనందుచేతనే, దివ్యజ్యోతియగు ఈశ్వరప్రకాశమునుండి జీవకోట్లు దూరులగుచున్నారు. ఒకేదూదిచేత గలిగెడు అనేకరకములగు వస్త్రములు, షర్టులు, టోపీలు, చొక్కాలు వేలువేలుగా కనిపించినను యథార్థముగ

విచారించిన ఒక్కేదూదిగా ఏలాగున ఉండునో, ఆలాగున తత్త్వదృష్టితో జూచిన మీఆత్మయు నాఆత్మయు. నొకే ఈశ్వరమయ ముగ గనందగును. ఇట్టిస్థితి గలుగుటకే సమ్యక్ జ్ఞానమనియు, దివ్యదృష్టియనియు, దివ్యజ్ఞాన మనియు పేర్లు, గొప్పదగు ఏకశిలయందు ఒక ప్రక్కరాజు మంత్రులు, భృత్యులు మొదలైనవారున్ను ఇంకొక ప్రక్క అనేక విధములగు జంతు సముదాయమున్ను, మఱియొకప్రక్క అగణితములగు పక్షివర్గమున్ను వేఱొకప్రక్క అనేక వృక్షసమూహములున్ను, ఇంకొకప్రక్క దేవతలును, వేఱొకప్రక్క అసురులు మొదలైనవారును చెక్కబడిన, స్థూలదృష్టితో జూచునప్పుడు వేలు వేలు గుణములున్ను, రూపములున్ను, నామములున్ను కనుపించినను, సూక్ష్మదృష్టితో జూచిన అవి అన్నియు ఒక్కటే శిలామయ ముగా నెట్లుండునో, కొంచమైనను భేదమెట్లు గలిగియుండవో. ఆలాగున ఆత్మదృష్టితో చూచిన ఇవన్నియు ఆసద్వస్తువగు దైవమయముగానే యుండును. అట్టిదృష్టి నవలంబించుకొనవలెను. ఇదే మిమ్ములను దైవ ప్రాప్తి నొందించునది, ఇప్పుడు జెప్పినవానిలో విశేష వాక్యములున్ను, సామాన్య పరిణామమునుగూర్చి చెప్పబడినవే. విపర్తవాదదృష్టితో జూచిన, ఇట్టి పరిణామావస్థకూడ గ్గలక ఆసద్వస్తువగు బ్రహ్మమే చిద్ఘనమై. ఆనందమై, అమృతరసమై, యెల్లకాలము, ఏకరూపమై వెలుగుచున్నది. ఇదే "తత్త్వమసి" యను సామవేదసారమగు ఛాందోగ్యోపనిషత్తు తెలుపుచున్నది. ఇట్టి మహావాక్యశ్రవణము ముముక్షువులందరును, జిజ్ఞాసువులందరున్ను చేయ వలసి యున్నది. దీనికి సాధన చతుష్టయసంపత్తిగల ప్రతిమానవుడున్ను ప్రతిస్త్రీయు, ప్రతిపురుషుడును అర్హులై యున్నారు. పరమేశ్వరు డొసంగిన ప్రాణవాయువును పీల్చుటకున్ను, సూర్యప్రకాశములో సంచరించుటకున్ను, ప్రశాంతచంద్రికలో విహరించుటకున్ను సర్వులును ఏలాగున అర్హత గల్గి యున్నారో, ఆలాగున పరమ కారుణికుడగు ఈశ్వరుడు జీవకోట్ల జ్ఞాన సౌఖ్యము కొరకొసంగిన దైవ విచారము గలుగజేసికొనుటకు, అందరున్ను అర్హులై యున్నారు. అట్టి దైవజ్ఞాన మొక్క దేశములోగాని, ఒక్కస్థలములో గాని, ఒక్కలోకము లోగాని, ఒక్కరిహద్దులోగాని ఉండక ఒక్కరిదిగానిగాక పరమాణువునుండి పరమేశ్వరుని వరకు అన్నిటిలోను వ్యాపించి మీహృదయ ములో వెలుగుచు, మీఆత్మయైయుండి మీరైయేయున్నారు. ఇదే యథార్థ

ముగ పురోవృద్ధిని గోరువారు పూర్వవృత్తాంతమును మఱువగూడదను వాక్యముయొక్క లక్ష్యార్థము ఈవిషయమై వేలకొలది శ్రుతిస్మృతులు ప్రమాణములు గలవు అనుకూలము గలవారు చూచుకొనవచ్చును ఇదే సనాతన మతము.

అయినను కొన్ని ప్రమాణశ్లోకములు ఈక్రింద చూపించడమైనది.

అగ్నావాపద్ధృతంసర్వ మగ్ని రేవ భవేద్యథా।
విదితం విదితం వేద్యం సంవిదేవ భవేత్తథా॥

అగ్నియందు హోమముచేయబడిన ఘృతమంతయు అగ్నిరూపమై యేలాగున నగుచున్నదో, అలాగున తెలిసికొనదగిన ఆత్మను తెలిసికొనిరాగా రాగా, అసంవిత్తు ఆత్మయే యగుచున్నది.

కర్పూరో దీపసంసర్గా ద్దీపఏవ భవేద్యథా ।
వేద్యవేదన సంసర్గాత్సంవిదేవ భవేత్తథా॥

దీపపుసంసర్గముచే కర్పూరమేలాగున దీపరూపమై మారుచుండునో, అలాగున తెలియదగిన ఆత్మను తెలియుటకు తగిన ధ్యానాదులు వేయుచు రాగారాగా అసంవిత్స్వరూపమగు చైతన్యమే యగుచున్నది.

సంవిదితం సంవిదితం సంవిన్మయమేవభవతి సంవేద్యమ్।
అగ్నావాహిత మాహితమగ్నిమయం కిన్నజాయతే కాష్ఠమ్॥

లెస్సగ ఆత్మయందు పరమాత్మభావనచేయుచు రాగారాగా అంత యున్ను ఆ పరమాత్మమయమే యగుచున్నది. అగ్నియందు హోమము చేయబడిన వస్తువులన్నియు అగ్నిమయములై యుండును గాని ప్రత్యేక మేమియు మిగిలియుండదుగదా!

నాహంబ్రహ్మేతి సంకల్పాత్ సుదృఢాద్బధ్యతేమనః ॥
సర్వంబ్రహ్మేతి సంకల్పాత్ సుదృఢాన్ముచ్యతేమనః॥

తనయొక్క ఆత్మస్వరూపమగు బ్రహ్మమును మఱచి దేహేంద్రియము లతో కూడిన వాడగు తన్ను తలంచుటయే బంధము గల్గ చేయుచున్నది. తన ఆత్మస్వరూపమును బ్రహ్మముగా దలంచి ధ్యానించుటచే, సమస్త బంధములనుండి విముక్తి గల్గుచున్నది.

సంకల్పః పరమో బంధ స్త్వసంకల్పో విముక్తతా।
సంకల్పం సంవిజిత్యాంతర్యథేచ్ఛసి తథాకురు॥

అనాత్మ వస్తువులో ఆత్మసంకల్ప మేదిగలదో అదియే బంధమును గలుగజేయుచున్నది. అట్టి సంకల్పము లేమియే విముక్తి యగుచున్నది. అందువలన అన్ని సంకల్పములను జయించిన వాడవై ముక్తుడవుకమ్ము. ఇదే శాస్త్రములన్నింటియొక్క సారము. పిమ్మట నీ యిష్టము వచ్చినలాగున చేయుము అని శ్రీ వసిష్ఠమునీంద్రులు శ్రీరాములకు యోగవాసిష్ఠమున నుపదేశించిరి. ఇక అపరోక్షానుభూతి యందు శ్రీజగద్గురు శంకరభగవత్పాదా చార్యు లుపదేశించిన దానిని చూడుడు—

సర్పత్వేన యథారజ్జూ రజతత్వేన శుక్తికా।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేనతథాఽఽత్మతా॥

రజ్జువు సర్పముగను, శుక్తి రజతముగను నిర్ణయింపబడినట్లు ఆత్మ దేహముగా మూఢునిచే నిశ్చయింపబడుచున్నది.

ఘటత్వేన యథా పృథ్వీ పటత్వేనైవ తన్తవః।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా॥

పృథ్వి ఘటముగను, తంతువులు పటముగను నిశ్చయింపబడునట్లు ఆత్మ దేహముగా మూఢునిచే నిశ్చయింపబడుచున్నది.

నరత్వేన యథాస్థాణుర్జలత్వేన మరీచికా।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా॥

స్థాణువు పురుషుడుగను, ఎండమావులు జలముగను, నిశ్చయింప బడునట్లు ఆత్మదేహముగా మూఢునిచే నిశ్చయింపబడుచున్నది.

ఆత్మానం సతతం జానన్ కాలం నయ మహామతే।
ప్రారబ్ధమఖిలం భుంజన్ నోద్వేగం కర్తుమర్హసి॥

మహామతీ, నీవు ఆత్మను నిరంతరమును తెలిసికొనుచు. కాలము గడుపుచుందువుగాక! ప్రారబ్ధమంతయు అనుభవించువాడవై చిత్తక్షోభమును పొందకుండుము.

కనకం కుండల త్వేన తరంగత్వేన వై జలమ్ ।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా॥

కనకము కుండలముగను, జలము అలలవలెను నిశ్చయింపబడునట్లు. ఆత్మ దేహముగా మూఢునిచే నిశ్చయింపబడుచున్నది.

భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా!
పుమాం స్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్॥

నిశ్చయబుద్ధి గల ఎవనిచేత ఎ వస్తువు తీవ్రవేగముచే రేయింబవళ్ళు భావింపబడుచున్నదో,వాడు ఆ జ్ఞేయవస్తువుగా (అపరోక్షముగా తెలియదగిన బ్రహ్మముగా) భ్రమరకీటమువలె అగుచున్నాడు.

పురోవృద్ధియొక్క తాత్పర్యము నీలాగున గ్రహింతురుగాక!

ఓం తత్ సత్.



# బ్రహ్మజ్ఞానము మనుజులను సోమరులనుగా జేయుచున్నదా? లేక సోహంపరులనుగా జేయుచున్నదా?

ఓంనమో గురుభ్యో గురుపాదుకాభ్యో
నమః పరేభ్యః పరపాదుకాభ్యః ।
ఆచా .
నమోఽస్తు ల ః॥

సామాన్యజనులు బ్రహ్మజ్ఞానము. అనగా దైవభక్తి యోగము, తపస్సు మొదలగు జీవన్ముక్తికి హేతువులైన పవిత్రమార్గము లన్నియు జనులను సోమరులనుగా జేయుచున్నవని చెప్పెడు ఒక దురలవాటు గలదు. ఇద్ది వేదశాస్త్ర విచారణయు, బ్రహ్మనిష్ఠుల సంసర్గమును లేకపోవుటవలనను, తనయొక్క ఆత్మ పరిశుద్ధావస్థ పొందని హేతువులను గలిగిన అపోహయే

గాని మఱియొకటిగాదు. అయితే కొంతచదువుకొన్న వారును, మేధాసంపత్తి గలవారు సహితము ఈయభిప్రాయముగలవారు లేకపోలేదు. దానికి కారణము ఇప్పుడు స్వప్రయత్నముచే జీవితము గడుపచూడక సోమరులై బిచ్చమెత్తుకొని తినుచు మత్తువస్తువులను పుచ్చుకొనుచు సత్యధర్మదూరులై యుండు కొందరి దిమ్మరులను జూచి చెప్పిరేగాని మరియొకటి గాదు. ఈ విషయములో వారు చెప్పెడు వాక్యము సంపూర్ణముగా అర్థరహితమని తలంచరాదు. అది సత్యము. అయితే అట్టివారి దృష్టియందు ఈలాటి వారెక్కువగా కబడియుందురు కాని నిజమైన బ్రహ్మనిష్ఠులను, తాపసోత్తములను యోగసాధకులను, పరమభక్తులను వీరు చూచియుండరు. అందువల్ల సాధువు లందరు నిట్టి వారలుగా నుండవచ్చునని వారు తలంచుట కవకాశము గలిగినది.

పట్టణ ప్రదేశములలో మురికినీరు కాలువలు గలవు. వాటిని జూచి పరమపావనములగు గంగ, సింధు, యమున, గోదావరి మొదలగు పుణ్యనదులు గూడ నీలాగున నుండవచ్చునని తలంచు టెంత పొరబాటో ఈ కార్యములలో అలాగున గ్రహించుకొనవలసి యుండును. అయితే వారు తలంచేలాగున నుండువారు చాలమంది గలరు. అట్టివారు వృద్ధియగుటకు ముఖ్యకారణము దారిద్ర్యము. రెండవది జనులకు పనిబాటలు లేకపోవుట. మూడవది యట్టివారిని సంస్కరించి సరియైన మార్గములో నడుపువారు లేకపోవుటచేతను నీలాగున గలుగుచున్నది. ప్రజల నాలాటి కుమార్గము నుండి సంస్కరించుట సామాన్యజనులకుగాని, సామాన్యరాజులకుగాని వీలగు పని గాదు అది ప్రభుత్వమువలననే గావలసియుండును.

దానికి తగిన శాసనముల నిర్మించి అట్టివారికి జీవనోపాయముల నేర్పరచిన మాత్రమే యిట్టి దురవస్థ లోకమునుండి తొలగును. కాని వీరు యోగనిష్ఠ గలవారని గాని, బ్రహ్మవిచారము జేయువారని గాని, పరమ భక్తులని గాని వివేకముగలవారు తలంచరు. ఇట్టివారితో బ్రహ్మనిష్ఠులను బోల్చి చెప్పుట సరికాదు. అది తమస్సుతో ప్రకాశమును, సమాధినిష్ఠతో నుండు మహాత్మునితో గాఢసుషుప్తిలోనుండు సామాన్య మనుజుని సమముగా చెప్పినట్లే యుండును. పుణ్యనదులగు గంగ, సింధు, గోదావరి మొదలగు వాటియొక్క ప్రవాహములు ఎన్నియో కోట్ల జనులకెట్లు జీవనాధారములై

యున్నవో, ఆలాగున నొక్కొక్క మహాత్ముడు జన్మించినపుడు ఎన్నికోట్ల జీవులు సంసార తాపాగ్నిజ్వాలనుండి విముక్తులై శాశ్వత ముక్తిపదవిని బొందిరో చెప్పనలవియగునా? వీరిలో నవతారపురుషులు, ప్రవక్తలు యోగులు, తాపసులు పరమభక్తులు వారివారి దివ్యతేజస్సు ననుసరించి జనులను పాపపంకమునుండి యుద్ధరించియున్నారు. ఆ విషయము వెనుక తెలుపబడును అట్టి దివ్యపురుషు లవతరించని దేశము సూర్యోదయములేని ప్రదేశమువంటిదే యగును. అట్టి పావన మూర్తులుండని స్థలము వట్టి ఎడారి ప్రదేశముగాను. శ్మశానస్థలముగాను ఉండునేగాని యుత్కృష్టమగు మానవజాతి నివసించెడు భూప్రదేశము గాగలదా?

అయితే కొందరు ఆత్మ ప్రాప్తి గలుగజేసికొనుటకు సంసారములో నుండిన ప్రతిబంధముల నుండి తప్పించుకొనుటకు సాధ్యముకాదని తలంచి త్యాగులై, విరక్తులై బ్రహ్మనిష్ఠ జేయుచుందురు. లేక వేదాంత విచారణగాని, తపస్సుగాని, యోగనిష్ఠగాని యభ్యసింతురు. వీరిని జూచి మలినహృదయులును, విషయాసక్తులును, సంసారమోహముచే జ్ఞానాంధులగు కొందరు ఈలాగున తలంచగలరు. అదేమన వీరందరును ఈలాగున విరక్తులై పోయినచో సంసారకార్యములు జరుగవనియు, దానివలన ప్రపంచమునకు హానికరమనియు తలంతురు. త్యాగమును, వైరాగ్యము లేనిచో ప్రపంచములో నేకార్యమునుగాని, యెవరుగాని, యే కాలములోగాని సాధింపజాలరు. సాధించినవారందరును పరమ త్యాగము, అత్యధిక వైరాగ్యము, తీక్ష్ణమైన వ్రతనిష్ఠ నవలంబించినవారు మాత్రమే. అట్టివారే లోకోన్నత కార్యముల నాచరించినయున్నతోన్నత పదవిని పొందియున్నారు.

ఇప్పుడు స్వరాజ్యవిషయములో పరమ త్యాగము నవలంబించి జనులను స్వరాజ్యాభిమానమును గలుగజేయు విషయములో సదా ప్రయత్నపరులై, తీక్ష్ణసహనశక్తిగలవారలై ప్రబోధమును గలుగజేయు పుణ్యపురుషులును, త్యాగమూర్తులును, మాతృదేశాభిమానులును, అన్నవస్త్రముల కైన లేని పరమదరిద్రజనులను, దారిద్ర్యపీడచే తపించు జీవకోట్లనుజూచి సహింపజాలక తమయొక్క సర్వస్వమును త్యజించి సౌఖ్యముల నన్నిటిని విడిచి బంధుపుత్రమిత్రాదుల నందరిని ఉపేక్షించి లోకసేవ జేయుచుండగా దేశాభిమానము లేశమైన లేనివారును, తమయొక్క సౌఖ్యమును మాత్రము

జ్ఞాపకముంచుకొనువారును జీవరాసులయందు కరుణలేనివారును, త్యాగమెఱుంగని వాడుకసునగు కొందరు వారికి భిన్నాభిప్రాయములుగలవారై యున్నారు. స్వరాజ్యములో జేరిన సంసారము పాడైపోవును. ఇది లోకమున కుపద్రవ కారణము. అంతేగాక లోకవినాశమునకు గూడ హేతువగును అని చెప్పుటలో నెంత సత్యమిమిడియున్నదో, ఇది యెంత పరమార్థమో, ఎంత పరిశుద్ధ విచారమో తెలిసికొనిన పైజెప్పిన అనగా బ్రహ్మజ్ఞానము జనులను సోమరులనుగా చేయునను వాక్యముగూడ అంతే సత్యముతో గూడినదని విజ్ఞులు గ్రహింపకొనవచ్చును.

స్వరాజ్యములో ప్రవేశించిన ఒకవేళ శాసనోల్లంఘనము జేయు వారి సొత్తులను జప్తు చేయవచ్చును. అలాటికారణము లేవియు నాత్మ రాజ్యములో అనగా స్వారాజ్యములో ప్రవేశించి విరక్తులై ధర్మభోధకు లగువారికి గలుగవు. కొద్దికాలముండి జీవించుట కాధారమైన ఈ కొద్ది దేశముకొఱ కింతత్యాగము, పరిశ్రమ, సహనముగలిగి స్వరాజ్య ప్రాప్తికొఱకు పనిజేయు ధీరపురుషులు యత్నించునపుడు, శాశ్వతమై, అనంతమై, సౌఖ్యానందమైన స్వాత్మరాజ్య ప్రాప్తికొరకెంత త్యాగము, ఎంత పరిశ్రమ, యెంతవ్రతనిష్ఠ గలిగియుండవలయునో మీరే యోచించు కొనవలయును. ఎంత యున్నతో ద్యోగమును బొందదలంచిన నంత యున్నతవిద్యను నభ్యసించవలసి యుండునుగదా! బ్రహ్మవిద్యయును అట్టిది యని మఱువకుడు. ఇది యనంతానందమును గలుగజేయునది. అఖిలలోకముల కాధారభూతమైనది. దేనియందు మహిమగలదో అది మహాప్రయత్నము వలననే లభించును.

ఈ బ్రహ్మవిద్య యందుగూడ నెనిమిది తరగతులు గలవు. ఇది యోగ మార్గానుసారముగాను, జ్ఞానమార్గానుసారముగాను నుండును. కొందరు యోగమార్గము నవలంబించియు, మఱికొందరు జ్ఞానమార్గము నవలంబించియు జీవన్ముక్తి పదవిని బొందగలరు. యోగమందు నిష్కామ యోగమును జ్ఞానమందు భక్తి యోగమును, అంతర్ధ్యానములు, హృదయశుద్ధిగల వారి కిని, ఇంద్రియ నిగ్రహము సిద్ధించినవారికిని, మనశ్శాంతి లభించిన వారికిని, వైరాగ్యము గలిగినవారికిని జ్ఞానమార్గము చాలును. అనగా వేదాంతవిచారణ చేతనే దైవసాక్షాత్కారము గలుగును ఇది ధ్యానయోగముతో జేరినది.

ఆలాగున పైజెప్పిన దైవికగుణముగల పరమభక్తులకు స్మరణ కీర్తన, ధ్యానములుండిన చాలును. అట్లుగాని వారికితపస్సు, యోగసాధన, ఇంద్రియ నిగ్రహపరముగు అనుష్ఠానములన్నియు నుండవలయును. ఆలాగున నిష్కామకర్మ యోగనిష్ఠ గలవారికి జీవన్ముక్తి పదవి గలుగును.

యోగమార్గములో 1. యమము, 2. నియమము, 3. ఆసనము, 4 ప్రాణాయామము, 5, ప్రత్యాహారము, 6. ధారణ, 7, ధ్యానము, 8. సమాధియను ఎనిమిదిమెట్లు గలవు. ఆలాగున జ్ఞానమార్గములోను 1. శుభేచ్ఛ, 2. విచారణ. 3. తనుమానస, 4. సత్త్వాపత్తి, 5. అసంసక్తి 6. పదార్థాభావన, 7, తురీయము, 8, తుర్యాతీతము అను ఎనిమిదవస్థలు గలవు. వీనిలో యోగమార్గమున యమమునుండి ప్రాణాయామము వఱకు గల నాలుగంగములు యోగముయొక్క బహిరంగము లనబడును. ప్రత్యాహారమునుండి సమాధిపర్యంతము గల నాలుగంగములు అంతరంగము లనబడును. ఆలాగున జ్ఞానమార్గములోగూడ శుభేచ్ఛనుండి సత్త్వాపత్తివరకు గల నాలుగు భూమికలు బాహ్యభూమికలగును. అసంసక్తినుండి తుర్యాతీతమువఱకు గలుగు భూమికలను ఆభ్యంతరములని చెప్పుదురు. కాని శుభేచ్ఛ, విచారణ, తనుమానస అనుమూడు భూమికలలోనుండు వఱకు దృశ్యవృత్తులు గలుగుచుండును. సత్త్వాపత్తి అను నాల్గవభూమికలో ప్రవేశించిన, నది మధ్యముగా నుండును క్రిందిమూడు భూమికలవరకు వచ్చినవారైనను సరియైన యనుష్ఠానము లేకపోయిన క్రిందికి జారిపోవుదురు. పదార్థాభావన, తుర్యము, తుర్యాతీతము ఈభూమికలలోనికి ప్రవేశించినవారికి విషయ వాసనలు నశించియుండును. వీరికి బాహ్యవృత్తులు గలుగవు. అట్టి వారికి పతనము సంభవిడచదు, వీరి హృదయము శరత్కాలాకాశమువలె శుద్ధముగా నుండును. అట్టివారు మరలమరల పదార్థాభావన నుండి పైపై భూమికలలోనికి మెల్లమెల్లగా ప్రవేశించుచుందురు, వీరు స్వచ్ఛమగు నాకాశమువలె శుద్ధజ్ఞాన ప్రకాశవ్యాపకులై యుందురు, వీరు జీవన్ముక్తులు. ముందుజెప్పిన ముగ్గురును అభ్యాసులు, ఈవిషయము లన్నియు నింతవరకు వ్రాయబడిన గ్రంథములలో శాస్త్రసహితముగా దెలిపియుండుటచే మరల నిచట ప్రస్తావించబూనలేదు.

## మన కర్తవ్యము.

ఇప్పుడు లోకములో గల్గియుండు దురభిప్రాయమును, అనగా బ్రహ్మజ్ఞానము (వేదాంతము) జనులను సోమరులను జేయుచున్నదను వ్యామోహమును (నిందను) తొలగించుటకు తగిన ప్రయత్నము చేయుట ప్రతి ముముక్షువుయొక్కయు కర్తవ్యమైయున్నది. నివృత్తిమార్గములో నభిలాషగల ప్రతిస్త్రీయును, పురుషుడును, వారు గృహస్థులుగాని. తక్కిన మూడాశ్రమములలో నుండువారు గాని తగిన పరిశ్రమజేసి బ్రహ్మజ్ఞాన మొక్కటి మాత్రమే జనుల కాత్మశాంతిని గలుగజేయునది, అది యొకటి మాత్రమే జనుల దుఃఖసాగరమునుండి తరింపజేయునది, అది యొక్కటి మాత్రమే తాపత్రయాగ్ని చల్లార్చునది; అదియొకటి మాత్రమే యాత్మను పునీతముగా జేయునది; అదియొక్కటి మాత్రమే పండితులకైనను, భూమండలాధిపతులకైనను, బ్రాహ్మణులకైనను, బ్రాహ్మణేతరులకైనను, యతులకైనను, ఇతరాశ్రమస్థులకైనను, స్త్రీలకైనను, పురుషులకైనను, బాలురకైనను, వృద్ధులకైనను, దేవతలకైనను, బ్రహ్మలోకనివాసులకైనను, వెయ్యేల బ్రహ్మదేవునికైనను దుఃఖములేని యానంద ప్రాప్తిని గలుగజేయు దివ్యామృతమై వెలయుచున్నది. అని లోకమున చాటవలెను. తక్కిన విద్యచేతగాని, ధనముచేగాని, అధికారముచేగాని, భూమండలాధిపత్యముచే గాని, యజ్ఞాదిక్రతువులచేగాని, స్వర్గలోకమును బొందినగాని, అచటనుండి తపోలోకము జనలోకము సత్యలోకమువరకు ప్రాకినను, చతుర్ముఖ బ్రహ్మయై వెలిగినను వేదసారమగు దైవజ్ఞానామృత పానము జేయనిచో శోకశాంతిగాని, ఆనందప్రాప్తిగాని యేకాలములోగాని, యేలోకములోగాని, యెవరికిగాని లభింపజాలదని భేరిమ్రోగించి రాజవీధులలో జెప్పుచుండవలయును. దానికందరును పరిశ్రమచేయు స్వభావము గలిగియుండవలయును. సోమరితనమునకు తిలోదకముల విడువవలయును. ఇంద్రియ సౌఖ్యముల కన్నిటికి తర్పణ మొనర్పవలయును. ఎంతవరకు విద్య నభ్యసింప సాధ్యమగునో అంతవరకు విద్య నభ్యసింపవలయును, అది సంస్కృతవిద్యగా నుండేలాగున జూడవలయును. విద్యాభ్యాసముతో గూడ బ్రహ్మవిద్యను అనుష్ఠానమునుగూడ గలిగియుండే లాగున నిశ్చయించుకొనవలయును. లేనిచో విద్యయవిద్యయై పోవును. మంచి తపస్సు గలిగి

యుండవలయును. యోగసాధనల జేయతలంపు గలవారు దానినిగూడ శీలించవలయును. అయితే తపస్సు, యోగము సిద్ధులకొరకుండగూడదు. అట్లయిన తపస్సు తమస్సుగాను, యోగము వియోగముగాను పరిణమించును. సాధ్యమైనంతవఱకు పరుల నాశ్రయించకజీవించవలయును.పరులనాశ్రయించి పుణ్యకర్మలగాని లోకోపకారములగాని చేయు స్వభావము గల్గియుండరాదు. అయితే అంత రంగిక భక్తులకుమాత్రము పుణ్యవిషయమై సలహాలు చెప్ప వచ్చును. అశ్వమేధాది యజ్ఞములుగాని, రాజసూయాది క్రతువులుగాని, ఇతరములగు ఆరాధనలుగాని బ్రహ్మనిష్ఠకు సరిపోజాలవు.

వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానము పైతి చాద్యమ్॥
(భగ॥ అ. 8 శ్లో. 28)

బ్రహ్మనిష్ఠయొక్క మాహాత్మ్యమును జెప్పెదనివినుము. అర్థజ్ఞాన సహితముగా వేదము నధ్యయనము జేయుటవలనను, శ్రద్ధా భక్తులతో యాగముల జేయుటవలనను, లెస్సగా కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సుల జేయుటవలనను, యథాశక్తి సత్పాత్రదానముల జేయుట వలనను, ఏ పుణ్య ఫలము గలుగునని శాస్త్రములయందు జెప్పబడియున్నదో అట్టి ఫలముల నన్నిటిని తుచ్ఛము. అని తలంచి యోగి ఆద్యమైనదియు సర్వోత్కృష్ట మైనదియునగు బ్రహ్మమును బొందును. అని శ్రీకృష్ణభగవానులు పదేశించిరి. మనుస్మృతిలోగూడ మనుమహర్షి యీలాగుననే చెప్పెను –

వార్యన్నగోమహీవాస స్తిలకాంచనసర్పిషామ్।
సర్వేషా మేవ దానానాం జ్ఞానదానం విశిష్యతే॥

జలదానము. అన్నదానము, గోదానము, భూదానము, వస్త్రదానము, తిలదానము, సువర్ణదానము, ఘృతదానము మొదలగు నెన్ని విధములైన దానములు కలవో, వాటియన్నిటిలోను బ్రహ్మజ్ఞాన దానము అత్యుత్కృష్ట మైనది, ఏలన తక్కిన యేదానముచేతను అంతఃకరణములోగల యవిద్యా

సంబంధమగు భవరోగతాపము శమించదు. అజ్ఞాన మహారోగమునకు ఈశ్వర సాక్షాత్కారజ్ఞాన మొక్కటియే దివ్యరసాయనము.

స్నాతం తేన సమస్త తీర్థనిచయే దత్తం మహీమండలం
విప్రేభ్యః పితృదేవతా స్సురగణా స్సర్వేఽపి సంతర్పితాః॥

జప్తా మంత్రసహస్రకోటి రమునా తప్తంచ తీవ్రం తపో।
యస్యబ్రహ్మ విచారణే క్షణమపి ప్రాప్నోతి స్థైర్యం మనః॥

బ్రహ్మాండ కటాహములోగల సమస్తతీర్థములలో విధిప్రకారము స్నాన దానములు చేసిన నేఫలముగలదో, పుణ్యకాలములో కాశ్యాది పుణ్యక్షేత్రము లలో నుత్తమ వేదబ్రాహ్మణులకు భూమండల మంతయు దానము జేసిన నేఫలము గలదో, సమస్త పితృదేవతల నుద్దేశించి గయలో తర్పణ మొనర్చిన నేఫలముగలదో, బ్రహ్మవిష్ణు మహేశ్వరాది దేవతల విధిప్రకార మారాధించిన నేఫలము గలదో, గాయత్ర్యాది మంత్రములను వెయ్యికోట్లు జపమొనర్చిన నేఫలము గలదో, కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సుల తీవ్రముగా నొనర్చిన నేఫలము గలదో, అవియన్నియు మొత్తముచేసిన కలుగుఫలమంతయు, ఒకక్షణకాలము నిర్విషయస్థితిలో నుండి పరమాత్మ ధ్యానములో నిలుకడగలిగిన సిద్ధించును అని యోగవాసిష్ఠము.

అట్టి సర్వోత్తమమగు సాధనము మనచేతిలో గలిగియుండగా ఏల ఇతరుల నాశ్రయించవలయును? యాచనస్వభావము గలిగియుండుట చేతనే గృహస్థులకు, ధనాభిమానము గలవారలకు, విద్యాగర్వము గలిగిన వారలకును సాధువులపై విశ్వాసములేక పోవుచున్నది. అందువలననే పరమ పవిత్రమగు బ్రహ్మజ్ఞానము సోమరితనములో లోకమును ముంచుచున్నదని వారు చెప్పుచున్నారు. అపరిగ్రహవ్రతమును శీలించవలయును. జిహ్వేంద్రియ మును, గుహ్యేంద్రియమును బాగుగా అరి కట్టవలయును. ప్రతిజ్ఞాపూర్వక ముగా అనగా సంకల్పపూర్వకముగా నికమీద "మాకు వశముగాన"ని నిశ్చయించుకొనవలయును. పుణ్య తీర్థములయందుగాని, గురువులయందుగాని, యిష్టదేవతలందుగాని యిట్టి సంకల్పము చేసికొనిన మతింత మంచిది, అనగా నొట్టు పెట్టు

కొనవలయును. లేనిచో నొకప్పుడు మనస్సు తిరుగునేమో! పరిశుద్ధాత్ములకు తప్ప తక్కినవారికి దృఢవ్రతములో నిలుకడ గలుగుట దుస్సాధ్యము, మీరంతయును పరమఋషుల సంతానములని దృఢభావన జేసికొనవలయును. అప్పుడు నిద్రనుండి లేచిన సింహమువలె మీ రోంకారరవముతో గర్జింపగలరు. సింహధ్వని వినిన మృగములన్నియు పారిపోవుటగాని, అణగిపోవుటగాని యేలాగున నడవిలో గలుగుచుండునో, అలాగున అపుడు మీహృదయ సీమలోగల ప్రాకృతగుణము లన్నియు నణగిపోగలవు. ప్రపంచములోగల సర్వజనులకును శమదమాది గుణములు గలిగిన బ్రహ్మజ్ఞానమున కర్హత గలదని సూర్యుడు ప్రకాశించుచున్నప్పుడు భేరిమ్రోగించి రాజవీథులయందు ఉద్ఘోషించుచుండవలయును. బ్రహ్మజ్ఞానము సోమరితనమును గలుగజేయునని చెప్పెడు వాక్యమును సాధుసంఘములనుండి యుచ్చాటన జేయవలయును. సాధుసంఘము అని చెప్పనేల? భారతదేశములోనే అట్టి పాపవాక్యము లేకుండజేయవలయును. సాధువులను శబ్దము భక్తులైన వారందఱికిని జేరినదని గ్రహించుకొనవలయును. బ్రహ్మజ్ఞానములేని స్థలము పైశాచికలోకమని జనులు గ్రహించవలయును. ముఖ్యముగా అపరిగ్రహవ్రతమును, పరిశ్రమయు మాత్రముండిన దీనికి చాలును.

ఈవిషయమై ధనముకాని, పాండిత్యముగాని, బ్రాహ్మణాది భేదముగాని, స్త్రీ పురుష తారతమ్యముగాని విచారించబనిలేదు. అప్పుడు మాత్రమే యీలోక ముద్ధరింపబడగలుగును. బ్రహ్మజ్ఞానామృతవృష్టి యెంతకాలమువఱకు నేదేశమున వర్షించలేదో అంతవఱకు కాదేశమున గల జనుల హృదయము వర్షములేని దేశీయజనుల దురవస్థవంటిదే యగును. ప్రశాంతమగు దైవజ్ఞానము ఏస్థలములో చాలినంత గలిగియుండలేదో అంతవఱకా దేశము చంద్రోదయములేని కారుచీకటివలె తమోమయమై యుండును.

సాధువులు సోమరులైపోయిరనియితరులు చెప్పుటలో సారములేదనిసంపూర్ణముగా మనము చెప్పజాలము. వారు చెప్పేలాగున కొందరు తామస గుణముతో గూడియుండి యేలాటి పరిశ్రమచేయక పరాన్నముతో జీవితము గడుపువారు గలరు. అయితే వారిని సాధువులతో పోల్చిచెప్పుట సరికాదు. అట్టివారు ఏదొక్క సంప్రదాయములో చేరినవారుగాని, స్వబుద్ధితో నీశ్వరవిచారణ చేయువారుగాని కారు. సాధువుల పవిత్రమైన వేషము వేసిన వారిజీవితము

కష్టములేక గడుపవచ్చునని తలంచివారు నట్టివేషమును వేసికొనినవారేగాని మరియొకటిగాదు. అట్టివారిని జూచి పాపచరితులగు సాధువులుగూడ నిట్టివారేయని తలంచుట పాతకము అయినను దానిని సాధువులలో కొందరి దోషముచే గృహస్థులు చేయుచున్నారని తలంచి యట్టిదోషమేమియు బ్రహ్మ నిష్ఠలలో గలుగకయుండులాగున ప్రతివారును ప్రయత్నించవలయు నని మరియొకసారి ప్రార్థించుచున్నాను.

ఇంకొక సంగతినిగూడ మనము గ్రహించుకొనవలసియున్నది. అదేమన సన్న్యాసులు లోకమునకేమి మేలు చేయుచున్నారనుటయే. అయితే యీవిషయమును జెప్పువారు బాగుగా దూరాలోచన చేయుట లేదనియే మనము తలంచుకొనవలయును ప్రపంచములో గొప్ప యుద్యోగమును సంపాదించుకొనిన వారును, ఉన్నతములైన యింజనీరుల పదవిని పొందిన వారును వైద్యశాస్త్రములలో నత్యున్నత స్థితితలిగియుండు డాక్టరులును, విద్యయందు అపారపాండిత్యమును సంపాదించినవారును. వ్యాపారములో గొప్పధనమును సమకూర్చినవారును అట్టి స్థితికి వచ్చుటకు ఎంతకాలము ప్రయత్నించిరో జ్ఞాపకము చేసికొనవలయును. వారును చింతల నన్నిటిని విడిచి, యితరబంధనముల తొలగించి, వారివారి కార్యములలో నియుక్తులై కొన్ని సంవత్సరములు తదేకబుద్ధిగలిగి ప్రయత్నించినందుచే నట్టియున్నత పదవికి రాగలిగిరి. ఐ. ఎ యస్, పరీక్ష ప్యాసు చేయుట కెంతకాలము చదువవలసియుండునో యోచింపుడు. రమారమి యిరువది సంవత్సరములు విద్యనభ్యసించవలయును అలాగున పెద్దడాక్టరుపనిలో పరీక్ష నివ్వవలసి యుండినను అంతకాలము విద్యనభ్యసించ వలయును. అట్లే మహామహోపాధ్యాయపదవిని సంపాదించ వలసియుండినను అంతకాలము శ్రమపడి విద్యాభ్యాసము జేయవలసియుండును. పై జెప్పినవారిని విద్యాభ్యాస కాలములో మీరు లోకమునకేమి యుపకారము చేయుచున్నారు? సంసారమునువిడిచి యీదూరదేశములోనుండి యేమి సంపాదించుచున్నారని యెక్కరడిగినచో నతనినిగూర్చి వారు ఏమి అనుకొనెదరో దానినే మనమును గ్రహించుకొనవలయును ఇతనికి విద్యాగంధము లేదు. విద్యయొక్క యోగ్యత తెలియదనిగదా తలంతురు. అలాగునే బ్రహ్మవిద్య, తపస్సు, యోగాద్యనుష్ఠానము, దైవభక్తి మొదలగువానిలో నున్నతపదవి గలుగుటకు

కొంతకాల మేకాంతవాసము, తపస్సు మొదలైనవాని నభ్యసించి కొనవలసి యుండును దీర్ఘవ్యాధి గలవారు ఆరోగ్యము కొరకేలాగున యనుకూల స్థలములోనుండి మంచి పథ్యముతో గూడి కొన్ని నెలలుగాని, సంవత్సరములుగాని, యౌషధ సేవ చేయవలసియుందురో ఆలాగున భవరోగము నశించుటకుగూడ కొంతకాలము వ్రతనిష్ఠగలిగి పుణ్యప్రదేశములో నివసించి సాధనజేయ వలసియుండును. ఈ దేహమునకు గలిగినవ్యాధి కొన్ని సంవత్సరముల నుండియో, లేక పుట్టినప్పటినుండియో యుండవచ్చును. అజ్ఞాన మను భవరోగమో అనాదినుండి వచ్చినది. ఎన్నియో జన్మముల నుండి జీవునితో గలసియున్నది అప్పుడు దానియొక్క నివృత్తికొఱ కెంత కాలము బ్రహ్మనిష్ఠ చేయవలయునో యోచించుకొనవచ్చును. సౌఖ్యమును గూర్చి విచారించిన నాలాగుననే యుండును ఏలన నౌషధసేవచే ఆరోగ్యము సంపాదించిన నీ దేహముతో నది యంత మొందును భవరోగము నశించిన, అనంతకాలము అనంతసౌఖ్యమును బొందగలుగును. కావున నీరెంటియొక్క తారతమ్యము విచారణ జేసికొనిన బ్రహ్మనిష్ఠయొక్క గౌరవమును దెలిసికొనగలరు.

మఱియు నొకనికి జిల్లాకలెక్టరు పని వచ్చిన నాజిల్లాలో యాతండాధిక్యము బడయవచ్చును. దానికంటె ఎక్కువ యధికారము లభించిన నొకరాష్ట్రముననో లేక మరియొక దేశముననో మాత్రమే యాధిక్యము పడయగలుగును. ఆత్మప్రాప్తియో, లోకమునం దన్నిటికంటె యధికమైన స్థానమును బొందింపును, మఱియు నెంత యున్నతోద్యోగము లభించినను, ఎంత యారోగ్యమును సంపాదించిన అంతఃకరణములోగల అజ్ఞాన మను భవరోగము వారిలోనుండు నటకు జీవించి యున్నపుడుగాని, మరణానంతరమునగాని అట్టివారి కాత్మశాంతియు నిత్యసౌఖ్యము గలుగదుగదా? ఈబ్రహ్మనిష్ఠయో జీవించియున్నపుడును దేహము పోయిన తరువాతను పరమశాంతియు. పరమానందప్రాప్తియు గలిగియుండును. ఆలాగున యోచించుకొనిన బ్రహ్మవిద్యయొక్క మహిమ నేమని వర్ణింపగలము, అట్టి మహిమాతిశయము లేనిచో పూర్వకాలము రాజులు తమయొక్క రాజ్యమును విడిచి వానప్రస్థాశ్రమమునకు వెళ్ళుదురా? పండితులు సర్వసంగ పరిత్యాగులై తపోధనవనముల కేగుదుర్గా? అధికారగరిష్ఠులును సమస్తమును వదలి జ్ఞాన

మవలంబింతురా? ఎప్పుడును అగ్ని యేలాగున నూర్ధ్వముగా జ్వలించునో ఆలాగున ప్రాణికోట్లన్నియు పురోభాగమునకు వెళ్ళదలంచునే గాని అధోగతిని గుఱించి ప్రయత్నించవు

సామాన్యజనుల విచారమేమనగా, బాహ్యసౌఖ్యములచే సుఖము గలుగునని యే యజ్ఞానముచే గలిగిన దోషమేగాని మరియొకటిగాదు. సుఖమునకు స్థానము హృదయము అనగా మనస్సు. దీనికి చిత్తమనిగాని బుద్ధియనిగాని చెప్పవచ్చును. హృదయ మెంతకెంతకు శుద్ధమగుచుండునో జీవునకు బాహ్యపదార్థావశ్యకత లేకనే ఆత్మలో నంతకంత సౌఖ్యము గలుగుచుండును. హృదయము దోషయుక్తముగా నుండిన నెంత బాహ్యసుఖముండినను లేశమైన సుఖము గలుగదు.

ఈ తత్త్వమును దెలిసికొనియే పూర్వరాజులు రాజ్యసౌఖ్యములన్నిటిని తుచ్ఛములుగా దలంచి తాపసవేషమును బూని, తపోభూమిలో ప్రవేశించి తపస్సుచే నాత్మను శుద్ధిజేసికొని రాజర్షు లను పవిత్ర నామమును సంపాదించిరి. ఏమి? వారందరును బుద్ధిహీనులా? అయితే స్థితిగతులిప్పుడు మారిపోయినందుచేతను, అధ్యాత్మవిద్య నశించిపోవుట చేతను, తపోనిష్ఠులు, యోగిపుంగవులు, పరమదైవభక్తులు బ్రహ్మజ్ఞానులు, శాంతహృదయులు, కరుణాస్వరూపులు, విషయవిరక్తులు, తగ్గిపోయినందుచేతను వీరివలన గలిగెడు సుఖమును జనులు తెలిసికొనలేక పోవుచున్నారు

మఱియు నొక బీజముపెట్టి దానియొక్క ఫలము గలుగువరకు దానిని పోషించకపోయిన ప్రయోజనము గనుపించదు. విత్తనము బెట్టిన కొన్ని దినములకుగాని, కొన్నిమాసములకుగాని ఫలము నివ్వనిచో దానిని పోషించిన నేమి ఫలము? విడిచిపెట్టుడు; పోషింపవలదని చెప్పువారెట్టివారో ఆలాగుననే బ్రహ్మనిష్ఠచే, తపస్సుచే, దైవభక్తిచే నేమి గలుగుననియెడు వారిని గుఱించి మనము గ్రహించుకొనవలసియుండును. కొబ్బరి, మామిడి, పనస మొదలగు వృక్షములు ఫలించుటకై దారు సంవత్సరములు పట్టును. అంతవరకు పోషించిచూడక వెంటనే ఫలము గనుపించలేదని చెప్పుమాటల కేమి యర్థము? మఱియు నేవృక్షమునుండి యెక్కువఫలము గలుగునో అది ఫలించుటకున్ను ఎక్కువకాలము పట్టును. స్వల్పఫలము నిచ్చు

విత్తనము త్వరలోనే నశించిపోవును. మనము పెట్టినది కల్పవృక్షము. ఇది మోక్షఫలము నిచ్చునది. దీనియొక్క ఫలము గలిగిన నెన్నియుగములకైనను నశించని యక్షయ జ్ఞానఫలమును, ఆనందామృత భక్తిరసమును, అనంత కాలమునకు కిచ్చుచునే యుండును కావున నిది ఫలించుటకు ఎన్ని సంవత్సరములు పట్టునో మీరే యోచించుకొనవచ్చును. దీనియొక్క కాలపరిమితి యంతఃకరణశుద్ధి ననుసరించియున్నది. ఆత్మశుద్ధి యెంతత్వరలో గలుగునో అంత శీఘ్రముగా జ్ఞానముగూడ గలుగును.

సామాన్యముగా ద్వాదశ సంవత్సరములు అవధియని చెప్పుదురు. ఈకాలములో వ్రతభంగము గలుగనీయక, దినచర్యలు తప్పక, దైవభావము మఱుగుపడనీయక, ధ్యానాదికార్యముల జేయుచుండవలయును. పూర్వజన్మ సుకృతవిశేషము గలవారికి త్వరలోనే ఫలితము గనుపించును. వీరికి పన్ద్రెండు సంవత్సరము లుంతవలసినపని లేదు, ఆత్మశుద్ధి గలుగనివారికిని, కోపాదిదోషములు గలవారికిని, చిత్తోపరతి సిద్ధింపనివారికిని, శాంతియు, కరుణయు, విరక్తియు, సిద్ధింపనివారికిని కాలనియమమే లేదు. ఇవన్నియు ఎన్ని సంవత్సరములకుగాని, యెన్ని జన్మములకుగాని, కల్గునో అప్పుడు మాత్రమే యాత్మలాభము లభించును అనగా జ్ఞానము సిద్ధించును.

వృక్షముబెట్టి పోషించుటలోను ఇతరవిద్యల నభ్యసించుటలోను, బ్రహ్మనిష్ఠ జేయుటలోను, చాల తారతమ్యము గలదు. ఏలన వృక్షము, ఫలించిన తరువాతనే సుఖము గలుగును. విద్యనభ్యసించినవారికి ఉద్యోగము లభించిన పిమ్మటనే యానందము ప్రాప్తించును ఈబ్రహ్మవిద్య, దైవ ధ్యానము అటువంటివిగాదు. ప్రారంభించిన దినమునుండియే దినమేల, యాక్షణమునుండియే కొంత యాత్మశాంతియు నిర్మలసుఖమును అరంభ మగును వృక్షమునకు సరియైన పోషణ లేకపోయిన ఫలించుట కేలాగున నిర్ణీతకాలమునకంటె ఎక్కువకాలముపట్టునో, మఱియు సంరక్షణయుండియు చిగిరించి పువ్వులుపూసియుండు కాలమున పశువులు మేసిన, మరల యథా ప్రకారము వృక్షము మంచిస్థితికి వచ్చుటకు ఎక్కువకాలమెట్లు పట్టునో అలాగున అనుష్ఠానకాలమున విషయ వృత్తులచే బెరువు గలిగిన మరల మనస్సునకు పరిశుద్ధతయు, ధ్యానములో నేకాగ్రతయు, సూక్ష్మగ్రహణశక్తి

యున్న గలుగుటకు కొంతకాలము పట్టును. కావున కల్పవృక్షము నేలాగున నతిప్రేమతోను, జాగ్రత్తతోను బోషింతురో, ఆలాగున ఆత్మజ్ఞానములో వికల్పము గలుగక సదా చూచుచుండవలయును. మఱియు నుత్కృష్ట వృక్షములకు లేతప్రాయమున నెట్లు పురుగులు పట్టుట గలదో, ఆదుష్టక్రిముల గనిపెట్టి తీసిలేయుటయుగలదో, ఆలాగున అభ్యాసకాలమున పతన హేతువులగు అనేక దృశ్యవృత్తులు గలుగవచ్చును. వాటిని మొదలంట నశింపజేయుచుండవలయును. దానికి నివాసనియమ మత్యవసరము. కావుననే విఘ్నములు గలుగని పుణ్యప్రదేశములో నుండి సాధనజేయవలయునని శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి.

ఇక నింతవరకుండిన బ్రహ్మనిష్ఠులు సోమరులై యుండిరా? లేక సోహంపరులై యుండిరా? అనువిషయమును గుఱించి యోచింతము. అయితే యిప్పుడుండు కొందరు మఠాధిపతులయొక్కయు, పీఠాధిపతుల యొక్కయు, వంశపరంపరా గురువులయొక్కయు, గురుపరంపరలో గల వారియొక్కయు గురుకట్నముకొరకు దిరుగుచుండు గురువులయొక్కయు స్థితిగతులజూచి పూర్వీకులగు మూలపురుషులలోగల పవిత్రతను తెలియక దూషింపరాదు. అదే దీనిలోగల రహస్యము. ఇప్పుడుండు వారిలో కొందరు భోగపరులై నందుచే యోగమునకు దూరులైపోయిరే గాని బ్రహ్మ తత్త్వముయొక్క మహిమ యవర్ణనీయమైనదే. ఇప్పుడుండు కొందరి నడతను జూచియే, జనులకు సన్యాసులపైనతృప్తి గలుగుటకు కారణమైనది. అది నిజము. పూర్వాచార్యులు బ్రహ్మనిష్ఠను లోకములో బోధించుటకును, సాధకు లనుష్ఠానము చేయుటకును, ముముక్షువులు, బ్రహ్మవిద్య నభ్యసించుటకును మఠములు, క్షేత్రములు, ఆశ్రమములు ఏర్పరచియుండిరి. అదియెంతో పవిత్రభావముతో జేసిరేగాని యిప్పుడుండు వారిలో కొందరట్టి పవిత్రధనమును తమయొక్క భోగపరత్వమునకు దుర్వినియోగపరచుటచే జనులకు విశ్వాసము లేకపోయినది.

ప్రకాశమునకును, అంధకారమునకు నేలాగున సంబంధములేదో ఆలాగున భోగమునకును, యోగమునకును సంబంధముండదు. అవి దినరాత్రులవలెను, శుక్లకృష్ణపక్షములవలెను, ఉత్తరాయణ దక్షిణాయన

ములవలెను దూరదూరభేదము గలిగియుండును. దేవతలకును, రాక్షసుల కును ఎంత తారతమ్యముండునో భోగపరత్వమునకు, యోగ పరత్వమునకు నంత వ్యత్యాసము గలదు. గంభీరసింహము నివసించెడు గుహా ప్రాంతము లలో లేళ్ళు కుప్పిగెంతులు వైచి తిరుగుచుండునా? అలాగున నెవరి హృద యాంతరాళమునందు యోగధారణయను నిష్ఠ గలిగియుండునో వారి సమీపమున భోగచిహ్నము కొంచెమైన నుండదు. గరుడపక్షిగూడుగట్టి నివసించు చెట్టుకొమ్మలపై సర్పములు తిరుగుచుండునా? అలాగున తురీ యాత్మయందు పరమవిశ్రాంతిని బొందియుండు యోగి నివసించు స్థలములో నెచ్చోటనైన ఆశాపాశ దోషాదులకు స్థలమే యుండదు. వైరాగ్యనిధియగు బ్రహ్మనిష్ఠుడు, జ్ఞానభాస్కరు డెచ్చోట ప్రకాశించుచుండునో యాస్థలములో తమోగుణ స్వభావమగు చీకటి ప్రవేశించునా? గండుపిల్లి విహరించు ప్రదేశ ములో నెచ్చటనైన మూషికములు తిరుగాడుచుండునా? అలాగున మౌన జ్ఞాననిష్ఠ గలవారి సమీపములోను దృశ్యవృత్తుల గుణము లుండజాలవు. అమృతమునకును, విషమునకును నెంతభేదముగలదో, నిర్విషయమున కును సవిషయమునకును అంత తారతమ్యము గలదు.

మనము ప్రస్తుతము భోగపరులై యుండు కొందరి యోగుల మాటలను విడిచి యాత్మజ్ఞానమునకును, యోగనిష్ఠకును, తపస్సంపదకును, దైవ భక్తికిని ఆదికారణ పురుషులను గూర్చి మాత్రమే విచారింతము. వారు సోమరులై యుండరా లేక సోఽహంపరులై యుండిరా? అనునది గ్రహించ వలయును, పూర్వీకులగు జనులును, రాజులును అమాయకులై అట్టి కాలము లోనుండిన బ్రహ్మనిష్ఠులను, సాధువులను, బ్రాహ్మణులను ఆదరించిరని తలంచరాదు. ఇప్పుడుండు వారికంటె పూర్వీకులెక్కువ యోగ్యతయు, నిర్మలబుద్ధియు గల్గిన వారే. అట్టి కాలములో నుండే లాగున సాధువులును, బ్రాహ్మణులును ఇప్పుడుండిరేని, విషయభక్తిగలిగి యీ చెప్పేవారే వారికి నమస్కరించి వారికృపకు పాత్రు లయ్యే లాగున వర్తించ గలరు.

ఇప్పుడుండు వారికి తపశ్శక్తి, జ్ఞాననిష్ఠ తగ్గిపోయినందుచే వారిపై జనులకు విశ్వాసము తగ్గిపోయినదేగాని మరియొకటిగాదు ఒకవేళ భౌతిక కార్యములలో నిప్పుడుండునంత సౌకర్య మట్టికాలములో గలవారికి

లేకపోయినను ఆత్మవిషయముతోను, విద్యావిషయములోను, జ్ఞాన విషయములోను, ధర్మవిషయములోను, ఇప్పటివారికంటె వారెంతో యున్నతస్థితిలో నుండినవారలే ఏలన నిప్పుడు లోకములో నత్యద్భుత విషయములను, విచిత్రయంత్రములను, విజ్ఞానశాస్త్రము (సైన్సు) మొదలగు వానిని వృద్ధిపరచినవారు మన పూర్వీకులకంటె శ్రేష్ఠులమని తలంచు వారు గలరు. అయితే యానాటి భారతీయౌన్నత్యమును, విజ్ఞానమును, నాగరికతను, జూచిన (విచారించిన), వీరీకాలములో నెంత హీనస్థితిలో, మృగవృత్తిలో నున్నారో చరిత్రమే సాక్ష్య మిచ్చును. ఇది పక్షపాతముతో జెప్పిన వాక్యముగాదు: సర్వజనులకును విశదమైన విషయమే. ఆ విషయముల నన్నిటిని పేర్కొని ప్రస్తావించుట మనయొక్క ప్రస్తుతవిషయము గాదు. మారణయంత్రముల సహాయముచే దుర్బలు లగు జనులను,ధర్మముతో పరిపాలించెడి వారిదేశమును,ధ్వంస మొనర్చి యాక్రమించుకొనుట పౌరుషము గాని, బుద్ధివికాసస్వభావము గాని కాదు. మృగస్వభావము. బలమైనమృగము బలహీనజంతువును వధించి తినుట నాగరికత లక్షణమా? లేక పశుత్వమా? రక్షించుటయే నాగరకత లక్షణము అట్లుగానివారి పశుకృత్యము జూచి యది నాగరకత యని దలంచుట పొరబాటు.

అయితే విదేశీయులవలె భారతీయులేల విజ్ఞానశాస్త్రమును, యంత్ర నిర్మాణాదులను వృద్ధిపరచగూడదని యడిగిన - వీరికి సహాయము లేక పోయినది. స్వాతంత్ర్యలక్ష్మి యస్తమించినది. అస్వాతంత్ర్యమను చీకటి గ్రమ్మి దేశము నావరించినది· నిస్సహాయు లేమి చేయగలరు? జపాను మొదలగు దేశీయు లంత యున్నతస్థితికి రాగలిగినది స్వాతంత్ర్య లక్ష్మి యొక్క ప్రసన్నతచేతనేగాని మరియొక దానిచేగాదు. ఇదే దీనిలో గల రహస్యము.

అయితే భారతీయులు యధోగతికి కొన్నికారణములు వీరియందు లేకపోలేదు. దానిలో ముఖ్యకారణము జనులయొక్క గుణమున కాధిక్య మివ్వకపోవుటయే. ఈ పాపశాసనము, ఘోరతమ మూఢవిశ్వాసము జనుల నింత యజ్ఞానతమస్సులోనికి దీసికొనివచ్చినది కులములకును ఆశ్రమ, ములకు గుణములజూడక యాధిక్యమిచ్చినందున సోమరితనము పెరిగి

లోకమునకు భారిమై జనులు హీనస్థితికి వచ్చిరి. ఇందువలన శ్రేష్ఠకులములో బుట్టినవారు అంత మాత్రముచే శ్రేష్ఠులమని తలంచి శ్రేష్ఠగుణముల వృద్ధి నొందించక పోయిరి. శ్రేష్ఠకులముగాదని తలంచు వారిలో, శ్రేష్ఠగుణము గలిగినను శ్రేష్ఠత్వమున కర్హతలేదని జనులు తలంచుటచే శ్రేష్ఠగుణములు పెంపొందింపుటకు ప్రయత్నించకపోయిరి, ఇందువలన నుభయులును జీవచ్ఛవముల స్థితికి వచ్చిరి. ఇదే దీనిలోగల మర్మము అంతేగాని భారతీయులు బుద్ధిహీను లనిగాని, ప్రజ్ఞారహితు లనిగాని తలంపరాదు. వీరు ప్రజ్ఞారహితుల సంతతిలో జన్మించినవారు గారు ఈశ్వరసృష్టిలో శ్రేష్ఠ మానవజాతి యని ప్రసిద్ధికి వచ్చిన ఋషి వంశములో బుట్టినవారు. పరిశుద్ధ అని విఖ్యాతిగాంచి యార్యవంశ సంతతివారు. అట్టి పుణ్యవిశేషముచేతనే భారతీయు లిప్పటికిని సజీవులై యున్నారు. ఈ విషయ మాత్మస్తుతి యని తలంచి విడచి పెట్టడమయినది. ఏ కుటుంబములోనో, యెప్పుడో యొకడు గొప్ప విజ్ఞానవంతుడై యుండెనని తలంచి యట్టిస్థితినిబొంద ప్రయత్నము జేయక. యజ్ఞానస్థితిలోనుండి అట్టివాని సంతతిలో పుట్టినవార మని ప్రగల్భ వాక్యముల జెప్పిన నేమి ప్రయోజనము? సోమరులై అజ్ఞాననిద్రలోనుండు జనులను జాగ్రత స్థితిలోనికి దెచ్చినవారెవరైనను. ఏదేశవాసులైనను వారే గొప్పవారు.

కొందరు పాపులకు సహాయపడిన నరకమందురు. ఓహెూ! యెంత యంధవిశ్వాసము! తానాచరించలేని కార్యము నేల యితరులకు జెప్ప వలయును? అట్టివాక్యమునందేమైన సారముగలదా? అజ్ఞానముయొక్క మహిమ నేమని చెప్పవచ్చును? ఎందరో పుణ్యాత్ము లన్నసత్రములు. ధర్మపాఠశాలలు, ఉచితవైద్యాలయములు నిర్మించి జనులకు సేవజేయు చున్నారు. వీరు చెప్పు సిద్ధాంతప్రకార మా పుణ్యజీవు లందరును నరకమను భవించ వలసియుండునుగదా? అహా! వీరి మేధాశక్తి నేమని చెప్పవచ్చును. మొదట జనులయాత్మ సంస్కరణము గలిగిన మాత్రమే లోకసంస్కరణము గాని, లోకోన్నతిగాని గలుగ వలసియుండును.

కనుక యాత్మశుద్ధి గలుగుటకు నుత్కృష్టగ్రంథముల ముఖ్యముగా జదువవలయును అట్టి గ్రంథములలో శ్రీభగవద్గీత ముఖ్యమైనది. స్వధర్మ కార్యముల నిర్వహించుటకు భయ బిచ్చమెత్తి యెచ్చటనైనమండి

కాలమును గడుపదలంచిన యర్జునునియొక్క యాశయము సరిగాంచి శ్రీభగవాను లుపదేశించి సోమరితనమను పెనుభూతమును గీతయను మంత్రోపదేశముచే బారదోలి సోహం పరత్వమును బోధించిన దివ్య గ్రంథమిది. స్వకార్యమునందు సన్నదుసిగా జేసి కృతకృత్యమును బొందించెడు వేదాంతశాస్త్రమా, మానవుల సోమరులనుగాజేయుట? 'ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ నిబోధత' అని యుపదేశించెడు యుపనిషద్వాక్యమా, జనులసోమరులనుగా జేయునది? ఓజనులారా! అజ్ఞాన మోహమునుండి లెండు. తమోమయమగు సుషుప్తినుండి మేల్కొనుడు; ఆత్మజ్ఞానమును బొందిన శ్రేష్ఠ పురుషుల నాశ్రయించి తెలిసికొనదగిన విషయముల దెలిసికొనుడు; కృతార్థులు గండు; అని యుద్ఘోషించు కఠోపనిషద్వాక్యమును వినుడు. ముందుగా తరించుడు. తరువాత లోకమును తరింపజేయుటకు ప్రయత్నింపుడు. అపుడు. మీరు కృతార్థులుగా లరు. లోకముగూడ కృతార్థత నొందగలదు. ఈ విషయమై "శ్రీకృష్ణభగవాను లర్జునునకుపదేశించిన యమృతవాక్యమును వినుడు

విపత్తులలోనుండి, ధర్మసంకటములోనుండి, దుఃఖములోనుండి ఏమిచేయవలయునో తెలియని సందిగ్ధస్థితినుండి యర్జునుని ఏది రక్షించెనో యది యీ వేదాంతవాక్యమే గదా!

దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితమ్।
సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ॥
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే।
గాండీవం స్రంసతే హస్తా త్త్వక్చైవ పరిదహ్యతే।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥
(అ. 1. శ్లో॥ 28, 29, 30)

ఓ కృష్ణా! యుద్ధముచేయ నిచ్ఛతో వచ్చియున్న యీ బంధువులను జూచి నా యవయవములు నిస్సత్తువ లగుచున్నవి. నోరెండుచున్నది, నా శరీరమున వణకు, గగుర్పాటును గలుగుచున్నవి. గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. శరీరము మండుచున్నది. రథమునందుండజాలకున్నాను. మనస్సు భ్రమబొందుచున్నట్లున్నది.

ఇట్టి స్థితిలోనుండు అర్జునుని ఉద్ధరించిన తేజోవంతమగు సజీవమగు వేదాంత వాక్యమును వినుడు. క్షీరసాగరమథనమున సముద్రములో మునిగిన మందరపర్వతమును కూర్మావతారమెత్తి భగవంతు డుద్ధరించినట్లు లోకము ధర్మపథమునుండి జారి దృశ్యసౌఖ్యమే శాశ్వతమను బుద్ధిగలిగి యజ్ఞానమగు తమస్సులో మునుగునప్పుడు మహాత్మ్ము లవతరించి లోకోద్ధారణమును జేయుచుందురు. శ్రీబుద్ధ, శ్రీ శంకర, శ్రీ క్రీస్తు, శ్రీమొహమ్మదు మొదలగువారు భూలోకములో నవతరించినపుడు అట్టి కాలమున లోకమెంత యజ్ఞానాంధకారమయమైయుండెనో, జీవకోట్లు ఈశ్వరదృష్టినుండి యెంత దూరముగా జారిపోయినవో, చరిత్రముల జదివినవారందరికి విదితము. ఈ గీతశాస్త్ర మర్జునున కొకని కుపదేశించినదని తలంపరాదు జీవకోట్లన్నిటికి భగవంతు డనుగ్రహించిన యమృతసారమని గ్రహించవలయును. పైజెప్పిన స్థితిలో శవప్రాయుడై పడియుండు అర్జునుని యే దివ్యామృతము సజీవునిగా జేసెనో, ధీరునిగా జేసెనో, అమిత పరాక్రమవంతునిగా జేసెనో వేదాంతమా మనుజుల సోమరులనుగా జేయునది.

ఏవముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః॥

(అ. 1. శ్లో॥ 47)

అర్జును డిట్లు శ్రీకృష్ణమూర్తితో జెప్పి, దుఃఖముచేత మనస్సు చలించగా ధనుర్బాణములను విడిచి పెట్టి యుద్ధభూమిలో దిగులు నొంది రథముమీద చతికిలబడెను.

పెనుభూత మావేశించి మూర్ఛజెందియుండువానికి గొప్ప మంత్రవేత్త భూతమును దొలగించి స్వబోధమును గలుగజేసినట్లు, కర్తవ్యాకర్తవ్యముల దెలిసికొనుటకు జ్ఞాపకశక్తియైనలేనివాడై పడియుండు అర్జునుని శ్రీ భగవానుడు ఏ దివ్యమంత్రోపదేశముచే మోహమను దయ్యమును తొలగించి దివ్యతేజస్సంపన్నునిగా జేసెనో యట్టి వేదాంత వాక్యమును వినుడు.

తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదన్తమిదం వాక్య మువాచ మధుసూదనః ॥

కనికరముతో కూడుకొనినవాడును, కన్నీళ్ళతో నిండినవై వ్యాకులము లైన నేత్రములు గలవాడును, దుఃఖపడుచున్న ఎను నగు జ ని గూర్చి శ్రీకృష్ణమూర్తి ముందు చెప్పబోవు వాక్యమును బలికెను.

కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్।
అనార్యజుష్టమస్వర్గ్య మకీర్తికరమర్జున! ॥

ఓ అర్జునుడా! అజ్ఞానులచే నవలంబింపబడదగినదియును, పరలోక సుఖము నడ్డుపఱచునట్టిదియును, అపకీర్తిని గలుగ జేయునట్టిదియును. హీనమునగు నీ దుఃఖము ఒడుదుడుకు సమయమున నీకెట్లు గలిగినది?

క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!॥

ఓ అర్జునుడా! నపుంసకత్వమును బొందకుము. నీకి మనో వ్యాకులత తగదు శత్రువులను దపింపజేయువాడా! నీచమైన పిఱికి తనమును వదలి స్వకార్యనిర్వహణమునకు లెమ్ము. స్వధర్మనిర్వహణ స్వభావములేనివాడు స్త్రీయును, పురుషుడును గాని హీనుడని యర్థము.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
నచైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః॥

ఓ అర్జునా! అయుదము లీయాత్మను భేదింప జాలవు. అగ్ని యీ యాత్మను దహింపజాలదు. ఉదకము లీయాత్మను తడుపజాలవు వాయువునీ యాత్మను శుష్కింపజేయజాలదు

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః॥

ఓఅర్జునా! ఈయాత్మ ఛేదింపబడదగినవాడు కాడు. ఈ యాత దహింపబడదగినవాడు గాడు తడపబడదగినవాడుగాడు. ఎండింపబడదగిన వాడునుగాడు. ఈతడు నిత్యుడు, సర్వవ్యాపకుడు, చలనము లేనివాడు, చలింపనివాడును, సదా యొకేరీతిగా నుండు వాడును అగుచున్నాడు.

పైజెప్పిన శ్లోకముయొక్క యర్థము దృఢపడుటకొఱకు మఱల దానిని గురించియే చెప్పుటకు కారణమైనది. అనగా శ్రవణ మొక దానిచే దృఢముగా గలుగదని దలంచి మనన నిదిధ్యాసములు చేయదగినవి; ఇదే వేదాంతబోధచే గలిగిన ప్రయోజనము అర్జునుడు ఈదేహమే తానను బుద్ధి గలిగియుండెను. లేక దేహములోనుండు జీవుడనను భావము గలిగి యుండెను అంతేగాక జననమరణ ధర్మములు గలిగిన వాడనని తలంచి యుండెను అప్పుడు భగవంతుడు నీవు దేహముగాదనియు, దేహివనియు వ్యాపకుడవనియు, నిత్యుడవనియు, త్రికాలా బాధ్యుడవనియు బోధను గలుగజేసెను. ఆహా! చచ్చిన వానిని బ్రతికించిన నెట్లుండును. రాజపదవి నుండి చ్యుతుడై భిక్షమెత్తి జీవించు వానిని మరలరాజునుగా జేసిన నెట్లుం డునో, గ్రహావిష్టుడైన విప్రోత్తముడు స్వబోధను మఱచి హీనవృత్తిలోనుండగా వానియొక్క గ్రహమును దొలగించి బ్రాహ్మణత్వబోధను గలుగజేసిన నెట్లుండునో, అలాగున వేదాంతము అజ్ఞానములోనుండు జీవునికి ప్రబోధ ము గలుగజేసి జ్ఞానవంతునిగా జేయును. ఇదే వేదాంతము మనకు గలుగజేయు మహోపకారము.

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ (అ. 18 శ్లో. 63.)

ఓఅర్జునా! ఈవిధముగా రహస్యమునకంటె నతి రహస్యమైన నీయాత్మతత్త్వోపదేశమును నీకొఱకుపదేశించడమైనది. దీనిని సంపూర్ణ ముగా సావధానచిత్తము గలవాడవై విచారణజేసి యెట్లు చేయదలంచు చున్నావో అట్లు చేయుము. భగవంతుడుగూడ కర్తృత్వమును దనపైనుంచు కొనక జ్ఞానము (ధర్మము) నుపదేశించెను. కర్తృత్వమునుంచిన, అది సంపూర్ణ నిష్కామయోగము గాజాలదు అట్టి తత్త్వమిచట తెలుపడమైనది.

కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ!॥

ఓయర్జునా! ఇతివఱకు నాచే తెలుపబడిన యాత్మ తత్త్వోపదేశమును నీవు నిశ్చలమనస్సుతో వింటివా? ఓయర్జునా! నీకు అవివేకమువలనచే గల్గిన

మోహము పోయినదికదా? ఈశ్లోకములో శిష్య వాత్సల్యమును సూచించెడు వాక్యము గలదు. కారుణ్యాతిశయముచే శిష్యుడు కృతార్థుడుగావలయు ననెడి బుద్ధి మహాత్ములకు గలిగియుండును.

నష్టో మోహస్స్మృతిర్లబ్ధాత్వత్ప్రసాదాన్మయాఽచ్యుత!
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ॥

ఓ కృష్ణస్వామీ! నీ యనుగ్రహము వలననే ఆత్మ సాక్షాత్కార స్థితిని బొందితిని. అజ్ఞానము నష్టమైపోయినది. నాకిపు డేలాటి సందేహమును లేదు. ఇక నీయాజ్ఞానుసారముగ వర్తించెదను. ఇదే శ్రీభగవద్గీతయొక్క సారము. గీత యుపదేశించిన తత్త్వమిదియే. శిష్యుడు కృతార్థుడయ్యెనా లేదా యని గురువు పరిశోధించవలసిన ధర్మము. మఱియు నీదేహముతో నున్నపుడే జీవన్ముక్తిపదవిని బొంది కృతార్థుడనైతిని. అజ్ఞానమునుండి నివృత్తిగలిగినది. నిత్యానందమగు పదవి లభించినది. అని శిష్యునికి గలుగవలసిన ధర్మము ఈశ్లోకములో నిమిడియున్నది. విషపానముచే మూర్ఛనొంది యుండు మనుజుని అమృతపానము చేయించి మృత్యు రహితునిగా జేయునట్లు వేదాంతము ప్రపంచమున కుపకారము చేయుచున్నదిగాని సోమరిని చేయదు.

ఇక మనము శ్రీరామచంద్రుని గుఱించి తెలిసికొనవలసియున్నది. ఈమహానుభావుడు లోకసంగ్రహార్థముగా జేసిన లీలనుగుఱించి యీ క్రింది గ్రంథము మనకు దెలుపుచున్నది. సంసారములోనుండు వారేలాగున వర్తించవలయునో, ఎట్లుండిన బంధము గలుగదో, జీవన్ముక్తి గలుగునో యీలాటివిషయములన్నియు నీగ్రంథములో వివరింపబడెను. ఇది ముఖ్యముగా రాజ్యపరిపాలనము జేయురాజులును, శ్రీమంతులును ఉద్యోగస్థులును, చూడదగిన గ్రంథరాజము. వారు వీరని మాత్రమేల చెప్పవలయును. ప్రతిముముక్షువును దీనిలో జెప్పేలాగున యాచరించవలసియుండును. మనోలయము, వాసనాక్షయము గలిగినమాత్రమే జ్ఞానము గలుగునని యీగ్రంథము నొక్కి వక్కాణించుచుండును. దీనికే శ్రీయోగవాసిష్ఠమనియు, వాసిష్ఠరామాయణమనియు పేర్లు గలవు. దీని నారు ప్రకరణములతోను, ముప్పదిరెండువేల శ్లోకములతోను, శ్రీవాల్మీకిమహర్షి బ్రహ్మ

దేవుడు యాజ్ఞానుసారము కూర్చెను. దీనియందు జనకుడు మొదలగు అనేక రాజర్షులయొక్కయు, శుకుడు మొదలగు పెక్కండ్రు బ్రహ్మర్షుల యొక్కయు, నారదుడు మొదలగు అనేక దేవర్షులయొక్కయు జ్ఞానప్రదము లగు కథలు గలవు. అంతేగాక చూడాల మొదలగు అనేక నారీమణులు జీవన్ముక్తి పొందిన దివ్యగాథలు గలవు. మనుష్యచరిత్రలేగాక. నందికేశ్వరుడు మృగ దేహమును ధరించిన బ్రహ్మనిష్ఠాగరిష్ఠులైన వారియొక్క చరిత్రలును, పక్షివర్గములో జేరిన కాకభుశుండుడు మొదలగువారియొక్క వృత్తాంతములును నిందులో జేరియున్నవి దీనియొక్క ముఖ్యసారమేమన, ముక్తియను శాశ్వతపదవిని సర్వజనులును, సమస్త స్త్రీలును పురుష లందరును బొందుటలో నేలాటి యాటంకములేదనియు, శమదమాది గుణములు గలిగి, బ్రహ్మవిచారముగాని, యోగనిష్ఠగాని పరమైకాంతభక్తి గాని, నిష్కామకర్మయోగముగాని యుండిన చాలుననియు నిర్ధారణ జేయ బడినది. శ్రీరాముని వైరాగ్యమిట్లుండెను.

కుమారస్య విశాలాక్షం పాండుతాం ముఖమాదదే।
పాకపుల్లదళం శుక్లం సాలిమాలమివాంబుజమ్॥

శ్రీరాముని విశాలలోచనముఖమండలము పాలిపోయి, భ్రమరచుంబితమును, వికసితమును నగు తెల్లతామరపూవువలె నాయెను వైరాగ్యము గలుగునప్పుడు ఇట్టిస్థితియందరికిని గలుగును. రజోగుణ తమోగుణ శరీరాణువులును, అంతఃకరణ భావములును, దేహమునుండి మనస్సునుండి పోవునపుడిట్టి చిహ్నము గలుగును.

కృశాంగశ్చింతయా యుక్తః ఖేదీ పరమదుర్మనాః।
నోవాచ కస్యచిత్ కించిల్లిపికర్మార్పితోపమః॥

చింతవల్ల చిక్కి శ్రీరాముడు విమనస్కుడై, భిత్తియందు వ్రాసిన చిత్తరువువలెనుండి యెవరితోడను, ఏమియు మాటాడకుండెడివాడు.

కా తే పుత్ర ఘనా చింతేత్యేవం రామం పునఃపునః।
అపృచ్ఛత్ స్నిగ్ధయా వాచా నైవాకథయదస్యః॥

పుత్రా! నీకున్నచింతఏమి? అని దశరథుడు అనేక పర్యాయములు స్నేహపూర్ణవాక్యములచే బ్రశ్నించినను, రామచంద్రుడేమియును బల్కలేదు.

తతో దశరథో రాజా రామః కింఖేదవానితి।
పృచ్ఛత్ సర్వకార్యజ్ఞం వసిష్ఠం వదాతాం వరమ్॥

రాముడు విచారపూరితమనస్కుడై నాడేల? అని అనంతరము దశరథుడు సర్వకార్యజ్ఞుడును. వాగ్మియును నగు వసిష్ఠుని ప్రశ్నించెను.

ఇత్యుక్తశ్చింతయిత్వా స వసిష్ఠమునినా నృపః।
అస్త్యత్రకారణం శ్రీమన్ మారాజన్ దుఃఖమస్తు తే॥

దీనికింతగుకారణమున్నది. దుఃఖింపకుము అని దశరథునితో వసిష్ఠుడు ధ్యానమొనరించి పల్కెను.

ఇక రాముని భృత్యులు రాముని గూర్చి తెల్పిన మాటలు వినుడు.

దేహయష్టిమిమాం దేవ ధారయస్త ఇమే వయమ్।
ఖిన్నాం ఖేదే పరిమ్లానతనౌ రామే సుతే తవ॥

రాముడు దుఃఖవశమున కృశ శరీరుడై నాడు. మేమును కృశించి యెట్లో యీశరీరమును దాల్చియున్నాము.

వస్త్రపానాశనాదానపరాఙ్ముఖతయా తయా।
పరివ్రాడ్ధర్మిణం భూవ సోఽనుయాతి తపస్వినమ్॥

రాముడిప్పుడు అన్నపానాదులయెడంగల విరక్తింజేసి పరివ్రాజకుడగు యతిని బోలుచున్నాడు.

ఏక ఏవ వసన్ దేశే జనశూన్యే జనేశ్వర
న హసత్యేకయా బుద్ధ్యా న గాయతి న రోదతి॥

అతడేకాగ్రచిత్తుడై, ఏకాంత ప్రదేశములగూర్చొని యుండును. హాసగాన రోదనాదుల నొనర్పడు.

బద్ధపద్మాసనః శూన్యమనా వామకరస్థలే।
కపోలతలమాధాయ కేవలం పరితిష్ఠతి॥

శూన్యమనస్కుడై చెక్కిలిపై చేతినుంచి పద్మాసనము నూరక కూర్చొనియుండును.

ప్రత్యహం కృశతామేతి ప్రత్యహం యాతి పాండుతామ్ ।
విరాగం ప్రత్యహంయాతి శరదంత ఇవ ద్రుమః॥

రోజురోజున కాతడు కృశించుచున్నాడు. రోజురోజున కతడు పాలిపోవుచున్నాడు, వైరాగ్య మంతకంత కెక్కుడగుచున్నది అతనిస్థితి శిశిర ఋతువునందలి వృక్షమువలె నున్నది

అనుయాతౌ తథైవైతౌ రాజఞ్ శత్రుఘ్నలక్ష్మణౌ ।
తాదృశావేవ తస్యైవ ప్రతిబింబావివ స్థితౌ ॥

అతని అనుచరులగు లక్ష్మణ శత్రుఘ్నులస్థితియు నిట్లే యున్నది. వారాతని ప్రతిబింబమట్లున్నారు.

అపాతమాత్రహృద్యేషు మా భోగేషు మనః కృథాః।
ఇతి పార్శ్వగతం భవ్యమనుశాస్తి సుహృజ్జనమ్॥

విషయేంద్రియసంయోగమువలన కలుగునవియు, దుఃఖాంతములు, క్షణికములునునగు భోగములయందు మనస్సుంచకుము అని ప్రక్కనుండు మిత్రున కుపదేశించును

నీతమాయురనాయాస పదప్రాప్తి వివర్జితైః ।
చేష్టితైరితి కాకల్యా భూయోభూయః ప్రగాయతి ॥

మోక్షపదమున కుపయోగింపని ప్రయత్నములలో నాయువు వ్యయింపబడుచున్నది. అని మధురమును స్ఫుటమునునగునట్లు మాటిమాటికి బాడుచుండును.

ఇతి లోకే సమాయాతాం శాఖాప్రసరశాలినీమ్।
ఆపత్తామలముద్ధర్తుం సముదేతు దయాపరః॥

మీ పుత్రుని కిట్టినిపత్తు ఘటిల్లినది, అది శాఖాప్రశాలతో బెరుగ నున్నది, దీనినిదూర మొనర్ప ప్రయత్నింపుడు, అనియున్నది అట్టి వైరాగ్య నిధులగువారే బ్రహ్మసాక్షాత్కారమును సులభముగ బడయ గలరు.

# మనస్తత్త్వము

ప్రతి మానవుడు తెలిసికొనవలసిన తత్త్వము లన్నింటిలోను మనస్తత్త్వమే అతిప్రయోజనమైనది. ఏలన, అన్నింటిని మనస్సే తెలిసికొను చుండగా నిక ఆ మనస్సుయొక్క స్వరూపమును దేనివలన తెలిసికొన గలము? మనస్సును ప్రకాశముచేయు బుద్ధిగాని లేక ఆత్మగాని మఱి యొకటి గలదను భావ మీవిషయములో ఉపయోగపడునది కాదు, ఎందు కనగా, మనస్సును దాటిపోయినవారికి మాత్రమే అది ఉపయోగకరమగును. ఇదే వేదాంతశాస్త్రములోగల రహస్యము. ఇది యెట్లుండుననిన ఒక రాజకీయ సభలో రెండుపార్టీలవారు గలరు. కాని ఒక పార్టీకి సంబంధించినవారే మంత్రులుగాను, అధ్యక్షులుగాను, సభ్యులుగాను నున్నారు. అట్లుండగా, వారికి భిన్నమగు పార్టీవారి యభిప్రాయమును వారు ఋజువుచేయుదురా? లేదుకదా! అలాగున సమస్త కార్యములను మనస్సే చేయుచుండగా తనకు విరుద్ధమైన కార్యమేదైనను ఆ మనస్సు చేయగలదా? కనుకనే బ్రహ్మవిద్య యందు ఇంత నిగూఢ తత్త్వము గలిగియున్నది.

ఈ విద్య మనోలోకమున కావల వెలుగుచున్నది. మనస్సును దాటి పోవక అచ్చోటికి వేఱుమార్గము లేదు. మనస్సును దాటిపోవలసియుండిన మనోరాహిత్యము కలుగవలయును, అనగా మనోజయము గలుగవలసి యుండును. మనోజయము గలుగవలసియుండిన, ఇంతవఱకు జన్మజన్మాంతర ములనుండి యంతఃకరణములో నిలిచియుండు దృశ్య సంస్కారములన్నియు అయ మొందవలెను. అట్టి సంస్కారములకే కర్మయనియు, వాసన యనియు, మాయ యనియు, అవిద్య యనియు అజ్ఞాన మనియు, గుణముల సముదాయ మనియు పేర్లు. ఇంతేగాక ఇంకను ఎన్ని పేర్లు కర్మను గుఱించియు, బంధమును గుఱించియు గలవో, అవన్నియు, ఈ మనస్సునకు సంబంధించినవని గ్రహించుకొనవలెను. ఈ మనస్సును జయించనిదో బ్రహ్మవిద్య యందు ప్రవేశించుట యెట్టివారికిని సాధన పనిగాదు. ఈ మనస్సుయొక్క అటంకము చాల గొప్పది. ఇది మాత్రమే ఆత్మవిద్య గోచరించును. ప్రపంచములోగల తక్కిన సమస్త విద్యలున్ను తెలిసికొనుటకుగాని. వాని యందు విజయము గాంచుటకు గాని యీ మనోజయము, అనగా మనశ్శుద్ధి

కావలయునను నిర్బంధము లేదు. ఉండిన మంచిదే. కాని ఉండితీర వలయునను నిర్బంధము లేదు. ఈబ్రహ్మవిద్యయందు నిశ్చయముగ మనో నైర్మల్యము గాంచలయునను నిర్బంధ నియమము గలదు. ఇట్టిదానిలో నిది అలంఘనీయ శాసనము. కనుకనే దీనియందు జనులకు ప్రవేశము గలుగ కుండుటకున్ను, ఒకవేళ కొందఱకు సుకృతవశమున ప్రవేశము గలిగినను, విజయము సంప్రాప్తింపక జారిపోవుటకును కారణమగుచున్నది.

ప్రపంచములో గల విద్యలలో ముఖ్యములగు నాల్గు వేదములున్ను, వేదాంగములున్ను చదువుటకును, చదివించుటకున్ను, చిత్తైకాగ్రతాపరమగు ఉపరతి గలుగవలయునను నిబంధన లేదుకదా! ఏలన, వేదములు నాల్గున్ను చదివినవారును. చదివించెడి వారును, అలాగున వేదాంగములను గ్రహించినవారును, గ్రహింపజేయువారును. అనేకులు గలరుకదా! కాని నిర్విషయస్థితిగాని బంధ విముక్తిగాని. మనోరాహిత్యము గాని యెందఱు కలిగియుందురు? వేదాంగములగు వ్యాకరణశాస్త్రముగాని, జ్యోతి శాస్త్రముగాని, వైద్యశాస్త్రముగాని, విజ్ఞానశాస్త్రము (సైన్సుగాని) శిల్పశాస్త్రముగాని (యింజనీరింగ్)గాని, వెయ్యేల, ప్రపంచమున నేన్ని శాస్త్రములు గలవో, వాటి యన్నిటిలో ప్రవేశము గలవా రనేకు లున్నారు. వారుగూడ మనశ్శాంతి గలుగక, ప్రసన్నత నొందక, అజ్ఞానమ తొలగక, శ్రమపడుచుండుట మనము గాంచుచున్నాము. ఇక యజ్ఞాది కర్మ శాస్త్రపారీణు లనేకులు కలరు. వీరిలో, ఆత్మశుద్ధిగలిగి, ఉపశమమును హొందినవారెందఱు కలరు? ఇదేరీతిగ భూగర్భశాస్త్రము, నక్షత్రశాస్త్రము మొదలైనవి తెలిసినవారికిగూడ ఆత్మశుద్ధి గల్గియుండవలెనను నియమము లేదు. ఆత్మవిద్యలో ఇట్టి ప్రయాసముండుటచేతనే ఆత్మవిద్య సామాన్యజనులకు అలవాటులో లేకపోవుటకు కారణమైనది, అందుచేతనే జీవకోట్లు తమస్సులో పడియుండవలసి వచ్చినవి ఈవిషమై సీతారామాంజనేయము చూడుడు—

వేదశాస్త్రంబులు వివరించి బుధులచేఁ
జదివింపవచ్చుఁదాఁ జదువవచ్చు
యజ్ఞదానతపంబు లధికారిజనముచే
జేయింప వచ్చుదా జేయవచ్చు

నిలలోన గల తీర్థముల కేగ నన్యుల
బోధింప వచ్చుదా బోవవచ్చు
నష్టాంగయోగవిద్యల నార్యులకు నుప
దేశింపవచ్చు సాధింపవచ్చు
గాని యెవ్వారికైన విజ్ఞాన యోగ
గతిని దేహేంద్రియము లరికట్టి మనము
నాగి యంతర్ముఖముజేసి యనవరతము
నిశ్చలసమాధినిష్ఠచే నిలువరాదు.

తక్కిన విద్యలయొక్కయు, అవిద్యల ఫలములయొక్కయు అంతర్ముఖము నుండియీబ్రహ్మవిద్య ప్రారంభమగుచున్నది.వేదాంతమనగా వేదములయొక్క అంతిమ భాగము. దీనికి ఉపనిషద్విద్యయని పేరు. అందు ప్రవేశించుటకు ముందుగనే అంతఃకరణశుద్ధి గలుగవలెననియది కఠినముగ శాసించును. ఈ ఆజ్ఞోల్లంఘనము ఎవరిచేతను చేయ సాధ్యము గాదు. చేసినచో పునర్విచారణ లేకనే అతనినది దానినుండితొలగించును. దీనికే పతనమని పేరు. మరల దానిలో చేరవలసియుండినపుణ్యసంస్కారము కావలసియుండును. అట్లైన దాని యందు మరల ప్రవేశము కలుగచేసికొనవచ్చును. అంతఃకరణశుద్ధి కలుగవలసియుండిన శమాదిషట్కసంపత్తి యవవరము, అనగా శమము, దమము,ఉపరతి, తితీక్ష, సమాధానము, శ్రద్ధ-ఇవన్నియుచేరిన శమాదిషట్క సంపత్తి గలిగెనని నిశ్చయించుకొనవచ్చును.

దీనిలోగల మరియొక అంగమును సాధనచతుష్టయ సంపత్తియని చెప్పుదురు. నిత్యానిత్య వస్తువివేకము' ఇహాముత్రఫలభోగవిరాగము శమాదిషట్కము, ముముక్షుత్వము ఈనాల్గునుజేరి సాధనచ తుష్టయ సంపత్తి యనబడును.

ఇందు ముముక్షుత్వము మందమనియు, తీవ్రమనియు రెండు విధములు. ఇవన్నియు ఏకకాలములో చేరునపుడే నిజమైన యంతఃకరణశుద్ధి కలుగును, అనగా మనశ్శుద్ధి సిద్ధించును. అధికపుణ్య ఫలముయొక్క ఆవిర్భావము కలుగునపుడే మానవుడు ద్వైతత్వము లోనికి ప్రవేశించిన

వాడును, మోక్షద్వారముయొక్క తలుపు దగ్గరకు వెళ్ళినవాడు నగును. ఈఘట్టముననే శ్రీకృష్ణభగవానులు గీతయందిట్లుపదేశించిరి.

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥

ఎపుడు అనుష్ఠానముచే పరిపక్వావస్థ కలుగునపుడు నీ యొక్క బుద్ధి దేహమే యాత్మయనెడి అజ్ఞానరూపదోషమును, లేక అవిద్యను దాటునో, అప్పుడు ఇకపై వినదగిన వేదాంతార్థము యొక్కయు, ఇంత వరకు శాస్త్రములద్వారా వినబడిన వేదాంతార్థము యొక్కయు యథార్థ జ్ఞానము, అనగా వేదముయొక్క నిజమగు అర్థమును తెలిపెడి నిర్వచనమును పొందగలవు.

ఈలాగున స్కందోపనిషత్తునందుగూడ ఉపదేశింపబడినది. ఎట్లన,

న నిజం నిజవద్భాత్యంతఃకరణజృంభణాత్ ।
అంతఃకరణనాశేన సంవిన్మాత్రస్థితో హరిః ॥

అనగా, అంతఃకరణము దృశ్యవిషయములతో కూడి బహిర్ముఖమైనపుడు నిజమైన ఆత్మస్వరూపము అనుభవమునకు రాకయుండును. అంతఃకరణము శుద్ధమగునపుడు సత్యస్వరూపుడగు పరమేశ్వరుడు తన యాత్మగా వెలుగుచున్నట్లు గోచరమగును.

అంతేకాదు, ఇంద్రియములలో వాసన (దృశ్యవృత్తి) గలవారికి ఈశ్వరుని పరమార్థముగ నెఱుంగుటకుకూడ యవకాశము గలుగదు. మైత్రేయ్యుపనిషత్తున్ను ఈవిధముననే చెప్పుచున్నది.

శబ్దస్పర్శమయా యేఽర్థా అనర్థా ఇవ తే స్థితాః।
యేషు సక్తస్తు భూతాత్మా న స్మరేచ్చ పరం పదమ్॥

శబ్దస్పర్శరూపరసగంధాదులు అజ్ఞానదశలో సౌఖ్యములుగ నగుపడినను, యథార్థస్థితిని తెలిసికొనుటలోనవి యాటంకమును కలుగజేయును. కావున, నవి యనర్థములనియే గ్రహింపవలెను. ఏలన నవి దృశ్యసుఖములు శాశ్వతములనియు, వాని ననుభవింభవింపుట జీవుని స్వభావమనియు తలంచునట్టి

బుద్ధిని గలుగజేయును. అందువలన పరమ పద ప్రాప్తికి హేతువగు పరమేశ్వరుని (బ్రహ్మమును) నిశ్చయముగ స్మరించుట కవకాశము కలుగదు. కావున మనుజు డేమి చేయవలసి యుండునో, ఆవిధిని శ్రుతియిట్లు తెలుపు చున్నది.

తపసా ప్రాప్యతే సత్వం సత్త్వాత్సంప్రాప్యతే మనః।
మనసా ప్రాప్యతే హ్యాత్మా హ్యాత్మా పత్నా నివర్తతే॥
(మైత్రేయ్యుపనిషత్)

అనగా, తపస్సువలన అంతఃకరణము శుద్ధమగును. మనస్సు శుద్ధ మగునపుడు ఆత్మకది స్వాధీనముగానుండును. అట్టిశుద్ధమైన ఆత్మలో పరమాత్మ స్వరూపజ్ఞానము స్ఫురించును. అట్టి స్వస్వరూప సాక్షాత్కార జ్ఞానము కలుగునపుడు సంసారదుఃఖము లన్నియు నశించును. గంధక సౌవీర పాషాణాది ధాతువులను స్ఫుటముచేయుట వలన అందలి విష దోషములు నశింప, ఏలాగున నవి సిద్ధౌషధములగునో, ఆలాగున తప స్సువలన విషయాది దోషములన్నియు నశించి ఆత్మ శుద్ధమగును. నిరం తర మీశ్వరచింతనయు, ఆత్మోపలబ్ధిపరమగు యోగనిష్ఠయు, శమద మాదిగుణములతో కూడిన బ్రహ్మవిచారమును తపశ్శబ్దమునకు పర్యాయ వాచకములు. తపశ్శబ్దముయొక్క అర్థము, అంతఃకరణములోగల సమస్త దోషములను జ్ఞానాగ్నివలన దహింపచేయుటయే యగును. ఇటి యే ప్రకారము కలిగినను దానిని తపస్సనియే చెప్పవచ్చును.

మనస్సును పరిశోధించి చూచిన నది త్రిగుణములతో చేరినదే యని తెలియగలదు ఈగుణత్రయములో ఎవరి కేగుణము గలిగియుండునో వారు తాముచేయు కార్యము లన్నియు నీతియుక్తము లనియు అనుష్ఠేయము లనియు, ధర్మవంతము లనియు తలంచునట్లు చేయు ఒక మహిమ యద్దాని యం దిమిడియున్నది. కనుగొనుటకు గుణత్రయాతీతునకు మాత్రమే సాధ్యమగును. కనుకనే జీవకోట్లన్నియు వారివారి సంస్కారము (మనస్సు) ననుసరించి ప్రవర్తింపగలరని శాస్త్రము చెప్పెడు రహస్యము. ప్రాణికోట్లు కర్మపాశములచే బంధింపబడినవారలని చెప్పుటకు కారణమిదియే. అనేక రంగులుగల యద్దము లమర్చబడియుండు మేడలో మీరు కూర్చుండినచో

ఆయద్దములయొక్క రంగు నీలముగాని, పీతముగాని, రక్తముగాని అయి యుండిన, వాని ద్వారా వచ్చెడు సూర్యరశ్మిచే నాగృహమంతయును, దానిలోనుండు సామాను లన్నియును,అదర్పణవర్ణము ననుసరించి ప్రకాశించు చున్నట్లు గాంచగలరు· అప్పుడది సత్యముగానే గోచరించును. ఇంటిలోనుండి బైటకువచ్చి చూచిన మాత్రమే సూర్యుడు కేవలము ప్రకాశస్వరూపుడై యుండెననియు, గృహాంతర్భాగమున గన్పించెడి వర్ణములన్నియు దర్పణ ముల భేదములచేగల్గిన వనియు తెలిసికొనగలరు. అలాగున జీవకోట్లు త్రిగుణములతో కూడిన కర్మపంజరములోపల నుండువరకు సత్యస్వరూపు డగు ఈశ్వరుని (ఆత్మను) యథార్థముగ తెలిసికొనజాలరు, ఇదే దీనిలో గల రహస్యము. కనుకనే బ్రహ్మవిద్యను ఆత్మజ్ఞానము పొందిన యాచార్యుని వలన గ్రహింపవలెనని చెప్పెడు రహస్యము. లేనిచో వారివారి మనస్సు ననుసరించి వారువారు చేయునవన్నియు సరిగానుండునని తోచెడు ప్రమాద ములో పడిపోవుదురు. ఆత్మజ్ఞుడైన గురువైనచో ఇతరులలోగల గుణములను కనుగొన శక్తిగలిగియుండును. అప్పుడు వారిని దిద్దుటకా మహాత్మున కధికారత గలిగియుండును. కనుకనే గీతయందిట్లు చెప్పబడినది.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।
శ్రద్ధామయోఽయం పురుషో యో, యచ్ఛ్రద్ధస్స ఏవ సః॥

అనగా ఓఅర్జునుడా! సమస్త ప్రాణులకు వారివారి పూర్వ జన్మ సంస్కారముతో గూడిన యంతఃకరణము ననుసరించిన స్వభావము గలుగు చున్నది. ఈజీవుడు శ్రద్ధయే (స్వభావమే) స్వరూపముగాగల వాడు; ఏవ్వడెట్టి శ్రద్ధ (స్వభావము) కలవాడో వాడట్టి శ్రద్ధకు తగినవాడే యగుచున్నాడని యర్థము.

మీరెవరైనను ఎఱుపు, పసుపు, నీలవర్ణములుగల సులోచనములు పెట్టి చూచినయెడల, జగత్తంతయు మీరు ధరించియుండు దర్పణవర్ణము గానే కన్పించును! శుద్ధమైన అద్దముద్వారా చూచువారికి మాత్రమే అన్ని వర్ణములున్నూ; వేఱు వేఱుగ కనుగొనుటకు శక్తిగల్గియుండును. ప్రకృతి యొక్క రహస్యమున్నూ ఈలాగుననే యుండును. కావున త్రిగుణములను దాటు పర్యంతము మనము సత్యమును తెలిసికొనజాలము. పరమేశ్వరుని

యొక్క సృష్టిమహిమ ఈలాగుననే యుండును. కావున ఈశ్వరాను గ్రహముచే ప్రకృతిదోషము తొలగిసమాత్రముననే సత్యము గోచరము కాగలదని చెప్పెడు రహస్యము. బ్రహ్మసాక్షాత్కార జ్ఞానముకల వారిలో అగ్రగణ్యులును, త్రిమూర్త్యాత్మస్వరూపులును, పరమాద్వైత సత్యమును బోధించు గురువరేణ్యులునగు శ్రీదత్తాత్రేయులుగూడ అవధూతగీతయందు ప్రారంభముననే యీశ్లోకము నుపదేశించిరి.

ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా।
మహాభయపరిత్రాణా ద్విత్రాణా ముపజాయతే॥

జీవకోట్లకు ఈశ్వరానుగ్రహము వలన మాత్రమే అద్వైత జ్ఞానము కలుగును. సాంసారికగుణములచే బద్ధులగువారికి దీనికంటె వేఱు మార్గము లేదు. కనుకనే యెట్టివారికిని మొదట భక్తి గలిగియుండవలె ననియు, అట్టి భక్తి లేనివారికి ఈశ్వర సాక్షాత్కారజ్ఞానము గలుగదనియు, శాస్త్రములును, మహాత్ములును చెప్పుచున్నారు.

కనుకనే "సదా యింద్రియనిగ్రహము కలిగియుండుము. మనస్సెల్లప్పుడును స్వాధీనములో నుంచుకొనుము. నిస్సంగత్వము కలిగేలాగున చూడుము, ప్రకృతిగుణములు కలిగియుండకుము. శాంతము, కరుణ విరక్తి, భక్తి గల్గి వర్తింపుము." ఇట్టి పావనమగు నుపదేశమును గురువులు ముందుగ నుపదేశించుచో, మఱియు ఉపదేశమును పొందిన శిష్యులు ఆలాగున సదా ఆచరణలో నుంచుచో, లోకమెంతో బాగుపడియుండును. అయితే అట్టిస్థితి గల్గుటకు వారి దృశ్యసంస్కారము నశింపవలెను, కర్మము క్షయించవలెను. మనశ్శుద్ధి కలుగవలెను. అత్తరి యింద్రియనిగ్రహము మనోనిరోధము గల్గియుండవలెనని జెప్పెడు వేదవాక్యము సార్థకమగును. అట్లుగానిచో ఎంతగొప్ప యుపదేశము లైనను నిరర్థకములే యగును.

విరేచనమునకు ఔషధము వేసికొని యుష్ణోదకము పానముచేసిన బహిర్భూమికి వెళ్ళక నిశ్చలముగ గూర్చుండుమని చెప్పినచో పాప మతడేమి చేయగల్గును? విరేచనమయి, మలశుద్ధి అయిన తరువాత నిర్విచారముగ నుండుమని చెప్పిన, అత డాలాగుననే చేయగల్గును. ఇప్పుడు గల వేదాంతబోధయు ఈలాగున పరిణమించినది అంతఃకరణశుద్ధి గలుగుట

కున్ను. పాపము క్షయించుటకున్ను తగిన సాధన లుపయోగించక, అమనస్కము, అచలము, నిర్వికల్పము, నిస్సంగత్వము, సమాధి, తురీయము, తురీయాతీతము, సర్వసాక్షిత్వము, దృక్స్థితి, మొదలగు అతీతవాక్యము లుపదేశించి యేమి ప్రయోజనము? సామాన్యజనులుకూడ పై జెప్పిన వాక్యములను విని తామున్ను సాక్షిభావములోనో, అమనస్కములోనో, అచలములోనో, సదా తురీయములోనో యున్నట్లు బల్కుచుందురు. దీనియొక్క యథార్థస్థితి గలుగకపోవుటచేతనే ఉపదేశమును పొందినవారు దృశ్యవిషయ ములలోనికి దిగిపోచున్నారు ఉపదేశించువారున్ను మనోనిగ్రహము కలుగక, దృశ్యబాధలోపడి పరితపించుచున్నారు కావున ఆత్మశుద్ధి కలుగుటకు హేతువులైన దివ్యమంత్రజపము సాత్త్వికాహారము తపస్సుయోగము, వ్రతము, పరమభక్తి పుణ్యకర్మానుష్ఠానములు, వేదాంతశ్రవణము ఈలాటి దివ్య గుణములు గల్గియుండిన ఆత్మశుద్ధి త్వరలో సిద్ధించును. అపుడు నిర్వికల్పము, అవన్నియు ప్రయత్నము లేకనే సిద్ధించును, అపుడే ప్రవాహవేగమును, అనుకూలమైన గాలినిన్ని అనుసరించి పోయెడు పడవవలె ఆత్మోన్నతిలోనికి త్వరలోనే చేరవచ్చును. అట్లుకాని బోధలన్నియు ప్రవాహవేగమునకున్ను, వాయువేగమునకున్ను అడ్డముగ నడిపింపబడు పడవ చందమున శ్రమపడ వలసియుండును.

మంచిబుద్ధిగల ఉపదేష్ట అందఱును పై జెప్పిన అతి పావనములగు గుణములున్ను, అనుష్ఠానములున్ను క్రింది మెట్టు లనియు, వారిబోధలు అన్నిటికన్న పైస్థితి అనియు వచింతురు. వారు చెప్పినది మాత్రము పై స్థితిలో చేరునదేకాని వారుండుస్థితిని చూచిన భూమిలోనే వారు సంచరించు చున్నారని తెలియవచ్చును. గుణము, శుభేచ్ఛగల పుణ్య జీవులయొక్క పవిత్రప్రవర్తన కూడ వారియందు కనుపించుటలేదు. కనుకనే పరమ పవిత్రమై దివ్యమై బ్రహ్మాది దేవతలచే కూడ పూజింపబడెడు బ్రహ్మవిద్య కింత పతనము కలిగినది.

ఇక బ్రహ్మవిద్య యున్నతస్థితికి రావలసియున్నచో కొందఱు అంతఃకరణశుద్ధి గలవారును, బ్రహ్మనిష్ఠులును, త్యాగశీలురును సోమరి తనమను పెనుభూతమును జయించినవారును, కొంతవరకైన శాస్త్ర పరిచయము గలవారును, తపస్సునుగాని, యోగమునుగాని బాగుగా

ఆచరించినవారును. పరమ విరక్తులును, బ్రహ్మచర్యవ్రతమును నిర్వహించువారును ఏర్పడవలెను. ఒకవేళ విద్యలేనప్పటికిని మంచితపస్సుగాని, పరమభక్తిగాని గలిగియుండిన చాలును; విద్యచదివినను, తపస్సచేత ఆత్మ స్ఫుటము చేసిన బంగారమువలె ప్రకాశింపవలెను. అట్లుచేయని విద్య, అవిద్యయే యగును.

పై జెప్పిన నిర్మలగుణముగల పురుషశ్రేష్ఠులవలె; ధీరత్వముగల నారీమణులు కొందఱు ఏర్పడవలెను. వీరు తమ జీవితమంతయు ఆత్మజ్ఞానోపార్జనమందును, బ్రహ్మనిష్ఠ చేయుటలోను వాని నుపదేశించుటలోను వినియోగించవలెను. తక్కిన ప్రపంచకార్యములు చేయుట కనేకు లున్నారు. వారాయాకార్యములను చేయుచుందురు ఈ బ్రహ్మనిష్ఠులలో కూడ పరిపక్వమనస్సు కలుగనివారుండిన, వారు పుణ్యకర్మలను, లోకసేవను చేయుచుండుటయే మిక్కిలి శ్రేయస్కరమైనది. వృత్తులు, సంస్కారములు, విషయవాసనలు, అంతఃకరణములో నుండువఱకు నిరంతర మీశ్వరుని విషయములో నిలకడగల్గి యుండుటకు సాధ్యముగాదు. వీరున్నూ ధ్యానకాలములో ధ్యానానుష్ఠానము నభ్యసించుకొనవలెను, ధ్యేయమగు భగవద్వృత్తి గల్గి యుండు వరకున్నూ అట్టివృత్తియే చాలును. దానినుండి బాహ్యవృత్తి గలిగినపుడు పై చెప్పిన సత్కర్మలను బాహ్యాభ్యాసమును అందఱును చేయుచుండవలెను. ఇదే యుత్తమమైన పద్ధతి యగును పూర్వఋషి సంప్రదాయమున్నూ ఈలాగుననే యుండెను అట్టి పద్ధతియే మఱల మనకిపుడు కావలసినది. అయినను దేశకాలానుసారము అనుకూలమగు మార్పులు వివేకజ్ఞులు చేయుదురు వాని ననుసరించి వర్తించేలాగున చూడవలెను. అవన్నియు బాహ్యప్రపంచమును గుఱించియేగాని, ఆత్మవిషయములో ఏలాటిమార్పులు గలుగవు. ఏలన, అది సనాతనము, మార్పులేనిది, నిత్యము.

## నివృత్తిమార్గము

ఇంతవఱకు చెప్పినవిషయములలో మనము మఱింత లోతులోదిగి చూడవలసియుండును. లేకపోయిన నివృత్తిమార్గము పూర్తిగ గన్పించదు. ఇట్లు లోతున ప్రవేశించుటకును, అచ్చట జరుగుచుండు తత్త్వ రహస్యములు కనుగొనుటకున్ను హృదయశుద్ధి పూర్తిగ కావలసియుండునని మున్ముందుగనే

చెప్పబడియున్నది. అదిలేనిచో కాఱుచీకటిలో నుండు వానికి త్రోవ తెలియనట్లు మనమేమియు తెలిసికొనజాలము. జలము బురదచే నిండి యుండ, దానిలోపల జరుగు విషయములును, అచ్చట నుండు జంతువు లును, వస్తువులును ఏలాగున తెలిసికొనజాలమో, ఆలాగున అంతఃకరణము పాపపంకిలమై యుండునపుడు సృష్టియొక్క రహస్యమేమియు తెలియ సాధ్యము కాదు. అంతఃకరణశుద్ధి కలిగి రాగారాగా పరమేశ్వరునియొక్క సృష్టిశక్తి కొంచెము కొంచెముగా మనకు గోచరము కాగల్గును అప్పుడే సత్యము తెలియవచ్చుటచే అనిత్యములగు విషయములలో విరక్తిగల్గి సత్యము నాశ్రయించే స్వభావము కలుగును.

ఈస్థితికి వచ్చునపుడు మనుజుడు తాను స్వయముగ జడస్వభావము గలవాడు కాదనియు, కేవలము చైతన్యాత్మ యని గాని, చేతనాత్మయొక్క యంశమని గాని స్వబోధ ముదయమగును. అప్పుడు ఇంతవరకున్న స్థితికిన్ని, ఇప్పుడు గల్గిన స్థితికిన్ని చాల మార్పు గల్గును. ఇత్తఱి వానవుడు కేవలము మనస్సుయొక్క స్వభావము ననుసరించి ప్రవర్తింపవలసిన పనిలేదనియు, ఆత్మయొక్క స్వభావము కేవలము చైతన్యమయ మనియు, జ్ఞానమయ మనియు గోచరము కాగల్గును. ఈయంతఃకరణస్వభావము లన్నియు ఎప్పుడో చేసిన కర్మలచే గల్గినవనియు. వీటిని నివర్తింపచేయవచ్చుననియు స్వయ ముగా బుద్ధి గల్గును. వస్త్రము యొక్కరూపము స్వభావముగ తెలుపనియు, మురికిచేరుటచే నలుపు గల్గినదనియు తెలిసికొన్న సిమ్మట, క్షాలనాదిక్రియలచే నిర్మలస్థితి గలుగజేసికొనవచ్చునని దృఢసంకల్పము కలుగునట్లు ధ్యానాది సంస్కారణములచే ఆత్మశుద్ధి చేసికొనవచ్చునని నిశ్చయమగు బుద్ధి యుద యించును.

ఒక చక్రములోనో, లేక అంకులరాట్నములోనో యమర్చిన బొమ్మల వలె అనగా, చక్రముతిరిగిన, బొమ్మలవలె తిరుగవలసియుండునేగాని దానినుండి తప్పించుకొనుటకు వేఱుమార్గము లేదని యింతవఱకు కలుగుచు వచ్చిన బుద్ధి నశించును. ఏలన, ఆకొయ్యబొమ్మలు నిర్జీవములు, అచేతన ములు; మానవుడో నిర్జీవుడు కాడు. సజీవుడు, అచేతనుడు కాడు, చేతన స్వరూపుడు. కావున దానినుండి తప్పించుకొనవచ్చును అనుబోధ కలుగును

అదే ప్రకారము ప్రవాహమునకు లోబడి పోయెడు కఱ్ఱలు మొదలైన జడవస్తువులన్నియు ప్రవాహవేగము ననుసరించి పోవలసి యుండినను చైతన్యము గల మనము అలాగున పోవలసిన పనిలేదను తత్త్వమాతనిని సదా ప్రబోధించుచుండును ఏలన, ఈతతెలిసినవారు ప్రవాహమునకు ఎదురీచి తీరమునకు చేరుచుందురు. తెడ్డు, గడలు, చుక్కాణి మొదలైనవాని సహాయముచే ప్రవాహవేగమునుండి తప్పించి మానవులు పడవను గమ్య స్థానమును చేర్చునట్లు అతని నమ్మకమును, లక్ష్యప్రాప్తికి మఱింత బలమును గలుగచేయుచుండును. అలాగున సూర్యుని కాంతి అద్దములద్వారా ప్రసరించు నపుడు పలురంగుల ననుసరించి ప్రకాశించినను, ఇన్నిరంగులతో నిది ప్రకాశించుటకు కారణమేమి యని యోచించెడి యవస్థ కలుగునపుడు ఈప్రకాశమెచ్చటనుండి వచ్చుచున్నది, దీనియొక్క మూలస్వరూపమెద్ది యని తెలిసికొనవలెనను కుతూహల మతనిని ప్రేరేపించుచుండును అపుడు గృహాంతర్భాగము నుండి బయటకువచ్చి, ప్రకాశకారణభూతుడగు సూర్య భగవానుని దర్శించునవుడు ఆభాస్కరమూర్తి తేజోరాశియనియు, అద్దముల ద్వారా ప్రకాశము వచ్చుటచే దర్పణవర్ణానుసారము ప్రకాశము కలుగుచున్న దనియు అతనికి తెలియవచ్చునుకదా! అలాగున అంతఃకరణస్వభావము త్రిగుణముల భేదముచే ఏర్పడుచుండుననియు, సాక్షిచైతన్యాత్మ శుద్ధమై జ్ఞానమయమై, తేజోరూపియై ప్రకాశించుచున్నదనియు. అదే మన యొక్క ఆత్మస్వరూపమనియు అపుడు బోధము కలుగును.

అత్తరి ఆమానవునకు గలిగెడు యానందము ఇంత, అంత యని వర్ణింప నలవికాదు. సంతోష ప్రవాహములో పొంగిపొర్లుచుండును. ఉత్సాహమునకు హద్దు లేదు. అప్పుడు తానింతవఱకుండిన దానికంటె ఎంతో యున్నతస్థితికి వచ్చెననియు, సాధారణముగ ఎవనికిని సిద్ధింపని మహాదశ తనకు సిద్ధించెననియు, తాను కేవలము దివ్యమూర్తిస్వరూపు డనియు నిశ్చయ మాతనికి కలుగును. అత్తరుణమున అతని యంతరాత్మ సదా యీలాగున ప్రేరణచేయుచుండును. ఇట్లు తనయందొక యంతర్వాణి పలుకుచున్నట్లుకూడ తోచును. లేక యొక దేవత తనలో ప్రవేశించి ఆత్మలో ఈలాగున పలుకుచున్నదా యను సందేహము గల్గును.

కాని అవి యేవియును గావు. అది ఆత్మశుద్ధమగునపుడు గలిగెడు స్వభావమని యోగు లెఱింగియున్నారు. సంకల్పముయొక్క బలమాలాగున చేయుచుండును. దేవియందు సంకల్పము బలమగునో, అత్తఱి ఆత్మయు అలాటి స్వభావము గలదగును. ఉప్పులో వేసియుండు వస్తువులు కొంతకాలమునకు లవణమయమైపోవునుగదా! కార్యరూపముగ కన్పించెడి ప్రతిపదార్థమున్నూ దానికి కారణరూపమగు మూలవస్తువై పరిణమించుట ప్రకృతియొక్క అలంఘనీయమగు స్వభావము. కార్యరూపముగ నుండెడు విత్తనము కారణరూపమగు వృక్షమై పరిణమించుట ప్రకృతిమాతయొక్క స్వభావమైయున్నది అయితే కాల, దేశ, పదార్థ, క్రియల అనుకూలత కావలసియుండును అప్పుడు కార్యవస్తు సముదాయమంతయు కారణరూపముగ మారుచుండును. బీజమునకు మెత్తని నేలయు, జలము, సూర్య ప్రకాశము అన్నియు గలుగవలెను. అప్పుడే వృక్షమై మాఱుట కనుకూలముండును. అలాగున కారణస్వరూపుడగు ఈశ్వరునినుండి కార్యరూపమగు జీవుడుగానుండెడు ఈయాత్మయు తనకు వృద్ధినొందుటకు తగిన భక్తి వైరాగ్యాది పరికరములన్నియు దొరుకునపుడు జీవత్వమునుండి శివత్వమును పొందుచుండును.

సాధనానుష్ఠానముల పరిపక్వకాలము వచ్చునపుడు కార్యరూపము కారణరూపముగా మాఱుచుండు ననుదానికొాఱకు ఉదాహరణము చెప్పెద. చేతనస్వరూపమగు పక్షియొక్క గ్రుడ్డు అచేతనమై (జడమై) యుండును. అయితే ఆపక్షి తనయొక్క ఱెక్కలక్రింద గ్రుడ్డును పెట్టుచుండిన స్వయముగ నది భేదింప పిల్లలు ఏర్పడును కాని కొంగ మొదలగు కొన్ని పక్షుల గ్రుడ్లు పరిపక్వము గలిగి పగిలినను, రోమములు, ఈకలు ఏమియు కలుగక కేవలము నెత్తురుముద్దగనే యుండును. చలనశక్తి కూడ లేకయుండును సృష్టికర్తయైన పరమేశ్వరుని శక్తివలన ప్రాణశక్తి గల్గి చలనమేర్పడును మఱికొన్ని దినములకు ఈకలు, రోమములుద్భవించి, కొంచెము కొంచెము తిరుగుట కవకాశము కలుగును వృద్ధి కాగా, కాగా గూటినుండి యటునిటు బోవుచుతానుండు వృక్షముయొక్క శాఖలలో సంచరించుశక్తి గల్గియుండును. మఱింతకాలము మార్పువచ్చునపుడు తల్లిపక్షివలె ఆకాశమున ఎగురుటకు తగిన అవయవముల న్నియు కలుగును. ఇప్పు డీలాగున

జడమయమై యుండిన అండము చైతన్యమగుపక్షియై, కార్యత్వము మాఱి కారణత్వమును పొందినదో ఆలాగున సంస్కారభావమునుండి జీవుడును నిజస్వభావమగు దైవత్వమును పొందెడు కాలమొకటి వచ్చును. అట్టి దైవత్వావిర్భావ కాలమున వృత్తులు, వాసనలు, సంకల్పములు, సంసారములు, గుణములు మొదలగున వన్నియు, ఆత్మగుణములుగాని ఆత్మ స్వభావములుగాని కాదను బోధము గల్గును. అప్పుడు వాటినుండి విడుదల పొందుట కేయే ప్రయత్నములు కావలసియుండునో అవన్నియు సమకూర్చుకొని ముక్తుడగును. పైజెప్పిన పక్షియొక్క స్థితిలోనే యీ మానవుడుగూడ నుండును. కాని ద్రవరూపముగానుండు జీవపదార్థము పిండరూపమగు అండాకారముపొంది క్రమముగ కరచరణ శిరాది అవయవము లన్నియు ఏర్పడినవి. అయితే అవన్నియు గర్భాంతరాళమున జరుగుచుండుటచే సామాన్యజనులు తెలిసికొనజాలకున్నారు. ఇది కొంచెము తెలిసికొనిన, దేహాభిమానము చాలవఱకు తొలగిపోవును. అది తెలయనీయక మాయ కప్పిపుచ్చుచుండును. మాయయొక్క మహిమ తొలగిపోయినవారికి దేహోత్పత్తిసంగతి తెలియును. కనుక వారు నిరభిమానులై యుందురు.

నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥(గీ.4-37)

అనగా, ఈ లోకమందు జ్ఞానముతో తుల్యమై పాపములను బోగొట్టి శుద్ధిని గలుగజేయునది మఱియేదియునులేదు. కాలక్రమమున, తన యనుష్ఠానము పరిపక్వస్థితికి వచ్చునపుడు జీవుడు ఆత్మసాక్షాత్కారజ్ఞానము తనలోనే స్వయముగ పొందగల్గును: సాధనలో ఈ క్రింద పేర్కొనిన వన్నియు చేరియుండును. నిరంతర దైవచింతన, పరిశుద్ధమైన తపస్సు, దైవప్రాప్తిపరమగుయోగము, బ్రహ్మానుసంధానపరమగు ఆధ్యాత్మవిచారణయు, భూతకోట్లకు హితముకొరకు నిరంతరము ప్రయత్నముచేయుట వీటిలో ఎవరెవరికి దేనియందాత్మశాంతి గల్గెనో, అవి ముఖ్యమని వారు చెప్పుదురు. అట్టిమాటల విని భ్రమపడ నక్కరలేదు. తనయంతరాత్మ సంస్కారము ననుసరించి దేనియందైనను తుదివరకు విశ్రాంతి నొందక ప్రయత్నించెనేని పరమశాంతిమయమగు ఆత్మలోనికి సర్వులును చేరగలరు;

అనగా ఈశ్వరుని పొందగలరు: పైజెప్పిన వారందరును తత్తత్కార్యముల జేయుచుండినను దైవధ్యానము అనగా బ్రహ్మధ్యానము లేనివారై యుండరు. కావున అది (బ్రహ్మధ్యానము) ముఖ్యమైనది. ఈ విషయమై శ్రీయోగవాసిష్ఠ మున వసిష్ఠమునీంద్రుడు శ్రీ రామచంద్రున కిట్లుపదేశించెను.

స్వసంవిద్యత్నసంరోధాద్యథా చేతః ప్రశామ్యతి।
న తథాంగ తపస్తీర్థ విద్యాయజ్ఞక్రియాగణైః ॥

అనగా, బాహ్యవిషయములనుండి చిత్తమును నిరోధించి ఆత్మయందు నెలకొల్పుట యను ధ్యానయోగక్రమముచే చిత్తము పూర్ణముగ శమించును ఇట్టి చిత్తప్రశమనము తపో, తీర్థ, విద్యా యజ్ఞాదిక్రియా సమూహములచే గూడ పూర్ణముగ సిద్ధింపనేరదు.

ఇక ముముక్షువుల సందేహ నివృత్తికొఱకొక సంగతి చెప్పెద - మంచి ఆచరణము. అనుష్ఠానముగల యొక బ్రహ్మనిష్ఠున కేదైన నొక గొప్పవ్యాధి సంభవించునపుడు ఆహారము భుజింపవలెననిగాని. స్నానాది నిత్యకృత్యములు చేయవలెననిగాని సంకల్పముండదు. కేవలము దంత ధావనముగాని, శౌచముగాని చేయశక్తియున్నా గలిగియుండదు. అత్తఱి చేయవలెనను విచారముకూడ నుదయింపదు. ఔషధసేవవలన వ్యాధి కొంచెము కొంచెము శమించుటకు కాలమాసన్నమైనపుడు స్వయముగ మలవి సర్జనాదిశుద్ధి చేయవలెనను బుద్ధి కలుగును ఇక కొంత ఆరోగ్యము కలిగిన ముఖప్రక్షాళనాదులు చేయవలెనని అతడు వాంఛించును. మఱింత ఆరోగ్యము కలిగిన కొంచము లేచి కూర్చుండిన బాగుగనుండునని వానికి తోచును. ఇంకను ఆరోగ్య మావిర్భవించిన కొంచము తిరుగుచుండిన బాగుండునను ఇచ్ఛ జనించును. ఎక్కువ ఆరోగ్యము కలిగి రాగారాగా స్నానసంధ్యాద్యను ష్ఠానములు జరుపవలెననియు, భోజనాదులుగూడ ఆరోగ్యదశతో నుండి నట్లుండవలెననియు అభిలాష కలుగును. చూచితిరా! ఇక భవరోగము కలిగి యుండు జీవునియొక్క స్థితియు ఈలాగుననే యుండును. భక్తివైరాగ్యము లను దివ్యౌషధసేవనముచే అజ్ఞానవ్యాధి శమించునపుడు గల్గెడి స్థితియును ఈలాగున నుండును. బ్రహ్మనిష్ఠయొక్క శక్తి యిటువంటిది. అనుష్ఠానము

పూర్ణావస్థకు రాగారాగా జీవుడు అజ్ఞానసంబంధములగు సమస్త దుష్కృత్యములను మానును. సమస్త విషయవాసనలను త్యజించును. ప్రకృతిసంబంధము లగు సకలగుణములను ఉపేక్షించును. అట్టి యవస్థ గలుగనందుచేతనే సామాన్యులు విషయములను విడువజాలకయు, ఇంద్రియనిగ్రహశక్తి లేకయునున్నవారై వాసనామయములగు విషయములలోనే పడియుండి వేదాంతము మాత్రము వాక్కుతో చెప్పుచుందురు. బ్రహ్మాభ్యాసపరిపక్వము గల్గిన జీవుడు శుద్ధుడుగాను, చైతన్యాత్ముడుగాను, స్వయంప్రకాశ స్వరూపుడుగను నుండును, 'ఆత్మబోధ' మను గ్రంథమిూలాగున చెప్పుచున్నది.

ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా।
హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్॥

అనగా సర్వోత్తమమైన యౌషధమును సేవించుటవలన రోగములు నశించునట్లు ఎల్లప్పుడును బ్రహ్మానుసంధానాభ్యాసము చేయుటచే గల్గిన సంస్కారరూపమైన సద్వాసన, ఆవరణవిక్షేపశక్త్యాత్మకమైన అవిద్యను పూర్ణముగ నశింపజేయును. మఱియు,

ఏవ మాత్మారణౌ ధ్యానమథనే సతతం కృతే।
ఉదితాఽవగతిజ్వాలా సర్వాజ్ఞానేంధనం దహేత్ ॥

లోకమందు, కొయ్యమీద కొయ్యనుంచి చిలికిన మాత్రమున అగ్నిహోత్రముపుట్టి ఆ కొయ్యలను దహించివైచునట్లు, ధ్యానమను చిలుకడేముచే, జ్ఞాన ముదయించి మూలాజ్ఞానమును పూర్ణముగ నశింపజేసి స్వస్వరూపసాక్షాత్కారము గలుగజేయును.

మఱియు కారణమునుండి గలిగిన సర్వవస్తుసముదాయమును. కార్యరూపముగ భిన్నముగ కన్పించినను, కారణముతో సంబంధించినపుడు, కార్యత్వము నశించి కారణాకారస్థితిని పొందును. దృష్టాంతమేగ; భూమినుండి యేర్పడిన వృక్షాదులన్నియు మరల భూమిలో పడిపోవునప్పుడు మట్టి అయిపోవును. అలాగున పృథివినుండి ఉత్పన్నమైన యినుముతో వేయబడినట్టి మిక్కిలి వాడిమిగల ఖడ్గములు,ఇతర ఆయుధములు,ఇంజనులు, మట్టిలో పడిపోయిన, కొంతకాలమునకు త్రుప్పుపట్టి మట్టి అయిపోవును. అలాగున

సమస్త వస్తువులగూర్చియు ఊహించుకొనవచ్చును. అట్లే బ్రహ్మమునుండీ ఏర్పడిన జీవకోట్లన్నియు. మరల బ్రహ్మమయమై పోవును. అజ్ఞానముచే జ్ఞానము మఱుగుపడి పోయినను, నిజమగు జ్ఞానముదయించుటతోడనే అజ్ఞానము లయ మొందుచుండును. ఇదంతయు ప్రకృతియొక్క నియతియై యున్నది. కట్టెలో నిగూఢమైయుండు అగ్నిని కట్టె తనయొక్క గర్భములో దాచి యుంచినను, అద్దానిని మథింపగా అగ్నియేర్పడి దానిని దహింపవేయు చుండును. ఆలాగున అజ్ఞానము పంచకోశములతో ఆత్మను భద్రముగ మూసివేసి యుండినను, ధ్యాన, నిదిధ్యాసనాదులచే విజ్ఞాన ముదయమగున పుడు దానిచే ఆ యజ్ఞానమంతయును విలీన మొనర్పబడును. ఏ కొయ్య కాలుచుండునో, దానియందు వాసనగాని. దారుశేషముగాని కొంచెమైనను నిలువదుగదా! అలాగున ఏ హృదయములో జ్ఞానాగ్ని ప్రజ్వలించుచుండునో ఆ హృదయములో అజ్ఞానముగాని. వాసనలుగాని యుండవు. గీతను చూడుడు :—

యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురు తేఽర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

అనగా లెస్సగామండుచున్న, అగ్నిహోత్రుడు సమిధలను హోమద్రవ్యములను, అన్నింటిని ఏలాగున సంపూర్ణముగ భస్మ మొనర్చునో అలాగున జ్ఞానమనెడి యగ్ని సమస్తకర్మలను వాసనలను సంపూర్ణముగ నాశమొనర్చును అని గీతాచార్యు డుపదేశించెను. ఈ విషయమై సీతారామాంజ నేయమందు చెప్పిన వాక్యములను వినిన, వాసనలతోను, వృత్తులతోను మాకే సంబంధము లేదని చెప్పెడు వేదాంతబోధకుల హీనాశయ మందఱ కును తెల్లముగ విశదము కాగలదు :—

వనితానందనచందనాదివిషయ వ్రాతంబులం బొంది చ
య్యన నంతంతకుఁ జొక్కు నెమ్మనము బ్రహ్మానంద వారాశివా
సన యెక్కించుక పోఁకెనేనిఁ బ్రవినాశంబొందు నానాద్రుపు
ష్పనటద్భృంగము చంపకప్రసవ సంస్పర్శాప్తిఁగూలుంగతిక్,

చక్కెరయును లవణంబును
గ్రక్కున నుదకములయందుఁ గరఁగిన రీతిన్
మిక్కిలి తనుఁగను ఘను మది
చొక్కఁచు నానంద జలధి నుడిసి నశించున్.

ఇతర సంకల్పములు లేక యెపుడు దాను
సచ్చిదాత్ముడనని సుప్రసన్న వృత్తి
దన్నుఁగనువాని చిత్తంబు దనకుదాన
పొలియు దనయంద నింధనానలము పగిది.

ఇనుడస్తమించు తఱి నా
తనికిరణము లతనితోడ దగ జనురీతిం
బెనుమానసంబు పొలిసిన
మునుకొని తద్గతి వికారములు పొలియుగడున్.

నానాకర్మజవాసనాన్విత మనోనాశంబు గాకున్న బ్ర
హ్మానందానుభవంబు గల్గునె యనాయాసంబుగా నిప్పడి
య్యానందాంబుధి నోలలాడక యబాహ్యాభ్యంతరార్థానుసం
ధానోద్భూత నితాంత దుఃఖమయ సంతాపంబు చల్లారునే?
(శ్రీసీతామాంజనేయము. అమనస్కము.)

ఒక యింటి గదిలో మంచిదీపము వెలుగుచుండిన దానియందు చీకటెట్లుండును? ఉండజాలనట్లే, మంచిజ్ఞానప్రబోధము గలవారి యంతఃకరణములో అవిద్యాసంబంధము లేమియు నుండజాలవు. ఇక యీ విషయమై విస్తారముగ వ్రాయబనిలేదని తలచెద. అయితే యిపు డొకసంశయము ముముక్షువులకు గలుగవచ్చును. అదేమన, ఇపుడు కొందఱు బ్రహ్మనిష్ఠులై యున్నను, వారిలో కొందఱికి కొన్ని ప్రకృతికి సంబంధించిన గుణములు. విషయములు కాన్పించుచుండునే! ఆ విషయమై వారినడిగిన అంతఃకరణ వృత్తుల కాత్మ సాక్షిగా నుండునని చెప్పదురు. ప్రమాణముకూడ చూపుదురు.

సరి, రోగియైనవారికి ఆరోగ్యము కలిగిన పిమ్మటగూడ అప్పుడప్పుడు రోగ చిహ్నములు కలుగుచుండిన జనులేమి తలంతురు? ఇకను రోగముయొక్క లేశము నిలచియున్నది. కావుననే అప్పుడప్పుడు బాధలు కలుగచేయుచున్నది అని యెంచుదురు. అలాగున వారు బ్రహ్మనిష్ఠ చేయుచుండవచ్చును, కాని ధ్యాననిదిధ్యాసనాదులు చాలవు; శ్రవణమననములు పూర్తియై నిదిధ్యాసనమున రూఢిగల్గినవారట్టిగుణము గల్గియుండరు కనుకనే శాస్త్రమీలాగున చెప్పుటకు కారణము.

అహం బ్రహ్మేతివాక్యార్థబోధో యావద్దృఢం భవేత్।
శమాది సహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్ ॥

దీని యర్థము పైన తెలిపినదే. బాగుగ జ్వలించు అగ్నిలో కొంత భాగము కాలక నిలిచిపోవునా? పోదు. అంతయును భస్మమగును. సుగంధము గల హోమద్రవ్యముగాని, దుర్గంధముగల యితరవస్తువులుగాని అన్నియును భస్మములై పోవును. బాగుగ జ్వలింపని అగ్నియైనచో, కొంతభాగము కాలకయు, బొగ్గులతోకూడియు, హోమించిన వస్తువులను దహింపజాలక పొగ కలిగియుండును. అప్పుడు శ్రోత్రియుండేమిచేయును? మఱల సమిధలు ఎక్కువగ వేసి విసనకఱ్ఱచే అగ్నిని ప్రజ్వలింపచేసి పూర్ణముగ భస్మమొనర్చును. అట్టి హోమమునకు మాత్రమే ఫలము గలుగును. ఆలాగున ఆత్మయజ్ఞము చేయు బ్రహ్మనిష్ఠులు తమయందు విషయవాసనలుగాని, ప్రాకృత వృత్తులుగాని యుండిన, మఱింత వైరాగ్యమును బలపఱచి, మంచి ఏకాంతస్థలమున తీవ్రముగ బ్రహ్మనిష్ఠ నభ్యసించుకొనవలెను. లేనిచో సామాన్యస్థితినే పొందుదురుగాని, అతీతబ్రహ్మనిష్ఠులస్థానము లభింపజాలదు: నిశ్శేష క్లేశ శమనమును కలుగదు. సముద్రాంతర్గత బడబాగ్ని జ్వలింప ప్రారంభించిన, ఆయ్యది సముద్రజలమునంతయు ఏలాగున రహితమొనర్చునో, ఆలాగున అంతఃకరణములోగల సంసార వాసనామయమగు జలమంతటిని జ్ఞానాగ్ని ప్రజ్వలించి నశింపచేయగల్గును.

ఇప్పుడు జీవకోట్లు వాసనావశమై ప్రవర్తించునని చెప్పిన యెడల, ఒక సందేహము ముముక్షువులకు కలుగును. అదేమన, అట్టి యీ వాసనకు అంతముగలదా? లేదా? యని. కలదన్న చెప్పిన

క్కాలపరిపక్వము గల్గునపుడు ముక్తులగుదురు. లేదని చెప్పిన యెల్లప్పుడును బద్ధులైయుందురు. అట్లయిన ప్రయత్నమే యక్కరలేదు. ఏ జీవి యే కార్యమును చేసినను, అది వాటియొక్క స్వభావమేగనుక దానినుండి నివృత్తిగల్గెడు ప్రయత్నమే అవసరము లేకపోవును. అట్లయిన నివృత్తిమార్గమును బోధించెడు శాస్త్రములే వ్యర్థము లగును అంతేగాక జ్ఞానోపదేష్టలగు పరమగురువులయొక్కయు అవసరముండదు, ఈ విషయమై మనము చెప్పబూనిన అంతములేదు శాస్త్రముయొక్క సిద్ధాంతమే సజ్జనులయొక్క అభిప్రాయమైయున్నది. ఎప్పుడైనను ఈ జీవులు పుణ్యకర్మ విశేషమువలననో, ఈశ్వరుని కరుణవలననో, కాక తాళీయముగ మహాత్ముల కృపవలననో ఆత్మజ్ఞానములో ప్రవృత్తిగల్గి రాగా రాగా, రెండువిషయములకు వశపడి యుండవలెననెడి తత్త్వము బోధమగును. 1. మనయొక్క గుణములను కనిపెట్టి సవరించుటకు మనకు స్వయముగ సాధ్యము కాదు. 2. మనకంటె ఎక్కువస్థితిలో నుండువారును, ఆత్మజ్ఞానము గలవారును, ఈశ్వరసాక్షాత్కారముగలవారును నగు జ్ఞానులను అనుసరించి వారు జెప్పేలాగున నడుపవలెనను బుద్ధియుదయమగును. ఇదే యొక్కువమందికి గలిగెడు పుణ్యస్వభావమైయుండును. ఇట్టివారు గురూపదిష్ట మార్గానువర్తులైయుందురు. దానివలన వారు త్వరలోనే బంధనమునుండి విముక్తులగుదురు. ఇక రెండవతరగతి వారు గలరు. ఇట్టివారు చాల యరుదుగనే యుందురు. వారీశ్వరప్రాప్తి కొఱకు తీవ్రమైన తపోధ్యానాదులయందు సదా ప్రవృత్తి గల్గియుందురు. సమస్తమును ఈశ్వరునియందు సమర్పించి అనన్యభక్తి గల్గి తదేకధ్యాననిష్ఠ గలవారై యుందురు. ఉత్కృష్టమైన శాస్త్రములనుగూఢ, ధ్యానమునుండి బహిర్దృష్టి గలిగినపుడు చూచుచుందురు. అనేక బ్రహ్మనిష్ఠుల దర్శించి వారి యాచరణలన్నియు తెలిసికొని ప్రవర్తింతురు. వీరున్నూ ఈశ్వరానుగ్రహమువలన కొంతకాలమునకు ప్రకృతిదోషరహితులై జీవత్వోపాధినుండి విముక్తులగుదురు. ఎవరు తమలో గల దృశ్యవిషయ వాసన నశించు పర్యంతము బ్రహ్మనిష్ఠ చేయుదురో వారే పుణ్యజీవులు. ఇదే ఋషులయొక్క ఆశయము.

నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥

ఈ లోకమందు పాపములను బోగొట్టి అంతఃకరణశుద్ధిని గలుగ జేయునది జ్ఞానముతో తుల్యమైనది మఱేదియు లేదుకదా! యోగధ్యాన నిష్ఠాపరాయణుడై కాలము పరిపక్వముకాగా తనయందే మనుజుడాత్మ సాక్షాత్కారరూపమగు జ్ఞానమును పొందుచున్నాడు.

తేషామేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥

నేను అట్టి ధ్యాననిష్ఠాపరులగువారి యంతఃకరణము నివసించుచున్న వాడనై అనుగ్రహించు తలంపుతో వారి యజ్ఞానమను తమస్సును ప్రకాశించు చున్న వివేకమను దీపముచే నశింపజేయుచున్నాను. అని గీతాచార్యులగు శ్రీ కృష్ణభగవాను ఉపదేశించిరి.

జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణోవాఽంత్యజోపివా।
సంసారసాగరం తీర్త్వా ముక్తి సారం హి గచ్ఛతి॥

జ్ఞానమనెడు ఓడచే బ్రాహ్మణుడైనను, అంత్యజుడైనను ఈసంసార సాగరమును తరించి ముక్తియను తీరమును పొందగల్గును.

సంసారార్ణవమగ్నానాం జంతూనామవివేకినామ్ ।
అగతీనాం గతిస్సాక్షాత్ జ్ఞానమేవ హి కేవలమ్॥

సంసారమనెడి దుఃఖసాగరములో మునిగినవారును, వివేక జ్ఞానము పూర్తిగలేనివారును, సహాయమేమియు లేనివారునగు మానవులకు ఈజ్ఞాన మొక్కటియే సమస్తదుఃఖములనుండి తరింపజేసి మోక్షము గలుగజేయుదై యున్నది అని పరమశివుడు సూతసంహిత యందుపదేశించెను.

ఇప్పుడు శ్రీ విష్ణుమూర్తియొక్కయు, పరమశివునియొక్కయు యాశయము మనము తెలిసికొనదగ్గినది. చెట్టు కాలపరిపక్వావస్థ వచ్చిన పుడు పుష్పించి ఫలించునట్లు ధ్యాననిష్ఠ పరిపక్వస్థితికి వచ్చినపుడు వారి యంతరాత్మలో జ్ఞానము స్వయముగా నుదయించి ప్రకాశించును. అరణిని మథించి రాగారాగా అగ్ని ప్రజ్వలించునట్లును, పెరుగును తరచుచు రాగా రాగా నవనీతము బయటపడునట్లును, జ్ఞావి త్రవ్వుచు రాగారాగా జలము

కన్పింపనట్లును వీరిలోనిగూఢమైయుండు ఆత్మతత్త్వమున్నతపోధ్యానాదులు చేయుచురాగా కొంతకాలమునకు ప్రకాశమునకువచ్చును.అట్టితపోధ్యానాదులు చేయని పక్షమున శుద్ధాంతఃకరణులై యుండిరేని వేదాంతశ్రవణ మనన నిదిధ్యాసనాదులు తప్పక చేయుచువచ్చిన, వీరున్నా స్వరూప సాక్షాత్కారముపొంది ముక్తులు కాగలరు. ఈ బ్రహ్మవిచారము చేయువారిలో అనుష్ఠాన పరిపక్వము ననుసరించి శుక్లపక్ష చంద్రుని గమనమువలె కొందఱు ద్వితీయ, కొందఱు పంచమి, కొందఱు సప్తమి, కొందఱు ఏకాదశి, కొందఱు త్రయోదశి చంద్రకళలవలె ఆత్మప్రకాశములోను, సత్త్వగుణ పరిణామములోను విభేదము గల్గియుందురు, పౌర్ణమిదినమున పూర్ణచంద్రుడు సంపూర్ణకళలతో నెట్లు ప్రకాశించుచుండునో, అలాగున కేవలము దృశ్యము నశించి నిరంతరము ద్వైవాకృతి కలవారు చాల యరుదుగానుందురు, మఱియు, పౌర్ణమిదివసమున అస్తమయము నుండి మఱునాడు సూర్యోదయమువఱకు ఏలాగున కొంచెమైనను చీకటి లేక శరత్కాలమున షోడశకళా ప్రపూర్ణమై చంద్రబింబము కన్పించుచుండునో, అలాగున ఏకాలమునను తన పూర్ణాత్మస్వరూపము మఱపు కలుగకయు, సంపూర్ణ ఆత్మశాంతికి భంగము కలుగకయు, బ్రహ్మానందామృతము సంతతము వర్షించుచుండినచో అట్టిస్థితియే నిజమైన జీవన్ముక్తియని గ్రహించుకొనవలెను. శరత్కాల పూర్ణ చంద్రునివలె జ్ఞానిప్రసన్నుడై యుండును.ఇట్టి షోడశకళాప్రపూర్తి లేనివారందఱును ఇంకను పూర్ణావస్థను పొందియుండలేదు. వీరు పంచమియో, దశమియో త్రయోదశియో, ఏదోయొకతిథి యందుండువారే యగుదురు: షోడశకళాపూర్ణజ్ఞానసిద్ధిగలవారు చాలయరుదుగనే యుందురు. శ్రీబుద్ధదేవుడు, శ్రీదత్తాత్రేయులు, శ్రీశంకరాచార్యులు మొదలగు మహాత్ములు పౌర్ణమిదశలోనికి వచ్చినవారే. కనుకనే "వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభ"- అని శ్రీగీతాచార్యు లుపదేశించుటకు హేతువైనది:

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥

వేలకొలది మనుజులలో ఒక్కడు మాత్రమే పరమార్థ తత్త్వము నెఱింగి తరింపవలెనను బుద్ధిగల్గియుండును, అలాగున తరణోపాయబుద్ధిగల

యనేకులలో ఒక్కడు మాత్రమే నిజమైన భక్తి, శ్రద్ధ, సత్య, ధర్మనిష్ఠలతో కూడి యనుష్ఠించును. అట్టి యనుష్ఠానముగల వారిలో నొకానొకడు మాత్రమే సర్వబంధరహితుడై పరమాత్మ సాక్షాత్కారజ్ఞానమును పొందును అయితే తక్కినవారి యనుష్ఠానము లన్నియు వ్యర్థములై పోవునని తలంపరాదు. వారు ఉత్కృష్టమైన పుణ్యలోకములను పొంది మఱుజన్మలో శ్రేష్ఠవంశములో శ్రేష్ఠ గుణములుగల్గి, జీవన్ముక్తి పొందుటకు తగిన నిష్ఠగలవారై మోక్షము పొందుదురు అని గీతావాక్యముల యభిప్రాయము. కఠోపనిషత్తునందు కూడ ఈలాగుననే కాన్పించుచున్నది.

> శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః,
> శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః ।
> ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా
> ఆశ్చర్యోజ్ఞాతా కుశలానుశిష్టః॥

అనగా ఏయాత్మ వినుటకును, వినినను తెలిసికొనుటకు అలవి గానిదో అట్టి యాత్మను గుఱించి చెప్పువాడును, పొందువాడును, తెలిసికొనువాడును అరుదై యున్నారు.

అయితే తదితర బ్రహ్మనిష్ఠులు పూర్ణజ్ఞానమును పొందక నిత్య సుఖమనుభవించక పోవుదురని తలంపనక్కరలేదు. పంచమిలో నుండు వారు షష్ఠికిని, దశమిలో నుండువా రేకాదశిస్థితిలోనిక్ని మార్పుదల పొందుదురు అట్లీశ్వర జ్ఞానము పూర్తిగ పొందువఱకు మఱల మఱల ఉన్నతస్థితికి వచ్చుచునుందురు. ఈజన్మలో పూర్ణస్థితి పొందనివారు వచ్చే జన్మలో పూర్వాధికమైన యుత్కృష్టస్థానమును పొందుదురు. అయితే అనుష్ఠానము మాత్రము తప్పక చేయుచుండవలెను. తానున్నా జగత్తున్నా, ఈశ్వరమయమను జ్ఞానము కలుగువఱకున్నూ అంతఃకరణోపాధి పూర్తిగ తొలగిపోజాలదు, అదే దానికి గుఱుతు, ఏలన యెంతవఱకు పౌర్ణమిదినము కాలేదో, అంతవఱకు చంద్రుని రేఖలోనుండు భూమి తొలగిపోయి యుండ లేదు. ఎంతవఱకు గ్రహణకాలమును రాహు కేతువుల విమోచనము గలుగలేదు. అంతవఱకు చంద్రబింబము పూర్ణముగ కన్పించదు. మఱియు

సంపూర్ణ గ్రహణవిమోచనము గలుగనిచో శుద్ధి కాలేదనియు, గ్రహణదోష మింకను ఉండెననియు తలంచవలెను.

అలాగున దృశ్యవృత్తి నిశ్శేషముగ నశించువఱకున్నూ యీ జీవుడు ప్రకృతినుండి విమోచనావస్థ పొందలేదు. అమృతత్వ మనుభవించుట గూడ పూర్తి కాలేదు. మాయామాలిన్య కల్మషమున్నూ నశించలేదని ప్రతిబ్రహ్మనిష్ఠుడును గ్రహించవలెను. అనుష్ఠానముకూడ చేయుచుండవలెను. సృష్టియొక్క రహస్యము జీవన్ముక్తి గల్గినవారికి మాత్రమే లెస్సగ తెలియ గలదనియు, తక్కిన వారందరును వారివారి ప్రకృతి (మనస్సు) యొక్క స్థితినిబట్టి యుందురనియు తెలియవలెను.

ఇంతవఱకు చెప్పినదానిలో ఇంకను గ్రహించవలసిన విషయములు చాలగలవు వాస్తవము ఇపుడు కన్పించెడు పంచేన్ద్రియ విషయము లేస్థితిలో నుండు నని మనకు తెలియసాధ్యము కాదు. ఏలన, మనస్సుయొక్క సృష్టిని గుఱించియు, మనయొక్క మనఃస్థితినిగూర్చియు మాత్రమే మనకు తెలిసికొనుట కవకాశము గల్గుచుండును. ప్రకృతియొక్క మహిమవలన, మనకు తెలిసినదే సరిగా నుండునని తోచెడు స్వభావము మనకు గలిగి యున్నది. ఈరహస్యము తెలిసికొనుట చాల కష్టము. దీనియొక్క తత్త్వము తెలిసికొనుటయే మనస్తత్త్వమును ఎఱుంగుట యగును.

సామాన్యయోగులు, తపస్వులు, జ్ఞానిష్ఠులు, భక్తులు సహితము ఈమానసిక తత్త్వమునకు లోబడియుందురను విషయ మిదివఱకే చెప్పబడి యుండెను గదా! కనుకనే కొందరు యోగ మెక్కువనియు, కాదు, తపస్సే గొప్పదనియు, కాదు కాదు జ్ఞానమే యుత్కృష్టమైన దనియు, అట్లుకాదు భక్తియొక్కటియే శ్రేష్ఠమైనదనియు, అదికాదు లోకసేవయే సర్వోత్కృష్ట మనియు, అట్లుకాదు ధర్మమార్గముతో గృహస్థాశ్రమమందుండుటయే అన్నిటికంటె నుత్తమమైనదనియు అనేకులు అనేకవిధములుగ చెప్పుటకు కారణమగుచున్నది. ఇవన్నియు వారి యొక్క పొరపాటు కాదు. పరమేశ్వరుని యొక్క సృష్టిమహిమ యని ఆత్మజ్ఞానులు తలంతురు. భోగ మనుభవించుట కొఱకే మానవజన్మము నీశ్వరుడిచ్చెననియు, దానియం దేలాటి దోషము లేదనియు కొందఱు పలికెదరు, ఇకకొందఱు భోగములు రోగకారణము

లగుటచే మితము గానే అనుభవించవలెనుగాని, భోగపరులై పోగూడదనియు నుపన్యసింతురు. మఱింత అంతఃకరణశుద్ధి గలవారు భోగములన్నియు యోగమునకు ప్రతిబంధము లనియు, అవి అజ్ఞు కొఱకు కేర్పడినవనియు, వాటిని నిశ్శేషముగ రహిత మొనర్పవలెననియు వాదింతురు. ఇక కొందరు గృహస్థాశ్రమమే అన్నింటికంటె శ్రేష్ఠమైనదనియు. సంసారములో నుండియే అన్నిటియొక్క సారము కనుగొనవలెననియు, కనుకనే సంసారములోనే సారము గలదనియు, శ్రుతు లట్లే చెప్పుచున్నవనియు తర్కింతురు. అట్లుకానిచో ఈశ్వరు డేల యీ సంసారమును సృష్టించవలె వనియు నుపదేశింతురు ప్రక్కనుండి మఱియొకడు సంసారములో సారము లేదనియు, దీనిలోనుండినచో ఏకాలమందును దరిజేర జాలమనియు, దీనిలో శాశ్వతవస్తువేదియు లేదనియు కనుకనే సంసారము నిస్సారమని శాస్త్రములు చెప్పుచున్నవనియు వచించుచుండును. వీరు చెప్పు వాదము లన్నిటికిన్ని ప్రమాణములు గలవు. ఆత్మజ్ఞాని మాత్రము పైవారిని గూర్చి వారివారి యంతఃకరణవృత్తి అలాగున నుండుటచేతనే అట్లు చెప్పుచున్నారే కాని వారిని గుఱించి మన మేమియు చెప్పుట తగదని తలంచి యూరకుండును.

ముందు మనము ప్రారంభించిన శబ్దాదివిషయముల గ్రహించునట్టి కర్ణ, చర్మ, నేత్ర, జిహ్వా, ఘ్రాణములను గుఱించి వివరించెద. ఒక శబ్దము వినవచ్చుచున్నది. అది యింత పెద్దదని గాని, చిన్నదని గాని మనము నిశ్చయింపజాలము. మనయొక్క కర్ణగోళసృష్టి ననుసరించి మనకాశబ్దము యొక్క లఘుత్వముగాని గురుత్వముగాని గోచరమగును. దృష్టాంతముగ, మనలో కొంచెము చెవుడున్నవానికి ఆశబ్దము చాల పెద్దదిగా నున్నను చిన్నదిగానే వినవచ్చును. ఇది శబ్దముయొక్క దోషమా లేక చెవియొక్క దోషమా? కర్ణముయొక్క దోషమే కాని మఱియొకటి గాదు, మఱియు కొన్ని జంతువులకు శ్రవణశక్తి మానవులకంటె ఎంతో అధికముగ నుండును. అనగా చిన్న శబ్దముగ మనకు తోచునది, వాటికి చాల దూరమునగూడ పెద్దదిగా వినవచ్చును. మనలో ఎవరికైన కొంచెము చిత్తైకాగ్రతయు, ఇంద్రియములకు సూక్ష్మతయు గల్గిన వారికి సామాన్యజనులకు చిన్నదిగ వినిపించెడు శబ్దము చాల పెద్దదిగానే వినిపించును. మీలో ఎవరైన చెవిపై చేతిని వంకరగా పెట్టిన చిన్నశబ్దము కూడ పెద్దదిగా వినవచ్చును కావున

ఒకశబ్దము వినవచ్చిన అది యెంత పెద్దదో, యెంత చిన్నదో మనము నిర్ణయింపజాలము.

ప్రకృతియొక్క మహిమ యిటువంటిది, రెండవదగు స్పర్శమును గూర్చి చింతించెదము పైజెప్పిన రీతిగా మనయొక్క చర్మసృష్టి ననుసరించియే స్పర్శముగూడ తెలియఁగును. కఠినమైనను, మృదువైనను, ఉష్ణమైనను, శీతలమైనను స్పర్శేంద్రియముయొక్క స్వభావము ననుసరించి అనుకూలముగాను ప్రతికూలముగాను నుండును. మంచి వేసవి మధ్యాహ్నకాలమునగూడ కొందఱు మండుచున్న యెండలోపని చేయుదురు. కొందఱాతీక్ష్ణమగు ఎండను సహింపలేక యుందురు. శీతకాలములో మంచులో కూడ కొందఱు సుఖముగ పనిచేయుచుందురు. కాని కొందఱకు చేతులు కాళ్ళు ముడుచుకొని పోగా, కఱ్ఱవలె నుందురు. ఇట్లు కలుగుటకు కారణమేమి? స్పర్శేంద్రియభేదమే. అలాగున ఒంటెయు, ఒక రకము మేకలు మొదలగునవియు మండుటెండలో సంచరింపగలవు. గేదె మొదలగు జంతువులా యెండను సహింపజాలవు. ఇదిన్ని సృష్టి విశేషము కదా! మఱియు తాబేలు, కప్ప మొదలగునవి మంచుగడ్డలలోకూడ జీవించును. కొన్ని ప్రాణులట్టి మంచులో జీవింపజాలవు. మానవులలోకూడ కొందఱికి తిమ్మిరి గల్గిన స్థలములలో నిప్పు తగిలినను, వేడిమి తెలియదు. ఇవన్నీ స్పర్శేంద్రియ భేదమేగాని యుష్ణత్వ భేదముకాదు.

అలాగున నేత్రేంద్రియశక్తి (చూపు) మందగించిన వారికి దగ్గఱనున్న వస్తువుకూడ బాగుగ కన్పించదు. సులోచనములు పెట్టిచూచినవారికిని బాగుగ కన్పించగలదు. ఈభేదము దేనివలన కలిగినది? నేత్రభేదమేకాని వస్తుభేదము కాదు. కొన్ని యద్దముల ద్వారా జూచిన, చిన్న వస్తువులుకూడ చాల పెద్దవిగ గోచరించుట మనము గాంచుటలేదా? దూరదర్శినీ సహాయముచే బహుదూరమున నున్న పదార్థములను కూడ జనులు కనుగొనుచున్నారు. ఈరహస్యమునుగూర్చి వివరించిన, ఏవస్తువుయొక్కయు యథార్థస్థితిగతులు మనకు తెలియవనియు, మన మనస్సుయొక్క పరిమితి ననుసరించి తెలిసికొనవలసి యుండునేకాని, మఱేమియు చెప్పజాలమనియు దృఢముగ బోధ గల్గును. మఱియు రంగు అద్దముద్వారా చూచిన యెత్తనికి ఆ యద్దమువర్ణము ననుసరించి అన్నియు అదేరంగుగ గోచరించును. ఈ

విషయమై యెవరేమి చేయగలరు? సూక్ష్మమైన దుర్భిణీయంత్ర సహాయముచే గాలిలోను నీటిలోనుగల సూక్ష్మప్రాణులనుగూడ జనులు కనుగొన సమర్థులగుచున్నారు. కావున పరమేశ్వరుడు మానవుల కిచ్చియుండు నేత్రగోళ సృష్టి ననుసరించియే అందఱికిని గోచరించుచుండును గాని వాస్తవస్థితి, అందఱికిని తెలియ సాధ్యము కాదు. మనకు చీకటిగా నుండునప్పుడు కొన్ని జంతువుల కది ప్రకాశముగా నుండును. మనకు ప్రకాశముగానుండునది వాటికి చీకటిగా నుండును, గుడ్లగూబలకు పగలు కన్ను కన్పించదు. రాత్రి బాగుగ కన్పించును. కాకి, కొంగ, కోడి మొదలగు జంతువులకు చీకటిలో ఏమియు కనుపించదు. గబ్బిలములు కారుచీకటిలో నుండు చిన్న వస్తువులనుకూడ కనుగొనును. గబ్బిలములలో కొన్నిరకములు (ఇండ్లలో నుండునవి) కారుచీకటిలో అతిసూక్ష్మములగు దోమలు మొదలగువాటిని పట్టి తినుచుండును. కొన్ని జంతువులకు పగలున్నా. రాత్రియున్న ఒకే విధముగ గన్పడును. పిల్లి, కుక్క మొదలగువానికి రాత్రిని పగలున్నా భేదములేకయే ఒకేవిధముగ కన్పించును. మీనములు మొదలగు జంతువులకు జలములోపల కన్పించువేగాని బయట కన్పడదు. తాబేలు, మొసలి మొదలగు జంతువులకు నీటిలోను, తీరమందును ఒకేవిధముగ కన్పించును. ఇదంతయు పరమేశ్వరుని సృష్టి మహిమగదా!

ఇక రసనేంద్రియ విషయమై యోచించిన అదిన్నీ మఱింత చిత్రముగా నున్నదని తెలియగలదు. ఒకరికి రుచికరమైనది మఱియొకరికి అరుచిగా నుండును. ఒకరికి కొంచెముగా రసవంతముగ నుండునది మఱియొకరికి మిక్కిలి రసవంతముగ నుండును. దృష్టాంతముగ కొందఱకు ఉప్పు,కారము పులుపు ఎక్కువగా నుండవలెను. కొందఱు వాటిని భుజింపజాలరు. కొందఱికి మధురముపై ప్రీతియుండును, ఇంకొకరికి అది యిష్టమే యుండదు. మనకు మధురముగానుండు పదార్థములు కొన్ని జంతువులకు చేదుగ నుండును. మనకు చేదుగానుండు వేపాకు మొదలైనవి మేకలు మొదలైన వానికి రసయుక్తముగనే యుండును. ఈలాగున విచారించిన దేనినిగుఱించి యెవరు ఏమి చెప్పగలరు? రాబందు మొదలగు పక్షులకు దృష్టి అతి దూరముగ కన్పించెడి శక్తి యుండును కొన్ని జంతువులకు ఘ్రాణేంద్రియము అతిదూరముననున్న వాసనగనుగొను మహిమగలిగియుండును.

ఇవన్నియు చూచిన వాటివాటి సృష్టిననుసరించియే వస్తువులభేదము గోచరించు చున్నట్లు తెలియును. కొందఱు అతిప్రీతితో భుజించెడు గోమాంసాది పదార్థములు మఱికొందఱు తాకిన స్నానము చేయుదురు. కొందఱకు పక్వాహార మిష్టము. మఱి కొందఱకు అపక్వారమందు ప్రీతి కొందరికి షడ్రసములందిష్టము గలదు. కొందరకు తీపి వస్తువులం దభిరుచి జనించును. కొందఱకు ప్రకృతిసిద్ధమైన రసము మాత్రము చాలును అట్టివారికి కృత్రిమరసము లన్నియు నీరసములుగానే యుండును. ఈలాగున అన్నిటిని గూర్చియు విచారించుకొనవచ్చును.

కొందఱకు అతిదుర్గంధము కలిగిన స్థలములందును ఘ్రాణేంద్రియ మేమియు విరోధము కలుగజేయదు మఱికొందర కట్టి దుర్వాసన యెంతో బాధకరముగా నుండును. కొందరకు సుగంధమందు ప్రీతి మిక్కుటము, ఇవన్నియును విచారించిచూచిన జనులందరును ఏదో యొక్క అలవాటునకు వశులై యుండుటచే దానివలన అట్టి స్వభావము గల్గియున్నారని బోధపడును. కావున ప్రకృతిగుణము లుండువరకును సత్యము తెలిసికొనుట కెవరికిని సాధ్యము కాదు. అతీంద్రియ జ్ఞానముగల యోగులకు అతిదూరముగా నుండు శబ్దమును వినుశక్తియు, వస్తువులను కనుగొనుశక్తియునుండును. గొప్పసిద్ధ పురుషులకు త్రికాల జ్ఞాన ముండును. ఇట్టిమహిమయు తపోయోగాదులచే అంతఃకరణమందు కలిగిన మార్పేగాని వేరుగాదు. గీతాచార్యులీ విషయమై యిట్లుపదేశించియున్నారు.

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప! ॥

ఓ యర్జునుడా! జన్మించుకాలమున ఇచ్ఛాద్వేషముల వల్ల బుట్టిన ద్వంద్వమోహముచే సమస్త ప్రాణులును మిక్కిలి మోహమును పొందు చున్నవి. సృష్టికాలములో జన్మాంతరకర్మానురూపమగు సంస్కారము ననుసరించి సత్త్వగుణము కాని, రజోగుణము కాని, తమోగుణము గాని మిశ్రగుణము గాని, విశుద్ధగుణము గాని జీవకోట్లు గల్గియుండును. వాటి నన్నింటిని ఈ జన్మలో రహితమొనర్చిననే జీవన్ముక్తి గల్గును. ఈ సంస్కారము పుష్పములో గంధమేలాగున సంధిరపబడి యుండునో అలాగుననే యుండునని గీతాచార్యు లుపదేశించిరి, ఎట్లన,

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥

అనగా, దేహేంద్రియాది సంఘాతమునకు స్వామియగు జీవుడు ఎప్పుడీ శరీరమునుండి బయలుదేఱి మరియొక శరీరమును పొందుచున్నాడో, అప్పుడు పరిమళమునకు స్థానమైన పుష్పము మొదలగువానినుండి వాయువు వాసనగల సూక్ష్మాంశములను స్వీకరించిపోవునట్లే మనస్సుతోకూడిన యింద్రియములను స్వీకరించి పోవుచున్నాడు ఇహలోకమునుండి పరలోకమునకు జీవు డేలాగున పోవుచుండునో పరలోకమునుండి యిహలోకమునకును ఆలాగున వచ్చుచుండును. ఇది మానవులకు గల్గియుండేలాగున దేవతలకున్ను, అసురులకును రాక్షసులకు గూడ వ్యాపించియుండునదే గీత చూడుడు.

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః॥

ప్రకృతివలన బుట్టిన సత్త్వాదులను మూడు గుణములచేత విడువబడిన స్థావర జంగమాదిరూపమైన వస్తువు మనుష్య లోకముననైనను స్వర్గాది లోకముననైనను. దేవతలలోనైనను మఱియెక్కడననైనను, లేదు. దీనిని యోచించిన,, చతుర్దశ భువనములలోగల జీవకోట్లన్నియు ఏదో యొక విధమగు ప్రకృతిగుణముతో కూడియున్నట్లు గోచరమగుచుండును. కావుననే గీతలో 14వ అధ్యాయమున నిట్లు చెప్పబడినది.

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥

అనగా జీవుడు దేహమువలన బుట్టిన సత్త్వాదులగు మూడు గుణములను దాటి, పుట్టుక, చావు, ముదిమి, దుఃఖములు అనువానిచే యీశరీరముననుండినను విడువబడినవాడై (జీవన్ముక్తుడై) మోక్షమును పొందుచున్నాడని యరము.

కావున ముముక్షువులు ఈ త్రిగుణములలో ఏగుణమైనను తమలో నుండినచో దాని యొక్క ప్రభావమే మనలను ఈలాగున ప్రవర్తింపజేయు చున్నదని తెలిసికొని అట్టి గుణములను రహితమొనర్చుటకు చూడవలెను. అట్టి వారు ధన్యాత్ము లగుదురు. బంధ విముక్తికలుగు వఱకు అట్టి పరమసత్యము పైననే ఆధారపడియుండవలెను. సత్యము ఒకే వస్తువుగను, ఒకే రూపముగాను ఉండునేగాని అనేకరూపములు గాను, అనేక విధములు గాను ఉండునది కాదు. అట్లనేక విధముల నుండునది సత్యము కాదు. సత్యమే సద్వస్తువు; అదే ఈశ్వర స్వరూపము; అదే బ్రహ్మము; అదే భగవత్థ్సానము; అదే కైవల్యము. జీవులకు అట్టి పరమ సత్యమును తెలియ నీయక మాయ అంతఃకరణమున జేరి మోహమును కలుగజేయుచుండును. ఇదే దీనిలోగల మర్మము. సత్య మెల్లప్పుడును ఏకరీతిగనే యుండవలెను. ఏ కాలమందును దానికేలాటి మార్పును కలుగగూడదు.

ఈ ధర్మము నాధారముగ జేసికొని చూచిన మనకు చిన్న కాలము నుండి యిప్పటివఱకు ఎన్నిమార్పులు గలిగినవో తెలియందగును. ప్రాకృత గుణమునకు మాత్రమే పరిణామము కల్గును, కావున శైశవావస్థనుండి కలుగుచు వచ్చిన మార్పు లన్నియు అంతఃకరణములోగల ప్రకృతిగుణములే. ఇంకను మార్పుగలుగుచుండిన అవియున్నూ, ప్రకృతియొక్క స్వభావము లనియే గ్రహించవలెను, అయితే యీ అవిద్య త్రిగుణాత్మక మనబడును. సత్వగుణమనియు, రజోగుణమనియు, తమోగుణమనియు త్రిగుణములకు పేర్లు. అవి ఒక్కొక్క దానిలో నొక్కొక్కటికలసి యనేక భేదములుగ నుండును.

బాల్యకాలమున ఆటలలో సౌఖ్యము గలదను తలంపు గల్గియుండును; దానికి మించిన సుఖ మాతనికి కన్పించదు: కొంతకాలము గడచిన పిదప, విద్యాభ్యాసములోను, దానికి సంబంధించిన కార్యములలోను మనస్సు మగ్నమైపోవును. అప్పుడట్టి స్వభావమునకు మించిన జీవితము మానవ జీవితమే కాదను తలంపు గల్గును. పిదప యటనుండి యౌవనదశకు వచ్చును. ఆపత్తు లన్నిటికిని, వ్యామోహము లన్నిటికినదే తగిన కాలము. ప్రకృతి అప్పటికి బాగుగ వికాసము పొంది యుండును. మాయయొక్క

మహిమ లన్నియు అతనియందు సంస్కారము ప్రదర్శింపజేయు చుండును. అత్తటి స్త్రీలకైనను పురుషులకైనను వైవాహిక సుఖమునకంటె మించిన సౌఖ్యము ప్రపంచములో లేదను తలంపు గలిగించును. కొంతకాలము మలినమైన ఆ విషయములోనే జీవులు కాలము గడుపుదురు. అత్తరుణమున ఎట్టి హీన విషయము గూడ మహాశ్రేష్ఠముగ తోచుచుండును. మలమూత్ర మయమగు శరీరములో బంగారముకన్న అధికమగు ప్రీతిగల్గియుండును. అమృతము కూడ దీనికి మించినదను తలంపు గలుగదు, శరీరములోగల నవద్వారములనుండి యుద్భవించెడు మలము లన్నియు పీయూషముకన్న ఎక్కువ మహిమగలవని మాయాప్రభావముచే జీవులు తలంతురు.

అకటా! అవిద్యయొక్క ప్రభావ మేమని వర్ణింపవచ్చును! ఎంత మేధాసంపత్తి గలవానిని కూడ యేమియు తెలియని పరమ మూఢునిగ నొనర్చు ఈ అవిద్యయొక్క శక్తి నేమని వర్ణించవచ్చును? జ్ఞానులనుకూడ మహామోహచక్రమున పడవైచి త్రిప్పునట్టి యీ అజ్ఞానముయొక్క శక్తి నేమని తలంచవచ్చును? మలమును నిర్మలముగాను, దుఃఖమును సుఖముగాను, బంధమును మోక్షముగాను, తలంపచేసెడి ప్రకృతియొక్క మహాత్మ్యము నేమని వర్ణింపగలము?

దీనియందు కొంతకాలము గడిపిన పిమ్మట సుకృతవిశేష ముండిన, అంతఃకరణము కొంచెముగ శుద్ధమై పై వర్ణించిన వన్నియు మాయయొక్క మహిమవలన గల్గిన మోహమనియు, ఇంద్రజాలమువలె నవి నశ్వరము లనియు, అంతేకాదు, దుఃఖహేతువులని గూడ తలంపుగల్గును. ఇప్పటికెన్ని మార్పులుగల్గినవో లెక్కపెట్టుకొనుడు. సుకృతవిశేషము లేని జీవికైనచో ఆ మాయామోహములోనే వార్ధక్యముకూడ గడచిపోవును.

అట్లుగాక దైవకృప గల్గిన జీవియైనచో ఈ మార్పు లన్నిటికిని మనస్సే కారణమనియు, ఈ ప్రపంచము కలలో కల్పించెడి లోకమనియు నిశ్చయించుకొనును, అపడే దీనినుండి నివృత్తిని బొందెడి మార్గము కలదా యను విచారణ గలుగును. అత్తటి ఈశ్వరప్రార్థన, పుణ్య కర్మలు, పవిత్రమైన వ్రతములు, దివ్యమంత్రముల జపములు, తీర్థయాత్రలు మొదలగు పవిత్రమార్గములలో ప్రవేశము గల్గును. అందువలన అంతఃకరణశుద్ధి

మఱింత యెక్కువగుటచే ప్రపంచమందు సంపూర్ణ విరక్తిగల్గును. మాయ యొక్క మహామహిమయే ఇదంతయునని తెలిసికొనును. అప్పుడు పరమై కాంతమున ప్రవేశించి, తపస్సు, యోగము మొదలగు ఆత్మప్రాప్తికి ముఖ్యమగు సాధనలను శ్రద్ధతోను; తీవ్రవేగముతోను అనుష్ఠించుచుండును. అత్తరుణమున దానికి మించినది లేదనియు, ఇంతవఱకు ప్రారంభించిన జప తపః ప్రార్థన వ్రతాదులు ఎక్కువ కాదనియు, ఇప్పుడుగల నిష్ఠయే అన్నిటి కెక్కుడనియు బోధము గల్గును. ఇప్పటి కెన్ని మార్పులు గల్గినవో యోచించు కొనవలెను ఎన్ని పరిణామములు మాఱివచ్చినవో విచారణీయము.

పై జెప్పిలాగున జ్ఞానతపస్సుచేతను, ఆత్మజ్ఞానసంధానమగు యోగ నిష్ఠచేతను, అంతఃకరణము మఱింత శుద్ధమగుచుండగా వీటివలన యథార్థ తత్త్వము బోధము కాజాలదనియు, ఉత్తమబ్రహ్మనిష్ఠులగు గురువుల సహాయముచే నిజమగు వస్తుతత్త్వము తెలిసికొనవలెననియు బోధ ముదయించును. అంతఃకరణము చాల నిర్మలస్థితికి వచ్చుటచే మనస్సులో ఇంతవరకు గల్గివచ్చిన మార్పులన్నియు బోధమునకు వచ్చును. కావున, హృదయము పరివర్తనము గలుగక నిశ్చలస్థితిలో నుండుటకును, తనలోగల లోపములను సవరణ చేయుటకును, ప్రకృతి కావల ప్రకాశించు ప్రకాశము లోనికి ప్రవేశించుటకును తగిన ఆచార్యుడావశ్యకమని తోచును. ఏలన ఇంతవఱకు వచ్చిన దారులన్నియు, పరిణామములన్నియు, అంతఃకరణమొక్క పరిణామమే గాని, నిజమైన ఆత్మలో (ఈశ్వరునితో) మన మింకను ప్రవేశించియుండలేదనియు అతనికి నిశ్చయమగు నమ్మకము గలుగును. ఏలన, ఆత్మ పరిణామము లేనిది స్వయంప్రకాశమైనది. గుణముల యొక్క లేశమైనను స్పర్శింపనిది, నిత్యమైనది అని శ్రుతివాక్యములు దెల్పుచుండగా, అట్టి స్థితి తనకు గల్గినదా, లేదా యని తనలో యోచించుకొనుచుండును. అపుడీ యంతఃకరణమును, మనస్సును, బుద్ధిని ప్రకాశింపజేయు

ఒకటి వీటన్నిటికంటె పై భాగమున ఏ వికారము కలుగక స్వయం ప్రకాశమై యుండుననియు, అది అమృతమనియు, అనంతమనియు, బ్రహ్మాది స్తంబపర్యంతమన్నిటిలో అంతర్యామియై ప్రకాశించుననియు, తనలోను, తాను భజించు దైవములోను, తన కాత్మతత్త్వ ముపదేశించు గురువులోను వెలుగుచున్నదనియు బోధము కల్గును. దానివలననే యిన్నియు

ప్రకాశించుచున్నవి; కావున ఈ బుద్ధియు, మనస్సున్ను, అంతఃకరణమున్నూ జడములు, ఇంతవఱకు వీటిననుసరించియే మనము ప్రవర్తించితిమి. ఇపుడి వన్నియు బంధముతో కూడినవే. ఇవి సత్యము లని నమ్మి మోసపోయితిమి. అను దృఢబోధము గల్గును. అట్టి ముండకశ్రుతి జ్ఞాపకమునకు వచ్చును.

న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః ।
తమేవ భాంత మను భాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి॥

సర్వప్రకాశకుడగు సూర్యుడు ఆత్మభూతుడగు ఆ పరబ్రహ్మమును ప్రకాశింపచేయజాలడు. చంద్రుడు, నక్షత్రములున్నూ ప్రకాశింపచేయ జాలవు, ఈ మెఱుపులును. ప్రకాశింపచేయజాలవు. మన కనుల కెదుట కనబడుచున్న ఈ అగ్నిహోత్రుడెట్లు ప్రకాశింపజేయును? అంతట ప్రకాశిం చుచున్న ఆ పరమేశ్వరుని అనుసరించే సర్వము ప్రకాశించుచున్నది. ఈ ప్రపంచమంతయు ఆ పరమేశ్వరుని ప్రకాశము చేతనే ప్రకాశించుచున్నది

అట్టి ఆ సత్యస్వరూపమగు ఆత్మను ఈశ్వరునిగా తెలిసికొనును. సమస్తమతములయొక్క సారమొక్కటియే యను నిజతత్త్వము గోచర మగును. శ్రుతులన్నియు ఈ తత్త్వమునే యుపదేశించుచున్నవి. అట్టి వాక్యము లన్నింటిని ఇచట వ్రాయదలంచిన విషయము పెరిగిపోవును. శివమహిమ్నః స్తోత్రములో గల పరమతత్త్వ మిదియే ఇది మానవ ప్రణీతము గాదు. పుష్పదంతుడను గంధర్వునిచే ప్రణీతము.

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః తథ్యమితి చ ।
రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిలనానాపథజుషాం
నృణామేకో గమ్యస్త్వమసి తయసా మర్ణవ ఇవ ॥

వేదమతము, సాంఖ్యమతము, యోగమతము, శైవమతము, వైష్ణవ మతము మొదలుగాగలవన్నియు పరమ సత్యమగు బ్రహ్మమునే ఉపదేశించు

చున్నవి. మార్గములు వేర్వేరుగా నున్నను జలప్రవాహము లన్నియు మహాసముద్రమును చేరునట్లు, భక్తులయొక్క అభిరుచి ననుసరించి వేర్వేరు భావనచే యుపాసన చేయుచున్నను, అందఱును ఆ పరమేశ్వరునే పొందు చుందురు. అదియే పరమసత్యము, దానినే బ్రహ్మమనియు, ఈశ్వరు డనియు, మహాశక్తియనియు, పరాశక్తియనియు పలు పేరతో పిలిచెదరు.

యం శైవాస్సముపాసతే శివ ఇతి. బ్రహ్మేతి వేదాన్తినః
బౌద్ధా బుద్ధ ఇతి, ప్రమాణ పటవః కర్తేతి నైయాయికాః।
అర్హన్ కథ్యతి జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోయం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో విభుః॥

శైవులు దేనిని శివమని చెప్పుచున్నారో, వేదాన్తులు దేనిని బ్రహ్మ మనుచున్నారో, బౌద్ధులు దేనిని మహాబోధితత్త్వమనియు, నిర్వాణమనియు, బుద్ధదేవుడనియు వచింతురో, న్యాయశాస్త్రనిపుణులు దేనిని కర్తయను చుందురో, జైనశాస్త్రరతులు దేనిని 'అర్హత్' అని తలంచుదురో, కర్మ నిరతులగు మీమాంసకులు అన్నిటికి కర్మయే కారణమని యెద్దానినిగూర్చి చెప్పుచుందురో, వైష్ణవులు విష్ణువని దేనిని వచింతురో, అలాగున దేనిని క్రైస్తవులు దేవుడనియు, మహమ్మదీయులు అల్లాయనియు వచింతురో, అట్టి త్రైలోక్యనాథుడగు ప్రభువు మనందఱి యొక్క వాంఛితమును సఫల మొనర్చునుగాక! అందఱియొక్క దుఃఖమును శమింపచేయునుగాక! నిత్య ముక్తిపదమును అందఱికిని గలుగ జేయునుగాక!

మహావాక్యము స్వానుభవముగల గురువులయొద్ద శ్రవణము చేయ వలయుననియు, అట్టి మహాపురుషుల సమీపమున వినయ విధేయతలుగల్గి వర్తింపవలెననియు, అట్లుకానిచో ఈపరమసత్యము బోధము కాదనియు ఆత్మలో సంకల్పము గల్గును. అట్టి మహావాక్య శ్రవణభాగ్యము గలుగు నప్పుడు ఆత్మానుసంధానపరుడై, తాను శివజీవైక్యానుభవము గలిగినవా డనియు, తరించినవాడనియు, జన్మము యొక్క అంత్యము కనుకొనినవా డనియు, జననమరణ రహితుడనియు బోధము కల్గును. అదే పరమప్రాప్యము; ఆవల పొందవలసినది మఱొకటి లేదు. అంతర్యామిత్వావస్థయు నశించి

దృగ్దృశ్యములయొక్క ఏకత్వమున్నూ, ధ్యాతృధ్యేయముల యైక్యమున్నూ అప్పుడు గల్గును. ఇత్తఅిమాత్రమే భ్రమలన్నియు సడిగిపోవును. ప్రకృతి యొక్క పరిణామమంతయు నశించును. మాయయొక్క మహిమ మటు మాయమై పోవును. కర్మలన్నియు నశించును. సంశయములన్నియు తొలగును. భవబంధములన్నియు నశించును. అప్పుడు శరత్కాల పౌర్ణమిదినము షోడశ కళాపూర్ణచంద్రునివలె అమ్మహాత్ముడు ప్రకాశించును అదే శివము, అమృతము; ఆనందము, దైవము. ఓం తత్ సత్.

## సత్యమార్గము

దీనిలో నడచుటకు ప్రారంభించినపుడే నిజముగ ఈశ్వరుని విషయములో అడుగుపెట్టినవార మగుదుము. వేదాంతమార్గములో గల యనేకు లున్నూ, సత్యమార్గమునుండి దూరులుగా నున్నారనియే చెప్పవచ్చును. దీనికి కారణమేమన, పరిశుద్ధమగు సత్యములో జీవితము గడపి సత్ స్వరూపుడగు సర్వేశ్వరుని సాక్షాత్కరించిన జీవన్ముక్తులు, బ్రహ్మనిష్ఠులు ప్రస్తుతము మనసేత్రములయెదుట కనుపడకపోవుటయే. అట్టివారుండిన వారినే ముముక్షువులు మార్గదర్శకులుగ జేసికొని బ్రహ్మనిష్ఠామార్గమున నడుతురు, అట్టి దివ్యపురుషుల దర్శనము లభించనిచో ఎన్ని శాస్త్రములు చదివినను నిజమగు మార్గమిదియని నిశ్చయము గలుగదు. ఇప్పుడుండువారిలో కొందఱు హీన కర్మలు చేసియు (ఆత్మజ్ఞానిని) అతీంద్రియజ్ఞానిని కర్మలు బాధింపవని చెప్పుచుండు పరమ పవిత్రములగు శ్రుతివాక్యముల నుదాహరింతురు. ఆత్మజ్ఞానికి బంధనము లేకున్నను, తామట్టి ఆత్మజ్ఞానులై తిమా యని విచారణ చేయువారరుదైరి. కర్మయొక్కఫలము అతి నిగూఢమైనది, తాను ఏవిత్తనము పెట్టునో, అదే వృక్షమై ఫలించునట్లు, జ్ఞానికిగాని అజ్ఞానికిగాని కర్మఫలము వెంబడించుచుండును. విత్తనమొకటి దానివలన కలుగు ఫలము మఱియొకటి చేయుశక్తిగల యోగులుగాని, జ్ఞానులుగాని యుండిరేని, వారలను మాత్రము కర్మము బాధింపనేరదని నమ్మవచ్చును. ఈవిషయమై వాసిష్ఠ రామాయణములో శ్రీరామచంద్రులకు వసిష్ఠ మునీంద్రుడు ఉపదేశించిన

యో యాదృక్ క్లేశమాధాతుం సమర్థస్తాదృగేవ సః ।
అవశ్యం ఫలమాప్నోతి ప్రబుద్ధోఽ ప్యజ్ఞ ఏవ వా ॥

జ్ఞానియైనను, అజ్ఞానియైనను. వారివారి కర్మల కనురూపమగు ఫలమును తప్పక పొందుదురు, కాన జ్ఞానిగాని, అజ్ఞానిగాని యిరువురును ఆకాశగమనాది సిద్ధులగూర్చి తాము చేయుయత్నము ననుసరించియే వాటిని బొందుదురు.

ఆమోదశ్చందనస్యేవ స్పందనస్య ఫలం హృది ।
సర్వస్యైవాస్తి తన్మానం తద్వతా సమవాప్యతే ॥

శ్రీగంధమందు సుగంధమువలె విహితనిషిద్ధకర్మలఫల మందఱి యందు నుండియే యుండును (కలుగునని భావము). కాలక్రమమున అట్టి క్రియాఫలమును వా రవశ్యము పొందెదరు.

సంవిదుద్బోధనే బంధ స్తదనుద్బోధనే శివమ్ ।
ఆసత్సద్వజ్జగద్భాతి సంవిదుద్బోధనోదరమ్ ॥

చిత్తవృత్తిని బహిర్ముఖ మొనర్చుటయే బంధము. ధ్యానము (సమాధి)చే దాని నాత్మయందు లీన మొనర్చుటయే మోక్షము చిత్తవృత్తిని బహిర్ముఖమొనర్చుటచేతనే అసత్తగు యీ జగత్తు సత్యముగ తోచుచున్నది.

అజడం వేదనం ప్రోక్తం మోక్ష ఇత్యభిధీయతే।
ప్రబుద్ధః బంధ ఇత్యాహురధిచ్ఛసి తదాహర॥

ఓ రామచంద్రా! జగత్తుయొక్క నామరూపరహితమగు చైతన్య స్థితియే మోక్షమనియు, నామరూపసహిత దృశ్యస్థితియే బంధమనియు చెప్పబడును. ఈ రెంటిలో నీకేయది యిష్టమో దానినే యభ్యసింపుము.

నికటస్థః శివః స్పృష్టః సమనాగ్రభ్రమంతికమ్ ।
వాడవోఽగ్నిః స్వనాశాయావహం త్యేవాంబులేఖయా॥

చిదాకాశమున నృత్యము చేయుచున్న శివసంకల్పస్వరూపిణియగు ప్రకృతి, సమీపమునసున్న శివుని స్పృశింపగనే క్రమముగ తన యూనవరణ

శక్తిని గోల్పోయి, సముద్రజలము బడబాగ్నిని స్పృశించి తద్రూపమే యగునట్లు: శివునియందైక్యమగుచున్నది.

చితిః శివేచ్ఛా సా దేవం తమేవాసాద్యశామ్యతి।
జన్మస్థాన శిలాం ప్రాప్య తీక్ష్ణధారా యథాయసీ ॥

పదునైన యినుపకత్తిని తన యుత్పత్తిస్థానమగు భూమియందుంచినచో క్రమముగ నది తనరూపమును గోల్పోయి మట్టియై భూమియందే లయమగునట్లు, శివేచ్ఛాస్వరూపిణియగు చిత్ శక్తి (ప్రకృతియు) శివుని పొంది వానియందే లయించుచున్నది.

జ్ఞాతజ్ఞేయస్య మనసో నూనమేతద్ధి లక్షణమ్।
న స్వదంతే సమగ్రాణి భోగవృందాని యత్పునః॥

జ్ఞేయవస్తువగు ఆత్మ (బ్రహ్మము) నెఱింగిన వానికిక భోగములు రుచింపవు. ఇదియే నిశ్చయముగ జ్ఞాతజ్ఞేయుని లక్షణము.

స్వాత్మతత్త్వాభిగమనం భవతి ప్రాయశో నృణామ్।
మునే విషయవైరస్యం కదర్థానుపజాయతే ॥

ఆత్మజ్ఞానము శ్రవణాదుల మూలమున ప్రాయశః లభింపవచ్చును. కాని విషయవైరాగ్యము చేకూరుట మాత్రము బహుదుస్తరము.

తస్మాత్ పౌరుష మాశ్రిత్య సచ్ఛాస్త్రైః సత్సమాగమైః।
ప్రజ్ఞామమలతాం నీత్వా సంసారజలధిం తరేత్॥

కాన పురుషప్రయత్నము నాశ్రయించి సచ్ఛాస్త్రసత్సాంగత్యములచే బుద్ధిని శుద్ధ మొనర్చుకొని, సంసారసాగరమును దాటవలెను.

యస్తూదార చమత్కారః సదాచారవిహారవాన్।
స నిర్యాతి జగన్మోహాత్ మృగేంద్రః పంజరాదివ ॥

నిరంతరము యత్నశీలుడై, సజ్జనులును జ్ఞానులునునగు మహాత్ముల యుత్తమ ఆచారములగల్గి వర్తించువాడు బోనునుండి సింహమువలె జగన్మాయనుండి బయల్వెడలును.

సవివేకో హి శాస్త్రస్య జ్ఞానస్య తపసః శ్రుతేః।
భాజనం భూషణాకారో భాస్కర స్తేజసామివ ॥

వివేకవంతుడే శాస్త్ర, జ్ఞాన, తపః, శ్రవణాదుల కర్హుడు. ప్రకాశ వంతములగు పదార్థములలో-సూర్యునివలె యాత డందరిలోను అగ్రగణ్యుడగును.

శమేనాసాద్యతే శ్రేయః శమో హి పరమంపదమ్।
శమః శివః శమః శాంతిః శమో భ్రాంతినివారణమ్॥

శమముచేతనే మోక్షప్రాప్తి చేకూరును. శమమే యుత్తమ పదము. శమమే శుభప్రదమైనది. శాంతికి మూలము శమమే. శమము చేతనే భ్రమ తొలగును.

విచారచారవో జీవా భాసయన్తో దిశో దశ।
భ్రాన్తి భాస్కరవన్మూనం భూయో భవభయాపహాః॥

ఉత్తమ విచారణగల్గి శోభించు జీవన్ముక్తులు దశదిక్కుల ప్రకాశింపచేయుచు అనేక జీవుల సంసారభయమను అంధకారమును తొలగించుచు సూర్యునివలె నిక్కముగ వెలుగొందుచుందురు.

వరం కర్దమభేకత్వం మలకీటకతా వరమ్
పరమన్ధగుహాహిత్వం న నరస్యావిచారతా॥

బురదయందు కప్పయైయుండుట మేలు; మలమందు క్రిమియై యుండుట మేలు; చీకటి గుహయందు సర్పమైయుండుట మేలు; కాని మనుజునకు విచారణజ్ఞానము లేకయుండుట ఉత్తమము కాదు.

వరం శరావహస్తస్య చండాలాగారవీథిషు।
భిక్షార్థమటనం రామ న మౌర్ఖ్యహతజీవితమ్॥

ఓ రామా! చేతియందు పాత్రనుంచుకొని వీథులలో సంచరించుచు చండాలుని గృహమందు బిచ్చమెత్తుటమేలు. కాని అజ్ఞానముతో కూడియుండు జీవిత ముత్తమము గాదు.

యోఽస్మాత్తాతస్య కూపోఽయమితి కౌపం పిబత్యపః।
త్యక్త్వా గాంగం పురస్థం తం కోఽనుశాస్త్యతిరాగిణమ్॥

ఇది మా తండ్రి త్రవ్వించిన నూయి యని తలంచి ప్రక్కనున్న పవిత్ర గంగాజలమును వదలి, అందలి మురికినీటినే త్రావనెంచువానివలె రాగియైన మూర్ఖునకెవరు బోధింపగలరు?

యస్మై నేదం త్వరుచయే రోచతే దుష్కృతోదయాత్।
విచారయతు యత్కించిత్సచ్ఛాస్త్రం జ్ఞానవాఙ్మయమ్॥

శ్రేష్ఠమగు ఔషధముచే ఆరోగ్యము కలుగునట్లు, ఈ యోగవాసిష్ఠ గ్రంథ శ్రవణముచే మనుజునకు జీవన్ముక్త్యనుభవము కలుగును.

ఓముచ్చారణసంవిత్తి వేదనాచ్చ ప్రపశ్యతి।
యత్కరోతి మహారాజ్యం భవత్యాశు స తన్మయః॥

ఓంకారము నుచ్చరించుచు దాని యర్థమును భావించుచు బ్రహ్మదేవుడు మనస్సుచే ఎద్దానిని సంకల్పించునో, శీఘ్రముగ ఆ రూపమునే పొందును. అనగా, తన మనఃకల్పన ననుసరించియే పదార్థములు వ్యక్తమగుచుండుటను గాంచును.

యదార్యగర్హితం యద్వా న్యాయేన న సమార్జితమ్।
తస్మాద్ గ్రాసాద్వరం మన్యే మరణం దేహినామిదమ్॥

పూజ్యులగు మహాత్ములచే గర్హితమును, అన్యాయోపార్జితమును నగు అన్నమును భుజించుటకంటె మరణించుటయే శ్రేష్ఠతరము.

గచ్ఛ కర్కటి మూఢాంస్త్వం జ్ఞానేనాశ్వవబోధయ।
మూఢోత్తారణమేవేహ స్వభావో మహతామితి॥

ఓ కర్కటీ! నీవజ్ఞుల చెంతకు బోయి వారలకాత్మబోధ గావింపుము. ఏలయన, మూఢజనుల యజ్ఞానమును తొలగింపుటయే మహాత్ముల స్వభావమగును. (ఇట్లాకాశవాణి కర్కటియను రాక్షసినిగూర్చి వచ్చెను)

శివదంతే హ్యసంబుద్ధాః స్వవికల్పవిజృంభితైః।
ఉపదేశాదయం వాదో జ్ఞాతే ద్వైతం న విద్యతే॥

అవివేకులు తమ తమ కల్పనలగూర్చి వాదవివాదముల జేయు చుందురు. ఈ భేదదృష్టియంతయు వేదాంతోపదేశమునకు పూర్వమే యగును. ఏలన, తత్త్వ మెఱింగిన పిదప ఇక ద్వైతస్ఫురణయే యుండదు.

అస్యేపి సావధానా యే ధీరాః సురమహర్షయః।
చిత్తాత్స్వమనుసంధానం న త్యజంతి మనాగపి

సావధానచిత్తులును, ధీరులునునగు ఇతర దేవ, మహర్షులు గూడ ఉపాసనాజ్ఞానముల తమ చిత్తమునుండి తొలగింప నొల్లరు.

మనసైవ మనస్తస్మాత్పౌరుషేణ పుమానిహ।
స్వకమేవ స్వకేనైవ యోజయేత్పావనే పథి॥

కాన సాధకుడు స్వతః పురుషప్రయత్నముచే మనస్సుచేతనే మనస్సును పవిత్రమార్గమందు నియోగించవలెను.

ప్రతిభాసస్యానుపదం ప్రాక్తనీం స్థితిముజ్ఝతి।
కులాలకర్మానుపదంఘటో మృత్పిండతామివ॥

కుమ్మరివాని క్రియచే ఘటము తన పూర్వపు మృత్తికాదశను త్యజించునట్లు, దృఢవాసనా ప్రాబల్యముచేతను దృఢభావనచేతను మనస్సు తన పూర్వస్థితిని, పూర్వసంస్కారములను త్యజించును.

మహాసత్త్వగుణోపేతా యే ధీరాః సమదృష్టయః।
అనిర్దేశ్యకలోపేతాః సాధవస్త ఉదాహృతాః॥

విశుద్ధ సత్వగుణముకలవారును, ధీరులును, అనగా విషయములచే గాని, దుఃఖములచేగాని చలింపనివారును సమదృష్టిగలవారును బ్రహ్మ సాక్షాత్కారము బడసి అవర్ణనీయమగు ఆనందము ననుభవించువారును సాధువు లనబడుదురు.

సాధు సంవ్యవహారార్థం శాస్త్రం యో నానువర్తతే!
బహిఃకుర్వంతి తం సర్వే న చ దుఃఖే నిమజ్జతి॥

సాధువుల యాచారవ్యవహారముల దెల్పు శాస్త్రముల ననుసరించని వానిని సజ్జనులు బహిష్కరింతురు. మఱియు నాతడు దుఃఖమునే పొందును.

వహ్న్యౌష్ణ్యయోరివ సదా శ్లిష్టయోశ్చిత్తకర్మణోః।
ద్వయోరేకతరాభావాద్ద్వయమేవ విలీయతే.

అగ్నియుష్ణత్వములవలె నెల్లప్పుడు కలసియేయుండు చిత్తకర్మల రెంటిలో యొకటి లేనిచో రెండును లేకపోవును.

జాగ్రచ్ఛాభిమతం వస్తు నయత్యమృతమృష్టతామ్।
అనీహితం చ విషతాం నయత్యమృతమప్యలమ్॥

వివేక ముదయించుచున్నను రాగాదుల ప్రభావముచే మనస్సు విషము (స్వాదరహితవస్తువు) నమృతముగను. అమృతమును విషముగను నొనర్చుచు నేయుండును.

అమృష్ట సర్వభావానామలమాత్మచమత్కృతిమ్।
మనః స్వాభిమతాకారం రూపం సృజతి వస్తుషు॥

పరిపూర్ణమగు ఆత్మసాక్షాత్కారము బడయనివాని చిత్తమే పదార్థముల నభిలషించుచు వాటి గూర్చిన కల్పనల జేయుచుండును గాని పూర్ణసాక్షాత్కారముగల తత్త్వజ్ఞానుల చిత్తమట్లుగాదు.

స్వాయత్తమేకాంతహితం స్వేప్సితత్యాగవేదనమ్।
యస్య దుష్కరతాం యాతం ధిక్తం పురుషకీటకమ్॥

తన యధీనమునందున్నదియు, సర్వవిధముల హితమునే గలుగ జేయునదియునగు అభిలషిత విషయములయెడ వైరాగ్యవృత్తి యెవరికి దుష్కరమైయుండునో అట్టి మనుజకీటకమునకు ధిక్కారమగుగాత!

నాహంబ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాద్బధ్యతే మనః।
సర్వం బ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాన్ముచ్యతే మనః॥

నేను బ్రహ్మముగానను దృఢసంకల్పముచే మనస్సు బంధనమును తగుల్కొన్నట్లు అంతయు నాత్మస్వరూపమగు బ్రహ్మమే యను దృఢసంకల్పముచే నద్ది బంధవిముక్తిని బడయును.

సంకల్పః పరమో బంధస్త్వసంకల్పో విముక్తతా।
సంకల్పః సంవిజిత్యాంతర్యథేచ్ఛసి తథా కురు॥

సంకల్పమే గొప్పబంధనము. సంకల్పరాహిత్యమే ముక్తి, ఓ రామచంద్రా! నేను బ్రహ్మనుగానను సంకల్పమును, అంతయు నా స్వరూపమగు బ్రహ్మమేయను విరోధసంకల్పజనిత జ్ఞానముచే జయించి, పిమ్మట నీకోర్కె చొప్పున ఆచరింపుము.

ఇంద్రియగ్రామసంగ్రామ సేతునా భవసాగరః।
తీర్యతే నేతరేణేహ కేనచిన్నామ కర్మణా॥

సర్వేంద్రియజయమను వారధిచే గొప్పదగు సంసారసాగరము దాటబడునుగాని, మఱియే కర్మచేతను గాదు.

చిత్రామృతం నామృతమేవ విద్ధి
చిత్రానలం నానలమేవ విద్ధి।
చిత్రాంగనా నూనమనంగనేతి
వాచావివేక స్త్వవివేక ఏవ॥

ఓరామచంద్రా! చిత్రమందలి అమృతము అమృతముకాదు. చిత్రమందలి అగ్ని అగ్నికాదు. చిత్రమందలి స్త్రీ స్త్రీకాదు. ఇట్లే వాచా వివేకము వివేకము కానేరదు. అది అవివేకమే యగును.

విచారః సఫల స్తస్య విజ్ఞేయో యస్య సన్మతేః।
దినానుదినమాయాతి తానవం భోగగృధ్నుతా॥

ఏసద్బుద్ధియొక్క భోగలాలసత దినదినము క్షీణించుచుండునో, అట్టివానిచే నొనర్పబడు విచారణయే సఫలమగును.

ఆస్థామాత్రమనంతానాం దుఃఖానామాకరం విదుః।
అనాస్థామాత్రమభితః సుఖానామాకరం విదుః॥

అసద్వస్తువందు సత్యత్వబుద్ధి గల్గియుండుటయే సర్వదుఃఖములకును నిలయము. అసద్వస్తువునందు సత్యత్వబుద్ధి లేకయుండుటయే సర్వసుఖములకును నిలయము.

సంశాంతాహంకృతేస్సంతోర్ధ్వోగా రోగా మహోత్సుకాః
న స్వదంతే సుతృప్తస్య యథాऽన్నా విషా రసాః॥

ఓ మహాత్మా! అహంకారము లెస్సగ నశించిన నిత్యతృప్తునకు రోగ రూపములగు భోగములు విషము వలె రుచింపకుండును.

భోగేష్వస్వదమానేషు పుంసః శ్రేయః పురోగతమ్।
క్షీణేంఽధకారే కిం నామ మనసోఽన్యత్ ప్రవర్తతే॥

మనుజున కెపుడు భోగములయెడ ప్రీతి తొలగునో అపుడు మోక్ష శ్రేయము వానియెదుట నున్నట్లే. ఏలయన, మనస్సునందలి యంధకార (దోష)మగు అహంకారము క్షయింప ఇక మఱియొక ప్రతిబంధమేమి గలదు?

క్రియావిశేషబహులా భోగైశ్వర్యహతాశయాః।
నాపేక్షం తే యదా సత్యం న పశ్యంతి శఠాస్తదా॥

అనేక క్రియాకలాపముల దగుల్కొని, భోగైశ్వర్యములచే నశించిన బుద్ధిగల జీవులు పరమాత్మ వైపునకు తమ చిత్తమును మరల్పనిచో ఆత్మ వంచకులై శ్రేయమును పొందకయుందురు.

యే తు పారంగతా బుద్ధేరింద్రియైర్న వశీకృతాః।
తఏనాం జాగతీం మాయాం పశ్యన్తి కరబిల్వవత్॥

బుద్ధినిగూడ నతిక్రమించినవారును; ఇంద్రియములకు వశులుకాని వారును నగు మహాత్ములు ఈజగన్మాయను అరచేతియందలి బిల్వఫలము వలె స్పష్టముగ గాంతురు.

సుఖోచ్ఛేద్యతయా జ్ఞస్య సంసారమలమాతతమ్।
తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా॥
నశ్యతి క్రియయా పుత్ర పురుషస్య తథా మలమ్।
నశ్యత్యేవ సందేహ స్తస్మాదుద్యమవాన్భవ॥

ఓ రామచంద్రా! ఈసంసారమాలిన్య విస్తారమంతయు జ్ఞానిచే సులభముగ నశింపజేయబడును. బియ్యపుగింజపై గల పొట్టు, రాగియందలి మాలిన్యము, దంపుట, స్ఫుటమొనర్చుట యను క్రియలచే తొలగునట్లు ఈ సంసారమాలిన్యమున్ను; జ్ఞానభూమికాభ్యాసమను పురుష ప్రయత్నముచే తప్పక నశించును. ప్రయత్న పరుడవు కమ్ము.

వృథా భవతి బాలేషు యథా రాగమయీ కథా।
నిరర్థకాల్పబోధేషు తథోదారోదయా కథా ॥

శృంగారరసయుక్తమగుకథలు బాలురకు బోధించిన నిరర్థక మగునట్లు అల్పజ్ఞానము గలవారియెడ మోక్షప్రాప్తి గూర్చిన యతీత బోధయు వ్యర్థమగును.

బద్ధోహి వాసనాబద్ధో మోక్షః స్యాద్వాసనాక్షయః।
వాసనాస్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వమపి త్యజ॥

ఓరామచంద్రా! వాసనలు గలవాడే నిజముగ బద్ధుడు. వాసనాక్షయమే మోక్షము.కాన నీవు వాసనలన్నింటిని తొలగించి తుదకు మోక్షాపేక్షను కూడా త్యజింపుము. (ఏలన, బంధమను అవస్థ యుండునపుడే ముక్తిబొంద తలంతురు· మోక్షావస్థయందు బంధమే లేదు గాన నిట్లు చెప్పబడినది )

కిం కిల స్ఫారమనసాం పశూనాం చ విశేషణమ్।
కృష్యం పశవో రజ్జ్వా మనసా మూఢచేతనః॥

దృశ్యవిషయములందు ప్రవర్తించు చిత్తముగల మనుజునకును, పశువులకును భేదమేమి? త్రాడుచే పశువు లీడ్వబడుచున్నవి; మనస్సుచేమూఢు లీడ్వబడుచున్నారు

అయం గుణసమాహారో బంధాయైవ సమాశ్రితః।
సంత్యక్తో భవ మోక్షాయ యథేచ్ఛసి తథా కురు॥

ఓ రామచంద్రా! త్రిగుణాత్మకమగు మాయారూపమైన యీ దృశ్యము నాశ్రయించుటచే బంధమున్ను, దీనిని పూర్ణముగ త్యజించుటచే ముక్తియు లభించునని యెఱింగి యిక నీయిచ్ఛ వొప్పున నొనర్పుము.

చిత్తతాం శృంఖలామేతాం స్వరూపజ్ఞానయుక్తితః।
బిలాచ్ఛిత్త్వాన్మహాబాహో స్వాత్మసింహం విమోచయ ॥

మహాబాహుడవగు నో రామా! చిత్తమను గొలుసును ఆత్మజ్ఞాన యుక్తిచే త్రెంపి ఆత్మయను సింహమును సంసారమను బోనునుండి విడిపింపుము,

ఓంకారాదర్ధమాత్రార్థం భావయన్మౌనమాస్థితః
సంశాంతసర్వసంకల్పః ప్రశాంతకలనాగణః॥

శాంతుడును సంకల్పరహితుడును, కల్పనా వర్జితుడునునయి బలిచక్రవర్తి ఓంకారముయొక్క త్రిమాత్రలకు పరమగు అర్ధమాత్రచే సూచితమగు తురీయాత్మస్వరూపమగు బ్రహ్మమునే భావించుచు మౌనము వహించియుండెను.

సర్వసంభ్రమసంశాన్త్యై పరమాయ ఫలాయ చ।
బ్రహ్మవిశ్రాంతిపర్యంతో విచారోఽస్తు తవానఘ॥

పాపరహితుడవగునో ప్రహ్లాదా! భ్రమయంతయు పూర్ణముగ నశింపుటకొఱకును, పరమానందస్వరూపమగు ముక్తియను ఫలము ప్రాప్తి నొందుటకొఱకును, బ్రహ్మమందు విశ్రాంతి లభించునంతవఱకు ఆత్మ విచారణ చేయుమనే యుండుము. (ఇట్లు శ్రీభగవానుడు ప్రహ్లాదున కుపదేశించెను.)

చేత్యహీనం చిదాలంబం మనో యస్య గతజ్వరమ్।
తేనాంబుకతకేనేవ జనతా సంప్రసీదతి॥

ఎవని మనస్సు విషయాసక్తిలేనిదై దుఃఖరహితమై యుండునో అట్టివానిచే జనులందరును కతకరేణువు (చిల్లగింజ)చే నీటివలె పరిశుద్ధత్వము జెందుదురు.

అపి శీతరుచావర్కే సుతప్తే పీందుమండలే।
అప్యధః ప్రసరత్యగ్నౌ విస్మయోఽస్య న జాయతే॥

సూర్యుడు చల్లబడినను, చంద్రుడుష్ణత్వము జెందినను, అగ్ని అధోముఖముగ జ్వలించినను ఆత్మజ్ఞాని కేమియు నాశ్చర్యము గలుగదు.

సత్తాలయం యాతి యత్ర నిర్వికారంచ తిష్ఠతి।
భూయో నావర్తతే దుఃఖే తత్ర లబ్ధపదః పుమాన్ ॥

ధర్మి, ధర్మముల విభాగమేమియులేని నిర్వికారపదమునందు స్థితి జెందినవాడిక దుఃఖభూయిష్ఠమగు సంసారమున తగుల్కొనడు. మోక్షమను పురుషార్థసాధనమున సమర్థుడగుటచే అట్టివాడే పురుషుడనబడును.

తద్ధేతు స్సర్వహేతూనాం తస్య హేతుర్నవిద్యతే।
సంసారః సర్వసారాణాం తస్మాత్సారం న విద్యతే॥

నిర్వికారమగు బ్రహ్మమే సర్వకారణములకును కారణము. దానికి మఱియొక కారణములేదు. అదియె సారవస్తువులన్నింటిలోను సారమైనది. కాన, అద్దానికి మించిన సారవస్తువు మఱొకటి లేదు.

యస్యాజ్ఞానాత్మనో జ్ఞస్య దేహ ఏవాత్మభావనా।
ఉదితేతి రుషైవాక్షరిపవోఽభిభవంతి తమ్॥

దేహమందాత్మాభిమానముగల్గి ఇంద్రియముల వశమైనర్పకయుండు అజ్ఞానిని ఇంద్రియములను శత్రువులు అతిక్రోధముతో నెదిర్చి బాధింతురు

యస్య జ్ఞానాత్మనో జ్ఞస్య సత్యేవాత్మని సంస్థితిః।
సంతుష్యైవాక్షసుహృదో న ఘ్నంతి తమనిందితమ్॥

పవిత్రాచరణగల్గి సత్యస్వరూపమగు ఆత్మయందు నిలకడ బొందినట్టి జ్ఞానిని ఇంద్రియములు మిత్రునివలె సంతోషముతో నాదరించును. అయ్యది వానినేమియు బాధింపక అనుకూలాచరణచే వానికింజ్ఞానాభి వృద్ధి గలుగజేయును.

అకర్తృత్వాదభోక్తృత్వమభోక్తృత్వాత్సమైకతా।
సమైకత్వాదనంతత్వం తతో బ్రహ్మత్వమాతతమ్॥

అకర్తయగుటచే మనుజుడభోక్తయు నగును. అభోక్తయగుటచే సమత్వము సిద్ధించును. సమత్వముచే ఏకత్వమున్ను, ఏకత్వముచే అనంతత్వమున్ను సిద్ధించును. ఆ పిదప వ్యాపకమగు పరబ్రహ్మరూపత్వము సంప్రాప్తమగును.

మౌర్ఖ్యమోహసముత్థానా త్వనాత్మన్యాత్మభావనా।
ఆత్మజ్ఞానాన్మహాబోధాద్విలయం యాతి వాసనా॥

తత్వజ్ఞానాభావమును మౌర్ఖ్యముచే నుత్పన్నమైన దేహాదులం దాత్మాభిమానమను వాసన ఆత్మజ్ఞానమను నుత్తమబోధచే నశించును.

యో న నిర్వాసనో నూనం సర్వధర్మపరోఽపి సః।
సర్వజ్ఞోఽప్యభితో బద్ధః పంజరస్థో యథా ఖగః॥

సమస్తధర్మముల నెఱింగినను, సర్వజ్ఞుడైనను, వాసనల ద్యజింపనిచో పంజరమందలి పక్షివలె అతడు బద్ధుడే యగును.

సర్వత్ర విద్యమానాఽపి దేహేషు తరలాయతే।
సర్వగోప్యాతపః సౌరో భిత్తౌ దౌ వై విజృంభతే॥

సూర్య పకాశము,దర్పణభిత్త్యాదులందతిశయముగ భావించునట్లు, సర్వత్ర వ్యాప్తమైయున్నను చైతన్యము శుద్ధబుద్ధియందే యధికముగ ప్రకాశించును.

సాధూనాం సమదృష్టీనాం పరిప్రశ్నేన సేవయా।
సంగ మేన చసా యుక్తిర్లభ్యతే ముచ్యతే యయా॥

సమదృష్టిగల సాధువుల సేవించుటచేతను వారి సంసర్గముచేతను. భక్తియుతముగ వారల బ్రశ్నించుటచేతను జ్ఞానరూపమగు యుక్తి లభింప, అద్దానిచే జీవుడు ముక్తి నొందును.

బుద్ధిర్మహదహంకారః ప్రాణాశ్చేత్యాదిభిర్మునే।
క్రియానురూపైరభిధా వ్యాపారైః శాంతముచ్యతే॥

చిత్తమే క్రియాభేదము ననుసరించి అంతఃకరణము, బుద్ధి, మహత్త్వము, అహంకారము, ప్రాణము, జీవాత్మ మున్నగు నామంబులచే జెప్పబడుచున్నది.

యథా స్వయంభూః సంకల్పః స్వయంనామ తథైవహి।
ఏతౌ స్వవేదనాయత్తౌ బంధమోక్షౌ వ్యవస్థితౌ॥

సమష్ట్యహంకారరూపుడగు బ్రహ్మవలెనే వ్యష్ట్యహంకారరూపుడగు జీవుడును సంకల్పమాత్రుడే యగును. సంకల్పముచే బంధమును, సంకల్పత్యాగముచే మోక్షమును నిశ్చయముగ సిద్ధించును.

గమ్యదేశైకనిష్ఠస్య యథా పాంథస్య పాదయోః।
స్పందో విగతసంకల్పస్తథా స్పందః స్వకర్మసు ॥

స్వగృహాభిముఖుడై చను పథికుని పాదములు నిరంతరము చలించుచున్నను, దానికాచలనమును గూర్చిన సంకల్పముండనట్లు, సంకల్పరహితుడై యోగి శాస్త్రోచితములగు అనిషిద్ధకార్యమున బ్రవృత్తి గలిగి యుండును,

దర్శనాత్స్పర్శనాచ్ఛబ్దాత్కృపయా శిష్యదేహకే।
జనయేద్యః సమావేశం శాంభవం స హి దేశికః॥

దర్శన, స్పర్శనోపదేశాదులచే శిష్యునియందు శివస్వరూపుడగు పరమాత్మయొక్క సన్నివేశము గల్గించగల్గు నాతడే గురు వనదగును.

స్వభావం సంవిజిత్యాదావింద్రియాణాం స చేతసామ్।
ప్రవర్తతే వివేకే యః సర్వం తస్యాశు సిద్ధ్యతి॥

విషయములవైపునకు పరుగిడు మనస్సుయొక్కయు, సర్వేంద్రియములయొక్కయు దుస్స్వభావమును జయించి అధ్యాత్మశాస్త్రములందు ప్రవృత్తి గల్గియుండువాని కంతయును సత్వరముగ సిద్ధించును.

స్వభావమాత్రం యేనాంతర్న జితం దగ్ధబుద్ధినా।
తస్యోత్తమపదప్రాప్తిః సికతాతైలదుర్లభా॥

తన దుస్స్వభావమును మొమ్మొదట జయించని మూఢునకు, ఇసుకయందు తైలమువలె ఆత్మపదప్రాప్తి దుర్లభమైనది.

శుద్ధేఽల్పోప్యుపదేశో హి నిర్మలే తైలబిందువత్।
లగత్యుత్తానచిత్తేషు నాదర్శ ఇవ మౌక్తికమ్॥

స్వల్పోపదేశమైనను నిర్మలచిత్తునియందు, శుభ్రవస్త్రముపై తైలబిందువువలె వెంటనే ప్రవేశించును. అద్దముయొక్క వెనుకభాగమున ముత్యములైనను ప్రతిబింబించనట్లు సాధనచతుష్టయసంపత్తి లేనివారల శూన్యచిత్తములందట్టి యుపదేశము ప్రవేశింపదు.

సుసాధ్యః కర్కటోద్భేదో మత్తైరావతదంతినః।
నోత్పథప్రతిపన్నానాం స్వేంద్రియాణాం వినిగ్రహః॥

మదించిన ఐరావతమను ఏనుగుయొక్క గండస్థలము చీల్చుటయైనను సులభమేగాని చెడు మార్గమందు ప్రవృత్తి గల్గియుండు ఇంద్రియములను నిగ్రహించుట సులభముకాదు.

యథాక్షిసంవృతిః సర్వరూపాలోకశమోదయా।
సంవిత్సంవరణం నామ సర్వదృశ్యశమస్తథా॥

కామాది శత్రువుల నశింపచేయు నో బ్రాహ్మణోత్తమా! కనుమూసిన తోడనే రూపజ్ఞానమంతయు శమించునట్లు, బహిర్ముఖ చిత్తము నంతర్ముఖముగా జేసి ఆత్మాభిముఖమొనర్చుటచే దృశ్యమంతయు శమించును. (ఇది మంకియను బ్రాహ్మణునకు శ్రీ వసిష్ఠ మునీంద్రు లుపదేశించినది)

అపేక్షైవ ఘనో బంధ ఉపేక్షైవ విముక్తతా।
సర్వాశబ్దాన్వితా తస్యాం విశ్రాంతే న కిమీక్ష్యతే॥

దృశ్యవిషయముల నపేక్షించుటయే బంధము, ఉపేక్షించుటయే ముక్తి. పూర్ణకాముడును, ఆత్మయందు విశ్రాంతిని బడసినవాడును నగు జ్ఞాని యిక దేనిని వాంఛించును?

యావన్నాధిగతం బ్రహ్మ న విశ్రాంతం పదే పదే।
తావత్తన్మనసత్వేన న ధ్యానమవగమ్యతే॥

బ్రహ్మము నెఱుంగనంతవఱకును, ఆత్మపదమందు విశ్రాంతిని బొందనంతవఱకును, విషయచింతన యున్నంతవఱకును జీవున కాత్మధ్యానమందు నిలుకడ కలుగదు.

తావద్విషయవైరస్యం భావయన్త్యుచితాశయాః।
న పశ్యంత్యేవ తాన్యా వద్భోగాంశ్చిత్రనరో యథా॥

భోగములేదుటనున్నను చిత్రమందలి మనుజునకు వాటియందేయపేక్షయు నుండదు. అట్టి వికార రహితమగు స్థితి కలుగువఱకు యోగులు విషయవైరాగ్య మభ్యసించుచునే యుందురు.

క్వకిల స్వాత్మ విశ్రాంతిః క్వైతద్విషయ సేవనమ్।
సుషుప్తజాగ్రతోరైక్యం భ్రాంతాభ్రాంతాత్మనోర్భవేత్॥

ఆత్మసుఖమందలి విశ్రాంతి యెచట! విషయసుఖమెచట! తత్త్వజ్ఞానికిని విషయములందు ప్రీతియుండుచో నిక జాగ్రత్సుషుప్తులును జ్ఞానియు నజ్ఞానియు నొకేవిధముగ యుండవలసివచ్చును. (అనగా నట్లెన్నటికిని సంభవింపదనుట.)

అజ్ఞోఽపి తజ్ఞతామేతి శనైః శైలోఽపి చూర్ణ్యతే।
బాణోఽప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాసవిజృంభణమ్॥

ఓ రామచంద్రా! అభ్యాసప్రభావమెట్టిదో చూడుము! దీనిచే నజ్ఞానియు క్రమముగ జ్ఞాని యగుచున్నాడు. పర్వతములు చూర్ణ మొనర్పబడుచున్నవి. జడమగు బాణమున్ను అతి సూక్ష్మమగు లక్ష్యమును జేరుచున్నది.

స్వసంవిద్యత్నసంరోధాద్యథా చేతః ప్రశామ్యతి!
న తథాంగ తపస్తీర్థ విద్యా యజ్ఞ క్రియాగణైః॥

బాహ్యవిషయాకార చిత్తవృత్తి నిరోధముచే చిత్తము శమించునట్లుల తపస్తీర్థవిద్యాయజ్ఞాది క్రియలచే శమింపనేరదు.

నిర్వాణాయ వితృష్ణాయ స్వచ్ఛశీతల సంవిదే।
స్పృహయంతి సదా సత్తాం బ్రహ్మవిష్ణు హరా అపి॥

తృష్ణారహితమును, నిర్మలమును, శాంతిస్వరూపమును పరమ ప్రేమాస్పదమును, బోధరూపమునునగు ఆత్మసత్తను బ్రహ్మవిష్ణు మహేశ్వరాదులుకూడ నిరంతర మభివాంఛింతురు.

సహస్రేభ్యః సహస్రేభ్యః కశ్చిదుత్థాయ వీర్యవాన్।
భినత్తి వాసనాజాలం పంజరం కేసరీ యథా॥

ప్రయత్న మొనర్చునట్టి లక్షలమంది జనులలో ధీరుడగు ఒకానొకడు మాత్రమే. పంజరమును సింహము భేదించునట్లు వాసనాజాలమును భేదించివైచును.

జ్ఞాతజ్ఞేయ స్త్వసంకల్పః సంకల్పాతిశయాశయః।
అవాసనో వ్యవహృతౌ వాతవత్స్పందతే నవా॥

జ్ఞాతజ్ఞేయుడు (ఎఱుంగదగిన ఆత్మవస్తువు నెఱింగినవాడు)ను, సంకల్పరహితుడును, వాసనానివర్జితుడునునగు జీవన్ముక్తుడు ప్రపంచ వ్యవహారములందు, వాయుస్పందమువలె వర్తింపకయుమండును.

అకల్పసిద్ధసంఘేషు మోక్షోపాయాః సహస్రశః।
వ్యాఖ్యాతాశ్చ శ్రుతాశ్చాలమీదృశాస్తు న కేచన॥

(శ్రీవసిష్ఠ మునీంద్రుల యుపదేశమునుగూర్చి సిద్ధులు పల్కినది)

కల్పారంభమునుండి మోక్షోపాయమును గూర్చిన వేలకొలది గ్రంథముల వినియున్నాము. మఱియు స్వయముగ వాటికి వ్యాఖ్య యొనర్చియున్నాము. కాని యిట్టి దివ్యోపదేశము నెప్పుడును కనివిని యుండలేదు.

సత్యవిషయమును గూర్చి యెంతకెంతకు అంతరాత్మలో విమర్శన తీవ్రావస్థను పొందుచుండునో అంతకంతకు జీవుడు ప్రకృతికి దూరుడై ఈశ్వర సమీపమునకు అనగా ఈశ్వరాత్మస్థితికి చేరుచుండుననియే తలంచ వలెను. దీనివలన తాలు పరిశుద్ధు డగుచున్నాడా లేదా, యను తత్త్వమును సాధకుడు తెలిసికొనవచ్చును. నడచునప్పుడు తనయొక్క నీడను నిలబెట్టి నడువశక్తిగల వారుండిరవో, వారిని మాత్రమే కర్మముగాని,సంకల్పముగాని బాధింపదు. ఎవరు నడుచునప్పుడు వారి నీడ కూడ వారిని వెంబడించి వచ్చు చుండునో అట్టివారు తమ సంకల్పములకు, కర్మలకు సంబంధించిన ఫలము ననుభవించియే తీరవలెను. ఇదే పరిశుద్ధమగు వేదాంతవాక్యము మన కుప దేశించినది.

అయితే యిప్పుడు ముముక్షువులకొక సందేహము జనించవచ్చును ప్రపంచములో గొప్ప బ్రహ్మనిష్ఠులు, ఆత్మసాక్షాత్కారజ్ఞాన సంపన్నులు ఉండిరి, ఉండియున్నారు; వీరు సంచరించునపుడు ఛాయలేక పోయినదా? నీడ వెంటనే అనుగమింపకపోయినదా? యని తలంప నక్కరలేదు. బ్రహ్మ క్షేత్రలెవరు ఉండిరో, ఉండియున్నారో వారందఱును శ్రుతివాక్యము ననుస రించి, పరిశుద్ధాచరణగల్లవారై, దృశ్యాది సంకల్పరహితులై, శుద్ధాత్మబోధకు లై యేయున్నారు.ఇంతవఱ కాలాగుననే యుండిరి.దానికనుగుణమగుప్రశాంత నిర్మల జ్ఞాన సుఖమువే వా రనుభవించిరి.అనుభవించుచునే యున్నారు. హేయ విషయములుగల్లిన జ్ఞానికి విషయములతోను,సంకల్పములతోను,మనస్సుతోను సంబంధము లేదని చెప్పెడు వచనమునకే శుష్కవేదాంతమని పేరు. అలా గున చేయుట పాతకము. శ్రీ శంకరులు, శ్రీ బుద్ధదేవుడు, శ్రీ కృష్ణ చైత న్యులు, శ్రీ గురునానక్ మొదలగు ఉదారచరితులందు ఇప్పుడుండేవారు చెప్పలాగున ఏదేని దోషము కనిపించునా? దోషములతో జ్ఞానికిగాని, యోగికిగాని, పరమభక్తునకుగాని సంబంధములేదని ఆ మహాపురుష లెచ్చ టైనను చెప్పియున్నారా? విషయములు, గల్గియుండువఱకును ప్రకృతి దోషము సంపూర్ణముగా నంశింపలేదనియే ప్రతి సాధువును తలంచవలసి యున్నది.

ఈ విషయమై యింతవఱ కనేకసార్లు చెప్పియుండుటచే, మఱల మరల చెప్పుట బాగుగాలేదని తలంచి శ్రీమద్భగవద్గీతోపనిషద్వాక్యము

నిచట నిరూపించి విషయమును ఉపసంహరింప తలంపు గల్గుచున్నది? ఇపుడు సామాన్యముగ వేదాంతములో ప్రవేశించినవా రందఱును ఈ క్రింది వాక్యమును చెప్పుచుందురు, ఇది శ్రుతివాక్యమనుటసత్యమే. అయితే ఆ శ్లోకమును పూర్తిగ వారు చదివినచో ఇట్టి ప్రమాదమున కవకాశము గలుగదు. పూర్వార్ధమును గ్రహించి, ఉత్తరార్ధమును విడిచిన కారణముచేతనే, మోహములో పడుటకు కారణమైనది. ఇదెటువంటిదనగా, న్యాయాధిపతి వాదిప్రతివాదులను విచారింపక, వారియొక్క వాక్యములను మాత్రము నమ్మి కార్యమును తీర్మానముచేసినట్లగును. అదెంత విచారశూన్యమో, ధర్మవిరుద్ధమో న్యాయదూరమో, యోచించుకొనదగును. వారు చెప్పెడి శ్రుతివాక్యమిది—

(ఈ పవిత్రవాక్యము ఉపనిషత్తులలోను, యోగవాసిష్ఠాది లోకోన్నత గ్రంథములలోను గన్పించుచున్నది)

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"

దీని తాత్పర్యమేమన, మనుష్యులయొక్క బంధమునకును మోక్షమునకును కారణము మనస్సే యగుచున్నది, ఉత్తరార్ధము వినుడు.

"బంధాయ విషయాసక్తం ముక్త్యైనిర్విషయం స్మృతమ్".

ఏది బంధమునకును మోక్షమునకును కారణమగుచున్నదో, దానిని ఈ రెండవపాదము నిరూపించుచున్నది. విషయములం దాసక్తిగల మనస్సు బంధమును గలుగజేయుచున్నది. విషయములం దాసక్తి నశించిన మనస్సు మోక్షముకొఱకే యగుచున్నది. ఈ పరమసత్యమును గ్రహింపకపోవుటయే అనర్ధము లన్నిటికిని కారణమైనది. ఈ ఒక్కశ్లోకమును ముముక్షువులు సదా జ్ఞాపకములో నుంచుకొని వర్తించిన నిజమైన సత్యమును ఎఱుంగగలరు.

యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తి రిష్యతే ।
అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా ॥

ఏకారణముచేత విషయాసక్తముకాని మనస్సునకు మోక్షము చెప్పబడియున్నదో, ఆకారణముచే ముముక్షువుచేత సదా మనస్సు విషయరహితమైనదిగా చేయుదగినది [illegible]

నిర స్త విషయాసఙ్గం సంనిరుద్ధం మనో హృది।
యదా యాత్యాత్మనోభావం తదా తత్పరమం పదమ్ ॥

ఎప్పుడు విషయములందలి యాస క్తిని విసర్జించిన వేంటనే హృదయ మందు చక్కగా నిరోధింపబడిన మనస్సు సదా ఆత్మస్వరూపమును పొందిన దగుచున్నదో, అప్పు డదియే ఉ త్తమపద మనబడును.

తావదేవ నిరోద్ధవ్యం యావద్ధృవది గతం క్షయమ్।
ఏతజ్జ్ఞానం చ ధ్యానంచ శేషో న్యాయశ్చ వి స్తరః ॥

హృదయమందున్న దృశ్యవాసనా సంబంధములగు సంకల్పములు క్షయమగునంతవఱకును ధ్యానయోగాద్యనుష్ఠానములు చేయుచుండవలెను. ఇదేజ్ఞానము,ఇదే ధ్యానము అనగా యోగము,ఇక విస్తారముగ గ్రంథములలో కన్పించెడు వాక్యము లన్నియు వీనిని గూర్చియేగాని, నూతనముగా గ్రహింపదగిన దేదియును అందు లేదు

ఏక ఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః।
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచన్ద్రవత్ ॥

సర్వభూతములకు ఆత్మయైన భగవంతు డొక్కడే అయినను అంతః కరణోపాధి ననుసరించి అనేకములుగ నున్నట్లు కన్పించుచుండును. ఎట్లన, ఆకాశమందుండు చంద్రు డొక్కడైనను, జలోపాధులచే భిన్న భిన్నములుగ గోచరించుచుండును ఇదే భేదమునకు కారణము. ఇట్టి ఆత్మస్వరూపము అనుభవమునకు వచ్చుటకు సాధకు డెట్లుండవలెనో ఆ విషయమును ముండకోపనిషత్తు విస్తారముగ ఉపదేశించుచున్నది.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన।
యమేవైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥

ఈ ఆత్మస్వరూపము వేదశాస్త్రములను కడవరకు చదువుటచేతగాని. వేదార్థములను చక్కగ వివరించి చెప్పెడు శక్తి గలిగియుండుటచేత గాని

పఠించిన శాస్త్రములను మఱువక ధారణచేసెడి బుద్ధివివేక శక్తి వలన గాని, అనేక శాస్త్రములను అనేకులయొద్ద శ్రవణముచేయుట చేతగాని లభించునది కాదు. అనగా పై జెప్పిన సమర్థత గల్గియున్నను, అంతఃకరణశుద్ధి గల్గి, తీవ్రవైరాగ్య మవలంభించి, నిరంతర ఈశ్వరచింతన చేయువారలకు లభించునది గాదు.

ఏ భక్తుడు నిరంతరము పరమేశ్వరుని పొందవలెనను ఆసక్తిగల్గి ధ్యానము చేయుచుండునో, సదా ధ్యానపరాయణుడై యుండునో వానికి మాత్రమే అట్టి జ్ఞానము గల్గును. అట్టివానికి పరమాత్మ తననిజస్వరూపమును ప్రకాశింపజేయుచున్నాడు. ఈ పరమతత్త్వమెఱింగినచో అంతఃకరణశుద్ధిగల్గి బ్రహ్మవిచారము ధ్యానపూర్వకముగ చేయనిచో ఆత్మప్రాప్తి కలుగ దను తత్త్వము బాగుగ గోచరము కాగలదు. ఏలన, శాస్త్రము చదువుటకును. చెప్పుటకును, ధారణయొనర్చుటకును, నిర్విషయస్థితి కలుగవలెనని లేదు, ఈశ్వర స్వరూపమో, "తమసః పరస్తాత్" ప్రకృతి కావలయుండుటచేత అంతఃకరణలో గల అవిద్యను సంపూర్ణముగ దాటిపోవలసి యుండును. ఇట్టి మోహమును గలుగజేసెడు మాయను రహితముచేయ బ్రయత్నించువారలకు పై జెప్పిన పఠనధారణలు లేనప్పటికినీ ముక్తిగల్గును, ఈ సత్యమునే శ్రీ భగవానులు గీతయం దుపదేశించిరి.

తేషామేవానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

నేను నిరంతరము ధ్యానముచేయు భక్తుల యంతఃకరణమున నివసించువాడనై, అనుగ్రహించు తలంపుతో వారలయొక్క అజ్ఞానమువలన బుట్టిన మాయారూపమగు యంధకారమును మిక్కిలి ప్రకాశించుచున్న జ్ఞాన దీపముచేత తొలగించి, నిజరూపమగు ఆత్మస్వరూప ప్రకాశమును గలుగ జేయుచున్నాను.

పరమకారుణికుడగు భగవంతునకు భక్తులయెడల ప్రేమయేమని చెప్ప వచ్చును! కొందఱు "మేము శాస్త్రములు చదువలేదు. కావున ముక్తికి దూరులగు దుము" అని తలంచి వ్యాకులపడుదురేమో యని యెంచి కరుణగల్గి అది

అవసరములేదనియు, శుద్ధాంతఃకరణులై, నిరంతరము ధ్యానము చేసిన వాలున(?)నియు ఈ శ్రుతి స్మృతివాక్యములు తెలుపుచున్నవి.

సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా
సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్ ।
అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
యం పశ్యంతి యతయః క్షీణదోషాః ॥

నశించినపాపములు గలవారలను, పరిశుద్ధమైన జ్ఞానమును పొంద తలంపుగల్గి పరమాత్మ స్వరూపాను సంధానమునకు ప్రయత్నించు వారలును గ్గురు(?)వారు, ఏ ఆత్మను తమలో దర్శించుచున్నారో అట్టి ప్రకాశస్వరూపమును పరిశుద్ధమునునగు ఆత్మస్వరూపమును సాధకులు నిరంతర సత్యపాలనము చేతను, శుద్ధాత్మజ్ఞానపరమగు తపస్సుచేతను, శుద్ధబ్రహ్మసాక్షాత్కారరూప జ్ఞానముచేతను, బ్రహ్మచర్య నియమపరిపాలనము చేతను హృదయపుండరీకమునందు పొందగలరని యర్థము.

మనస్తత్త్వ రహస్యమును గుఱించి యింతవఱకు వివరింపబడమైనది. దీని యొక్క రహస్యమును తెలిసికొనకపోవుటయే మనస్సే ప్రధానమని మన వేదాంతులలో కొందఱు చెప్పుటకు కారణమైనది. ఇందలి మొదటి అర్థము మనస్సే అన్నిటికిని కారణ మగుచుండు ననుట దీనినియొక్క పరమార్థము, మనస్సు మంచిదైన మంచికార్యములు చేయుటకును; మనస్సు చెడ్డదైన చెడుకార్యములు చేయుటకును కారణమగుచుండుననుటయేకాని వీరు చెప్పేలాగున పాపకృత్యము లొనర్చుచు మనస్సే ప్రధానమనునట్టి విపరీతార్థము కాదు: ఏలన కారణమున కన్యముగ కార్యముండరాదుగదా! ఏవిత్తనము పెట్టిన దానికనుగుణమగు వృక్షమున్ను పుష్పమున్ను, ఫలమున్ను మాత్రమే గలుగును. అలాగున ఏవరి మనస్సులోగల సంకల్పములు, సంస్కారములు వృత్తులు, వాసనలు ఏయే ప్రకారముగానుండునో దానికి తగిన కార్యమునే వారు చేయుచుందురు. ఇదియే మనస్సు ప్రధానమని చెప్పెడు వాక్యముయొక్క మొదటి యర్థము.

[illegible] శక్తి ఇంద్రియములు అన్నిటికిని మనస్సే యధిపతి. కనుక మనస్సు ననుసరించి ఇంద్రియములు విషయములందు ప్రవర్తించును. మనస్సు ఇంద్రి

యములను నిరోధించినచో నవి యణగిపోవును. సేనాధిపతి యాజ్ఞననుసరించి సైనికులు ప్రవర్తించునట్లే ఇంద్రియములన్ని మనస్సుయొక్క ఆజ్ఞ ననుసరించి వర్తించును.

కావున మనస్సు శుద్ధముగానుండిన, ఇంద్రియములు అశుద్ధ విషయము లలో పోవనిశ్చయించినను వానినట్లు పోనీయక అట్టిది నిరోధించునని భావము. సైన్యములో ఒక్కడు దుర్మార్గుడుండినను సేనాధిపతి యాజ్ఞకు బద్ధుడైపోవునుగదా!

3. దృశ్యవిషయములు ఎట్లుండినను మనోభావము ననుసరించియే అవి మంచివిగను, చెడ్డవిగను నున్నట్లు భావము కలుగును. ఇది భావనా విశేషముయొక్క రహస్యము. పామరులకు విషయములు మహాశ్రేష్ఠములుగ తోచును. పరిశుద్ధాత్ములకు విషయము లతి నీచములుగా తోచును. ఇదిన్ని మనస్సుయొక్క మార్పు అనియె విజ్ఞులు తెలిసికొనియున్నారు. దీనివల్లను మనస్సే ప్రధానమని చెప్పిరి.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత! ।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్సఏవ సః ॥

అని శ్రీ గీతాచార్యు లుపదేశించిరి. అనగా, ఓ అర్జునుడా! సమస్త ప్రాణులకును వానివాని పూర్వజన్మ సంస్కారములతో గూడిన యంతఃకర ణము ననుసరించిన స్వభావము కలుగుచున్నది. జీవుడు స్వభావమే స్వరూప ముగ గలవాడు. ఎవ్వడు ఎట్టి స్వభావముగలవాడో వాడు అట్టి స్వభావమున కనుకూలముగానే ప్రవర్తించును. ఈ పరమ తత్త్వమును తెలిసికొనిన మనస్సే ప్రధాన మని చెప్పెడు వాక్యములోగల భావము నివృత్తి కాగలదు.

మనో నిరోధము గలిగిన, యితర దేహేంద్రియము లన్నింటియొక్క నిరోధము గల్గును. కనుక మనోనిగ్రహ మొనర్చుకొనుటయే అన్నింటి యొక్క సారమని తెల్పసికొనవలెను. దీనిచే ముముక్షువు గ్రహింపదగిన దేమన, మనస్సు శుద్ధముగా నున్నచో మనుజుడు శుద్ధములైన వస్తువులను, లైనవిషయములను కార్యములను జేయుచుండును. అశుద్ధముగానున్నచో అశుద్ధము లును, అసత్యములునగు కార్యములందు ప్రవర్తించుచుండును. దృశ్య

వాసనలుగాని, విషయవాసనలుగాని కలిగిన అట్టి దోషములు తనయందిం కను నిశ్శేషముగా రహితము కాలేదని యెంచి వాసనాక్షయమునకు గడం గవలెను. మీరేలాగున నొక పాత్రలో పవిత్రమైన వస్తువు పెట్టతలంచిన ఆ పాత్రను ఒకరివే శుద్ధపఱపింపునపుడు దానియిందేదైన దుర్వాసన యుండినచో, మఱియొకసారి కడిగి తెమ్ములాగున చెప్పుదురో, అట్లే మరల వాసన నిశ్శేషముగ పోనిచో మఱియొక స్సారిగాని రెండుసార్లుగాని, మూడు సార్లుగాని, ఇట్లు శుద్ధపడువఱకు క్షారవస్తువులచే ఎట్లు శుద్ధమొనర్తురో, అలాగున హృదయములో దృశ్యవిషయవాసన యేదైననుండుచో నిర్వాసనస్థితి గలుగువఱకు ధ్యాన, ధారణ, మనన, నిధిధ్యాసనలు చేయుచుండవలెను. ఉత్కృష్టమగు వేదాంతశాస్త్ర మీలాగుననే చెప్పుచున్నది.

తావదేవ నిరోధస్స్యాత్ యావ త్తత్త్వం న విందతి ।
విదితే తు పరేతత్త్వే ఏకమేవానుపశ్యతి ॥

ఎంతవఱకు మనోనిరోధము గల్గి జ్ఞేయమగు బ్రహ్మాకారస్థితి కలుగ లేదో అంతవఱకు శమదమాదులతో గూడినవాడై పవిత్రస్థానమందు పవిత్ర భావన గల్గి నిష్ఠచేయుచుండవలెను.

అవ్యుత్పన్నమనా యావత్ భవానజ్ఞాతతత్పదః ।
గురుశాస్త్ర ప్రమాణైస్తు నిర్ణీతం తావదాచరేత్ ॥

అని శ్రీవసిష్ఠులు యోగవాసిష్ఠమం దుపదేశించిరి. ఎంతవఱకు మన స్సులో గల వృత్తులు, వాసనలు, విషయములు నశింపలేదో, ఎంతవరకు ఆత్మసాక్షాత్కార జ్ఞానమందు నిలకడ కలుగలేదో, అంతవరకు గురువుల బోధలచేతను, ఉత్కృష్ట వేదాంతశాస్త్ర విచారముచేతను బ్రహ్మవిచారము చేయుచుండవలెనని దీని భావము.

5. ఇక మనస్స్ప్రధానమని చెప్పెడు విషయమై విశేషార్థమును చెప్పెద. ఇంతవరకు చెప్పిన నాలు అరములును సామాన్యములు. ఇప్పుడు చెప్పబోవునది విశేషారము, ఇది అనుష్ఠానపరులకు మాత్రమే గలుగును. వారలకే గోచరమగును.

యథా సంకల్పయేద్యోగి యోగయుక్తో జితేంద్రియః
తథా తత్తదవాప్నోతి భావనామాత్రకారణమ్ ॥ ౮౭

యోగసాధనచేత ధ్యానమందు నిలుకడగలవాడును, అందువల్ల ఇంద్రియనిగ్రహము గలవాడును, జ్ఞేయమగు బ్రహ్మమున స్థిరతగలవాడునగు యోగి ఏమేమి సంకల్పించునో అది ఆలాగుననే ఫలించును, అట్టి యోగులకు తమయొక్క భావనయే చాలును. ఇట్టి ఉన్నతస్థితిలోనుండు వారిస్థితిని పొందకపోవుటయే సంకల్పములు ఫలింపకపోవుటకు కారణమగుచున్నది.

ఇది సంకల్పశుద్ధి, మనోనైర్మల్యము. యోగసిద్ధి, తపస్సిద్ధిగల యోగుల విషయమైనదేగాని సామాన్యముగా కొన్ని వేదాంతవాక్యములను మాత్రము నేర్చుకొని శుద్ధాచరణ లేనివారి విషయమై ప్రవర్తించినదికాదు. ప్రాకృతగుణములు హృదయమున నశించునపుడు జీవుడు శుద్ధుడై ఈశ్వరావస్థను పొందును. ఈశ్వరుని సంకల్పమాత్రముచేతనే సమస్త జగత్ సృష్ట్యాదులు జరుగుచుండును. వ్యష్టిభావము నశించిన జీవునియొక్క సంకల్పము లన్నియు సఫలీకృతము లగునని శ్రీ యోగవాసిష్ఠమున గలదు.

సోఽయం పశ్యత్యశేషేణ యావత్సంకల్పమాత్రకమ్ ।
స్వమాత్మవచనం శాంత మనన్యత్పరమార్థతః ॥

నిరావరణ జ్ఞానయుక్తుడేది సంకల్పించునో, తనసత్య సంకల్పముచే నద్దానిని తన పరమార్థస్వరూపమునకు భిన్నముగ గాంచడుగాన తప్పక ధాని ప్రాప్తినొందును.

అనిరావరణజ్ఞప్తేర్యతః శాంతో న భేదధీః ।
తతః సంకల్పనాద్ద్వైతాద్వరాద్యస్య న సిద్ధ్యతి ।

ఆవరణసహితమగు జ్ఞానముగలవానికి భేదబుద్ధి శమింపదు. అతడు ద్వైతసంకల్పముతోనే కూడియుండును గాన వరశాపాదులు వానికి సిద్ధింపజాలవు.

7. ఒకడు హైకోర్టుజడ్జి, జిల్లాకలెక్టరు మొదలగు పదవులలో నుండునపుడు తాను విధించిన వాక్యము లన్నియు వెంటనే యితరులు అమలు జరుపుదురు. తనశక్తి ఉద్యోగము లేనపుడు తనవాక్య మెట్లాగున విఫలమగునో, ఆలాగున బ్రహ్మవిద్యయోగల అనుష్ఠానములతోగూడి సరియైన నిష్ఠ యుండినచో అతనివాక్యములేగాక సంకల్పములు గూడ తప్పక ఫలించును.

అట్టి ఆచరణ లేనందుచేతనే సంకల్పము లన్నియు నిష్ప్రయోజనము లగుచున్నవి. ఇదన్ని మనస్సుయొక్క ప్రధానతత్త్వమునే తెలుపుచున్నది.

కావున యెవరైనను తాము సంకల్పించినట్లు జరుగకపోవుచుండిన వారి మనస్సునందు మాలిన్యము నశించియుండలేదని బాగుగా తెలిసికొనవలయునే గాని జనులపై కోపగించిన ప్రయోజనములేదు. అట్లు కోపగించుటచే లోకములో మఱింత యనర్థమును గలుగజేసిన వారగుదురు. కనుకనే బ్రహ్మనిష్ఠులకు ఏ సంకల్పము నుండరాదనియు, ఏ వస్తువుపై ఆశ గలిగియుండరాదనియు, వైరాగ్యనిష్ఠ గలిగియుండవలెననియు శాస్త్రము చెప్పుచుండగా తాను గలిగియుండవలసిన నిస్సంకల్పత్వమును, నిరాశత్వమును, నిర్దోషత్వమును మఱచి యితరులపై ద్వేషమును గలుగజేసికొనుట మంచిదికాదు. అనగా తానడిగినది యివ్వకపోయినచో వీరు లోభులు, కఠినులు, ధర్మబుద్ధి లేనివారలు అని పరుల నిందించుట చాల పొరపాటు. ఈశ్వరుడిచ్చినదానితో తృప్తిపడి ఆత్మశాంతికి భంగకరముకాని పనిని మాత్రము చేసిన చాలును బ్రహ్మనిష్ఠకు మించిన కార్యము మఱియొకటి ముల్లోకములందును లేదు. అట్టిది మన స్వాధీనములో నుండ, అట్టి నిష్ఠను వదలి ధర్మ కార్యములకైనను పుణ్య కార్యములకైనను లేక యితర కార్యములకైనను ఏల యితరుల యాచన చేయవలెను? పరోపకారము కొఱకును, ఈశ్వరకార్యములకొఱకును ఇతరుల యాచించవచ్చునని శాస్త్రములందు చెప్పబడియున్నను అది తీవ్ర బ్రహ్మనిష్ఠుల విషయమై చెప్పబడినది కాదనియు, సామాన్యుల విషయమై చెప్పబడినదనియు బ్రహ్మనిష్ఠ లెఱుంగవలెను.

ఈ విషయమై యొక కథ చెప్పెద — ఒక బిచ్చగాడు దారిలోగల యొక చెట్టునీడక్రింద కూర్చొనియుండెను. ఆ మానుక్రింద ఎవరో బాటసారులు చెరకు నమిలి ఉమ్మివేసిన పిప్పియుండెను. దానిని తీసుకొని ఆ యాచకుడా నమిలినప్పుడు అందు మాధుర్యములేదు; చెరకురసముగాని యుండలేదు! అప్పుడతడు ఇది యే మూఢుడో నమిలివైచెనో కొంచెమైనను తన కుంచకపోయెనుగదా అని తలంచుచు, అతనిని, కఠినుడు, ధర్మహీనుడు అని తిట్టుచుండెనట! పైని చెప్పిన జనులయొక్క ప్రవృత్తియు ఈలాగుననే యుండునని తలంచవలెను.

లాగున చూడవలెను ఎవరున్ను ఆత్మవంచనలేక సర్వేశ్వరు డిచ్చినదానిలో శక్తి కొలది యే కార్యమునైన చేసిన చాలును. ఇక యీఅవ యర్థమును చెప్పెద.

6. తపస్సిద్ధిగాని, యోగసిద్ధిగాని, గలిగిన యోగికి 1. అణిమ, 2. మహిమ, 3. గరిమ, 4. లఘిమ, 5. ప్రాప్తి, 6. ప్రాకామ్యము, 7. ఈశత్వము, 8. వశిత్వము అను సిద్ధులు కలుగును. అట్టి సిద్ధపురుషులు సంకల్పము మాత్రముచే తలంచినట్లు చేయగలరు కాన అట్టివారికి మనస్సే ప్రధానమని చెప్పబడెను, మనస్సే ప్రధానమని చెప్పువారు తాము సంకల్పించినలాగున జరుగుచున్నదా లేదా యని పరీక్షించి చూచిన దీనియొక్క రహస్యము గోచరము కాగలదు.

7. మఱియొక అర్థముకూడ తెలిపెద. అదేమన, తన్నును ప్రపంచములోగల యే వస్తువునైనను తనయొక్క యిష్టానుసారముగ మార్పుచేయు శక్తి సంకల్పమాత్రముచే గలుగుచుండునా యను విషయము. సిద్ధపురుషులైనచో సంకల్పించినట్లు చేయగలరు, వీనికి మనస్సే ప్రధానము. వీరి కందఱివలె ప్రయత్నమేమియు చేయ బనిలేరు. ఇట్టి యున్నతస్థితి తనకు గలిగినదా యని యోచింపక యిప్పుడుండువారిలో కొందరు తినుటలోను, త్రాగుటలోను, హీనకృత్యము లోనర్చుటలోను, వస్త్రధారణలోను ప్రవర్తించి అమాయకులతో 'మనస్సే ప్రధాన' మని వేదాంతవాక్యములను బలుకుచుందురు. ఇందువలననే అతి పవిత్రమైన వేదాంతశాస్త్రమునకు పతనము గల్గినది. మఱియు వేదాంతులపై జనులకు విశ్వాసము లేకుండుటకును కారణమైనది.

మనస్సు చెడువిషయములలో పోవునప్పుడు, అయ్యో, మనమనస్సెంతో మలినమైనది. దుష్ట కార్యములలోనికి బోవుచున్నదేయని తలంచి జ్ఞానముచే తెచ్చుకొని అట్టి చెడుకార్యములనుండి మనస్సును మరలించుకొనుటయే మనస్సు ప్రధానమని చెప్పెడుదాని కర్థము. ముఖ్యముగా నివాసదోషము చేతను, ఆహారదోషముచేతను, మనస్సు వశపడకపోవును. ఈ రెండులో ఆహారదోషముకంటె నివాసదోష మెక్కుడు చెఱుపు చేయును. ఆహారదోషముండిన అట్టి కాలక్రమమున మనస్సును మాలిన్యపఱచును. ఇక నివాస

దోషమో, తక్షణమే విపత్తులో బడద్రోయును. కాన పై జెప్పిన రెండు లోపములు లేక జిజ్ఞాసువు లుండవలెను.

పై జెప్పేలాగున అందఱును మనస్సే ప్రధాన మని తలంచి నీతిబాహ్యులైయున్నారని తలంపరాదు. అట్టి వారెందరో పుణ్యపురుషులు గలరు ఎందరో బ్రహ్మనిష్ఠులును గలరు. ఎందరో పవిత్రాత్ములుగలరు. అట్టివారు లేనిచో నిక సంసారసాగరమున బడియున్న వారిని తరింపజేయువా రుండరు. అంతేగాక ఎవరికైనను ఆత్మశాంతి గలుగవలసియుండిన, మనోనిగ్రహము లభించవలసియుండిన, శాశ్వతదైవసుఖము సిద్ధింపవలసియుండిన, జీవించి నప్పుడేదివ్య ప్రకాశముగలుగవలసియుండిన,జననమరణములగు భవరోగము నుండి తరింపవలసియున్న, వేదాంతశాస్త్రాభ్యాసము తప్ప వానిని రక్షించునది మఱి యొకటి మూడులోకములందును లేదు. అట్టి పుణ్యజీవులకు గోరంత యిచ్చినను కొండంత పెరుగును. బిందువంత జలమిచ్చినను అయ్యది సముద్రమువలె వృద్ధి నొందును. అట్టి పుణ్యపురుషుల హృదయములో పడినవస్తువు లన్నియు సాక్షాత్ భగవంతున కర్పించినట్లే యుండును మనస్సే ప్రధానమను విషయమై ముండకోపనిషత్తు చెప్పినది చూడుడు.

యం యం లోకం మనసా సంవిభాతి
విశుద్ధసత్త్వః కామయతే యాంశ్చ కామాన్ ।
తం తం లోకం జయతే తాంశ్చ కామాన్
తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేద్భూతికామః ॥

పరిశుద్ధాంతఃకరణముగల జ్ఞాని మనస్సుచేత ఏ యే లోకమును సంకల్పించునో ఏ యేకోరికలను కోరునో, ఆయా లోకమును, ఆయా కోరికలను పొందును. కాన ఈశ్వరానుగ్రహము నభిలషించువాడు బ్రహ్మవేత్తను సేవించవలెను.

సర్వసంగవిముక్తస్య యోగారూఢస్య ధీమతః ।
యాదృశం మానసం యత్ర తాదృశం విన్దతే ఫలమ్ ॥

ప్రాకృతములగు సమస్తబంధములనుండి విముక్తినొందిన [illegible]త్తము గలవాడును ఈశ్వరధ్యానతత్పరుడు [illegible]ఐక్యానుసంధానమును సిద్ధింపజేసినవాడును

శుద్ధమైన బుద్ధిగలవాడు నగు యోగి తన మనస్సునందు ఏమేమి సంకల్పములు చేయునో ఆయా సంకల్పముల ననుసరించిన ఫలమును తప్పక పొందగల్గును అని యుపనిషద్వాక్యము.

అయినను ఇట నొకవిషయము జ్ఞప్తియందుంచుకొనవలెను. లోకోద్ధారమొనర్చుట, గొప్పగొప్ప సంస్థల నిర్మించుట, మహాకార్యము లొనర్చుట మున్నగునవి మేమేల యొనర్పజాలకున్నామని చిత్తశుద్ధిగల భక్తులు కొందరు తలంచవచ్చును. అట్టి సంస్కారము కొందఱకు మాత్రమే యుండునని గ్రహింపవలెను. లేక ఈశ్వరుడు వారి కిట్టి సంస్కారమును కలుగజేసెనని కాని తలంచి లక్ష్యమగు జీవన్ముక్తి కొఱకే ప్రయత్నమును కొనసాగించుచుండవలెను. ఇందలి నిగూఢ తత్త్వమేమన ప్రపంచసృష్టి యంతకును ప్రకృతియే కారణము. అట్టి ప్రకృతి యెవనికి వశపడియుండునో అనగా ఎవడు ప్రకృతిరహితత్వ మొందునో లేక ప్రకృతిని జయించునో అతడు ప్రకృతికి పరమగు పరమాత్మానుభవము గల్గియుండును.

ఇట్టి యున్నతస్థితిని సర్వులు పొంద నర్హులే. బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని, స్త్రీలుగాని, పురుషులుగాని యెవరైనను అంతఃకరణశుద్ధిగల్గి ప్రయత్నించిన అట్టి దివ్యపదవిని పొందగలరు. అపుడా స్థానమునకు సంబంధించిన సర్వశక్తులును వారికి లభింపగల్గవు. ఒక గొప్ప ఉద్యోగమునందు ప్రవేశించువా రెవరైనను, ఏజాతివారైనను, ఏ కులము వారైనను, ఏ దేశీయులైనను అద్దానికి సంబంధించిన సర్వాధికారములు వారికి గల్గునుగదా! అట్లనే ఇట్టి మహోన్నతమగు దైవ స్థితిని బొందిన ప్రతివారికి ఆయాదైవికశక్తు లన్నియు గలుగును. అట్టి వాని కార్యము, లన్నియు ప్రకృతియే నిర్వహించుచుండును, దీనికే జగన్మాత యనియు, పరాశక్తియనియు, మహాశక్తియనియు, శివశక్తియనియు, విష్ణుమాయయనియు, భగవత్కృపయనియు గూడ పేర్లు గలవు. ఇట్లు ప్రకృతియే గోడవలె జీవుని అడ్డుపరచుచుండును. గోడయేలాగున అనేక రాళ్ళతో కట్టబడినదో ఆలాగున జీవునియొక్క జన్మాంతర సంస్కారము లన్నియు కర్మరూపముగ అడ్డుపడియుండును. దీనిని తొలగించుటయే బ్రహ్మనిష్ఠుని కర్తవ్యమై యున్నది.

8. మనస్సే ప్రధానమను విషయమై యింకొక అర్థముకూడ తెలిపెద. ఈ జీవజగత్తులన్నియు కేవలము పరమేశ్వరస్వరూపములై యున్నను మనస్సుయొక్క భావనావిశేషముచే ప్రపంచముగాను, జీవులుగాను, సత్త్వరజస్తమో గుణములుగాను, జననమరణములను అవస్థలుగాను, వెయ్యేల సమస్తసంహార సంకటముల రూపముగాను నగుచుండును. ఈ విషయము ప్రమాణపూర్వకముగ చెప్పబడిన విస్తారమగును. కాన సంగ్రహముగ నిట చెప్పబడినది. ధ్యాన, జ్ఞాన, యోగాదులచే మనస్సు శుద్ధపడుట వలనను. బ్రహ్మవిచారమందు ప్రవేశించుటవలనను, శ్రవణమనననిదిధ్యాసనము తాసర్చుటవలనను దోషములన్నియు నివారింప అపుడు జీవునకు తాను శుద్ధశివస్వరూపుడనయు మాయచే గల్గిన భ్రమవలననే యీ సత్యము నింతవఱకు తెలిసికొనలేదనియు జ్ఞానము గలుగును. అపుడు అవిద్యయొక్కయు, అజ్ఞానము యొక్కయు శక్తిచే ఈ ప్రపంచమీలాగున కనుపించుచున్నదను బోధము గలుగును. ఇట్టి అవిద్యాదోషము నశించిన మాత్రమే నిజమైన యవస్థ జీవకోట్లకు గల్గును, అవిద్య నశింపవలసియుండిన ఈశ్వరభక్తి అవశ్యము గల్గి యుండవలెను, ఇదియే దీనిలోగల సారము. శాస్త్రము లన్నియు ఈ విషయమునే యుద్ఘోషించుచున్నవి.

యావదాత్మా న లబ్ధోఽయం శుద్ధో జ్ఞానంచ నోదితమ్।
మలినే విషయే రాగ స్తావదజ్ఞానినో భవేత్॥

ఎంతవఱకు ఈ ఆత్మ లభించుట లేదో, శుద్ధమైన ఆత్మజ్ఞాన ముదయము కాలేదో, ఎంతవఱకు విషయవాసన క్షీణము కాలేదో అంతవరకు తా నజ్ఞానదశలో నున్నట్లే తలంచుకొనవలెను.

యథా భర్జితబీజస్య ప్ర్రరోహిత్వం వినశ్యతి।
తథాత్మజ్ఞానినో నిత్యం జగద్బుద్ధి ర్విలీయతే॥

ఏలాగు అగ్నిలో వేయించిన బీజముయొక్క అంకురత్వము నశించియుండునో అలాగున ఆత్మజ్ఞానాగ్నిలో దహించిన చిత్తముగల వానికి దృశ్యవిషయములు నశించియుండును. విషయాంకురములు హృదయమునందు పుట్టుచుండిన ఇంకను జ్ఞానాగ్నియందు చిత్తము దగ్ధము కాలేదని సాధకులు గ్రహించుకొనవలెను.

ఇంద్రియేష్వింద్రియార్థేషు ప్రవృత్తేషు యదృచ్ఛయా।
అనుధావతి తాన్యేవ మనో వాయు మివానలః॥

ఇంద్రియములు, ఇంద్రియార్థము (విషయము)లలో స్వేచ్ఛగా ప్రవర్తించుచుండిన, విషయముల ననుభవించుచుండిన, అగ్నిదేవునకు వాయుదేవుడు సహాయపడునట్లు విషయానలము మఱింత ప్రజ్వలించునే గాని శమింపదు. ఇది సమస్తశాస్త్ర సిద్ధాంతము.

నాశ్రమం కారణం ముక్తేః దర్శనాని న కారణమ్।
తథైవ సర్వకర్మాణి జ్ఞానమేవహి కారణమ్ ॥

ఆత్మజ్ఞానప్రాప్తికి సన్న్యాసాది ఆశ్రమములు కారణము కాదు. అలాగున శాస్త్రముల పఠించుటయు కారణముకాదు. అదే ప్రకారము కర్మ కాండలో ప్రవృత్తిగలిగియుండుటయు కారణము కాదు. ఈశ్వర సాక్షాత్కార జ్ఞానము కలుగుట ఒక్కటి మాత్రమే కారణ మగును.

అంతస్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకమ్।
న నశ్యతి తమో నామ కృతయా దీపవార్తయా॥

గృహాంతర్భాగ తిమిరము (చీకటి) దీపముయొక్క వార్తవలన ఏలాగున నశింపదో అలాగున హృదయగుహయందు గల అజ్ఞాన తమస్సు శాస్త్రముల పఠించుటచేకాని, చెప్పుటచేగాని విలయము నొందదు.

యస్య నాస్తి వివేకస్తు కేవలం యో బహుశ్రుతః।
న నజానాతి శాస్త్రార్థాన్ దర్వీ పాకరసానివ॥

బహుశాస్త్రములను పఠించినవాడైనను, ఎవనికి అంతఃకరణ శుద్ధి గలిగి వివేకజ్ఞాన ముదయము కాలేదో అట్టివాడు చదివిన శాస్త్రము లన్నియు అనేక రసయుక్తపదార్థములలో త్రిప్పబడు గరిటెవలె నుండును. అనగా గరిటె ఆయాపదార్థముల రసమును తెలిసికొనజాలనట్లు ఆచరణలేని కేవల శాస్త్రపఠనమొనర్చువాడును ఆయథార్థతత్త్వమును, శాస్త్రార్థమును ఎఱుంగ జాలక అనుభవజ్ఞానరహితుడై యుండును.

స్వతంత్రాభ్యాసశీలానాం కథం యోగమవాప్నుయాత్।
నాస్తితే మపి జ్ఞానం నాస్తి తేషాం గతిః పరా॥

అనుభవజ్ఞులగు మహనీయుల అనుగ్రహము పొందక స్వతంత్రముగ ఎవరు యోగాదిసాధనలు చేయుదురో, అట్టివారికి యోగసిద్ధి కలుగుటగాని, ఆత్మజ్ఞానముదయించుటకాని, ఉత్తమగతి లభించుటగాని సంభవింపదు.

శ్రద్ధావినయసంయుక్తః శాన్తిదాన్త్యాదిసంయుతః।
యావత్ జ్ఞానోదయస్తావ ద్వేదాంతార్థం నిరూపయేత్॥

ఎంతవరకు ఆత్మజ్ఞానోదయము కాలేదో అంతవరకు శ్రద్ధావినయములతో గూడినవాడై శమదమాది గుణములు కలుగజేసికొని వేదాంత శ్రవణము, బ్రహ్మచింతన, ధ్యానయోగాభ్యాసముగావించుకొనవలెను. వేదాంతశాస్త్రముయొక్క సారమంతయు, మహనీయుల యభిప్రాయమంతయు నీశ్లోకములో ఇమిడియున్నది.

ఇక శ్రీయోగవాసిష్ఠమున ఉపదేశించినది చూడుడు.

అనర్థాయావిచారేణ వయుః కుర్యాన్న భస్మసాత్।
బోధేన జ్ఞానసారేణ దృశ్యం కర్తవ్య మాత్మసాత్॥

ఓ రామా! అనర్థప్రదమగు అవిచారణచే ఆయువును నశింపజేయవలదు శ్రవణమననాదులచే ప్రాప్తమగు తత్త్వజ్ఞానముచే ఈ దృశ్యము నాత్మతో ఐక్యమొనర్పుము.

ఆయుషః క్షణ ఏకోపి సర్వరత్నైర్నలభ్యతే।
నీయతే తద్వృథా యేన ప్రమాదః సుమహానహో॥

ఆయుష్యసంతతియొక్క క్షణమైనను వ్యర్థముగ గడపినచో, మణుల నయ్యది అనేకరత్నములచేగూడ లభింపనేరదు. కాన ఆత్మవిచారము లేక సమయమును గడుపుట మిక్కిలి ప్రమాద మగును.

శాస్త్రసాధ్యుత్సదాభ్యాసాన్నామ పావనం తద్విచారపరః।
అభ్యాసో దృశ్యసంశాంత్యైఃకష్టాత్తో న భవిష్యతి॥

మోక్షోపాయమనబడు యీ వేదాంత శాస్త్రమును గురుముఖతః శ్రవణ మొనర్చి, ఆ పిదప మనననిదిధ్యాసనాదులచే బాగుగ నభ్యసింప వలెను. దృశ్యము శమించుట కింతకు మించిన యుపాయమెద్దియు నేటి వఱకు మఱియొకటి యుండియుండలేదు ఇకను ఉండబోదు.

క్షపయంతి విపాకం తం పూర్వోపాత్తస్య కర్మణః।
సకాలే ప్రభవత్యేవ పూర్వోపాత్తం శుభాశుభమ్॥
స్వచ్ఛాయామివ దుర్వారం దేవానామపి పార్థివ॥

పూర్వజన్మమునందు వారు వారు చేసిన పుణ్యపాపములయొక్క ఫలము అనుభవకాలము వచ్చినపుడు అనుభవించియే తీరవలెను. శుభా శుభ ఫలములు తమనీడవలెనే మనుజుని విడువక వెంబడించి వచ్చుచుండును అవి దేవతలనైనను విడువవు.

శాస్త్ర మీలాగున చెప్పుచుండగా సామాన్యజనులు కూడ తమకు కర్మలు, ధర్మములు లేవని చెప్పుట యెంత విచారకరమగు ప్రవృత్తియో తెలియగినది.

యో యాదృక్ క్లేశమాధాతుం సమర్థస్తాదృగేవ నః।
అవశ్యం ఫలమాప్నోతి ప్రబుద్ధోఽప్యజ్ఞ ఏవ వా॥

జ్ఞానియైనను అజ్ఞానియైనను క్లేశకరములగు వారివారి కర్మల ననురూపములగు ఫలములను తప్పక బొందుదురు.

ఆమోదశ్చందనస్యేవ స్పందనస్య ఫలం హ్లాది।
సర్వస్యైవాస్తి తస్మానం తద్వతా సమవాప్యతే॥

శ్రీ గంధమందు సుగంధమువలె విహితనిషిద్ధకర్మల ఫలము అందఱి యందును ఉండియేయుండును. కాలక్రమమున అట్టి క్రియలయొక్క ఫలములను వారవశ్యము పొందెదరు

ఇక ఈ విషయమై విస్తారముగ వ్రాసి గ్రంథమును పెంపొదలించుట లేదు. ఉత్కృష్టమగు శాస్త్రము లీలాగున నుద్ఘోషించుచుండ సామాన్య సిద్ధాంతులు వేదాంతశాస్త్ర వాక్యములను గుఱించిన సత్యమును శుద్ధబుద్ధిగల

ముముక్షువులే తెలిసికొనగలరు దైవప్రాప్తి అనగా ఈశ్వర సాక్షాత్కార జ్ఞానము కలుగుటకు దైవభక్తి గలిగియుండవలెనని అనేక శాస్త్రములును, పలువురు మహాత్ములును తెలుపుచున్నారు. శ్రీ భగవద్గీతయొక్క సారమున్ను ఇదియే ఏలన, గీతలోగల 14వ అధ్యాయమున గుణత్రయవిభాగమును గూర్చి చెప్పబడినది. మూడుగుణములు, వాటి పరిణామములు. వాటివలన గలిగెడు ఫలములు అన్నియు నీయధ్యాయమున నుపదేశించినదేగాక గుణత్రయాతీతుని అనగా జీవన్ముక్తుని స్థితిగూడ ఇందు తెలిపిరి. మఱియు నట్టి దుష్కరమగు గుణత్రయాతీతస్థితి నిర్మలమగు భగవద్భక్తి యొక్కదానిచే గలుగునని అందు శ్రీభగవాను లుపదేశించిరి. ఏలన, యిది సర్వజనులకు అనుష్ఠించుటకు సులభకారణమగుటచేతను, కారుణ్యనిధియగు శ్రీ భగవానులు అందఱును తరించవలెనను అభిప్రాయము గల వారగుటచేతను ఇట్లు పదేశించబడమైనది.

మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥
(గీ. అ. 14 శ్లో. 26)

ఎవడు అచంచలమైన భక్తి యోగముచేత నన్ను ధ్యానించుచున్నాడో అతడు త్రిగుణములను అతిక్రమించి జీవన్ముక్తిదశను బొందుటకొఱకు సమర్థుడగుచున్నాడు. ఈలాగుననే ఆఱవ అధ్యాయములో ఆత్మసంయమ పరమగు ధ్యానయోగమున్ను, జ్ఞానప్రాప్తియు, జ్ఞానప్రాప్తికై యుపాయ మున్ను భగవాను లుపదేశించిన తరువాత ఆఖరున అనన్యభక్తియొక్క దాని చేతనే అట్టి పదవి లభించుననియు, సాధన లన్నింటిలో పావనమైన భక్తియే శ్రేష్ఠమనియు నుపదేశించిరి

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున।
యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా॥
శ్రద్ధావాన్ భజతే యోమాం స మే యుక్తతమో మతః॥
(అ. 6, శ్లో॥ 46, 47)

తపస్సు చేయువానికంటెను, అనుష్ఠానములేని వేదాంతశాస్త్రములు పఠించువానికంటెను, నిత్యనైమిత్తికాదికర్మల చేయువాని కంటెను యోగ నిష్ఠగలవాడు శ్రేష్ఠుడు అట్టియోగి అందరిలోను అధికుడని భగవంతు డుపదేశించిన తరువాత అట్టి ధ్యానయోగు లందఱిలోను భక్తిగలిగి పరమాత్మ యందు నిలుపబడిన చిత్తముగలవాడై, అత్యధిక శ్రద్ధతోకూడినవాడై సర్వేశ్వరుని యెవడు భజించునో, అనగా ధ్యానించునో ఆతడు అందఱికంటె అధికుడనియు, అదియే తన సమ్మతమనియు వచించెను.

భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥
(అ. 18. శ్లో॥ 55)

వేదాంతశాస్త్రమంతయు సంగ్రహముగ ఉపదేశించిన అంతిమాధ్యాయ మగు పధునెనిమిదవ అధ్యాయములో శ్రీభగవాను లుపదేశించినది చూడుడు- భక్తులారా! బ్రహ్మనిష్ఠులారా! ఎన్నిరకములగు రసయుక్తములైన బీజము లుండినను అన్నిటికిని ఓకే ఆధార భూతమగు జలము అనగా వర్షము లేనిచో ఎట్లన్నియు వ్యర్థములగునో, ఆలాగున మీరు యోగముగాని, తపస్సుగాని, జపముగాని, వ్రతము గాని మఱి యెన్నెన్ని మార్గములు కలవో అవన్నియు అనుష్ఠించువారలైనను, అనన్యమైన భక్తియొక్కటి లేనిచో అవేవియు పూర్ణ ఫలము నొసంగజాలవు. మఱియు బీజము లన్నియు అంకురించుటకు జల మొకటియే ఆధారమెట్లగునో, అట్లనే అన్నిమార్గములకును భక్తియొక్కటియే ఆధారమగును. అంతేగాక భక్తియొక్క దానియందు మాత్రమే, అహం కారము. అసూయ. ద్వేషము మున్నగు దోషములు నశించును. అయితే యిప్పుడు గల భక్తులలో కొందరియం దిట్టి ద్వేషాదులు కన్పించుచున్నవే యని తలంచవచ్చును, దానికి భక్తియొక్క పరమ లక్ష్యము పొందక పోవుటయే కారణము. భక్తియొక్క పరమ కాష్ఠ సర్వ చరాచర ప్రాణికోట్ల యందును, తనయందును భగవంతుని చూచుటయే యగును. అట్టి భక్తి కలుగనందు చేతనే ద్వేషాదులు కలుగుచున్నవి

ఇక పై శ్లోక తాత్పర్యము వినుడు:— పరిశుద్ధమైన భక్తిచే నాయొక్క స్వరూపమును అనగా భగవత్స్వరూపమును లెస్సగ తెలిసికొనుచున్న, అట్టి

తెలివియే. అనగా జ్ఞానమే నిజమైన తత్త్వము బోధపడుటకున్నూ, ఆత్మ యొక్క ఆవరణములు, బంధములు నశించుటకును కారణ మగుచున్నది. అట్టి సాక్షాత్కారజ్ఞానమువలన. జీవుడు పరమ శాంతిని, నిత్యమగు మోక్ష మును పొందుచున్నాడు.

ఈ భక్తి విషయమై వ్రాయవలసియుండిన ఎంతయో గలదు. ఇంతవఱకు వ్రాసియుండిన గ్రంథములలో విశేషముగ తెలుపబడి యుండెను. ఇప్పుడు ధ్యానము అన్నిటికంటె ఎక్కువ ఫలమును కలుగ జేయునను విషయమై సూతసంహితలో చెప్పబడినవిషయము కొంచెము మాత్రమిట తెలుపబడుచున్నది.

1. ధ్యానయజ్ఞం వినా ముక్తౌ యతన్తే మోహితా జనాః।
పాయసాన్నం పరిత్యజ్య భక్షయన్తి మహావిషమ్॥

2. ధ్యానయజ్ఞం వినా కించిత్ కుర్వాణో ముక్తిసిద్ధయే।
అక్ష్ణాపి శబ్దం గృహ్ణాతి వినా శ్రోత్రేణ కేవలమ్॥

3. అశ్వమేధాదయో యజ్ఞా అశేషా వేదదర్శితాః॥
మునీంద్రా ధ్యానయజ్ఞస్య కలాం నార్హన్తి షోడశీమ్॥

4. ధ్యానయజ్ఞపరో మర్త్యశ్శివ ఏవ న చాపరః।
ధ్యానయజ్ఞైకనిష్ఠస్య న కించిదపి దుర్లభమ్॥

5. ధ్యానయజ్ఞపరాణాంతు ప్రసాదం కురుతే శివః।
శివోఽపి సాక్షాత్ సర్వజ్ఞః సంసారవినివర్తకః॥

6. బహునోక్తేన కిం సర్వం సమాసేన మయోదితమ్।
కురుధ్వం వేదవిన్ముఖ్యాః ధ్యానయజ్ఞ మశంకితాః॥

1. మాయా మోహితులగు ఏ జనులు ధ్యానమనెడు ఆత్మయజ్ఞమును విడిచి ముక్తివిషయమై ఉత్తర ప్రయత్నములు చేయుదురో వారు శుద్ధమగు

2. ధ్యానయజ్ఞము నుపేక్షించి మోక్షవిషయమై యితర క్రియలు చేయువారలు శ్రోత్రముచేత వినవలసిన శబ్దమును నేత్రముచేత వినదలం చినవారిచందమున నుందురు.

3. ఓ మునీంద్రులారా! వేదమందు కర్మభాగములో నుపదేశించిన అశ్వమేధాదులగు సమస్తయజ్ఞములున్నూ ధ్యానయజ్ఞముచే గలిగెడు ఫలముయొక్క పదునారు భాగములలో నొక్క భాగమైనను కలుగ జేయ జాలవు.

4. ధ్యానయజ్ఞపరుడగు మానవుడు సాక్షాత్ శివస్వరూపుడే యగును. ధ్యానయజ్ఞైక నిష్ఠునకు దుర్లభమైన దేదియు ఏ లోకమందును లేదు.

5. ఆత్మధ్యానమనెడు యజ్ఞమందు నిష్ఠగలవానికి ఈశ్వరాను గ్రహము త్వరలోనే సిద్ధించును. సర్వజ్ఞుడున్నూ, సర్వసాక్షియు, సంసార దుఃఖమును నివర్తింపజేయువాడును సాక్షాత్ శివుడే యగును,

6, వెయ్యేల, సంక్షిప్తముగ నుపదేశించెదను. వేదవేత్తలలో శ్రేష్ఠులగు నో బ్రహ్మనిష్ఠులారా! మీరు సంశయము లేనివారై ఆత్మ ధ్యాన మను జ్ఞానయజ్ఞము నాచరింపుడు. దీని యొక్కదానిచేతనే సంసారమును తరించి మోక్షపదవి చేరగల్గుదురు.

ఇట్టి ఆత్మజ్ఞానమునకు అనగా బ్రహ్మనిష్ఠయను ధ్యానయజ్ఞమునకు విఘ్నములను గలుగజేయునట్టి పాపగుణములను ప్రతి ముముక్షువున్ను విడువవలయును. ఇట్టి పాపగుణములే మోక్షమునకు విఘ్నములై యున్నవి. అవి యేవనగా—

భయం క్రోధ మథాలస్య మతిస్వప్నాతి జాగరమ్।
అత్యాహారమనాహారం నిత్యం యోగీ వివర్జయేత్॥

భయము, క్రోధము, ఆలస్యము (సోమరితనము), అతినిద్ర, నిద్ర లేకుండుట అతిభోజనము భోజనము లేకుండుట, ఈ యేడింటిని యోగనిష్ఠా భిలాషి విడువవలెను.

ఆలస్యమనృతం శౌర్యం జాడ్యం నిందాఽప్యనుద్యమః।
షడేతే షంత్రిణస్తస్య జ్ఞానద్వారనిరోధినః ॥

సోమరితనము, అసత్యము, మూర్ఖత్వము, రోగము, పరనింద, స్వప్రయత్న రాహిత్యము అను నీయాఱున్ను సాధకునకు మోక్షద్వార నిరోధులని తెలియదగినది.

ఇప్పుడీ మనస్తత్వమును ఉపసంహరించెద. యథార్థముగ విచారించిన మనస్సను వస్తువే లేదు. విషయములు, గుణములు వాసనలు, సంస్కారములు, సంకల్పములు, మాయ, అవిద్య, అజ్ఞానము మొదలైన వన్నియుజేరి మనస్సగుచున్నవి. ఇవన్నియు ఆత్మనుండి వదలిపోవునపుడు మనస్సుకూడ లేకపోవును. ఇవన్నియు నున్నచో ఆత్మప్రకాశమును మఱుగుజేసి జీవుని అంధకారమున బడద్రోయును. ఎట్లన, యథార్థము విచారించిన మేఘమను వస్తువేలేదు. సూర్యరశ్మిచే గలిగెడు జలరేణువులు, వాయువు, విద్యుత్తు మొదలైనవి చేరినపుడు మేఘమనునది యేర్పడుచున్నది. ఇయ్యది చల్లనిగాలిచే కరగి వర్షమై కురిసిన మరల మేఘముండదు. ఈ మేఘము దట్టమై యుండునపుడు ఎంతయో ప్రకాశవంతమైన సూర్యునికూడ కనుపడకుండచేయు విధముననే మనస్సుయొక్క స్థితికూడ ముముక్షువులును, విజ్ఞానస్వరూపులును తెలిసికొనదగినది. బృహదారణ్యకోపనిషత్తునందు మనస్సును గూర్చి చెప్పబడిన అతిపవిత్రమగు ఉపనిషద్వాక్యము నిట నుదాహరించి యిక దీనిని ముగించెద.

కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి।
రధృతి ర్హ్రీర్ధీర్భీ రిత్యేతత్సర్వం మన ఏవ॥

కామము, సంకల్పము, సంశయము, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, లజ్జ, జ్ఞానము, భయము మొదలగు వృత్తులన్నియు జేరియే మనస్సగునని చెప్పబడియున్నది.

మనస్తత్త్వము సమాప్తము.



# నియతి

అబ్ధివద్ధృత మర్యాదా భవన్తి విగతాశయాః।
నియతిం న విముంచంతి మహాన్తో భాస్కరా ఇవ॥

నియతి శబ్దమునకు నీతియనియు, నియమ మనియు, ఆచరణ యనియు, అనుష్ఠాన మనియు, సన్మార్గమనియు, సత్ప్రవర్తన మనియు, సదాచార మనియు మొదలుగాగల పేరులు గలవు. ఇప్పుడు ప్రపంచములో కావలసినది యీ నీతియే, జనులు నీతిదూరు అగుచుండిన, దైవదూరులు గాను, జ్ఞానదూరులుగాను, సత్యదూరులుగాను అగుచుందురు. ప్రకాశము నుండి దూరముగ పోగా పోగా ఏలాగున జనులు కారు చీకటిలోనికి దిగి పోవుచుందురో, అలాగున నీతిదూరులు గాఢ తమస్సులోనికి పోవుచుందురు. చీకటిలోనికి పోగా పోగా నేత్రములు కనుపడక పోవునట్లు నియతిదూరులకు జ్ఞానముకూడ గోచరము గాకపోవును.

ఇప్పుడిట్టి యవస్థ చాలమందికి గలుగుటయే బ్రహ్మవిద్య పతన మగుటకు కారణమగుచున్నది. అందువలన తాము నిజసుఖము నెఱుంగక పోవుటయేగాక దుఃఖసంకలిత హృదయులై శోకబాధితు లగుచున్నారు, అనగా క్లేశ సాగరములో పడియుండి దుఃఖించుచున్నారు. దృఢముగా కట్టని వంతెన అయినచో ఏలాగున జలప్రవాహవేగమున పడిపోవునో. అలాగున దృఢమైన నియతిలేని బ్రహ్మనిష్ఠులుగూడ తప్పక ఒకానొకపుడు విషయములలో పడిపోవుదురు. నదిని దాటుటకు వంతెన ఎటువంటిదో, దుఃఖప్రవాహమును దాటుటకును నియతి అటువంటిదే నీతి బాహుల్యగు వారు గమ్యస్థానమును పొందజాలరు. ఇంజను సహాయముతో నడచునవగు రైలు, మోటారు, విమానము మున్నగువానిపై ప్రయాణము చేయుచుండిన, వాటి యింజను చెడిపోయిన, ఏలాగున ప్రయాణము ఆగిపోవునో, లేక ప్రమాదము గల్గునో, అలాగున నియతికి లోపముగల్గిన ముక్తిమార్గమున కాటంకము గల్గును లేక పతనము గూడ సిద్ధించును. మఱియు సూర్యాది గ్రహము లన్నియు నియతియందే యుండుటవలన ఈ భూలోకాదు లన్నియు సురక్షితములై యున్నవి ఏ గ్రహమైనను నియతినుండి తప్పిపోయిన లోకము లన్నియు ధ్వంసములై నశించును. ఆలాగున నియతిలో నుండు వాడు ఎంత గొప్ప కార్యమైనను చేయశక్తి గలిగియుండును. అది పోవుటచే

అగ్ని కార్యములును స్తంభితము లగును ఇరుసు విరిగిపోయిన రథ మేలాగున భూమిలో కూలిపోవునో ఆలాగు నియతినుండి తప్పిన జనులుకూడ అజ్ఞానములో పతితు లగుదురు, జనులయొక్క శక్తి తగ్గిపోవుటకున్ను, ప్రత్యేకించి బ్రహ్మనిష్ఠులయొక్క ఊర్ధ్వగతి కడుగలుగుటకును ఈ నియతినుండి తప్పుటయే కారణము.

ఒక యంత్రముయొక్క చక్రములు మొదలైనవన్నియు ఏలాగున మర చీలలచే బంధింపబడియుండువరకు ఆ యంత్రము శుద్ధముగా పనిచేయునో, మేకులు వదలిపోయినచో ఆ యంత్రమేలాగున ఛిన్నాభిన్న మైపోవునో, ఆలాగున మనుజు డెంతవఱకు తన నియతిని దిట్టముగా ఆచరణలో నుంచునో అంతవర కాతని కెప్పుడును పతనము గలుగదు. అంతేగాక వాని యూర్ధ్వగతికి ఆటంకము లేవియు నుండవు. ఇప్పుడుండు యోగులకు గాని, తపస్సులకుగాని, భక్తులకుగాని కలిగెడు ఆటంకము లన్నిటికి కారణము నియతి యొక్క దానిని పాలింపకుండుటయే యగును. అందువలన పూర్వ ఋషులయొక్క స్థానమును వీరు పొందజాలకున్నారు. వీరియొక్క అవిద్యారోగమున్ను శమింపకయున్నది. ఒక ఔషధము తయారు చేయున పుడు దానికి కావలసిన పదార్థము లన్నియు తగు భాగములతోగూడ పక్వము చేయబడిననే ఆ యౌషధము సరియైన ఫలమును గలుగజేయును. అట్లు కానిచో రోగమును శమింపచేయుశక్తి ఆ యౌషధమునకు లేకపోవును. అట్లే బ్రహ్మవిచారము చేయువారి ఏ యే నీతుల శాస్త్రములు విధించుచున్నవో అవి సరిగానుండిన మాత్రమే భవరోగము శమించును. పూర్వకాలపు ఋషులు, యోగులు. భక్తోత్తములకు కలిగియుండు ఆత్మశక్తి, దైవశక్తి వీరికి లేకపోవుటకున్నూ ఇదే కారణము. కట్టె లెంత అధికముగ నుండునో నిప్పున్ను అంత అధికముగ జ్వలించునట్లు నియతికి సంబంధించి సుగుణము లన్నియు గలిగిన మాత్రమే ఆత్మశక్తియు పూర్ణముగా గల్గును. అగ్ని జలములయొక్క బలముచేగదా యింజనులన్నియు చైతన్యము నొందు చున్నవి; రైళ్ళున్నగునవి అతివేగము పరుగెత్తి అనేక జనుల గమ్యస్థానము జేర్చుచున్నవి. ఆలాగున పూర్వకాలములో నుండిన సంయము లందఱును నియతిలో నిలుకడ గలవా రగుటచేతనే అతీంద్రియజ్ఞానులై సంసారములో నుండు అనేకజనులను మోక్షమునకు జేర్చగల్గిరి.ఇప్పు డుండువారికి నియతిలో

కొఱత గలిగినందుచే వారు దివ్యమగు ముక్తిపదవిని చేరకయున్నారు. అయితే అందఱును ఆలాగున నున్నారని తలంచవలదు. ఎందఱో పుణ్య జీవు లుండవచ్చును. అట్లు లేనివారినిగూర్చి మాత్రమే యిది చెప్పడమైనది. నియతి బద్ధులైనవారు ఇప్పుడు కూడ దుఃఖరహితులయ్యే యున్నారు.

అవిద్య నిశ్శేషముగ నశించిననే మోక్షము గలుగునని చెప్పినది నిజము. అవిద్యకు దృశ్యసంబంధ గుణములే స్వభావ మనియు, ఆ యవిద్య గుణములకు భిన్నముగా లేవనియు శాస్త్రము చెప్పుచుండగా, అట్టి గుణము లను రహితమొనర్పజూడనిచో ఆ యవిద్య యెట్లు నశించును? ఈ యవిద్యకే అజ్ఞానమనిగూడ పేరుగలదు. మూల పకృతి యని కూడ దీనినే పిలతురు. మాయ యని కూడ దీనికే పేరు. ఆత్మజ్ఞాన స్వరూపమున కన్యమైన సమస్త గుణములున్ను అంతఃకరణములోనుండి తొలగిన, మిగిలియున్న దేదియో అదే జ్ఞానము. ఆ యవిద్యాగుణము లన్నియు తొలగునపుడు జీవున కాత్మజ్ఞానము స్వయముగ తనలోనే ఉదయమగును అట్టి దివ్యజ్ఞానము మరియొక స్థలమునుండి రావలసినదిగాదు. మేఘము వదలునప్పుడు సూర్యుడు స్వయముగానే వెలుగునట్లు ఆత్మశక్తిగూర్చియు అట్లనే యెఱుంగవలెను. అరణిని మథించుచురాగా రాగా అగ్ని ప్రజ్వలించునట్లు ఆత్మచింతనయందు ఏకాగ్రతగలిగి ధ్యానము చేయుచున్నవారికి దైవత్వ ప్రాప్తియు తప్పక గలుగుచుండును.

రెండు ప్రాణశక్తులు చేరునప్పుడు విద్యుచ్ఛక్తి యేర్పడి ప్రకాశించు నట్లు ఆత్మ పరమాత్మ ఐక్యము, లేక మనస్సు ఆత్మల ఐక్యము, లేక జీవేశ్వరుల ఐక్యము కలుగునప్పుడు దివ్యజ్ఞానము ఏర్పడును. అనగా అనాత్మభావము నశించి ఆత్మభావను (జ్ఞేయము)లో నిలకడ గలుగునప్పుడు దైవస్థితి జీవులకు గలుగుచుండును. ఇట్టిస్థితి జ్ఞానమును దాటిన తర్వాత జ్ఞేయములోనికి ప్రవేశించిన మాత్రమే సిద్ధించును. జ్ఞానమును దాటుటయనిన జ్ఞానికుండవలసిన సుగుణము లన్నియు పూర్తియైన పిదప మాత్రమే జ్ఞేయమందు ప్రవేశము సిద్ధించునని అర్థము జ్ఞానశబ్దమునకు ఆత్మజ్ఞానమని కూడ అర్థము గలదు. జ్ఞానికుండవలసిన గుణములకున్ను అదే అర్థము ఏర్పడియున్నది. ఇచట జ్ఞానియొక్క గుణములనే జ్ఞానమని చెప్పినదని గ్రహించుకొనవలెను.

జ్ఞానికుండవలసినది సామాన్యముగ పుణ్యకర్మలకు సంబంధించిన గుణములని గ్రహించినచాలదు. సంయములకు, ధ్యానపరాయణులకు ఉండ వలసినది ధారణాధ్యానపరాయణుల కుండవలసిన అమానిత్వాది సుగుణ సమూహమనియే గ్రహించుకొనవలెను. సరోవరములు, చెరువులు మొదలగు నవి దృఢమైన కట్టలచే ఎట్లు బాగుగ సంరక్షింపబడుచున్నవో అలాగున బ్రహ్మనిష్ఠులయొక్క అధ్యాత్మజ్ఞానముకూడ నియతియను దృఢబంధనముచే రక్షించుకొనవలెను. తుపాకిమందు మొదలగువానికి గంధకము, బొగ్గు, వడును మొదలగునవన్నియు సరిగా నుండునపుడు మాత్రమే ఆ మందు మనము తలంచినప్పుడు పనిచేయును. వానిలో నేదైన సరిగా లేనిచో అది పనిచేయజాలదు, అలాగున ఆత్మ నిష్ఠనకు విధింపబడిన నియమములన్నియు సరిగా నుండిననే ఆతడు ధ్యానమునకు గల్గెడు ప్రతిబంధములను, హృదయ గ్రంథులను (ఆవరణములను) నశింపజేయును. మఱియు ఒకరి కుండవలసిన అవయవములన్నియు సరిగా నుండిన మాత్రమే లోకవిషయ జ్ఞానములన్నియు వానికి చక్కగ గలుగుచుండును. నేత్ర మొక్కటిలేక తక్కిన అవయము లన్నియు ఉండినను ఏలాగున దృశ్యజ్ఞానముగలుగదో ఏలాగునకర్ణేంద్రియము లేనిచో శబ్దజ్ఞానము తెలియదో, అదేరీతిగ ఏ యింద్రియము లేక పోయినను దానివలన కలిగెడు ప్రపంచజ్ఞానమెట్లు గోచరముకాదో, అలాగున బ్రహ్మనిష్ఠ కుండవలసిన నియమము లన్నియు గలిగియుండనిచో ఆత్మలోకములో గలుగవలసిన జ్ఞానమున్ను పూర్ణముగ గలుగ నేరదు అంగహీను డేలాగున పుణ్యజన్మముగలవాడు కాడని జనులు చెప్పుచుందురో, అలాగున జ్ఞానాంగము లన్నియు పూర్ణముగా లేనివాడు అధ్యాత్మలోకములో, పుణ్యమందు కొఱత గలగినవాడని తలంచవలసి యుండును, మహనీయులు ఎంత మహిమ గలవారైనను తమయొక్క నియతిని విడచియుండజాలరని అనేక శాస్త్రము లుద్ఘోషించుచున్నవి.

అబ్ధివద్ధృత మర్యాదా భవన్తి విగతాశయాః।
నియతించ నముంచంతి మహా భాస్కరా ఇవ॥

సముద్రమెంత గంభీరమై, గొప్పదై, విశాలమైయున్నప్పటికిని కట్టదాటి లోకములోని కెట్లురాదో, సూర్యాది మహాగ్రహములు సృష్ట్యా

రింభమునుండి నేటివఱకు మహాశక్తి, గొప్ప తేజస్సు గలిగి యున్నను తమ జ్యోతిశ్చక్రరేఖనుండి యెట్లు తప్పకయున్నవో, నిజమైన బ్రహ్మవేత్తలును అలాగున వర్తింపుదురేగాని నియతి నతిక్రమించి యొక క్షణమైన నుండ జాలరు సూర్యాదిగ్రహములు స్వస్థానము నుండి చలించిన ప్రపంచ మేలాగున ధ్వంసమైపోవునో, అలాగున ప్రపంచమును జ్ఞానబోధచే నడుపు వారున్ను, ధర్మమార్గ ముపదేశించుచు జనులను అధర్మమునుండి మఱలించు వారునగు బ్రహ్మనిష్ఠులున్ను నియతినుండి దూరులైన ప్రపంచము దుఃఖ మయమై, హింసాపరమై, దయా శూన్యమై, జ్ఞానరహితమై, అజ్ఞానమయ మగు గాఢ తమస్సులోబడిపోవలసి యుండును. ఇప్పుడు లోకములో ఏదైన లోపమున్నచో, సరియైన బోధకులగు బ్రహ్మనిష్ఠులు లేకపోవుటయే దానికి కారణముగాని మఱి యొకటిగాదు రైలును నడుపుడ్రైవరున్ను, గార్డున్ను సరిగా లేనిచో ప్రయాణికుల కెట్లు అసాయము గలుగునో అలాగున ప్రపంచ మును ధర్మమార్గములో నడపెడు సాధువులు, సన్యాసులు, బ్రహ్మనిష్ఠులు మొదలగువారందఱును నియతిలో నిష్ఠ గలిగి యుండనిచో వారున్ను, ప్రపంచమున్ను అంధకారములోనికి దిగిపోవును.

అంత స్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకమ్।
న నశ్యతి తమోనామ కృతయా దీపవార్తయా॥

గృహాంతరాళములో నిబిడమైయుండు చీకటి దీపపువార్తవలన నెట్లు నశింపజేయ సాధ్యముకాదో, అలాగున బుద్ధిగుహయందు నిబిడమైయుండు అజ్ఞాన తమస్సు నశించుటకు శాస్త్రశ్రవణము, పఠనము, పాఠనము మాత్రము చాలదు. దానియందు చెప్పినలాగున ఆచరించిన మాత్రమే తమోరాహిత్యము గలుగును. దీపము వెలిగించిననేగదా చీకటి యింటినుండి తొలగును.

ఆచారహీనం న పునంతి వేదాః
యద్యప్యధీతాః సహ షడ్భిరంగైః।
ఛన్దాంస్యేనం మృత్యుకాలే త్యజన్తి
నీడం శకున్తా ఇవ జాత పక్షాః॥

వేదములు కడవలకు చదివినను నీతిబద్ధుడు కానిచో అవి వాని ఆత్మను శుద్ధము చేయజాలవు, వేదముగాక వేదాంగములుగూడ అధ్యయనము చేసినను, వేదాంగములగు షట్ఛాస్త్రములను అర్థముతో బఠించినను ఆచరణ లేనివాని నవి పవిత్రము చేయజాలవు. అంతేగాక అట్టి అధ్యయనములు పరలోకములో వానికెట్టి సహాయము చేయజాలవు ఎంత సౌందర్యవంతమగు దేహము గలియున్నను అంతకాలమున నెట్లది వీడిపోవునో ఆలాగున ఆతడు చదివిన వేదవేదాంగము లన్నియు మరణకాలమున ఆత్మను విడచిపోవును. పక్షియొక్క పిల్లలు రెక్కలు వచ్చినపుడెట్లు గూటిని విడిచి పెట్టిపోవునో శాస్త్రపఠన పాఠనములుగూడ ఆలాగుననే యుండును.

1. ఆత్మోన్నతి మార్గములో (మోక్షద్వారములో) ప్రవేశింప దలంపు గలవారలకు ఏకోపాయ మొకటికలదు, ఇది ముక్తి సౌధమునకు శిలాస్థాపనము వంటిది మోక్షభవనము దీనిపైననే ప్రతిష్ఠింపబడి యున్నది. ముక్తికిదియే ప్రాణాధారము. పుణ్యజీవులకు సాధించుటకు, ఆచరణలో నుంచుటకు ఇది అంతప్రయాసమైన పని కాదు. అదేమన, మీ వాక్కులోను, సంకల్పములోను, కరచరణాదుల క్రియలలోను, ఏలాటి ప్రకృతిదోషములు గాని, చెడుసంకల్పములుగాని, విషయవాసనలుగాని, ఎవరిపైనను ద్వేషము గాని, ఏ విధమైన కోరికలుగాని మీయందు లేనను నిర్మలబుద్ధి కలుగవలెను. మీ చిత్తములోగాని, బుద్ధియందుగాని, సంకల్పమందుగాని తుదకు రోమములందుగాని, ఏ విధమైన మాయామాలిన్యములు, విషయవాసనలు గాని లేవని అంతరాత్మసాక్షిగ అనుభవము గలుగవలెను. అప్పుడు మీ జీవితమంతయు మారిపోయినట్లు మీకు గోచరము కాగలదు. ఉత్కృష్ట మానవత్వము గాక దేవత్వమునకు మించినస్థితి మీకు గలిగినట్లు బోధము కలుగును. అప్పుడు అగ్ని ద్రావకములో శుద్ధిచేసిన మలినబంగారమువలె మీరు శుద్ధులైనట్లు ఆత్మలో గోచరము కాగలదు. అపుడు మీయొక్క ప్రసన్నభావమునకు ప్రశాంతస్థితికి, హద్దు ఉండదు. "బ్రహ్మనిష్ఠయొక్క మహిమ యేమని చెప్పవచ్చును!" అని మీలో మీకు ఆశ్చర్యము గలుగుచుండును. ఇట్టి త్రికరణశుద్ధిగలుగనిచో మానవుని అధ్యాత్మ ప్రయత్నము లన్నియు బూడిదయందు హోమమిచ్చిన హవిస్సువలె వినష్టమై పోవును. ఈ విషయములో చదివినవారు, చదువనివారును, స్త్రీలున్ను, పురుషులున్ను

సమానావస్థగల్గియుందురు. ఇది కేవలము ఆత్మయొక్క అనుష్ఠానము మాత్రముచేతనే కలుగును. కాని మఱియొక మార్గముచే కలుగునవిగాదు. అపుడు మీ హృదయములోను, మీ దేహములోను, ఇంతేకాదు. ప్రతిరోమ కూపములోను, రోమాగ్రభాగములోను మీరు పరిశుద్ధు లనియు, పుణ్యజీవు లనియు బోధము గల్గును. ఈ యధ్యాత్మ జ్ఞానమార్గములో ప్రవృత్తి గలుగుటకు ఎన్నియో జన్మములనుండి చేసిన పుణ్యమిప్పటికి ఫలమునకు వచ్చినదను భావము గలుగుచుండును.

ఈ త్రికరణశుద్ధిలో దేనియందైనను మాలిన్యము గలిగియున్న దనితోచినవెంటనే ప్రాయశ్చిత్తము చేసికొనవలెను. అప్పుడు మలినము త్రొక్కినవాడు కాలు కడుగుకొనిన ఎట్లు శుద్ధుడగునో అలాగున పాపము లన్నియు నశించును. అట్టి ప్రాయశ్చిత్తమునకే పంచప్రాయశ్చిత్తమని పేరు గలదు. ఉత్కృష్టధర్మములో, నిర్మల గురుభక్తిలో, శ్రేష్ఠమైన దైవభక్తిలో విశ్వాసముగలవారు అలాగున ప్రాయశ్చిత్త మాచరింతురు. ఆ ప్రాయశ్చిత్త పంచక మేదనిన:— (1) ఉపవాస వ్రతము, (2) మౌనము, (3) మంత్ర జపము, (4)పశ్చాత్తాపము (ఈశ్వరప్రార్థన), (5) అన్నశాంతి. ఈలాగున శక్తికొలది చేయుచు వచ్చిన కొంతకాలమునకు మీ త్రికరణములలోగల దోషము లన్నియు నశించును ఈ మూడుకరణములు శుద్ధములు గానిచో దుర్బలమగు పునాదిపై గట్టినమేడవలె లేక గోపురమువలె కొంత కాలము నకు పతనము గలుగును. ఇందు సందేహము లేదు. కనుకనే ఏ కార్యమైనను త్రికరణశుద్ధిగ చేయవలెనని చెప్పు రహస్యము. ఈ స్థితి మీకు గలుగనిచో మీ యత్నము లన్నియు ఊషరక్షేత్రమందు చేసిన కృషివలె ఫలమును గలుగచేయకుండును. లేక కళాయిలేని పాత్రలోవండిన పప్పు పులుసువలె ఆత్మప్రాప్తిలో ఉన్నతి కలుగదు. అట్టివారి సంసర్గముచే తదితర జీవులు పవిత్రులగుట దుస్తరము.

(2) ఇకను, ఆత్మశుద్ధిగల్గి, మనః ప్రసన్నతయందే కొఱతలేక యుండదలంచిన ఒక చిన్నసాధన కలదు. దీనికిన్ని ఏకోపాయము అనియే పేరు. అదేదన ముఖములో ఏలాటివికారము గలుగనీయక మాట్లాడునట్లు అభ్యసించుటయే, ముఖారవిందము, వికసించియుండు తెల్ల దామరపుష్పము వలె యుండేలాగున, అతిజాగ్రత్తతో అభ్యసించుచు వచ్చిన ప్రకృతి వికృతు

శేవియు ఆత్మను మాలిన్య పఱుపజాలవు మఱియు సాత్త్వికగుణ మెల్లప్పు డున్ను తన్ను విడివియుండజాలదు. అందువలన రాజసతామసగుణములు దగ్గఱకు చేరనొల్లవు. అయితే ముఖారవిందము ప్రసన్నముగానుండిన చాలదనియు, హృదయారవిందముకూడ స్వచ్ఛముగా నుండేలాగున సాధకులు అభ్యాస మొనర్చు కొనవలెననియు జ్ఞప్తియందుంచుకొనవలెను. ముఖములో విసుగు చిహ్నముగాని, అప్రీతియొక్క గుఱుతుగాని, విషాదము యొక్క లాంఛనముగాని కలుగకూడదు. ఇట్లు చెప్పుటచే నిక కోపము మొదలగునవి కూడనేకూడదని వేఱుగ వచింపవలయునా? దీనిచే మీ హృదయము సదా సంతోషభరితమై యుండునదే గాక, ప్రేమయు, శాంతియు మిమ్ముల విడిచిపెట్టి ఒక్క నిమిషమైన నుండజాలవు. అప్పుడు మీకు ప్రపంచములో విరోధు లెవ్వరును ఉండరు. అందఱును మిత్రులే, మీ హృదయము క్షీరసాగరమువలె గంభీరమై స్వచ్ఛమైయుండును. ప్రపంచ కార్యము లనేకములు మిమ్ములను బాధించుటకు వచ్చినను, అనగా మీ మనస్సును మాలిన్యపఱుపచూచినను సాధ్యము గాకుండును. సింహము నివాసము చేసెడు స్థలమునకు మత్తగజములు మున్నగు ఏ అడవిమృగము లును రానట్లు, ఆత్మను మలినపఱచు కర్మలెవ్వియు అపుడు దగ్గఱకు రాజాలవు. ఒకవేళ ప్రాపంచిక కర్మలందెపుడైన విశ్రాంతిగలుగక పోయినను ఉత్తరక్షణముననే పరమశాంతి ప్రవాహము ప్రవహింపజొచ్చును.

మఱియొక మనోజయోపదేశము – ఇదిన్ని పై జెప్పిన దానివలె నుండును. ఇట్టి అభ్యాసముగలవారికికూడ మనశ్శాంతియు, ప్రసన్న సౌఖ్య మును కలుగుటలో సందేహము లేదు అదేమన, మాటలను అణచి, మౌనముగానుండి సంజ్ఞలచే సమస్తకార్యములను నిర్వహించే లాగున అభ్యసించుకొనుటయే. కాని యిది మౌనవ్రతమని తలంచ నక్కఱలేదు. అత్యవసరమునకు మాత్రము అర్థవంతముగాను, సూక్ష్మముగను మాట్లాడ వచ్చును. కాని సంజ్ఞవలన నిర్వహింప సాధ్యము గానప్పుడు మాత్రమే విన్నగను, సారవంతముగను మాట్లాడవలయును. దీనివల్లగూడ, వెలుతురు దగ్గఱకు చీకటిచేరనట్లు తమోగుణముగాని, ప్రకృతివల్ల గలిగెడు వికారము గాని మనుజుని యొద్దకు చేరవు అంతే గాక ఇట్టి అనుష్ఠానమువల్ల బుద్ధిబల మధికరించును విజ్ఞానమున్ను విపులముగా వృద్ధినొందును. పన్ననన్న

దారములచేర్చి గొప్ప మోకు చేసిన, అది యెంతయో బలముగ నుండునట్లు నానాప్రకారములుగ పోవుచుండెడి మనస్సు నిశ్చలత్వ మొందునపుడు. ఏకాగ్రమగునపుడు, గలిగెడిశక్తియు మహత్తరమైనదగును, పెద్దమోకుచే ఎంత గొప్ప జంతువునైనను ఏలాగున కట్టివేయవచ్చునో, అలాగున ఎట్టి మనశ్చాంచల్యమునైనను దానిచే నణచవచ్చును. వృత్తులను నిగ్రహించ వచ్చును. ఇది యొక గొప్ప అభ్యాసమేయగును కొంతకాలము సేవించిన మీరే దానివలన గలిగెడు మహిమను తెలిసికొనవచ్చును.

ఇంద్రియగ్రామసంగ్రామ సేతునా భవసాగరః।
తీర్యతే నేతరేణేహ కేనచిన్నామ కర్మణా॥

ఇంద్రియజయమనెడు సేతువుచే సంసారమును దాటవచ్చును. ఇంతకు సులభమైన మార్గము ప్రపంచమున మఱియొకటి లేదు. ఇట్టి భవసాగరోత్తరణము మఱి యేకర్మచేతను గలుగునది కాదు.

(3) ఉపదేశద్వయము :— దీనివలనగూడ మనోజయము చేకూరును. ఇది పైజెప్పిన రెంటికన్నను చాల గొప్పది ఆత్మతత్త్వ మెఱింగిన వారికిని బుద్ధిశుద్ధమైనవారికిని మాత్రమే యిది సిద్ధించును. దీనిసాధన యెట్లనిన, దృశ్యవృత్తులు ఆత్మలోనికి రానీయక చూచుటయు, ఆత్మభావము మఱుపు గలుకనీయక చేయుటయు నగును. అనగా, ప్రకృతి ఉదయముగాకయు, ఆత్మభావము అస్తమింపకయు చేయుట యగును. అయితే ఆత్మ యెటు వంటిది అనువిషయము అనుభవము గలిగిన మాత్రమే యిది సాధ్యమగును దేహాది బుద్ధ్యంతమువఱకుగల విషయములన్నియు నిగ్రహింపబడవలెను. వీటన్నిటికంటె విలక్షణమై వెలుగుచుండెడి ఆత్మయే తనస్వరూపమను బోధము గలుగవలెను. పై భావనచే మనోజయము త్వరలో సిద్ధించును. ఇది చాల గొప్ప అనుష్ఠానమేగాని సామాన్యమని యెన్నడు తలంపరాదు. కాని ఈ అభ్యాసము జ్ఞానగుణముగల్గి జ్ఞేయములో నిలుకడ గలిగినమాత్రమే సిద్ధించునని నమ్మవలెను, దీనివలన ప్రకృతియొక్క అస్తమయమున్ను, ఆత్మయొక్క ఉదయమున్ను అతి త్వరతో గలుగుచుండును. అన్నిటికిన్ని త్రికరణశుద్ధి ఆధారభూతమని మఱువకూడదు.

ఆచారాల్లభతే హ్యాయురాచారా దీప్సితాః ప్రజాః।
ఆచారాద్ధనమక్షయ్య మాచారో హ్యాంత్యలక్షణమ్॥

ఆచార మనినను నియతి యనినను ఒక యర్థము. నియతివల్ల అక్షయమగు ఆయస్సు గలుగును. నియతివల్ల జనులకు వాంఛితార్థము లన్నియు గలుగును. మఱియు నియతివల్ల అక్షయమగు ధనముకూడ చేకూరును· గుణము లన్నిటిలోను ఆచారము అంత్యలక్షణము, అనగా దానికి మించినది మఱియొకటిలేదని భావము

ఎవని యింద్రియములన్నియు శుద్ధములై, స్వాధీనములై యుండునో అతనికి ఆ యింద్రియములే పరమబంధువులై సదా సుఖములు గలుగచేయు చుండును. ఎవని యింద్రియములు అస్వాధీనములై విషయవాంఛలచే మాలిన్యము గలిగియుండునో, అతనికి ఆ యింద్రియములే శత్రువులై సదా క్లేశము గలుగచేయుచుండును. మణిరత్నమాలయందు శ్రీశంకరభగవత్పాదాచార్యులవా రిట్లుపదేశించియున్నారు.

కే శత్రవః సన్తి నిజేంద్రియాణి
తాన్యేవ మిత్రాణి జితాని యాని

దీని యర్థము పైన దెల్పినదే. గీతలో శ్రీ కృష్ణభగవానులున్ను ఈలాగుననే ఉపదేశించియున్నారు.

బన్ధురాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మైవాత్మనా జితః।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాఽఽత్మైవ శత్రువత్॥

ఎవడు తన యింద్రియములన్నింటిని నిగ్రహించుకొనునో; అతనికి ఆయింద్రియములే పరమబంధువులవలె సదా సౌఖ్యమును గలుగ చేయు చుండును; ఎవడు విషయసుఖములనుండి యింద్రియములను మఱలింప శక్తి లేనివాడై యుండునో వానికి ఆయింద్రియములే పరమ శత్రువులవలె బాధను కలుగచేయుచుండును. ఇంద్రియములు స్వాధీనము కావలెనన్నయెడల, రజస్తమోగుణములు నశింపవలెను. రజస్తమోగుణములు నశింపవలెనన్న నిష్కామ్య కర్మయోగము· నిరంతర భగవచ్చింతన గలిగియుండవలెనని శ్రీ కృష్ణభగ

వాను లుపదేశించిరి. శ్రీయోగవాసిష్ఠములోను ఈ విషయమై యిట్లు తెలుప బడుచున్నది.

యస్యాఽజ్ఞానాత్మనో జ్ఞస్య దేహ ఏవాత్మభావనా ।
ఉదితేతి రుషైవాక్ష రిపవోఽభిభవంతి తమ్॥

దేహాత్మభావనగల వాడును, ఇంద్రియములు వశమ్మునలేనివాడును నగు అజ్ఞానిని వాని యింద్రియము లను శత్రువులు అతిక్రోధముతో కొట్టి తరిమి, బాధించుచుండును. మఱియు

యస్యజ్ఞానాత్మనో జ్ఞస్య సత్యేవాత్మని సంస్థితిః ।
సంతుష్యైవాక్ష సుహృదో న ఘ్నంతి తమనిందితమ్॥

ఉత్తమ అచరణగలవాడును, సత్యస్వరూపమగు ఆత్మయందు స్థితి బొందినవాడును నగు జ్ఞానిని వాని యింద్రియము లేమియు బాధింపక, పైగా అనుకూలాచరణముచే వాని జ్ఞానమును వృద్ధి పఱచుచు ఇవ్విధముచ వానిని సదా సంరక్షించుచుండును.

(4) ఇక పంచశీలమనునది యొకటి కలదు. ఎట్టి నియమములేని వారైనను ఈ పంచశీలాచరణవలన తప్పక నియమ్మసంయుక్తులు కాగలరు. ఆపంచశీల మెద్దియనిన (1) ఆహారనియమము (2) నివాసనియమము (3) అనుష్ఠాననియమము, (4) సహవాస (సంసర్గ) నియమము, (5) క్రియా నియమము.

1. ఆహారనియమమనగా నియమితకాలములో నియమితాహారమును నియమము ననుసరించి భుజించవలయుననుట. తదితరకాలములో ఏ వస్తువులున్ను భుజింపరాదని నియమము గలిగియుండవలెను. అదిన్ని దినమున కొకసారిగాని, రెండుసార్లుగాని యుండవలసినదేకాని అంతకధిక ముగ నుండరాదు. ఒకసారి భుజించిన చాలునని తలంచువారు ధన్యులు. లేనిచో రాత్రులందేదైన స్వల్పాహారముండిన బాధకరముకాదు. అదిన్ని ద్రవపదార్థమైయుండుట మఱింత మంచిది. దానివలన ఆరోగ్యమున్ను, చురుకుతనమున్ను, మిగుల జాగ్రతయు తప్పక కలుగును. ఈ ఆహారము కూడ ఎక్కువపదార్థములతో కూడినదిగ యుండరాదు. కాని నిండానీరస

ముగాగాని, హీనముగగాని యుండుటయు మంచిదికాదు, శుద్ధమైన వస్తువులైనను అధర్మమార్గమునుండి వచ్చినచో పాపాహారమువలె అది జీవుని మలిన పఱచును. ఈవిషయములో సాధకులెంత జాగ్రతవహించిన అంతక్షేమమే వారికి కలుగును. ఆహారవిషయములో వస్తుశుద్ధియు, ఉపయోగించు పాత్రల శుద్ధియు, పాకము చేయువారి శుద్ధియు నుండవలెను.

2, ఇక నివాసనియమమును గుఱించి చెప్పెద. ఏస్థలము నిష్ఠకు అనుకూలపడునో, అట్టిస్థలమే యుండవలెను. విషయముల నంకురింప చేసెడు ప్రకృతి యేమియు అచ్చోటనుండరాదు: జిహ్వేంద్రియ గుహ్యేంద్రియముల నిగ్రహము బాగుగా గలిగియుండవలెను, ఈద్వారములను మూసినవారికి మోక్షద్వారము తెఱువబడును.

3, అనుష్ఠానముకూడా కాలసమయమున తప్పక చేసికొనవలెను. అనుష్ఠానముపూర్తి అయిననే భోజనము చేయవలె నను వ్రత మవలంబింపవలెను, ఒక్కరోజైనను అనుష్ఠానము వదలియుండరాదు. మనస్సు రాగిపాత్రవంటిది. నిత్యము తోమినమాత్రమే అది శుద్ధముగానుండును. మనస్సుయొక్క స్వభావ మటువంటిది. అలాగున చేయువారి జ్ఞానమెల్లప్పుడును నిరావరణముగ ప్రకాశించుచుండును. కొలిమిలోనుండు ఇనుము అగ్నిమయమై జ్వలించుచుండునట్లు, అట్టివారిచిత్తము (మనస్సు) మొదలగు నింద్రియము లన్నియు) జ్ఞానమయమై తేజోమయమై వెలుగుచుండును:

4. సహవాసము :- యోగ్యులుకానివారు, విరక్తులుకానివారు. కరుణ లేనివారు, పరోపకారబుద్ధిలేనివారు మున్నగు జనుల సంసర్గ మెప్పుడును చేయరాదు సహవాసము రంగువంటిది. వస్త్రము తెల్లదైనను రంగులు నీలముగానో, ఎర్రుపుగానో, పసుపుగానో యుండిన అవస్త్రమున్ను అట్టి వర్ణముకలదే యగును. విషయములతో సహవాసముగల నిర్ధనుడైనను, భోగులతో సంసర్గముకల యోగియైనను, నియమము లేనివారి సంసర్గము చేయు సంయమియైనను సరే, అట్టివారి సహవాసమున్ను చేయరాదు. నూనెచే తడిసిన కాగితమ్ము, ప్రక్కనుండు కాగితములను చెఱచునట్లు ప్రపంచవిషయములందు వారి సంసర్గముచే తనకున్ను అట్టిదోషము గలుగు చుండును.

౫. క్రియానియమము :- ఏ సమయములో ఏపని ఏలాగున చేయవలెనో, ఆసమయములో ఆపనిని ఆలాగున చేయునట్లు ఇంద్రియములను నియమింపవలెను. ఈవిషయమున గాలి, వాన, చలి, యెండ మొదలగు వానివల్ల భయమునుపొందక, వాని నెదిరించి కార్యమును నిర్వహించే మనశ్శక్తికలిగియుండవలెను. తనకు నియమింపబడినపని యెంతతక్కువైనను మహాశ్రేష్ఠమయినదిగ తలంచి అద్దాని నుత్సాహముతో నెఱవేర్చు స్వభావము గల్గియుండవలెను. నియమము నాచరింపని సన్యాసికంటెను. బ్రాహ్మణునికంటెను, నియమమును పాలించెడు తక్కువజాతివాడే శ్రేష్ఠుడు. ఈపై నియమము లన్నియు ఆత్మను మలినముచేయక సదా కాపాడుచుండును. శూరులైన యంగరక్షకులు ప్రభువును సదా సంరక్షించునట్లు ఈనియమము లన్నియు ఆత్మను ఏ విపత్తులోనికి బడనీయక చూచుచు సదా సంరక్షించుచుండును అదే దీనిలోగల రహస్యము. ఇట్టివారికి ఏకాలమునను పతనము కలుగదు. వ్రతభ్రష్టత్వమును కలుగనేరదు. ఇవ్విధమున నియమముచే బాగుగ సంరక్షింపబడిన జీవితము,బాగుగ కాపాడ బడుచుండు పుష్పోద్యానమువలెను, లెస్సగ సంరక్షింపబడు ఫలవృక్షములవలెను, శోభాయమానమై పుణ్యమయమై, బహుజన ప్రీతికరమైయుండును. ఈ విషయము లన్నియు సాధువులు చక్కగా తెలిసికొని యాచరింపదగినవి.

పూర్వఋషు లిట్టి సుగుణములు గలిగియున్నందుచే వారు ఇప్పటికి కూడ సర్వజనుల చేతను వంద్యులగుచున్నారు. ఇప్పుడుండు వారిలో చాల మందికి ఇట్టి పవిత్రనియమము లేనికారణముచే వారు లోకముచే నిందితులైరి. పుష్పోద్యానపాలకులు వృక్షములకు ఏర్పడెడు క్రిమికీటకాదుల నేలాగున తీసి వైచి వాటిని శుద్ధమొనర్చుదురో, ఆలాగున బ్రహ్మనిష్ఠులు తమలో ప్రకృతిగుణములేవైన ప్రవేశించుచుండునా యని అతి జాగరూకతతో కనిపెట్టి దోషముల చేరనీయక చూచుచుండవలెను. అట్టివారే బ్రహ్మనిష్ఠ యొక్క పూర్ణఫలమును బొందగలుగుదురు.

యో న నిర్వ్యాసనో నూనం సర్వధర్మధరోపి సః।
సర్వజ్ఞోప్యభిత్తో బద్ధః పంజరస్థో యథా ఖగః॥

సమస్త ధర్మముల నెఱింగినను, సర్వజ్ఞుడైనను, వాసనల త్యజింపనిచో పంజరమందలి పక్షివలె నాతడు బద్ధుడే యగును.

స్వభావం సంవిజిత్యాదా వింద్రియాణాం సచేతసామ్।
ప్రవర్తతే వివేకే యః సర్వం తస్యాశు సిద్ధ్యతి॥

విషయములవైపునకు పరుగిడు మనస్సుయొక్కయు, సర్వేంద్రియములయొక్కయు దుస్స్వభావమును జయించి అధ్యాత్మశాస్త్రములందు ప్రవృత్తిగల్గియుండువానికి అంతయు సత్వరము సిద్ధించును.

స్వభావమాత్రం యేనాంతర్న జితం దగ్ధబుద్ధినా।
తస్యోత్తమపదప్రాప్తిః సికతా తైలదుర్లభా॥

తన దుస్స్వభావమును మొమ్మొదట జయించని మూఢునకు, ఇసుక నుండి తైలమూతీయుట యెంత దుర్లభమో, ఆత్మపదప్రాప్తియు అంత దుర్లభమైనది.

యావన్నాధిగతం బ్రహ్మ న విశ్రాంతం పరేపదే।
తావత్తన్మ న నత్వేన న ధ్యానమవగమ్యతే॥

బ్రహ్మము నెఱుంగనంతవఱకును, ఆత్మపదమందు విశ్రాంతిని బొందనంతవఱకును, విషయచింతన యున్నంతవఱకును జీవున కాత్మధ్యానమందు నిలుకడ కలుగదు.

సహస్రేభ్యః సహస్రేః కశ్చిదుత్థాయ వీర్యవాన్।
భినత్తి వాసనాజాలం పంజరం కేసరీయథా॥

ప్రయత్న మొనర్చునట్టి లక్షలమంది జనులలో ధీరుడగునొకానొకడు మాత్రమే, పంజరమును సింహము భేదించునట్లు వాసనాజాలమును భేదింపివైచును.

శాస్త్రస్యాస్యతు యన్నామ వాదనం తద్వినా పరః।
అభ్యాసో దృశ్యసంశాంత్యై న భూతో న భవిష్యతి॥

మోక్షోపాయమనబడు వేదాంతశాస్త్రమును గురుముఖతః శ్రవణమొనర్చి ఆ పిదప మనననిదిధ్యాసనాదులచే దానిని బాగుగ నభ్యసింపవలెను. దృశ్యభ్రమ శమించుట కింతకు మించిన యుపాయమెద్దియు నేటివఱకు మఱియొకటి యుండయుండలేదు. ఇకనుండబోదు.

యథా భర్జితబీజస్య ప్రరోహిత్వం వినశ్యతి।
తథాత్మజ్ఞానినో నిత్యం జగద్బుద్ధి ర్విలీయతే॥

ఏలాగున అగ్నిలో వేయించిన బీజముయొక్క అంకురత్వము నశించియుండునో, ఆలాగున ఆత్మజ్ఞానాగ్నిలో దహించిన చిత్తముగలవానికి దృశ్యవిషయములు నశించియుండును. (విషయాంకురములు హృదయములో పుట్టుచుండిన, ఇంకను జ్ఞానాగ్నియందు చిత్తము దగ్ధము కాలేదని సాధకుడు గ్రహించుకొనవలెను,

ఓంకారాదర్ధమాత్రార్థం భావయ న్మౌనమాస్థితః।
సంశాంతసర్వసంకల్పః ప్రశాంతకలనాగణః॥

శాంతుడును, సంకల్పరహితుడును, కల్పనావర్జితుడునై ఓంకారముయొక్క త్రిమాత్రలకు పరమగు అర్ధమాత్రచే సూచితమగు బ్రహ్మమునే భావించుచు మౌనము వహించి యుండుటయే తురీయస్థితి యనదగును.

(కాలము)

కాలమును గుఱించియు చాలమంది అజాగ్రతను పొందియున్నారు. సామాన్యముగ కొంతపుణ్యస్వభావమున్న, కొంతవరకు ఆత్మశుద్ధియు గలిగినవారుకూడ కాలమును బాలుమట్టుకు వ్యర్థపఱచుచున్నారు. వ్యర్థములైన మాటలచేతను. వ్యర్థములైన పత్రికలను పుస్తకములను చదువుటచేతను, వ్యర్థముగ స్నేహితులవద్ద తిరుగుటచేతను సమయమును వ్యయపఱచుచుందురు. ఈ విషయములోను జాగ్రత్త వహింపనిచో జీవుడు కృతార్థుడు కాజాలడు. బంధవిముక్తికలిగి మోక్షసౌఖ్య ప్రాప్తినొందుట సామాన్యకార్యమని తలంపరాదు. ఒక్క నిమిషమైనను నిరుపయోగముగా పోవుచుండిన యెవడు పరితాపమొందునో, అట్టివాడే కాలముయొక్క మహిమను గుర్తెఱింగినవాడగును. పరితాపమేకాదు. నేత్రములనుండి యెవనికి ధార

ధారగా నీరు ప్రవహించుచుండునో, అతడే నిజమైన జీవిత రహస్యము నెఱిఁగినవాడగును. ఏలన ఒక్కొక్క క్షణమందు జీవితము నశించిపోవు చుండును. అది రంధ్రము గలిగిన పాత్రలోగల జలమువలె క్షయము నొందుచుండును. పోయినదానిని మఱల సంపాదించుట సాధ్యమైన పనికాదు. పూర్వజన్మములో ఎంతో సుకృతము చేసినందుచే ఈజన్మమున అది లభించి యింత ఉత్కృష్టస్థితి చేకూరినది.

వ్యాపారము చేయువారు బాగుగా వ్యాపారము జరుగుచున్నపుడు. అది మాని వ్యర్థముగ మాట్లాడుచు కూర్చుందురా? ఏ వ్యాపారమున్ను, లేనపుడు మాత్రము ఇతరులతో సంభాషణ చేయుచుండవచ్చును. అదేరీతిగ జీవితముచే సంపాదింపవలసిన విజ్ఞానమున్ను, పుణ్యమున్ను సంపాదింప చూడక వ్యర్థభాషణములచే కాలము గడుపుచుండువాడు జీవితముయొక్క మాహాత్మ్యము నెఱింగినవాడు కానేరడు. కాలము అమూల్యమైన దనియే విజ్ఞులమతము.మితభాషణ మవలంబించిన ఎన్నడున్ను ఇతరుల తనదగ్గర కూర్చుండబెట్టి కబుర్లుచెప్పి కాలము నష్టపరచకుండును. అందువలన వాని దగ్గఱకు ఎవరున్ను చేరరు. కార్యదీక్షకలవాడు "మేల్" తపాలు రన్నరువలె నుండును. అతడు తపాలుతీసికొని వెళ్ళునపుడు ఎవరితోను మాట్లాడుట కవకాశముగలదా? దిమ్మరులగు మానవులైనచో త్రోవలో పోవుచుండెడి వారితో నిష్ప్రయోజనమగు మాటల జెప్పుచు వెళ్ళుచుందురు. నిరక్షుడైనవో స్వభావముగ వైరాగ్యము గలిగియుండునేగాని కాలమును వ్యర్థపుచ్చ నొల్లడు.

ఈవిషయమై హిందీలో శ్రీ కబీరుదాసుగారు ఒక కీర్తనపాడియు న్నారు. కబీరుదాసుగారు కాశీలో నివసించియుండిరి. కాశీలో సంధ్యాకాలము వ్యాపారము ఎక్కువజరుగుచుండును. ఏలన, యాత్రికులందఱును పగలు తీర్థదర్శనములకు దేవాలయములకు బోవుచుందురు. ఆకీర్తన యొక్క సారమేమన – జనులారా! ఒకడు అడవిలో ప్రయాణము చేయుచున్నాడు. సహాయముగ రెండవవారు లేరు. ఊరు చేరుటకు ఇంక రెండు క్రోసుల దూరము గలదు, సూర్యుడ స్తమించనున్నాడు. అది కృష్ణ పక్షము. వర్షము కురియుచున్నది. అడవిలో మంచి త్రోవలేదు. పైగా మనుష్యుల భక్షించు

క్రూరమృగము లచట బాలగలవు. అంతేగాదు. భూతప్రేతపిశాచము లచట సంచరించుచుండును: అట్టి తరుణములో తొందరగ నడచిపోయి ఆ యడవిని దాటచూడక అందలి చెట్లను లెక్క పెట్టుచు, పూవులను గోయుచు కాలము గడపువాడు మతిలేనివాడే యగునుగదా! అలాగున జీవితమను సూర్యుడస్తమింప నున్నాడు. తాను సంసారమధ్యమున నున్నాడు. మోహమను కారుచీకటితో కూడిన కృష్ణపక్షరాత్రిగూడి యున్నది. కామక్రోధాదులను పెద్దపులులు సంచరించుచున్నవి. అంతేకాదు, అవిద్య అజ్ఞానమను భయంకర భూతప్రేత పిశాచములు గలవు. ఇట్టి తరుణమున దృశ్యవిషయములోను, ప్రాకృత వ్యామోహములలోను, ప్రపంచవాసనల లోను చిక్కుకొను జీవునిగతి యేలాగుననుండునో యోచించుకొనుడు. అట్టి వానికి వెనుక గలిగెడు సంకటము లపారములు. ఇట్లుండగా దుష్కార్యముల లోను, పాపకృత్యములలోను కాలము వ్యర్థపఱచువారి విషయమై వేఱుగ చెప్పవలెనా? వ్యర్థవిషయములందు కాలముగడుపుట మున్నగునవిలేక, దైవవిచారణ యందుగాని, పవిత్రమంత్రజపమునగాని, ఉత్కృష్టగ్రంథ విచారణయందుగాని, పవిత్రమంత్రజపముగాని, ఉత్కృష్టగ్రంథ విచారణ ములోగాని, సత్కర్మల చేయుటయందుగాని కాలమును వినియోగించిన, ఎంతో యుత్తమఫలమును బొందవచ్చునుగదా! మీరు ఊరకయుండిన, సమయము ఊరకయుండునా? అది నిలుకడలేక పోవుచునే యుండును.

కనుక, పుణ్యాశ్రమములలో చేరుటకు ముందుగాను. బ్రహ్మ విచార మును ప్రారంభించుటకు పూర్వమును సోమరితనమునకు తర్పణము విడువ వలెను. ఇదే విజ్ఞులు దెల్పిన రహస్యము లన్నింటిలోను పరమ రహస్యము జీవితముయొక్క పరమలక్ష్యము పొందువరకు నిలుకడలేక యత్నించువారు మాత్రమే ఈజన్మమున నిర్వాణమును పొందగల్గుదురు. అనగా, ఈశ్వర సాక్షాత్కారమును పొందుదురు. శ్రద్ధగలవానికి సముద్రము అడుగుజల మంతే గాన్పించును. సోమరిదేవత నుపాసించు వానికి అడుగునీరున్న సముద్రమువలె గన్పట్టును. పరిశ్రమశీలునకు మేరుపర్వతముకూడ చిన్న రాతి గుట్టవలెనే గోచరించును రాతిగుట్టేల, చిన్న రాయివలెనే తోచును. ఎత్తిదూరముగ విసరివేయుటయు ప్రయాసమని తలంపడు ఆలస్య పురుష నకు ఒక చిన్నమట్టిపెళ్ళగూడ మహాపర్వతమువలె పెద్దదిగ తోచుచుండును.

అనగా, సోమరులకు ఏచిన్నపనిగూడ భారముగాను దుస్సాధ్యముగాను గోచరించును, ధీరుడును, శ్రద్ధావంతుడగు నరునకు ఎట్టిపనియైనను అతిసులభమేయను బోధ గలిగియుండును. కాలమును ఎట్లు వినియోగ పఱచవలెనో, ఆవిషయమై శివానందలహరిలో శ్రీశంకరు లిట్లు నిరూపించిరి,

> కంచిత్కాల ముమామహేశ భవతః పాదారవిందార్చనైః
> కంచిద్ధ్యాన సమాధిభిశ్చ నతిభిః కంచిత్కథాకర్ణనైః।
> కంచిత్కంచి దవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశామీదృశీం
> యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్ సముక్తఃఖలు

అనగా, ఉమామహేశ్వరా! మీయందు మనస్సు నిలిపి యెడ తెఱపిలేక యొకప్పుడు మీపూజలును, వేఱొకప్పుడు నియతమైన మీ నిరంతర ధ్యానంబులును, మఱియొకప్పుడు మీపాదవందనములును. ఇంకొకప్పుడు మీ (దైవ) సంబంధకథలు వినుటయు, కొన్నివేళల మీ దర్శనములును జేయుచు, మఱికొన్ని వేళల ఈశ్వరార్పణబుద్ధితో సత్కథల జెప్పుచు, సంతోషము నొందువాడు జీవన్ముక్తుడగును. ఈ శ్లోకమువలన. ముముక్షువులు, అభ్యాసులు, ఉపాసకులు ఉండవలసినస్థితి చక్కగ తెలు పడమైనది. అనగా ధ్యానమందు ఎంతసేపు మనస్సునిలుచునో అంతసేపు ధ్యానములోను, దానిలో నుండి తగ్గునపుడు కొంతసేపు స్మరణ, కీర్తనాదుల లోను, మఱికొంతసేపు వేదాంతశాస్త్ర విచారణలోను, ఇక కొంతసేపు ఈశ్వరార్పణబుద్ధితో సత్కర్మల నాచరించుట యందును కాలము గడుప వలసినదేకాని ఒక్క నిమిషమైనను వ్యర్థము చేయగూడదు. గీతయందు శ్రీకృష్ణభగవానులున్ను ఇట్లుపదేశించిరి—

> మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్।
> కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తిచ రమన్తి చ॥

దైవధ్యానమందే మనస్సునుంచి, (దైవ) విషయములే చెప్పుకొనుచు దైవమందే ప్రాణమును సమర్పించి, దైవసంబంధకార్యములేచేయుచు, దైవమందే ఆనందించుచు దైవమందే (ఆత్మయందే) క్రీడించుచు నుండ

వలసినదేకాని వ్యర్థములైన యితర కార్యములందు కాలమును గడుపరాదు. పంచదశియందుకూడ ఈ విషయమునే ఉపదేశించియున్నారు.

తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్।
ఏతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః॥

బ్రహ్మస్వరూపమును గూర్చియే చింతించుటయు, బ్రహ్మ స్వరూపము గూర్చియే సంభాషించుటయు; గురుశిష్యాది సంవాదముల ద్వారా బ్రహ్మస్వరూపమునే తెలిసికొనుటయు, ప్రత్యగాత్మయందు చిత్తైకాగ్ర నిదిధ్యాసంబును బ్రహ్మాభ్యాసమని విజ్ఞులు నుడివిరి.

నిద్రాయా లోకవార్తాయా శ్శబ్దాదేరాత్మవిస్మృతేః।
క్వచిన్నావసరం దత్వా చింతయాత్మాన మాత్మని॥

అనగా, అధికనిద్రచేతను, వ్యర్థమైన ప్రపంచమాటలచేతను, ఆత్మ విస్మృతి గల్గచేసెడు ఇతరవాక్యములచేతను, ఉపయోగములేని కృత్యములను చేయుటచేతను బ్రహ్మనిష్ఠులు కాలమును వ్యర్థపఱచక ఆత్మనే తమలో చింతింపవలెను.

కాలమును జయించినవారు కాలుని (మృత్యువును) జయించినవారే యగుదురు. ఇంతవఱకు చెప్పినదంతయు ఆత్మనిష్ఠగలవారికి నుండవలసిన సుగుణములు. ఆ[illegible]స్తువు, అనగా బ్రహ్మము ఈగుణములకు గూడ విలక్షణమై [illegible]డు అది [illegible]గుణదుర్గుణములకు రెంటికిని సాక్షిగాన కేవల మీ[illegible] [illegible]వముతో[illegible] తృప్తినొందక శాశ్వతమగు అద్వైతన్వ ధామములోనికి, స్వయంప్రకాశములోనికి ప్రవేశించే లాగున చూడవలెను. అట్లుకానిచో,. సుగుణములు పుణ్యలోకప్రాప్తి కలుగజేయునేగాని జన్మరాహిత్యమగు మోక్షమును కలుగచేయవు. ప్రస్తుతము లోకము అధ్యాత్మోన్నతి నుండి చాల క్రిందకు [illegible]రిపోయినందుచే ఈ సుగుణములగుఱించి, అనగా నియతినిగూర్చి యి[illegible] చెప్పవలసివచ్చినది. యథార్థముగ ఆత్మయొక్క నియతి కేవలము జ్ఞానమయమై నిలుచుటయే యగును. అట్టి [illegible]నీతతత్వము పొందనిచో ఈ నియతి[illegible] ప్రేరణచేయు పరమప్రాణమని నమ్మవలెను. వట్టి స్థితిలో నిలకడ గలిగినవానికి అట్టిస్వభావమే గలిగియుండునేగాని ప్రాకృతమైస్వభావము లేవియు గలిగియుండవు.

కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనా స్సురాగిణః।
తేఽప్యజ్ఞానతయా నూనం పునరాయాంతి యాంతి చ॥

బ్రహ్మము విషయమై పచించుటయందు కుశలురును, రాగులై బ్రహ్మాకారవృత్తిరహితులును అగువారలు నిక్కముగ - అజ్ఞానులే యగుదురు, అట్టివారు జననమరణచక్రమున తగుల్కొనియే యుందురు!

జ్ఞేయములో ప్రవేశింపనిచో పుణ్యముయొక్క అగ్రభాగమును మనుజులు చేరజాలరు. ఒకడు శ్రేష్ఠమైన పాలరాతితో ఉత్కృష్టమైన పనితనముతో గొప్పదగు ఒక దేవళము కట్టించెనుకాని, దానిలోమూల విగ్రహప్రతిష్ఠయు, సంప్రోక్షణయు జరిగియుండలేదు. అట్లైన ఆదేవాలయ ప్రయత్నముయొక్క పూర్ణఫల మెట్లాతడు పొందజాలడో, అలాగున అనేక సత్కర్మలుగాని తపస్సులుగాని, యోగములుగాని, చేసినవారైనను శరీరమున జడకాషాయాదులు గలిగియుండినను, జ్ఞేయమగు ఆత్మలో ప్రవేశము కలుగనిచో పూర్ణమగు బ్రహ్మసుఖమును, ప్రకృతి రహిత మగు స్థితియున్ను ఆత్మకు లభించదు.

జ్ఞేయస్థితియందు మూడుగుణములున్ను లయించును. అచ్చోట విశుద్ధగుణ మొక్కటి మాత్రమే నిలుచును. మూడుగుణములు దాటినవారికిని మూడుగుణములు లయమొందినవారికిని మాత్రమే ఆ పావన పదములోనికి ప్రవేశముగల్గును. తురీయమనియు, విశుద్ధసత్వమనియు, గుణాతీతమనియు, గుణరహితమనియు, నిర్గుణమనియు, సాక్షియనియు చెప్పినను ఒకటే అర్థము. శమాదిగుణములు సంపూర్ణముగ గలుగువఱకున్ను ఆ తురీయాత్మలో ప్రవేశము గలుగదు. ఒకడు పాచకక్రియలో ఎంతనిపుణుడైనను వస్తు పదార్థములన్నియు పాత్రయి, కట్టెలు మొదలైన వన్నియు లేనిచో వాని పచనక్రియ యెట్లు జరుగును? తనకున్ను ఇతరులకున్ను క్షుద్బాధ యెట్లు శమించును? అలాగుననే శాస్త్రాదుల పాండిత్యము గలిగియున్నను, శమదమాదిగుణములు లేనిచో ప్రకృతిచే గలిగెడుబాధ శమింపదు. శాశ్వత సౌఖ్యమున్ను లభింపదు. ఇదే శమాదిగుణములు లేనిచో గలిగెడు దోషము

విశుద్ధ సత్త్వస్య గుణాః ప్రసాద
స్స్వాత్మానుభూతిః పరమా ప్రశాంతిః

తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా
యయా సదానందరసం సమృచ్ఛతి॥

తురీయస్థితియందున్న వాని లక్షణ మీలాగున నుండును. నిరంతరము ప్రసన్నత, ఆత్మానుభవము, మిక్కిలిశాంతి, తృప్తి, అతి హర్షము, నిరతిశయానందము అతడు గలిగియుండును ప్రపంచములో ఏపని చేయవలసియుండినను దానికి తగిన సామగ్రియుండినసనే మనుజు డద్దానిని సరిగ చేయగల్గును. వ్రాయవలసియుండిన, కలము, సిరా, కాగితము లేనిచో ఎట్లు వ్రాయగల్గును? అట్లనే కమ్మరపనిగాని, బంగారుపనిగాని చక్కగచేయవలసియుండిన, వాటికి కావలసిన యుపకరణములు తప్పకయుండియే తీరవలెను లేనిచో ఎట్టిపనివాడైనను ఏమియు చేయజాలడు. ఆలాగున వైరాగ్య, సత్త్వ శాంత్యాదిదైవగుణములు ఉండిన మాత్రమే జ్ఞేయములోనికి ప్రవేశింప నర్హత గలుగును. అచ్చట ప్రకృతి గుణము లేవియు నుండవు. అవన్నియు బుద్ధివరకే పోగల్గును అట్టిబుద్ధి శుద్ధమైనమాత్రమే అచ్చోటనుండి పైకి వెళ్ళగలము లేనిచో గుణములు అడ్డుపడును. అవి యేమాత్రమున్ను పైకివెళ్ళనీయవు. బుద్ధికి ఆవల వెళ్ళునప్పుడే తురీయపదము చేరగలము ఇచ్చటికి వచ్చిన సాధకుడు ప్రకాశములోనికి వచ్చినవాడే యగును. అది శివము. దానికే కైవల్యమనియు పరమపదమనియు పేర్లు అప్పుడు జీవత్వము వదలిపోయినందుచే శివపదము గల్గును మూసిపెట్టియుండిన దీపము యొక్క మూత తీసివైచిన ఎట్లుండునో, అట్టిఅవస్థయే సాధకునకు లభించును ఇచ్చట తత్త్వమసి వాక్యముచే జీవేశ్వరైక్యమును సంపాదించుకొనవలెను. శివవిశిష్టాద్వైతశైవులున్ను, విష్ణువిశిష్టాద్వైత వైష్ణవులున్ను, వారుభయులలో అంతర్భూతులగు ద్వైతులున్ను, శ్రీపతంజలి మున్నగు యోగమార్గావలంబకులున్ను, అచ్చోటనే నిలచిపోవుదురు. అచ్చట ఈశ్వరునియందు గల దివ్యగుణములన్నియు జీవునకుకూడ గల్గును. కాని యైక్యము గల్గదు బంధవిముక్తి మాత్రము గల్గును. అప్పుడు జీవుడు శుద్ధాత్ముడగును. అచట కేవలము జ్ఞానముమాత్రముండును. ప్రకృతి యేమియు ఉండదు. కావుననే అట్టి స్థితి గలవారికే శుద్ధమగు జ్ఞానగుణములు తప్ప ప్రకృతి గుణమేమియు ఉండుట లేదని శాస్త్రము చెప్పెడు రహస్యము. అగ్నినుండి - ఉష్ణత్వము, సూర్యునినుండి ప్రకాశము, చంద్రునినుండి

శీతలత్వము, తేనెనుండి మాధుర్యము తప్ప మఱియొక వస్తువేలాగు కలగదో, అలాగున ఆ స్థితిగలవారినుండి జ్ఞానము, ఆనందము మాత్రమే కలుగునుగాని అజ్ఞానసంబంధగుణము లేవియు కలుగవు. అదే దీనికి గుఱుతు. అప్పోట "శివోఽహం", "బ్రహ్మాస్మి" అను మహావాక్యము యనుభవము బాగుగ కలుగును; కలుగచేసికొనవలెను. రూఢికలుగువఱకున్ను మనన నిదిధ్యాసనములను నిలుపరాదు. ఆనందములోనికి వెళ్ళినవారందఱున్ను ముక్తులే ధన్యాత్ములే. ఈ అనుష్ఠాన విషయమై గరుడపురాణము చెప్పినది చూడుడు.

ఇహైన నరకవ్యాధే శ్చికిత్సాం న కరోతి యః।
గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి॥

ఈ జన్మమందే, నరకవ్యాధికి చికిత్స యెవడోనర్పడో, అనగా సంసారతరణోపాయమునకై యత్నింపడో. అతడు పరలోకమును జెంది ఏమి చేయగల్గును? ఔషధమున్ను, వైద్యుడున్ను, లేని దేశములో వ్యాధి గలవాడు వెళ్ళియేమి బాగుచేసికొనగల్గును? అనగా సత్కర్మలచే స్వర్గాది లోకముల జెందినను, అచట ముక్తి సాధనకార్యము లేవియు జీవులు చేయ జాలరు. దానికి మనుష్యలోకమే తగియున్నది. కామ్యకర్మల ఫలమను భవించుటకు మాత్రము స్వర్గలోక మేర్పడినది. అనగా మనుష్యజన్మలో మాత్రమే బ్రహ్మధ్యానము చేయుటకు తగిన యంతఃకరణసృష్టి యేర్పడి యున్నది. అట్టి సామర్థ్యము దేవతలకు గాని, మఱియెవరికినిగాని గల్గి యుండలేదు. కావుననే జన్మము లన్నింటిలోను మానవజన్మము జ్ఞానముతోకూడినదనియు, ఉత్కృష్టమైనదనియు చెప్పుటకు కారణము. ఈ విషయమై కఠోపనిషత్తున గనదగును. మఱియు నైష్కర్మ్యసిద్ధియందు. ఇట్లు తెలుపబడినది—

యదా సర్వే ప్రముచ్యంతే ఇతి 'స్వి'తిచ వాజినః।
కామ బంధనమేవేదం వ్యాసోప్యాహ పదేపదే॥

(నైష్కర్మ్యసిద్ధి)

'యదా సర్వే ప్రముచ్యంతే' అనిన్ని "ఇతి సుకామాయమానః" (కామమే సంసారమునకు కారణము) అనిన్ని మహర్షులు చెప్పుచున్నారు. "కామబంధనమే వేదం" అని వ్యాసమహాముని మాటి మాటికి చెప్పెను.

కామబంధనమే వేదం నాన్యదస్తీహ బంధనమ్।
కామంధనముక్తో హి నేహ భూయోఽభిజాయతే॥
(భాగవతము)

అనగా కామబంధమే సంసారకారణము. ఆ కామముయొక్క నివృత్తియే మోక్షము.

తస్యైవం దుఃఖతప్తస్య కథం చిత్పుణ్యశీలనాత్।
నిత్యేహోక్షాలితధియో వైరాగ్యం జాయతే హృది॥

దుఃఖములచే పరితాపము నొందువాడును, బహుప్రయాసముల చేత పుణ్యకర్మల ననుష్ఠించుటవలన సంభవించిన నిత్యకర్మానుష్ఠానముచేత పరిశుద్ధముగా చేయబడిన బుద్ధికలవాడునైన మనుజునకు మనస్సునందు వైరాగ్యము పుట్టును.

శుధ్యమానంతు తచ్చిత్త మీశ్వరార్పితకర్మభిః।
వైరాగ్యం బ్రహ్మలోకాదౌ వ్యనక్త్యథ సునిర్మలమ్॥

పరమేశ్వరునియందు సమర్పింపబడిన కర్మలచేత మనుజుని చిత్తము పరిశుద్ధిని పొందింపబడినదై అనంతరము బ్రహ్మలోకాదుల సుఖమందును మిగుల వైరాగ్యమును ప్రకటించును.

ఇట్లు నైష్కర్మ్యసిద్ధియందు శ్రీ సురేశ్వరాచార్యులవా రుపదేశించిరి. మఱియు,

యం లబ్ధ్వాచాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే॥
(గీత 6–22)

ఏ జ్ఞానమును పొందిన మఱల దానికంటె నుత్తమలాభము మఱి యొకటియున్నదని తలంపడో, దేనియందుండినవాడు మహత్తరమగు దుఃఖముచేతను చలింపడో, అదే యుత్తమమైన జ్ఞానావస్థయని శ్రీ కృష్ణ భగవాను లుపదేశించిరి. శ్రీ శంకరులుకూడ ఆత్మబోధలో ఇట్లే తెల్పిరి.

యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్।
యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్॥

ఏ ఆత్మలాభముకంటె అధికమగు లాభము మఱొకటి లేదో, ఏ ఆత్మసుఖముకంటె అధికమగు మఱొక సుఖములేదో, ఏ జ్ఞానముకంటె అధికమగు వేఱే జ్ఞానము లేదో అదియే బ్రహ్మమని నిశ్చయించి తెలియనగును.

ఈ నియతి ధర్మము గీతలో 13-వ అధ్యాయమున "అమాని"త్వాది గుణములందును, మఱియు 16-వ అధ్యాయమున "అభయం సత్వసంశుద్ధిః" మున్నగు దైవికగుణములందును తెలుపబడియున్నదని ముముక్షువులు తెలిసికొనదగినది. ఇక ఇతరశాస్త్రములలో తెలుపబడిన యమనియమములు మొదలగు సాధకునకుండవలసిన ఉత్కృష్ట జ్ఞానగుణము లన్నియు ఈ నియతిలో చేరినవే. అవన్నియు వ్రాసి గ్రంథమును విస్తరింప తలంపులేదు. ఇదివరకు వ్రాసిన ఓంకారాది గ్రంథములలో అవన్నియు చాలవఱకు పేర్కొనబడియున్నవి. తేజోబిందూపనిషత్తునందు చెప్పిన ధ్యానపద్ధతి అవలంబింపదగినది. ఇది ఒక్కటి మాత్రమే సంసారదావాగ్నిని చల్లపఱచెడు జ్ఞానమేఘకుంభవర్షమని సాధకులు తెలిసికొనగలరు.

అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం బుద్ధివ్యాధిం వినాశయేత్।
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం చిత్తబంధం వినాశయేత్॥

"అహం బ్రహ్మాస్మి" యను ఈ మంత్రము బుద్ధికి కలిగియుండు అజ్ఞానమను వ్యాధిని నశింపచేయునది అహంబ్రహ్మాస్మి యను మంత్రము చిత్తమునకు కలిగియుండు అన్నిబంధములను నివారించునదగును.

అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం చిత్తవృత్తిం వినాశయేత్।
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం సంకల్పాదీన్వినాశయేత్॥

అహం బ్రహ్మాస్మియను ఈ మహావాక్యము చిత్తవృత్తుల రహిత మొనర్చునది. అహం బ్రహ్మాస్మియను ఈ వేదాంతమహావాక్యము సంకల్పముల నన్నిటిని పారద్రోలును.

అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం కోటిదోషం వినాశయేత్।
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం కామాదీన్నాశయేత్క్షణాత్

అహం బ్రహ్మాస్మియను ఈ దివ్యమంత్రము కోటిదోషముల నైనను భస్మము చేయును అహం బ్రహ్మాస్మియను ఈపవిత్రమంత్రము జీవునకు కలిగియుండు అనాత్మదోషములన్నింటిని క్షణములో లయ మొనర్చును.

చిదాత్మాహం పరాత్మాహం నిర్గుణోఽహం పరాత్పరః।
ఆత్మమాత్రేణ యస్తిష్ఠేత్సజీవన్ముక్త ఉచ్యతే॥

నేను చిదాత్మస్వరూపుడను, పరమాత్మస్వరూపుడను. ప్రకృతి గుణములు లేనివాడను, పరాత్పర పరబ్రహ్మస్వరూపుడను అను నిట్టి ఆత్మ భావములో ఎవడు నిలుపగలడో, ఆతడు జీవన్ముక్తుడనియే చెప్పదగును.

దేహత్రయాతి రిక్తోహం శుద్ధచైతన్యమస్మ్యహమ్।
బ్రహ్మాహమితి యస్యాన్తః స జీవన్ముక్త ఉచ్యతే॥

నేను దేహత్రయములకు విలక్షణుడను, శుద్ధచైతన్యస్వరూపుడను, శుద్ధబ్రహ్మస్వరూపుడను అని ఎవని అంతఃకరణములో అచంచలమగు జ్ఞానము గలిగియుండునో, ఆతడు జీవన్ముక్తుడే యగును,

కేవలం తుర్యరూపోస్మి తుర్యాతీతోఽస్మి కేవలః।
సదా చైతన్యరూపోఽస్మి చిదానందమయోస్మ్యహమ్॥

"నేను కేవలము తురీయస్వరూపుడను, కేవలము తుర్యాతీత స్థితిలో నుండువాడను, ఎల్లప్పుడును చేతనాస్వరూపుడను సచ్చిదానందమయుడుగా నుండువాడను.

నిర్వికల్పస్వరూపోఽస్మి నిరీహోఽస్మి నిరామయః।
సదాఽసంగస్వరూపోఽస్మి నిర్వికారోఽహ మవ్యయః॥

నేను నిర్వికల్పస్వరూపుడను, ఏలాటి సంకల్పములు లేనివాడను. ఎప్పుడును లయములేనివాడను, సర్వదా అసంగస్వరూపుడను, నిర్వికార స్వరూపుడనై యుండువాడను.

సద్వైకరసరూపోఽస్మి సదా చిన్మాత్రవిగ్రహః।
అపరిచ్ఛిన్నరూపోఽస్మి హ్యఖండానందరూపవాన్॥

నేనెల్లప్పుడున్ను బ్రహ్మానందరసముచే భరితుడను, ఎల్లప్పుడును, చిన్మాత్రస్వరూపుడు, పరిచ్ఛిన్నముగాని రూపముగలవాడను, అఖండానంద స్వరూపుడను-

# ధర్మ సూక్ష్మము



ప్రతిమతమునకున్నూ, ప్రతిశాస్త్రమునకున్నూ, ప్రతిధర్మమునకున్నూ ఒక సమాప్తిగలదు, అనగా - దీనితో ఈ మతము పూర్తియగును. దీనితో ఈ శాస్త్రము సమాప్తమగును. దీనితో ఈ ధర్మము సంపూర్ణమగును అని యొక నియమము గలదు. అట్లు గానిచో అనవస్థాదోషము తటస్థించును, ఇది శాస్త్రముయొక్క సిద్ధాంతము. మనము ఇంగ్లీషుగాని, సంస్కృతముగాని, ఆచార్యపరీక్షగాని చదువుచున్నప్పుడు "ఈ పాఠముతో నీవిద్య సమాప్తము" అని యొక నియమము గలదు. అట్లుగాక, దీనితో నీ శాస్త్రము, ఈ భాష యెట్లు పూర్తియగును? ఈ భాషలో నికను నెన్నియో గ్రంథములు గలవు. ఈ శాస్త్రములో నింతేగాక మఱియు నెన్నియో పుస్తకములు గలవు. అవియన్నియు జదువనిచో నెట్లు ఈ భాష పూర్తియగును! ఏలాగున ఈ శాస్త్రము సమాప్తమగును? అని యొకరడిగినచో దానికంతమే లేకపోవును. అట్లు పూర్తిచేయుటకు మనుష్యజన్మములో సాధ్యముగాదు.

ఆ ప్రశ్న యెటువంటిదనగా, ఒకడు నీతండ్రిపేరేమి? యనుచున్నను. దానికి తనతండ్రిపేరు ఫలానదని చెప్పవచ్చును. మరల మీ తాతపేరేమి? యనిన దానికిని తాతపేరు చెప్పవచ్చును. తరువాత మీ ముత్తాత నామ మేమి? యనిన దానిగూడ కొంచెమూహించి జ్ఞాపకముచేసికొని తెలుపవచ్చును. కాని, మీ మునిముత్తాత నామ మేమి యని అడిగిన అందఱికిన్ని తెలియుట ప్రయాసము. మఱల మునిముత్తాత తండ్రి పేరేమి? వారితాత, వారి మునిముత్తాత పేర్లు ఏమని యడిగిన ఎవరున్నూ చెప్పజాలరు. అట్లు చెప్పనంతమాత్రముచే వారికి వంశము, కులము, లేదని చెప్పదగునా?

అలాగున, మీ గ్రామమునకు ఉత్తరముగ నూఱుమైళ్ళదూరమున నేగ్రామము గలదు? అనిన ఫలాని గ్రామము గలదని యోచించుకొని చెప్ప వచ్చును అచటనుండి వెయ్యిమైళ్ళ ఉత్తరమున ఏ పట్టణముగలదో, అదియు కొంచెము చింతించి తెలుపవచ్చును. కాని అచ్చోట నుండి పదివేలమైళ్ళ, ఉత్తరమున నేదేశము గలదో, అదియు నొకవేళ కొంత జ్ఞాపకముచేసికొని చెప్పినను చెప్పవచ్చును. గలల నచ్చోటనుండి పదివేలమైళ్ళ ఉత్తరమున నేదేశము గలదని యడిగినచో నుత్తరధ్రువము గలదని చెప్ప సాధ్యమగును అచ్చోటనుండి మఱి పదివేలమైళ్ళ దూరమున ఏమి గలదని యడిగిన చెప్ప సాధ్యముగాదు, ఆకాశము గలదని చెప్పిన చెప్పవచ్చును. అచ్చటనుండి యింకను పదివేలమైళ్ళకు ఉత్తరమున నేమిగలదని ప్రశ్నించినచో ఆకాశ మనంతమని సమాధానము చెప్ప సాధ్యమగును. అలాగున ధర్మము లన్నిటి కిని ఒకపరిమితి గలిగియున్నది. దానితో నది సమాప్తియగును.

కావుననే రాజకీయ విషయముల రికార్డులో తనయొక్కయు, తన తండ్రియొక్కయు పేర్లతో ఆ వ్యవహారము పూర్తిచేయడమైనది. వైదిక విషయములగు శ్రాద్ధాదులలో పుత్రుడు తనయొక్క తండ్రిశ్రాద్ధముతో పూర్తి చేయును. కాని శ్రాద్ధాదులలోగూడ విశేషకార్యమున, పితృ, పితామహ, ప్రపితామహాయని చెప్పుటతోనే యా కార్యమంతమగును. ధర్మము యొక్క సూక్ష్మమున్ను అటువంటిది. అట్లుగాక యుండిన దానికంతమే యుండదు.

అది యెటువంటిదనగా, ఒక పరమలుబ్ధుడగు శ్రీమంతుని దగ్గఱకు కడుదీనుడైన ఒక యాచకుడు వెళ్ళి యేదైన కొంచెము సహాయమగు దానము నడిగినప్పుడు ఆ ధనవంతుడు యాచకునితో మీరడిగినది మంచికార్యమేగాని యేదైన నివ్వవలయునని నాకున్నూ యివ్వగలదు. కాని నా నియమమేమన, ప్రపంచములోగల సర్వయాచకులకున్ను ఇచ్చినమాత్రమే యది సరిగా నుండును. అదియే సమత్వమగును. అట్లు చేయుటయే ధర్మముగును, అని చెప్పి ఆ పరమదీనుడగు నా యాచకుని పంపినాడట! అట్లు శాస్త్రమున విధిలేదు. అది సాధ్యమున్ను కాదు.

కావున తనయొక్క శక్తికితగిన దానధర్మములు చేయవలయు ననియే శాస్త్రము విధించుచున్నది. అదియే సాధ్యమగును. తక్కినవి

యసాధ్యము, ధర్మాచరణ చేయనొల్లనివారు మాత్రమే అలుబ్ధుడగు ధనికుని వలె చెప్పుదురు. కావున బ్రహ్మచర్యము ఇంతవఱకు పూర్తియగును. అలాగున నహింసయు దీనితో సమాప్తియగును. అదేరీతిగా వైరాగ్యమున్నూ, ఉపరతి యున్నూ బోధయున్నూ దీనితో పూర్తియగునని శాస్త్రము తీర్మానించుచున్నది. అంతటితో నది సమాప్తి యగును. అలాగున మనోవాక్కాయకర్మలతో, దృష్టికి గోచరించెడు ప్రాణులను పీడింపకయు, భక్షింపకయు నుండుట అనుష్ఠించిన నహింసా ధర్మము పూర్తియగునని సామాన్యముగా చెప్పనగును. అట్లుగాక ఫలములలో జీవులు లేవా? వాయువులోను, జలములోను ప్రాణులు లేవా? యని ప్రశ్న చేయుట అనవస్థాదోషమగును, మఱల సకల ప్రాణి కోట్లయందును దయగలిగియుండవలయును. అంతటితో పూర్తి చేయక తనయొక్క ఆత్మను అజ్ఞానకార్యములలో ప్రవేశింపజేయక చూచుచుండ వలెను, లేనిచో. దుఃఖము నొందును ఆత్మలో క్లేశము నొందనీయక నిరతిశయానందసుఖమగు జీవన్ముక్తిని గలుగజేయుటయు గొప్పదగు అహింసయగును. కాని అది గొప్పదని గౌణమగు పైజెప్పిన అహింసావ్రత మును పాలింపకపోయినచో వృక్షమును సంరక్షింపక ఫలమును భుజించు టకు నిరీక్షించుచుండునట్లే యుండును. అంతేగాక, దేహమును సంరక్షిం పక దేహికి జ్ఞానము గలుగజేయ దలంచినట్లుండును. కావున, బాహ్యమగు స్థూలధర్మానుష్ఠానము చేయనిచో సూక్ష్మమగు జ్ఞానము ఏకాలమందును గలుగిదని దృఢమగు నమ్మకము గలిగియుండవలయును. అలాగున మనస్సు తోను, వాక్కుతోను. క్రియతోను, బ్రహ్మచర్య మనుష్ఠించిన చాలును. ఏదైన ఆహారదోషముచేగాని, శీతోష్ణముల భేదముచేగాని, స్వప్నములో నేదైన బ్రహ్మచర్యవిరుద్ధ సంకల్పముగాని, క్రియలుగాని తోచిన వాని వలన దోషములేదు. కాని సంపూర్ణాత్మశుద్ధి గలిగిన, ఆలోపముగూడ గలుగదు.

24. ఇది స్త్రీ పురుషులందఱికిని సమానధర్మము. అలాగున గృహస్థ బ్రహ్మచర్యమున్ను శాస్త్రములో చెప్పేలాగున ఋతు కాలధర్మము ననుసరించి యుండును అట్లైన, వారున్ను గృహస్థబ్రహ్మచారులనియే గ్రహించుకొన వలయును. కాని దీనితో పూర్తియైనదని తలంచక బ్రహ్మ భావములో నర్తించుటచే అఖండ బ్రహ్మజ్ఞానము గలిగియుండుటచేతనే బ్రహ్మచర్యము

పూర్తియైనదని తలంపవలయును. రాగారాగా ఈ గృహస్థదంపతులున్నూ నైష్ఠికబ్రహ్మచారివలె అనుష్ఠించేలాగున చూడవలయును. ఆత్మశుద్ధి గలుగు నప్పుడు ప్రకృతిదోషము నశించునప్పుడు విషయములలో నీచబుద్ధి గలుగును పైజెప్పేలాగున వైరాగ్యముయొక్కయు, ఉపరతియొక్కయు ఆత్మబోధము యొక్కయు అర్థమును శాస్త్రము చెప్పినట్లు గ్రహించుకొన వలయును, ఇహలోక స్వర్గలోక భోగములయందు తుచ్ఛబుద్ధిగలిగిన, వైరాగ్యము పూర్తియగును. దేహసంరక్షణకొఱకు గల అన్నవస్త్రాదు లుండవచ్చును. దానివలన వైరాగ్యమునకు హానిలేదు. ఆలాగున దృశ్య ములో రమింపక ఆత్మలో నిరంతరము రమించెడు స్థితిగలిగిన, ఉపరతి యున్నూ సిద్ధించినదని నిశ్చయించుకొనవచ్చును. ఆలాగున ఆత్మ భావము అనగా దైవభావము ఎల్లప్పుడున్నూ స్థిరముగా గలిగి దృశ్యభావము గలుగని యవస్థ సిద్ధించినచో, బోధముయొక్క అనగా జ్ఞానముయొక్కయు పూర్ణావస్థ గలిగినదని నిశ్చయించుకొనవచ్చును.



# ధర్మరహస్యము

ఏ స్థలములోగల డాక్టర్లు మంచివారలై రోగులను చక్కగ చూచి బాగుపరచుచుందురో, అట్టివారు నాటు వైద్యులుగాని, యూనాని వైద్యులు గాని, ఇంగ్లీషు వైద్యులుగాని, మఱియేవైద్యులుగాని యుండినను ఆ గ్రామస్థులున్ను, చుట్టుప్రదేశములందుండువారున్ను, ఆవైద్యులపై, ఆ సంఘములపై, దానికి సంబంధించిన వారిపై, అచటకు వచ్చెడు ఆ సమాజము వారిపై శ్రద్ధావిశ్వాసములు గలిగియుందురు. అట్లుకానిచో, అచటనుండు వైద్యమువారిపై గాని, ఆ సంఘముపైగాని, జనులకు విశ్వాసము కలిగి యుండదు. అంతేగాక యచటకు వచ్చెడు ఆ సంఘములో నుండు మంచివారి యెడ నైనను జనులకు విశ్వాసముండదు.

ఆలాగున ఏ స్థలములోనుండు సాధువులుగాని. భక్తులు మొదలైన వారు గాని, యోగ్యులైనచో వారిపైన, వారిసమాజముపైన, అచటకు వచ్చెడు ఆ సంఘమునకు సంబంధించినవారిపైన జనులందఱికిన్ని, భక్తి శ్రద్ధలు కలిగియుండును. కావున గురువులపై, సమాజముపై, దైవముపై

విశ్వాసముగల వారందఱున్ను ఎచటనుండినను శ్రేష్ఠమైన గుణము గలిగి యుండే లాగున చూడవలయును, లేనిచో గురువులవారికిన్నీ, బ్రహ్మనిష్ఠులగు వారికిన్నీ, దైవమునకును, దైవవిషయ వేదాంతశాస్త్రమునకున్ను, ద్రోహముచేసినవారే యగుదురు. ఇయ్యది లోకమున ఇపుడు స్పష్టముగ కనబడుచున్నది. యథార్థమైన గురుసేవయొక్క రహస్యము దీనియందు నిగూఢమైయున్నది. కావున గురు భక్తి గలవారలు, దైవవిశ్వాసము కలవారలు మంచి యనుష్ఠానము కలిగియుండేలాగున సదా చూడవలయును. దానికి మించిన గురుసేవ మఱియొకటిలేదు. ఇట్టివారు గురు సన్నిధినుండి యెంతదూరముగ నుండినను దగ్గఱగా నుండినవారే యగుదురు. గురు ధర్మమును దైవధర్మమును లోకములో ప్రచారము చేయుటయే గురుభక్తుల యొక్కయు, దైవభక్తులయొక్కయు ధర్మమని మఱువకూడదు.

# జన్మ సాఫల్యము

జనులారా? కర్షకుల వ్యవసాయసమయ మెటువంటిదో మీ యొక్క అభ్యాసకాలమున్ను అటువంటిదే. లేక మీయొక్క యౌవనారంభమున్నా అట్టిదనియే గ్రహించుకొనవలయును. సంవత్సర జీవితసుఖమంతయు కృషి చేసెడు కాలమున నెట్లుండునో, అలాగున మీ యొక్క జీవితసౌఖ్యమంతయు, జీవన్ముక్తియు అట్టికాలముననే యుండునని మఱువకుడు విత్తనమువేయుట, నారునాటుట మొదలగు పనులు చేయుసమయమున ఎలాగున వ్యవసాయదారులు నిద్రయు, భోజనమునుగూడ లక్ష్యముచేయక సేద్యపు పనిలోనే కాలము గడుపుచుందురో, అపుడొక నిమిషమైనను సమయమును ఎట్లు వ్యర్థపుచ్చరో, ఇతర కార్యములన్నిటిని ఎట్లు నిలిపివేయుదురో అలాగున మీరును అభ్యాస కాలమున నిద్రాహారాదులనుగూడ లక్ష్యపెట్టక, ధ్యానములోను, విద్యాభ్యాసమునందును. గురుసేవయందును, వ్రతనిష్ఠలోను, పుణ్య కర్మానుష్ఠానములోను కాలము పూర్తిగ వినియోగపఱచవలయును. వ్యవసాయకాలమున వానకున్నూ, చలికిన్ని, ఎండలకున్నూ భయపడి, భోజనమునకును, నిద్రకున్నూ లోబడి అప్పటికాలమున పరిశ్రమ చేయక గడిపినచో

ఆసంవత్సరము జీవితమంతయు ఏలాగున దుఃఖముతోను, భోజనాదులు లేకయు గడుపవలసియుండునో. అలాగున యౌవనారంభమునగాని విద్యాభ్యాసమయమునగాని, అనుష్ఠానకాలమునగాని, మీరు శీతోష్ణముల సహింపనిచో, నిద్రాహారాదులను జయింపనిచో మీ జీవితమంతయు దుఃఖభూయిష్ఠముగాను, క్లేశపూరితముగాను గడుపవలసి యుండును, జీవితమంతయు మాత్రమేకాదు, పరలోకమున కూడ వ్యధల ననుభవింపవలసి యుండును. పరలోకము మాత్రముగాదు భావిజన్మము సహా దుఃఖరూపముగానే యుండునను తత్త్వము మఱువకుడు. వర్తమానకాలమున్ను, పరలోకజీవితమున్ను, భావిజన్మమున్నూ మన అఱచేతిలో నుంటున్నవి. ఈమూడింటిని మనము ఇపుడే పావన మొనర్చవలయును. లేక మానవజన్మము గలుగనిస్థితి, మోక్షస్థితిని గూడ కలుగచేసికొనవచ్చును. ఇదే ముముక్షువులయొక్కయు, జిజ్ఞాసువులయొక్కయు, ముఖ్యకర్తవ్యమని మఱువకూడదు. ఇందులకే ఉత్తమ గురుకులవాసము కావలయునని గ్రహింపవలయును. శ్రేష్ఠులైన గురువులు దొరకినమాత్రమే గురుకులవాసముచేసిన చాలును. లేనిచో స్వప్రయత్నపరులై యుండుటయే బాగు పరిశ్రమపరులు కానిచో ఎవరున్ను పవిత్రులు గాజాలరను తత్త్వమెల్లప్పుడును మనస్సులోనుంచి జీవింపవలయును. లోకములో పావనులైనవారి చరిత్రమే దీనికి సాక్ష్యము. సోమరితనముకన్న మించిన పెనుభూతము జగతిలో మఱియొకటి లేదని మఱువకుడు. ఈ సోమరి పెనుభూతముయొక్క సోదరుడే అభిమానము. వీరుభయులు చేరినచో, దయ్యముపట్టిన వారికిన్ని, మతిచెడినవారికిన్ని ఎట్టి గతికలుగునో వారలయొక్క జన్మమున్ను అలాగుననే యుండును.



# షోడశకళా ప్రపూర్ణము

1. ప్రథమ కళాచతుష్టయము. (వ్రతము, సంకీర్తన, ప్రత్యాహారము, శ్రవణాదులు,)

2. ద్వితీయ కళాచతుష్టయము. జప, చింత, ధారణ, మననాదులు.)

3. తృతీయ కళాచతుష్టయము. (ధ్యాన, సవికల్ప సమాధి, అనుసంధాన, నిదిధ్యాసనములు.)

4. చతుర్ధ కళాచతుష్టయము, (సాక్షాత్కార, నిర్వికల్పసమాధి నిర్వృతి, నిర్వాణములు )

దీనికే షోడశకళా ప్రపూర్ణ నిర్వాణ మని పేరు. ఈకళలు మొదటి దానికన్న – రెండవది వెయ్యిరెట్లధికముగానుండును. రెండవ దానికన్న మూడవది వేయిరెట్లధిక ఫలము నిచ్చునదిగా నుండును. మూడవదానికన్న నాలుగవది వెయ్యిరెట్లధికమైనది, కాన ముముక్షువులు - సాధువులు - భక్తులు ఈనాలుగింటిని వరుసగా నభ్యసించవలసినదేగాక - నాలుగింటిని కూడ-ఆచరణలో నిత్యము నుంచవలెను. అపుడు మాత్రమే సర్వజనులున్నూ, తరించుటకు కారణమగును, కొందఱు వారిసంస్కారము ననుసరించి - ఈ కళాచతుష్టయములో నొక్కొక్క దానియందేయుండి యాచరించుచూ దానిలోనే ప్రీతిగలిగి యుందురు సాధారణముగా మహాత్ములందరున్నూ, ఈనాలుగింటిలోను ప్రవృత్తి గలిగియుందురు ఒక్కొక్కప్పుడు ఒక్క దానితోనే చాల కాలమువఱకు నుండెదరు. కాని వైరాగ్య, శమదమాదులు అందఱి కొకేవిధముగానే యుండును. అది శరత్కాల నిర్మలాకాశమందుండు పౌర్ణమిచంద్రునివలె ప్రశాంతముగాను – ప్రసన్నముగాను - ప్రకాశముగా నుండును. అట్టిస్థితి కలిగినదా! లేదా! యని సాధకులు నిరంతరము చూచు చుండవలయును.

అభ్యాసకులందరున్నూ నాలుగవస్థానమగు సాక్షాత్కార నిర్వికల్ప సమాధి నిర్వృతి నిర్వాణములు గలుగువఱకున్నూ యనుష్ఠానము నిలుప రాదు, ఇది కల్లోల మడగిన ప్రశాంత మహాసముద్రమువలె యగాధమై, గంభీరమై యుండును అట్టి దివ్య పురుషుని సర్వేంద్రియములద్వారా అమృత సమానమగు ఆనందము ప్రవహించుచుండును. అదే దీనిలో ముఖ్యముగా

గమనింపదగినది. తేనెతో నిండిన ఘటమునకు ఏప్రక్క రంధ్రము చేసినను మాధుర్యమగు తేనెవచ్చుచుండునేగాని మఱియేవిధమగు రసమున్నూ కలుగదు ఘటములో వెలుగు దీపము బాగుగా ప్రకాశించుచుండిన, రాత్రి కాలములో ఆఘటమున్నమనకెన్ని రంధ్రములుండునో యన్నిటిద్వారా యాదివ్యజ్యోతియే బహిర్ముఖముగ ప్రకాశించునట్లు, పూర్ణాత్మస్థితిగలవారి సర్వేంద్రియము లేల! సర్వరోమ కూపములనుండియు, ఆ ప్రశాంతమగు, ప్రసన్నమగు, అమృతమగు, ఆనందమగు భావమే కలుగుచుండును· అదే యా పూర్ణత్వమును పొందినదానికి గుఱుతు. ఓమ్.



# భావశుద్ధియే జ్ఞానసిద్ధి*

ధ్యానాయ ధ్యానగమ్యాయ ధ్యాతృపాపహరాయ చ ।
ధ్యానేశ్వరాయ సుధియే ధ్యేయధ్యాతృస్వరూపిణే॥

భావశుద్ధియే జ్ఞానసిద్ధి యను ఆశ్రమములో వ్రాసియుండు వాక్యము చూచి అనేకులు దానియొక్కయర్థము అందఱికిన్ని వ్యక్తమయ్యేలాగున, తెలుపవలయునని యడుగుచుందురు. కావున ఇది ఇప్పుడు వ్రాయడమైనది. సంక్షిప్తముగా చెప్పినచో భావము శుద్ధమగుటయే జ్ఞానముయొక్క సిద్ధి యనంబడును. భావము శుద్ధమగుటయే జ్ఞాన ప్రాప్తి యని తాత్పర్యము.

ఈభావము బాహ్యాభ్యంతరభేదములచే రెండు భాగములుగా తెలియ దగినది. అవి రెండును మఱల నొక్కొక్కటి స్థూలసూక్ష్మము లనియెడు భాగములచే ద్వివిధములుగా నుండును.

దానిలో బాహ్యముయొక్క స్థూలార్థ మేమన, ఇంద్రియముల కేలాటిచెడు విషయవృత్తులు లేకుండుటయే యగును. అనగా 1. కర్ణేంద్రియము ఏలాటి దుష్టవాక్యములను వినకయుండుటయు, 2. స్పర్శేంద్రియము దుష్టస్పర్శనముల చేయకయుండుటయు, 3. నేత్రేంద్రియము దుష్ట చూపులు లేకుండుటయు, 4. రసనేంద్రియము దుష్టపదార్థముల రుచింపక

* భావశుద్ధియే జ్ఞానసిద్ధి, అను పేరుతో శ్రీవారు రచించిన గ్రంథమొకటి విడిగా ప్రచురింపబడియున్నది (స, ల)

యుండుటయు, 5. అలాగున ఘ్రాణేంద్రియము దుష్టగంధముల నాఘ్రాణింపకయుండుటయు నగును· ఇవి జ్ఞానేంద్రియముల వృత్తులు.

అలాగుననే 1. వాక్కుతో నొక్కశబ్దమైనను దుష్టవాక్యము నుచ్చరింపకుండుటయు, 2. పాణీంద్రియము ఏవిధమైన దుష్టకార్యముల చేయకుండుటయు, 3. పాదేంద్రియము దుష్టస్థలములో సంచరింపకుండుటయు, 4. ఉపస్థేంద్రియమే దుష్టవిషయములు లేకయుండుటయు, 5. పాయ్వింద్రియము శుద్ధమైనస్థలముల మలినపఱచకయుండుటయు నేది గలదో అది కర్మేంద్రియముల శుద్ధియనంబడును.

పతివ్రతయగు నారీమణి తనయొక్క వ్రతభంగము కలుగనివ్వక యెట్లు జాగరూకత గలిగి వర్తించునో, మఱియు బ్రహ్మచర్యవ్రతము నల్పువారు ఏలాగున తనయొక్క వ్రతమునకు హాని కలుగనివ్వక చూచుచుందురో, అలాగున ఈ ఇంద్రియ నియమనశక్తిగలవారుగూడ చూచుచుండవలయును· పైజెప్పినవారు వ్రతభంగము కలవారైనచో దానివలన బొందగలుగు ఫలమేలాగున పొందజాలరో, అలాగున ఈనియమము కలవారుగూడ తమ వ్రతమునకు భంగముగలిగిన, పతనము కలుగునవి నిశ్చయించుకొనవలయును. పతనము కలిగినచో అట్టి నిర్మలమగు వ్రతముచే గలిగెడు అతి పవిత్రమగు ఫలితమున్ను తమకు కలుగజాలదని నిరంతరము జ్ఞాపకముంచు కొనవలయును. ఎట్లన, ఒక యుద్యోగమునకై యొకడు చదువుచున్నాడు, దానియందుత్తీర్ణుడైన ఆ యుద్యోగము లభించును. లేనిచో నా పదవి లభించనట్లు, వ్రతియొక్క వ్రతమును గూర్చియు గూడ సాధువులు నిశ్చయించుకొనవలయును. కావుననే యనేకులు అనేకానుష్ఠానముల జేసియు భంగము గలుగనీయక చూడకపోవుటచే దానియొక్క ఫలితమును బొందజాలకున్నారు. ఈచెప్పినది ఇంద్రియములయొక్క స్థూలార్థమేయగును.

వీనియొక్క సూక్ష్మార్థము వినదగినది, ఇది పై జెప్పినదానికన్న మిక్కిలి సారమైనది. దీనిని మఱింత లోతుకు దిగి విచారణ చేయవలసియుండును. అపుడే నిజమైన సత్యము గోచరము కాగలదు. 1. కర్ణముతో ఏవాక్యమును వినుచున్నామో, ఆవాక్యముయొక్క పరయర్థము ప్రపంచమునకు సత్యమైనను దానిలో మనస్సునుంచక సత్యమగు బ్రహ్మమందే మనస్సు

నుంచవలయును. 2 అలాగున, స్పర్శించెడి వస్తువులు ధర్మయుక్తమైనను అవి దృశ్యవస్తువులుగా తలంపక బ్రహ్మవస్తువులుగా నిశ్చయించుకొన వలయును 3. చూచెడు వస్తువులు సత్యములైనను వానిని దృశ్యవస్తువులుగా చూడక దైవరూపముగానే చూడవలయును. 4. భుజించెడు వస్తువులు ధర్మముతో కూడినవైనను అవిన్ని దృశ్యవస్తువులని తలంపక పరమాత్మ వస్తువులుగానే చింతనచేయవలయును. 5, ఆఘ్రాణించెడి వస్తువులు ధర్మయుక్తములైనను దృశ్య వస్తువులుగా తలంపక వానినిగూడ ఈశ్వర స్వరూపముగానే తలంపవలయును. ఇట్లుండవలయుననియే కఠోపనిషత్తున నచికేతుడను ఋషి కుమారుడు యమధర్మరాజుతో సత్యాసత్యములకున్ను ధర్మాధర్మములకున్ను విలక్షణముగానుండెడు ఏయొక్క బ్రహ్మవస్తువ గలదో దానిని తెలుపవలయునని యడిగిన రహస్యము.

అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్।
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద॥

శాస్త్రవిహితమైన ధర్మముకంటె వేరైనది. అధర్మముకంటె వేరైనది, కార్యకారణభూతమైన దానికంటె వేరైనది. జరిగినదానికంటెను, జరుగబోవు దానికంటెను, వర్తమానమైనదానికంటెను వేరైనదియగు ఎద్దానిని నీవు ఎఱుంగుచున్నాడవో దాని నుపదేశింపుము.

ఇది, జ్ఞానేంద్రియములకు చెప్పినట్లు కర్మేంద్రియములకు కూడను గ్రహించుకొనవలయును, 1. వాక్కుతో చెప్పెడు వచనముగూడ ప్రపచంమునకు సత్యమైనను ఆ కార్యములు దృశ్యములగుటచే జ్ఞాన దృష్టిలో అసత్యమనియే గ్రహించవలయును. అనగా సత్యస్వరూపుడు సర్వేశ్వరు "డొక్కడే యని నిశ్చయించవలయును. అతడే 'సత్యస్యసతం' అని చెప్పబడుచున్నాడు. అనగా బాహ్యమైన సత్యమునకన్న యతీతమైనది. అదియే నిజమైనతత్త్వము. దానినే బ్రహ్మమనియు ఈశ్వరుడనియు, పరమాత్మయనియు చెప్పుచుందురు. 2. చేతితో ఏపదార్థములు ఇచ్చిపుచ్చుకొనియెదరో అవి సత్యములైనను ఈశ్వరమయము తప్ప రెండవది అణుమాత్రమైనను లేనందుచే అవస్తువును గూడ బ్రహ్మమయముగా చూడవలయును. 3. పాదముతో నడచెడి స్థలములు ధర్మయుక్తములైనను దైవమునకన్న అన్యమైనది లేనందుచే ఆ స్థలములను

గూడ దైవముగానే భావనచేయవలయును. 4. ఉపస్థేంద్రియముతో చేయు కార్యములుగూడ ధర్మయుక్తములుగా నుండినను శుద్ధబ్రహ్మమున కన్యమైనది యొకపరమాణువైనను లేనందుచే ఆ కార్యములను గూడ బ్రహ్మమయములుగానే భావనచేయవలయును. వికారము ప్రకృతి యందు కలదుగాన ప్రకృతియనునది లేదను భావన ఇచట చేయుచుండుటచే ఈభావన దృఢపడి రాగారాగా ఆ ప్రకృతిచేష్టలుగూడ అణగిపోవును. ఇదియే దీనిలోగల రహస్యము పుటముచేసిన, విషయుక్తములగు పాషాణాది వస్తువులు ఏలాగున విషరహితములై దివ్యౌషధములగునో, అలాగున భావనాశక్తి యను అగ్నియందు దహించిన ఇంద్రియములుగూడ నిర్విషయస్థితిని పొంద గలుగును. భావనయొక్క మహిమ అటువంటిది· 5. అదే ప్రకారము పాయ్వింద్రియముయొక్క వృత్తియందును పరిశుద్ధమైన జ్ఞానమయమగు బ్రహ్మభావనయే చేయవలయును, అట్టి భావనవల్లనే ప్రకృతి విశేషముగా నశించును. అప్పుడే సంపూర్ణముగా ఇంద్రియములకు భావశుద్ధి గలిగినదని నిశ్చయించు కొనవచ్చును. అప్పు డెచ్చోటను అనిష్టభావము గలుగదు. సర్వకాలములలోను సర్వత్ర నిర్మలభావమే కలుగుచుండును.

బాహ్యాభ్యంతరభేదేన శౌచం తు ద్వివిధం స్మృతమ్।
మజ్జలాభ్యాం బహిశ్శుద్ధి ర్భావశుద్ధి స్తథా న్తరమ్॥

బాహ్యాభ్యంతరభేదములచే శౌచము ద్వివిధముగా నుండునని గ్రహింపదగినది. మృత్తికచేతను, జలముచేతను గలిగెడు శుద్ధి బాహ్యశుద్ధి యనియు, నిర్మలభావము కలిగియుండుట (భావశుద్ధి) అభ్యంతర శుద్ధి యనియు నెఱుంగవలెను.

అంతశ్శుద్ధి విహీనైస్తు యేఽధ్వరా వివిధాః కృతాః।
న ఫలన్తి మునిశ్రేష్ఠ భస్మని న్యస్త హవ్యవత్॥

ఆత్మశుద్ధిలేనివారు అనేకవిధములగు యజ్ఞములుగాని, వ్రతములుగాని దానములుగాని, తీర్థయాత్రలుగాని, పూజలుగాని చేసినను అవి ఫలమును కలుగచేయజాలవు. అవి యన్నియు బూడిదయందు హోమించిన హవిస్సు వలె నిష్ఫలములగును,

## భా వ శు ద్ధి యే జ్ఞా న సి ద్ధి

భావశుద్ధివిహీనానాం సమస్తం కర్మ నిష్ఫలమ్।
తస్మాద్రాగాదికం సర్వం పరిత్యజ్య సుఖీ భవేత్॥

భావశుద్ధి సంపూర్ణముగా కలుగనివారి సమస్తకర్మలున్ను నిష్ఫలములు, అందువల్ల రాగాదులను మనోమాలిన్యమంతయు పరిత్యజించి సుఖముగా నుండులాగున చూడుము.

మృదాభారసహస్రైస్తు కుంభకోటి జలైస్తథా।
కృతశౌచోపి దుష్టాత్మా చండాల సదృశస్స్మృతః॥

వేలకొలది టన్నుల మట్టిచేతను, కోట్లకొలది కుంభముల జలముచేతను దేహశుద్ధి చేసికొనినవాడైనను ఆత్మశుద్ధిలేనివాడు పాపజీవులతో సమానుడుగా తలంచబడుచున్నాడు.

అంతఃశుద్ధివిహీనశ్చ బహిశ్శుద్ధిం కరోతి యః।
అలంకృతః సురాభాండ ఇవ శాంతిం న గచ్ఛతి॥

ఆత్మశుద్ధిలేనివాడై బాహ్యశుద్ధిగలవాడైనను వాడెప్పుడున్ను శుద్ధుడు కాజాలడు, ఎట్లన, సురాభాండముయొక్క బాహ్యమును శుభ్రముగా నలంకరించినను దానిలోగల మద్యముయొక్క వాసన ఎట్లు నశింపజాలదో, శుద్ధికాదో అలాగునే భావశుద్ధిలేనివారి స్థితియనియు గ్రహించుకొనవలయును

అనిర్జితేంద్రియగ్రామో యస్తు ధ్యానపరో భవేత్।
మూఢాత్మానం చ తం విద్యాద్ధ్యానం చాస్య న సిద్ధ్యతి॥

ఇంద్రియసమూహములను ఎవ్వడు స్వాధీనములో నుంచుటకు శక్తిలేనివాడు అగునో, అతడెంత ధ్యానపరుడైనను శుద్ధుడు కాజాలడు. అతనిని మూఢాత్ముడనియే గ్రహించుకొనవలయును. ధ్యానముచే గలిగెడు ఫలమును అతడనుభవింపజాలడు. ఇక అంతరేంద్రియములయొక్క వృత్తిని గురించి యోచించుకొనవలయును. 1, దీనిలో మనస్సు ముఖ్యమైనది. మనస్సు ఏలాటి దృశ్యవిషయములలో మాలిన్యము తలంచకయుండిన మనస్సు శుద్ధము అయినదని గ్రహించదగినది, సత్యమునకున్ను, ధర్మమునకున్ను భిన్నమైన తలంపు కలుగక సత్యముతోన్ను ధర్మముతోనుగలాటి తలంపు

మాత్రమే కల్గియుండవలయును. 2. చిత్తము, ఇదిన్ని దృశ్యములగు చెడువిషయములను గూర్చి చింతలచేయక సదా మంచివిషయములను మాత్రమే చింతన చేయుచుండవలయును. 3. బుద్ధియొక్క నిర్మలత ఎట్లగుననిన, బుద్ధియైనది ఏయొక్క దృశ్యవిషయములగు దుష్టకార్యముల గుఱించి ఈలాగున చేయవలయునని నిశ్చయముచేయక యుండవలయును. 4 అనాత్మ వస్తువులగు వేనియందును నేననికాని, నాదనికాని భావము గలుగ నీయక చూడవలయును. అపుడు అహంకారము శుద్ధమగును. ధర్మమునకున్ను సత్యమునకున్ను విరుద్ధమగు ఏవిషయములోను అంతరేంద్రియములు నాల్గున్ను ప్రవర్తింపగూడనిస్థితి గలుగవలయును. అపుడే అంతఃకరణము శుద్ధమగును. అట్లు తనకు స్వయముగా తోచవలయును· అపుడు భావశుద్ధియొక్క బాహ్యార్థముశుద్ధమైనట్టు తెలిసికొనవలయును.

ఇక అంతరేంద్రియముయొక్క అంతరార్థశుద్ధిని గురించి చెప్పెద 1, సత్యధర్మములతో గూడిన వస్తువుల ననుభవించుటకున్ను, వాటిని మననము చేయుటయున్ను గలిగియుండిన, మనస్సుయొక్క బాహ్య శుద్ధి మాత్రమే గలిగెను ఏలన నిజముగా విచారణ సలిపినచో వస్తువులలోగూడ ఏవస్తువున్ను ఈశ్వరున కన్యముగా లేదుగదా! బ్రహ్మమున కన్యముగా ఏదియైనను ప్రతీతియైనచో అది మాయవల్లనే ఏర్పడెనని గ్రహించుకొనవలయును. దైవమున కన్యముగా ఒక వస్తువుండిన మాత్రముననే మనస్సు దాని గూర్చి సంకల్పము చేయును. అంతయు నొకేవస్తువగు దైవమయమైనచో మఱల మనస్సు దేనిని మననము చేయును? అపుడు మనస్సు అనునది ఒకటి లేకపోవును. అత్తఱి మనస్సుగూడ సద్వస్తువే యగును. ఆసద్వస్తువు తనయాత్మ కన్యముగా మఱి ఏవస్తువున్ను లేదనియు నిశ్చయించుకొనిన, తన యాత్మయగుబ్రహ్మను గుఱించి మాత్రమే మననము చేయవలయును అపుడు మనస్సు భావశుద్ధిలోనికి మఱలుచుండును. పుణ్యపాపములకున్ను, బంధమోక్షములకున్ను ఈమనస్సే కారణము, ఈమనస్సు దృశ్యాభావముగలదైన మఱల బంధయు కలుగదు. 2. అదేప్రకారము బుద్ధియున్న దృశ్యవిషయమును గుఱించి నిశ్చయముచేయక ఈశ్వర స్వరూపమునుమాత్రమే తనయొక్క స్వరూపమని నిశ్చయించుకొనవలయును.

ఏలన, దైవమున కన్యమైనది ఎంతకాలమువఱకు ప్రతీతి యగుచుండునో అంతవఱకు ప్రకృతియుండును. 3. చిత్తము. చిత్తము గూడ ధర్మయుక్త మగు వస్తువును మాత్రమే చింతించెడు స్థితి కలిగియుండినను అదిన్ని బాహ్యశుద్ధిమాత్రమే యగును ఏలన బ్రహ్మమున కన్యమై రెండవవస్తువు లేదుగదా! కలదని తోచిన అది మాయయొక్క మహిమయేగదా? కావున వస్తువును గుఱించి చింతించెడు చిత్తము యొక్క వృత్తి నశించి తనయొక్క నిజస్వరూపమగు ఆత్మను గుఱించి మాత్రము సదా చింతన చేయుచుండ వలయును, అపుడే చిత్తము శుద్ధమగును 4. అహంకారమున్ను అలాగున తనయొక్క పూర్ణ భావమును మాత్రమే భావనచేయవలయును. దృశ్య వస్తువుల దేనియందైన నభిమానముంచిన అదిన్ని బంధమునే కలుగచేయును. ఆత్మకన్యముగా మఱి యేవస్తువున్ను లేదుగదా! కలదని తలంపు కలిగినచో అది మిథ్యయను భావము వెంటనే చేసికొనవలయును. అపుడు భావము, లన్నియు శుద్ధములైనవి. అత్తఱి మిగిలినది బ్రహ్మవస్తు వొకటిమాత్రమే అదిశివము. అద్వైతము. అమృతము. ఆనందము. ఈవిషయమును గీతాచార్యులు ఉపదేశించిరి చూడుడు.

మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానస ముచ్యతే॥

చిత్తనైర్మల్యమున్ను, సంతోషభావమున్ను, చిత్తమును పరమాత్మ ధ్యానమం దుంచుటయు, చిత్తము నితరవిషయములపై పోనివ్వక చేయుటయు, భావము లన్నియు సంపూర్ణముగ శుద్ధములై యుండుటయు-ఇది మానసిక తపస్సనంబడును.

మఱియు అది ఎట్లు సిద్ధించునో దానికొక రహస్యము తెలిపెద. (1) మనస్సు దేనిని మననము చేయుచున్నదో అనగా మనస్సు దేనిని తలంచునో, లేక సంకల్పించునో అపుడు మనస్సు ఈలాగున సంకల్పము చేయుచున్నదని దేనివల్ల తెలిసికొనుచుండునో అదే. ఆత్మ,మనస్సు శుద్ధమైన, అట్టి యాత్మయందు నిలుకడ కలుగును. (2) ఆలాగున బుద్ధి దేనినిగుఱించి నిశ్చయించుచున్నదో ఆబుద్ధియొక్క నిశ్చయము దేనివల్ల ఎఱుంగబడు చున్నదో ఆదే ఆత్మ, బుద్ధిశుద్ధమైన,అట్టి ఆత్మభావము సులభముగా గోచరము

కాగలుగును, (3) అదే ప్రకారము చిత్తము దేనినిగురించి చింతించు చున్నదో ఆ చిత్తముయొక్క చింతనను ఏది తెలిసికొనుచున్నదో అదే ఆత్మస్వరూపము, చిత్తము నిర్మలమైనచో అట్టి యాత్మను ప్రయాసము, లేకనే తెలిసికొనవచ్చును ఏలన, ఈ మనస్సు, బుద్ధి, చిత్తము, దేనిని తలంచునో, నిశ్చయించునో, చింతించునో, ఆ వస్తువులకన్న చిత్తము బుద్ధి, మనస్సు వేఱుగదా? అపుడు చింతింపంబడిన వస్తువులు చిత్తాదుల కన్యముగాను, అవి దృశ్యముగాను ఈ మనస్సు మొదలగునవి దృక్కులు గాను, స్పష్టముగా గోచరములగుచున్నవి గదా! అట్లుండగా మనస్సు మొదలగు వానిని తెలిసికొనియెడు ఆత్మవాటికి విలక్షణముగాను, దృక్స్వరూపముగాను ఉంటున్నదని ఏల తెలిసికొనగూడదు? అదే ప్రకారము (4) అహంకారము దేనినిగుఱించి అహంకరించియున్నదో ఆ వస్తువుకన్న అహంకారము విలక్షణముగదా వస్తువు దృశ్యముగాను అహంకారము దృక్కుగాను యుండును. అపుడు అహంకార మీలాగున అహంకరించుచున్నదని ఏ జ్ఞానమువల్ల గోచరమగుచున్నదో అదే ఆత్మస్వరూపము అది జ్ఞానస్వరూపమగుట చేతనే అంతఃకరణములగు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనెడి నాల్గింటియొక్క స్వభావమును తెలిసికొనుచున్నది. అదే ఆత్మస్వరూపము. అది అంతఃకరణశుద్ధివల్లనే తెలియందగినది.

ఆకాశము శుద్ధమగునపు డేలాగున సూర్యుడు కనుపించునో, ఆలాగున హృదయములోగల సకల అనాత్మవాసనలు నశించునపుడు ఆత్మస్వరూపము గోచరము కాగలుగును. ఇదే భావశుద్ధియొక్క రహస్యము. శుద్ధమైన దర్పణమందు తనయొక్క శరీరము స్పష్టముగ గనుపించునట్లు హృదయశుద్ధి గలుగునప్పుడు ఆత్మయు నిర్మలముగ ప్రకాశించును.

భావశుద్ధిః పరం శౌచం ప్రమాణం సర్వకర్మసు।
చిత్తం విశోధయేత్తస్మాత్కిమన్యైర్బాహ్యశోధనైః॥

భావశుద్ధికన్న పరమగు శుద్ధి మఱియొకటి లేదు. సమస్తకర్మలలో ఇదే ముఖ్యమగు ప్రమాణము. అందువల్ల చిత్తశుద్ధిని ముఖ్యముగా చేసికొన వలెను. అట్లు చేయక బాహ్యమాత్రము శుద్ధిచేసికొన యేమి ప్రయోజనము?

భావతః సంవిశుద్ధాత్మా స్వర్గం మోక్షం చ విందతి।

భావసంశుద్ధిగల ఆత్మ, స్వర్గమును మోక్షమును పొందుచున్నది.

జ్ఞానామలాంభసా పుంసః సద్వైరాగ్యమృదా పునః।
అవిద్యారాగవిణ్మూత్రలేపగంధ విశోధనమ్॥

జ్ఞానమనెడు నిర్మలమగు జలముచేతను, శుద్ధవైరాగ్యమను మృత్తిక చేతను ముముక్షువైన పురుషుడు మరల మరల అవిద్యారాగ ద్వేషములని యెడు మలమూత్రములను శుద్ధముగా కడుగుచుండవలెను.

తైలక్షయే యథా దీపో నిర్వాణ మధిగచ్ఛతి।
కర్మక్షయే తథా జంతుర్నిర్వాణ మధిగచ్ఛతి॥

తైలము క్షయింప దీపమారిపోవునట్లు, కర్మవాసనలన్నియు నశించు నపుడు జీవుడు నిర్వాణమగు పదవిని పొందుచున్నాడు.

త్రివిధా భావనారూపం విశ్వమేత త్త్రిధోచ్యతే।
బ్రహ్మాఖ్యా కర్మసంజ్ఞా చ తథా చైవోభయాత్మికా॥

కర్మభావాత్మికా హ్యేకా బ్రహ్మభావాత్మికా పరా।
ఉభయాత్మికా తథైవాన్యా త్రివిధా భావభావనా॥

సనకాద్యాస్సదా జ్ఞానిః బ్రహ్మభావనయా యుతాః।
కర్మభావనయా చాన్యే దేవాద్యా స్స్థావరాశ్చరాః॥
హిరణ్యగర్భాదిష్వ చ బ్రహ్మకర్మాత్మికా ద్విధా॥

త్రివిధములగు భావనారూపములచే ఈ విశ్వమును మూడు విధములుగా చెప్పడమైనది. బ్రహ్మభావనయనియు, కర్మభావనయనియు, బ్రహ్మకర్మోభయాత్మికయనియు వాటిపేర్లు వానిలో మొదటిది కర్మ భావాత్మికయనియు, రెండవది బ్రహ్మభావాత్మికయనియు, మూడవది ఉభయాత్మికయనియు త్రివిధముగా భావనాభేదము గ్రహించవలయును. జ్ఞానులగు సనకాది ఋషులు సదా బ్రహ్మభావముతో కూడినవారలు. దేవతలు కర్మభావనతో కూడినవారలు, చరాచరాత్మకమగు ఈ జగత్తును కర్మ

రూపముగ భావనచేయువారు ఇంద్రాదిదేవతలు. హిరణ్య గర్భుడు ఆదిగా గలవారు బ్రహ్మకర్మాత్మకమగు ఉభయములతో కూడిన వారలు. అనగా సనకాదిఋషులు ఈ జగమంతయు బ్రహ్మభావముతో చూచువారు, ఇంద్రాది దేవతలు ఈ ప్రపంచమును కర్మభావముతో చూచెడివారు, చతుర్ముఖ బ్రహ్మ మొదలైనవారు బ్రహ్మకర్మాత్మికమగు ఉభయభావముతో గూడిన వారు. ఈ మూడును భావానాభేదముచే కలుగుచున్నవి. కావున జీవన్ముక్తి పదవిని పొందగోరువారు సనకాదులవలె బ్రహ్మభావన గలిగియుండ వలయును.

బ్రహ్మైవాహం న సంసారీ నిత్యముక్తో న శోకభాక్।
సచ్చిదానందరూపోహ మాత్మానమితి భావయేత్॥

ఆత్మభావన ఎట్లు చేయవలయునో యా రహస్యము ఈలాగున చెప్పడమైనది. ఇది మహావాక్యప్రబోధకభావ మగును. "నాయాత్మ కేవలము ప్రకృతికి పరమగు ఆ బ్రహ్మస్వరూపమేగాన అట్టి యాత్మయగు నేను సంసారి కాను; నిత్యముక్తుడను. కావున ఏ శోకమున్ను నాకు కలుగకూడదు' ఇట్లు సచ్చిదానందస్వరూపముగ ఆత్మను నిరంతరము భావన చేయవలయును

ఇపుడు గురువుయొక్క లక్షణము చెప్పబడుచున్నది—

పారంపర్యక్రమప్రాప్తో నిత్యానుష్ఠానతత్పరః।
గుర్వనుజ్ఞారతః శ్రీమా నభిషేకసమన్వితః॥

సుందరః సుముఖః శాంతః కులీనః సులభో వశీ।
మంత్రతంత్రార్థతత్త్వజ్ఞో నిగ్రహానుగ్రహక్షమః॥

నిరపేక్షో మునిర్దాంతో హితవాదీ విచక్షణః।
తత్త్వనిష్ఠాసనే దక్షో వినయీ చ సువేషవాన్।

ఆశ్రమీ ధ్యాననిరతః సంశయచ్ఛిత్సుబుద్ధిమాన్।
నిత్యానుష్ఠానసంయుక్తస్స్వాచార్యః పరికీర్తితః॥

గురుపరంపరాక్రమముతో కూడినవాడును, నిత్యానుష్ఠాన తత్పరుడును, తనయొక్క గురునాజ్ఞయందు ప్రవర్తించువాడును, జ్ఞాన సంపన్నుడును,

గురువుచే అభిషిక్తుడున్ను, కురూపుడు కానివాడును, ప్రసన్నవదనము కలవాడును, శాంతుడున్ను, మంచికుటుంబములో పుట్టినవాడున్ను, అందఱి కిన్ని సులభుడును, సహా ఇంద్రియనిగ్రహము కలవాడున్ను, మంత్రము యొక్కయు వేగార్థముయొక్కయు, తత్త్వము నెఱిగినవాడును, నిగ్రహాను, గ్రహశక్తిగలవాడును. అపేక్షారహితుడున్ను, మౌనము కలవాడును (వేదాంత తత్త్వమును మననము చేయువాడును). దాంతుడును, పరులకు హితమును చెప్పువాడున్ను, ప్రకృతి కన్న పరుడున్ను, వేదాంతతత్త్వమును వెల్లడి చేయుటలో సమర్థుడున్ను, వినయము కలవాడున్ను, వికారవేషము లేని వాడున్ను, తనయొక్క ఆశ్రమమునకు తగిన ఆచరణకలవాడున్ను, నిరం తరము ధ్యానమందు ప్రీతిగలవాడున్ను. సంశయముల భేదించువాడున్ను, స్వచ్ఛమైనబుద్ధి గలవాడున్ను, నిత్యానుష్ఠానములతో కూడినవాడున్ను ఎవడు కలడో, అట్టివాడే ఆచార్యుడని చెప్పబడును. ఇది గురులక్షణము.

ఇక శిష్యుని యొక్క లక్షణము చెప్పబడుచున్నది.

శాంతో వినీత శ్శుద్ధాత్మా సర్వలక్షణసంయుతః।
శమాదిసాధనోపేతః శ్రద్ధావాన్ సుస్థిరాశయః॥

శుద్ధదేహోఽన్నపానాద్యైర్ధార్మికః శుద్ధమానసః।
దృఢవ్రతసమాచారః కృతజ్ఞః పాపభీరుకః॥

గురుధ్యానస్తుతికథాసేవనాసక్తమానసః।
ఏవంవిధో భవేచ్ఛిష్య స్త్వన్యథా గురుదుఃఖదః॥

శాంతుడును, వినీతుడును, శుద్ధాత్ముడును, సర్వలక్షణములతోగూడిన వాడును, శమాదిసాధనములు కలవాడును, శ్రద్ధావంతుడును, సుస్థిరమైన మనస్సు కలవాడున్ను, అన్నపానాదులచేత శుద్ధమైన దేహము కలవాడును, ధర్మబుద్ధి కలవాడున్ను, శుద్ధమైన మనస్సు కలవాడున్ను, దృఢవ్రతమను సమాచారముకలవాడున్ను, చేసినమేలు మఱువనివాడున్ను, పాపభీతికల వాడున్ను, గురువుయొక్క ధ్యానకీర్తనకథాసేవనాదులయందు ఆసక్తమైన చిత్తముగలవాడున్ను ఇట్టి స్వభావము కలవాడు శిష్యుడనంబడును. అట్లు కానివాడు గురువునకు క్లేశము గలుగజేయువాడగును. అట్లు క్లేశము

కలిగించు స్వభావములేనివాడై ప్రీతికలుగజేయుస్వభావము కలిగియుండ వలయును.

యథా దీపో నివాతస్థో నిశ్చలో వాయువర్జితః।
ప్రజ్వలన్నాశయేత్సర్వమంధకారం మహామతే॥

తద్వద్దోషవిహీనాత్మా భవత్యేవ నిరామయః।
శ్రూయతాం భూప కైవల్యం కేవలం మలవర్జితమ్॥

గాలిలేని స్థలములో నుండెడు దీప మేలాగున చలింపక యుండునో, అలాగున హృదయాంతరాళములో సంకల్పములేని జ్ఞానదీపము ప్రజ్వలించి నదై అంధకారసమూహమును నశింపచేయును. ఓ మహామతే! అలాగున భావములన్నియు శుద్ధములైనవాని ఆత్మ ఏవిధమైన మాయామోహము లేనిదై యుండును. కైవల్యమనునది కేవలము మలరహితమగు (అజ్ఞాన రహితమగు) స్థితియని గ్రహింపదగినది.

దుష్కృతంహి మనుష్యస్య సర్వమన్నే వ్యవస్థితమ్।
యో యస్యాన్నం సమశ్నాతి స తస్యాశ్నాతి కిల్బిషమ్॥

ఎవడు ఎవనియొక్క అన్నము భుజించుచుండునో ఆయన్నదాత యొక్క పాపముకూడ ఆయన్నముతో కలిసివచ్చుచుండును. కావున అట్టి అన్నము భుజించువాడు అన్నము ఇచ్చువానియొక్క పాపము కూడ భుజించు చున్నట్లు తలంచవలయును. అందుచే విరక్తులై బ్రహ్మనిష్ఠ చేయువారు శుద్ధాత్ములిచ్చెడు అన్నము నీరసముగా నుండినను అమృతముగా తలంచ వలయును. అట్టి పుణ్యము లేనివారి అన్నము సుఖకరముగా నుండినను విషమువలె తలంచుకొనవలయును.

యస్యాన్నపానపుష్టాంగః కురుతే పుణ్యసంచయమ్।
అన్నప్రదాతు స్తస్యార్ధం కర్తుశ్చార్ధం న సంశయః॥

ఎవడు ఇచ్చిన అన్నపానాదులచేత శరీరము సుఖము కలిగియుండునో అట్టి శరీరముతో చేయబడిన తపోధ్యానవ్రతానుష్ఠానములచే గలిగెడు పుణ్యముయొక్క సగము ఆయన్నదాతకు చెందుచుండును. అనుష్ఠానము

చేసెడు తనకు సగము మాత్రమే లభించును. దీనియందు సందేహములేదు. కావున జిహ్వాచాపల్యము కలిగి సుఖము నిచ్ఛించి ఎప్పుడున్ను ఇతరుల అన్నము భుజించు స్వభావము విరక్తులకు తగదు

ప్రతిగ్రహసమర్థోఽపిన ప్రసజ్యేత్ప్రతిగ్రహే ।
ప్రతిగ్రహేణ విప్రాణాం బ్రాహ్మం తేజః ప్రశామ్యతి॥

దానమును స్వీకరించి, దానివల్ల కలిగెడు దోషమును రహిత మొనర్ప శక్తిగలవాడైనను ప్రతిగ్రహమందు ప్రసక్తియుండగూడదు. ప్రతిగ్రహమువల్ల బ్రహ్మనిష్ఠుల బ్రహ్మ తేజస్సు క్షయించును

భావశుద్ధి గలుగుటకు ఉపాయమును ఈ క్రింది శ్లోకము తెలుపు చున్నది.

జ్ఞానలభ్యం పరంమోక్షం ప్రాహుస్తత్త్వార్థచింతకాః।
తద్జ్ఞానం భక్తిమూలం చ భక్తిః కర్మవతాం తథా॥

తత్త్వజ్ఞులగు మహాత్ములు సర్వోత్కృష్టమైన మోక్షము జ్ఞానముచే పొందబడుచున్నదనియు, అట్టి జ్ఞానము అనన్యమైన దైవభక్తివలన కలుగు చున్నదనియు, ఆభక్తి నిష్కామకర్మ యోగానుష్ఠానమువల్ల కలుగుననియు చెప్పుచున్నారు. ఈయొక్క శ్లోకములోనే కర్మ, భక్తి, యోగ, జ్ఞానములు కలిగెడు విధము నుపదేశించడమైనది.

సర్వపాపేషు నష్టేషు బుద్ధిర్భవతి నిర్మలా।
నైవ బుద్ధిః సమాఖ్యాతా జ్ఞానశబ్దేన సూరిభిః॥

సమస్తపాపములు నశించినపిమ్మటనే బుద్ధి నిర్మలమగుచున్నది. బ్రహ్మవేత్తలాపరిశుద్ధమగు బుద్ధితోకూడిన స్థితిని జ్ఞానమని చెప్పుచు న్నారేగాని వేరుగాదు.

అనుభూతేరభావేపి బ్రహ్మాస్మీత్యేవ చింత్యతామ్ ।
అప్యసత్ప్రాప్యతే ధ్యానాన్నిత్యాప్తం బ్రహ్మ కిం పునః॥

మఱియు బ్రహ్మానుభవము (అనగా అపరోక్షజ్ఞానము) లేక పోయి నను (అహం బ్రహ్మాస్మి) అని యిట్లు ధ్యానించవలయును. బ్రహ్మవిష్ణు రుద్రాదుల యుపాసనలవల్ల (ఆదేవతలరూపముతో) ఉపాసకుడు పూర్వము లేని ఆయాలోకముల పొందుచుండగా, స్వస్వరూపముచేత సర్వదా పొంద బడియుండెడి సర్వాత్మక బ్రహ్మమును ధ్యానమువలన ఉపాసకుడు పొందు చున్నాడని వేఱుచెప్పవలసిన పనిలేదని ఈ వాక్యము చెప్పుచున్నది.

భావనయొక్క విశేషమును ఈ క్రిందిశ్లోకము తెలుపుచున్నది.

భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా।
పుమాం స్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్॥

నిశ్చయబుద్ధిగలవానిచేత ఏ వస్తువు తీవ్రవేగముచేత (రేయింబవళ్ళు) భావింపబడుచున్నదో ఆజ్ఞేయవస్తువుగా (అపరోక్షముగా) తెలియదగిన బ్రహ్మముగా) నాతడు భ్రమరకీటన్యాయమున బ్రహ్మ మగుచున్నాడు.

జీవన్ముక్తిస్తు తద్విద్యాత్పూర్వోపాధిగుణాం స్త్యజేత్।
స సచ్చిదాది ధర్మత్వా ద్భజే భ్రమరకీటవత్॥

లోకమందు పురుగును తుమ్మెద తీసికొనివచ్చి చేయవలసిన ప్రకార ముగా చేసినమాత్రముచేతనే ఆ పురుగు భ్రమరముయొక్క ఓంకారధ్వనిని విని దానియందు లగ్నమైన మనస్సు కలదగుటచే తన యందు పూర్వముండిన కీటకధర్మమును వదలి భ్రమరత్వమును పొందినట్లు, బ్రహ్మము యొక్క తీవ్రభావనచే (ధ్యాన, శ్రవణ మనన నిదిధ్యాసనములచే జీవధర్మమును వదలి పరబ్రహ్మ సాక్షాత్కారస్థితిని సాధకులు పొందుచున్నారు.

యథాఽగాధనిధేర్లబ్ధౌ నో పాయః ఖననం వినా।
మల్లాభేపి తథా స్వాత్మచింతాం ముక్త్వాన చాపరః॥

మిక్కిలి లోతునందు స్థాపించబడిన సువర్ణనిధిని తోడుటయందు త్రవ్వుటతప్ప మఱియొక యుపాయము లేనట్లు పరబ్రహ్మమగు నన్ను బొందుటయందును తన (ఆత్మ) స్వరూపమును ధ్యానించుటతప్ప మఱి యొక యుపాయ మెద్దియును లేదను భగవద్వచనము కలదని తెలియ దగినది.

వివిక్తదేశ ఆసీనో విరాగో విజితేంద్రియః।
భావయేదేకమాత్మానం తమనంతమనన్యధీః॥

నిర్జనప్రదేశమందుండువాడై, సమస్త ఆశలను వర్జించి, ఇంద్రియములను వాటి వ్యాపారమందు ప్రవేశింపకుండ అణచి, మనస్సును చలింపకుండ ఆత్మయందుంచి, ఆత్మయందు పరబ్రహ్మభావన చేసికొని ధ్యానించువాడు బ్రహ్మప్రాప్తి నొందగలుగును.

ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా।
హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్॥

సర్వోత్తమమైన దివ్యరసాయనమును సేవించుటవల్ల రోగములు నశించునట్లు, ఎల్లప్పుడు బ్రహ్మాత్మైక్యాను సంధానభావన చేయుటవల్ల కలిగిన ఆత్మసంస్కార రూపమైన సద్వాసన ఆవరణవిక్షేపశక్త్యాత్మకమైన అవిద్యను బొత్తిగాపోగొట్టి జీవన్ముక్తిని కలుగచేయును.

యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్।
యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్॥

ఏ జ్ఞానలాభమునకన్న వేఱు లాభము అధికము లేదో, ఏ ఆత్మసుఖమునకన్న వేఱు సుఖము గొప్పది లేదో, ఏ ఆత్మజ్ఞానమునకన్న మించిన మఱియొక తెలిసికొనదగిన జ్ఞానములేదో అదియే బ్రహ్మ మని నిశ్చయించి తెలిసికొనవలయును.



# భావాతీతము

జ్ఞానాయ జ్ఞానగమ్యాయ సర్వజ్ఞానైకహేతవే।
జ్ఞానేశ్వరాయ యజ్ఞాయ జ్ఞాత్రే విజ్ఞానసంపదే॥

భావాతీత మనియు, ద్వంద్వాతీత మనియు దీనికి పేరు గలదు. కావుననే గురుధ్యానమున. "భావాతీత" మనియు, పాఠాంతరమున "ద్వంద్వాతీతం విశ్వాతీత" మనియు మున్నది. "భావాతీతం త్రిగుణరహితం"

అనియు ఒకే యర్థమునే తెలుపుచున్నది. దీనిని గుఱించియే యుత్తరగీతయం దిట్లు చెప్పబడినది.

అదృశ్యే భావనా నాస్తి దృశ్యమేతద్వినశ్యతి।
అవర్ణమస్వరం బ్రహ్మ కథం ధ్యాయన్తి యోగినః॥

కనబడని పదార్థమందు ధ్యానము కలుగదు. కనబడెడు వస్తువు నశించునుగదా! అట్టైన వర్ణరూపరహితంబై శబ్దాదుల కగోచరంబై వెలయు బ్రహ్మమును యోగు లెవ్విధమున ధ్యానింపగలరు?

దీని తాత్పర్యమేమన అభావమునందు భావనచేయుటకు సాధ్యము కాదు భావమునే భావన చేయవలసియుండును, భావమునకు లోనైనది నశించును. ఇట్టి ద్వంద్వవిధదోషములలో ధ్యానయోగులు ఎట్లు భగవానుని లేక ఆత్మను లేక ఈశ్వరుని ధ్యానింపగలరని ప్రశ్నయొకటి యున్నది ఈవిషయమై తరువాత మనము తెలిసికొనవచ్చును· ఇపుడు భావాతీతమును గుఱించి తెలిసికొనదగిన విషయములలోనికి ప్రవేశించెదము.

ఈ భావాతీతపదమునకు నాలుగు విధములగు అర్థములు కలవు. (1) ముముక్షువైనను, భక్తుడైనను తాను దేని ధ్యానమును చేయుచు వచ్చెనో అది సాకారము గాని, నిరాకారము గాని దానికన్న అన్యము ఇక ధ్యానము చేయదగినది లేనేలేనని నిశ్చయము కలిగియుండుట. ఇదే భక్తియోగమున కున్ను, ధ్యానయోగమునకున్ను, జ్ఞానయోగమునకున్ను సంబంధించి యుండును. అది వారివారి హితము ననుసరించి యుండువదే.

(2) తాను దేనిని చిరకాలమునుండి ధ్యానించి ఏది ధ్యేయమని నిశ్చయించుకొనియుండునో దానియొక్క అంత్యమువరకు చేరుట అనగా దానిని సాక్షాత్కరించుకొనుట ఇది పై జెప్పిన దానికన్న అధికమైనది. ఇక ధ్యానము చేయవలసిన పనిలేదు. మన యనుష్ఠానము పూర్తియైనది. మనకు శోకశాంతియు, ఆనందప్రాప్తియు గలిగినది. ధన్యుడనైతిని, అని తృప్తి కలిగియుండుటయు భావాతీత మనబడును.

(3) భావములు మనస్సుయొక్కయు లేక బుద్ధియొక్కయు వృత్తులు, మనోవాక్కాయములకు బ్రహ్మము, ఈశ్వరుడు, ఆత్మయు అందునవి కావు.

మఱియు మనోబుద్ధ్యాదులు జడములు. ఇవి చైతన్యాత్మను భావన చేయ జాలవు. అంతేగాక మనోబుద్ధ్యాదుల భావనల నెఱుగుచుండెడు ఆత్మ మనోబుద్ధ్యాదులకు సాక్షిగానుండి మనోబుద్ధ్యాదుల భావనలను తెలిసికొనుచుండునది. అట్టి యారూఢజ్ఞానము కలుగుటయే భావాతీతమనబడును. ఇది పై జెప్పిన రెండింటికన్న గొప్పది.

(4) దీనికన్నను గొప్పపదవి మఱియొకటి కలదు. అది సర్వోత్కృష్టము. అది పరమకాష్ఠయని చెప్పవచ్చును. భావించుటకు తనకన్న అన్యమగు వస్తువు మఱియొకటి యుండవలయును. అట్టి రెండవవస్తువు మఱియొకటి కన్పించుటలేదు. అంతయు నొకే యాత్మమయముగానే కన్పించుచున్నది. అంతయు నొకే ఈశ్వరమయముగాను, బ్రహ్మమయముగాను నుండగా ఏది దేనిని భావించును? భావించునపుడు భావించువాడు భావింపదగినది. భావము అను మూడున్ను కలిగియుండును. ఇది త్రిపుటితో గూడినది. అట్టి త్రిపుటిసహితమైనది. ఏకైకమగు బ్రహ్మము లేక దైవ మెట్లు కాగలుగును?

ఈ త్రిపుటినే ధ్యాతయనియు, ధ్యేయమనియు జెప్పుదురు అలాగున ద్రష్టయనియు. దృశ్యమనియు, దర్శనమనియు పేర్లుగలవు. అట్లే జ్ఞాతయనియు, జ్ఞేయమనియు, జ్ఞానమనియు చెప్పటగలదు. ఇవన్నియు త్రిపుటికి లోబడినవే. ఈ భావాతీతమగు పదవి సామాన్యమైనది కాదు. కేవలము జీవన్ముక్తులు, విదేహముక్తులు విహరించెడు అతి దివ్యలోకములో గల అతి దివ్యపదవియని గ్రహించుకొనవలయును. శ్రీ బుద్ధదేవుడు దుఃఖము ఏమాత్రమైన లేనిదనియు, నిరతిశయసుఖ ఘనీభూతమనియు బోధించిన నిర్వాణపద మిదియే అలాగున శ్రీశంకరు లుపదేశించిన "ఏకమేవాద్వితీయం" అను బ్రహ్మపదమున్ను ఇదేయని గ్రహించదగినది. చిరకాలము ధ్యానముచేతను, మనననిదిధ్యాసములచేతను మాత్రమే ఈ స్థానములోనికి జీవులు చేరగల్గుదురు ఇదే జగజ్జీవరహితమగు ఈశ్వరనిలయము. ఇచట జీవజగదీశ్వరులు ఏకమగు కేవలేశ్వర తత్త్వముమాత్రమే మిగిలియుండును. ఇది నదులు కాలువలు అన్నియు సముద్రమున జేరునపుడు నదులు కాలువలును నామరూపములు లేని పైయొకే మహాసము

ద్రమముగా కన్పించుచున్నట్లుండును. బుద్బుదములు, కల్లోలములు శాంతినొందిన ప్రశాంతమహాసముద్రమువలె ఆస్థితి గలిగియుండును

యథా నద్యః స్యందమానాః సముద్రేఽ
స్తం గచ్ఛన్తి నామరూపే విహాయ।
తథా విద్వాన్నామరూపాద్విముక్తః
పరాత్పరం పురుషముపైతి దివ్యమ్॥

ఈ యుపనిషద్వాక్యము పై జెప్పిన దానిని బోధించుచున్నది. ఏలాగున, నదులన్నియు సముద్రమునకు ప్రాపించునపుడు తమ నామ రూపముల విడిచి ఒకే మహాజలమగుచుండునో అలాగున బ్రహ్మవేత్త తనయొక్క నామరూపోపాధులను త్యజించి దివ్యమైన పరాత్పరుడగు పరబ్రహ్మముయొక్క అవస్థను పొందుచున్నాడు. శిల్పి ఏర్పఱచిన పలురకములగు విగ్రహముల నన్నిటిని మఱల గఱగించిన ఒకే లోహమయమగు వస్తు కేవలమగు ఆస్థితిలో జగజ్జీవులు ప్రత్యేకముగా స్ఫురింపవు. అనేక రంగులతో గూడిన వస్త్రములయొక్క రంగులను తీసివేసి దారములన్నిటిని దూదిగా చేసిన ఏలాగున నొకే విధముగా నుండునో, అలాగున ప్రకృతి యను చిత్రకారుని కృత్రిమము లన్నియు నశించిన ఒకే ఈశ్వరమయముగానే యుండును. గీత మూడవ అధ్యాయాంతమున ద్వంద్వాతీతమగు జ్ఞేయమును పొందెడు విధానము తెలుపబడియున్నది.

ఇంద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధిర్యోబుద్ధేః పరతస్తు సః॥

లోకముకన్న దేహము పరమనియు, దేహమునకన్న శ్రోత్రాదీంద్రియములు పరములనియు, ఇంద్రియములకంటె మనస్సు పరమైనదనియు, సంకల్పవికల్పాత్మకమగు మనస్సుకంటె నిశ్చయాత్మకమైన బుద్ధి పరమనియు జ్ఞానులు చెప్పుచున్నారు. ఎవడు బుద్ధికంటె పరుడుగా సాక్షిగా నున్నాడో వాడే ఆత్మయని తెలిసికొనవలసినది. వానికన్న పరమైనది మఱియొకటి లేదు. సర్వమునకు సాక్షియు, ఆధారభూతుడు నగు ఆత్మయు అదేయన్ని తెలిసికొనుము.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥

ఓ అర్జునా! వెనుకటి శ్లోకమందు చెప్పబడిన ప్రకారముగా బుద్ధికంటె వ్యతిరిక్తుడైన వానినిగా అనగా పరుడైనవానినిగా ఆత్మను (అనగా తన్ను) తెలిసికొని నిశ్చయాత్మకమగు బుద్ధిచేత మనస్సును నిశ్చలముచేసి, జయింప నసాధ్యమైనదియు, కామమే స్వరూపముగా గలదియనగు అజ్ఞానమను శత్రువును నశింపజేయుము. ఈయర్థమే కఠోపనిషత్తునందు నాచికేతుడను ఋషికుమారునకు యమధర్మరాజు బోధించిన యాత్మతత్త్వజ్ఞానమున గూడ గలదు.

ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
మనసస్తు పరాబుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్పరః॥

లోకమునకన్న సూక్ష్మమైనది దేహము, (పరము) దేహమున కన్న కర్మేంద్రియములు సూక్ష్మములు (పరములు) కర్మేంద్రియముల కన్న జ్ఞానేంద్రియములు సూక్ష్మములు (పరములు) జ్ఞానేంద్రియముల కన్న శబ్దాది విషయములు సూక్ష్మములు (పరములు) శబ్దాదివిషయముల కన్న మనస్సు సూక్ష్మమైనది (పరమైనది). మనస్సుకంటె నిశ్చయాత్మకమగు బుద్ధి సూక్ష్మమైనది (పరమైనది) బుద్ధికంటె సర్వమహత్త్వమగు హిరణ్యగర్భాఖ్యతత్త్వము సూక్ష్మమైనది (పరమైనది).

మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః।
పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః॥

మహత్తత్త్వముకంటె అవ్యక్తము మహత్తరమైనది. ఆ యవ్యక్తముకంటె పురుషుడు మహత్తరుడు. పురుషునికంటె మహత్తరమైనది కొంచెమైనను లేదు. అదియే అంత్యమైనది. అదియే సర్వోత్కృష్టమైనది. ఈవాక్యములో బుద్ధ్యుపహితతత్త్వమే మహత్తత్త్వమనియు, అవ్యక్తమనియు చెప్పినదిగా గ్రహించవలయును. బుద్ధితత్త్వమునే ప్రధానమనియు, ప్రకృతి యనియు కొందఱు చెప్పుదురు. అంతేగాని మహత్తత్త్వము అవ్యక్తము ఒకదానికొకటి భిన్నమని తలంప నక్కఱలేదు. ఈ తత్త్వమును పురస్కరించినచో

శ్రీగీతాచార్యులగు శ్రీకృష్ణ భగవాను లుపదేశించిన పై జెప్పిన రెండు శ్లోకములు అని గ్రహించుకొనవలయును. మఱియు ఈయర్థమే ఈయుపనిషత్తునందు విశదముగా తెలుపబడియున్నది.

అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకోఽలిఙ్గ ఏవ చ।
యద్ జ్ఞాత్వా ముచ్యతే జన్తురమృతత్వం చ గచ్ఛతి॥

మానవుడు ఏయాత్మ పురుషుని తెలసికొని అవిద్యా విలసితమగు సంసారబంధమునుండి వదలబడుచున్నాడో, అమృతత్వమునున్ను పొందుచున్నాడో, అట్టి పురుషుడు అవ్యక్తముకంటె శ్రేష్ఠుడు. సర్వవ్యాపకుడు లింగరహితుడును. అగుచున్నాడు.

ఇన్ద్రియాణాం పృథగ్భావ ముదయాస్తమయౌ యత్ ।
పృథగుత్పద్యమానానాం మత్వా ధీరో న శోచతి॥

జ్ఞానియగువాడు వేఱువేరుగా పుట్టియున్న ఇంద్రియములయొక్క భిన్నభావమును ఉత్పత్తివినాశనములను తెలిసికొని దుఃఖింపడు. ఇదే భావాతీతమనియు, ద్వంద్వాతీతమనియు, ఇంద్రియాతీతమనియు చెప్పెడు స్థితి యని గ్రహించవలయును. ఇంద్రియములయొక్కయు, విషయముల యొక్కయు ఉత్పత్తిస్థితిలయములను తెలిసికొనెడి యాత్మ ఈమూడింటికి విలక్షణముగా నుండి సాక్షిరూపముగా చూచుచుండును. అందువల్ల తాను నిత్యశుద్ధ స్వయంప్రకాశస్వరూపుడుగా నున్నవాడని తలంచి హర్షశోకములను ద్వంద్వములను పొందకయుండును.

ద్వంద్వాతీతస్థితిని గుఱించి తెలియందగిన భాగము నిప్పుడు తెలిపెద. మనము గ్రహించుకొనవలసినది. ఈ ద్వంద్వమునే సంసారచక్రమనియు, సంస్కారమనియు, సంసార భ్రాంతియనియు, సంసారబంధమనియు చెప్పుదురు. దీనికే కాలచక్రమనియు, కర్మబంధమనియు, భవబంధమనియు పేర్లుగలవు. దీనియందు బంధము గలిగియుండువఱకు ఘటీయంత్ర మేలాగున క్రిందికిన్ని పైకిన్ని పోవుచుండునో, అలాగున ఈజీవుడు ఇహ లోకము నుండి పరలోకమునకున్ను, పరలోకమునుండి ఇహలోకమునకున్ను జనన మరణరూపముగా నిలుకడ గలుగక వచ్చిపోవుచుండును, యంత్రపు

టుయ్యేలలో గూర్చుండు వారేలాగున క్రిందనుండి పైకిని పై భాగమునుండి క్రిందిభాగమునకు వేగముగా తిరుగుచుందురో, అలాగునే కాలచక్రము యొక్క గతియు గలిగియున్నదని గ్రహించగినది. అచక్రముయొక్క గమనము నిలిచిన మాత్రముననే దానినుండి దిగుటకు సాధ్యమగును. అద్దానినుండి దిగినవాడు ఏలాగున హాయిగగూర్చుండునో, సంసారచక్రము నుండి విముక్తిబొందిన జీవుడున్ను అలాగుననే నిత్యశాంతియగు దైవ సుఖమును పొందుచుండును ఆ ద్వంద్వములు దినరాత్రులవలెను, శుక్లపక్ష కృష్ణపక్షములవలెను, ఎండకాల వానకాలములవలెను సదా సుఖదుఃఖ రూపముగా తిరుగుయుండును.

ఇట్టి ద్వంద్వములో నిఱికికొనుటయే సంసారబంధముగాని అట్లుగాక గృహముగాని, గృహసంబంధముగాని, ఇతరములగు ధర్మప్రవర్తనలుగాని సంసార బంధములు గావు. ఈద్వంద్వములయందు చిక్కుకొననివారు సంసారములో నుండినను, లేక ధర్మకార్యప్రవర్తకులై యుండినను వారు సన్న్యాసులే, అలాగున బాహ్యసన్న్యాసులైనను ఈ ద్వంద్వములో తగు ల్కొనినవారు సంసారులే.

దీనినుండి విమోచనము కలుగుట సామాన్యము కాదు. చింతకాయ పండినమాత్రమే తోలునుండి విడుదల నొందగలుగును. కొబ్బరికాయలో గల జలము నశించిన మాత్రమే చిప్పనుండి విడుదలపొంది "కురిడీ" యగును అలాగున అంతఃకరణములోగల వాసనాజలము నశించినమాత్రమే జీవుడు ప్రకృతినుండి విముక్తి నొందగలుగును. అపుడు గృహములో నివసించువాడు గృహమునకున్ను, దానిలోగల సమస్తసామానులుకున్ను తాను ఏలాగున విలక్షణుడుగా నుంటున్నాడో అలాగున శరీరత్రయమున కున్ను శరీరత్రయగుణములకున్ను తాను విలక్షణుడుగా నుంటున్నానను జ్ఞానము గలుగును, అపుడు భవబంధమునుండి విముక్తిగలిగినదని తెలిసి కొనందగును. అపుడు బోనునుండి బైటపడిన సింహము చందంబున ఈ యాత్మ స్వేచ్ఛను. గంభీరావస్థను పొందుచుండును. అత్తఱి ఘటస్థమగు దీపము ఘటావరణచే కన్పడకపోయినను ఘటముయొక్క భేదనముచే ఎట్లు స్వయంప్రకాశమైయుండునో, అలాగున ఆవరణము నశించిన జీవుడుగూఢ

స్వప్రకాశుడై యున్నట్లు స్వయముగా గోచరించును. మఱియు అది ఎటు వంటిదనగా, గ్రహణకాలములో సూర్యచంద్రులు రాహుకేతువులచే గ్రసింపబడియుండగా ఎట్లు ప్రకాశశూన్యులై యుందురో, గ్రహణవిమోచన కాలమున అతులమగు దివ్య ప్రకాశకులై శోభింతురో అట్లు అజ్ఞానగ్రహణ మనెడు ద్వంద్వముల నుండి విముక్తిబొందిన జీవులున్ను నిరావరణ సూర్య చంద్రులవలె ప్రకాశవంతులై శోభింతురు.—గీత—

యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్॥
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః॥

చిత్తశుద్ధికి కారణములగు సత్కర్మముల ఈశ్వరార్పణబుద్ధితో నాచరించిన ఏ జనులయొక్క అజ్ఞానమైతే (పాపమైతే) నాశమును పొంది నదో, ఆ జనులు సుఖదుఃఖాదులైన ద్వంద్వహేతువగు కర్మమునుండి విడుపబడినవారై, దృఢమైన నియమముగలవారలై, పరమాత్మ ధ్యానమందు నిశ్చలురై యుందురు.

దీనివల్ల దైవార్పిత భావముతో సత్కర్మపరులై యుండుటయే ద్వంద్వవిముక్తికి కారణమని శ్రీభగవంతు డుపదేశించిన వాక్యమును ముముక్షువులు బాగుగ జ్ఞాపకము చేసికొనవలయును. ఏలన ఈ కాలమున పుణ్యకర్మలు, భగవద్భక్తి గొప్పది కాదనియు, తత్త్వవిచారమే గొప్పదనియు చెప్పుచూ ద్వంద్వములో తగుల్కొని తిరుగుచుండువా రనేకులు గలరు. అట్టివానివలలో చిక్కుకొనక యుండవలయునని భగవంతు డనుగ్రహించిన యుపదేశము మఱువకుందురుగాక!

అలాగుననే "సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ" — సుఖదుఃఖములను, లాభాలాభములను, జయాజయములను సమానముగా చూడవలయునని యుపదేశించుచున్నారు. ఇదే ద్వంద్వాతీతమునకు లక్షణ మగును. ఇట్టి స్థితి తమకు గలిగినదాయని ప్రతివారును తమయాత్మలో చూచుకొనవలయును సుఖమువచ్చినపుడు సంతోషమున్ను, దుఃఖము వచ్చినపుడు క్లేశమున్ను, లాభము వచ్చినపు డానందమున్ను, నష్టము వచ్చినపుడు దుఃఖమున్ను, జయము గలిగినపుడు హర్షమున్ను, అపజయము

గ్గలినపుడు శోకమున్ను, బహుమానము వచ్చినపుడు ప్రీతియును, అవమానము వచ్చినపు డప్రీతియును, గలిగియుండుట ద్వంద్వముతో గూడినట్లే తలచవలయును. ఈలాగున స్తుతి నిందలలోను. రుచి అరుచులలోను జ్ఞాపకము చేసికొనవలయును. దీనిని తెలిసికొనుటకే ఆత్మవిచారణ చేయవలయునని చెప్పు రహస్యమేగాని; ఇట్టి ద్వంద్వములోనుండి యాత్మవిచారణ చేయుటకన్న శ్రీకృష్ణభగవాను డుపదేశించినట్లు సత్కర్మలజేసికొని భగవద్భక్తి గలిగియుండుటయే మంచిది. మఱియు పూజ్యాపూజ్యతలను. శీతోష్ణములను, జననమరణములను. శుద్ధాశుద్ధములను, శత్రుమిత్రులను స్త్రీపురుషులను ఈ మొదలగు సకల ద్వంద్వములను సమానముగా చూచుకొను స్థితి తనకు గలిగినదా యని ఆత్మలో విచారణ సలుపవలయును. ఇది అంత సులభమని తలంచరాదు.

నిజమైన ద్వంద్వాతీతస్థితి ఈక్రింద వ్రాసే లాగున నుండునని ఉత్కృష్టశాస్త్ర ముద్బోధించుచున్నది. సముద్రముయొక్క ఉపరిభాగములో గల పడవలు; అలలు చలనముతో గూడియుండినను సముద్రాగాధ భాగములోగల గొప్పరాతిగుండు ఎట్లు నిశ్చలముగా నుండునో, అలాగున ద్వంద్వాతీతుడు దృశ్యాదులగు వస్తువులచే చలింపకయుండును. మఱియు సముద్రములో నుండు పడవ అలలచే కదలుచుండినను బడ్డు, చేర్చియుండు పడవ ఏలాగున నిశ్చలముగాను, గంభీరముగాను నుండునో అలాగున ద్వంద్వములదాటిన ప్రకృతికి పరమైన స్థితిని బొందిన పురుషుడు ఇంద్రియములు, మనస్సు మొదలగువాని యొక్క చపలతకు లోబడకయుండును. ఈ ద్వంద్వములగు మనస్సుయొక్క చంచలత్వమునే సంసారమని గ్రహించనగును. అది లేనివాడే సంసారముయొక్క తీరమును చేరినవాడగును. మనస్సుయొక్క ద్వంద్వమగు వికృతిచే వికారము పొందేవాడు బాహ్యసంసారమును విడిచిన వాడయ్యు అంతరంగమగు సంసారమును తరించినవాడు గాడు. ఇదియే దీనియొక్క గుఱుతు. మంచుచేగాని, వానచేగాని, గాలిచేగాని, ఎండచేగాని ఏలాగున పర్వతము చలింపకయుండునో అదేరీతిగా దృశ్యములగు ద్వంద్వములచే చలనము గలుగనపుడే ద్వంద్వాతీతమగు ఆరూఢస్థితి సిద్ధించినట్లు నిశ్చయించుకొనవలయును. గీతాచార్యుండు ఈ తత్త్వమునే యుపదేశించియున్నాడు—

యదా హి నేన్ద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే।
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే॥

ఎపుడు శబ్దాది విషయములయందును. కామ్యకర్మములయందును ఆసక్తి గలుగదో అపుడు సర్వసంకల్పములను విడిచిన యోగా రూఢస్థితి బొందినవాడని చెప్పబడుచున్నాడు. మంచి వేవగల వృక్షమేలాగున ఎంత గాలికైనను పతనము నొందక యుండునో, దుర్బల వృక్షములు తుపాను వచ్చినపుడు ఎట్లు పడిపోవునో, అలాగున ఇంద్రియాది వృత్తులగు ద్వంద్వములచే చలింపక సుస్థిరత గలిగియుండుటయే స్థితప్రజ్ఞుని లక్షణ మని గీతాచార్యులు ద్వితీయాధ్యాయమున ఉపదేశించిరి. మలినములేని సువర్ణమైన ఏలాగున అమ్లనింబరసాదులచే వికారము నొందకయుండునో, మలినబంగారమైనచో ఎట్లు చిలుముపట్టునో అలాగున ప్రకృతి నశించిన శుద్ధాత్ముడైనచో ఆ మహాత్ముడు దృశ్యవిషయాదులగు ద్వంద్వములవల్ల మార్పు బొందకయుండును. ఇట్టి స్థితి తమకు గలిగియున్నదా? లేదా యని పదేపదే ఆత్మలో విచారణ సల్పుచుండవలెను. ఇదే ఆత్మవిచారము యొక్క ప్రయోజనమగును అట్లు కానిది ఆత్మవిచారము గాదు.

అంతస్సంగం బహిస్సంగ మాత్మసంగం పరిత్యజేత్।
సర్వసంగనివృత్తాత్మా పశ్యేదాత్మానమాత్మని॥

ఈ శ్లోకమువల్ల మూడువిధములగు బంధములున్ను విడువవలయునని తెలుపడమైనది. 1. బాహ్యప్రపంచసంగము. 2. దేహేంద్రియాదుల సంబంధ మున్ను, 3. అనాత్మబుద్ధ్యాదులలో ఆత్మభావముగల సంబంధము. వీనినే లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన యని చెప్పుదురు. ఇప్పటి వారిలో చాలమందిన్ని బాహ్యప్రపంచమే సంసారబంధ మని తలంచి విడుచుచున్నారు. దేహేంద్రియములతో గూడిన అభిమానమునుగాని, అనాత్మయగు అవిద్యా సంబంధమును గాని విడుచుటకు యత్నించుట లేదు. అందువల్లనే పూర్వీక ఋషుల యొక్క పూజ్యమగు పదవిని పొందజాలకున్నారు.

బాహ్యప్రపంచ బంధము నొక్కదాని విడుచుటవల్ల స్థూలప్రతిబంధము నశించినదని తలంచవలయును. ఇక సూక్ష్మప్రతిబంధమున్ను మూలా

విద్యయగు కారణప్రతిబంధమున్ను మిగిలియున్నవి. అరటి, కంద, పెండలము వేమ. పసుపు మొదలగు చెట్లను భూమికి సమముగా గోసి వేసినను, వానియొక్క మూలమగు దుంప భూమిలోపల నుండుటచే మరల అవివిగిర్చి మామూలు చెట్లగునట్లు మూలావిద్యయగు అజ్ఞానమును హృదయ గుహానుండి తీసివేయనిచో జనన మరణములకు హేతు వగు స్థితి కలుగుట నిక్కము బాహ్యత్యాగముచే ప్రస్తుతము కొంత శాంతిగలిగినను, అది శాశ్వతమగు పరమశాంతియని తలంచవలదు.

జ్ఞానేన దీపితే దేహే బుద్ధిః బ్రహ్మసమన్వితా।
బ్రహ్మజ్ఞానాగ్నినా విద్వాన్నిర్దహేత్కర్మబంధనమ్॥

ఆత్మజ్ఞానముగలవాడు ఆత్మజ్ఞానముచేత దేహము ప్రకాశింపబడుచుండ గను, నిశ్చయాత్మకమైన బుద్ధి బ్రహ్మముతోగూడిన దగుచుండగను. బ్రహ్మజ్ఞాన మనెడి నిప్పుచేత అజ్ఞాన మనెడి కర్మపాశమును దహింపజేయు చున్నాడు ఇదే ధ్యానముయొక్క మహిమ యని గ్రహించవలయును. జ్వలించుచుండెడి అగ్నిలో వేసినవస్తులన్నిటిని అగ్ని తనయొక్క స్వరూప ముగా జేయుచున్నట్లు ధ్యానబలముగల వానికి బుద్ధ్యంత దేహాదీంద్రియము లీశ్వరమయముగానే గన్పించును.

ప్రాప్తే జ్ఞానేన విజ్ఞానే జ్ఞేయే చ హృది సంస్థితే।
లబ్ధశాన్తిపదే జీవే న యోగో నైవ ధారణా॥

జ్ఞానముచేత పరమాత్మజ్ఞానము పొందబడినదగుచుండగను, జ్ఞేయము (పరబ్రహ్మము) హృదయమునందు ప్రకాశించుచుండగను. జీవుడు శాంతి పదమును బొందుచుండగను యోగములేదు ధారణయున్ను లేదు. వియోగము గలిగియుండువఱకు మాత్రమే యోగముండును, ధ్యేయాకారము గలుగు వఱకే ధారణ యుండును ఇది ధ్యేయైకస్థితిని తెలుపుచున్నది. ఇదియే భావాతీతము,

యథా జలం జలే క్షిప్తం క్షీరే క్షీరం ఘృతే ఘృతమ్।
అవిశేషో భవేత్తద్వజ్జీవాత్మపరమాత్మనోః॥

జలమందు జలమును, పాలునందు పాలను, నేయియందు నేయిని గలుపగా నెట్టుల భేదము కనుపడక ఏకీభవించునో ఆవిధంబుననే అవిద్యోపాధియుక్తుండగు జీవాత్మకును పరమాత్మకును భేదంబు గానంబడినను, ఆజీవునకు ఆ యవిద్యా సత్సంస్కార విశేషంబుచే నివర్తి యైనపుడు పరమాత్మతోడ ఏకత్వము సిద్ధించుచున్నది. అనగా తానే పరమాత్మ యగుచున్నాడు.

తిలమధ్యే యథా తైలం క్షీరమధ్యే యథా ఘృతమ్।
పుష్పమధ్యే యథా గంధః ఫలమధ్యే యథా రసః।
కాష్ఠాగ్ని వత్ప్రకాశేత ఆకాశే వాయువచ్చరేత్॥

నువ్వులయందు నూనెవలెను, పాలయందు నేయివలెను, పుష్పమునందు వాసనవలెను, ఫలమునందు రసమువలెను, కట్టెయందు నిప్పువలెను, ఆకసంబునందు గాలివలెను. అన్నమయాది ంచకోశదేహమునందు ఆత్మ వ్యాపకమైయుండియు చలించుచున్నాడు. తిలమును క్షీరమును, పుష్పమును, చేయవలసిన క్రియలు చేయునపుడు అదివఱలో గన్పడని తైలము, ఘృతము, సుగంధము, రసము, అగ్ని మొదలైనవి ఎట్లు కన్పడుచున్నవో అలాగున ఆత్మానాత్మవిచారములచేతను. చిత్తైకాగ్రత ధ్యానముచేతను, కన్పడని ఆత్మను అనగా దైవమును గనుగొనగలరు.

ఈ వాక్యములన్నియు ఉత్తరగీతయందు భగవాను లుపదేశించియున్నారు. భగవద్గీతయందు అంతఃకరణశుద్ధికి తగిన నిష్కామకర్మయోగము నుపదేశించి అంతఃకరణశుద్ధి గలిగిన పిమ్మట ఆత్మచింతనయు ధ్యానయోగమున్ను చేయవలసియుండుటచే ఆ పరమతత్త్వమును, భగవద్గీత యగు పూర్వగీతను బోధించిన తరువాత ఉపదేశించినదగుటచే దీనికి ఉత్తర గీతయని పేరువచ్చినది.

దృశ్యములనుండి భావములనుండి ఆత్మకు ఎట్లు విముక్తి గలుగునో ఆ సంగతి తెలిపెద. కన్పించున వన్నియు దృశ్యములు కావా? వానిని చూచుచుండెడి యాత్మ దృక్కుగ నుంటున్నాడుగదా! అట్టి యాత్మ నిత్య సుఖస్వరూపుడుగదా? కావున దృశ్యముతో దృక్కునకు గల సంబంధమే బంధమగును ఒక "ఫ్యాక్టరీ" లోవెళ్ళి చూచిన ఒక చక్రము తిరుగుచుండును.

దానితో మఱియొక చక్రమునకు ఒకపట్టు తగిలించియుండిన రెండుచక్రములును తిరుగుచుండునట్లు గోచరించును. అన్ని యంత్రములును ఈలాగుననే యుండును ఆపట్టును తొలగించిన ఆ యంత్రములు నిశ్చలముగానుండునట్లు గోచరించును. ఇదే సంసారచక్రముయొక్క రహస్యము ప్రకృతి ఎల్లప్పుడును వికృతిస్వభావము గలిగి తిరుగుచుండును. దానితో మనస్సునకుగల సంబంధమే బంధమగును అది లేకుండునట్లు చేయుటయే విముక్తి యనంబడును. ఒక యంత్రాలయమునకు వెళ్ళి చూచిన ఈ సంగతు లన్నియు స్పష్టముగా గనదగును. ఇట్టిద్వంద్వములోనికి దిగివచ్చుటయే సంసారచక్రములోనికి దిగుట యగును. ఈలాటి ద్వంద్వములనుండి మనస్సును మరలించుకొనుటయే సంసారసాగరమునుండి సంసారయంత్రమునుండి పైకి ఎక్కుట యగును. ఇదియే దీనిలోనుండు కీలకము. అది ఎట్లు సాధింపవచ్చునని శంకింప బనిలేదు. శ్రీకృష్ణపరమాత్మ ఉపాయమును వచించియున్నారు.

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణ సుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత!॥

ఓ అర్జునా! ప్రంచతన్మాత్రలవలన బుట్టిన ప్రపంచకరణములచే బుట్టిన) శ్రోత్రాదీంద్రియములయొక్క శబ్దాదివిషయ సంయోగములయితే చలివేడి మొదలగు సుఖదుఃఖములను గలుగజేయునవిగాను,సంయోగవియోగములు కలిగినవిగాను, ఒకప్పుడుండి మఱియొకప్పుడు లేకుండునవిగాను అస్థిరములైనవిగా నున్నవి. కాబట్టి అర్జునా! అట్టి శీతోష్ణాది సుఖదుఃఖద్వంద్వములను సహించుకొనవలయును.

ఇట్టి ద్వంద్వములను, సహించుకొనెడి శక్తిగలిగినప్పుడే వారి సాధన దృఢపడినదని తెలిసికొనవచ్చును. పాదరసము అతిచలనము గలిగినది, అయినను మూలికల రసముచే కట్టినచో అది సీసముగుండువలె నుండును, మరల దానికి చలన ముండదు. అధ్యాత్మధ్యానబల మిటువంటిది. దుర్బల స్తంభమునకు గట్టిన పశువులు ఆకట్టును లాగుకొనిపోవును· లోతుగనాటిన బలమైన స్తంభమైనచో దానిని ఊడబెరుకుటకు పశువులేగాదు. ఏనుగులకైన సాధ్యముండదు. ఇదే దృఢప్రజ్ఞనియొక్కయు, అదృఢప్రజ్ఞనియొక్కయు

స్థితియని తెలిసికొనదగును. దేహబలము కలవాడైనను మనోనిగ్రహబలము లేనివాడైనచో, 'సుడిగాలి' శుష్క పత్రములను ఎగురగొట్టునట్లు దృశ్య వాసనారూపవాయు వతని చీకాకు పఱచును. దినరాత్రులవలె సుఖదుఃఖములు, స్తుతినిందలు, మానావమానములు, లాభనష్టములు వచ్చిపోవుచుండును. ఇవన్నియు, పూర్వ జన్మకర్మసంస్కారము ననుసరించి జరుగుచుండును కావున ఆత్మ అనగా జీవుడు ఈద్వంద్వములకు సాక్షిగానుంటున్నాడు. ఈద్వంద్వముల యొక్క రహస్యతత్త్వమును గ్రహింపక పోయిన యోగముచేగాని తపస్సువల్లగాని, శాస్త్రపఠనముచేగాని శాంతి గలుగదు.

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః॥

ఓ అర్జునా! విషయములయందింద్రియములు ప్రవర్తించుటవలన గలుగు సుఖములు ఏవి కలవో అవి దుఃఖహేతువులే యగుచున్నవి. ఏలయనగా అవి యారంభమును. సమాప్తియును గలవి. స్వల్పకాలముండునవి. కాబట్టి వానియందు వాస్తవము నెఱింగిన వివేకి ప్రీతి జేయడు. అనగా నాసక్తుడు గాడు. 'న తేషు రమతే బుధః' అని భగవంతుడు చెప్పుటచే ఆత్మతత్త్వ బోధముగలవాడు అనగా ద్వంద్వాతీతుడు దృశ్యములతో గలిసియుండడు ఇట్టి బోధము లేనివాడే ద్వంద్వములకు వశుడై యుండును.

ఆహా! గీతోపదేశ మెంత గొప్పది. ఇట్టి విచారణవల్లనే జీవుడు ద్వంద్వముల కతీతపదవులను పొందవలయును. అట్టి పదవిలోనికి వెళ్లుటకు గొప్ప మనోబలము కలుగవలయును. గొప్ప సంయమన శక్తియు ఉండవలయును ఈ సంయమనము కలుగుటకు మనశ్శుద్ధి బాగుగా నుండవలయును. లేనిచో అది సాధ్యము గాదు. అది గొప్ప కొండ నెక్కులాగున నుండును. ఎట్టివంటి కొండయనగా ఏటవాలుగాను, బహునైసుగాను, వర్షకాలమగుటచే పాచిపట్టినదిగాను నుండుకొండ. దానిపై నడచి పర్వతోపరిభాగము చేరుటలో ఎందరో జారిపడిపోవుదురు. దేహేంద్రియములను బాగుగా మనస్సుచే లాగు కొనుటకు శక్తిగలవాడు మాత్రమే పర్వతోపరిచేరగలుగును. ఆధ్యాత్మ పదవియు నట్టివంటిదే. కావుననే దానికి మేరుశిఖర

మనియు, త్రికూట పర్వతాగ్రమనియు పేరు కలిగినది. రోగపీడితుడై యుండువాడు. ఏ కార్యము చేయుటకున్ను ఎట్లు శక్తిగలిగియుండడో, అలాగున అజ్ఞానమను రోగము జీవునకు గల్గియుండిన ద్వంద్వమునుండి విడుదల చేసికొనజాలడు. మనస్సునకు నిర్మలత కలుగుటయే దానికి సుఖ మార్గము. దేహబలముమాత్రము గలగియుండినను మనోనిర్మలత యను బలము లేనిచో ఏ పనులున్ను జనులు చేయజాలరు. మనస్సు సత్త్వగుణము కలిగియుండునపుడు చాలవఱకున్ను స్వాధీనములో నుండును రజోగుణము కలిగియుండిన నిగ్రహము గడుంగడు ప్రయాసము తమోగుణముతో గూడి యుండినపుడు జ్ఞానహీనమైయుండును. విశుద్ధసత్త్వముతో గూడినపుడే తలంచినట్లు నిగ్రహించుకొనవచ్చును. మనస్సునకు సత్వగుణము కలుగుటకు సాత్త్వికాహారము, సత్యప్రవర్తన, సత్యమును గుఱించి చింతించుట. సత్య స్వరూపుడగు సర్వేశుని నిరంతరము ధ్యానించుట చేయవలెను. నిరంతరము ధ్యానము చేయుటకు సాధ్యము గాని వారు సమయము దొరికినపుడెల్ల ధ్యానము చేయవలయునేగాని సర్వేశ్వరుడిచ్చియుండు అమూల్యమగు సమయమును వ్యర్థపఱచ గూడదు.

కాలమును వ్యర్థపఱచనివాడు కాలుని జయించును. అనగా మృత్యు రహితమగు అమృతత్వమును పొందగలుగును. తుపానుగాలి చేతను ప్రవాహ వేగము చేతను, పడవమార్గము తప్పిపోవుచుండిన, చుక్కానివాడు ఏలాగున యావద్బలముతో చుక్కానిచే దానిని త్రిప్పుచుండునో, అలాగున మనస్సు దృశ్యములోనికి జారిపోవుచుండిన వివేకబలముచే ద్వంద్వములోనికి జార నీయక ద్వంద్వాతీతమగు పరమశాంతి నిలయములోనికి తీసికొనిపోవలయును. లేక, మదపుటేనుగు స్వాధీనములో నిలువక లోకములవైపు పోవుచుండిన మావటివాడు అంకుశముచే ఎట్లు నరములకూటములోపట్టి లాగి దానిని నిలబెట్టుచుండునో అలాగున దృశ్యవిషయములలోనికి జారిపోవుచుండు మనస్సును, విజ్ఞానబలముచే స్వరూపస్థియగు తురీయములోనికి తీసికొని పోవలయును. ఎత్తుప్రదేశమునకు నడుపుచుండు బఘ్సు మొదలగు బండ్లు క్రిందికి జారుచుండిన బ్రేకువేసి నిలుపబెట్టి శ్రమనధికముచేసి యెట్లు పై భాగమునకు నడుపుదురో, అలాగున ద్వంద్వాతీతపదవిలోనికి ప్రవేశింప [illegible]

లోనికి నెమ్మదిగ తీసికొనిపోవలయును. స్వాధీనములుగాని రాక్షసగుఱ్ఱములు పెడదారికి లాగుచున్నప్పుడు సారధి ఏలాగున కళ్ళెముపట్టి లాగ మంచి మార్గములో నడుపుచుండునో అలాగున మనస్సునుగూడ నడుపవలయును.

ఇట్టి ద్వంద్వములనుండి విడుదల పొందిన మనస్సు మాత్రమే నిరతిశయమగు సౌఖ్యము పొందగలుగును. లేనిచో ఎంత పండితుడైనను సార్వభౌముడైనను నిత్యశాంతిని సుఖమును పొందజాలరు. అంతేకాదు. తన కర్తవ్యమును నిర్వహించుటకున్ను శక్తియుండదు ద్వంద్వములకు భయపడి కర్తవ్యము నాచరింపనివాడు కృతకృత్యుడు గాడు. కృతకృత్యు డెపుడు గాడో అపుడు కృతార్థుడున్ను కాజాలడు. కావుననే కృతార్థుడు కావలసి యుండిన కృతకృత్యుడు ముందుగా గావలయునని శాస్త్రము చెప్పెడు రహస్యము. మంచి ఆత్మానుభవము గలవారి దగ్గఱనుండి శీలించిన మాత్రముననే ఈతత్త్వము గోచరముగా గలుగును.

అట్లు చేయని కారణముచేతనే సాధువులలో అనేకులు వ్యర్థులై పోవుచున్నారు. అందువల్లనే సాధువులపై జనులకు విశ్వాసము కలుగక పోవుచున్నది. కాని అందఱున్ను అలాగుననే యున్నారని తలంచరాదు. "సాధనాత్సాధకః" అని శాస్త్రము చెప్పుచున్నది. సాధనవల్లనే సాధువులగుదురు. సాధనలేని వారెవరున్ను ఏకార్యమున్ను సాధించియుండలేదు. "కాకతాళీయ న్యాయము"గా సాధనములేకనే ఒకరికి జ్ఞానము కలిగినచో అది జన్మాంతరసంస్కార మనియే శాస్త్రము తెలుపుచున్నది. ఏలన, కారణము లేక కార్య మేకాలమందున్ను కలుగదు. వారున్ను ఒకవేళ యోగాది సాధనలు, నిష్కామకర్మలు చేయకపోయినను బాల్యకాలమునుండియే తీవ్రమైన వైరాగ్యము గలిగి తురీయధ్యాననిష్ఠలో చిరకాలముండినట్లు గన్పించుచున్నది. ఇది స్థితి గలుగుట సామాన్యమా! అది గ్రహింపవలెను.

ఇపుడు ద్వంద్వములగూర్చియు, ద్వంద్వాతీతములో నిలుకడ గలుగుట కొఱకుగల యుపాయములనుగూర్చియు తెలుపడమైనది. మఱియు ద్వంద్వములోనికి దిగివచ్చుట యనునది ఎట్టిదనగా అది సాగరములోగల సుడిలోనికి ప్రవేశించుట వంటిదేయగును. దీనికే సంసారసాగరసుడియని పేరు. సుడిలో

పడిన పడవయు దానిలోగల జనులున్ను అనేకకష్టముల ననుభవించి మృత్యువుపాలగుదురు. సుడి గిరగిర తిరుగుచుండును. అది అగాధమగు ఉప్పుజలముతో గూడినది. మకర తిమింగిల సర్పాదులగు గొప్ప జలచరములలో గూడినది జలమో ఉప్పుమయము.

అలాగున ద్వంద్వమే సంసారము. దానికి అంతమే లేదు. విషయమే ఉప్పుజలము రాగద్వేష, కామక్రోధాది దుష్టజంతువులు గలది. భ్రమయే దాని యొక్క స్వరూపము సముద్రపు సుడులెటువంటివో. ద్వంద్వములగు సంసార సాగరమున్ను ఇటువంటిదే. సుడియెంత భయంకరమో, ద్వంద్వమున్ను అటువంటిదని జ్ఞాపకము జేసికొనదగినది.

దీనినే అజ్ఞానకానన మని కవులు వర్ణించిరి. రాత్రికాలములో దండకారణ్యమున ప్రవేశించిన, ఎంత సంకట మనుభవించవలసియుండునో ఈద్వంద్వమున్ను అటువంటిదే. మహారణ్యములో దిక్కు తెలియదు. అంతేగాదు, రాత్రికాలము సింహశార్దూలాది జంతువులచే నిండినది. దానిలో ప్రవేశించుట ఎంత భయావహకార్యమో, ద్వంద్వములోనికి జారుటయు అటువంటిదే యగును. ద్వంద్వములో దిగినవారికి 'ఇదమిత్థ' మని ఏమియు తెలియదు. చీకటివంటి మోహమాయ ఆవరించును. అది భ్రమ, ప్రమాదముల కాణ్వాలము. కావుననే ద్వంద్వాతీతమగు పదవిలో శుకాదియోగులు సదా యుండియున్నవారలని శాస్త్రము చెప్పెడి రహస్యము. ఈద్వంద్వమునే త్రిగుణమని పిలుతురు. త్రిగుణములతో గూడియుండుటయే బంధమనియు, త్రిగుణాతీతమైనది ముక్తియనియే వేదములు విధించియున్నవి. గుణాతీతుడు ద్వంద్వాతీతుడు ఒకడే. తురీయు డనియు సాక్షియనియు, ఇతనికి పర్యాయ నామధేయములు.

ఇక భావాతీతమును గురించియు, భావమును గురించియు తెలియదగును. "యోగేన గతకామానాం భావనా బ్రహ్మచక్షతే" యోగధ్యానముచే సంకల్పములు నశించిన చిత్తమందు గల భావము బ్రహ్మభావమనబడును, ఇది తనయొక్క ఆత్మమహిమలో నిలుచుటయే యగును. అట్లుగాక; బుద్ధిచేతగాని, మనస్సుచేతగాని, దేనిని భావించినను అభావమున్ను, వస్తువున్ను ఏజ్ఞానమువల్ల తెలియబడుచున్నదో అదే యాత్మ. అట్టియాత్మయందు, పరమాత్మభావము గలిగియుండుటయే ముక్తియు, కైవల్యమున్ను

అగును బుద్ధిగాని, మనస్సుగాని దేనిని భావించినను. దానిని దృశ్యముగా నెఱింగి యాత్మవల్ల త్రోసివేయు చుండవలయును. అట్టిభావములకులోబడిన, యది పైఁ జెప్పినలాగున మఱల సంసారబంధముల గలుగజేయును. కావున పాపకర్మ మొక్కటి మాత్రము కాదు. పుణ్యకర్మయున్ను భావముతోగూడినదే.

అయితే మలినకర్మయగు పాపముమాత్రము ఆత్మను మాలిన్యపఱచును. శుద్ధ కర్మయగు పుణ్యము ఆత్మను అంత మలినపఱచకపోయినను స్వరూప జ్ఞానస్థితినుండి బహిర్ముఖ మొనర్చును. అయితే పుణ్యకర్మలచే పాపకర్మలు సంపూర్ణముగా నశింపక ఎవరున్ను పుణ్యాపుణ్యములకు విలక్షణమగు ఆత్మస్వరూపజ్ఞానమందు నిలుకడగలిగి యుండజాలరని నిశ్చయించుకొన వలయును. మలినవస్త్రమును 'సబ్బు' 'చౌడు' మొదలగు వానివల్ల యుతుకు నప్పు డేలాగున వస్త్రములోగల మాలిన్యమున్ను సబ్బు మొదలైనవియున్ను రెండును వదలిపోయి వస్త్రముమాత్రము శుభ్రముగా నిలుచునో, అలాగున నిష్కామబుద్ధితో అనుష్ఠించెడి పుణ్యకర్మము పాపకర్మమును రహితపఱచి జ్ఞానదశయందు అదిన్ని వదలిపోవును.

అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలమ్।
కృత్వా జ్ఞానం స్వయంత నశ్యేజ్జలం కతకరేణువత్॥

మట్టినీటిలో చిల్లగింజ అఱుగదీయునప్పుడు నీటిలోగల బురదయు, చిల్లగింజచూర్ణమున్ను కలసి, జలమును శుద్ధపఱచి, రెండున్ను జలమున క్రిందుగునట్లు పోవునట్లు. ఈశ్వరార్పణబుద్ధితో జేయు పుణ్యము పాపమును నశింపజేసి తానున్ను వదలిపోవును. కావుననే శ్రుతి ఇట్లు చెప్పుచున్నది.

త్యజ ధర్మ మధర్మంచ ఉభే సత్యానృతే త్యజ।
ఉభే సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తత్త్యజ॥

ఏబుద్ధిచేత ధర్మమున్ను అధర్మమును తెలిసికొనుచుంటివో ఈ రెండింటియొక్క ఫలముతో బద్ధుడుగాక ఆబుద్ధినిగూడ త్యజించి, బుద్ధిసాక్షియగు ఆత్మయందు నిలుకడ గలిగియుండుము. ఇదే కేవలము బ్రహ్మానుభవముతో నుండుమని చెప్పినది. ఇవిరెండున్ను కర్మలతో

గూడినవగుటచే బహిర్దృష్టిని కలుగజేయును, అధర్మమును ధర్మముచే రహిత మొనర్చి, ధర్మభావమున్ను ధర్మాధర్మములకు సాక్షియగు ఆత్మలో నిలచి విడిచిపెట్టుము. ఈ శ్రుతివాక్యము అందఱికిన్ని చెప్పినది కాదు. కేవలము ఆత్మనిష్ఠ కలుగుటకు తీవ్రప్రయత్నము చేయుమనన శీలునకు చెప్పినదని మఱువగూడదు. లేనిచో విపరీతార్థమును తెచ్చి పెట్టును. అట్టి భావాతీత మగు సున్నతపదవిలోనుండు మహనీయుడు గూడ లోకమునకు పుణ్య కర్మయు. ధర్మమార్గమున్ను ఉపదేశించి యుండును. భావమునుండి మఱల భావాతీతస్థితిలోనికి పోవుటకిదే మార్గము. మనస్సు దేనిని మననము చేసినను, లేక సంకల్పించినను అది బంధహేతువని తెలిసికొని, దానినుండి మనస్సును మఱలించి, నిజస్వరూపమగు ఆత్మలో దైవభావము గలిగి యుండుటయే కర్తవ్యము.

అలాగున బుద్ధి దేనినిగుఱించి నిశ్చయించునో అది దృశ్యమగునే కాని దృక్కు కానేరదనియు, ఆభావమే బంధమనియు, వెంటనే తెలిసికొని ఆత్మయొక్క మహిమాతిశయములో నిలుకడగలిగియుండవలయును. అట్టి యుపాయముతప్ప మఱియొక మార్గము లేదు. అలాగున చిత్తము దేనిని గుఱించి చింతించుటకు ఉపక్రమించునో, అపుడు ఈ చిత్తము బహిర్ముఖము నకు ప్రయాణము చేయుచుండు నని తలంచి, చిత్తమును చింతలను చేయనీయక నిశ్చింతాత్మయగు తన మహిమాతిశయములోనికి తీసికొని పోవలయును. అదే ప్రకారము అహంకారము ఏవిషయమును గుఱించి యహంకరింప ప్రారంభించునో, అపుడు దీనికిన్ని బాహ్యవృత్తి కలిగినదని వెంటనే తెలిసికొని, దానినుండి నివృత్తిజేసి ప్రత్యగాత్మయగు శుద్ధచైతన్య ములో ఈశ్వరభావము గలిగియుండేలాగున యత్నించవలయును. బుద్ధికి సాక్షియై ఏయాత్మ అహమని చెప్పుచుండునో అదియే నిజమైన అహంకార మగును, అట్లుగాక దృశ్య వస్తువులను గుఱించిగాని, దేహేంద్రియములను గుఱించిగాని అంతఃకరణ ధర్మములను గుఱించిగాని అహంకరించినచో అది దురహంకార మగును. దానివల్ల దుఃఖమే గలుగును, బుద్ధికి సాక్షియగు ఆత్మాహంకారము గూడ వ్యష్టికి సాక్షిగానుండెడి యుపాధిసహితుడగు జీవాహంకారములు గలిగియుండరాదు. సమష్టిరూపమగు, యుపాధిరహిత మగు, వ్యాపకమగు, విశుద్ధమగు, దైవాహంకారము మాత్రమే గలిగి యుండవలయును. అది అహంకారము గాదు, సోహంకారమే యగును.

ఇపుడు చెప్పిన విషయము సామాన్యమని తలచరాదు బ్రహ్మనిష్ఠ చేయువారికి గూడ నది గలుగుట దుస్తరము. దేహేంద్రియాది దృశ్యములో అహంభావమేర్పడిన, కర్మముగా పరిణామము బొంది బంధమును గలుగ జేయును. అనాత్మభావము బలపడి రాగా రాగా అది యాత్మను మఱుగు పఱచి దృశ్యాకారమై పరిణమించును· ఎట్లన, అతి సూక్ష్మమగు త్రసరేణు వులు వాయుమయమైయుండి నేత్రములకు కన్పడని స్థితిలోనుండినను అవి వాయు, విద్యుత్తులతోగలసి మేఘమై పరిణామమునంది, ఇంత ప్రకాశమైన సూర్యుని గూడ గన్పడకుండునట్లు చేయును. అలాగున, అనాత్మభావము నిబిడమై నిజమగును ఆత్మను తెలియనీయక చేయును. ఆ మేఘము శీతల వాయువుచే జలమయమై కుంభవృష్టిచేయునట్లు. విషయవృష్టి ఆత్మనుముంచి వేయును. మఱియు భావనయొక్క శక్తి అపారమహిమ గలది. ఏలాగున ఏమియు గన్పింపని యాకాశము బలపడి వాయురూపమై, ఆ వాయువు తేజస్సై ఆ తేజస్సు జలమై, జలము పృథివియై, ఆ పృథివియే మహత్తైన పర్వతములుగాను, వృక్షములుగాను ఎట్లు పరిణామమై వచ్చినదో, ఆలాగున· దృశ్యభావము బలపడి ఈ స్థూలమగు దేహేంద్రియాదులకు అధిక్యమిచ్చును ఈ జగత్తే సత్యమని తోపజేయును. ఆత్మను మరుగుపరచును. కావున అట్టి దృశ్యభావము గలుగ నీయక చూడవలయును.

సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే।
క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥

విషయవృత్తివలన కామము జనించుచున్నది. కోపమువలన అడ్డు వచ్చినవానిపై కోపము గలుగుచున్నది. కోపమువలన వివేక జ్ఞానము నశించుచున్నది. వివేకశూన్యత్వమువల్ల గురుశాస్త్రోక్త ధర్మమునకు మఱపు గలుగుచున్నది. మఱపువలన (కార్యాకార్య వివేకమునకు యోగ్యమైన) తెలివి కాధారమైన అంతఃకరణమునకు నాశముకలుగుచున్నది. తెలివి పోవుటవలన తానున్ను నాశమును పొందుచున్నాడు. అని గీతాచార్యు లుపదేశించిరి.

సూక్ష్మమగు వటబీజము అంకురించునపుడే తీసివేయుట ఎంత సులభమో, అది పెద్ద మ్రానైన ఎంతస్థలము నాక్రమించునో, నివృత్తి చేయుట కెంతప్రయాసమో, భావముయొక్క రహస్యమున్ను ఈలాగునే యుండును, ప్రారంభదశయందు దానిని సులభముగా నివృత్తి జేయవచ్చును. ప్రబలమైన, మఱల నివృత్తి బొందింప సాధ్యముగాదు. ఇంద్రియములకు గోచరము కాని యాకాశము వాయురూప పరిణామము నొంది బలపడున పుడు, తుపానురూపమై మారినచో జనులకెంత బాధగలుగజేయునో, ఆ వాయువే అగ్ని పరిణామము బొందినచో ఆ నిప్పు గ్రామాదులను, అడవులను ఎట్లు కాల్చి భస్మమొనర్చునో, అలాగున అగ్నియే జలరూపము బొందిన, వెల్లువలై ప్రవహించి గ్రామాదుల నెట్లు ధ్వంస మొనర్చునో, ఆ జలము పృధివీరూప పర్వతరూపములుగా పెటిగిన, కొండలు జనుల కేలాగున దుర్గమమగునో, అట్లే ఈ భావనయు దృశ్యముగా పరిణమించి జీవునకు ఎన్నియో దుఃఖములు గలుగునట్లు వేయును. అంతేగాదు, జీవునియొక్క దైవస్థానమగు గమ్యమును హిమాలయాదిపర్వతమువలె నడ్డుపఱచును. కావున ఈ మనస్సును దృశ్యాకారముగా పరిణామమును బొందనీయక అతిజాగ్రత్తతో చూచుచుండవలయును, అట్లుండువాని హృదయము సదా నిర్మలాకాశమువలె స్వచ్ఛమై యుండును. వాయ్వాదులచే గలిగెడి క్లేశము లేవియు ఆ జీవుడిక పొందవలసిన పనియుండదు. కావున ఏ విధమగు దృశ్యభావముల బొందనీయక, సదా మనస్సును, బుద్ధిని చూచుచుండ వలయును.

ఇపుడు, అవధూతస్థితిలోనుండిన శ్రీ దత్తాత్రేయమహర్షి యుప దేశించిన భావాతీతము కొంత తెలిపెద, ఇది చెప్పినవారు త్రిమూర్త్యాత్మ స్వరూపుడగు శ్రీదత్తాత్రేయ మునివరుడని ముముక్షువులు జ్ఞాపకముంచు కొనిన మాత్రముననే దీనికింత మహిమ గలదుగదా! యని తెలిసికొనగలరు.

ఆత్మైవ కేవలం సర్వం భేదాభేదో న విద్యతే।
అస్తినాస్తి కథం బ్రూయాం విస్మయః ప్రతిభాతి మే॥

సమస్త చరాచర ప్రపంచమంతయు నద్వితీయంబగు పరబ్రహ్మమే. పరమాత్మకన్న భిన్నంబైన వేరుపదార్థ మొక్కటియున్ను లేదు. కావున

అతనియందు భేదము, అభేదమున్ను లేదు. కాబట్టి అట్టి పరమాత్మయందు భేదాభేదములు కలవనిగాని, లేవనిగాని నేనెట్లు నిర్దేశించెదనో అది నాకు వింతగా నున్నది.

ఆత్మానం సతతం విద్ధి సర్వమేకం నిరంతరమ్।
అహం ధ్యాతా పరం ధ్యేయ మఖండం ఖండ్యతే కథమ్॥

శాశ్వతుండును, సమస్తమైన ప్రపంచస్వరూపుడును, ఒక్కడును. అనగా నద్వితీయుడును నగు పరమాత్మను ఎల్లప్పుడును ఎఱుగుము. ధ్యానించువాడును, మిక్కిలియు ధ్యానింపతగినవాడును, భిన్నముగాని వాడునునగు నేను ఎట్లు ఖండింపబడుదును ?

అహో చిత్రం కథం భ్రాంతః ప్రధావసి పిశాచవత్।
అభిన్నం పశ్య చాత్మానం రాగత్యాగాత్సుఖీభవ॥

ఆశ్చర్యము! ఎట్లు భ్రాంతినొందినవాడవై పిశాచమువలె పఱుగెత్తు చున్నావు! భేదము లేని పరమాత్మను చూడుము. ఆసక్తి వదలుటవలన సుఖము గలవాడ వగుము.

సాకార మనృతం విద్ధి నిరాకారం తు నిశ్చలమ్।
ఏతత్తత్త్వోపదేశేన న పునర్భవ సంభవః॥

రూపముతోగూడినది (అనగా కనులకనుపడునవి) అబద్ధమని యెఱుగుము. రూపము లేని (నేత్రములకు గోచరముగాని) పరమాత్మయో చలనములేనిది (అనగా స్థిరమైనది). ఈ జ్ఞానోపదేశముచేత మరల పుట్టుక లేదు.

సాకారం చ నిరాకారం నేతి నేతి చ సర్వదా।
భేదాభేదవినిర్ముక్తో వర్తతే కేవలః శ్శివః॥

పరమాత్మ స్వరూపము కలది, స్వరూపము లేనిదియు కాదు, కాదని ఎవ్వడు భేదాభేదములనుండి విముక్తుడైన వాడగుచున్నాడో, అతడు కేవలుడైన మంగళస్వరూపుడైన పరమాత్మ.

భావగమ్యం నిరాకారం సాకారం దృష్టిగోచరమ్।
భావాభావవినిర్ముక్తమంతరాలం తదుచ్యతే ॥

సాకారముతో గూడినది, చూపునకు దెలియునది, చూపునకు తెలియని, నిరాకారము భావమొక్క దానిచే బొందతగినది. భావాభావముల నుండి విడుపబడినదియై మాయకు స్వాధీనముగాగ ఆ పరమాత్మ యుంటున్నది.

రాగద్వేషనిర్ముక్తః సర్వభూతహితే రతః ।
దృఢబోధశ్చ ధీరశ్చ స గచ్ఛేత్పరమం పదమ్॥

ఎవడు అనురాగ విరోధములచే విడువబడినవాడై, సమస్తప్రాణులకు మేలుచేయుటయందు ఆసక్తిగలవాడై, నిశ్చయ జ్ఞానముగలవాడై స్థిరబుద్ధి గలవాడై. స్థిరబుద్ధిగలవాడై యున్నాడో యతడు ఉత్కృష్టమైన స్థానమును పొందును.

ధ్యాతా న తే హృదయే న చ తే సమాధిః
ధ్యానం న తే హి హృదయే న బహిః ప్రదేశః॥
ధ్యేయం న తే హి హృదయే న చ వస్తుభేదః
జ్ఞానామృతం సమరసం గగనోపమోఽహమ్॥

నీకు మనస్సుందు ధ్యానించువాడు లేడు. నీకు సమాధియును లేదు. నీకు మనస్సునందు ధ్యానములేదు. నీకు బయటి ప్రదేశము లేదు. నీకు మనస్సునందు ధ్యానింపదగినది లేదు. నీకు వస్తుభేదమును లేదు. "నేను తత్త్వస్వరూపుడను, నాశములేనివాడను. భేదము లేనివాడను, ఆకాశముతో సమానమైన యాకారముగలవాడను"— అని యవధూతగీత.

ఇపుడు భావాతీతస్థితిని సంక్షేపముగా చెప్పడమైనది. దీని యొక్క సారమేమన, ఏ భావన కలిగినను దానిని తెలిసికొనుటవే ఆత్మ సాక్షిగా నుంటున్నందున, ఆ భావనకు లొంగిపోవకయు, దైవ భావమునకు మరుపుగలుగనీయకయు, అట్టి దైవభావము ఆత్మభావములో స్థిరపఱచుటయే యగును. మోటారు నడపెడు డ్రైవ రేలాగున ఏదైన లోయలోనికి గాని, అపాయస్థితిలోనికిగాని బస్సు జారిపోవుచున్నప్పుడు గట్టిగా

ఎట్లు నిలిపివేయునో, ఆలాగున మనస్సు ఏదైన దృశ్యభావములకు దిగిన పుడు ఆత్మలో దృఢమగు దైవభావమును వేయుచుండవలయును. అట్టి బ్రేకువేసి బండి నిలుపనిచో, అది ఎంత అపాయమో, ఆదేరీతిగా మనస్సు దృశ్యాకారమై పరిణమించిన గలుగు యపాయమున్ను అటువంటిదని బాగుగా ఆత్మలో ఆలోచనము చేసికొనవలయును.

అయితే దృశ్యభావన లేకపోయినను ఆత్మభావన చేయుటగూడ ఒకవిధ మగు భావనగదా యని సందేహింప నక్కఱలేదు. భావనలన్నియు బంధమగునపుడు ఇదిన్ని యెట్లు బంధము కాదు? ముక్తి ఏ విధమగును?అని తలపనక్కఱలేదు. ఇచట భావించెడువాడు, భావము. భావింపదగిన వస్తువు అను త్రిపుటి గలదని సంశయింప గూడదు, వ్యవహారదశలో అట్లు భావన చేయమని చెప్పవలసినదేగాని, వాస్తవముగా నచట త్రిపుటిలేదు, తాను తానై మాత్రమే నిలుకడ గలిగియుండును. ఆ భావనా వాక్య మెటువంటి దనగా, కోరికలన్నియు బంధము లగునపుడు మోక్షమును కోరుటగూడ బంధమని చెప్పినట్లుండును. మోక్షముయొక్క కోరిక ఎటువంటిదని, అన్ని బంధములనుండియు యాత్మవిమోచనము కలుగచేయునదగుటచే దాని ఫలితము బంధ విముక్తియే ఆలాగున శాస్త్రవాసనగూడ బంధమని గలదు. అయితే నిర్వాసనను గుఱించి బోధించెడు అధ్యాత్మశాస్త్రమును బంధమని చెప్పియుండలేదు. ఏలన, అది నిర్వాసననే బోధించుచున్నది. ఇతర శాస్త్రములు బహిర్దృష్టి గలుగచేయునవగుటచే బంధ మని చెప్పిరి.

మఱియు ఇది ఎటువంటి ప్రశ్నయనగా ఒకసభలో ముఖ్యుడు లేచి "అందఱున్ను నిశ్శబ్దముగా నుండగోరుచున్నాను" అని వినయముతో జెప్పిన వెంటనే మఱియొకడు లేచి. మీరు నిశ్శబ్దముగా నుండుడని చెప్పిన పుడు మీకు నిశ్శబ్దమెట్లు గలిగెను? అదిన్ని శబ్దముగదా! అని యడిగేలాగున నుంటున్నది. ఆలాగున, శ్రావకులకు గ్రహించుట కొఱకు "ఆత్మభావన గలిగియుండును" అని చెప్పబడినదేగాని అచట రెండవవస్తువు లేనందుచే తనయాత్మయొక్క స్వమహిమలో నిలుచుటయే యగును; కావున అది భావాతీతమే. అట్లులేనిచో గురుశిష్య సంప్రదాయమున్ను, శాస్త్రప్రవచన మున్ను గలుగదు. అట్టి వాక్యము బోధనార్థము లనియే విజ్ఞులున్ను, శ్రుతులున్ను తెలుపుచున్నవి.

ఇక కేవలాత్మలోగల నిలుకడయొక్క తత్త్వమునే భావాతీతమనియు, ద్వంద్వాతీత మనియు, పతంజలి మహర్షి తన యోగదర్శన మందుపదేశించిన దాని దెలిపెదను,

సూత్రము॥ తదా ద్రష్టుః స్వరూపావస్థానమ్।

చిత్తవృత్తులు నిగ్రహమైయుండు యోగావస్థయందుండు కాలము నందు, చిన్మాత్రుడైన పురుషుడు నిజస్వరూపమునందుండుట సంభవించు చున్నది.

విరామప్రత్యయాభ్యాసపూర్వస్సంస్కార శేషోఽన్యః

సంప్రజ్ఞాతసమాధులు లేకపోవుటయు. చిత్తమునందు ఏవృత్తులు తలసూపినను వానిని రానివ్వక నిరాకరించుటయు, నిర్మలమైన చిత్ప్రకాశ మార్గమువలన చిన్మాత్రుడైన పురుషుని స్వరూపమై యుండుటయు అసంప్రజ్ఞాత సమాధి యనబడును.

స్మృతిపరిశుద్ధౌ స్వరూపశూన్యే వార్థమాత్రనిర్భాసా నిర్వితర్కా॥

తాను ధ్యానించుమందు శబ్దార్థజ్ఞానముల వికల్పముపోయి, మఱియు అవస్తువుయొక్క శబ్దార్థజ్ఞానములజ్ఞాపకమే లేక, అధ్యాత్మ వస్తువుమాత్రము అభిముఖమైయుండుట నిర్వితర్కసమాధియనబడును.

నిర్విచార వై శారద్యేఽధ్యాత్మప్రసాదః॥

నిర్విచారసమాధియొక్క అభ్యాసబలమువలన అధ్యాత్మ ప్రసాదదము, (బుద్ధికి నిర్మలత్వము) కలుగుచున్నది.

తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజస్సమాధిః॥

సంప్రజ్ఞాత సమాధికిని నిరోధముకలుగగా, చిత్తవృత్తులు నశించును. అందువలన నిర్బీజసమాధి కలుగును.

పురుషార్థగుణానాం ప్రతిప్రసవే
కైవల్యం స్వరూప ప్రతిష్ఠావా చితిశక్తిరితి॥

భోగమోక్షరూపములైన పురుషార్థములుగల సత్వాది త్రిగుణముల యొక్క పునరావర్తిలేని విలోమపరిణామముయొక్క పరి సమాప్తిగాని లేక పురుషునియందుండు చిత్ప్రకాశము స్వస్వరూపమైన సచ్చిదానందము,

యాఖండపరిపూర్ణమైన పరబ్రహ్మమందు నెలకొనుటగాని కైవల్యమనబడు చున్నది.

ఈ భావాతీతవిషయమును వ్రాయుటలో ముఖ్యముగా మూడు గ్రంథముల నాధారము చేసికొనడమైనది (1) శ్రీకృష్ణభగవాను లుపదేశించిన భగవద్గీత, ఉత్తరగీతలు, (2) అవధూతగీత - ఇది శ్రీదత్తాత్రేయ మునివరప్రణీతము (3) శ్రీపతంజలియోగివర్యవిరచిత పాతంజలి యోగ దర్శనము.

అవతారపురుషులలో శ్రీకృష్ణులకు సమానముగాను, బ్రహ్మజ్ఞానములో శ్రీదత్తాత్రేయులకు సదృశముగాను, యోగీశ్వరులలో శ్రీపతంజలికి సదృశముగాను, మఱియొకరు భూలోకమునలో నేటివఱకు అవతరించినటువంటివారు లేరు, అయితే, ఈ ముువ్వురున్ను సాక్షాద్దైవ ప్రాప్తి, నిజమైన ఆత్మజ్ఞాన ప్రాప్తి, సత్యమగు నిర్వికల్పసమాధిపరమగు జీవన్ముక్తియను కైవల్యమును బోధించినవారే ఆస్తితులు గలుగుటకు ముువ్వురున్ను ఏకాభిప్రాయముగల వారలై, పరిశుద్ధమైన ఈశ్వరభక్తి యొకటియే సాధనమని యుపదేశించుట వల్ల దానిని తెలుపుటకొఱకు ముువ్వురియొక్క యాశయము అతిసంగ్రహముగా క్రింద తెలుపబడుచున్నది, దీనివల్ల దైవభక్తియొక్క ప్రాశస్త్యము విజ్ఞులెఱుంగగలరు.

ఈ భక్తిమార్గముతో సామాన్యజను లందరికిని ప్రవేశించుటకుమార్గము గలదు. అట్లుచేయక మొట్టమొదటనే బ్రహ్మసాక్షాత్కారము, నిర్వికల్ప మాధినిగుఱించినచో, దానిలో ప్రవేశించుటకు సామాన్యులకు తరముగాదు. చిన్నతరగతినుండి చదువుకొనుచు వెళ్ళుచుండిన అది ఏలాగున ప్రయాసము లేక పై తరగతిలోనికి తీసికొనిపోవునో, ఈ జ్ఞానయోగములయొక్క స్థితియు నటువంటిదే. అట్లుచేయక బాలురతోను బాలికలతోను చిన్నతరగతిలో ఎందుకు చదువవలయును? ఉన్నత క్లాసులో ప్రవేశించి చదువుడు, అని చెప్పి ఆ సర్వోన్నతగ్రంథములను వారిచేతికిచ్చిన ఎంతప్రయోజనమో, ఇదియున్ను అలాగున నుండునని వివేకవంతులు తెలిసికొనగలరు.

గీత ఆఱవ అధ్యాయము ధ్యానయోగమును గుఱించి చెప్పిన విషయము చూడుడు. దీనియందు ముముక్షుత్వమునుండి మోక్షస్థితి

పర్యంతము కేవల ఆత్మానుభవమును గుఱించి చెప్పియున్నారు. అచ్చటంతయు ఈశ్వరభక్తి నుపదేశించక కేవలమాత్మోపాసనను గుఱించియే తెలుపడమైనది. సాంగముగా అట్టి యున్నతాశయము నుపదేశించుచువచ్చి అధ్యాయాంతమున 46 47, శ్లోకములయందు భక్తి నుపదేశించినది. చూడుడు.

తపస్విభ్యోఽధికో యోగీజ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున॥

ధ్యానయోగి తపస్సుచేయువారలకంటె అధికుడు. ఆత్మానాత్మ విచారణ చేయువానికన్నను యోగి అధికుడు. కర్మనిరతులకన్నను యోగి అధికుడు, ఆ హేతువువలన ఓ అర్జునా ధ్యానయోగపరుడవు గమ్ము.

యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా।
శ్రద్ధావాన్ భజతే యో మాం సమేయుక్తతమో మతః॥

యోగులందఱిలోను ఎవడు నాయందు నిలుపబడిన మనస్సుచేత, నన్ను భజించుచున్నాడో అట్టి యోగి అతి శ్రేష్ఠుడని నాయభిప్రాయము.

ఇక గీతలో పదునాల్గవ అధ్యాయము అతిగహనమైనది, అగాధమగు తత్త్వము నది బోధించుచుండును. బుద్ధిమంతులు ఈ యధ్యాయము ముఖ్యముగా చూడదగినది. దీనియందు మూడుగుణముల యొక్కయు, గుణపరిణామములయొక్కయు, ఏ గుణము కలవాడెట్టి స్వభావముతో నుండును, ఏగుణములో నుండునపుడు దేహము వదలి పోయిన ఏస్థానము నొందును, మఱల జన్మము వచ్చిన నెట్టిజన్మములు గలవాడగును ఇవన్నియు విస్తారముగా బోధించి తుదరల గుణత్రయాతీతుడగు జీవన్ముక్తునియొక్క తత్త్వము నుపదేశించిరి. ఈమధ్యలో ఎచ్చటను ఈశ్వరునిగుఱించిగాని, ఈశ్వరభక్తిని గుఱించిగాని ఒకపదమైనను చెప్పలేదు. కేవలము ఆత్మను (అనగా బ్రహ్మమును) గుఱించిమాత్రమే యుపదేశించుచూ వచ్చిరి. అధ్యాయాంతమున 26 వ శ్లోకమున గుణత్రయాతీతస్థితి ఎట్లుగలుగును? అను తత్త్వము నుపదేశించునపుడు అనన్యమగు శుద్ధమైన భక్తియొకటియే యుపాయమని తెలిపిరి.

మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే।

ఎవడు నన్నే (అనగా భగవంతుని) చలింపని భక్తియోగము చేత సేవించుచున్నాడో, అతడు ఈత్రిగుణముల నతిక్రమించి జీవన్ముక్తి దశను పొందుటవలకు సమర్థుడగుచున్నాడు.

ఇక శ్రీదత్తాత్రేయులు కేవలాత్మను గురించి యుపదేశించినవారైనను మొట్ట మొదట తాము ప్రారంభించిన పరబ్రహ్మప్రాప్తి యెట్లు కలుగునో ఆ విషయమై మొదటనే యుపదేశించినది చూడుడు. (అవధూతగీత)

ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా।
మహాభయపరిత్రాణాద్విప్రాణాముపజాయతే॥

ఉత్పత్తిస్థితినాశములుగల ప్రపంచముయొక్క గొప్ప భయము నుండి రక్షకము లేనట్టి జీవులను రక్షించునట్టి (అనగా భయము తొలగించునట్టి) అభేదజ్ఞానముయొక్క తలంపు ఈశ్వరానుగ్రహము వలననే కలుగుచున్నది.

ఇదే ప్రకారము యోగీశ్వరులగు పతంజలి మహాముని యొక్క యాశయమున్ను చూడుడు— అష్టాంగయోగముల నుపదేశించి నిర్వికల్ప సమాధియగు అమృతస్థితిలోనికి తీసికొనిపోయిన యా మహనీయునియొక్క యాశయము ముముక్షువులు తెలిసికొనదగినది. సాధనపాదమున,

సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్ ।

పరమేశ్వరునియందు అతిశయమైన భక్తిచేయుటవల్లనే సమాధి సిద్ధియు కలుగును. యోగపాదమున.

21. తీవ్రసంవేగానా మాసన్నః॥

తీక్ష్ణమైన సంవేగము, జాగరూకమైన దృఢతరసంస్కారములుగల వారలకు, ఈశ్వరచింతనయున్ను కలవారలకు సంప్రజ్ఞాన సమాధి మిగుల సమీపము.

మఱియు ఈ భావాతీతవిషయమై ఇదివఱలో జెప్పిన నాలుగు విధములైన యర్థములేగాక మఱియొక విధముగూడ గలదు. అదేమన, శుద్ధభావముకలవారికి గోచరము కాగలదనియు, అశుద్ధభావముగలవారికి మాత్రము గోచరించునది కాదనియు గ్రహించదగినది. కావుననే ఉపనిషత్తులో "అచింత్యంచింత్యమేవతత్" అని కలదు. భావాతీతమగు అబ్రహ్మవస్తువచింత్యమనియు వెంటనే మఱల చింత్యమనియు, జెప్పునపుడు ఈ రెండు పదముల నెట్లు సమన్వయము, చేయదగును? అచ్చోట శుద్ధాంతఃకరణము గలవారికి గ్రాహ్యమనియు, అశుద్ధాంతఃకరణముగలవారి కగ్రాహ్యమనియును గ్రహించుకొనవలయును. ఈలాటి వాక్యములు వేదాంతశాస్త్రములో నెన్నియో కలవు. గీతలోను 'బుద్ధిగ్రాహ్యమతీంద్రియం" అని గలదు. ఆ యాత్మవస్తువు ఇంద్రియముల కగ్రాహ్యమనియు, బుద్ధిచే గ్రహింపదగినదనియు నర్థము గలిగియున్నది. బుద్ధిగూడ నింద్రియములలో గూడినదగుటచే నచ్చోట శుద్ధమైన బుద్ధివల్ల గ్రహింపదగినదనియు, మలినేంద్రియముగలవారికి గ్రహింపనలవికాదనియు నర్థము చేసికొనవలయును. అదే రీతిగా గీత 15–వ అధ్యాయములో నొక శ్లోకము గలదు....

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః॥

సద్గురూపదేశమును పొంది తద్ద్వారా ధ్యానాదులజేయుచు స్వస్వరూపమును (తన్నుతాను) తెలిసికొనవలయునను ప్రయత్నము జేయుచున్నవారును, చిత్తశుద్ధిగలవారును అనగా నింద్రియముల జయించి చిత్తమును దోషరహితముగా జేసికొన్నవారును అగుయోగులు స్వబుద్ధియందు (లేక) శరీరమునందున్న పరమాత్మను చూచుచున్నారు. కాని, శాస్త్ర ప్రమాణములచే పరమాత్మ ఇట్టివాడని తెలిసికొనియున్నను, తపస్సుచేతను, ఇంద్రియ నిగ్రహముచేతను దుర్వ్యాపారములనుండి తొలగని చిత్తముగలవారు అనగా ధ్యానాదులను ఇంద్రియ నిగ్రహమున్నులేక దుర్వ్యాపారములను చేయువారున్నగు అవివేకులు (మూఢులు) పరమాత్మయగు జీవు నెఱుంగలేరని తాత్పర్యము.

ఈలాగున కఠోపనిషత్తునందు గూడ గలదు:

"ఏషసర్వేషు భూతేషు గూఢోఽత్మా న ప్రకాశతే।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥

ఈ యాత్మవస్తువు సమస్తభూతములలో నుండినదైనను అతి నిగూఢమైయున్నందుచే మందబుద్ధులకు గోచరించునది కాదు. అతి సూక్ష్మమగు నిర్మలమైన బుద్ధిగలవారివల్లతీక్ష్ణమగు సూక్ష్మబుద్ధివల్ల గ్రహించుటకు సాధ్యమైనది: ఇచ్చటను, మలినాంతఃకరణముగలవారికి గోచరము కాదనియు, శుద్ధాంతఃకరణులకు గోచరించుననియు అర్థము చెప్పియున్నారు. కనుకనే ధ్యానముయొక్క కాష్ఠావస్థను గీతాచార్యు లుపదేశించినపుడు, అ॥18. "బుద్ధ్యా విశుద్ధయా యుక్తః" అని యుపదేశించిరి. అనగా మలవిక్షేపావరణాదులు లేని, విశుద్ధమైన ఏకాగ్రమైన బుద్ధితో గూడినవారికి మాత్రమే గ్రాహ్యమని యుపదేశించిరి. "శుద్ధ సంయమిగోచరం" అని శంకరులు పాదుకా స్తవమున తెలిపిరి. జలములోను, వాయువులోను గల అతి సూక్ష్మ క్రిములేలాగున దృష్టికి గోచరములు కానివైనను, భూతద్దమువల్ల నెట్లు గోచరములగుచుండునో, ఆలాగున శుద్ధహృదయముగలవారికి బ్రహ్మము గోచరమనియు, అశుద్ధ హృదయము గలవారికగోచరమనియు నర్థము.

ఈలాటి ద్వంద్వార్థములు గల ప్రయోగములు వేదాంతశాస్త్రములలో అనేక స్థలములలో గలవు. అచ్చోటనంతయు పైజెప్పిన విధముగానే యర్థము గ్రాహ్యబడియున్నది. మేఘములు నిశ్శేషముగ నశించిన ఆకాశము మాత్రము ఏలాగున శేషించి నిలుచునో, ఆలాగున అంతఃకరణమున గల భావములన్నియు నశించిన భావాతీతమగు జ్ఞేయ బ్రహ్మ మొక్కటిమాత్రమే మిగిలియుండును. ఈ విషయమై ఇతర ప్రమాణవాక్యముల గొన్నిటిని ఇచట నిరూపించెద.

యథా కాష్ఠగతో వహ్నిః సంసిద్ధోఽపి న లభ్యతే।
మూఢైః సర్వత్ర సంస్థోఽపి తథా త్వం నైవ లక్ష్యసే॥

ఏలాగున కట్టెయందు నిప్పు సిద్ధమైయుండినను, మథించనిచో గాదో, యాలాగున పరమాత్మవగు నీవు సర్వత్రస్థితుడవై యుండినను అజ్ఞానులచే చూడబడవు.

యథా తిలగతం తైలం గూఢం తిష్ఠతి సర్వదా।
తథా త్వం సర్వలోకేషు గూఢస్తిష్ఠసి శంకర॥

ఏలాగున తిలములయందు తైలము ఎల్లప్పుడును గూఢముగా నిలచియున్నదో యాలాగున సర్వేశ్వరా! నీవును సకల చరాచర ప్రాణికోట్ల హృదయములందు గూఢముగా నివసించువాడవై యున్నను ఆత్మజ్ఞానము లేనివారు నిన్ను తెలిసికొనజాలరు

యథా దధిగతం సర్పిః నిగూఢత్వేన సంస్థితమ్।
చరాచరేషు భూతేషు తథా త్వం దేవ సంస్థితః॥

ఏలాగున దధియందు ఘృతము నిగూఢమైయుండి తరిచిన మాత్రమే గోచర మగుచుండునో, యాలాగున భూతకోట్లన్నిటిలోను దేవా! నీవు గూఢమైన స్థితి గలిగియున్నావు హృదయమునుమథించువారే నిన్ను దర్శింప గలరు.

యథా జలం ధరావృష్ఠాత్ఖనన్నాప్నోతి మానవః।
తథా త్వం పూజయా నిత్యం మోక్షమాప్నోత్యసంశయమ్॥

ఏలాగున మానవుడు భూమిని త్రవ్వుటవల్ల జలమును పొందు చున్నాడో, ఆలాగున సర్వేశ్వరునియందుగల నిర్మలమగు ఆత్మయొక్క పూజవల్ల ఈశ్వరసాక్షాత్కారమగు మోక్షమును బొందుచున్నాడు. దీని యందు సందేహము లేదు.

బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థోఽథవా యతిః।
యది స్యాత్సరయోత్మాత్మచ స నూనం ముక్తిమాప్నుయాత్॥

బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, సన్యాసి యైనను, ఆత్మసంయమనశక్తిగలిగెనేని, తప్పక యతడు ముక్తిని బొంద గలుగును.

త్రివిధో దర్శనోపాయస్తస్య దేవస్య సర్వదా।
శ్రద్ధా జ్ఞానేన తపసా యోగేనైవ నిగద్యతే॥

దేవదేవుడగు ఆ మహాదేవునియొక్క దర్శనార్థము మూడు విధము లగు నుపాయములు గలవు. శ్రద్ధతోగూడిన యాత్మానాత్మ విచారణచేతను. జ్ఞానతపస్సుచేతను, యోగధ్యానముచేతను ఏకాలమందైనను సాధ్యమగును

అల్పాహారో రహస్థాయీ త్వింద్రియార్థేష్వలోలుపః।
రాగద్వేషవినిర్ముక్తో భిక్షుర్మోక్షాయ కల్పతే॥

బహుళముగా భుజింపని స్వభావము గలవాడును, ఏకాంత స్థల మందుండువాడును, సర్వేంద్రియ విషయములలో చపలము లేనివాడును, రాగమునుండియు, ద్వేషమునుండియు విముక్తి బొందిన వాడుననగు, యతి మోక్షమున కర్హుడగుచుండును.

దమ దాన దయా క్షాంతి శౌచేంద్రియ వినిగ్రహాః।
అస్తేయ సత్యాఽహింసాశ్చ సర్వేషాం ధర్మహేతవః॥

దమమ్ము, దానమ్ము భూతదయ, ఓరిమి. బాహ్యాభ్యంతరశుద్ధి, ఇంద్రియ నిగ్రహమ్ము, పరులవస్తువును వారికి దెలియకయు, ప్రీతిలేకయు గ్రహించే స్వభావము లేకుండుటయు' సత్యమున్ను, అహింసయున్ను, మోక్షాపేక్షగల సర్వజనులకు ధర్మకారణమైనవి. కావున ఏ సంప్రదాయములో నుండువారి కైనను. ఇట్టి గుణములు సమానముగా నుండవలసినవి.

తపసో న పరం కించిత్తపోహి మహతాం ధనమ్।
తపసా ప్రాప్యతే సర్వం తపోయోగ్యోఽసి పుత్రక ॥

తపస్సుకన్న శ్రేష్ఠమైనది మఱియొకటిలేదు. మహాత్ముల కీలోక మున తపస్సే గొప్పధనము. తపస్సువల్ల పొందబడ తగనివస్తువేలేదు, అనగా తపస్సువల్ల సర్వమును సాధ్యము. అందువల్ల నో కుమారా! నీవు తపస్సు చేయుట కర్హుడవై యున్నాడవని ఈశ్వరు డుపదేశించెను.

తపసో హి వినా నాస్తి సిద్ధిః కుత్రాపి శోభనే।
సర్వాసామపి సిద్ధీనాం మూలం హి తప ఉచ్యతే॥

తపస్సుకన్న మించినది మఱియొకటిలేదు. తపస్సు వినా ఎచ్చటను ఏ సిద్ధియున్ను గలిగియుండలేదు. సర్వవిధములగు సిద్ధులకున్ను తపస్సే మూలమని ఋషులచే చెప్పబడెను.

అగాధే నలిలే శుద్ధే సత్యతీర్థే క్షమాహ్రదే।
స్నాత్వా పాపవినిర్ముక్తః ప్రయాతి పరమాం గతిమ్॥

సత్యమనెడు శుద్ధమైన జ్ఞానతీర్థముగల క్షమయనెడు మడుగున స్నానముజేయువారు సర్వపాపములనుండి విముక్తులై పరమోత్కృష్టమగు మోక్షము నొందుచున్నారు. అనగా సత్యతీర్థములో స్నానము జేయువాడు సర్వమలినవిముక్తుడై ముక్తి నొందుచున్నాడు.

క్రోధో హి నాశయేచ్ఛ్రేయ స్తప ఏవ న సంశయః।
సర్వనాశకర స్తస్మాత్క్రోధం తత్ర వివర్జయేత్॥

కోపము శ్రేయస్సును నశింపజేయును. అలాగున తపస్సును గూడ నశింపజేయును. దీనియందు సందేహము లేదు. అంతేకాదు, కోపము పుణ్యములన్నిటిని నశింపజేయును. అందువల్ల ముముక్షువు లందరున్ను తమలోగల కోపమును ప్రయత్నపూర్వకముగా నశింప జేయుచుండవల యును. కోప మొకటి నశించిన తక్కిన దోషము లన్నియు లయించిపోవును పాపము లన్నిటికన్ని కోపమే ప్రభువు.

నాస్తి శ్రద్ధాసమం పుణ్యం నాస్తిశ్రద్ధాసమం సుఖమ్।
నాస్తి శ్రద్ధాసమం తీర్థం సంసారే ప్రాణినాం నృప॥

ఓ రాజా! ఈ సంసారములో జీవులకు శ్రద్ధకు సమమైన పుణ్య మున్ను లేదు. శ్రద్ధకు సమమైన సుఖమున్ను లేదు. శ్రద్ధకు సమమైన తీర్థ మున్ను లేదు. కావున దైవకార్యములో సదా శ్రద్ధగలిగియుండుము.

శశాంకరశ్మిసంయోగాచ్చంద్రకాంతమణిః పయః।
సముత్సృజతి నాయుక్తః సోపమా యోగినస్స్మృతా॥

చంద్రునియొక్క చంద్రిక చంద్రకాంతమణియందు పడినపుడు, అమృతము స్రవించునట్లు, యోగ ధ్యానముచే విశుద్ధాంతఃకరణుడున శ్రవలోకనమువల్ల నమృతత్వము గలుగుచుండును.

యథార్కరశ్మిసంయోగాదర్కకాంతో హుతాశనమ్।
ఆవిష్కరోతి వైకస్సన్నుపమా సాపి యోగినః ॥

ఏలాగున సూర్యరశ్మి సూర్యకాంతమణిపై పడునపుడు అగ్నివలె ప్రజ్వలించునో, ఆలాగున, యోగధ్యానముచే విశుద్ధమైన అంతఃకరణములో పరమేశ్వరధ్యానమువల్ల జ్ఞానాగ్ని ప్రజ్వలించును. ఇదే దాని యుపమానము. బ్రహ్మనిష్ఠులు, సాధువులు, భక్తులు అందఱున్ను ఈ పరమతత్త్వమునే గ్రహించవలసియుండును.

అంతఃకరణము మూడువిధములుగా నుండును. (1) మలినము (2) నిర్మలము, (3) వినిర్మలము. వీనినే అశుద్ధము, శుద్ధము, విశుద్ధమని తెలియదగినది. చంద్రుని చంద్రిక యంతట నొకేవిధముగా నుండినను, సామాన్యశిలలో ప్రతిఫలింపదు. స్ఫటికశిలలో ప్రతిబింబించును. చంద్రకాంతమణిలో బడిన యమృతధార ప్రవహించును. ఆలాగుననె, సూర్యరశ్మి సర్వత్ర ఏకవిధము నుండినను, గోడలో ప్రతిబింబించదు. అద్దములో ప్రతిబింబించును. సూర్యకాంతమణిపై బడునప్పుడగ్ని జ్వలించును. ఆలాగుననె, పరమాత్మ సర్వములోను సమానముగానుండినను మలిన, శుద్ధ, విశుద్ధ హృదయముల భేదమునుబట్టి ఒకరికి జ్ఞానము లేకపోవుటయు, ఇంకొకరికి పరోక్షజ్ఞానము కలుగుటయు, మఱియొకరికి అపరోక్షసాక్షాత్కార జ్ఞానము ప్రజ్వలించుటయు జరుగుచున్నది.

మనస్సులోగల యనాత్మభావములన్నియు తొలగిపోయిన, మరల మిగిలియుండునది ఆత్మయే, దైవమే. పరబ్రహ్మయే యగుచున్నది. "శేషం బ్రహ్మేతి కథ్యతే" – అంతఃకరణము శుద్ధమైన తరువాత మిగిలియుండునది బ్రహ్మమే; "స్వయంప్రకాశతే హ్యాత్మా మేఘాపాయేంశుమానివ" యని ఆత్మబోధలో శ్రీశంకరు లుపదేశించిరి. జ్ఞానము కొఱకు నీవు చేయవలసినదేమియు లేదు. హృదయములోగల యనాత్మ భావమును తొలగించినచాలును, ఎట్లన, సూర్యునకు స్వయంప్రకాశము కలదు, సూర్యుని ప్రకాశింపజేయుటలో ఇతరుల సహాయము అవసరములేదు. మబ్బులు తొలగగనే సూర్యుడు స్వయముగానే ప్రకాశించును. [illegible] కాలములో మూయబడియుండినను, [illegible]

కఱగిపోగా నా పర్వతశిఖరము లెట్లు గోచరింపనో, అలాగున అంతః కరణములో గల విషయవాసనలున్ను, అనాత్మభావమున్ను ఎప్పుడు సంపూర్ణముగా జ్ఞానానుష్ఠానమను సూర్యరశ్మివల్ల క్రమముగా గఱగిపోవుచుండునో యపుడాత్మజ్ఞానమందఱికిని స్వయముగా గెలవేసిన యరటిచెట్టుయొక్క పట్టలనొక్కొక్కదానిని తీసివేయుచు వచ్చిన 'భొందె' ఎట్లుమిగులునో, యాలాగుననే 'ముంజె' యొక్క పట్టల నొక్కొక్కదానిని తీసివేయుచు తాగా చాని పట్టలలోనున్న 'ఈను' ఏలాగునను మిగులునో, యాలాగున ఆత్మా నాత్మవిచారణచే పంచకోశముల, దేహత్రయముల, అవస్థాత్రయముల, 24 తత్త్వములను సంపూర్ణముగా త్రోసివేయగ సాక్షియగు ఆత్మ యొకటియే మిగిలియుండును.

భావములన్నిటిని నెఱుంగునది యగుటచే దానికి భావాతీతమనియు, తనకన్న అన్యముగా మఱియొకటి దానిని భావించుటకు లేనందుచే భావాతీత మనియు, ద్వంద్వములను సహించుటచేతను, ద్వంద్వములను తెలిసికొను నదగుటవల్లను ద్వంద్వాతీతమనియు నా దివ్యపదమునకట్టి పేర్లు గలిగెను. తత్త్వములు 24 అని కొందఱిమతము. ముంజయనగా మౌంజీబంధమునకు ఉపయోగించెడు దర్భవంటి ఒక తృణవిశేషము. ఇక విస్తారముగా వ్రాసి గ్రంథమును పెంచదలంచలేదు.

దీపమునకు తైలమెటువంటిదో ద్వంద్వాతీతమగు ఈ జ్ఞానజ్యోతికి బ్రహ్మచర్యము తైలమువంటిది. దానిని సంక్షిప్తముగా నిచట తెలిపెద. సృష్టియందు బ్రహ్మచర్య సంరక్షణకు సమానమైన ప్రయాసము మఱి యొకటిలేదు. సంరక్షణచే గలిగెడు ప్రభావమునకు సమానమగు మఱి యొక ప్రభావమున్ను లేదు. ప్రభావము దేనికి గలదో యది ప్రయాసము గానే లభించునని విజ్ఞులు తెలిపికొనుచున్నారు. ఆకలిబాధ అన్ని బాధలలో గొప్పదైనను, సమయమున్కు తప్పక భుజించువారికి కాబాధ తెలియదు. ఆలాగున దంపతులుగా నుండువారు సంకల్పము కలుగునపుడు దాంపత్యధర్మమును నిర్వహించుచుండుటచే ఆ ప్రయాసము వారికి తెలియదు. దాంపత్యము లేని స్త్రీపురుషులై బ్రహ్మచర్యవ్రతమును శీలించెడువారికి విషయ సంకల్పము నుండి మనస్సును మఱలించు టెంత ప్రయాసమో తెలియును. మఱియు పుణ్యవిశేషముచేతను, భగవద్భక్తి చేతను, వ్రతానుష్ఠాననిష్ఠచేతను,

రజోగుణము నశించి ఆత్మశుద్ధిగల వారికి అంతప్రయాస ముండదు. గాని, తక్కినవారికి కడుంగడు ప్రయాసము. ఏలన, సృష్టికర్త సృష్టికి హేతువగు కారణమును బ్రహ్మచర్య మందుంచుటచే అది సులభసాధ్యమైనచో సృష్టి క్రమమే ధ్వంసమైపోవునని తలంచి దానియొక్క నిగ్రహము సంతప్రయాసముగా నుంచియుండవచ్చును. అయితే జన్మహేతువగు సంస్కారములు చిరకాల తపోయోగాదులచే నశించిపోయిన వారికి మాత్రము బ్రహ్మచర్య మంత ప్రయాసముగా నుండదు. మూడులోకములలోను ఇంత ప్రభావము గల వ్రతము మఱియొకటి లేదు.

శృణు వ్రతస్య మాహాత్మ్యం వక్ష్యామి ప్రథమం తవ॥
బ్రహ్మచర్యవ్రతం సారం, వ్రతానాముత్తమం వ్రతమ్।
బ్రహ్మచర్యం తపస్సారం, బ్రహ్మచర్యం మహాఫలమ్।
క్రియాసు సకలాస్వేవ బ్రహ్మచర్యం వివర్ధయేత్॥

ఓ మహర్షిసత్తమా! ప్రథమమున మీకు వ్రతములన్నిటిలోను ముఖ్యమైన వ్రతమగు బ్రహ్మచర్యవ్రతము యొక్క మాహాత్మ్యమును చెప్పెద, బ్రహ్మచర్యవ్రతము మిక్కిలి సారమైనది, వ్రతములన్నిటిలోను ఇది యుత్తమవ్రతము. బ్రహ్మచర్యము తపస్సుయొక్క సారము. బ్రహ్మచర్యము మహత్తైన ఫలము కలుగజేయునది. కావున ప్రతివ్రతములోను, క్రియలలోను, బ్రహ్మచర్యమును సంరక్షించు కొనుచుండవలయును.

బ్రహ్మచర్యప్రభావేన, తప ఉగ్రం ప్రవర్తతే!
బ్రహ్మచర్యాత్పరం నాస్తి ధర్మసాధన ముత్తమమ్॥

బ్రహ్మచర్యప్రభావము వల్లనే ఉగ్రమైన తపస్సు చేయగలుగును. బ్రహ్మచర్యమునకు మించిన శ్రేష్ఠమగునది మఱియొకటి లేదు. ధర్మసాధన లన్నిటిలోను ఇది యుత్తమమగు ధర్మము.

మహావ్రతమిదం లోకే తన్నిబోధ సదా ద్విజ।

ఓ మునివర్యా! ఈ బ్రహ్మచర్యము లోకములో మహావ్రతము, దానిని లెస్సగా గ్రహింపుము—అని ఈశ్వరు డుపదేశించెను. ఇది పురుష

లకు మాత్రమే కాదు. స్త్రీలకుగూడ పురుషులవలె సమాన ఫలము గలుగ జేయునది.

సర్వేషాం వ్రతానాం మూలం, బ్రహ్మచర్యముదాహృతమ్।
విశేషాచ్ఛివభక్తానామేవం భూయో విధాస్యసి॥

వ్రతనిష్ఠగల వారందఱికిన్ని బ్రహ్మచర్యమే మేలుగలుగ జేయుటలో మూలకారణమైనది. భగవద్భక్తులందఱికిన్ని విశేషించి ఈ బ్రహ్మచర్య ముండవలయును ఇది మఱల మఱల మనస్సులో ధరించుకొన తగి యున్నది.

సంసారబంధమోక్షార్థం బ్రహ్మగుప్తమిదం వ్రతమ్।
మయా ప్రణీతం విప్రాణామపునర్భవకారణమ్ ॥

సంసారబంధమునుండి విముక్తికలుగుటకొఱకు, ఈ బ్రహ్మచర్యమను మహావ్రతము అతిరహస్యముగా నుంచబడెను. బ్రహ్మనిష్ఠులకు పునర్జన్మము కలుగకుండుట కొఱకు ఈశ్వరునిచే నీ బ్రహ్మచర్యవ్రతము నిర్మింపబడెను. దీనికి బ్రహ్మవ్రతమనిగూడ పేరుగలదు. బ్రహ్మచారి, వానప్రస్థ సన్యాసులు మనోవాక్కాయ కర్మలచే దోషముకలుగని బ్రహ్మచర్యవ్రతము కలిగియుండ వలెను, గృహస్థాశ్రమమందుండెడి స్త్రీ పురుషులు ఋతుకాలము తప్ప ఇతరకాలములలో పైజెప్పిన వారివలె బ్రహ్మచర్యవ్రతమున్ను గలిగి యుండినచో అట్టి స్త్రీ పురుషులుగూడ పైజెప్పిన మువ్వురు బ్రహ్మచారుల వలె బ్రహ్మచారులే యగుదురు. వారికే ఫలము చెప్పబడెనో యా ఫలితము ఈ గృహస్థ బ్రహ్మచర్య మాచరించువారికి గూడ కలుగును.

మైథునస్యాఽప్రవృత్తిర్హి మనోవాక్కాయకర్మణా।
బ్రహ్మచర్యమితి ప్రోక్తం యతీనాం బ్రహ్మచారిణామ్॥

యతులకున్ను, వానప్రస్థులకున్ను, బ్రహ్మచారులకున్ను, మనోవాక్కాయ కర్మలచే మిథునక్రియలయొక్క ప్రవృత్తిలేక యుండుట ఏది గలదో అది బ్రహ్మచర్యమని చెప్పబడెను.

స్వదారే విధివత్కృత్వా నివృత్తిశ్చాన్యతస్సదా।
మనసా కర్మణా వాచా బ్రహ్మచర్య మితి స్మృతా॥

స్వభార్యయందు ఋతుకాలవిధిననుసరించి ప్రవర్తించువాడై, మనస్సు చేతను, కర్మచేతను, వాక్కుచేతను, ఇతరకాలములలో విషయ నివృత్తి కలిగియుండుట ఏదికలదో, అది బ్రహ్మచర్యమనంబడును.

ఋతుకాలాభిగామీ యః స్వదార నిరతశ్చ యః।
స సదా బ్రహ్మచారీ విజ్ఞేయస్స గృహాశ్రమీ॥

స్వపత్నియందు ఋతుకాలమునమాత్రము, ప్రవర్తించువాడై, ఇతరకాలములో విషయరహితుడై ఎవడుకలడో, అట్టి గృహస్థాశ్రమమున నుండువాడు సదా బ్రహ్మచారియని తెలియదగినది. అట్టి గృహస్థాశ్రమ స్త్రీయును బ్రహ్మచారిణియే యని తెలియదగినది.

పరదారపరిత్యాగీ స్వదారపరితుష్టితః।
ఋతుకాలాభిగామిత్వాద్బ్రహ్మచారీ గృహీరితః॥

పరస్త్రీలను, తల్లులవలె తలచువాడును, స్వపత్నియందు, గృహస్థ ధర్మమును నిర్వహించువాడును, ఋతుకాలములో మాత్రము సంసారరీతిగా నుండువాడును నగు గృహస్థాశ్రమిగూడ బ్రహ్మచారి యనంబడును.

విషయే బుద్ధచిత్తానాం, వనేపి జాయతే రతిః।
సర్వత్ర సమదృష్టీనాం, గేహే ముక్తిర్హి శాశ్వతీ॥

విషయాసక్తిగలవాడు వనములోనుండినను, విషయబుద్ధి గలుగుచుండును అనగా విషయసంకల్పము నశించదని భావము. సమదృష్టిగల వారికి సర్వత్ర గృహమందుండినను, శాశ్వతమైన మోక్షము గలుగును. గృహస్థబ్రహ్మచర్యముగల స్త్రీపురుషులకు పరమునకు సంబంధించిన మోక్షము గలుగుటయేగాక ఇహములో మేధాసంపత్తియు ధర్మబుద్ధియు, ఆరోగ్యవంతమగు సంతానమును గలుగును అట్టి స్త్రీపురుషులు ఇహలోకమున నిర్మలహృదయముగలవారై బ్రహ్మవిచారమున కర్తృత గలవారగుటయేగాక మంచి యారోగ్యవంతులై గూడ యుండగలరు.

ఈ బ్రహ్మచర్యము శరీరసంబంధమగు బ్రహ్మచర్యముతో పూర్తియని తలంచరాదు.

"బ్రహ్మభావే విచరతో బ్రహ్మచర్యం తదుచ్యతే"

బ్రహ్మవిచారమందు చరించుటయే, అనగా బ్రహ్మములో చరించుటమే బ్రహ్మచర్యమనబడు ననియు నెఱుంగవలెను, అదే ముఖ్యమైనను. అముఖ్యమైన దేహసంబంధ బ్రహ్మచర్యములేనిచో అగాధమగు బ్రహ్మచింతనచేయుటకున్ను. మనస్సు నిర్మలముగానుండుటకున్ను ఇంద్రియముల స్వాధీనములో నుంచుటకున్ను తగిన నిగ్రహశక్తి కలుగదని తప్పక గ్రహించుకొనవలయును.

భోగేన తృప్తిర్నైవాస్తి, విషయాణాం విచారతః।
తస్మాద్విరాగః కర్తవ్యో మనసా కర్మణా గిరా॥

విషయభోగములను అనుభవించిన తృప్తి కలుగదు అందువల్ల మనస్సుచేతను, వాక్కుచేతను, కాయముచేతను, కర్మచేతను, లెస్సగ విచారణచేసి వైరాగ్యము కలుగచేసికొనవలయును.

న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే (మనుస్మృతి)

విషయాదిభోగములు నెంతయనుభవించినను శాంతికలుగుగదు. ఘృతములచేతను, సమిధలచేతను, అగ్ని అంతకంతకు వృద్ధియగునట్లు భోగములచేత కామము వృద్ధియగును.

సర్పిషా కాష్ఠభారేణ వర్ధతేగ్నిశిఖా యథా।
ఉపభోగేన కామేన హ్యాశా చోపరివర్ధతే॥

నేతిచేతను కట్టెలచేతను, అగ్నియొక్క జ్వాల అంతకంతకు వృద్ధియగునట్లు, భోగముచేత కామాగ్నియగు ఆశ అంతకంతకు వృద్ధి నొందునేగాని శమింపదు, (శివపురాణము)

ఇంధనేన యథా వహ్నిః వర్ధతే ఉత్తరోత్తరమ్।
భోగేన కామతృష్ణాగ్నిః ఉత్తరోత్తరవర్ధతే॥

కట్టెలువేయగా వేయగా నిప్పు అంతకంతకు వర్ధిల్లునట్లు భోగముచేత కామరూపమగు అగ్ని అంతకంతకు పెరుగునేకాని శమింపదు అని భారతము.

న జాతు కామః కామానాం నహస్రైరపి తుష్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ వాంఛా తస్య వివర్ధతే॥

విషయాసక్తిగల పురుషుడు వేలకొలది భోగముల ననుభవించినను ఒకప్పుడును దానికి శాంతికాదు. ఘృతముచే అగ్నిహోత్రుడు అంతకంతకు పెరుగునట్లు, విషయమును సహస్రావర్తు లనుభవించినను, వృద్ధినొందునే గాని శాంతినొందనేరదు. వైరాగ్యము ఒక్కదానివల్ల మాత్రమే విషయ వాంఛ నశించును గాని, వేఱు మార్గము లేదు.

యథా నిరింధనో వహ్నిః స్వయోనావుపశామ్యతి।
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనావుపశామ్యతి॥

కట్టెలు వేయకపోయిన ఏలాగున అగ్ని స్వయముగా శాంతినొందునో, ఆలాగున విషయములనుండి ఉపరతి బొందిన చిత్తము అప్రయత్నముగానే శాంతినొందును. ఇపుడు బ్రహ్మవిద్యయెంత ప్రభావముగలదో యను విష యమై దేవర్షిసత్తముడగు శ్రీనారదమహర్షియొక్క చరిత్రమును చెప్పెద.

శ్రీనారదుడు ఉపనిషచ్చింతన జేయుకాలమున దానియందీ పదము కన్పించినది- "తరతి శోకమాత్మవిత్" –ఆత్మవేత్తయైనవో శోకమోహము లుండవు. అనగా శోకసాగరమును ఆత్మవేత్తదాటును, అను శ్రుతిపదము వినిన వెంటనే శ్రీనారదుడు తనకు శోకమోహములు కలుగుచున్నవా? యని ఆత్మలోదీర్ఘముగా విచారించగా, తనయందు శోకములు నశింపలేదనియు, స్తుతినిందలలోను హర్షామర్షములలోను, లాభనష్టములలోను తనయాత్మకు సంబంధము తొలగిపోలేదనియు గ్రహించెను, ఎవ్వరైన స్తుతించినచో వారిపై ప్రీతియు, ఎవరైన నిందించినచో వారిపై అప్రీతియు కలుగుచున్నది గదా, ఆలాగున లాభము వచ్చిన సంతోషమున్ను, నష్టము గలిగిన దుఃఖమున్ను కలుగుచున్నదే. ఇట్టైన ద్వంద్వముల నేను దాటలేదుగదా! ద్వంద్వమేగదా సంసారము. బంధము, మోహము. ఈ ద్వంద్వము సంసారులలో నుండు వారికి కన్పించుచున్నది. అదేవిధముగా జ్ఞానులైన వారుకూడ ఉండినచో నిక

బద్ధులకున్ను ముక్తులకున్ను ఏమిభేద'మని యాత్మలో చింతన చేసిరి. ఈలాగున నిశ్చయించుకొని ద్వంద్వాతీతస్థితి నుపదేశించెడు పరమాచార్యుడు ఎచట కలడని యాలోచించి చూడగ బ్రహ్మమానస పుత్రుడును, ఆజన్మ బ్రహ్మచారియును, ఊర్ధ్వరేతస్సు గలవాడును. పుట్టుకలోనే మాయావరణాది ప్రకృతిదోషములు లేనివాడునగు సనత్కుమారుడొక్కడే గలడని మనంబున నిశ్చయించినవాడై యామహనీయుడే తగిన పరమగురుడని తలంచి సనత్కుమారుండు స్థలమునకు వెళ్ళెను. దేవర్షివరుడగు సనత్కుమారునకున్ను శ్రీనారదమహర్షికిన్ని జరిగిన సంభాషణను సంక్షిప్తముగా నిచట తెలిపెద. ఈవిషయము ఛాందోగ్యోపనిషత్తున విస్తారముగా, గనందగును. అలాగుననే శ్రీశంకరానందమునివరుడు వ్రాసిన యాత్మపురాణములోనుచూడదగును. వేదాంతపంచదశిలోను. ఇదిగాన్పించుచున్నది.

ఇచట నిద్రవాయుటకు కారణమేమన, శ్రీనారదుడున్ను ద్వంద్వాతీతస్థితి మొదటనే పొందలేదనియు ఈక్రింది తెలిపెడు విద్యలున్ను, సిద్ధులున్ను మహిమలున్ను కలిగియు, భావాతీతమును పొందకపోవుటచే శోకమోహములనెడి దుఃఖసాగరముల తరింపలేక పోయెను. గానద్వంద్వాతీతమనెడి భావాతీతము సామాన్యమని తలంపరాదు. ఈనారద మహర్షియే దీనికి తార్కాణము. ఎంతవఱకు కట్టి జ్ఞేయమగు ద్వంద్వాతీత స్థితి కలుగలేదో అంతవరకు ప్రతిష్ఠలేని దేవాలయమువలెను, దీపము లేని గృహమువలెను, జీవితముగలదని జిజ్ఞాసువులు నిశ్చయించుకొనవలయును. ఇపుడుండు వేదాంతులని చెప్పకొనువారలలో అనేకులనేక విధములగు ద్వంద్వములతో గూడి కష్టము లనుభవించుచున్నను, వాక్యములతో మాత్రము ఏలాటి సంబంధము లేదనియు, పరిపూర్ణస్థితిలో సదా ఉంటున్నారనియు, సమాధిలో నిలచియున్నారనియు, ఎల్లప్పుడు జీవబ్రహ్మైక్యస్థితి గలిగినవారనియు చెప్పెడు వీరిని గుఱించి లోకమే సత్యము నెఱుంగగల్గుము. మఱియు, శ్రీనారదులవలె సత్యనిష్ఠయు, శుద్ధాత్మ యొక్క అనుభవవిచారణయు గలవారును ఆత్మవంచకము లేనివారలు మాత్రమే ధ్యేయములో, భావాతీతములో ద్వంద్వాతీతములో నిలుకడ గలిగిన వారలగుదురను పరమసత్యమును మఱువకుందురుగాక! ఆజ్ఞేయైకస్థితినే పరిపూర్ణమనియు, బయలనియు ఉపనిషత్తు ఉపదేశించుచున్నది.

అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవార్ణవే।
అంతఃశూన్యో బహిఃశూన్యః శూన్యకుంభ ఇవాంబరే॥

ఇచట రెండువిధములగు దృష్టులను తెలుపడమైనది. ఒక దృష్టిలో నేమియును లేని శూన్యస్థితిని వర్ణించెను. మఱియొక దృష్టిలో సర్వము నిండిన పరిపూర్ణ దృష్టిని తెలిపెను. ఒకే వాక్యములోనే పూర్ణత్వమున్ను, చెప్పునపుడు అది విరుద్ధమేయగును, సమన్వయము గలుగదు. పూర్ణాత్మ బోధైకజ్ఞానదృష్టిలో, నిండుఘటము సముద్రములోనుంచిన, లోపలను, బయటను, జలమేలాగున నిండియుండునో, అట్లుండును. ఇదియే పరిపూర్ణ దృష్టి, మఱియొక దృష్టిలో శూన్యఘట మాకాశములోనుంచిన బాహ్యాభ్యంతరముల నేమియులేక శూన్యమైయుండునట్లు దృశ్యము, దృశ్యవృత్తులు లేని శూన్యభావమే ఇచట బయలుశబ్దముచే గ్రహించుగొనవలయును. అట్లుగాక, అనేక విషయములు, వృత్తులు, వాసనలతోగూడిన హృదయము గలవారై, వట్టిది, ఏమియులేదు బట్టబయలని చెప్పిన ఏమైన ప్రయోజనము కలుగునా? రజ్జువును జూచి సర్పమని భయముగలవానికి రజ్జువుయొక్క యథార్థజ్ఞానము తెలియునపుడు సర్పమేలాగున లేకపోవునో, ఆలాగున పూర్ణాత్మస్వరూపముగల తనలో అవిద్యయొక్క మహిమచే గలిగిన భ్రాన్తి నశించుట యేదికలదో, అదియే, దృశ్యము శూన్యమగు పూర్ణాత్మానుభవమని విజ్ఞులు తెలిసికొనగలరు.

ఇపుడు, శ్రీ నారదసనత్కుమారసంభాషణ ఈ క్రింద వ్రాయబడుచున్నది.

స పురాణాన్ షడంగాంశ్చ పంచవేదాన్ శాస్త్రాణి వివిధాని చ।
జ్ఞాత్వాప్యనాత్మవిత్త్వేన నారదోఽతిశుశోచ హ॥

నారదుడు, సర్వపురాణములను, పంచవేదములను, తర్కవ్యాకరణాది నానావిధశాస్త్రముల దెలిసికొనియు, ఆత్మజ్ఞానములేని కారణముచేత అధిక దుఃఖమును బొందినవాడాయెను.

సోఽహం విద్వాన్ ప్రశోచామి శోకపారం నయాద్య మామ్।
ఇత్యుక్తః సుఖమేవాస్య పారమిత్యభ్యధాదృషిః॥

శ్రీ నారదుడు—ఓ మహాత్ముడవగు సనత్కుమారా? సకలవేదశాస్త్రములజదివినట్టి యీ నేను ఆత్మజ్ఞానమందు నిలుకడగలుగమి మిక్కిలి పరితపించుచున్నాను, ఈ నన్ను సంసారదుఃఖసముద్రము యొక్క గట్టును. ఆత్మజ్ఞానమనెడి తెప్పచేత పొందింపజేసి కృతార్థ బుద్ధిని గలిగింపుము

అని ఇట్లు నారదుడు దుఃఖనివృత్త్యుపాయము నడుగగా అపుడు సనత్కుమారుడు భూమాశబ్దముచే చెప్పదగిన సుఖరూపబ్రహ్మమే యెఱుగబడుచున్నదగుచు దుఃఖనివృత్త్యుపాయమగునని "సుఖం త్వేవ విజ్ఞాసితవ్యం" అనెడి వాక్యము మొదలుకొని ఉత్తరగ్రంథ సందర్భముచేత చెప్పినట్లు ఛాందోగ్యశ్రుతియందుగల సప్తమాధ్యాయమందు వినబడుచున్నదని తెలియవలయును.

సుఖం వైషయికం శోకసహస్రోణావృతత్వతః।
దుఃఖమేవేతి మత్వాహ నాల్పేస్తి సుఖమిత్యసౌ॥

విషయములవల్ల గలిగెడు సుఃఖము దుఃఖములయొక్క సహస్రముచే కూడియుండుటచేత, విషముతో గూడియుండెడు క్షీరాన్నము బహుదుఃఖరూపత్వమును గలిగియున్నట్టు ఆ విషయసుఖమును బహుదుఃఖరూపమునుగా నిశ్చయించుచు, ద్వైతమందు సుఖములేదని సనత్కుమారుడు చెప్పెను.

ఇపుడు శ్రీసనత్కుమారమహర్షులకును శ్రీనారదమహర్షికిన్ని జరిగిన సంభాషణ ప్రశ్నోత్తరరూపముగా క్రింద వ్రాయబడుచున్నది.

పూర్వమొక కాలమందు ద్వంద్వరూపమగు సంసారతాపముచే తప్తుడైన నారదముని ఏకాంతదేశమందు స్థితుడైన సనత్కుమారుని సమీపమునకు బోయి దీనవచనములచే నిట్లనియె—

ఓ భగవంతుడా! ఏ బ్రహ్మము సకలజగదధిష్ఠానమో, ఏ బ్రహ్మము సర్వమునకన్న నుత్కృష్టమో. ఏ బ్రహ్మముయొక్క జ్ఞానముచే విద్వాంసులు కర్తృత్వభోక్తృత్వాది అధ్యాసరూపశోకములను తరించుచున్నారో. ఆ బ్రహ్మస్వరూపమును తాము బాగుగా నెఱుగుచున్నారు. ఓ భగవంతుడా! ఆ బ్రహ్మముయొక్క జ్ఞానమును శిష్యుడనైన నాకు దయచేసి యుపదేశము చేయుము.

నారదమునియొక్క యాప్రార్థనము విని మందహాసము చేయుచు వాని అజ్ఞాననివృత్తికొఱకు సనత్కుమారు డిట్లనియె—

హే నారద! నీవు సర్వలోకములయందు ప్రజ్ఞలచే సమర్థుడవు నీ వేయే విద్యలు నేర్చుకొనియున్నావో యాసంపూర్ణవిద్యలు మొదట నాకు చెప్పుము. ఆ వెనుక నీకు నేను బ్రహ్మోపదేశము చేసెదను.

అపుడు నారదుడు దీర్ఘ దండప్రణామముచేసి తన విద్యలను నివేదింప మొదలిడెను.

హే భగవన్! మంత్రము, బ్రాహ్మణమను రెండరూపములుగా గల ఋగాది నాలుగువేదములను జనకుడైన బ్రహ్మదేవుని ప్రసాదమున నెఱింగితిని. అట్లే బ్రాహ్మణమందు కథారూపేతిహాసములును, జగదుత్ప త్త్యాది పురాణరూపములును, సాధు అసాధు శబ్ద నిరూపకమగు వ్యాకరణ మున్ను, శ్రాద్ధాదికర్మప్రతి పాదకమైన పితృశాస్త్రమున్ను, రాశినామముగల గణితశాస్త్రమున్ను, జీవోత్పత్త్యాదుల ప్రతిపాదకమైన దైవశాస్త్రమును. భూమియందు నిక్షిప్తమైన నిధి సంబంధశాస్త్రమున్ను అక్షపాద ప్రణీత న్యాయ శాస్త్రమున్ను, వేదప్రతిపాదితవాక్యజ్ఞానముగల ప్రశ్నోత్తరశాస్త్ర మున్ను, ఏకాయననామకమైన నీతిశాస్త్రమున్ను,వేదాంగరూపవిద్యానామకమైన నిరుక్త శిక్షాకల్పశాస్త్రమున్ను, భూతవిద్యానామకమైన ఆయుర్వేదమున్ను, సుశ్రుతాది వైద్యశాస్త్రమున్ను,శాంతిపుష్టి కారకములైన నానావిధ యంత్రము లున్ను, అస్త్రవిద్యాసహిత ధనుర్విద్యానామకమైన క్షాత్రవిద్యయున్ను, నవగ్రహస్థితికారకమైన జ్యోతిశ్శాస్త్రమున్ను, నక్షత్ర విద్యయున్ను, గారుడ విద్యానామకమైన సర్పవిద్యయు, లోకమనోహర రంజకమైన గాంధర్వ విద్యయు, నేను బాగుగా నెఱుగుదును. హే భగవన్! ఋగ్వేదము మొదలు గాంధర్వవిద్యవఱకు నేను బాగుగా నెఱుంగుచున్నాను.

అయినను, ఆ వేదముల తాత్పర్యరూపమగు మోక్షసాధనమును నేనెఱుం గను. ద్వంద్వాతీతస్థితి నేను పొందియుండలేదు. భావాతీత నిత్య నిరతిశయ సుఖములో నాకు నిలకడ కలుగలేదు. ఓ భగవంతుడా! వేదార్థమును నేను సామాన్యముగా నెఱుగుచున్నాను. అయినను, వేదముల తాత్పర్య విషయీ భూతమగు ఏ యద్వితీయాత్మ గలదో దానిని నేనెఱుగను. కనుక నేను

కేవలము వేదమంత్రపాఠకుడుగా నున్నాను. ఓ భగవంతుడా! పూర్వము మీవంటి మహాత్ములచే నేనిట్లు శ్రవణము చేసితిని ఆత్మ నెఱింగిన పురుషుడు మూలకారణసహిత సకలశోకమును తరించుచున్నాడు. భగవంతుడా! త్రికోణాకృతిగల అగ్నిగుండమందు బడిన కుంటిమనుజు డెట్లు మహా శోకమును పొందుచున్నాడో, అట్లు ఆధ్యాత్మికాది త్రివిధతాపములు నాకు సర్వదా శోకవిహ్వలతను కలుగజేయుచున్నవి. హే దీనదయాళో సనత్కుమారా? ఎట్లు బాల్యముననున్న ఒక పతివ్రతస్త్రీ, ధనరహితురాలుగాను, బాంధవులు లేనిదిగానుండి యౌవనావస్థలో పతి మృతి నొందిన స్త్రీవాడుగాగ హా! దైవమా! నా గతి ఏమగునని ఎట్లు శోకముచేయునో, అట్లు నారదుడ నగు నేను 'హా దైవమా నాగతి యేమగు'నని నిరంతరము శోకించుచున్నాను. త్రివిధతాపములకు వశుడనగుచున్నాను. అనాథుడనైన దీనుడనైన నాపై కృపగల్గి నీవు నన్ను ఈ శోక సముద్రమును తరించువానిగా జేయుము—

ఈ ప్రకారము నారదుని దీనవాక్యముల విని భగవంతుడగు సనత్కుమారుడు స్థూలారుంధతీ న్యాయముగా ఆత్మస్వరూపబోధ జేయ నారంభించెను. ప్రథమమున చతుర్వింశతితత్త్వములను, పంచకోశములను, దేహత్రయమును, అవస్థాత్రయమును విధిప్రకారము బోధించి, వీటికి సాక్షియగు ఆత్మను, భూమాశబ్దమను నొక నూతనవాక్యముచే గల్పించి, దానినే పరబ్రహ్మముగా, పరమాత్మగా నుపదేశించి. నారద మహర్షిని ద్వంద్వాతీతమగు ఆ భావాతీత నిత్యశాంతిలోనికి, నిరతిశయ సౌఖ్యములోనికి జేర్చెను. శ్రీనారదుడును, సనత్కుమారుడను పరమ మహర్షియొక్క కరుణ వల్ల ద్వంద్వాతీతమగు నిత్యపరమశాంతిని బొందెను. ఈ కథవల్లనే భావాతీత మెంత పవిత్రాత్ములకు బొందదగినదో యని గ్రహించుకొనవలయును ఈ కథ అతి సంగ్రహముగా నిచట తెలుపడమైనది.

యోగవృక్షస్య ఛాయా యాతాపత్రయవినాశినీ।
ధర్మజ్ఞానే చ పుష్పాణి స్వర్గమోక్షౌ ఫలాని చ ॥
దుఃఖత్రయాభితప్తస్య ఛాయా యోగతరోఃస్మృతా।
న బాధ్యతే పునర్దుఃఖైః ప్రాప్య నిర్వాణముత్తమమ్॥

యోగవృక్షము (జ్ఞానవృక్షము)యొక్క వర్ణన ఈ రెండు శ్లోకములచే చేయబడినది. నిండువేసవి మధ్యాహ్నకాలమున, ఎడారిలో సంచరించువాడు. దప్పికచేతను, ఆకలిచేతను, తపించుచున్నప్పుడు మంచి నీడగలదిన్ని సుగంధపుష్పములతోను మధురమైన ఫలములతోను, శీతల జలాశయముతోను గూడినదియగు, గొప్ప చెట్టుయొక్క నీడ నాశ్రయించిన నెట్లుండునో, యాలాగున యోగవృక్షముయొక్క ఛాయ యేదిగలదో యది అధ్యాత్మికం అధిదైవిక, అధిభౌతికమను తాపత్రయమును నశింపజేయునది, ధర్మము, జ్ఞానము, అనుపుష్పములతో గూడినది, కామ్యకర్ములకు స్వర్గమున్ను, నిష్కాములగువారికి మోక్షము అను ఫలములచే నిండి శోభాయమానమైనదియు నగుచున్నది. తాపత్రయములచే, మిక్కిలి తపించెడు జీవి ఈ యోగ తరుచ్ఛాయను పొందిన వ్వుఅల తాపత్రయములచే దుఃఖమును నొందడు. అంతేకాదు, ధ్యానిని పొందువాడు ఉత్తమమగు నిర్వాణమును పొందగలడు.

ఇక భక్తులకుగాని, నిష్కామకర్మయోగులకుగాని, ధ్యానయోగులకుగాని, జ్ఞానయోగులకుగాని యుండవలసిన అద్వేష్టృత్వాది గుణముల గురించి శ్రీ భగవంతుడు గీత ద్వాదశాధ్యాయమున యుపదేశించిన, పరమ భక్తులకుండవలసిన గుణముల నిరూపణజేసి ఈ వ్యాసము సమాప్తి జేయదలంచెద. ఇపుడుకూడ భక్తి యోగ, కర్మయోగ,ధ్యానయోగ, జ్ఞానయోగములయందు కొద్దిగనో గొప్పగనో యాచరించువారు లేకపోలేదు. అయితే భగవంతు డుపదేశించిన ఈ గుణముల యాచరణలు, అనుష్ఠానములు, ధ్యాననిష్ఠలు తగినందుచే పూర్ణఫలమును పొందకపోవుచున్నారు కృతత్రేతాది యుగములలో కట్టెలచే అగ్నియెట్లు వృద్ధినొందెనో యాలాగున నిప్పుడుకూడ గలదు. కట్టెలులేక కృతాది యుగములలోను అగ్ని జ్వలించియుండలేదు. నిప్పులో కట్టెలు వేయువారు స్త్రీలుగాని, పురుషులుగాని, బ్రాహ్మణులుగాని, అబ్రాహ్మణులుగాని సన్న్యాసులుగాని, సంసారులుగాని యైనను, అగ్ని ఎలాగున జ్వలించునో అలాగున శ్రీ కృష్ణభగవానుఉపదేశించిన అనుష్ఠానము గలవారు పూర్వీక ఋషులవలె జ్ఞానప్రకాశకులగుదురు.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
॥ నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥

సకలభూతములకు ద్వేషికానివాడును, మిత్రధర్మము కలవాడును, దయగలవాడును, మమత్వములేనివాడును, అహంకారము లేనివాడును, సుఖదుఃఖములయందు సమబుద్ధి గలవాడును, ఓర్పుగలవాడున్ను నాకు ప్రియుడని భావము.

సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధిర్యోమద్భక్తస్స మే ప్రియః ॥

ఎవడు సర్వకాలములయందును, లాభమునందును, అలాభము నందును, సంతోషముకలవాడును, సమాహితచిత్తుడును, నియమింపబడిన మనస్సుకలవాడును, దృఢమైన ఆత్మనిశ్చయము కలవాడును. నాయం దర్పింపబడిన సంకల్పాత్మకమైన మనస్సున్ను నిశ్చయాత్మకమైన బుద్ధియు గలవాడును, నన్ను సేవించుటయం దాసక్తికలవాడును నగుచున్నాడో వాడే నాకు ప్రియుడు.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్సచ మే ప్రియః॥

ఎవనివలన లోకము క్లేశము నొందదో, ఎవడు లోకమువలన, చిత్తక్షోభము నొందడో; ఎవడు ప్రీతిచేతను, అప్రీతిచేతను, ఉద్వేగము చేతను విడువబడెనో, వాడు నాకిష్టుడగుచున్నాడు.

అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్సమే ప్రియః॥

దేనియందును అపేక్షలేనివాడును, బాహ్యాభ్యంతరశుద్ధి గలవాడును కార్యదీక్షగలవాడును, పక్షపాతము లేనివాడును. నిర్భయుడును, కామ్యము లగు సమస్తకర్మలను పరిత్యజించుస్వభావము కలవాడునునై ఎవడు నాకు భక్తుడగుచున్నాడో వాడు నాకిష్టుడు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః॥

ఎవడు ఇష్టవస్తులాభమునందు సంతోషింపడో, అనిష్టప్రాప్తియందు ద్వేషింపడో ప్రియవియోగమునందు వ్యసనము పొందడో దేనిని కోరడో, పుణ్యపాపకర్మలవల్ల గలిగెడు ఫలమునపేక్షింపడో భక్తిగలవాడో; వాడే నాకు ఇష్టుడు.

సమశ్శత్రౌచ మిత్రే చ తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః॥

శత్రునియందును మిత్రునియందును సమానుడును అటులనే మానమునందును, అవమానమునందును సమానుడును, శీతము ఉష్ణము సుఖము, దుఃఖము అనువానియందును సమానుడును, సర్వసంగ విముక్తుడును అగువాడు నాకిష్టుడు.

తుల్యనిందా స్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్।
అనికేతస్థ్సిరమతిర్భక్తిమాన్ మేప్రియో నరః॥

నిందయందును స్తుతియందును సముడును, మౌనముకలవాడును (మననశీలుడును) శరీరము నిలుచుటకే యాహారమైనను, ఏవస్త్రమైనను, ఏస్థలమైనను సంతోషించువాడును, సంసారమునుండి విముక్తుడును, జ్ఞానమందు నిశ్చలమైన మనస్సుగలవాడును నైననరుడు నాకు ప్రియుడు.

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేతీవ మే ప్రియాః॥

మనుష్యజన్మమెత్తిన యెవరైనను ధర్మార్థములకు మూలమైనదిన్ని అమృతమునునైన ఈ అద్వేష్టృత్వము మొదలుగాగల ధర్మసముదాయమున శ్రద్ధగలవారును, అక్షరాత్ముడైన నేనే నిరతిశయమైన గతిగాగలవారును (జ్ఞేయమునే పరమగతిగా తలంచువారును) ఉత్తమ భక్తులును, అగుచు ఎవరు ధ్యానించుచున్నారో వారు నాకత్యంత ప్రియులు.

ద్వంద్వములయొక్క లక్షణమున్ను, ద్వంద్వాతీతునియొక్క లక్షణమున్ను, ద్వంద్వాతీత స్వరూపమునున్నూ శ్రీ భగవానులు దీనియం దుపదేశించినారు. ఓం తత్ సత్ ఓమ్

# జ్ఞేయము

బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ।
అధశ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్॥

ఇదం = ఈ సమస్తము, అమృతం = నాశరహితమగు, బ్రహ్మైవ = పరబ్రహ్మమే, పురస్తాత్ = ముందరను, బ్రహ్మ = పరబ్రహ్మము, పశ్చాత్ వెనుకను, బ్రహ్మ = పరబ్రహ్మముచు, దక్షిణతశ్చ = దక్షిణభాగమునందును, ఉత్తరేణ = ఉత్తరభాగమునందును, అధశ్చ = క్రిందిభాగమునను, ఊర్ధ్వంచ = మీది భాగమునందు (సర్వతః = అంతటా) ప్రసృతం=వ్యాపించియున్నది బ్రహ్మైవ = పరబ్రహ్మమే, ఇతరమగు కార్యరూపముతో వ్యాపించియున్న, ఇదం=ఈ, విశ్వం=సమస్తజగత్తుచు, వరిష్ఠం=శ్రేష్ఠమగు ఇదం = ఈ, బ్రహ్మైవ = పరబ్రహ్మమే.

ఈ జ్ఞేయమునకే ధ్యేయమనియు జ్ఞానమనియు, విజ్ఞానమనియు ఈశ్వరసాక్షాత్కారమనియు, సాక్షిజ్ఞానమనియు, తురీయమనియు, నిర్వికల్ప సమాధియనియు ఇవి మొదలుగాగల పలువిధములగు పేర్లు గలవు. వీటి యన్నిటియొక్క సారమేమన, సత్పదార్థమగు ఆత్మనుండి అసత్పదార్థమగు బుద్ధిపర్యంతముగల యనాత్మభావములన్నిటిని రహిత మొనర్చుటయే యగును. ఇందువల్లనే యీ యున్నతస్థితికి భావాతీతమని గూడ పేరు గలుగుటకు కారణమైనది కావుననే ద్వంద్వాతీతమని చెప్పటకున్ను హేతువైనది యోగదృష్టితో చూచిన ఆత్మలోగల అజ్ఞానము అనగా కర్మ, సంస్కారము, సంకల్పము, వాసన మొదలగు ప్రకృతి గుణములను, ధ్యాన ధారణా సమాదులవల్ల రహిత మొనర్చుట అనగా ప్రకృతి బంధనమునుండి విముక్తినొందుటయే యనేంబడును. ఇది పాషాణము, గంధకము మొదలగు విషధాతువులను స్ఫుటక్రమము జేసి శుద్ధముచేయు నట్లుండును. లేక మలిన బంగారమును, శుద్ధిచేసి దోషము లేకుండునట్లు చేసేలాగున నుండును, లేక మలినవస్త్రము క్షారాదులచే శుద్ధపఱచునట్లును, చిల్లగింజ గంధముచే మట్టినీటిని నిర్మలపఱచునట్లును ఉండును. ఇవి యన్నియు అష్టాంగాది యోగసాధనలవల్ల అవిద్యనుండి విముక్తి పొందెడు మార్గములు.

ప్రపంచములోగల ప్రతిసత్పదార్థమున్ను అసద్వస్తువుతో కూడియే యుండును. అసత్తును పరిత్యజించి సత్తును గ్రహించుటయే ముముక్షువుల కర్తవ్యము. మామిడిపండ్లు మొదలుగాగల సకలఫలములును, తోలు పీచు, మొదలగు అసద్వస్తువులతో కూడియుండును. ఆ తోలు మొదలగువాటిని తొలగించిన సత్పదార్థము మాత్రమే మిగిలియుండును. ఆ సద్వస్తువు కేవలము మధురమయము. మాధుర్యము తప్ప అందు మరి యేమియు మిగిలియుండదు. అలాగున క్షీరమును (పెరుగు) మథించి నవనీతము తీసిన అదిన్ని జలభాగము పోవునపుడు సారమగు ఘృతము మాత్రమే మిగిలినదై యుండును. అట్లే నూవులు మొదలగు గింజలనుండి తైలము దీసిన వాని యందుగల అసత్పదార్థమగు పిండిలేనిదై సారమగు తైలముమాత్రము మిగులుచున్నట్లు సారరూపమగు ఆత్మలోగల నిస్సారరూపమైన అజ్ఞానమును తీసివేసిన సత్తగు ఆత్మమాత్ర మొక్కటియే శేషించును. ఇది యోగమార్గముతో కూడినది.

ఇక జ్ఞానమార్గము మరియొకటి కలదు. కేవలము వేదాంత విచారణ దృష్టితో కూడినది. కాని, అట్టి సువిమల విచారణదృష్టి మొట్ట మొదట ఎవరికిన్ని కలుగదు. నిష్కామకర్మలచే పాపనివృత్తియు, దైవోపాసనవల్ల విక్షేపనివృత్తియు, యోగధారణవల్ల ఆవరణమును పోయి ఏకాగ్రత గలుగ వలసియుండును. ఉపనిషద్భాగమగు బ్రహ్మ విచారణమందు ప్రవృత్తి కలుగుటకు శమదమాది సాధన చతుష్టయసంపత్తి తప్పక కలిగియుండ వలయును, అట్టి సాధన సంపత్తికలవారెవరైనను బ్రహ్మవిచారమున కర్తలే. అట్లు కానివారు శాస్త్రములను చదివిన వారైనను అగ్రజాతిలో జన్మించినవారైనను, యత్యాశ్రమము స్వీకరించినవారైనను, అనేక దాన ధర్మములు చేసినవారైనను, అనేక తీర్థయాత్రాదుల సేవించినవారైనను, యజ్ఞయాగాది క్రతువులను చేసిన వారైనను సాధన చతుష్టయ సంపత్తి లేనిచో బ్రహ్మవిచారమున కర్తలు కారు. కావుననే దీనిని వేదాంతమని చెప్పిరి, వేదాంతమనగా వేదముయొక్క అంతిమభాగ మని యర్థములో విధించియుండు పై జెప్పిన పుణ్యకర్మ లన్నియు నిష్కామబుద్ధితో శ్రద్ధా భక్తులుగలిగి ఆచరించిన బ్రహ్మవిచారమునకు తగిన బుద్ధియొక్క శుద్ధియు, ఏకాగ్రతయు కలుగును అపుడు బాగుగా సానపట్టిన గొడ్డలిచే చెట్లనెట్లు నరుక

వచ్చునో, అలాగున బుద్ధికి ఏకాగ్రతయు విశుద్ధతయు కలుగునపుడు అజ్ఞానారణ్యమగు వృత్తులను (సంకల్పములను) భేదించుటకు శక్తి కలుగును. కనుకనే గీతలో "బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్యచ" అని యుపదేశించుటకు కారణమైనది.

వేదము 'ఏకం సత్' అనియుపదేశించుచున్నది 'ఏకామేవాద్వితీయం' అనగా సద్వస్తువు ఒకటి మాత్రమే రెండవది యగు మరియొక వస్తువులేదు అని తెలుపుచున్నది. అట్లయిన. అనేకములుగా కాన్పించెడు ఈజగత్తు అంతయుయేమి? యని ప్రశ్నరాగా ఆత్మవిచారణచే దానికి సమాధానము వచ్చుచున్నది అది స్థిరము చేయు నిమిత్తము అనేకపద్ధతుల శాస్త్రమవలంబించవలసి వచ్చినది. దానిని ఇంద్రజాలమనియు, స్వప్నమనియు, దిగ్భ్రమయనియు, భ్రాంతిజ్ఞానమనియు బహువిధములుగా నుపదేశింపవలసివచ్చినది. ఈ విషయమై ఆరంభమనియు, పరిణామమనియు వివర్తమనియు మూడు విధములుగా శాస్త్రము జనుల బోధనార్థ ముపదేశించుచున్నది. అనేక ద్రవ్యములు (పదార్థములు) పరస్పరము మిళితమై యొక నూతన వస్తువును ఉత్పన్న మొనర్చెనేని వానిని ఆరంభకము అనియెదరు. ఎట్లన, న్యాయమతమున (తర్క శాస్త్రమున) అనేక పరమాణురూపద్రవ్యములు పరస్పరము మిళితములై తమకంటె విలక్షణమైన నూతనజగత్తును సృజించుచున్నవి. కాన, పరస్పరము మిళితమైన అనేక పరమాణువులు ఈజగత్తుయొక్క ఆరంభకారణము లని వచింపబడుచున్నవి.

-: ప రి ణా మ వా ద ము :-

ఏ సావయవవస్తువు తన గుణ సత్తులతో సహా తన కార్యమున పరిణత మగుచు, కార్యముయొక్క ఉత్పాదకము అగునో దానిని పరిణామి యందురు. ఎట్లన, సావయవమగు దుగ్ధము శ్వేతరూపాదిగుణములతోడను తన వ్యావహారికసత్తతోగూడ దధిరూపకార్యమందు పరిణితమగుచు, దధియొక్క ఉత్పాదకమగుచున్నది. కాన దధియొక్క పరిణామకారణము, క్షీరమగుచున్నది.

-: వి వ ర్తా ధి ష్ఠా న ము :-

ఏ వస్తువు తనకంటె విషమమైన సత్తగల వస్తువును కలిగించుచు, ఆవస్తువుతోటి స్వయముగ నిర్లేపముగ నుండునో దానిని వివర్తాధిష్ఠాన

మందురు. ఎట్లన రజ్జువునందు ప్రతీతమగు సర్పమునకు ప్రాతి భాసిక సత్తగలదు. దాని యధిష్ఠానమగు రజ్జువునకు వ్యావహారికసత్త గలదు. ఈవిధముగ తనకంటె విషమసత్త గల సర్పమును రజ్జువు కలిగించు చున్నది. ఏలన దానియందే కల్పిత సర్పముయొక్క ఉత్పత్తి యగుచున్నది మరియు, ఆ రజ్జువు త్రికాలములందును ఆసర్పముతోటి నిర్లేపముగ నున్నది. కాన రజ్జువునందు కల్పింపబడిన సర్పమునకు రజ్జువు వివర్తాధిష్ఠాన కారణమై యున్నది.

వివర్తవాదము వేదాంతశాస్త్రమున ప్రసిద్ధమైయున్నది. ఈ విషయమై అనేక వేదాంతదర్శనగ్రంథము లేర్పడి యున్నవి. దీనియందు అలక్ష్యము లన్నియు విస్తరించి చెప్ప బూనలేదు. అది విచారసాగరము వృత్తి ప్రభాకరము, అద్వైతసిద్ధి మొదలగు ఉన్నత గ్రంథములలో గనదగును. ఆలాటి గ్రంథములలోగల సారమును గ్రహించుట మిక్కిలి కష్టసాధ్యము. అవి తర్క జటిలములై యుండుటయే గాక కొన్ని సంస్కృత విరచితములై యుండుటవల్లను, అందరికిన్ని తెలుసు కొనుటకు సాధ్యముకాదు. తనయొక్క ఆత్మకు ప్రకృతినుండి విముక్తి గలుగుటకు అవి యన్నియు చదువవలసిన అవసరములేదు. సాధనచతుష్టయ సంపత్తిగలిగి ధ్యానపరులై వేదాంత బ్రహ్మవిచారము చేసిన చాలును. కనుకనే "యోగం జ్ఞానంచ యస్యాస్తి తీర్ణస్తేన భవార్ణవః" యని శాస్త్రము నిశ్చయించుటకు కారణమైనది, దీనివల్ల యోగమొకటి మాత్రము చాలదనియు, జ్ఞానము నిలుచుటకు యోగము సహాయ మనియు, నుపదేశించుటైనది. కావుననే యోగమున్ను జ్ఞానమున్ను ఏసాధువునకు గలదో అతడు మాత్రము భవసాగరమును తరించగల డని చెప్పబడినది. ఇట్లు శాస్త్రము చెప్పుటవల్ల యోగమే ముఖ్యమనియు, లేక విచారణయే ముఖ్యమైనదనియు చెప్పువారి వాక్యములు దుర్బలము లనిరూఢి యైనది. రెంటిని సమన్వయపఱచి చెప్పినది ఎంతో బాగున్నది. దీనివల్ల సాధనచతుష్టయసంపత్తి గలిగి ఆచరణలేని వేదాంతము ప్రయోజనకారి కాదనియు, సాధనపరుడై యోగాది అనుష్ఠానము కలిగిన వాడయ్యును. ఆత్మవిచారణ లేనిచో అదిన్ని ముఖ్య ప్రయోజనము కలుగచేయదనియు రూఢియైనది. ప్రపంచములోగల సర్వశక్తులు రెండు పదార్థములు వేరునవు దేర్పడుచున్నవను యథార్థము విచారించిన సృష్టియంతయు ద్వంద్వముల

ఐక్యమువల్లనే కలుగుచున్నది ఒకడు ప్రకృతియే (ప్రధానమే) సృష్టికి కారణమని చెప్పును. ఇంకొకడు పురుషుడే (ఈశ్వరుడే) సృష్టికి హేతువని వచించును. ఈ రెండు వాక్యములు కొన్నిటికి సంబంధించి యుండినను యథార్థముగా విచారించిన ప్రకృతి పురుషుల సంబంధమువల్లనే సృష్టి జరుగుచుండును. ప్రతిప్రాణుల సంతతియొక్క స్థితిని తెలిసికొనిన ఇది స్పష్ట మగును.

యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావర జంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ!॥

అని గీతావాక్యము ఒక రైలు ఇంజను చలించుటకు జలమే కారణమని యొకడున్ను, కాదు నిప్పే కారణ మని మరియొకడును వాదించినను, కొంతవఱకు సంబంధము చెప్పినను, నిప్పు నీళ్ళు రెండున్ను లేనిచో ఇంజను నడుచుటకు శక్తి కలుగదుకదా?

అలాగున విద్యుచ్ఛక్తికి రెండువిధములగు ప్రాణశక్తులు గలిగినపుడే ఉద్భవించును. ఇవి రెండున్ను కలియక విద్యుచ్ఛక్తి ఏర్పడుటగాని, దీపము ప్రకాశించుటగాని, యంత్రము నడచుటగాని కలుగదు. అలాగున పొటాషియమున్ను, మణిశిలయున్ను కలియునపుడే నిప్పు ఏర్పడును. వీనిలో నొకదానివల్ల అగ్ని యుద్భవింపజాలదు. అట్లే ప్రతిప్రాణికోట్లున్ను ప్రాణాపానములనియెడు రెండువిధములగు ప్రాణశక్తులవల్లనే జీవించుచున్నవి. లేనిచో ఒకజీవి గూడ జీవింపజాలదు. ఇదే యోగముయొక్కయు జ్ఞానముయొక్కయు ఐక్యముచే గలిగెడు ఫలితమని గ్రహించుకొనవలయును. పై జెప్పిన వేదాంత గ్రంథములన్నియు ముక్తిని పొందుటకు అభిలాషగల ముముక్షువున కక్కరలేదు. ఎట్లన, పెద్ద యుద్ధములకుమాత్రమే అనేక ట్యాంకులు, పిరంగులు, విమానములు మఱఫిరంగులు,బాంబులు మొదలైనవి కావలసియుండునుగాని, తమయొక్కరి ఆత్మనాశనమునకు ఇవి ఏమియు నక్కరలేదు.చిన్నదైనయొక్క ఆయుధముగాని, స్వల్ప విషపదార్థముగాని చాలును. శాస్త్రార్థవాదములు చేయువారికిగాని, మతములు స్థాపించు వారికిగాని పైన జెప్పిన గ్రంథములు కావలసియుండును, జీవన్ముక్తి నొంది నిత్యశాంతిలో నిరతిశయ సుఖములో నుండగోరువారికి అవి ఏవియు నక్కరలేదు. వారికి శ్రీభగవద్గీత కఠోపనిషత్తు మొదలగు కొన్ని గ్రంథముల విచారణ చాలును. దీనికిగూడ, శక్తిలేనివారు

పవిత్ర ఆచరణగల బ్రహ్మనిష్ఠులవల్ల ధ్యానక్రమములు తెలిసికొని యాచరించిన తప్పక విముక్తు లగుదురు. రోగము కలవాడు డాక్టరు పరీక్షప్యానయిన తరువాతగూడ ఔషధసేవ చేయవలయునని విధి గలదుకదా! గొప్ప డాక్టరైనను తనకు రోగము వచ్చినపుడు ఔషధసేవయు, పథ్యమున్ను లేక ఆరోగ్యము కలుగునా? కావున శాస్త్రము చదివినను, చదువక పోయినను శుద్ధమైన అనుష్ఠానమొకటి యుండిన చాలును. కాని అనుకూలము కలవారు శాస్త్రములను చదువుటకై యత్నించవలయును. విద్యాశూన్యమైన దేశముగాని, సంఘముగాని క్షయించును. కావున మహాపురుషులందరు విద్యాభివృద్ధికి తోడ్పడుటకు కారణమైనది కాని యథార్థముగ విచారించిన అంతఃకరణములో గల అవిద్య నశించుటయే విద్యయొక్క ప్రయోజనమగును. అది కేవలము ఈశ్వరభక్తిచేతను, మహనీయులగు గురువుల కరుణచేతను, ముముక్షువులకు గలుగును. అట్టి అంతఃకరణము శుద్ధముగాని పామరునియొక్కయు పండితునియొక్కయు హృదయము ఏకరీతిగానే యుండును.

రాగద్వేషాదులు, దృశ్యవిషయములు, ఉభయమున్ను ఇరువురికి ఒకేవిధముగా కన్పించుటవల్ల ఆత్మసంస్కారము లేని విద్య జ్ఞానప్రాప్తికి గాని, ఈశ్వరకరుణకుగాని, తనయాత్మశాంతికిగాని, జీవన్ముక్తిసుఖమునకుగాని ఉపయోగపడదని స్పష్టముగా తెలిసికొనవచ్చును. వివర్తభావము రజ్జువును చూచి సర్పమనియు' రాత్రులలో స్తంభమును జూచి దయ్యమనియో, దొంగ యనియో, శుక్తిని చూచి వెండి యనియు, ఎండ మావులను చూచి జలమనియు, ఆకాశమును జూచి నీలవర్ణమనియు గలిగెడు భ్రాంతి ఏదికలదో దీనినే వివర్తమనియెదరు. యథార్థము తెలియకపోవుటచేతనే ఒక వస్తువును మరియొక వస్తువుగా చూడడమైనది ఆలాగున ఆత్మయొక్క నిజమగు జ్ఞానమును పరిశీలింపక పోవుటవల్లనే భ్రాంతిజ్ఞానము కలుగుచున్నది. ఈ భ్రాంతి మాయ వల్లనే ఏర్పడుచుండును. అని వేదాంతముయొక్క సారము సంగ్రహముగా చెప్పడమైనది. ఇది గొప్పదియగు సూర్యబింబము చిన్న అద్దములోగాని, జలపాత్రలోగాని ప్రతిబింబించినట్లుండును. ఈ విషయమై గీతయందు శ్రీకృష్ణభగవానుడు సప్తమాధ్యాయమున ఇట్లుపదేశించెను—

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే॥

దేనిని తెలిసికొనిన పిమ్మట ఈ మోక్ష మార్గమున తిరిగి మరి యొక్క యుపాయము తెలియవలసినదిగా మిగిలియుండదో అట్టి అను భవముతోగూడిన జ్ఞానమును నేను నీకొఱకు చెప్పబోవుచున్నాను అని భావము. అదే విధముగా ఆఱవ అధ్యాయమున,

జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః॥

ఆత్మానాత్మ విచారణ పరమగు శాస్త్రజ్ఞానము చేతను, అదే విధముగా అనేక పెద్దలవల్ల శ్రవణముచేసిన జ్ఞానముచేతను, అట్లే తనయొక్క విద్య చేత విమర్శచేసిన వివేకజ్ఞానముచేతను తృప్తి పొందిన వాడును నిశ్చలమైన మనస్సు గలవాడును, ఇంద్రియ నిగ్రహము కలవాడును యోగి యనంబడును. అనగా జ్ఞాని యని యర్థము ఈ ప్రకారముగా నుపదేశించు టచే జ్ఞానము వేఱుగాను, విజ్ఞానము వేఱుగాను, బోధపడుచున్నది. ఇచట విజ్ఞానమనగా జ్ఞేయముని గ్రహించవలయును. జ్ఞేయమనగా తెలిసికొనదగిన వాని యన్నిటిలోను ముఖ్య విషయమని తాత్పర్యము. ధ్యేయమనగా ధ్యానముచేత పొందదగిన దైవప్రాప్తి యనియర్థము, ఈజ్ఞానవిజ్ఞానవిష యమై-గీ- 13 అధ్యాయమున అర్జునుడు ప్రశ్న చేసియున్నాడు—

"ఏతద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ" - ఇచట జ్ఞాని కుండవలసిన గుణములు జ్ఞానమనియు, ఈజ్ఞానమే అమానిత్వాదు లనియు ఈయధ్యాయమున 8వ శ్లోకము మొదలు 12వ శ్లోకము వఱకు ఇఱువది గుణములను శ్రీభగవంతు డుపదేశించెను. ఈ ఇరువది గుణములు కలిగి యుండినమాత్రమే జ్ఞేయమును పొందుటకర్హత గలిగినదని గ్రహింపదగినది మరియు ఈజ్ఞానము కలిగిన మాత్రముచే తృప్తి బొందకూడదనియు, తన యొక్క పని పూర్తి అయిన దనియు గమ్యస్థానము పొందబడినదనియు, కృతార్థుడనైతిననియు తలంచరాదు. జ్ఞేయమును పొందునపుడే తన పని పూర్తి అయినదనియు, అపుడు మాత్రమే అమృతత్వము అనగా మోక్షము కలిగెననియు తలంచవలయునని శ్రీభగవంతుడే యుపదేశించినాడు

జ్ఞానమనగా నొక ఉన్నతోద్యోగమునకు తగినపరీక్షలో ఉత్తీర్ణుడైనటు వంటిదని గ్రహింపదగును. పరీక్షలో నుత్తీర్ణుడైనంతమాత్రమున ఉద్యోగము లభింపనిచో యా విద్యవల్ల గలిగెడు సౌఖ్యమును పొంపజాలడు గదా? కాని పరీక్షయందు విజయము గాంచనియెడల యుద్యోగము లభించదు ఇదియే దీనిలో గల సారము. కనుకనే శ్రీకృష్ణభగవానులు అమానిత్వాది జ్ఞానము నుపదేశించిన తరువాత పదమూడవ శ్లోకమునుండి—

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్‌జ్ఞాత్వాఽమృత మశ్నుతే।

యని తెలిపెను. అమృతత్వము కలిగిన మాత్రముననే జీవుడు జననమరణదుఃఖములనుండి విడివడును. అప్పుడే నిత్య శాంతియు, నిరతిశయ సౌఖ్యముల్ను, సర్వ బంధ విముక్తి యున్ను కలుగును. వేరు లన్నియు తెగిపోయిన వృక్షమేలాగున ఎండిపోవునో యాలాగున సంస్కారము లన్నియు నశించిన,జీవుడు ప్రకృతి నశించినవాడగును కావున జ్ఞేయము ఆఖరుస్థితియని తెలియ తగినది. దీనినే ధ్యేయమని గూడ గ్రహించదగిన దని ఇదివఱలో తెలుపబడియుండెను. ఈ జ్ఞేయమునే ఉపాసనామత ప్రకారము సాకారద్వైవ సాక్షాత్కారమనియు, సాంఖ్యమత ప్రకారము సాక్షిత్వమనియు, యోగ మతప్రకారము స్వస్వరూప సాక్షాత్కార మనియు చెప్పుదురు. వేదాంత సిద్ధాంత ప్రకారము బ్రహ్మసాక్షాత్కార మనియు గ్రహించదగినది. బౌద్ధ మతమున జెప్పిన పరమ నిర్వాణపదవియు నిదియే యగును.

ఇక ప్రపంచములో గల సర్వమతస్థుల గమ్యస్థానము లేవి గలవో అవియన్నియు, ఈ జ్ఞేయధ్యేయములని మనము తెలిసికొన్న చాలును. జైనమతస్థులు చెప్పెడు "అర్హత్" పదమున్ను ఇదియే, దీనినే జీవన్ముక్తి పదవి యని అందరున్ను అంగీకరించియున్నారు. అట్టి యవస్థ కలిగిన పిమ్మట జనన మరణాది క్లేశములు జరా నీరాది వ్యాధులు అనుభవించ వలసిన పనిలేదనియు చెప్పుదురు. ఆ స్థితి కేవలము అనంతానందమనియే శాస్త్రములు తెలుపు చున్నవి. ఆత్మవేత్తలగు మహనీయులున్ను దానినే నిశ్శేష శోకశాంతి, అతి హర్షమనియు తెలిపిరి ఈ జ్ఞేయమునే కొన్ని భాషలలో కొందరు స్వర్గమనియు, మరికొందరు ఈశ్వరస్థాన ప్రాప్తి

యనియు, ఇంక కొందరు వైకుంఠనివాస మనియు. వేరే కొందరు కైలాస ములో నివసించుట యనియు మరి కొందరు సర్వావరణరహితమగు స్వయం ప్రకాశమనియు, కొంద రాత్మవిముక్తియనియు. మరికొందరు ముక్తి యనియు, ఇంకకొందరు జీవన్ముక్తియనియు వేఱే కొందరు విదేహముక్తి యనియు, కొందరు నిర్వికల్పసమాధియనియు పేర్లుమాత్రము వేఱువేఱుగా చెప్పుదురేకాని మరి ఏలాటి భేదమున్ను దీనియందు లేదు.

గీతాచార్యులగు శ్రీకృష్ణ భగవానుని మతప్రకారము జ్ఞానమున్ను, జ్ఞేయమున్ను వేఱువేఱుగా భావించుచున్నట్లు మనమిప్పుడు తెలిసికొన్నాము. కాని కొన్నిస్థలములలో జ్ఞానమునకే జ్ఞేయమని అర్థము గలదనియు తెలిపి యున్నాము. కనుకనే ఈ 13వ అధ్యాయమున, జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది 'సర్వస్య విష్ఠితమ్' అని చెప్పుటకు కారణమైనది. "జ్ఞానగమ్యం" ఇచట జ్ఞానమునకే జ్ఞేయమనియు, జ్ఞేయమునకు జ్ఞానమనియు అర్థము గలదనియు తెలిసి అట్టిజ్ఞేయ బ్రహ్మము సర్వ ప్రాణికోట్ల హృదయమందు వెలుగుచుండెడి ఆత్మ యని యుపదేశించిరి. ఇట్లు చెప్పుటచే అమానిత్వాది జ్ఞానముగలవారు మాత్రమే జ్ఞేయమగు బ్రహ్మమును పొందగలరని స్పష్టముగా చెప్పినారు. ఇది అమృతము, శివమును, ఆనందము, అద్వైతము.

ఇట్టి జ్ఞేయబ్రహ్మమును, అనగా ముక్తిని జీవించియుండునప్పుడే పొందవలయును. కావుననే జీవన్ముక్తియని చెప్పుచున్నారు. దేహాంత్యములో జీవుడు ఏయవస్థను పొందియుండునో దాని కనువగు స్థానము మాత్రమే దేహ వియోగానంతరము సిద్ధించును, అంత్యకాల స్థితి ననుసరించియే పర లోకమందును, పునర్జన్మ గలుగునపుడున్ను కలుగును. దేహ ముండునపుడు మాత్రమే మార్పు చేసికొనుటకు మనకు శక్తికలిగియుండును. పరలోక ప్రయాణమందుకాని, పరలోకమందుగాని మరుజన్మమును మార్చుటయందు జీవులకు శక్తిగలగియుండదు. ఆ పరలోక వాసమున్ను, మఱల వచ్చెడి జన్మమున్ను కర్మాధీనము, కావున అచట స్వప్రయత్నము కలుగదు.

పాశముచే బంధింపబడిన పశువు ఏలాగున బంధనమునకు లోబడి యుండవలయునో కర్మపాశమున్ను అటువంటిది. పాశము పట్టుకొని వెళ్ళెడు మనుజు ననుసరించి పశువులు ఎట్లు పోవలసియుండునో, కర్మబద్ధులగు

జీవులయొక్క స్థితియున్ను అటువంటిది. లేక విత్తనము పెట్టునపుడు దానియొక్క ఫలమును తెలిసికొని పెట్టు శక్తి ఏలాగున మానవునకు కలిగియుండునో అట్లుగాక పైరుపెట్టిన తరువాత ఏలాగున మార్చుచేసి కొనుటకు తరముగాదో, రాబోవు సంవత్సరమున ఆ ధాన్యమునే భోజనము చేయవలసి యుండునో కర్మయొక్క రీతియు నిటువంటిది. పరలోక నివాస మున్ను, మఱలవచ్చెడు జన్మమున్ను మనయొక్క హస్తగతముగా నుండును. దానిని మనము ఇపు డిష్టము వచ్చినట్లు మార్చుకొన వచ్చును. ఇదే మానవుని యొక్క స్వబుద్ధివిశేషము; సంచితకర్మ విడిచిపెట్టిన బాణము వంటిది. అది ప్రారబ్ధరూపముగా ఇపుడు వచ్చినది. ఆగామికర్మ అనుసంధించిన బాణము వంటిది మన ఇష్టము ననుసరించి దానిని ఉపసంహరించుకొనవచ్చును. లేక లక్ష్యమును మార్చుకొనవచ్చును. ఇదే ముముక్షువులు వివేకమువల్ల కర్మను మార్చుకొనెడు ఉపాయమన తెలియదగినది కనుక

స్వపంతం వాపి భుంజానం గచ్ఛంత మపి వర్త్మని।
యువాన మపి బాలం వాస్వవశే కురుతే కురుతే విధిః॥

నిద్రించువాడైనను, భుజించువాడైనను, మార్గములో సంచరించు వాడైనను, యువకుడైనను, బాలుడైనను విధి అనగా కర్మమునకు అధీనుడు కావలసియుండును, జీవించియున్నపుడే జీవన్ముక్తిని పొందవలయునని శ్రుతిస్మృతులు ఏకకంఠముగా చెప్పుచున్నవి.

గీత. అ॥ 5 ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణితే స్థితాః॥

ఎవరియొక్క మనస్సు బ్రహ్మము మొదలు స్తంబమువఱకుగల చరాచర ప్రాణికోట్లలో సమానమగు దైవభావ విషయమందు స్థిరముగా నుండునో, వారిచేత ఈశరీరముతో నుండునపుడే (జీవించియుండునపుడే) జననమరణ రూపసంసారము జయింపబడినది. దీనివల్ల, జీవించియున్న ప్పుడే జన్మరాహిత్యము కలుగవలయునని సిద్ధమగుచున్నది.

శక్నోతీహైవయస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్।
కామక్రోధోద్భవం వేగం న యుక్తస్ససుఖీ నరః॥

కామము వలనను కోపము వలనను పుట్టిన క్షోభమును. ఇచటనే అనగా ఈ దేహమునందున్నప్పుడే సహించుటకు (అణచుటకు) ఏమనుష్యుడు సమర్థుడగుచున్నాడో, వాడు యోగియు, ఆత్మానుభవముగల జ్ఞానియు అగుచున్నాడు. అట్టివాడు మాత్రము నిరతిశయ బ్రహ్మానుఖమును పొందగలుగును గీతాచార్యులు ఉపదేశించిన ఈ వాక్యము జిజ్ఞాసువులు చాలా జాగ్రత గలిగి చింతన చేయవలసియుండును ఇక ఈవిషయమై కఠోపనిషత్తు ఏమి చెప్పుచున్నదో చూడుడు.

ఇహ చేదశకద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః।
తతస్సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే॥

ఈ దేహము పడిపోవుటకంటె ముందు, ఈలోకమునందే బ్రహ్మాత్మజ్ఞానబోధమును, తెలిసికొనుటకు అసమర్థుడైన యెడల భూర్భువాది ఊర్ధ్వలోకములలోగాని, అతల వితలపాతాళ లోకములలోగాని శరీర భావమునకు (జన్మమెత్తుటకు) సమర్థుడగుచున్నాడు. కావున పాంచ భౌతికమగు శరీరము పడిపోవుటకు ముందే ఆత్మావబోధ ప్రయత్నము చేయదగినదని భావము. ఈశ్రుతి, మానవజన్మయొక్క శ్రేష్ఠత్వమును తెలుపుచున్నది. జ్ఞానమువల్ల మనుజుడు శ్రేష్ఠుడని చెప్పుచున్నప్పటికిన్ని మనుష్య జన్మ మొకటి మాత్రమే బ్రహ్మమును తెలుసుకొనుటకు అర్హమగు సృష్టి గలిగియున్నదను రహస్యమును ఉపదేశించియున్నది. ఇట్టి యోగ్యత దేవతలకు కూడ లేదు, కావుననే దేవతలతో సహా మానవ జన్మమెత్తి తపోయోగాదులననుష్ఠించి జ్ఞానము పొంది, ముక్తినొందవలయునని శాస్త్రము చెప్పెడు రహస్యము.

యథాఽఽదర్శే తథాఽఽత్మని యథా
స్వప్నే తథా పితృలోకే।
యథాప్సు పరీవదదృశే తథా గన్ధర్వలోకే
ఛాయాతపయోరివ బ్రహ్మలోకే॥

ఏవిధముగా అద్దమునందు తన ప్రతిబింబము స్పష్టముగా కనబడుచున్నదో అదేవిధమున మనుష్య జన్మబుద్ధియందు ఆత్మదర్శనము ...

ష్పష్టముగా అగుచున్నది. ఏ విధముగా స్వప్నమునందు తన స్వరూపము వికారముగ కనపడుచుండునో, అలాగున పితృలోకమునందు ఆత్మదర్శనము అస్పష్టముగా కన్పించును. జలములం దేవిధముగా తన ప్రతిబింబము స్పష్టముగాక, సంకీర్ణమైన అవయవములుగలదిగా అంతట చూడబడుచున్నదో, అదేవిధముగా (గంధర్వలోకము) స్వర్గలోకమునందు అస్పష్టముగా చూడబడుచున్నది.

బ్రహ్మలోకే-బ్రహ్మలోకమునందు నీడ ఎండలయందువలె అస్పష్టముగా కన్పించును:— దీనివల్ల మనుష్యజన్మబుద్ధియొక్క విశేషము గొప్పతనము గ్రహించుకొనదగినది. ఇక ఈ విషయమై మానవలోకముయొక్క ప్రాశస్త్యమును గురించి గరుడపురాణమున విష్ణుభగవాను లుపదేశించినది చూడుడు.

ఇహైవ నరకవ్యాధేశ్చికిత్సాం న కరోతి యః।
గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి॥

ఎవడు నరకమనెడి వ్యాధికి ఈలోకమున ఈదేహముతో కూడియున్నప్పుడే జ్ఞానమనెడు చికిత్స చేయడో వైద్యుడున్ను, ఔషధమున్ను లేని పరలోకములకువెళ్ళి ఆరోగి ఏమి చేయగలడు. కనుక ఈ మానవజన్మమునందే భవరోగ శమనమునకు తగిన భవరోగవైద్యులును, జ్ఞానోపదేష్టయగు ఆచార్యుడును, బ్రహ్మవిచార మనెడు ఔషధమున్ను గలదు. కాని స్వర్గాదిలోకములలో ఈ రెండున్ను లేవు. అది ఎటువంటిదనగా, ఔషధమున్ను, వైద్యుడున్ను, వైద్యాలయమున్ను, అనుకూలపథ్యమున్ను గల స్థలములో రోగి ఔషధసేవ చేయక, పైన చెప్పిన ఔషధ వైద్యులులేని ప్రదేశములలో వెళ్ళి రోగమును బాగుచేయించుటకు చూచే లాగున నుండును.

చతురశీతి లక్షేషు శరీరేషు శరీరిణామ్।
న మానుష్యం వినాఽన్యత్ర తత్త్వజ్ఞానం తు లభ్యతే॥

ఎనుబదినాలుగు లక్షల శరీరములయందును జీవులకు మనుష్యజన్మమున తప్ప ఇతర జన్మలలో తత్త్వజ్ఞానము లభింపదని భావము.

సోపానభూతం మోక్షస్య మానుష్యం ప్రాప్య దుర్లభమ్।
యస్తారయతి నాత్మానం తస్మాత్పాపతరోఽత్రకః॥

మోక్షమునకు సోపానభూతమును దుర్లభమునగు మనుష్య జన్మమును పొందియు ఎవడు ఆత్మకు తరణోపాయము చూచుకొనడో, వానికంటె పాపుడెవడు? మఱియు ఇట్టి మనుజజన్మములో వార్ధక్య దశ వచ్చుటకు ముందుగానే జ్ఞానప్రాప్తికి తగిన కార్యము చేసికొనవలయునని యుపదేశించు చున్నది—

యావన్నాశ్రయతే దుఃఖం యావన్నాయాంతి చాపదః।
యావన్నేంద్రియవైకల్యం తావచ్ఛ్రేయస్సమభ్యసేత్।
యావత్తిష్ఠతి దేహోఽయం తావత్తత్త్వం సమభ్యసేత్।
సందీప్తే కోణభవనే కూపం ఖనతి దుర్మతిః॥

ఎంతవఱకు దుఃఖములు సంప్రాప్తములు కావో, ఎంతవఱకు ఆపదలు రావో, ఎంతవఱకు ఇంద్రియవికలత్వము కలుగదో, ఎంతవఱకు జరామరాదులు బాధింపవో, అంతవఱకే ఆత్మశ్రేయస్సును (జ్ఞానమార్గమును) చూచుకొనవలయును. అట్లుచేయక, యౌవనకాలమంతయు వ్యర్థపఱచి అంత్యకాలమున మోక్షమును సంపాదించుకొనవచ్చునని తలంచెడిది ఎటు వంటిదనగా, ఇంటి చుట్టుగిలు నిప్పంటుకొన్న తర్వాత అనిప్పును చల్లార్చుటకు నీటికొఱకు నూయి త్రవ్వుటకు ప్రారంభించెడు వాడెంత మూఢుడో అటువంటిదని జ్ఞాపకముంచుకొనవల్లయును. ఇక మాయయొక్క మహిమ ఎటువంటిదో తెలుపుచున్నాడు.

పశ్యన్నపి ప్రస్ఖలతి శృణ్వన్నపి న బుధ్యతి।
పఠన్నపి న జానాతి దేవమాయావిమోహితః॥

దేవమాయావిమోహితుడు చూచుచున్ననుగూడ జారిపడుచున్నాడు. వినుచున్ననుగూడ బోధపఱచుకొనలేకున్నాడు. చదువుచు నైతము తెలిసికొనలేకపోవుచున్నాడు. అనగా మాయామోహముచే చూచియు అంధుడగుచున్నాడు. వినియు బధిరుడగుచున్నాడు. చదివియు గ్రహింపజాలకు

న్నాడు. హఠయోగప్రదీపిక ప్రారంభములోనే కేవలము జ్ఞేయమగు బ్రహ్మ ప్రాప్తికొఱకే యమనియమాది అష్టాంగ యోగము ఉపదేశింపబడుచున్నదని తెలుపబడినది.

శ్రీఆదినాథాయ నమోఽస్తు తస్మై
యేనోపదిష్టా హఠయోగవిద్యా।
విభ్రాజతే ప్రోన్నతరాజయోగ
మారోఢుమిచ్ఛోరధిరోహిణీవ॥

మిగుల శ్రేష్ఠమైన రాజయోగము నధిరోహించుటకు (ఎక్కుటకు) కోరికగలవారికి నిచ్చెనవలె ప్రకాశించు హఠయోగవిద్య నుపదేశించిన శ్రీ ఆదినాథులకు నమస్కారము. అనగా జ్ఞేయమగు బ్రహ్మపదము నెక్కుటకు అష్టాంగ యోగములు నిచ్చెన వంటివని తెలుపడమైనది.

ప్రణమ్య శ్రీగురుం నాథం స్వాత్మారామేణ యోగినా।
కేవలం రాజయోగాయ హఠవిద్యోపదిశ్యతే

తన గురువైన గోరక్షనాథులను భక్తిపూర్వకముగా నమస్కరించి స్వాత్మారామయోగిచేత కేవలము రాజయోగము సిద్ధించుకొఱకు హఠవిద్య యుపదేశింపబడుచున్నది. కేవలము "రాజయోగాయ" అని ప్రయోగించుటవల్ల ఆత్మసాక్షాత్కార జ్ఞానముకొఱకు హఠవిద్య యుపదేశింపబడెనని తెలిసికొనదగును. ఇట్లు ఈ గ్రంథముయొక్క ఆదియందు ఉపదేశింపబడినదేగాక అంత్యమందు గూడ ఈతత్త్వముపదేశింపబడినది. కావున సాధనలోనే కాలము గడుపక జ్ఞేయ బ్రహ్మమును పొందుటకై యత్నించవలయును

సర్వే హఠలయోపాయా రాజయోగస్య సిద్ధయే।
రాజయోగసమారూఢః పురుషః కాలవంచకః॥

హఠోపాయములును, లయోపాయములును అగునవి యన్నియు రాజయోగము నిమిత్తము చెప్పబడెను.

ఇక ఈ జ్ఞేయస్థితిని గుఱించి ఉత్తరగీతయందు శ్రీకృష్ణపరమాత్మ ఉపదేశించినది చూడదగినది. ఉత్తరగీతయని చెప్పుటలోనే శ్రీ భగవద్గీత

పూర్వగీతయని ఏర్పడుచున్నది. ఉత్తరగీత కేవలము బ్రహ్మనిర్వాణమును గూర్చి ఉపదేశింపబడినది కావుననే ప్రథమమున ఈక్రిందిశ్లోకము నడుగడమైనది. జీవితములో నాలుగు భాగములు కలవు, బ్రహ్మచర్యము, గృహస్థము పూర్వాశ్రమ మనియు, వానప్రస్థము, సన్యాసము ఉత్తరాశ్రమ మనియు శాస్త్రసమ్మతము. పూర్వాశ్రమమున అంతఃకరణశుద్ధికొఱకు ధర్మోపాసనలను బోధించుచుండును. ఇది కొంత ప్రపంచముతో సంబంధించి యుండును. ఉత్తరాశ్రమమున నిర్విషయ నిర్వాణమును మాత్రముపదేశింపను, ఇదియే జీవునియొక్క పరమార్థ దశ యగును.

హృదయాంబుజమధ్యస్థం జ్ఞానజ్ఞేయస్వరూపకమ్।
తత్క్షణాదేవ ముచ్యేత యయద్ జ్ఞానాద్బ్రూహి కేశవ॥

ఓ కేశవా! ఏది హృదయకమలమధ్యమందుండునదై, జ్ఞానజ్ఞేయ స్వరూపము కలదియైయుండునో! దేనిని తెలిసికొనుటవలన తక్షణము నందే ముక్తినొందనగునో అట్టిజ్ఞానమును నాకు ఉపదేశింపవలయును. దీనియందు, "జ్ఞాన జ్ఞేయ స్వరూపకం" అని చెప్పుటచే కేవలద్వైతజ్ఞానమునే జ్ఞేయమని తెలిసికొనవలయును. గీతయందు జ్ఞానము వేరుగాను జ్ఞేయమును వేరుగాను తెలుపుచు జ్ఞానమునకే జ్ఞేయమనియు అర్థము గలదనియు తెలుపడమైనది.

ప్రాప్తే జ్ఞానేన విజ్ఞానే జ్ఞేయే చ హృది సంస్థితే।
లబ్ధశాన్తిపదే దేహే న యోగో నైవ ధారణా॥

జ్ఞానముచేత పరమాత్మజ్ఞానము పొందబడినదగుచుండగను, జ్ఞేయము (పరబ్రహ్మము) హృదయమునందు ప్రకాశించుచుండగను జీవుడు లబ్ధశాంతి గలవాడగుచుండగను యోగములేదు, ధారణయు లేదు. గమ్యస్థానము చేరువరకుమాత్రముగదా గమనము కలుగును. అలాగున యోగమున్ను ధారణయున్ను జ్ఞేయైకస్థితి పొందుటకే యుండును. తరువాత సాధన, అనుష్ఠానము అవసరము లేదని యర్థము కాదు. నదియొక్క గమనము సముద్రమును చేరుటకే యుండును. మఱల ఏమగుచున్నది? గమనమాగి అనంతమైన సాగరమగుచున్నది. దీనియందు చెప్పిన జ్ఞానమున్ను, విజ్ఞానమున్ను జ్ఞేయైకస్థితి పొందుటకొఱకని రూఢిపడినదిగదా?

ముహూర్తమపి యో గచ్ఛేన్నాసాగ్రే మనసా సహ।
సర్వం తరతి పాప్మానం తస్య జన్మ శతార్జితమ్॥

నాసికాగ్రభాగమునందు అనగా జ్ఞేయబ్రహ్మమునందు, మనస్సుతో గూడ క్షణము సేపైనను, తత్త్వజ్ఞానార్థము నిశ్చలస్థితిని ఎవడు పొందునో అట్టివాడు వందలకొలది జన్మములలో ఆర్జించిన పాపము సర్వమును దహింపచేయుచున్నాడు.

అహం బ్రహ్మేతి మాంధ్యాయేదేకాగ్రమనసా సకృత్।
సర్వం తరతి పాప్మానం కల్పకోటిశతైరపి॥

ఎవడు నిశ్చల మానసముచే తానే బ్రహ్మమని నన్ను పలుమారు ధ్యానము చేయునో అనగా ఆబ్రహ్మమే భగవత్స్వరూపమనియు, ఆ భగవత్స్వరూపమే తనయొక్క స్వరూపమని ఎవడు ధ్యానము చేయునో వాడనేక నూఱుకోట్లకల్పములందు చేయబడిన సమస్తమైన పాపమునుండి తరించుచున్నాడు.

ఘటసంవృతమాకాశం లీయమానే యథా ఘటే।
ఘటో నశ్యతి నాకాశం తద్వజ్జీవః పరాత్మని॥

ఘటము నశింపగా ఏ విధముగా ఘటమే నశించునుగాని ఘటావృతమైన ఆకాశము నశింపదో, అలాగున దేహము నశింపగా జీవుడు సత్సంస్కారబలముచే పరమాత్మనియందైక్యము నొందువాడగును. అనగా సత్యపరిపూర్ణుడగు పరమాత్మయే తానగునని భావము.

తపేద్వర్షసహస్రాణి ఏకపాదస్థితో నరః।
ఏకస్య ధ్యానయోగస్య కళాం నార్హతి షోడశీమ్॥

మానవుడు ఒంటికాలి యందున్నవాడై అనేకములైన వేల సంవత్సరములు తపస్సుచేసినను, బ్రహ్మాత్మైక్యమగు నొక ధ్యానయోగము యొక్క పదునాఱవదైన కళతో (ఫలముతో) సరిపోడు.

సర్వత్రావస్థితం శాన్తం న ప్రపశ్యేజ్జనార్దనమ్।
జ్ఞాన చక్షుర్విహీనత్వాదంధః సూర్యమివోదితమ్॥

అంతటను ఉన్నట్టివాడును, నిర్వికారుడును అయిన పరమాత్మను, ఉదయించిన సూర్యుని గ్రుడ్డివాడు చూడజాలని చందమున జ్ఞాన నేత్రము లేనివాడు చూడజాలడు.

అంతస్సంగం బహిస్సంగం ఆత్మసంగం పరిత్యజేత్।
సర్వసంగ నివృత్తాత్మా పశ్యేదాత్మాన మాత్మని॥

లోపలి సంబంధమును, బాహ్యాసంబంధమును మనస్సంబంధమును వదలివేయవలయును. తన ఆత్మయందు పరమాత్మ నెఱుంగవలయును. దీనియందు మూడు సంగములు చెప్పడమైనది. మొదట ప్రపంచముతో గల సంబంధము లన్నిటిని విడువవలయును. రెండవది దేహముతో సంబంధముగల భావములను త్యజించవలయును. మూడవది ఆత్మకు అనాత్మ స్వరూపమగు మనోబుద్ధ్యాదులతో గల సంబంధము త్రుంచవలయును. ఈలాగున సర్వసంగములను త్యజించినవాడు మాత్రమే ఆత్మయందు పరమాత్మను దర్శింపగల్గును. ఈశ్లోకమును అర్థముచేసికొనిన తన యొక్క సంగత్యాగము ఎంతవఱకు కలిగినదని తెలిసికొనవచ్చును. లోకమునకు దేహమునకున్ను గల సంబంధమొకటి. దేహమునకు మనస్సునకుగల సంబంధము రెండవది. మనస్సునకు ఆత్మకుగల నంబంధము మూడవది, ఇవన్ని తొలగినపుడు మాత్రమే మేఘమువదలిన నిర్మలా కాశమునందుండు సూర్యునివలె హృదయాకాశమందు స్వప్రకాశ స్వరూపుడగు తన ఆత్మను దైవమయముగా చూడగలుగును. అంతవఱకు బాగుగా వెలుగుచుండు దీపమును పాత్రచేత మూసిపెట్టినట్లుండును.

నిర్మథ్య చతురో వేదాన్మునినా భారతం కృతమ్।
భారతోదధి మంథస్య గీతా నిర్మథనస్య చ।
సారముద్ధృత్య తం కృష్ణో అర్జునస్య ముఖేహుతమ్॥

నాలుగు వేదములను గోవులయొక్క సారమను క్షీరమును, శ్రీవ్యాస భగవానుడు పితికి తన తపస్సనెడు ఘటములోకాచి — పెఱుగు అనెడి భారతమను గ్రంథమును రచించెను. శ్రీ కృష్ణమూర్తి అట్టి భారతమను పెరుగు కడవను గీతయను కవ్వముచేత చక్కగా చిలికి సారభూతమగు

నవనీతమును గైకొని అర్జునుని నోటిలోనుంచిరి. మాండూక్యోపనిషత్తునందు ఈ జ్ఞేయమునే బ్రహ్మమనియు, తెలిసికొనదగిన విషయములన్నిటిలోను ఈజ్ఞేయ బ్రహ్మమే తెలి కొనదగినదనియు నుపదేశింపబడమైనది.

ప్రపంచోపశమం శాన్తం శివమద్వైతమ్।
చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః॥

ప్రపంచము శాంతి నొందినదిన్ని రాగద్వేష దోషములు లేనిదిన్ని పరిశుద్ధమునైనదియు నైన భేదములేని అద్వైతమునే తురీయమునుగా తలంచుచున్నారు. అది పరమాత్మ స్వరూపము, ఆపరమాత్మస్వరూపము తెలిసికొనదగినది.

త్రిషు ధామసు యస్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః।
స పూజ్యస్సర్వభూతానాం వన్ద్యశ్చైవ మహామునిః॥

మూడైన స్థానములయందు సమానత్వము ఏదియో ఆసమానత్వమును నిశ్చయమును బొందినవాడై ఎవడు తెలిసికొనుచున్నాడోవాడు సమస్తభూతములకును పూజింపదగినవాడును, నమస్కరింపదగినవాడును, గొప్పమునియును అగుచున్నాడు.

అకల్పక మజం జ్ఞానం జ్ఞేయాభిన్నం ప్రచక్షతే।
బ్రహ్మజ్ఞేయ మజం నిత్య మజేనాజం విబుధ్యతే॥

కల్పనారహిత మయినట్టియు, అజమయినట్టిదియు, జ్ఞానము జ్ఞేయము అగు బ్రహ్మమునకంటె అభిన్నమయిన దనియు, బ్రహ్మవిదులు పలుకుచున్నారు. ఆబ్రహ్మము జ్ఞేయము అజము నిత్యము సత్యమున్ను అగుచున్నది. అజమగు బ్రహ్మము అజమగుజ్ఞానముచేతనే తెలిసికొనబడుచున్నది, అనగా జ్ఞేయమే పరబ్రహ్మస్వరూపమనియు అదే బ్రహ్మనిష్ఠులు తెలిసికొనదగిన పరమపదమనిన్ని ఋషులున్ను వేదములున్ను ఉపదేశించుచున్నవి.

ఆత్మ సత్యానుబోధేన న సంకల్పయతే యదా।
అమనస్తాం తదాయాతి గ్రాహ్యాభావే తదగ్రహమ్॥

ఆత్మయే సత్యమని బోధించునట్టి శాస్త్రాచార్యోపదేశము ననుసరించిన జ్ఞానముచేత ఎప్పుడు సంకల్పించడో అప్పుడు అమనీభావమును, పొందుచున్నాడు. ఆమనస్సు గ్రాహ్యములేనప్పుడు విషయగ్రహణము లేనిదిగా అగుచున్నది.

అనగా ఎపుడు మనస్సు దృశ్యవిషయమును గ్రహింపకయుండునో దృక్స్వరూపమగు జ్ఞేయైకస్థితిలో నిలుకడ గలిగియుండునో. దానికే అమనస్కమని పేరు? బంధముక్తిగల జీవునియొక్క లక్షణ మీలాగుననే యుండును.

నిగృహీతస్య మనసో నిర్వికల్పస్య ధీమతః।
ప్రచారస్సతు విజ్ఞేయ స్సుషుప్తోన్యో న తత్సమః॥

నిరుద్ధమొనర్పబడినట్టియు, నిర్వికల్పరూపమైనట్టియు, వివేకుల మనస్సుయొక్క ఏప్రచారముకలదో ఆప్రచారము ముముక్షువులచేత విశేషముగా తెలిసికొనదగినది. సుషుప్తియందుగల ప్రచారము వేఱయినది. దానితో సమానమయినది కాదు. ఇచట సుషుప్తికిన్ని, సమాధికిన్ని గల భేదము నిరూపితమయినది. సుషుప్తియందు స్వబోధముండదు. సమాధి యందు ఆత్మబోధము కలిగియుండును. సుషుప్తిలో నిద్రనొందినవారిని ఎచ్చట నుంటున్నారు ఏకార్యము చేయుటకొఱకు వచ్చినారు? అని ఏమియు తెలియదు. ఆత్మైక్యబోధమగు సమతావస్థయను సమాధియందు తాను నిత్యుడు, స్వయంప్రకాశుడు, జ్ఞానైకస్వరూపుడు అను బోధము కలిగి యుండును. ఇచట సమాధి శబ్దమునకు సహజసమాధియగు ఆత్మైకబోధమని గ్రహించుకొనవలయును.

మనోదృశ్య మిదం ద్వైతం యత్కించిత్సచరాచరమ్॥
మనసో హ్యమనీభావే ద్వైతం నైవోపలభ్యతే॥

ఈ చరాచరాత్మకమగు ఈద్వైతము మనస్సే. మనస్సుయొక్క అమనీభావమునందు ద్వైతము పొందుట లేదుకదా? ద్వైతాద్వైతముల రహస్యము ఆత్మసాక్షాత్కారము కలుగునపుడే గోచరించునని ఈశ్రుతి యుపదేశించుచున్నది. చరాచరాత్మకమగు జగత్తంతయు మనస్సుచేత

కల్పితము.అట్టిమనస్సు శుద్ధమగునపుడు అద్వయమగు బ్రహ్మమొకటియేమిగిలి యుండును. అది చక్కని దృష్టాంతముచే క్రిందివాక్య మపదేశించుచున్నది.

అద్వయంచ ద్వయాభానం మనస్స్వప్నే న సంశయః।
అద్వయంచ ద్వయాభానం తథా జాగ్రన్న సంశయః॥

అద్వయమగు మనస్సు స్వప్నమునందు ద్వయాభాసమగుచున్నది. సంశయములేదు. అదేవిధముగా అద్వయమగు మనస్సు జాగ్రద్దశయందు ద్వయాభాస మగుచున్నది, సందేహములేదు.

యథా స్వప్నేద్వయాభాసం స్పందతే మాయయా మనః।
తథాజాగ్రద్ద్వయాభాసం స్పందతే మాయయా మనః॥

ఏ విధముగ స్వప్నమునందు మనస్సు మాయచేత ఆభాసద్వైతమును కలిగించుచున్నదో అదేవిధముగా జాగ్రద్దశయందు మనస్సు ద్వైతాభాసమును మాయచేత కలుగ చేయుచున్నది.

స్వప్నమునందు లేని జగద్విలాసము ఎట్లు కలుగుచుండునో, జాగ్రద్దశకువచ్చిన పిమ్మట అవి ఏలాగున మిథ్యారూపమై పోవుచుండునో అలాగుననే అజ్ఞానమగు సుషుప్తిలో నుండువానికు ఈజగత్తు కలిగి యుండును, ఇదియే దీనిలోగల సత్యము.

అనాది మాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే।
అజమనిద్ర మస్వప్న మద్వైతం బుధ్యతే తదా॥

అది లేని మాయచేత నిద్రించువాడగు జీవుడు ఎప్పుడు మేలుకొనుచున్నాడో అపుడు పుట్టుక లేనిదియును, నిద్రలేనిదియును, స్వప్నము లేనిదియును అగు, అద్వయస్వరూపమగు (తుర్యమును) జ్ఞేయమును తెలిసికొనుచున్నాడు. నిద్రనుండి లేచినవాడు, తానెవడు? ఎచట నున్నాడు? ఏకార్యము చేయుటకొఱకు వచ్చినాడో వీటిని ఎట్లు తెలుసు కొనుచున్నాడో, మాయామోహానిద్రనుండి మేల్కొనినవాడున్ను తనయొక్క స్వరూపమును

స ఏష నేతినేతీతి వ్యాఖ్యాతం నిహ్నుతే యతః।
సర్వమగ్రాహ్య భావేన హేతునాఽజం ప్రకాశతే॥

వ్యాఖ్యాతమైన సకలమును ఏహేతువువలన ఈయాత్మ కాదు కాదని గ్రాహ్యము కాదనెడి హేతువుచేత తీసివేయుచున్నది. బ్రహ్మము ప్రకాశించుచున్నది. దృశ్యనిషేధరూపముగ జ్ఞేయమును ఈవాక్యముపదేశించుచున్నది. లోకము మొదలు బుద్ధిపర్యంతముగల సమస్తమున్ను పరిశోధించిన ఆత్మ కాదని తెలియదగును. ఏలన బుద్ధిపర్యంతముగల అవి అన్నియు దృశ్యములు. అపుడు దృక్కగు జ్ఞేయబ్రహ్మమొకటియే మిగులును. అదే మన ఆత్మస్వరూపము. ఇదే తెలిసుకొనదగినది. ఇది జ్ఞేయమును బోధించునదగుటచేతను ఉపనిషత్సారమగుటచేతను మిక్కిలి విస్తరించి వ్రాయబూనలేదు. అరటిచెట్టుయొక్క పట్టలను ఒక్కొక్క దానిని తీసివేసినచో మోము ఎట్లు మిగులుచుండునో, ముంజగడ్డి యొక్క పొరలను ఒక్కొక్క దానిని తీసివేసి లోపలనుండెడి ఈనెను ఏలాగున గ్రహించి, మౌంజీబంధమున కుపయోగపరచెదరో, ఆలాగున "నేతినేతి" వాక్యములచే బుద్ధిపర్యంతముగల సమస్తము త్రోయబడగా సత్యస్వరూపమగు జ్ఞేయమగు ఆత్మయొకటియే మిగులును. అది ఓం తత్ సత్.

స ఆత్మా న చ విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః।
తుర్యాత్మ జ్ఞాన హీనానాం నముక్తిః స్యాత్కదాచన॥

ముముక్షువులందరికి తురీయమగు ఆ ఆత్మ తెలిసికొనదగినది. అట్టి తురీయమగు ఆత్మయొక్క జ్ఞానమును పొందని వారికి ఏకాలమందున్ను మోక్షము లభించదు.

శ్రీపతంజలిమహర్షి యోగదర్శనమందు తురీయజ్ఞానమే జ్ఞేయమనియు, అట్టిదానినే ముముక్షువులు సాక్షాత్కరించవలయుననియు ఉపదేశించిరి.

—: పాతంజలి యోగశాస్త్రము :—

తదా ద్రష్టుస్స్వరూపావస్థానమ్॥

చిత్తవృత్తులు నిగ్రహమైయుండు (యోగపరిపక్వదశయందు) కాలమునందు చిన్మాత్రుడైన పురుషుడు నిజస్వరూపము నందుండుట సంభవించుచున్నది. దీనికే జ్ఞేయముయొక్క జ్ఞానమ్మని తాత్పర్యము.

వీతరాగవిషయం వా చిత్తమ్॥

లోకవిషయముల యందాశయున్న, ఆ వ్యాపారముల భావనయును లేనిచిత్తము స్థైర్యమును పొందును. నిర్విషయమగు చిత్తము ఆత్మోపలబ్ధికి కారణమగుచున్నది.

సమాధి సిద్ధిరీశ్వర ప్రణిధానాత్॥

పరమేశ్వరునియందు అతిశయమైన భక్తిగలుగుటవలన ఈశ్వర సాక్షాత్కార సమాధి జ్ఞానము కలుగును అతిశుద్ధమగు భక్తిగూడ జ్ఞేయమును కలుగజేయును.

తత్ర ప్రత్యయైక తానతా ధ్యానమ్॥

ధారణాస్థలమునందు జ్ఞానముయొక్క ధ్యానేతర వస్తువులను చిత్తమునందు రానీయక చేయుటయే శుద్ధమైన ధ్యానమనబడుచున్నది.

తదేవార్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః॥

ముందు చెప్పిన ధ్యానము, ధ్యానించు వస్తువులయొక్క స్వరూపమై ఆ ధ్యానముకూడ లేక జ్ఞేయైకస్థితిని కలిగియుండుట సమాధియనబడును.

ఇక అహింసాదులలో నొక్కొక్క ధర్మానుష్ఠానముయొక్క ఫలమును నిరూపించుచున్నారు. వీటియొక్క అనుష్ఠానము శుద్ధికలుగునపుడు దానియొక్క ప్రయోజనము కలుగును. ఏ బీజము పెట్టి పోషించినను కాలము పరిపక్వస్థితికి వచ్చినపుడు దానియొక్క సిద్ధియు నాలాగున నుండును.

అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః॥ 1

అహింసాభ్యాసము సిద్ధిగల యోగి నివసించు స్థలమున పరస్పరము వైరముగల జంతువులుకూడ వైరభావమును విడిచి ప్రేమగలిగియుండును, అనగా శత్రుత్వము లేనివై మైత్రత్వముతో మెలగుచుండును.

సత్య ప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్ 2

సత్యమునందభ్యాసము కలవాడు అగ్నిష్టోమాది కర్మములు చేయకున్నను వాని ఫలము లభించును. సత్యమును చెప్పెడు సిద్ధిగల వానికి తన వాక్కుతో ఏవాక్యము చెప్పునో అది తప్పక ఫలించును. ఋషులకు గల నిగ్రహానుగ్రహశక్తికిన్ని ఇదే కారణము.

అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్। 3

పరుల వస్తువులతో ఆశలేనివాడై ఇతరుల ఏ వస్తువునున్ను అపహరించని వానికి అప్రయత్నముగనే సకలస్థలములయందు గల సమస్త రత్నములు తనంతట అవిలంభించును. అట్లాగా సమస్తధనములున్ను వానిదగ్గర చేరును. భూమిలోగల నిధులుకూడ అతని నేత్రములకు గోచరించును.

బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః॥ 4

బ్రహ్మచర్యము నభ్యసించుటవలన బ్రహ్మవర్చస్సు గలుగును. బ్రహ్మమును ధారణచేయుటకు తగిన శుద్ధమైన మేధస్సు ఉదయించును. దీనివల్ల ఆత్మజ్ఞానము చేకూరును. కాన ఇంద్రియము నష్టపరచక కాపాడు చుండవలయును. తైలము జ్యోతియై మాటి చీకటి గృహములోగల అన్ని వస్తువులను ప్రకాశింపచేయునట్లు బ్రహ్మచర్యము దివ్యజ్యోతియగు ఓజస్సుగా మారుచుండును. అట్టివానికి ప్రకృతియందు గల సమస్త సూక్ష్మతత్త్వములును మనోదృష్టికి గోచరమగును.

అపరిగ్రహేస్థైర్య జన్మకథంతా సంబోధః॥ 5

పరవస్తు పరిగ్రహము చేయనివానికి జన్మాంతర జ్ఞానము కలుగును. పరిగ్రహము రెండువిధములు, పరులనుండి బాహ్యవస్తువుల గ్రహించుట యొకటి దృశ్యవిషయ సంకల్పము హృదయములో కలుగుట మరియొకటి. ఈ రెండు విషయములు లేనివానికి తాను పూర్వజన్మములో ఎట్టివాడై యుండెను? ఏమిచేసెను? ఈలాటి జ్ఞానము కలుగును.

శౌచాత్స్వాఙ్గ జుగుప్సా పరైరసంసర్గః॥ 6

శుచిత్వమును అభ్యసించువానికి తన దేహోత్పత్తికి కారణములైన మాతా పితృ దేహజన్య శుక్లశోణితరూపమైన పర్యాలోచన జ్ఞానమువలన తన దేహమునందు అసహ్యమున్ను-స్త్రీలు మొదలగు శరీరమందు, హేయ బుద్ధియు కలుగును. ఇట్టి పరిశుద్ధి స్త్రీకూడా అభ్యసించినచో పురుషుల శరీరముకూడ శుక్లశోణిత సముద్భవమనెడి జ్ఞానముకలిగి అట్టిస్పర్శము నికృష్టమని జ్ఞానము కలుగును. ఇట్టి అనుష్ఠాము లేనికారణముచేతనే పరస్పరముభయులకు భ్రాంతికలుగుచున్నది. ఈ శౌచము మృత్తికాజలముచే దేహశుద్ధియు. జ్ఞానవైరాగ్యములచే ఆత్మశుద్ధియు కలిగియుండవలయును.

సత్త్వశుద్ధి స్సౌమనస్యైకాగ్రతేంద్రియ జయాత్మదర్శన యోగ్యత్వానిచ.

పరిశుద్ధుడైనవానికి సత్త్వశుద్ధియు దీనివలన సౌమనస్యమును, దీనివలన చిత్తైకాగ్రతయును, దీనివలన ఇంద్రియజయమును, దీనివలన ఆత్మదర్శన జ్ఞానమున్ను కలుగును. అనగా శుచిత్వము కలవానికి రజస్తమోగుణముల క్షయత్వమున్ను, మనస్సునందు కొంచెమేని దుఃఖము లేని ప్రీతియు చిత్తస్థైర్యమును, విషయములందు విముఖతయును బ్రహ్మజ్ఞానమునందు సమర్థతయు కలుగును, శ్రీపతంజలివారు అయిదుగుణములు దీనిలో చెప్పిరి. ఇవికొంచెము విస్తరించి చెప్పినచో (1) ఆత్మశుద్ధియు, దేహేంద్రియములను శుభ్రముగ నుంచుటయు (3) శుద్ధమైన వస్తువును మితముగా భుజించుటయు, దీనియందు వస్తుశుద్ధయుండిన మాత్రముచాలదు. అదివచ్చిన మార్గముగూడ శుద్ధముగా నుండవలయును (4) నివసించు స్థలమున్ను, ఉపయోగ పఱచుచుండెడు వస్తువులున్ను శుభ్రముగా నుంచవలయును. (5) చెప్పేవాక్యమున్ను చేయు పనియు శుద్ధములై యుండవలయును. దీనికే పంచశీలములనిపేరు. వీనిని హృదయమందుంచిన మంచిఅద్ధములో ప్రకాశించెడి సూర్యబింబమువలె ఆత్మజ్ఞానము ఉదయించును. అట్లు కాని వారి హృదయము మట్టిగోడయందు లేక బండరాతియందు సూర్యబింబము ప్రతిఫలింపని చందమున ఆత్మజ్ఞానము శూన్యముగా నుండును.

సన్తోషాదనుత్తమ స్సుఖలాభః॥ 7

లభించుదానితో సంతుష్టిగలవానికి నిరతిశయమైన ఆనందమెల్లప్పుడు కలుగును. ఆశలచే ప్రేరితమైన హృదయమెప్పుడున్ను దుఃఖమునే కలుగచేయును. నిరాశచే కలిగెడు సౌఖ్యము అనంతానందమని విధించుచున్నది.

కాయేన్ద్రియ సిద్ధి రశుద్ధిక్షయాత్తపసః॥ 8

తపస్సు చేయుటవలన చిత్తమునందలి మలినము తొలగుచున్నది. అందువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు అద్భుతశక్తి కలుగుచున్నది.

స్వాధ్యాయాదిష్టదేవతా సంప్రయోగః॥ 9

తన ఇష్టదైవమంత్రమును జపించుటవలనతానుకోరిన ఇష్టదైవము ప్రత్యక్షమగును, వేదమంత్రములయందు తనకభిమతంబైన దేవతామంత్ర

మును ఓంకారపూర్వకముగా జపించుటవలన ఆ దేవత సాక్షాత్కారమై తన తన కిష్టార్థముల నొసంగును. మఱియు ప్రణవపూర్వకమైన ఈశ్వరోపాసన వలన చిత్తము నిర్మలత్వము నొందును.

సమాధి సిద్ధిరీశ్వర ప్రణిధానాత్॥ 11

పరమేశ్వరునియందు అతిశయమైన భక్తిచేయుటవలన చిత్తము ఈశ్వరాకార స్థితినిపొంది శివ జీవైక్యస్వరూపము సమాధి సాక్షాత్కారము కలుగును ఇది యోగదర్శన సాధన పాదమునందు కనందగును. ఇపుడు మనకు కావలసినది ఆచరణము -పరిశుద్ధమైన బ్రహ్మనిష్ఠ లేనందుచే పూర్వీకఋషుల స్థానము ముముక్షువులుపొందక పోవుటయేగాక లోకులకు సాధువులపై భక్తులపై అవిశ్వాసము కూడ కలుగుచున్నది. మఱియు బ్రహ్మతేజస్సు దివ్యశక్తికూడ సాధువులకు గలుగకపోవుటకు దీనిలో చెప్పిన విధిని అనుష్ఠింపక పోవుటయే కారణము. దీనిలో శ్రీ పతంజలిమహర్షి 11 విధులను నిరూపించిరి. దీనికి ఇతరశాస్త్రములలో వివరింపబడిన వాక్యముల కొన్నిటిని ఈక్రింద చేర్చబడమైనది. ఇట్టి అనుష్ఠానమువలన సన్నని మఱ్ఱి విత్తనమును పోషించుటవలన గొప్పవృక్షమగునట్లు సూక్ష్మమగు జీవశక్తి గొప్పదైవశక్తి కలదిగా మారును. సన్నదగు అగ్నికణము వృద్ధిపఱచుట వలన అనంతమగు మహాగ్నిగా ఎట్లు మారుచుండునో అణురూపముగా చెప్పెడు జీవుడుకూడ విభుస్వరూపుడగు ఈశ్వరచైతన్య రూపముగా మారుచుండును.

ఈ అహింస బాహ్య అహింసతో పూర్తికాదు. ఆత్మహింస కూడ లేకయుండవలయును. 1. అహింస.

అభయం సర్వభూతేభ్యోదత్వా యశ్చరతే మునిః।
న తస్య సర్వభూతేభ్యో భయముత్పద్యతే క్వచిత్॥

ఏ మననశీలుడు సర్వభూతములకు భయము కలుగనీయకసంచరించు చుండునో అట్టివానికి ఎచ్చోటను ఏప్రాణివల్లను పీడకలుగదు. ఇదే ధర్మము యొక్క రహస్యము. పరప్రాణులను పీడచేయువానికి సర్వప్రాణులవల్లను ఎల్లప్పుడున్ను దుఃఖము కలుగుచుండును.

అహింసా ప్రథమం పుష్పం ద్వితీయం కరణగ్రహః।
తృతీయకం భూతదయా చతుర్థం క్షాంతిరేవచ॥
శమస్తు పంచమం పుష్పం దమష్షష్ఠంచ సప్తమమ్।
ధ్యానం సత్యం చాష్టమంచ హ్యేతైస్తుష్యతి కేశవః॥

పరమేశ్వరుని ఆత్మలో పూజించెడు అహింసాది పుష్పములను దీనిలోవర్ణించడమైనది. ఆపుష్పము లెవ్వియనగా?

(1) అహింస, (2) ఇంద్రియనిగ్రహము, (3) సర్వభూతదయ. (4) క్షమ (5) శమము (అంతరింద్రియనిగ్రహము) (6)దమము, (బాహ్యేంద్రియనిగ్రహము) (7) ధ్యానము, (8) సత్యము. ఈ సుగుణములు గలిగి ఆత్మార్చనము చేయుటవల్ల సాక్షాత్ శ్రీమన్నారాయణుడు మిక్కిలి ప్రీతిగలవాడగును.

అహింసా పరమో ధర్మః సర్వవేదే ప్రకీర్తితః।
చరాచరాణాం భూతానాం, అభయం యః ప్రయచ్ఛతి॥
సర్వదా, సర్వసౌఖ్యాఢ్యోజాయతేదివి చేహచ॥

ధర్మములన్నిటికిన్ని అహింసయే పరమధర్మము. వేదములన్నియు ఈలాగుననే చెప్పుచున్నవి. చరాచరములగు భూతకోట్లకు ఎవడు అభయము నిచ్చుచున్నాడో వాడు ఎల్లప్పుడును ఎల్లచోట్లను పరలోకమందును ఇహలోకమందును దుఃఖము నొందజాలడు. పూర్ణసుఖము నొందగలుగును.

నాస్తిభర్గ సమో దేవో నాస్తి గంగా సమా నదీ।
నాస్తి హింసాసమం పాపం నాస్తి ధర్మో దయాపరః॥

సర్వేశ్వరునకు సమానమైన మరియొక దేవుడులేడు. గంగకు సమానమైన నదిలేదు. హింసకు సమానమైన పాపములేదు. అహింసకు సమానమైన శ్రేష్ఠధర్మము లేదు.

అహింసా పరమోధర్మో అహింసా చ పరం తపః।
అహింసా పరమం జ్ఞాన మహింసా పరమం ఫలమ్॥

అహింసయే పరమధర్మము. అహింసయే శ్రేష్ఠమైన తపస్సు, అహింసయే పరమమైన జ్ఞానము. అహింసయే పరమమయిన ఫలమును

కలుగచేయుట ఆత్మహింసయు హింసలో చేరినదే. పాపకార్యములచే తాము దుఃఖించుటయు హింసయగును. ఆత్మజ్ఞానము లేక అజ్ఞానములోపడి తపించుటయు హింసయగును. ఆత్మయొక్క స్వరూపము జ్ఞానము, ఆనందము, స్వప్రకాశము, అని తెలుసుకొని ఆత్మకు కలుగుచుండు క్లేశములను ఆత్మలో చేరనీయక చూచుటయే గొప్ప అహింసా వ్రతమగును.

## 2. సత్యము.

ఈ బాహ్యసత్యముతో సత్యము పూర్తికాజాలదు. "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అను జ్ఞానము కలుగునపుడే సత్యవ్రతము పూర్తియగును. మఱియు, అట్టి సత్యస్వరూపమగు ఆత్మ వ్యవహారము మాత్రము గల్గి అసత్యమగు జగద్వ్యవహారము గలిగియుండకుండుటయే సత్యవ్రతనిష్ఠయగును.

సత్యమేవజయతే నానృతం సత్యేన పంథా
వితతో దేవయానః।
యేనాక్రమ న్త్యృషయో హ్యాప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్॥

సత్యమే జయించును. అసత్యమునకు జయము కలుగదు సత్యముచేతనే దైవమార్గము తెలుపబడియుండును. ఋషులందరున్ను, సత్యమువల్లనే సమస్తకోరికలు పొందినవారై మోక్షమునుకూడ పొందిరి. సత్యమన్నిటికన్న ఉత్కృష్టమయిన స్థానము.

సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మాసమ్యక్ జ్ఞానేన
బ్రహ్మచర్యేణ నిత్యమ్ అంతశ్శరీరే జ్యోతిర్మయోహి
శుభ్రోయం పశ్యంతి యతయః క్షీణదోషాః॥

యత్నశీలురై నందువలన సమస్తదోషములు నశించినవారలై ఋషులు సత్యముచేతను తపస్సుచేతను సమ్యక్ జ్ఞానముచేతను బ్రహ్మచర్యముచేతను నిత్యముకూడినవారలై హృదయాంతరవర్తియై జ్ఞానజ్యోతిర్మయుడై యుండు ఆత్మను దర్శించుచున్నారు. యతులు సన్యాసులనికూడ పేరు

కలిగియున్నారు "యతయః క్షీణదోషాః" సర్వదోషములును నశించినవారు యతులగుదురు. దోషములను నశింపచేయుటలో యత్నపరులగుటే యతి శబ్దమునకు అర్థము.

సత్యేనార్కః ప్రతపతి సత్యే తిష్ఠతి మేదినీ।
సత్యం చోక్తం పరో ధర్మః స్వర్గస్సత్యే ప్రతిష్ఠితః॥

నిత్యుడగు ఈశ్వరుడున్ను అవినాభావసంబంధము గలిగియుందురు. అనగా సత్యమును విడిచి ఈశ్వరుడులేడు. ఈశ్వరుని విడిచి సత్యమున్నులేదు. సత్యముచేతనే సూర్యుడు ప్రకాశించుచున్నాడు. సత్యమువల్లనే ఈభూమి నిలిచియున్నది. సత్యవచనము ధర్మములన్నిటికన్న ఎక్కువైనది. స్వర్గలోకమున్ను సత్యమందే నిలుచుచున్నది.

అశ్వమేధ సహస్రం చ సత్యం చ తులయా ధృతమ్।
అశ్వమేధ సహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే॥

సహస్రాశ్వమేధ యాగములయొక్క ఫలమున్ను సత్యము యొక్క ఫలమున్ను త్రాసులోపెట్టి ఋషులు తూచిరట. అశ్వమేధ సహస్ర ఫలితముల కన్న సత్యముయొక్క ఫలితమే ఎక్కువగా తూగెనట!

నానృతాత్పాతకం కించిన్న సత్యాత్సుకృతం పరమ్।
వివేకాన్నపరో బంధు రితి వేదవిదో విదుః॥

అసత్యమునకు మించిన పాపములేదు. సత్యమునకు మించిన సుకృతమున్నులేదు. వివేకమునకు మించిన బంధువున్ను లేదు. వేదవేత్తలు ఇట్లు తలంతురు.

### 3. అ స్తే య ము,

పరవస్తువుల దొంగిలింపకయుండుట మాత్రముచే అస్తేయము పూర్తి కాదు. ఆత్మవంచనములేక ప్రవర్తించినపుడే అస్తేయవ్రతము శుద్ధియగును. అలాగున ప్రకృతి విషయములను ఆత్మలోనికి రానిచ్చుటయు అస్తేయ వ్రతమునకు భంగమేయగును.

ఇది తనయొక్క పవిత్రజీవితమును నిరూపించుచున్నది. దీనిచే కలిగెడు ఫలితము శ్రీపతంజలి మహర్షియే నిరూపించియున్నాడు.

నాస్తి శ్రద్ధా సమం పుణ్యం నాస్తి శ్రద్ధాసమం సుఖమ్।
నాస్తి శ్రద్ధా సమం తీర్థం సంసారే ప్రాణి నృప॥

జీవితము పరుల వస్తువులవల్ల చేయనీయక స్వప్రయత్నముతో చేయు ప్రయత్నముకన్న సమమయిన పుణ్యము మఱియొకటి లేదు అట్టి శ్రద్ధకు సమానమయిన సుఖమున్ను లేదు. అట్టి శ్రద్ధకు మించిన తీర్థమున్ను లేదు. ప్రపంచములోగల జీవులకిదే శ్రేష్ఠమయిన ధర్మము.

ఆచారేణ నరో దేవి సుఖత్వముపజాయతే।
అనాచారేణ పాపేన నాశం యాతి తథా ధ్రువమ్॥

పవిత్రాచరణముచేతనే నరుడు సుఖమును పొందగలుగును. దుష్టాచరణమగు పాపమువల నిశ్చయముగా అతడు నశించును.

కృషికారో యథా దేవి భన్నం బీజం సుసంస్థితమ్।
యాదృశం తు భవత్యేవ తాదృశం ఫలమశ్నుతే॥

వ్యవసాయము చేయువాడు తనయొక్క క్షేత్రమునందు ఏ బీజము విత్తునో దాని కనుగుణమయిన ఫలము కలుగునేగాని మరియొక ఫలమెట్లుకలుగదో జీవులయొక్క అనుష్ఠానమున్ను అలాగుననేయుండును.

## 4, బ్రహ్మచర్యము,

బ్రహ్మవిచారమందు నిరంతర ముండునపుడే బ్రహ్మచర్యవ్రతము శుద్ధముగానుండును. బ్రహ్మవిచారములేని బ్రహ్మచర్యము దేహేంద్రియ మనస్సులను శుద్ధమొనర్చునేగాని ఆత్మను శుద్ధమొనర్పజాలదు. కావున బ్రహ్మవిచారములో నిరంతరము సంచరించుట యేది కలదో ఇదే బ్రహ్మచర్యవ్రతమునకు ప్రాణమువంటిది, ఈబ్రహ్మచర్య వ్రతము చెప్పునపుడు స్త్రీలను నిందించినట్లు తోచును. కాని అందరి స్త్రీలను గాని పుణ్యవతులను గాని కాదు. దుష్టగుణము గల దీనియందు చెప్పబడెడి స్త్రీలకు మాత్రమే అధిక్షరింపబడు.

ఋతుకాలాభిగామీ యస్స్వదారనిరతశ్చ యః।
స సదా బ్రహ్మచారీ చ విజ్ఞేయస్స గృహాశ్రమీ॥

గృహస్థాశ్రమందుండు వాడును, శాస్త్రములలో విధించియుండు ఋతుకాలము ననుసరించి స్వపత్నితో యుండెనేని అతడు గూడ గృహస్థ బ్రహ్మచారియనియే గ్రహించదగినది. అలాగుననుండు స్త్రీగూడ బ్రహ్మ చారిణి యనియే శాస్త్రముయొక్క నిశ్చయమని గ్రహింపతగినది. కాని నైష్ఠిక బ్రహ్మచారులవలె సంకల్పశక్తియు, సంకల్పసిద్ధియు మాత్రము వీరికి కలుగదు. ముక్తికి మాత్రము భంగముండదు. బ్రహ్మచర్యవ్రత కాలమందే జీవితమంతయు శుద్ధముగా నుండవలెయుండును. వీరికి అనుష్ఠానములు మెండు. జీవితముయొక్క ప్రాథమిక దశయగు ఇది నాలు గంతస్థులతో గట్టెడు భవనముయొక్క పునాదియని గ్రహించవలయును.

దేవద్రోహం నకుర్వీత గురుద్రోహం తథైవచ।
దేవద్రోహా ద్గురుద్రోహః కోటీకోటి గుణాధికః॥

బ్రహ్మచారి దైవద్రోహముగాని గురుద్రోహముగాని ఎప్పటికిన్ని చేయరాదు దైవద్రోహముకన్న గురుద్రోహము కోటానకోట్లధికమయిన పాపఫలమును కలుగచేయును.

గురోర్యత్ర పరీవాదో నిందా వాపి ప్రవర్తతే।
కర్ణౌ తత్ర పిధాతవ్యౌ గంతవ్యం వా తతోఽన్యతః॥

గురుభక్తిగల బ్రహ్మచారి తన గురుదేవుని అవమానమును గాని నిందను గాని ఎచ్చటైన ఎవరైన చేయుచుండిన అపాపవాక్యమును విననీయక కర్ణమును మూసికొనవలయును. అట్లుగానిచో ఆస్థలము నైన విడిచి పెట్టవలయును. తనకు శక్తిగలిగెనేని అచట సత్యమును బోధించి నిలుకడచెట్టవలయును.

నభాత్మానం ప్రశంసేద్వా పరనిందాంచ వర్జయేత్।
వేదనిందాం దేవనిందాం ప్రయత్నేన వివర్జయేత్॥

బ్రహ్మచారి ఆత్మస్తుతిని, పరనిందను తప్పక మానవలయును ఆత్మ ప్రశంసవలన భాగ్యభాగ్యము నశించును, పరదూషణవల్ల దోషములు

నము, ఆలాగున వేదనిందను, దేవనిందను ప్రయత్నపూర్వకముగ నిశ్శేష ముగా వర్జింపవలయును.

దుష్కృతం హి మనుష్యస్య సర్వమన్నే వ్యవస్థితమ్।
యో యస్యాన్నం సమశ్నాతి స తస్యాశ్నాతి కిల్బిషమ్॥

యతికిన్ని బ్రహ్మచారికిన్ని భిక్షాన్నమే విధి గలదు. కాని భోజన ప్రియులై ఆత్మశుద్ధిలేని వారి భోజనమును భుజించిన కలిగెడు దోషము దీనియందు నిరూపింపబడుచున్నది అన్నము మాత్రము శుద్ధిగానుండిన చాలదు. అదివచ్చే మార్గముకూడ శుద్ధముగా నుండవలయును. పాప మార్గముతో వచ్చెడు వస్తువులు శుద్ధములైనను అని అశుద్ధములే మానవుని యొక్క పాపము వాడిచ్చెడు దానములద్వారా వచ్చుచుండును. కావున అట్టి పాపాన్నము భుజించుటవలన వానియొక్క పాపము అన్నము భుజించు వానికికూడ చేరుచుండును. శుద్ధాన్నముగా నుండవలసినచో (1) వస్తు శుద్ధియు (2) అది వచ్చేమార్గశుద్ధియు, (3) పాత్రశుద్ధియు (4) పచనము చేయువారికి కలిగియుండవలయును. దీనికే భావశుద్ధియని పేరు. అట్లు శుద్ధ మైన అన్నము నీరసముగానుండినను ఆత్మజ్ఞానజ్యోతి మఱుగుపడక వెలుగు చుండును అట్లుగాని రస యుక్తమైన ఆహారమైనను ఆత్మజ్ఞానమును మఱుగు పఱచి మధుమేహములను కలుగచేసి తనయొక్క వ్రతమును పతన మొనర్చును.

తపసో న పరం కించి త్తపో హి మహతాం ధనమ్।
తపసా ప్రాప్యతే సర్వం తపో యోగ్యోఽసి పుత్రక॥

తపస్సుకన్న శ్రేష్ఠమైనది మరియొకటిలేదు. మహాత్ములకు తపస్సే గొప్పధనము. తపస్సువల్ల సమస్తమును పొందగలుగును. కావున నో కుమారుడా! నీవు తపస్సు చేయుటకు అర్హుడవై యున్నావు అని శ్రీ వ్యాస భగవానులు శుకమహర్షి నుద్దేశించి పలికెను.

తపస్తో హి విన్నా నాస్తి సిద్ధిః కుత్రాపి శోభతే।
పూర్వాపరా కర్మ సిద్ధినాం ... తప ప్రాప్యతే

తపస్సువినా ఎచ్చటను ఏసిద్ధియున్ను ప్రకాశింపజాలదు. కావున సమస్తసిద్ధులకున్ను తపస్సే మూలమైనది. యోగసిద్ధికిన్ని, మోక్షసిద్ధికిన్ని, జ్ఞానసిద్ధికిన్ని తపస్సే కారణము.

ధర్మ్యం యశస్యమాయుష్యం లోకద్వయరసాయనమ్।
అనుమోదామహే బ్రహ్మచర్యమేకాంతనిర్మలమ్॥

పరిశుద్ధమైన బ్రహ్మచర్యము ధర్మము లన్నిటికి మూలమైనది. యశస్సును పూర్ణాయుస్సును కలుగచేయునది. ఇహలోక సౌఖ్యమునకున్ను, పరలోక సుఖమగు ముక్తికిన్ని ఇది దివ్యరసాయనము వంటిది, దీనికి మించిన నిర్మలమైన ధర్మము లేదని ఋషుల ఆశయము.

సర్వేషాం వ్రతానాం మూలం బ్రహ్మచర్య ముదాహృతమ్।
విశేషాచ్చివ భక్తానామేవం భూయో విధాస్యసి॥

వ్రతము లన్నిటికిన్ని బ్రహ్మచర్యమే మూలమని ఋషులచే చెప్పబడినది, భగవద్భక్తులకు గూడ విశేషించి ఈ బ్రహ్మచర్యవ్రతము ఏర్పడి యున్నది. కావున ఇట్టి విధిని ప్రతి ముముక్షువున్ను అనుసరింపదగినది.

మైథునస్యాఽప్రవృత్తిర్హి మనోవాక్కాయకర్మణా।
బ్రహ్మచర్యమితిప్రోక్తం యతీనాం బ్రహ్మచారిణామ్॥

మనోవాక్కాయ కర్మలచే మిథున క్రియలగు అష్టవిధ దోషములు లేకుండుటయే పరిశుద్ధమైన బ్రహ్మచర్యమని చెప్పబడెను. యతులున్ను బ్రహ్మచారులున్ను ఈ త్రికరణ శుద్ధితో బ్రహ్మచర్యమును సంరక్షింపవల యును. గృహస్థులకు ఋతుకాలము తప్ప తక్కినకాలములలో వారున్ను బ్రహ్మచర్య వ్రతమును పాలింపవలయును.

పరదార పరిత్యాగాత్స్వదారపరితుష్టితః।
ఋతుకాలాభిగామిత్వాద్బ్రహ్మచారీ గృహీరితః॥

మనోవాక్కాయ కర్మలచే పరస్త్రీలను వర్జించి స్వపత్నియందు సంతుష్టి గలవాడును; శాస్త్రవిధి ననుసరించి ఋతుకాలమున మాత్రము స్వపత్నితో

ప్రవర్తింప గృహస్థుడుగూడ బ్రహ్మచారి యనదగును. అట్టి స్త్రీయును బ్రహ్మచారిణియే.

విషయే లుబ్ధచిత్తానాం వనేపి జాయతే రతిః।
సర్వత్ర సమదృష్టీనాం గేహే ముక్తిర్హి శాశ్వతీ॥

విషయసంకల్పము కలవారు వనమందుండినను విషయచింత నశించుటలేదు, సమదృష్టిగల జ్ఞానులకు గృహమందుండినను, శాశ్వతమైన మోక్షము కలుగును.

అంగార సదృశానారీ ఘృతకుంభసమః పుమాన్।
అస్పర్శాద్దృఢతామేతి తత్స్పంపర్కాద్విలీయతే॥

అగ్నిగుండము వంటిది నారి. ఘృతకుంభము వంటివాడు పురుషుడు. స్పర్శించువఱకు మాత్రము దృఢత్వము కలిగియుండును. స్పర్శనమే అవసరము లేదు. దర్శనము మాత్రము చేతనే విలీనమగును

దర్శనమనియే చెప్పనేల? శ్రవణముగూడ మనస్సును పరవశ మొనర్చును. కావుననే అష్టవిధ బ్రహ్మచర్యములలో

శ్రవణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణమ్।
సంకల్పోధ్యవసాయశ్చ క్రియా నిర్వృతిరేవ చ॥
ఏతన్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః।
విపరీతం బ్రహ్మచర్యమనుష్ఠేయం ముముక్షుభిః"

వినుట, వచించుట విహరించుట, చూచుట. రహస్యభాషణం మనస్సులో సంకల్పించుట, బుద్ధితో నిశ్చయించుట, క్రియతో ప్రవేశించుట అనెడి 8 ఈదోషములు ఉండకూడదు

విద్వాంస మప్యవిద్వాంసం యతస్తా ధర్షయంత్యలమ్।
స్వవశం వాపి కుర్వన్తి సూత్రబద్ధశకుంతవత్॥

విద్వాంసుడైనను, అవిద్వాంసుడైనను, స్త్రీలయొక్క సాన్నిధ్యము వలన ఆకర్షింపబడుదురు. దారముకట్టిన పక్షిని ఏలాగున లాగుకొని

షోవుచురో అలాగున విషయబుద్ధిగల స్త్రీలు విషయ స్వభావము గల పురుషులను స్వాధీనము చేయుదురు.

స్వాంతమునకున్ను, ఇనుమునకున్ను ఏలాగున పరస్పరమాకర్షణము కలిగియుండునో, సృష్టియందుగూడ ఇట్టి పరస్పరాకర్షణస్వభావము సంకల్పశుద్ధి లేని స్త్రీ పురుషులకు కలుగుచుండును.

"మాత్రావా దుహిత్రావా న స్వస్రైకాంత శీలతా।
బలవ న్నింద్రియాణ్యత్ర మోహయంత్యపి కోవిదాన్॥

తల్లితోడను, కూతురుతోడనైనను, తోడపుట్టువుతోనైనను. బ్రహ్మచర్యవ్రతము కలవారు ఒకే స్థలములో నుండరాదు ఏలన ఇంద్రియముల యొక్క బలము అతిబలమైనది, మహా బలవంతులనుకూడ అది లోబఱచును. బలవంతులను మాత్రమేకాదు గొప్పవిద్వాంసులను కూడ అది మోహింపజేయును. అలాగున బ్రహ్మచర్యవ్రతముగల స్త్రీలున్ను తండ్రి, సోదరుడు, కుమారుడు, ఉండే ఏకాంతప్రదేశమున నివసింపరాదు.

తావద్విద్యాప్రభవతి తావద్జ్ఞానం ప్రవర్తతే।
తావత్సునిర్మలా మేధా సర్వశాస్త్రవిధారిణీ॥

తావత్స్వ గురుశుశ్రూషా తావద్ధ్రితరణే మతిః॥
తావత్సుబుద్ధో భవతి విశ్వేకస్థావ్రతేవ హి॥
తావత్సత్రాం సంగమూబి స్తాత్వత్సారాణాలాలసా।
యావత్సమంతినీలోలనయనాందోళనం న ॥

ఎంతవఱకు స్త్రీలయొక్క చంచలమైన నేత్రములయొక్క దృష్టి పడలేదో అంతవఱకే విద్య ప్రకాశించును. అంతవఱకే జ్ఞానమున్ను ప్రవర్తించును, అంతవఱకే సర్వశాస్త్రములను ధరించెడు లేక గ్రహించెడు నిర్మలమైన మేధాశక్తి కలిగియుండును. మఱియు ఎంతవఱకు స్త్రీలయొక్క విషయవీక్షణకటాక్ష భ్రూవిక్షేపాదులు కలుగవో అంతవఱకే జపమున్ను, తపస్సున్ను, తీర్థయాత్రయున్ను, గురుశుశ్రూషయున్ను, ముక్తిని పొంద వలయునన్న మనస్సున్ను అనగా తలపోసేటు బుద్ధియున్ను కలిగియుండు

డును. విషయబుద్ధిగల స్త్రీలయొక్క విషయదృష్టియను పిడుగు ఎంతవఱకు పురుషుని యందుపడలేదో అంతవఱకే పురుషునియొక్క ప్రబోధమున్ను, వివేకజ్ఞానమున్ను, మహనీయుల సంసర్గమునందు ప్రీతియున్ను, శాస్త్రపఠన మందు ఉత్సాహమున్ను కలిగియుండును.

"నారీణాం నయనాదేశః సురాణామపి దుర్జయః।
స యేన విజితో లోకే హరిభక్తస్స ఉచ్యతే॥
మాంద్యంతి మునయోప్యత్ర నారీచరితలోలుపాః।
హరిభక్తిః కుతః పుంసాం నారీ భక్తిజుషాం ద్విజాః॥

విషయదృష్టిభావముగల స్త్రీలయొక్క నయనచేష్టల జయించుటకు దేవతలకు కూడ అసాధ్యమైనది, అట్టిదానిని జయించిన వాడెవడో వాడే లోకమున భగవద్భక్తుడనబడును. స్త్రీలయొక్క చంచలమైన దృష్టికి లోబడిన మునులు గూడ మంద బుద్ధిగలవార లగుదురు. నారీభక్తి యందు లోబడిన చిత్తముగల పురుషులకు మఱల హరిభక్తి ఎట్లు కలుగును అనగా కలుగదని భావము.

పుత్ర్యా అపి ప్రసంగేన రహస్థ్సానే తు ముహ్యతి।
అతో మాత్రా భగిన్యా వా దుహిత్రాపి రహస్థ్సలే॥
సహ నాసీత మతిమాన్యువత్యా కిముతాన్యయా॥

మతిమంతుడగు పురుషుడు ప్రసంగవశాత్తైనను ఏకాంతస్థలమున పుత్రి, తల్లి, సోదరీలతోనైనను కూడియుండరాదు. అట్లైనను మోహమును కలుగచేయునని శాస్త్రము విధించియుండగా యువతులగు ఇతర స్త్రీలతో ఏకాంతప్రదేశముననుండుట యెంత అపాయకరమో యోచించుకొనవలయును. అలాగున పావన ధర్మమును పాలించెడు నారీమణులుగూడ వయస్సులో నుండు తండ్రి, సోదరుడు, పుత్రుడు ఉండే ఏకాంతస్థలమున నివసింపరాదు.

తావత్తపోఽభివృద్ధిస్తు తావద్దానం దయా దమః।
తావత్స్వాధ్యాయ వృత్తించ తావచ్ఛౌచం ధృతం వ్రతమ్॥
యావత్త్రీ స్తముఖీ దృష్టిం చపలాం న విలోకయేత్।

తావన్మాతా పితా తావద్భ్రాతాతావ త్సుహృజ్జనః॥
తావల్లజ్జా భయం తావత్స్వాచారస్తావ దేవహి।
జ్ఞానమౌదార్య మైశ్వర్యం తావదేవహి భాసతే।
యావన్మత్తాంగనాపాశైః పాతితో నైవ బంధనైః॥

ఎంతవఱకు లేడి కన్నులవంటి చంచలమగు సిగ్గుగల స్త్రీలయొక్క దృష్టిని చూడలేదో అంతవఱకే తపోవృద్ధియున్ను. దాన బుద్ధియున్ను, భూతదయయున్ను, ఇంద్రియనియమమున్ను కలిగియుండును. అట్టి విషయ దృష్టిని ఎంతవఱకు చూడలేదో అంతవఱకే అధ్యయన ప్రవృత్తియున్ను, శౌచమున్ను, ధారణాశక్తియున్ను, వ్రతమున్ను నిలుచును.

ఎంతవఱకు విషయముచే మదించిన స్త్రీయొక్క దృష్టియగు పాశములచే పురుషుండు బంధింపబడడో అంతవఱకే మాతృభక్తి. పితృభక్తి, భ్రాతృవాత్సల్యము. సుహృజ్జన ప్రీతి కలిగియుండును. ఎంతవఱకు స్త్రీల యొక్క చేష్టలగు బంధనములచే పతితుడుకాడో అంతవఱకే లజ్జయున్ను భయమున్ను ఆచారమున్ను నిలుచును. అట్టి పతనము ఎంతవఱకు కలుగదో అంతవఱకే జ్ఞానమున్ను ఔదార్యమున్ను ఐశ్వర్యమున్ను ప్రకాశించును. అట్టి వీక్షణపాశముచే ఎప్పుడు బద్ధుడగునో అపుడు పైజెప్పిన సుగుణము లన్నియు మంచుపడిన తామర కొలనులో గల తామర పూవులును పత్రము లున్ను జీర్ణించిపోవునో ఆలాగున క్షీణించి పోవును. కావున ఈవిషయము లున్ను ముముక్షువులు, జిజ్ఞాసులు, భక్తులు, పవిత్రజీవితము గడుప తలంపు గల సర్వజీవులున్ను మఱువక జ్ఞాపకముంచుకొనవలయును.

## 5. అపరిగ్రహము

పరవస్తువును గ్రహింపకపోవుటచే అపరిగ్రహ వ్రతము పూర్తికాదు. శబ్దాది విషయములను ఆత్మలో చేరనీయక చేయునప్పుడే అపరిగ్రహ వ్రతము పూర్తియగును. అపుడే పరిగ్రహవర్జిత ఫలము సిద్ధి గలుగును.

పరిగ్రహ సమర్థోఽపి నప్రసజ్యేత్ప్రతిగ్రహే।
పరిగ్రహేణ హి విప్రాణాం బ్రాహ్మం తేజః ప్రశామ్యతి॥

అపరిగ్రహమనగా పరవస్తువులను గ్రహింపక పోవుట, పరవస్తువును గ్రహించుటచే వీరి పుణ్యము వారికిపోయి వారిపాపము వీరియందు చేరు చున్నది. ప్రతిగ్రహము అనగా దానము స్వీకరించి జపధ్యానాది హెూమా తిథి సత్కారాదులచే ఆ దోషమును నివర్తింపుటకు శక్తి మంతుడైనను పరవస్తువును గ్రహించుటలో మనస్సును ప్రవేశపెట్టకుము పరవస్తు పరిగ్రహమువల్ల వీనియొక్క బ్రహ్మతేజస్సు అతి త్వరలోనే నశించును. పర వస్తువును భుజించునపుడు పాపమునే భుజించునట్లు తలంచువారే పవిత్రులగు దురు. ధ్యానయోగము నుపదేశించెడు గీత ఆఱవ అధ్యాయమున శ్రీభగవంతు డున్ను దీనినే ఉపదేశించినారు.

యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥

ధ్యానయోగముకలవాడును లేక జ్ఞాన నిష్ఠుడు ఒంటరిగా నుండ తలంచువాడును, నియమించబడిన అంతఃకరణమును దేహమును కలవాడును, ఆశలు లేనివాడును, పరిగ్రహ వర్జితుడును, ఏకాంతము నందున్నవాడును, సర్వకాలములయందు అంతఃకరణమును పరమాత్మయందు చక్కగా నుంచ వలయును. ఈ భగవద్వాక్యమును బాగుగా జ్ఞాపకముంచవలయును. ఇదే విధముగా 18 అధ్యాయములలోను యుపదేశించడమైనది.

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే ॥

అహంకారము, జాతి, విద్య, అధికారములతో కూడిన బలమున్ను దర్పమున్ను, కామమును, కోపమును, పరవస్తువును గ్రహించెడు పరిగ్రహ మున్ను నిశ్శేషముగా విడిచి పెట్టి మమకారములేనివాడై పరమశాంతుడు నగువాడు బ్రహ్మజ్ఞానప్రాప్తికి అర్హుడగుచున్నాడు. ఈశ్లోకములో కామ క్రోధాదులగు దుష్టగుణములతోచేర్చి పరిగ్రహమును గూడ చెప్పినందుచే పరవస్తు పరిగ్రహమెంత నీచమైనదో యోచించుకొనవలయును.

పూజితంహ్యశనం నిత్యం బలమూర్జంచ యచ్ఛతి।
అపూజితం తు తద్భుక్త ముభయం నాశ యేదిదమ్॥

సత్యార్జితముతో శుద్ధమైన అన్నము భుజించుటవల్ల మనోవాక్కాయములకు బలమున్ను, మంచి ఓజస్సున్ను కలుగును, కలుగును. అట్లుచేయక అపూజ్యమగు పరాన్నమును ఎల్లప్పుడు భుజించుచుండిన అది ఇహపరములరెంటివిన్ని నశింపచేయును.

దుష్కృతం హి మనుష్యస్య సర్వమన్నే వ్యవస్థితమ్।
యోయస్యాన్నం సమశ్నాతి స తస్యాశ్నాతి కిల్బిషమ్॥

ఎవడు ఎవని అన్నమును భుజించునో. వానియొక్క పాపమును గూడ అతడు భుజించుచున్నాడు. వానియొక్క పాపశాంతి కొఱకే దానమిచ్చుచున్నందున పరిగ్రహమువల్ల అవస్తువుతో పాటు పాపముగూడ వచ్చుచుండును.

తప్త్వా తపస్వీ విపినే క్షుధార్తో
గృహం సమాయాతి సదాన్నదాతుః॥
భక్త్యా సదాన్నం ప్రదదాతి తస్మై
తపోవిభాగం భజతే హి తస్య॥

వనమునందుండు గొప్పతపస్వియైనను క్షుద్బాధ కలుగునపుడు అన్నదాతయగు గృహస్థుని ఆశ్రయించుచున్నాడు. భక్తితో అట్టి తాపసునకు అన్నము నిచ్చెనేని ఆ తపస్వియొక్క తపోమహిమలో సగము భాగము అట్టి అన్నదాతకు వచ్చుచుండును. తపస్సులేని వాడైనచో గృహస్థుని యొక్క పాపమును భుజించు వాడగుటచే తన తపస్సంతయు త్వరలోనే నశించును.

రాహుగ్రస్తస్య సోమస్య యథా జ్యోత్స్నా నభాసతే।
తథా తమోఽభిభూతానాం భూతానాం నశ్యతే సుఖమ్॥

రాహుకేతువులచే గ్రస్తమైన గ్రహణకాల సూర్య చంద్రుల ప్రకాశమే లాగున ఆవరింపబడునో అలాగున పాపాన్నములచే ముముక్షువుయొక్క ఆత్మజ్ఞాన ప్రకాశముగూడ మఱుగుపడిపోవును.

పరాన్నేన తు భుక్తేన మైథునం యోఽధిగచ్ఛతి।
యస్యాన్నం తస్య తే పుత్రా అన్నాచ్ఛుక్రం ప్రవర్తతే॥

ఈ పరిగ్రహవర్జితము సాధువులు బ్రహ్మచారులకు మాత్రముగాదు. గృహస్థులుగూడ పరిగ్రహవర్జితులై యుండవలయును. పరాన్నముచేత జీవనము గడుపు స్త్రీ పురుషులకు ఏర్పడెడు శుక్ల శోణితములు ఎవరి అన్నమువల్ల యుద్భవించినవో ఆశుక్లశోణితములవల్ల ఏర్పడు సంతానములు గూడ అట్టి స్వభావము కలవారగుదురు. కాన వంశోద్ధారకులగు సంతానము కలుగవలసియుండిన భుజించే అన్నము ధర్మయుక్తముగా నుండవలయును. బ్రహ్మనిష్ఠ ధ్యానయోగాదులు చేయువారు గూడ ధర్మయుక్తమగు అన్నమును భుజింపనిచో పాపాన్నముచే మనస్సు మాలిన్యము నొందినదై విషయములలో పతితు లగుదురు.

## 6, శౌచము,

బాహ్యశౌచనముచే గొప్ప శుచిమంతుడనని తలంపరాదు. విషయ కల్మషము నశించిపుడే శౌచసిద్ధి లభించును. శుద్ధాత్మభావము మఱువక యుండునపుడే శౌచము సిద్ధించెనని గ్రహించవలయును.

ఆచారహీనం నపునంతి వేదాః
యద్యప్యధీతాన్యహషడ్భిరంగైః॥
ఛందాంస్యేనం మృత్యుకాలే త్యజన్తి
నీడం శకున్తా ఇవ జాతపక్షాః॥

ఆచారహీనుని నాల్గువేదముల్నున్న, షడంగములగు 6 శాస్త్రములున్న నిర్మలుని చేయజాలవు. అనగా నాలుగు వేదములున్న 6 శాస్త్రములున్న కంఠస్థము చేసినవాడైనను తాను చెప్పినట్లు ఆచరణము లేకపోయిన అవి ఏవియు ఫలవంతములు కావు. ఇవి అన్నియు అంత్యకాలమున దేహముతో గూడ వదలిపోవును. ఎట్లన పక్షులు గూడు కట్టి పిల్లలు నెగిరినపుడు ఏలాగున గూటిని విడిచి పెట్టునో, వీనియొక్క శాస్త్రము అన్నియు అలాగున నుపేక్షించును.

నిమిషం నిమిషార్ధం వా యత్ర తిష్ఠన్తి యోగినః।
తత్రైవ సర్వశ్రేయాంసి తత్తీర్థం తత్తపోవనమ్॥

బాహ్యాభ్యంతర శుద్ధిగలవాడైన బ్రహ్మధ్యాన పరాయణుడు ఒక నిముషముగాని. అర్ధనిముషముగాని ఎచ్చోటనుండి ధ్యానముచేయునో. అచ్చట సర్వశ్రేయస్సులున్ను కలుగును. అది పుణ్యతీర్థస్థలమగును అది తపోవనముగా పరిణమించును, బాహ్యాభ్యంతర శుద్ధి గలిగి బ్రహ్మనిష్ఠచేయు స్థలముయొక్క మహిమ దీనివల్ల గ్రహించుకొన వచ్చును.

## 7. సత్త్వశుద్ధి,

సత్త్వశుద్ధిని మనశ్శుద్ధి యని గూడ చెప్పుదురు. దీనివల్ల తృప్తి నొందక సమస్తమున కాధారమగు ఆత్మ శుద్ధమైనది అని తలంపుకలిగి ఆ శుద్ధాత్మయే తానుగా నుంటున్నానని బోధము కలుగునపుడే సత్త్వశుద్ధి పూర్తి యగును.

ప్రసన్నే విమలా ముక్తిర్వైరాగ్యేణ పరేణవై।
అభ్యాసేనైవ విజానం విశుద్ధం చ స్థిరం భవేత్॥

హృదయము నిర్మలమగునపుడు మోక్షము కలుగును. అట్టి హృదయ నిర్మలత శ్రేష్ఠమైన వైరాగ్యముచేతను,బ్రహ్మనిష్ఠాభ్యాసము చేతను కలుగును. అపుడు విజ్ఞానము అనగా అనుభవజ్ఞానము విశుద్ధముగాను సుస్థిరముగా నుండును.

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే।
ప్రసన్న చేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥

చక్కగా చిత్తశుద్ధి గలుగుచుండగా జిజ్ఞాసువులకు సకల దుఃఖముల నాశము కలుగుచున్నది. నిర్మలమైన చిత్తము కలవానికి శీఘ్రముగా బ్రహ్మనిష్ఠానుభవసిద్ధి గలుగుచున్నది.

## 8. సంతోషము.

ఈ సంతోషము బాహ్యేంద్రియ విషయములవల్ల కలిగెడు సంతోష మని తలంపరాదు. నిరతిశయానంద సంతోషము ఆత్మప్రాప్తి యందే కలుగును. కావుననే "ఆనందో బ్రహ్మ" అని శ్రుతిమాత ఉపదేశించినది.

శశాంకరశ్మి సంయోగాచ్చంద్రకాంతమణిః పయః।
సముత్సృజతి నాయుక్తః సోపమా యోగిన స్స్మృతా॥

చంద్రబింబరశ్మి చంద్రకాంతమణియందు పడునపుడు ఏలాగున అమృతము స్రవింపుచుండునో ఇదే ప్రకారము హృదయము అత్యంత ప్రసన్నము, విమలము అగునప్పుడు ఆనందామృతము ఎల్లప్పుడును ప్రవాహరూపముగా నుండునని గ్రహింపవలయును. అచంద్రిక చంద్ర కాంతమణిలో పడునప్పుడు అమృతము ఆవిర్భవింపునుగాని ఇతరశిలలో కలుగదు. ఆలాగున చంద్రునివలె చల్లదనము నిర్మలత్వముగల హృదయ ములు గలవారు మాత్రమే పరమాత్మయొక్క ఆనంద మనుభవింతురు.

యథాఽర్కరశ్మి సంయోగా దర్కకాంతో హుతాశనమ్।
ఆవిష్కరోతి నైకస్సన్నుపమా సాఽపి యోగినః॥

సూర్యరశ్మి సూర్య కాంతమణియందు పడునపుడు అగ్ని ఏలాగున ప్రజ్వలింపునో ఆలాగున వైరాగ్యముచే విశుద్ధాంతఃకరణముగల మనస్సులో పరమాత్మయగు సూర్యునియొక్క రశ్మి పడునపుడు జ్ఞానాగ్ని ప్రజ్వలింపును. అపుడు కర్మ కట్టె లన్నియు దహింపును, సూర్యకాంతమణియందు ఇట్టి శక్తి గలదు గాని ఇతరమణులలో ఏలాగున సూర్యరశ్మి పడినను ప్రజ్వలింప జాలదో ఆలాగున ఇట్టి విశుద్ధాంతఃకరణము లేనివారి సర్వేశ్వరుని జ్ఞానరశ్మి పడుచుండినను ప్రజ్వలింజాలదు.

9 కాయేంద్రియశుద్ధి.

కాయేంద్రియశుద్ధి కలుగునపుడు శుద్ధమగు చిమ్నీలయందు శిల దీపము ప్రకాశింపునట్లు ఆత్మస్వరూప ప్రకాశము కలుగుచుండును. మహా విద్య 'యగు కారణదేహము కూడ శుద్ధ మగునపుడే కాయేంద్రియ శుద్ధి పూర్తి'యగును.

బాహ్యాభ్యంతర భేదేన శౌచం తు ద్వివిధం స్మృతమ్।
మృజ్జలాభ్యాం బహిశ్శుద్ధిర్భావశుద్ధి స్తథాంతరమ్॥

బాహ్యాభ్యంతర భేదములచే శుద్ధి రెండువిధములుగా చెప్పబడినది మృజ్జలములచే దేహశుద్ధియు, బ్రహ్మచింతనచే ఆత్మశుద్ధియు కలుగవలయును.

అనిష్కల్మష చిత్తస్య సర్వతీర్థేషు మజ్జనమ్।
నరస్యాంగారకస్యేవ సదా క్షీరాభిసేచనమ్॥

కల్మషహృదయము కలవాడు అనగా కపట హృదయుడు సదా గంగాది తీర్థములందు స్నానముచేయుచుండినను కొంచెమైనను శుద్ధత కలుగదు. అది ఎటువంటిదనగా బొగ్గును తెల్లని శుద్ధమగు గోక్షీరముతో ఎంత కడిగినను ఎట్లు నలుపుపోయి తెలుపు కానేరదో ఆలాగున మలి నాత్ములు తీర్థస్నానాది క్రియలు ఎంత చేసినను శుద్ధిని పొందజాలరు.

జ్ఞాన యజ్ఞాత్పరో యజ్ఞో నాస్తి నాస్తి శ్రుతౌస్మృతౌ।
జ్ఞాన యజ్ఞైక నిష్ఠస్య న కించి దపి దుర్లభమ్॥

శ్రుతియందును, స్మృతియందును ఆత్మజ్ఞాన పరమగు యజ్ఞమున కన్న శ్రేష్ఠమగు యజ్ఞయాగాది క్రతువు దాన ధర్మాది పంచ యజ్ఞములు లేనేలేవు. జ్ఞానయజ్ఞైకనిష్ఠ కలవానికి ఇహపరములలో దుర్లభము మఱి యొకటి లేదు.

వాగ్దండః కర్మదండశ్చ మనోదండశ్చతే త్రయః।
యస్యైతే నియతాః దండాః స త్రిదణ్డీ మహాయతిః॥

వాఙ్నియమము· కర్మనియమము. మనోనియమము ఏదికలదో అది నియతముగా ఎవనియందు కలిగియుండునో అతడే త్రిదండియగు మహా యతి యగును. దండనచేయుటవల్ల దండి శబ్దమేర్పడినది. తప్పు మార్గములో వాక్కుగాని, దేహేంద్రియములు గాని, మనస్సు గాని ప్రవర్తించిన వివేకము చేత వాటిని దండించి ఋజుమార్గములో నడుపుటయే దాని కర్తమగును. 'ఏకమేవాద్వితీయం' అను బ్రహ్మభావమునుండి చలింపకయుండువాడే ఏకదండియగు సన్యాసి యనంబడును. అట్లుగాక కర్మదండమును ధరించు వాడు భారమునే వహించుచుండును.

ఇంద్రియ గ్రామసంగ్రామ సేతునా భవసాగరమ్।
తీర్యతే నేతరేణేహ కేనాపి నామ కర్మణా॥

ఇంద్రియములయొక్క సమూహ సంయమ మనెడు వంతెనచేత సంసార సాగరము తరించవలసియుండునే గాని ఈప్రపంచములో ఇతరములగు బాహ్యకర్మలచే భవసాగరము దాటజాలరు.

వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాంశ్చ తపాంసి చ।
నైవాఽజి తేంద్రియస్యేహ సిద్ధిం గచ్ఛన్తి కర్హిచిత్॥

వేదములు సాంగముగ పఠించుట చేతగాని, కేవలము సంన్యాస మాత్రము చేతగాని, యజ్ఞములు చేయుట చేతగాని బాహ్యనియమము లాచరించుట చేతగాని, శరీరమును మాత్రము శుష్కింప చేసెడు తపస్సు చేతగాని ఇంద్రియనిగ్రహము చక్కగా లేనివానికి ఒకప్పుడున్ను ఏ సిద్ధియున్ను కలుగదు. కావున మంచి ఆత్మ నియమనము, ఇంద్రియ నిగ్రహము కలిగి యుండే లాగున చూడవలయును.

## 10. స్వాధ్యాయము

దీనికి అధ్యయన మని అర్థము. కేవలము వేదములను మాత్రము అధ్యయనము చేసిన చాలదు. వేదార్థమగు ఆత్మావలోకనము బాగుగా చేయుచుండవలయును. ప్రణవము మొదలగు ఏ మంత్రములనుగాని, గీతోపనిషత్తులనుగాని, భగవత్స్మరణలుగాని చేయుట కూడ అధ్యయనమగును.

జపంతః ప్రణవం నిత్యం ముచ్యన్తే సర్వపాతకైః।
సదాభ్యాసేన సంయుక్తాః పరం మోక్షం లభన్తి చ॥

ప్రణవమును పరబ్రహ్మానుసంధానముగా జపమాచరించువారు సర్వపాపములనుండి విముక్తులగుదురు. అట్టి ప్రణవాభ్యాసముతో కూడినవారు శ్రేష్ఠమగు మోక్షమును పొందగలరు.

జపేచ్ఛ ప్రణవం నిత్యం జితాత్మా విజితేంద్రియః।
పఠేదుపనిషద్వాక్యం వేదాంతార్థాంశ్చ చింతయేత్॥

ఎవడు నియమము గలవాడై అర్థముతో సహితము మనో జయము, ఇంద్రియ జయము గలిగి ప్రణవము జపించునో మరియు ఉపనిషత్పారాయణము, వేదాంతార్థ విచారముచేయునో అట్టివాడు ఇచటనే ఈ దేహముతో నుండునపుడే మోక్షమును పొందగలుగును.

ఓంకారాది జపోఽప్యేవం భావగర్భో హ్యు దాహృతః।
ధ్యేయ వస్తుస్వరూపస్య దార్ఢ్యాయ హి జపో మతః॥

ప్రణవము మొదలగు మంత్ర జపములు తత్తద్దైవభావ గర్భితములుగా ఉండవలయును. ధ్యేయవస్తువు బ్రహ్మముయొక్క దృఢజ్ఞానము కొఱకు జప మేర్పడినది.

ప్రణవస్సర్వవేదాదిః ప్రణవశ్శివవాచకః।
మంత్రాధిరాజరాజశ్చ మహాబీజం మతః పరమ్॥

ప్రణవము సర్వ వేదములకును ఆదియైనది. ప్రణవము ఈశ్వర వాచకము. ప్రణవము మంత్రము లన్నిటికి రాజాధి రాజైనది. ఇది మహా బీజమంత్రము. దీనికి మించినదిలేదు.

ఓమితీదం సర్వమితి శ్రుతి రాహ సనాతనీ।
భవంతోఽపి విదిత్వైవం ప్రణవార్థం మహేశ్వరమ్ ।
వేదగుహ్యం చ సర్వస్వం తారక బ్రహ్మ ముక్తిదమ్॥

సర్వమున్ను ఈ ప్రణవస్వరూపమని సనాతనమగు వేదము పలుకు చున్నది. అందువల్ల మీరందరున్ను ఈ ప్రణవస్వరూపమును ఈశ్వర స్వరూపముగా ఎఱుంగవలయును. ఇది వేదములో నిగూఢమైనది. సమస్త మున్ను దీనియందు గలదు. ఇదే ముక్తినిచ్చెడు తారక బ్రహ్మస్వరూపము.

## 11. సమాధి

యోగశాస్త్ర ప్రకారము మనోలయమే సమాధి యనబడును. సాంఖ్య శాస్త్రప్రకారము సాక్షియందు నిలుకడగలిగి యుండుటయే సమాధి యందురు. జీవేశ్వరుల ఐక్యము సమాధి యని ధ్యానయోగు లందురు. జీవేశ్వరుల సమత్వము తెలిసికొనుటయే సమాధి యని వేదాంతులు వచింతురు కావున యోగ సమాధిచే తృప్తినొందక జీవేశ్వరుల ఏకత్వము అనుభవమునకు తెచ్చుకున్నప్పుడే పూర్ణసమాధి యనదగును.

యథా దీపో నివాతస్థో నిశ్చలో వాయువర్జితః।
ప్రజ్వలన్నాశయేత్సర్వమంధకారం మహామతే॥

గాలిలేని స్థలములో నిశ్చలముగా వెలుగుచుండు దీప మేలాగున ప్రజ్జ్వలించినదై అంధకార సమూహమును గృహాంతరాళములో నశింజేయునో, అలాగున హృదయాంతరాళములో సంకల్పమనెడు గాలిలేని స్థలములో ఆత్మజ్ఞాన సాక్షాత్కారమగు జ్ఞానజ్యోతి వెలుగుచునపుడు అజ్ఞానమను అంధకారము నశించును.

తద్వద్ధోష విహీనాత్మా భవత్యేవ నిరామయః।
శ్రూయతాం భూపకైవల్యం కేవలం మలవర్జితమ్॥

పైచెప్పిన ప్రకారము దీపపుకాంతిచే చీకటి నశించినట్లు ఆత్మలో గల తమస్సు నశించునపుడు ఆత్మ క్లేశరహితమగు పరమశాంతి నొందును. కేవలము మలవర్జితమే కైవల్య మనంబడును. ఈ సత్యమును తెలుసుకొన్నప్పుడే జీవుడు ముక్తి నొందగలుగును.

యోగాత్పరతరం పుణ్యం యోగాత్పరతరం శివమ్।
యోగాత్పరతరం సూక్ష్మం యోగాత్పరతరం నహి॥

ధ్యానయోగమునకు సమానమగు పుణ్యముగాని, ధ్యానయోగమునకు సమానమగు శివత్వముగాని, (మంగళకరము) యోగమునకు సమానమగు సూక్ష్మజ్ఞానముగాని ఇహలోకమున మరియొకటి లేదు.

యథైకం చ సువర్ణాది మిశితం రజతాదినా।
అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽప్యహంయుతః॥
యథైవహి సువర్ణాది క్షారాదేః శోధితం శుభమ్।
పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః॥

ఏలాగున సువర్ణము తామ్రాదిలోహములతో కలిసినదై తక్కువ వెల గలదియగు చున్నదో అలాగున జీవుడే శివస్వరూపుడై యుండినను

అహంకారాది ప్రకృతిగుణములచే జీవత్వము నొంది దీనదశకు వచ్చు చుండును. ఆ హీనమగు బంగారు స్ఫుటము వేయునపుడు దానిలోగల మాలిన్యము పోవగా శుద్ధమగు సువర్ణమేలాగున అగుచున్నదో, అపుడు పూర్వము ఉండిన మంచిబంగారు శోభను విలువను ఎట్లు పొందుచుండునో, అలాగున జీవుడు సమాధ్యనుష్ఠానమువల్ల ప్రకృతిదోషము నశించుటవల్ల శుద్ధశివస్వరూపు డగుచున్నాడు. అపుడీశ్వరునివలె ప్రకాశవంతుడును, మంగళస్వరూపుడును అగుచున్నాడు. ఈస్థితిలో జీవుడు మోక్షమును పొందుచున్నాడు.

ఇపుడు మనుస్మృతి ద్వాదశాధ్యాయమున నుపదేశించిన జ్ఞానసారమును సంగ్రహముగా తెలిపెద. ఏలన! శాస్త్రములన్నిటిలోన మనుస్మృతి వేద సారమనియు, ఆదిశాస్త్రమనియు విజ్ఞులందరు ఎఱింగియే యున్నారు పదునొకొండవ అధ్యాయములవఱకు కర్మకాండము అన్నిటిని బోధించిన తరువాత ఈజ్ఞానము నుపదేశింపబడినది. దీనియందుగల త్రిగుణస్వరూపము ప్రతి ముముక్షువున్ను పఠనము చేయవలయును. అట్లయిన తాను ఏగుణ ముతో కూడియుండునని తెలిసికొనవచ్చును.

వేదాభ్యాస స్తపో జ్ఞానం శౌచమింద్రియ నిగ్రహః।
ధర్మ క్రియాత్మచింతా చ సాత్త్వికం గుణలక్షణమ్॥

వేదాభ్యాసము,తపస్సు అధ్యాత్మజ్ఞానము, శౌచము,ఇంద్రియ నిగ్రహము; దానాది సత్కార్యము లొనర్చుట బ్రహ్మధ్యానమందాసక్తి గలిగియుండుట ఇవి సాత్త్వికమగు గుణము గలవాని లక్షణములు.

—: రాజసగుణ లక్షణములు :—

ఆరంభ రుచితా ధైర్య మసత్కార్య పరిగ్రహః।
విషయోపసేవాజస్రం రాజసం గుణలక్షణమ్॥

ఫలము గోరి కార్యములుచేయుట, స్వల్పకార్యమునందయినను అధైర్య పడుట, కానిపని చేయబూనుట; ఎల్లప్పుడు శబ్దాది విషయముల ననుభవింప బూనుట ఇవి రజోగుణవంతుని కార్యములు.

—: తామసగుణ లక్షణము: -

లోభః స్వప్నోఽధృతిః క్రౌర్యం నాస్తిక్యం భిన్నవృత్తితా।
యాచిష్ణుతా ప్రమాదశ్చ తామసం గుణలక్షణమ్॥

పేరాశ (ఈశ్వరుడిచ్చినంతలో దానధర్మాదులు చేయకపోవుట) ఎక్కువ నిద్ర, అధైర్యము, క్రూరస్వభావము, ఈశ్వరునియందు, గురువు నందు, శాస్త్రమందు, మాతాపితరులందు విశ్వాసములేక వర్తించుట, దురాచారవృత్తి కలిగియుండుట, పరుల యాచించి జీవించుట, తప్పు కార్యములు చేయుచుండుట ఇవి తామసగుణము గలవాని కార్యములు.

ఇక ముఖ్యముగా ముముక్షువులు గ్రహించవలసిన విషయములు ఈ ద్వాదశాధ్యాయాంతమున తెలిపియున్నారు. ఇవి గ్రహించిన మనుధర్మ శాస్త్రముయొక్క సారము తెలియందగును

వేదాభ్యాసస్తపో జ్ఞానమింద్రియాణాంచ సంయమః।
అహింసా గురుసేవా చ నిశ్శ్రేయసకరం పరమ్॥

ఉపనిషదాదులను పఠించుట, వాని యర్థమును చక్కగా చింతన చేయుట, ఇంద్రియ నిగ్రహపరమగు తపము నొనర్చుట, బ్రహ్మజ్ఞాన మభ్యసించుట, ఇంద్రియములను స్వాధీనములో నుంచుట, అహింసా వ్రతము కలిగియుండుట, గురుశుశ్రూషయందు ప్రవృత్తి కలిగియుండుట ఇది యెల్లను ముఖ్యమగు మోక్షసాధనములు.

సర్వేషామపి చైతేషామాత్మజ్ఞానం పరం స్మృతమ్।
తద్ధ్యగ్ర్యం సర్వవిద్యానాం ప్రాప్యతే హ్యమృతం తతః॥

ఈ వేదాభ్యాసాదులలో అన్నింటను ఉపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మను కూర్చిన జ్ఞానమే శ్రేష్ఠము. ఆ జ్ఞానమువలననే మోక్షము కలుగును. కావున అది అన్నివిద్యలలో ప్రధానమును, సంపాద్యమునై యున్నది.

యథోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః।
ఆత్మజ్ఞానే శమే చ స్యాద్వేదాభ్యాసే చ యత్నవాన్॥

బ్రహ్మ విచారతత్పరుడు శాస్త్రవిహితమగు, అగ్నిహోత్రాది కర్మలను పరిత్యజించినయెడను పరమాత్మ చింతనము, ఇంద్రియజయము, ప్రణవజపము, ఉపనిషదాధి వేదపారాయణము వీనియందు ప్రయత్న పరుడై యుండవలయును. ఇతర విధికృతకర్మలు చేయకపోయినను బ్రహ్మ విచార మొకటియైన యుండిన చాలుననియు,అదే వేదసారమనియు ఈశ్లోకము తెలుపడమైనది. బ్రహ్మవిచారముయొక్క మహిమను తెలుపుటకు పై విధముగా చెప్పడమైనది.

అజ్ఞేభ్యో గ్రంథినః శ్రేష్ఠా గ్రంథిభ్యో ధారిణో వరాః।
ధారిభ్యో జ్ఞానినః శ్రేష్ఠా జ్ఞానిభ్యో వ్యవసాయినః॥

బొత్తిగా అధ్యయనము చేయనివానికన్నను ఇంచుకంత వేదాధ్యయనము చేసినవారు శ్రేష్ఠులు. ఇంచుకంత వేదాధ్యయనము చేసిన వారి కన్నను పూర్తిగా గ్రంథము నభ్యసించినవారు శ్రేష్ఠులు. కేవల గ్రంథ పాఠములను చేయువారికంటె చింతనచేయువారు శ్రేష్ఠులు. వేదములను వేదార్థములను వల్లించినవారికంటె తదర్థజ్ఞానము కలవారు శ్రేష్ఠులు. వారి కంటె అనుష్ఠానము కలవారు మిగుల మిక్కిలి శ్రేష్ఠులు. ఈశ్లోకములో అనుష్ఠానముయొక్క మహిమను తెలుపడమైనది.

సర్వమాత్మని సంపశ్యేత్సచ్చాఽసచ్చ సమాహితః।
సర్వం హ్యాత్మని సంపశ్యన్నాధర్మే కురుతే మనః॥

సమాహిత చిత్తము కలవాడై తనయందు సత్పదార్థము, అసత్పదార్థమును చక్కగా ఎఱుగవలయును. ఎఱింగి, ఆ సదసత్తు నెఱింగినవాడై అసద్వస్తువును విడిచి సద్వస్తువులో ప్రవృత్తి కలిగియుండవలయును అందువల్ల (అట్లు బాగుగా ఎఱుంగటవల్ల) అన్నిటిలోను తనయొక్క స్వరూపము చూచినవాడగుటచేత అట్టివాని మనస్సు అధర్మమునందు ప్రవర్తింపదు. తనవలె సర్వప్రాణులను చూచు నని భావము.

తపో విద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరమ్।
తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృత మశ్నుతే॥

తపస్సున్ను, బ్రహ్మ విద్యయున్ను విప్రునకు మిక్కిలి శ్రేయస్సును కలుగచేయును. తపస్సుచేత పాపము నశించును. బ్రహ్మజ్ఞానముచే మోక్షమును పొందును.

ఏవం యస్సర్వభూతేషు పశ్యత్యాత్మానమాత్మనా।
స సర్వ సమతామేత్య బ్రహ్మాభ్యేతి పరం పదమ్॥

ఎవడు సర్వభూతములందున్న యాత్మను; తనయాత్మను, బ్రహ్మరూపముగా చూచునో, అతడు బ్రహ్మసాక్షాత్కారము వలన ఉత్తమస్థానమగు బ్రహ్మమును పొందునన్నాడు.

ఆద్యం యత్త్ర్యక్షరం బ్రహ్మ త్రయీ యస్మిన్ ప్రతిష్ఠితా
స గుహ్యోన్యస్త్రివృ ద్వేదో యస్తం వేద స వేదవిత్॥

సర్వవేదములలో మొదటిదియై, అకారోకారమకార స్వరూపమయి నందున త్ర్యక్షరస్వరూపమైన ఏ వేదసారము కలదో ఏ మూడక్షరముల యందే, మూడు వేదములున్నవో అది మరియొక త్రివృద్వేదము. అది ప్రణవ మనునది వేదమంత్రములతో శ్రేష్ఠమైనది. కనుకను పరమార్థ స్వరూపమగు బ్రహ్మమును వివరించునది గనుకను పరమార్థకమైనందున జప తపంబులు చేయువారికి మోక్షప్రదమైనందునను మిక్కిలిరహస్యమును గోప్యమునునైనది. ఎవడీ ప్రణవమును స్వరూపముతోను అర్థముతోను ఎఱుంగునో వాడు వేదవేత్తయనబడును :—ఆత్మబోధమునందు సంగ్రహముగా స్వరూపసాక్షాత్కార జ్ఞానమును పొందువిషయమై శ్రీ శంకరులు బోధించిన విషయ మిచట తెలిపెద.

వపుస్తుషాదిభిః కోశై ర్యుక్తం యుక్త్యవఘాతతః।
ఆత్మాన మాంతరం శుద్ధం వివిచ్యా త్తండులం యథా॥

లోకములో జనులు బియ్యమును దంచడముచే పొట్టు, తవుడు మొదలైనవానిని వేఱుపఱచి తెలిసికొనెడి ప్రకారముగానే; పంచకోశముల వలెనే తోచు ఆత్మను శ్రవణమనన నిదిధ్యాసనములచేత శోధించి, వీనికంటె విలక్షణుడుగా నయి సత్యజ్ఞానానంద స్వరూపుడై యుండు ఆత్మను తన స్వరూపమునుగా తెలిసికొనవలయును

నిషిధ్య నిఖిలోపాధీన్ నేతినేతీతి వాక్యతః।
విద్యాద్దైక్యం మహావాక్యైర్జీవాత్మ పరమాత్మనోః॥

దేహేంద్రియాది సకలోపాధులను ఇదికాదు ఇదికాదని త్రోసి వేయుట వలనను జీవాత్మ పరమాత్మల ఐక్యమును, భేదనివృత్తి పూర్వకమైన అఖండానంద స్వరూపార్థమును తెలియజేసెడు మహావాక్యములచే తెలిసి కొనదగినది.

వివిక్తదేశ ఆసీనో విరాగో విజితేంద్రియః।
భావయేదేక మాత్మానం తమనంత మనన్యధీః॥

ఏకాంత ప్రదేశమందు కూర్చున్నవాడై, వైరాగ్యము నవలంబించిన వాడై, ఇంద్రియముల జయించినవాడై మనస్సును చలింపకుండ ఆత్మ యందుంచి సత్యజ్ఞానానంద స్వరూపుడగు ఆయాత్మను తన స్వరూపముగా ధ్యానించవలయును.

ఏవం నిరంతరం కృత్వా బ్రహ్మైవాస్మీతి వాసనా।
హరత్యవిద్యా విక్షేపాన్ రోగానివ రసాయనమ్॥

సర్వోత్తమమైన యౌషధము సేవించుటవలన రోగములు నశించు వట్లు ఎల్లప్పుడు బ్రహ్మానుసంధానపరుడై అశుద్ధ బ్రహ్మమగు ఆత్మనే తన స్వరూపముగా, ధ్యానాభ్యాసము వేయుటవలన గలిగెడు సంస్కార రూపమగు సద్వాసన ఆవరణ విక్షేపశక్త్యాత్మకమైన అవిద్యను బొత్తిగా పోగొట్టునని దృఢముగా నమ్మవలయును. శ్రీభగవంతుడు గరుడపురాణమున పరమ భక్తుడగు గరుడునకు ఆత్మసాక్షాత్కార స్వరూపమును సంక్షిప్తముగా నుపదేశించిన భాగము నిచట తెలుపడమైనది

తస్మాద్ జ్ఞానేనాత్మతత్త్వం విజ్ఞేయం శ్రీగురోర్ముఖాత్!
సుఖేన ముచ్యతే జంతుర్ఘోర సంసార బంధనాత్.

గురుముఖతః పొందిన జ్ఞానమువలన ఆత్మతత్త్వము నెఱుంగవలయును. దానివలన మానవుడు అనాయాసముగా మోక్షమును బడయును.

గృహాత్ప్రవ్రజితో ధీరః పుణ్యతీర్థ జలాప్లుతః।
శుచౌ వివిక్త ఆసీనో విధివత్కల్పి తాసనే॥
అభ్యసేన్మనసా శుద్ధం త్రివృద్బ్రహ్మాక్షరం పరమ్।
మనో యచ్ఛేజ్జితశ్వాసో బ్రహ్మబీజమవిస్మరన్॥

ధైర్యము గలవాడై గృహమునుండి పోయి పుణ్యజలములలో స్నానముచేసి దర్భాసన కృష్ణాజిన వస్త్రాసనాదులతో కూడిన ఆసనము శుద్ధమగు ఏకాంత ప్రదేశమున కూర్చుండి మనస్సున ఓంకారమును జపించుచూ, ప్రణవార్థమగు బ్రహ్మమును, భావించు అభ్యాసము కలవాడై ఎవడు దేహమును విడుచునో, వాడు బ్రహ్మనిర్వాణమను పేరుగల మోక్షమును పొందుచుండును. ఈభావమును శ్రీకృష్ణ భగవానుడు గీత అష్టమాధ్యాయమున అర్జునుని కొఱకు ఉపదేశించియున్నాడు. అదే భావమునే కఠోపనిషత్తునందు యమధర్మరాజు నచికేతునికొఱకు తెలిపియున్నాడు. కావున ఇపుడు చెప్పిన నిర్వాణపరమగు ప్రణవాభ్యాసము శ్రుతిస్మృతుల సారమని గ్రహించుకొనవలయును. గీతలోను, కఠవల్లి శ్రుతిలోను గల విషయము ఇదివఱలో వ్రాసియుండు ఓంకారాది గ్రంథములలో తెలిపియుండుటచేతను మఱల ఇచట తెలిపిన గ్రంథబాహుళ్య మగునని తలంచియు చేర్చలేదు.

జ్ఞానహ్రదే సత్యజలే రాగద్వేషమలాపహే।
యస్స్నాతి మానసే తీర్థే తస్మై మోక్షమవాప్నుయాత్॥

రాగద్వేషములను మలము లేనిదియు, సత్యమను జలము కలదియు, అగు మనస్సునందలి జ్ఞానహ్రదమునందలి తీర్థమున ఎవడు స్నానము చేయునో వాడు మోక్షమును పొందును.

శ్రద్ధావినయసంయుక్తః శాంతి దాంత్యాది సంయుతః।
యావద్ జ్ఞానోదయస్తావద్వేదాంతార్థం నిరూపయేత్॥

ఎంతవఱకు ఆత్మజ్ఞానోదయము కలుగలేదో అంతవఱకు గురుశాస్త్ర, దైవమందు విశ్వాసము కలవాడై, శమమగు అంతరేంద్రియ విగ్రహమును,

దమమగు బాహ్యేంద్రియ నిగ్రహముతోను గూడినవారై వేదాంతార్థమును చింతనచేయుచూ, బ్రహ్మాభ్యాసము చేయవలయును.

యావదాత్మా న లబ్ధోయం శుద్ధో జ్ఞానం చ నోదితమ్।
మలీనవిషయే రాగః తావదజ్ఞానినో భవేత్॥

ఎంతవఱకు జ్ఞేయమగు ఈ ఆత్మజ్ఞానము లభించలేదో, ఎంతవఱకు శుద్ధ జ్ఞానస్వరూపమగు ఆత్మ ఉదయము కాలేదో, ఎంతవఱకు మలినమగు విషయములలో రాగము నశించలేదో అంతవఱకు తన్ను అజ్ఞానిగానే తలంచవలయును.

సర్వగం సచ్చిదాత్మానం జ్ఞాన చక్షుర్నిరీక్షతే।
అజ్ఞాన చక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్॥

ఆత్మజ్ఞాన మనెడి నేత్రము కలవాడు సమస్తమున వ్యాపించియుండు సచ్చిదానంద స్వరూపాత్మను తన ఆత్మగా చూచుచున్నాడు. అజ్ఞాన దృష్టి యను గ్రుడ్డితనము కలవాడు ప్రకాశించుచుండు సూర్యుని - చూడజాలని చందమున తన స్వరూపమగు ఆత్మను చూడజాలక యున్నాడు.

యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్।
యజ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్॥

దేని లాభముకంటె వేఱు లాభము లేదో, ఏ సుఖముకంటె వేఱు సుఖములేదో. దేని యొక్క తెలియుటకంటె వేఱే తెలియదగినది లేదో (ఆత్మజ్ఞానముకన్న తనకు తెలియదగిన జ్ఞానములేదో) అదియే బ్రహ్మమని నిశ్చయించి తెలిసి కొనవలయును. అదే తన స్వరూపమగు జ్ఞేయ బ్రహ్మమనీ తెలియదగినది.

సత్యం బ్రవీమి పరలోక హితం బ్రవీమి
సారం బ్రవీమ్యుపనిషద్ధృదయం బ్రవీమి।
సంసార ముల్బణమసార మవాప్య జంతోః
సారోఽయ మీశ్వర పదాంబురుహస్య సేవా॥

నేను సత్యమును చెప్పుచున్నాను. పరలోక హితమును చెప్పుచున్నాను. సారమును చెప్పుచున్నాను. వేదశిరస్సు అగు ఉపనిషత్తుయొక్క హృదయము ను చెప్పుచున్నాను. (వేదాంతసారమును చెప్పుచున్నాను.) దుఃఖముతో గూడిన పాపరూపమగు ఈ సంసారమును పొందియుండు జీవునకు కరుణా సముద్రుడగు సర్వేశ్వరుని యొక్క పాదారవింద సేవయొకటియే సారమైనది. అనగా నిస్సారమగు సంసారమున ఈశ్వరసేవయొకటియే సారమైనది. ఈ సంసారములో సంపాదింప దగిన సారమది యొకటియే. తక్కిన సంపాదించు వస్తువు లన్నియు నిస్సారములే అని దీనియొక్క తాత్పర్యము. అట్టి ఈశ్వరసేవయగు పడవవల్లనే సంసార సాగరముదాటి జ్ఞేయ బ్రహ్మమగు ఆత్మసాక్షాత్కారమను తీరమును జీవుడు పొందవలసియుండును. జ్ఞేయ బ్రహ్మ విషయమై చెప్పవలసిన విషయములున్ను జ్ఞేయ బ్రహ్మమును పొందవలసిన ఉపాయము లున్ను దీనిలో సంక్షిప్తముగా చెప్పడమైనది. ఓమ్.

శ్రవణం తు గురోః పూర్వం మననం తదనంతరమ్।
నిదిధ్యాసన మిత్యేతత్పూర్ణ బోధస్య కారణమ్॥

ప్రథమమున శమాది షట్కముతో కూడిన వాడై గురుముఖతః శ్రవణము చేయవలయును. తరువాత మననము, అనంతరము నిదిధ్యాసన మున్ను చేయవలసి యుండును. ఇట్లయిన మాత్రమే పూర్ణప్రబోధము కలుగును. శ్రవణముచేయించుట మాత్రమే గురువుయొక్క కార్యమగును. దానిని మననము చేయుటయు తరువాత నిదిధ్యాసన మొనర్చుటయు ముముక్షువులయొక్క (శిష్యుల యొక్క) కర్తవ్యమై యుండవలయును.

చతుర్ణామపి వేదానాం యథోపనిషదశ్శిరః।
ఇయం రహస్యోపనిషత్ తథోపనిషదాం శిరః॥

ఈ వాక్యము సాక్షాత్పరమ శివుడు శుక రహస్యోపనిషత్తునం దుపదేశించెను. దీనివల్ల మహావాక్యార్థము ఎటువంటిదో యోచింపు కొనవలయును. నాలుగు వేదములయొక్క శిరస్సే యుపనిషత్తులు. అనగా వేదముల యొక్క సారమే ఉపనిషత్తులని భావము. ఈ శుక రహస్యోపనిషత్తులో బోధించిన మహావాక్యము అష్టోత్తర శతోపనిషత్తుల శిరస్సు అగును. అనగా అన్నియుపనిషత్తులకు సారమని భావము. వేదము లన్నిటికిని సారమైనది.

వేదములు సారమే యుపనిషత్తులు. ఉపనిషత్సారమే జ్ఞేయ బ్రహ్మమును బోధించెడు శివజీవైక్యపరమగు మహావాక్యము. ఇక మహావాక్యముల ప్రభావమును గురించి తేజోబిందూపనిషత్తు చెప్పిన ఆరు (6) వాక్యములను నిరూపించుటకు తలంచడమైనది.

1. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం బుద్ధివ్యాధిం వినాశయేత్।
2. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం చిత్తబంధం వినాశయేత్।
3. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం చిత్తవృత్తిం వినాశయేత్।
4. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం సంకల్పాదీన్వినాశయేత్।
5. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం కోటిదోషం వినాశయేత్।
6. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం కామాదీన్నాశయేత్క్షణాత్॥

1. అహం బ్రహ్మాస్మి అను మంత్రము బుద్ధియొక్క అజ్ఞానవ్యాధిని నిశ్శేషముగా నాశ మొనర్చును.

2. అహం బ్రహ్మాస్మి యను మంత్రము చిత్తముయొక్క భవ బంధమును నిర్మూల మొనర్చును.

3. అహం బ్రహ్మాస్మి యను ఈ మహా మంత్రము చిత్తము యొక్క వృత్తులను నిశ్శేషముగా విలయ మొనర్చును.

4. అహం బ్రహ్మాస్మి యనెడి ఈ మహావాక్యము సంకల్పము లన్నిటిని విలయ మొనర్చును.

5. అహం బ్రహ్మాస్మి అను ఈ మహామంత్రము కోటిదోషములను క్షయమొనర్చును.

6. అహం బ్రహ్మాస్మి యను ఈ మంత్రము క్షణకాలములోనే కామాది దోషము లన్నిటిని విలయమొందించును. అనగా దీనిని నిరంతరము అనుసంధానము చేయుచుండవలయును. నిత్యానుసంధానము కొఱకు తేజోబిందూపనిషత్తు మంత్రములు కొన్నిటిని యిచట చేర్చడమైనది.

1. అఖండైకరసం బ్రహ్మ చాఖండైకరసం వ్రతమ్।
అఖండైకరసో జీవః అఖండైకరసో హ్యహమ్॥

2. అఖండైక రసో బ్రహ్మ అఖండైకరసో హరిః।
అఖండైకరసో రుద్రః అఖండైకరసోఽస్మ్యహమ్॥

3. అఖండైక రసోహ్యాత్మా హ్యఖండైక రసోగురుః।
అఖండైక రసం లక్ష్య మఖండైకరసమహః॥

4. అఖండైక రసో దేహః అఖండైకరసం మనః।
అఖండైక రసం చిత్త మఖండైకరసం సుఖమ్॥

5, అఖండైక రసం కించి దఖండైకరసం పరమ్।
అఖండైక రసాదన్యాన్నాస్తి నాస్తి షడానన॥

6. అఖండైక రసం సర్వం చిన్మాత్రమితి భావయేత్।
చిన్మాత్రమేవ చిన్మాత్రమఖండైక రసం పరమ్॥

1. భవవర్జిత చిన్మాత్రం సర్వం చిన్మాత్రమేవ హి।
ఇదంచ చిన్మాత్రమయం చిన్మయమేవహి॥

2. చిత్తవృత్తి విహీనోఽహం చిదాత్మైక రసోఽస్మ్యహమ్।
సర్వదృశ్యవిహీనోఽహం దృగ్రూపోఽస్మ్యహమేవ హి॥

3. చిద్రూపమాత్రం బ్రహ్మైవ సచ్చిదానంద మవ్యయమ్।
ఆనంద ఘన ఏవాహమహం బ్రహ్మాస్మి కేవలమ్॥

4. సత్యానంద స్వరూపోఽహం జ్ఞానానంద ఘనోఽస్మ్యహమ్।
విజ్ఞానమాత్ర రూపోఽహం సచ్చిదానంద లక్షణః॥

5. బంధముక్తి విహీనోఽహం శాశ్వతానంద విగ్రహః।
ఆది చైతన్యమాత్రోఽహ మఖండైక రసోఽస్మ్యహమ్॥

6. ముక్తోఽహం నిర్వాణసుఖరూపవాన్।
సత్యవిజ్ఞానమాత్రోఽహం సన్మాత్రానందవానహమ్॥

1. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం దేహదోషం వినాశయేత్।
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం జన్మపాపం వినాశయేత్॥
2. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం మృత్యుపాశం వినాశయేత్।
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం ద్వైత దుఃఖం వినాశయేత్॥
3. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం భేదబుద్ధిం వినాశయేత్।
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం చింతాదుఃఖం వినాశయేత్॥
4. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం కోటిదోషం వినాశయేత్।
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం జ్ఞానానందం ప్రయచ్ఛతి॥
5. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం సర్వశోకం వినాశయేత్।
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం దృశ్యపాపం వినాశయేత్॥
6. అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం క్రోధశక్తిం వినాశయేత్।
అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం బుద్ధివ్యాధిం వినాశయేత్॥

ఓం తత్ సత్.

ఓం శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ భగవద్గీతాధ్యాయ స్వరూపము

శ్రీభగవద్గీత ప్రతి అధ్యాయమునకును (అర్జున విషాద యోగము మొదలు, మోక్షసన్న్యాసయోగము వఱకుగల పదునెనిమిది అధ్యాయముల కును) (1) అర్జున విషాదయోగము, (2) సాంఖ్యయోగము. (3) కర్మ యోగము ఈలాగున అన్నిటికిని వేఱువేఱు పేర్లు గలవు. ప్రతి అధ్యాయమున "ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే" అనియు ఫలాని అధ్యాయ మనియు చెప్పబడి యున్నది అనగా ఇది శ్రీకృష్ణభగవానులు ఉపదేశించిన దనియు ఉపనిష త్సార మనియు, బ్రహ్మవిద్యయనియు, యోగశాస్త్రమనియు, శ్రీకృష్ణార్జున

సంవాదమనియు, అట్లు అయిదు విశేషణములు గలిగినట్టి ఫలాని అధ్యాయ మని తెలుపబడియున్నది.

భక్తులలో కొందఱికి ఒక్కొక్క అధ్యాయమునకు ఫలాని, ఫలాని పేర్లు గలుగుటకు కారణ మేమి యని సందేహము గలుగు చుండును. ప్రతి అధ్యాయములోను ఇది శ్రీభగవానులు ఉపదేశించిన దనియు, అంతియేగాక, వేదములయొక్క సారమే ఉపనిషత్తుగా నుండగా మఱలా ఈగీత ఉపని షత్తుల సారమనియు, అంతియే గాక బ్రహ్మవిద్య యనియు, ఇదిన్ని గాక యోగ శాస్త్రమనియు, మఱల శ్రీకృష్ణార్జున సంవాద మనియు తెలుపబడినది. అనగా అర్జున విషాదయోగము, సాంఖ్యయోగము, కర్మయోగము, జ్ఞాన యోగము ఈలాగున పదునెనిమిది యోగములను జెప్పిరి. అనగా సాంఖ్యము చేతనే యోగ సిద్ధియనియు, కర్మచేతనే యోగసిద్ధి గలుగుననియు, జ్ఞానము చేతనే యోగము లభించుననియు ఈలాగున ప్రతి అధ్యాయములోను చెప్పి యున్నారు. వేదాంత శాస్త్రములలో యోగ మనినను, జ్ఞాన మనినను ఒకే అర్థ మగును. రెంటికిని మోక్ష మనియే అర్థము.

ఇచ్చట భక్తుల కొక సంశయము గలుగుచున్నది. ఏమన, మోక్షము గలుగుటకు ఈఅన్ని అధ్యాయములలో చెప్పినట్లు అన్ని యోగములు శీలించవలయునా? లేక వారివారి హితము ననుసరించి ఒకే యోగము నభ్యసించిన చాలునా? ఒకే యోగముచే మోక్షము గలుగుచో ఇన్ని అధ్యాయము లేల చెప్పవలెను? అన్ని అధ్యాయములలోని యోగము లన్నియు ఒక్కరిచేత ఒక్క జన్మలో అనుష్ఠించుటకు కాలము చాలదు గదా!

ఇట్టి సందేహములకు సమాధానము గలదు. వారి వారి శక్తి నను సరించి వీనిలో ఒకే యోగము ననుష్ఠించినను చాలును. ఎలన, ఆయుర్వేద ములో అనేక ఔషధముల పేర్లున్నూ, వానియొక్క విధానములున్నూ చెప్పబడి యున్నవి? అయితే రోగియైనవాడు సమస్త ఔషధములను ఉపయోగ పఱచవలెనా? లేక తనరోగమునకు తగిన ఒక్క ఔషధమును సేవించిన చాలునా? చాలినచో అనేక ఔషధముల యేర్పాటు ఏల చేయవలెను? కారణమేమన, రోగము లనేకములు, ఆలాగుననే జీవకోట్ల కర్మ లనేకము లగుటచేత అనేక యోగములు చెప్పవలసి వచ్చినది. ఒకే ఔషధమైనచో పెక్కుదలు రోగులకున్నూ సౌఖ్యము గలుగుట ప్రయాసము.

అలాగున భవరోగశమనము కొఱకు కారుణ్యనిధియైన శ్రీభగవానులు జీవకోట్ల హితము ననుసరించి యిన్ని యోగములను చెప్పియున్నారు. దీని యందుగల రహస్యమేమన రోగమునకు తగిన ఒక్క మందైనను లేనిచో రోగశాంతి యెట్లు గలుగదో, అలాగున ఏదైన నొక్క యోగమును అనుష్ఠానములో నుంచనిచో సంసార సంబంధవ్యాధి నివృత్తిగాజాలదనియే. అయితే మందు ఎంతసారవంత మైనను పథ్యము సరిగా లేనిచో వ్యాధి శమించ నట్లు, ఏయోగము ననుష్ఠించినను, ఆచరణ సరిగా లేనిచో భవరోగము నిశ్శేషముగ శమించదని ముముక్షువులు జ్ఞప్తిలో నుంచుకొనవలెను. వైద్య శాస్త్రములలో ఔషధమునకు ఒకపాలు బలమనియు, మూడుపాళ్ళ బలము పథ్యములో గలదనియు చెప్పియున్నారు. అలాగున వేదాంతశాస్త్రములలో గూడ అనుష్ఠానమునకే యాధిక్య మిచ్చి యున్నారు. గాని, మంత్రమునకు గాని, యోగమునకుగాని అధిక్య మివ్వలేదు. అందుచేతనే "భస్మనీవ హుతం యథా" యనుటకు కారణము. ఇచ్చట యోగశబ్దము యొక్క అర్థము బాగుగ గ్రహించవలసియుండును. "యోగశ్చిత్తవృత్తినిరోధః" అని శ్రీ పతంజలి మహర్షి తెలిపి యుండినను, యోగమునకు ఈశ్వర సాక్షాత్కార మనియు, ఈశ్వరైక్యమనియు, జీవబ్రహ్మల యేకత్వమనియు, ఆత్మ సాక్షాత్కార జ్ఞానమనియు అర్థములు గలవు. గీత ఆఱవ అధ్యాయమునందు.

యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥

అని శ్రీభగవానులు తెలిపియున్నారు. అనగా యోగియైనవాడు తన ఆత్మనిష్ఠకు ప్రతిబంధము గలుగనిచోటు నందుండి మనో దేహములను జయించి, ఆశలను విడిచి. పరవస్తువులను పరిగ్రహము చేయక ఆత్మను పరమాత్మధ్యానమం దై

ప్రః ఇచట ఏకాకి యని చెప్పుటచే ఒకే ప్రదేశములో ఒక్కఁడు మాత్రము ఉండవలెనని కాదు. ఒక్కొక్కరు ధ్యానము చేయు గదులలో రెండవవారుండరాదని భావము. పరవస్తువులను ఎక్కువగ పరిగ్రహించుటచే తన పుణ్యము క్షయించును. మంచి నిచ్చ తనకు లేనిచో పాపము గ్రహించ

అభివృద్ధినొందును. పాప మధికరించిన ధ్యానమందు సుఖము తగ్గిపోవును. దృశ్యవిషయములలోనికి మనస్సు తిరుగును. ఇదే దానికి గుఱుతు. కఠోపనిషత్తునందును ఈలాగున చెప్పబడినది—

యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ।
బుద్ధిశ్చ న విచేష్టేత తామాహుః పరమాం గతిమ్॥

'ఓ నచికేతుడా! శ్రోత్రాది జ్ఞానేంద్రియములైదును. మనస్సుతో గూడ ఎప్పుడు ఆత్మయందు చేరియున్నవో, బుద్ధి ఆత్మయందు నిశ్చలమై యుండి యే వ్యాపారములందును వ్యాపింపకయుండునో దానినే శ్రేష్ఠమైన మోక్షగతిగా చెప్పిరి' అని యముడు పలికెను. మఱియు,

తాం యోగమితి మన్యన్తే స్థిరామింద్రియధారణామ్।
అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవావ్యయౌ॥

బాహ్యాభ్యంతరేంద్రియములను ధరించియున్న అచంచలమైన ఆ పరమనిష్ఠను యోగమని చెప్పుచున్నారు. యోగము జననాపాయములు గలదిగాన. యోగమందు ప్రమాదము లేనివాడై యుండవలయును. మఱియు యోగమందు వియోగమును పొందక చూడవలయును.

ఇవి అన్నియు సరి. ఇప్పుడు భక్తులకు గల ముఖ్యసందేహ మేమన, మొదటి అధ్యాయమును అర్జున విషాద యోగమని చెప్పియున్నారే? విషాదమునకు వ్యాకులమనియు, దుఃఖమనియు, మనఃక్లేశమనియు మొదలగు అర్థములు గలవు; కావున వ్యాకులతకూడ ఒక యోగ మగునా? విషాదము మోక్షము గలుగ జేయునా? అంతేగాక ప్రారంభములో ఆనందకరములగు మంగళవాక్యములనే యోగమని ఉపదేశింపక దుఃఖవార్తలను యోగమని చెప్పిరే. ఇదియేమి ధర్మము? ఇదియొక్క సందేహమే. యోగమనగా ఐక్యమని అర్థమును ఒప్పుకొని యున్నారు. నాలుగు కోణములు గల యొకచతుష్కోణ చక్రము లిఖించి మధ్య 'యోగము' అని వ్రాసి నాలుగు ప్రక్కలను నాలుగు వాక్యములను లిఖించిన అన్నిటికిని యోగశబ్దము అన్వయించు చుండును. ఈ క్రింది చక్రము చూడుడు—

పోవుటయు, అట్టివిపత్తులనుండి రక్షించువారు లేకపోవుటయు, దాని వలన గలిగెడి భయభ్రాంతులున్ను వైరాగ్యముయొక్క చిహ్నములు. కావున అర్జునునకు కలిగిన విధమున అంతఃపరితాపము, భయము, వ్యాకులత క్లేశము, ఈలాటి దుఃఖము గలుగునపుడే నిజమైన ఆత్మతత్త్వ ముపదేశించుటకు సరియైన కాలము. ఇదియే శ్రీగీతయందు చూపింపబడినది.

మఱియు యుద్ధరంగములో మిగుల మహాశ్చంచలత్వము గలిగియుండే తరుణమున పదునెనిమిది అధ్యాయములతో గూడిన ఏడునూర్ల శ్లోకముల నుపదేశించుటకు సమయ ముండునా? యనియు వాలమందికి సందేహము గలుగును. ఇది సామాన్య మానవుల బుద్ధి గణనయందు తోచుట సహజమే. దైవానుభావములో దివ్యదృష్టి గలవారికిది ప్రయాసముగా నుండదు. ఏలన, ఇప్పుడు పఠించుచుండు వ్యాకరణ శాస్త్రమునంతయు శ్రీ చిదంబరమున నటరాజ ప్రభువగు పరమశివుడు పదునాల్గు చిన్న చిన్న సూత్రవాక్యములలో నుపదేశించెను. కావుననే దీనికి శివసూత్రములని పేరు వచ్చినది. ఎట్లన,

నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారమ్।
ఉద్ధర్తుకామస్సనకాదిసిద్ధా నేతద్విమర్శే శివసూత్రజాలమ్॥

వాక్యకారం వరరుచిం భాష్యకారం పతఞ్జలిమ్।
పాణినిం సూత్రకారం చ ప్రణతోఽస్మి మునిత్రయమ్॥

దానిని పాణిని మహర్షి గ్రహించి యెనిమిది అధ్యాయములుగల వ్యాకరణ సూత్రములను రచించిరి. దానికి వరరుచి వార్తికములను, శ్రీపతంజలి సూత్రమహాభాష్యమును రచించెను. భగవద్వాక్యము ఈలాగున నేయుండును. అతి సూక్ష్మమగు మఱ్ఱి విత్తనములోపల గొప్పదగు వట వృక్షము ఇమిడియున్నట్లు సూత్రవాక్యములున్ను గొప్ప అర్థము గలిగి యుండును. అట్టి సూత్రవాక్యములనుబట్టియే శ్రీవేదవ్యాసభగవానులు [illegible] తపోవనములో [illegible] గూర్చుండి దివ్యదృష్టితో శ్రీకృష్ణ భగవానుల యాశయము తెలిసికొని గీతాశాస్త్రమును రచించెను. సూత్ర వాక్యములయొక్క అర్థము [illegible]

అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్।
అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః॥

స్వల్ప అక్షరములతో గూడినది. అయినను సందేహములన్నిటిని రహిత మొనర్చునదియు, అతిసారమైనదియు, అనంతముఖము (పెక్కు అర్థము)లతో గూడినదియు, దోషరహిత మైనదియు, నిరంకుశమైనదియు, ప్రతిరోధమేమియు లేనిదియు నగు వాక్యమునే సూత్రము నెఱింగిన మహర్షులు సూత్రమని నుడివిరి. ప్రతి అధ్యాయములోను ఆ అధ్యాయ విషయమును దెలుపు ఒక్కొక్క శ్లోకమును మాత్రము ఇందు నిరూపింప తలంచడమైనది.

ఈ మొదటి అధ్యాయమందు శ్లో॥ 47-

ఏవముక్త్వాఽర్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః॥

అర్జునుడిట్లు చెప్పి దుఃఖముచేత చలింపబడిన మనస్సు గల వాడగుచు ధనుర్బాణములను విడిచి యుద్ధమందు రథముపై దిగులు నొంది చతికిల బడెను.

గీతయందు ప్రథమమున ప్రయోగించిన వాక్యము "ధర్మక్షేత్రే" అనునది. ధర్మశబ్దము ధృతరాష్ట్రునిచే తెలిసియో తెలియకయో, మొట్ట మొదటనే వచించడమైనది. అందువలన ధర్మమునకే జయము గల్గును గాని అధర్మమునకు గలుగదని సిద్ధమైనది. ఈవాక్యము ధృతరాష్ట్రుని వాక్కుతో ధర్మదేవత పలికించినట్లున్నది. మఱియు సాక్షాత్ శ్రీ కృష్ణ భగవానులు ప్రపంచములో అధర్మముల నణచివేసి ధర్మమును స్థాపించు టకై అవతరించియుండిరి. ఈవాక్యము భగవంతుడే స్వయముగ నాల్గవ అధ్యాయములో జెప్పియున్నారు- "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే - ధర్మశబ్దముయొక్క అర్థము మిగుల సారయుతమైనది. దేనివలన ఈజగత్తు ధరింపబడుచున్నదో అది ధర్మమే. "ధారణాద్ధర్మ ఇత్యాహుః" అనగా ఈప్రపంచమంతయు ధర్మసూత్రములో బంధింపబడియున్నది. ముత్యములచే కూర్పబడిన హారము యొక్క సూత్రము తెగినచో ఏలాగున

అందలి ముత్యములు భిన్నా భిన్నములై పోవునో, అలాగున ధర్మచ్యుతి గల్గిన మనుజునియొక్క స్థితియు గ్రహించుకొనవలెను. మహాసూర్యగోళము ను. నక్షత్రాదులును, ఇతరగ్రహములును. భూమియు, చంద్రుడు మొదలగున వన్నియు ఒక్కధర్మసూత్రములోనే కట్టబడియుండును. ఈ గ్రహముల యొక్క సంచారములు, ఉదయాస్తమయములు, ఋతువులు, అయనములు, సంవత్సరములు. మహాకల్పములు. పాపపుణ్యముల ఫలములు. జననమరణములు. అవృత్తిరహితమైన మోక్షము మొదలగునవన్నియు ధర్మసూత్రముపైననే యాధారపడియున్నవి. అట్టి ధర్మమమును విడనాడక ఆచరించుటయే యథార్థమగు ఈశ్వరాజ్ఞ ననుసరించి వర్తించుటయగును. ధర్మమువల్లనే యీజగత్తు నిలుచుచున్నది. ధర్మానుష్ఠానమువలన జీవుడు శుద్ధుడై యూర్ధ్వలోకములను బొందుచుండును. అధర్మప్రవృత్తివలన జీవుడు అజ్ఞానముచే గప్పబడి క్రమముగ అంధకార రూపమగు దుఃఖములోనికి పడిపోవును. ధర్మశబ్దమును గురించిన ప్రమాణము లెన్నియో గలవు. ధర్మము మానవునికి వెన్నెముక వంటిది. అదిచెడిన యిక మనుజుడు లేవజాలడు. జీవునియొక్క స్థితియు అలాగుననే యుండును. ఎవనియందైనను జ్ఞానముగాని, తపస్సుగాని, ధనముగాని, అధికారముగాని, పూజ్యతగాని, జయముగాని, బలముగాని, ధర్మానుష్ఠానము గల్గియుండు వఱకు మాత్రమే నిలుచును. ధర్మలోపము గలుగునప్పుడు వానిని ధర్మదేవత విడిచిపెట్టి పోవును. ఇది ప్రత్యక్షముగ కురు పాండవుల చరిత్రవల్ల సర్వజనులకును తెలియదగును.

కావున ధర్మమార్గములో నుండువఱకే జయము గల్గుననియు అధర్మ మార్గములోనుండువారికి క్షయమే గల్గుననియు గీతయొక్క మొదటి వాక్యము వలననే జనులు గ్రహించుకొనవచ్చును. రెండవ శబ్దము "కురుక్షేత్రే" అనునది. కౌరవకులమునకు ఆది పురుషులు కురువులు. వారివల్ల యేర్పడిన వంశమగుటచే కౌరవులని పేరు వచ్చినది. మొదటి కురుమహారాజు మహా ధర్మాత్ముడు వారిస్థలమగుటవల్లనే దానికి కురుక్షేత్రమను నామధేయము గల్గెను. మఱియు కురుమహారాజు అచ్చోట అనేకములగు ధర్మకార్యముల జేసియుండెను. అందుచేతను కురుక్షేత్రమునకు ధర్మక్షేత్రమను విశేషణము ప్రయోగించుటకు కారణమైనది. దీనివల్ల కురువంశీయులు ధర్మాత్ములే గాని

దుర్యోధనుని వంటి అధర్మపరాయణులు గారను అభిప్రాయముతోనే గలి ధృతరాష్ట్రుడట్లు పలికియుండవచ్చును. అట్టి ధర్మక్షేత్రమగు పుణ్యభూమిలో అధర్మము చేయబూనుచున్నావా? యని దుర్యోధనుని గూర్చియు తలంచి యుండవచ్చును లేక, పుణ్యభూమిలో ప్రవేశించినప్పుడు పాప బుద్ధి తొలగి పుణ్యస్వభావము కొంతవరకు గలుగును గాన ఆ స్థల మాహాత్మ్యము వలన దుర్యోధనుని చిత్తమునకైన మార్పు గలుగునని తలంచియైనను ధృతరాష్ట్రు డడిగి యుండవచ్చును

జనుల హృదయము మూడు విధములుగా నుండును. ఉత్తమ గుణముగలవారి హృదయము మృదువుగా నుండును. మధ్యమ స్వభావము గలవారి చిత్తము నిండా కాఠిన్యముగాని మృదుత్వముగాని లేనిస్థితిలో నుండును. కర్మజీవుల మనస్సు కఠినముగానే యుండును. ఉత్తముల హృదయము రేగడమట్టి వలెను మధ్యములది కొయ్యవలెను.కఠినులగు అధములకు రాయివలెను నుండును. జలమున తడసిన మట్టి వెంటనే కరుగునట్లు ధర్మ స్థలములోను, పుణ్యప్రదేశములోను, పుణ్యాత్ముల సమీపములోను ఉత్తముల మనస్సు కరిగిపోవును. మధ్యములు కొంతకాలము పై జెప్పిన స్థలములలోనుండిన జలములో పడియుండు మాను కొన్నిరోజులకు తడిసి మెత్తగిలిపోవునట్లు క్రమముగ పరిశుద్ధు లగుదురు. అధముని హృదయము రాతివంటిదగుట వలన పుణ్యస్థలములో గాని పుణ్యపురుషుల సమీపమున గాని ఎంతకాలముండినను, నీటిలోనుంచిన రాతివలె మార్పుగల్గకుండును. ఇదిన్ని కురు పాండవుల చరిత్రచే వ్యక్తమగుచున్నది.

ధర్మక్షేత్రమగు కురుక్షేత్రములో ప్రవేశించినవెంటనే, అర్జునుని హృదయము కరిగి నిర్వేదము వహింపజొచ్చెను. పాపకార్యమున ప్రవేశించి నందులకు దుఃఖపడి అన్నిటిని త్యజించి రథముపై వెలవెల బడిపోయెను. కాని దుర్యోధనుని చిత్తమునకు, ఎలాటి మార్పును గలుగలేదు. ధర్మరాజుకూడ దుఃఖాక్రాంత చిత్తముగలవాడై పాపకార్యమగు యుద్ధము చేయుటకన్న, నిశ్చితముతో అరణ్యమున నుండి, తపస్సుచే సిద్ధమని తలంచుచున్నట్టి దుఃఖసాగరములో మునిగిపోయెను. ఇదియంతయు భారతమున గనబడగలదు. ఈ రహస్య మెఱింగియే తపస్సు ధ్యానము, యోగము చేయువారు [illegible]

ప్రదేశములోనుండిన, వారియొక్క అనుష్ఠానము నిర్విఘ్నముగ సిద్ధించునని చెప్పుటకు కారణము.

మఱియు పుణ్య విశేష స్థలములోనికి పాపస్వభావముగల భూత ప్రేతపిశాచాదులు ప్రవేశింపజాలవు. దీపము దగ్గఱకు గబ్బిలములుగాని, గుడ్లగూబలుగాని రాజాలవు. మనోజయముగలుగు వఱకును నివాసస్థలమున్ను ఆహార నియమమున్ను బ్రహ్మనిష్ఠులు తప్పక అవలంబించవలయును. ఆహారములపై కోరిక గలిగినను, దొరకని స్థలములోనే యోగసిద్ధి గలుగు వఱకునుండవలెను. ఆహారమునకు నిండా కష్టముగానుండు స్థలములోను ఉండరాదు. అట్లైన మాత్రమే తపస్సు సిద్ధించును. ఇంద్రియ విషయము లలోపల మనస్సు పోయిన నిగ్రహించుకొనుట చాలకష్టతరము. ఒకవేళ శక్తిగల్గి యుండినను, అట్టిదోషము లేనిస్థలమైనచో, నిగ్రహప్రయత్నము కూడ అవసరము లేదుగదా! మఱియు ప్రారంభదశలో అభ్యాసులకు అట్టి నిగ్రహశక్తి గలిగియుండదు. కావున అట్టి ముముక్షువుల క్షేమము నుద్దేశించి యైనను నివాసస్థలమున్ను ఆహార నియమమున్ను ఆత్మజ్ఞానులు అవలంబించుట యుచితము. ఇట్టి నియమము లేకపోవుటయే పూర్వీక ఋషుల యొక్కయు యోగులయొక్కయు, తాపసులయొక్కయు, జ్ఞానులయొక్కయు స్థితి యిప్పుడుండు వారికి గలుగక పోవుటకు కారణము.

ఇకను నివాసస్థలమును గూర్చిన యొక్క రహస్యము గలదు. అదే మన, బాహ్య ప్రదేశములో స్థలమైన అనగా నేత్రేంద్రియ ఘ్రాణేంద్రి యాదులకు గోచరమైన దుర్వాసనగల వస్తువు లుండిన ప్రదేశములో ఏలాగున నుండుట కిచ్ఛగలుగదో, వికార వస్తువులను జూచినను, వికార శబ్దములను వినినను మనశ్శాంతి గలుగదో, అదేరీతిగ సూక్ష్మదుర్వాసనలు గల స్థలమునుండిన మనశ్శాంతి గలుగదు. అవి మనకు తెలియకనే మనస్సులో తగులుకొనుచు మనశ్శాంతికిని, ప్రసన్నత్వమునకు హాని కలుగజేయును. కనుక దుష్టజనులుండు ప్రదేశమునను, దుష్టకార్యములు జరుగు స్థలము నను ఉండుట మంచిది కాదు. అలాగుననే విషయాసక్తులు కోపస్వభావులు, పాపబుద్ధి గలవారలు ఉండుస్థలములనున్ను యోగసాధకులు కానేరరు.

# సాంఖ్య యోగము

సంఖ్యలను గుఱించి చెప్పిన దగుటచే ఈ యధ్యాయమునకు సాంఖ్య యోగమని నామధేయము గల్గెను. 1, 10 ఈలాటివి సంఖ్యలని చెప్ప బడును. ఈసాంఖ్యయోగమునకు కపిల మహర్షి మొదటివారు. వీరు ప్రకృతి తత్త్వము అన్నిటిని లెక్కపెట్టిన ప్రకృతికి పరమగు ఆత్మతత్త్వమును ఉపదేశించినవారు. దీనిని బట్టియే యిప్పుడు సాంఖ్యతత్త్వమును నేర్చు కొనవలయు నని వేదాంతులు కూడ చెప్పుచున్నారు. ఇది ప్రధానమునుండి అనగా మూల ప్రకృతినుండి పృథ్వీతత్వము వఱకు గల తత్త్వము లన్నిటిని నిరూపించి, ఇవి యన్నియు నశించు ననియు ఆత్మ యొక్కటి మాత్రమే నాశములేని వస్తువనియు బోధించును. కావున అట్టి ఆత్మతత్త్వము తెలిసి కొనుటయే మోక్షమని చెప్పను. ఆత్మ నశించునది కాదని అర్జునునకు తెలియుటకొఱకు ఈ యధ్యాయమును శ్రీభగవాను లుపదేశించిరి. ఇట్టి యుపదేశమువలననే అర్జునునియొక్క శోకమోహములు వదలిపోయినవి. ఓహో? ఈయుపదేశముయొక్క మహిమ యేమని చెప్పవచ్చును! దీనికి ఆత్మోపదేశమని పేరు. ఇట్టి ఆత్మోపదేశము వినా జీవునియొక్క శోకమోహ ములు నశింపవనియు శాశ్వతసౌఖ్యము గలుగదనియు తెలియదగినది. ఈ యధ్యాయములో నీ క్రిందిశ్లోకము ముఖ్యము.

> అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ।
> నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః॥

ఈ ఆత్మ ఛేదింప నలవిగానిది. దహింప నలవిగానిది, తడుప శక్య ముగానిది, ఎండింప సాధ్యముగానిది, సర్వ వ్యాపకమైనది, నిశ్చలమును అనాదియునై నది, ఇంద్రియములకు గోచరముకానిది, మనస్సువే జింతింప నలవిగానిది, సనాతనమైనది. ఇదే నిజమైన సనాతన ధర్మతత్త్వము, ఇట్టి శాశ్వత బ్రహ్మవస్తువును తెలిసికొనక జనులు బాహ్యములైన వర్ణాశ్రమ ములనే సనాతనమని తలంచి వాద ప్రతివాదములకు లోబడి ద్వేషములను పెంచి దేశారిష్టములను గలుగజేసిన, అందఱియొక్క భావిశ్రేయస్సునకు అడ్డు గలుగజేసిన వారగుదురేగాని, వారిక చేసిన దేమియు నుండదు. ఈయధ్యాయమున బ్రహ్మనిష్ఠులకు ప్రాణమువంటి స్థిత ప్రజ్ఞుని లక్షణము

బోగుగ నాచరణమునందుంచక పోయిన సాధకుని తక్కిన యనుష్ఠానము లన్నియు పతనమునకు కారణము లగును. కావున ప్రతివారును ఆత్మ జ్ఞానము గలవారియొక్క గుఱుతును చెప్పెడు ఈఅష్టాదశశ్లోకములను తప్పక పఠనము చేయవలెను. ఇది శాస్త్రములయొక్క సారము. ముముక్షువు లకు ప్రాణము.

# కర్మయోగము

కర్మయోగ ముపదేశింపబడినందున ఈఅధ్యాయమునకు కర్మ యోగమని పేరువచ్చినది. ఏకర్మ యేలాగున చేయవలెనో, ఎట్లు చేసిన జీవుడు ఇహమందును పరమందును సౌఖ్యము నొందగల్గునో, అట్టి విషయము లన్నియు సంక్షిప్తముగ దీనియందు నిశ్చయింపబడియున్నవి. సామాన్య ముగ కామ్యకర్మమనియు, నిష్కామకర్మమనియు. నిషిద్ధకర్మ మనియు, కర్మ మూడు విధములుగ జెప్పబడును. కామ్యకర్మములచే వానివానిలో నిశ్చయింపబడిన ఫలమును ఇహమందును పరమందు, మరుజన్మమందును జీవు డనుభవించును నిష్కామకర్మచే అంతఃకరణ శుద్ధి గల్గి లేక ఈశ్వరా నుగ్రహప్రాప్తినొంది జీవుడు మోక్షమున కర్హుడగును. నిషిద్ధ కర్మలవలన ఇహమందును, పరమందును. పునర్జన్మమందును జీవుడు దుఃఖ మనుభవింప వలసియుండును. ఈ కర్మ సంస్కారములు ఇప్పుడు కంటి కగుపడక పోయినను సూక్ష్మవాసనారూపముగ జీవుని ఆశ్రయించియుండును. సువాసన నేత్రమునకు గోచరము కాకపోయినను పుష్పముల నాశ్రయించియే యెట్లుండునో, అట్లనే కర్మయోగరహస్యమును గూర్చియు నెఱుంగవలెను. ఈతత్త్వమును తెలిసికొనిన జనులయొక్క రాబోవుజన్మలను కనుగొన వచ్చును. పరలోకములో ఏస్థితికల్గునో అదియు కనుగొనవచ్చును, జన్మ రాహిత్యమైననా, లేదా యనియు గ్రహింప సాధ్య మగును.

జీవునికి నాలుగు స్థానములు [సౌఖ్యములు] గలవు (1)ఇహసుఖము, (2) పరసుఖము [స్వర్గప్రాప్తి], [3] ఉపాసన మహిమ వలన గలిగెడు బ్రహ్మలోకాది స్థానము. (4) ఈశ్వరసాక్షాత్కారము: ఇదియే పరమార్థము.

శివజీవైక్యము, బ్రహ్మసాక్షాత్కారము. వీనికే క్రమముగ ఇహసుఖము, పరసుఖము. పరాత్పరసుఖము. పరమాత్మసుఖమనియు నామాంతరములు గలవు. నాల్గవది బ్రహ్మజ్ఞానము వలననే గలుగును. తక్కిన మూడవస్థల లోను జీవునకు రాకపోకలు గలవు. విదేహ కైవల్యమగు ఆత్మైక్యజ్ఞానమునకు రాకపోకలు లేవు. కారణ మేమన, పరబ్రహ్మము సర్వవ్యాపకము. అంతేగాక నిజమైన ఆత్మకు అన్యము కాదు. ఉపాధుల వలననే వేఱుగా గన్పించును. హృదయ గ్రంథులు నశించునప్పుడు, మఱియు, ఆవరణము తొలగునప్పుడు, ఏకత్వానుభవము గలుగును. ఇదే పరమ ముక్తి. మనుష్యుని యొక్క ముక్తిమార్గప్రాసాదమునకు నిష్కామ కర్మయోగమే పునాదివంటిది. అయితే వేదాంత శాస్త్రమందు మొదట కర్మయోగము, పిమ్మట ఉపాసనా యోగము, భక్తియోగము ఆపిదప ధ్యానయోగము (సమాధియోగము). తుదకు జ్ఞానయోగ మని చెప్పియుండగా జ్ఞానయోగమగు సాంఖ్యయోగమును రెండవ అధ్యాయములో నుపదేశించిన తరువాత మూడవ అధ్యాయమున కర్మయోగము నుపదేశించుటకు కారణమేమని సందేహము గలుగవచ్చును. దీనివే జ్ఞానియైన తరువాత మాత్రమే నిజమైన కర్మయోగము చేయ నర్హత గలుగునని తెలియనగును. మఱియు ఆత్మయొక్క నిజావస్థ తెలియనిచో జీవునకు మరణ భయము తప్పదు. అజ్ఞానమువలన శోకాక్రాంతుడైన యర్జునునకు సాంఖ్యయోగ ముపదేశించినపుడు ఆత్మకు నాశము లేదనియు, అది నిత్యమైన దనియు వానికి బోధము గల్గెను. ఇట్టివానికే ఆత్మోపదేశ మని పేరు.

ఇది మహాత్ములగు గురువులవల్ల గలుగవలెనని గీతాశాస్త్రము యొక్క సారము. ఇది గలుగనిచో ఈత తెలియనివారితో అగాధనదిని దాటుమని చెప్పినట్లును, గారుడమంత్రము తెలియని వానితో బుసకొట్టుచుండు త్రాచుపామును పట్టుమని చెప్పినట్లున్ను ఉండును. మాయామయమగు సంసారప్రవాహమును దాటుటకును ప్రకృతియను త్రాచుపామునుబట్టి యాడించుటకును ఆత్మజ్ఞానము గలుగవలెను. గీతా తత్త్వము ఈరహస్యమునే యుపదేశించుచున్నది. కనుకనే శ్రీ కృష్ణభగవానులు అర్జునునకు మొదటనే నాశములేని స్థితిని యుపదేశించిరి. అప్పుడు అర్జునుడు తనకు నాశము లేదనియు, ఆత్మకు ఈ ప్రకృతితో సంబంధము లేదనియు, తాను

సనాతన వస్తువగు ఆత్మ యనియు, అది యనాదిగానుండున దనియు బోధమును పొందెను గురూపదేశమీలాగున నుండవలెను. పరతత్త్వము మొదట నుపదేశింపి. మఱల సామాన్యముగ సర్వజనులు ఏలాగున తరించవలెనో, వారి పాప మెట్లు నశించునో, అంతఃకరణశుద్ధి యేరీతి గల్గునో, ఈలాటి విషయములన్నియు క్రమముగ నుపదేశింప నుద్యమించెను.

జ్ఞానియైననుగూడ కర్మయోగ మెంతవఱకు చేయుచుండవలెనో, అదిన్ని ఈ యధ్యాయమున నిరూపించబడినది. తనయొక్క దేహసంరక్షణవిషయమై స్నాన పానశయనాదులందు ఎంతవఱకు ఉపయోగబుద్ధి గలిగియుండునో అంతవఱకు వానివాని యాశ్రమమునకు తగిన యనుష్ఠానము గల్గియుండవలెననియే దీనియొక్క ముఖ్యోద్దేశము. దేహమునకున్ను, మనస్సునకున్ను, హితమైన వృత్తు లన్నియు గల్గియుండగా, తాను నిర్వహించవలసిన ధర్మములను విడిచియుండుట నీతి విరుద్ధ మనియే గీతాచార్యుల యభిప్రాయము. ఒకవేళ తాను పరిపక్వస్థితి నొందినను లోకానుగ్రహ విషయమై ధర్మాచరణయుక్తమగు కార్యములను చేయవలెనని దీనిలో గల తత్త్వరహస్యము. కర్మశబ్దమునకు సంసార బంధకక్రియ అని మాత్రము అర్థముకాదు. కరణములచే చేయు సమస్త క్రియలును కర్మయందంతర్భూతములే. పాదములతో నడచుట, కరములతో పనులుచేయుట, నేత్రములతో చూచుట, కర్ణములతో వినుట, అలాగున ఘ్రాణేంద్రియ, రసనేంద్రియాదులన్నిటి కార్యములున్ను కర్మలలో చేరినవే, జాగ్రదవస్థలో జరుగు విషయములన్నియు గాక స్వప్నములో సూక్ష్మదేహమందు జరుగువృత్తులుగూడ కర్మమునకు సంబంధించినవే. గాఢసుషుప్తియందు శ్వాసోచ్ఛ్వాసములు జరుగుచుండుట గూడా కర్మయే. ఇవి యన్నియు చేయుచుండగా తాను చేయవలసిన ధర్మకార్యములు మాత్ర మేలాగున కర్మ గాకపోవును? కాన ఆత్మ సాక్షాత్కారము నొందిన జ్ఞానికూడ ద్వంద్వములు గలిగి యున్నంతవఱకు తనకు శాస్త్రము విధించిన అనుష్ఠాన కర్మముల నాచరించవలెను. కర్మను విడివి ఒక్కప్రాణియైనను ఒక్క క్షణకాల ముండుట లేదని గీతాచార్యులు నిరూపించిరి.

అయితే దృశ్యవృత్తు లన్నియు నశించి నిరంతర ద్వైతాకార స్థితిలో నుండు జ్ఞానికి మాత్రము కర్మ చేయవలయు నను నిర్బంధము లేదని గూడ తెలిపియున్నారు. దీని నాధారముగా జేసికొని జ్ఞానియైన వానికి ఏకర్మయు

లేదని చెప్పుచు ఇంద్రియ సౌఖ్యములలో పడియుండువారు కూడ స్వధర్మానుష్ఠానమును విడిచిపెట్టి సోమరితనముతో గూడిన జీవితమునకు లోబడి పోవుచున్నారు. ఇట్టిదోషమే నివృత్తిమార్గస్థులలో అనేకులు పతితులగుటకు కారణమైనది దీనికి సరియైన యొక విధానము ఏర్పడినమాత్రమే భారత దేశము ఊర్ధ్వగతిని పొందగలుగును.

ఈ యధ్యాయములో ఈశ్లోకము ముఖ్యము—

తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర!
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః (3–19)

కావున నో యర్జునా! ఫలమందాసక్తిలేక నిరంతరము నియమితమగు కర్మను జేయుము. ఎందుకనగా, ఫలాసక్తిలేక కర్మను చేయుచున్న పురుషుడు ముక్తిని బొందును అని చెప్పిరి.

# జ్ఞా న యో గ ము

ఈ యధ్యాయమునకు జ్ఞానయోగమని పేరు. ముందు చెప్పబడిన మూడు అధ్యాయములలో చెప్పిన నిష్కామ కర్మయోగ మాచరించుటవలన పాపము నశించి అంతఃకరణశుద్ధి గల్గి జ్ఞానోదయ మగును. కావున కర్మయోగమువలన గలిగెడు ఫలమును చూపునదగుటచే నాల్గవ అధ్యాయము జ్ఞానయోగములో చేర్చబడమైనది. ఇదిన్ని చాల వఱకు మూడవ అధ్యాయము చెప్పినట్లు కర్మయోగమును ఉపదేశించుచున్నది. అయితే కర్మయోగము యొక్క ఫలము జ్ఞానయోగ సిద్ధియని తెలిసికొన దగినది. దీనిలో ఈక్రింది శ్లోకము ముఖ్యము

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః!
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః॥ (4-10)

రాగద్వేషములు వదలినవారై ప్రపంచ మంతయు భగవన్మయముగ జూచుచు నన్నాశ్రయించుటచే అనేకులు పవిత్రులై ఉత్తమ జ్ఞానము గలిగి

నాభావమును బొందిరి గీతాచార్యులు కర్మయోగము స్వతంత్రముగ ముక్తిని కలుగజేయునని యుపదేశించినను వేదాంత శాస్త్రములో నిష్కామ కర్మయోగముచే అంతఃకరణశుద్ధియు, తదుపరి ఈశ్వరోపాసనచే చిత్తైకాగ్రతయు, అనంతరము ధ్యానయోగముచే ఆత్మయొక్క ఆవరణనివృత్తియు, తద్వారా మహావాక్యబోధకమగు జ్ఞానయోగముచే సాక్షాన్మోక్షమును గలుగుననియే తెలుపబడియున్నది. కర్మయోగాదులు మూడున్ను పరంపరా మోక్షప్రాప్తిని గలుగ జేయుననియు, జ్ఞానమొక్కటియే సాక్షాత్కార మోక్షమునకు హేతువనియు నుపదేశించిరి. కావుననే ఈ నాల్గవ అధ్యాయమున "న హిజ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే" అనగా జ్ఞానమునకు సమానమైనది మఱియొకటి లేదని శ్రీభగవానులుకూడ ఉపదేశించి యున్నారు.

## కర్మసన్న్యాసయోగము

కర్మమునకు సన్న్యాసమునకు గల భేదాభేదములను నిర్ణయించున దగుటచే దీనికి కర్మసన్న్యాసయోగ మని పేరు వచ్చినది. కర్మయోగము శ్రేష్ఠమా, లేక జ్ఞానయోగము శ్రేష్ఠమా, అనగా గృహస్థాశ్రమము మంచిదా? లేక సర్వసంగపరిత్యాగమైన సన్న్యాసాశ్రమము మంచిదా? యను ప్రశ్నలకు సమాధానము దీనియందు నిర్ణయించడమైనది శ్రీ కృష్ణపరమాత్మ యొక్క విశాలభావము ఈ అధ్యాయమున జూపబడినది. రెండు ఆశ్రమములున్ను శ్రేష్ఠములే. బాహ్యమైన వేషములచేగాని, నివాసస్థలముచేగాని శ్రేష్ఠత్వమేమియు లేదు. అంతఃకరణశుద్ధి గల్గి నిస్సంగత్వమును సాధించి ఇంద్రియవిషయముల జయము గలిగి ఆత్మ జ్ఞానమును ప్రాప్తినొందిన, యేయాశ్రమమైనను సరియే. వీటిలో సన్న్యాసాశ్రమమే శ్రేష్ఠమని, గృహస్థాశ్రమము నికృష్టమని పలికెడివారు పసిపిల్లలవంటి వారనియు, వీరు శాస్త్రజ్ఞానముగాని, అనుభవ జ్ఞానముగాని లేనివారనియు శ్రీభగవానులు నిర్ణయించిరి. రెండాశ్రమములును శ్రేష్ఠములైనచో వానిలో ఏది ఆచరించవలెనని విచారణ వచ్చిన సంపూర్ణవిషయవాసనా రాహిత్యము గలుగని వారికి నిష్కామ కర్మపరమగు గృహస్థాశ్రమమే శ్రేష్ఠము. వాసనారాహిత్యము గలిగిన వారికి సన్న్యాసాశ్రమమే శ్రేష్ఠము. సన్న్యాసులలోగూడ ఏకర్మను జేయనివానికన్న లోకోపకారముగా సత్కర్మల జేయుచు అనుష్ఠానముతో

గూడియుండువాడు మేలైనవాడు. జ్ఞానసౌఖ్యములోను, జీవన్ముక్తిలోను ఇరువురున్ను సమానులైనను శాస్త్రవిధి ననుసరించి అనుష్ఠానముగల వారిని జూచి లోకము ధర్మమును నేర్చుకొని బాగుపడును. కావున అనుష్ఠానము లేనివారికన్న ఆచరణగలిగి ఆత్మజ్ఞానులైయుండు వారు మిక్కిలి శ్రేష్ఠులు. లోకోద్ధారకులగు మహనీయు లందఱును ఈలాగుననే యుండిరి. వీరిలో జీవన్ముక్తులై మోక్షమును బొందువారుకొందఱు, కొందఱు తాము ముక్తులైనను ఇతరులనుగూడ మోక్షార్హులు జేయవలెనను తలంపుగలవారు. ఒక పడవ సహాయముచే నదిని దాటిపోయినవాడు ఆపడవను గుఱించి మఱల యేలాటి విచారము చేయడు. కాని పడవతో జనులను దాటించువాడగు మఱియొకడు తానుగూడ నదిని దాటినవాడైనను పడవను వెడలనీయక సంరక్షించుచుండును. అలాగున ఏదోయొక సాధనచే సంసారప్రవాహమును దాటి మఱల తనయొక్క అనుష్ఠానమందు శ్రద్ధలేనివారలు కొందఱు. ఇక కొందఱు కరుణాస్వరూపులై సంసారములో నుండువారుగూడ తరించేలాగున అనుష్ఠానము గల్గియుందురు. కావుననే అనుష్ఠానము విడిచియుండేవారికంటె ఆచరణ గల్గియుండువారు శ్రేష్ఠులని చెప్పుటకు కారణమైనది. ఈయైదవ అధ్యాయమున ఈశ్లోకము ముఖ్యము—

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ।
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే॥ (5-2)

జ్ఞానయోగమున్ను కర్మయోగమున్ను రెండును ముక్తిని గలుగ జేయునవే. అయినను కర్మలను విడిచియుండుటకంటె నిష్కామ కర్మయోగ మవలంబించి ప్రవర్తించుటయే శ్రేష్ఠము.

## ఆత్మసంయమయోగము

దీనికి ఆత్మసంయమయోగమని పేరు. ఇందు ఆత్మ యనగా మనస్సు (లేక) జీవాత్మ యనియు అర్థము గలదు. సంయమనగా వశములో నుంచు కొనుట. లేక ఆత్మను పరమాత్మలో ఐక్యమొనర్చుట ఆత్మ నియమయోగమని చెప్పక ఆత్మసంయమ యోగమని చెప్పిరి. సంయమమనగా తప్పగనియమనము గల్గియుండవలెనని గమనించ తగినది. మనోనిగ్రహమనినను, మనో[illegible]

మనోజయమనినను, మనోరాహిత్యమనినను ఒకే యర్థము. మనోనిగ్రహము గాని, మనోలయముగాని గలుగవలసియున్న, ఆత్మలోగల సంస్కారము లన్నియు నశించవలెను. గుణము లన్నియు రహితము కావలెను. దీనికి కావలసియుండు ఉపాయము లన్నియు ఈఅధ్యాయమున శ్రీభగవానులుపదేశించియున్నారు. యోగశాస్త్రము లన్నిటియందును ఏయే యనుష్ఠానము లుపదేశింపబడినవో, అవన్నియు ఈ అధ్యాయమున గలవు దీనిలోగల అనుష్ఠానమును చేయుటకు ప్రత్యేకముగ ఒక జాతివారుగాని, దేశమువారు గాని, బ్రహ్మచర్యాది ఆశ్రమములందలి వారుగాని, స్త్రీలుగాని, పురుషులుగాని. అనుభేదమేమియు గన్పించుటలేదు. మనోనిగ్రహము గల్గిన చాలునని యుపదేశింపబడినది. కావుననే ఆత్మసంయమ యోగమని పేరిడుటకు కారణమైనది. హఠయోగాది గ్రంథములలో జెప్పినట్లు దీనియందు కఠిన సాధనలేవియు తెలిపియుండలేదు, సర్వజనులకు ఆచరించుటకు సులభసాధ్యము, నివృత్తి మార్గము లన్నిటిలోను మనోనిగ్రహము సాధించుట చాల ప్రయాసమైన విషయము. అట్టి నిగ్రహము దీనియందు సులభముగా నిరూపింపబడినది. రెండవది నివాసస్థలము. మూడవది ఆహారనియమము. ఇవన్నియు నీ యధ్యాయమున సామాన్య జనులకుగూడ ఆచరించుటకు సాధ్యమైనట్లుపదేశింపబడెను. ఆత్మ సంస్కారమందు సాధకుడు సదా మనస్సు నుంచి జాగ్రత్తగ పరిశోధించుచుండవలెను. సమస్తమునకు కీదియే మూలస్థానము ఆత్మసంస్కారమనినను, ఆత్మ పారిశుద్ధ్యమనినను ఒకే అర్థమని యిదివరకే తెలుపబడినది. ఆత్మనిష్ఠలో పూర్తినొందక, దేహము వీడినవానియొక్క పరలోకస్థితియు మఱుజన్మలో ఉత్కృష్ట వంశమున జన్మించి బాల్యకాలమునుండియే ఆత్మధ్యానములో గల్గెడు ప్రవృత్తియు, దీనియందు విశదముగా తెలుపబడినది. ఈ జ్ఞానము ముముక్షువులు ముఖ్యముగా జూడవలెను. దీని యందు ఈశ్లోకము ముఖ్యము:

యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ।
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన॥ 6-2.

ఓ యర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పుదురో, అద్దానిని నీవు యోగమనియు తెలిసికొనుము. ఎవడు మనస్సుయొక్క సంకల్పములను రహితము చేయలేడో, వాడెన్నటికిని యోగి కాజాలడు.

# విజ్ఞాన యోగము

విజ్ఞానయోగమనగా అనుభవ జన్యజ్ఞానమనియు, విశేషజ్ఞానమనియు, దైవసాక్షాత్కారమనియు, జ్ఞేయమును పొందుటయనియు అర్థము గలదు. వేదాంత శాస్త్రములో జ్ఞానమనియు విజ్ఞానమనియు, రెండుభాగములుండును. రెండవ శ్లోకమున జ్ఞానమున్ను, విజ్ఞానమున్ను చెప్పెదనని యుపదేశించెను. కొన్ని నిఘంటువులలో మోక్షవిషయజ్ఞానమును జ్ఞానమనియు, ఇతరశిల్పశాస్త్రములు మొదలగు వాటిని విజ్ఞానమనియు పేర్కొనియున్నారు. వేదాంతార్థమున విజ్ఞానమునకు అనుభవ జ్ఞానమనియు. శాస్త్రజ్ఞానమునకు జ్ఞానమనియు పేరు. లేక జ్ఞానికుండవలసిన శమదమాది సుగుణ సమూహాయమును గూడ జ్ఞాన మనెదరు. పదమూడవ అధ్యాయమున జ్ఞానమును గుఱించియు, జ్ఞేయమును గూర్చియు విస్తారముగ చెప్పబడినది. జ్ఞానశబ్దమునకే కొన్నిస్థలములలో విజ్ఞానమనియు జ్ఞేయవస్తువనియు, సాక్షాత్కారమనియు, పేర్లు గలవు. మఱల విజ్ఞానమునకు నిగూఢ తత్త్వజ్ఞానమనియు అతిరహస్య తత్త్వజ్ఞానమని గూడ నామధేయము లున్నవి. ఈయధ్యాయమున ఎనిమిదవ శ్లోకము ముఖ్యము. దీనిలోగల విశేషజ్ఞానమునే విజ్ఞానమని గ్రహింపవలయును. అదేమన భగవంతుడు ఆకాశమున శబ్దరూపముగాను. వాయువున స్పర్శరూపముగాను, అగ్నియందు తేజో రూపముగాను జలమందు రసరూపముగాను, భూమియందు గంధరూపముగాను, వేదమందు ప్రణవస్వరూపముగాను, సూర్యచంద్రాదులందు ప్రకాశస్వరూపముగాను నున్నానని తెలిపిరి. ఇదే విజ్ఞానముయొక్క పరమరహస్యము, దీనికి కారణముగూడ ఈ యధ్యాయమున తెలిపియున్నారు. సామాన్యజనుల జ్ఞానము అజ్ఞానముచే మాయబడి యుండుటచే నీరహస్యమును తెలిసికొనజాలరు, ఈరహస్యమునందే ద్వైతాద్వైతవిశిష్టాద్వైతముల యొక్క తత్త్వము నిలిచియున్నది. అదేమన శబ్దము వినా ఆకాశములేదు, ఆకాశమునుండి శబ్దమును వేఱుపఱచుట సాధ్యము కాదు. శబ్దమున్ను ఆకాశమున్ను ఒకటియే. అలాగున స్పర్శము వినా వాయువులేదు. వాయువునుండి స్పర్శమును వేఱుపఱచుటకు అవకాశము గన్పింపదు. అలాగున ప్రకాశము వినా అగ్ని యుండదు. తేజస్సును, వేఱుపఱచి అగ్నియను ఒక తత్త్వమే యుండదు. ఈలాగున రసము వినా జలమున్ను, గంధము వినా పృథ్వియును యుండవు. ప్రకాశము వినా

సూర్యుడు లేడు. ప్రణవము లేనిచో వేదమే యుండదు. ఈవేదములయొక్క ప్రాణమే ప్రణవము. కావుననే ప్రణవము లేని మంత్రము వేదసంబంధము గాదనియు, ప్రాణశక్తిలేని దనియు చెప్పబడుచున్నది. ప్రణవార్థ మెఱింగి ఓంకారము ధ్యానము వేయువారికి ఆత్మయందు నిగూఢమైయుండు దివ్య తత్త్వము ప్రకాశమునకు వచ్చును. ఈలాటి పరమరహస్యము లీయధ్యాయమున నుండుటచే దీనికి విజ్ఞాన యోగమని పేరువచ్చినది. విశేషబుద్ధితో విచారించిన పరమాద్వైతమే సిద్ధించును. సామాన్యదృష్టితో జూచిన విశిష్టాద్వైతమున్ను గన్పించును. ఈరెండుమతస్థుల యభిప్రాయమేమన, భగవంతు డగ్నిలో ప్రకాశస్వరూపుడుగాను, వాయువున చలనస్వరూపుడు గాను, జలమున రసస్వరూపుడుగాను నుండువనియే. ఇది ప్రత్యక్షముగా గన్పించునదే కాని, దీర్ఘ చింతన చేసినచో అగ్నియు ప్రకాశము, వాయువు చలనము, జలము, రసము ఒకటిగానే గోచరించును, దీని నాధారముగ చేసికొనియే ద్వైతా ద్వైత విశిష్టాద్వైత భాష్యము లేర్పడినవి. కావుననే శివపరముగ శ్రీశంకరాచార్యులున్ను, విష్ణుపరముగ రామానుజాచార్యులున్ను, పరబ్రహ్మపరముగ శ్రీశంకరులును ప్రస్థాన త్రయమునకు భాష్యములు వ్రాసిరి. అందఱికిని ప్రమాణమున్ను యుక్తియున్ను, అనుభవమున్ను భగవంతుడు అగ్నియందు ప్రకాశముగ నున్నాడని యొకరు చెప్పిరి. మరి యొకరు అగ్నిలోగల ప్రకాశము వేఱా? లేక అగ్నియే ప్రకాశమై యున్నదా అని ప్రశ్నించిరి దీనిచే ఇందలి అర్థమును గ్రహించుకొనవచ్చును. లేక యీశ్వరుడు పంచదారయందు మాధుర్యరూపమున నున్నాడని చెప్పిన, తీపిచేఱు, చక్కెరవేరుగానట్లు ఈ విషయమునగూడ విజ్ఞులెరుంగవలెను. అప్పుడు ద్వైతాద్వైత విశిష్టా ద్వైతములయొక్క రహస్యమున్ను సత్యమున్ను గోచరము గాగలును. ఇందీ శ్లోకము ముఖ్యము.

రసోఽహమప్సు కౌన్తేయ! ప్రభాఽస్మి శశిసూర్యయోః।
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ (7-8)

ఓ అర్జునా! జలమందలి రసమును, సూర్యచంద్రులయందలి ప్రకాశమును, వేదములయందలి ఓంకారమును. ఆకాశమందలి శబ్దమును నరులందు కృతకృత్యరూపమగు పుణ్యస్వభావమున్ను, నేనే అయియున్నాను,

సూక్ష్మదృష్టితో ఇట్టితత్త్వమును గీతాపారాయణ చేయువారు తెలిసికొనే లాగున చూడవలెను గీతను పూర్తిగా ప్రతిదినమున్ను పారాయణము చేయుట అధికపుణ్యమని తలంచి చాలామంది ప్రతి దినమున్ను 18 అధ్యాయములను పారాయణము చేయుదురు. అయితే అది మంచిదైనను ఆయాశ్లోకములలో నిర్ణయింపబడిన అర్థముగూడ తెలిసియుండేలాగున చూడవలెను. అట్లు అర్థము తెలియక పారాయణము మాత్రము చేయుటచే గొప్పలాభము కలుగదు. సమయము ఎక్కువ లేనివారు ఒక్కొక్క అధ్యాయము మూలశ్లోకమును మాత్రము పారాయణచేసి ప్రతిదినము 5 శ్లోకములు గాని2 లేకశ్లోకములుగానిఅర్థము బోధపడేలాగునటీకాతాత్పర్యగ్రంథములందు చదివి వానిసారము గ్రహించుట మంచిది. ఏ శ్లోకమందు ఏయర్థము వ్రాయబడెనో దానిని చదివి అర్థము బోధపడువఱకు; ఒకసారిగాని, రెండుసార్లుగాని, మూడు సార్లుగాని, మఱలమఱల చదువుట శ్రేష్ఠము. అర్థము తెలియక చదువుటలో పుణ్యముగలదు గాని గీతాచార్యుల బోధలన్నియు తెలియుటకును, ఆచరించుటకున్ను, అర్థము తెలిసిననే సాధ్యమగును.

## అక్షరపరబ్రహ్మయోగము

నాశరహితమగు పరబ్రహ్మమును పొందింప జేయునదగుటచే దీనికి అక్షర పరబ్రహ్మయోగమను నామధేయము గల్గెను. నిత్యమగు బ్రహ్మములో జీవుని యైక్యపఱుమనదగుగూడ దీనిని గ్రహించవలెను. దీనియం దెనిమిది ప్రశ్నలు మొదటగలవు. (1) బ్రహ్మమనగా నేమి? (2) అధ్యాత్మ మనగా నేమి? (3)కర్మయనగా నెట్టిది? (4) అధిభూతమెటువంటిది (5) అధి దైవ మననేమి? (6) ఈ దేహమందు అధియజ్ఞుడెవడు (7) అత డెట్టి స్వభావము గలవాడు? (8) ఆత్మధ్యాననిష్ఠగలవారు ప్రాణప్రయాణ సమయమున ఎట్లు ధ్యానించిన నిన్ను (భగవంతుని) పొందగలరు!—అను నీయెనిమిది ప్రశ్నలను అర్జునుడు చేసియున్నాడు. వీనిలో ఏడింటికిని ఒక్కొక్క వాక్యముతో సమాధానము చెప్పి ఎనిమిదవ ప్రశ్నయగు అంత్యకాలస్థితిగూర్చి విస్తారముగ సమాధాన మిచ్చియున్నారు. అదేగదా ముఖ్యమైనది. అందరున్ను చేయు సమస్త కార్యములును అంత్యకాలమున ఉత్తమగతి గలుగుటకే గదా! కాన ఈ విషయమై భక్తులున్ను, జ్ఞానులున్ను, యోగులున్ను, వెయ్యేల అందరున్ను

ముఖ్యముగా తెలిసికొన దగినదే. ప్రాణప్రయాణ సమయమున ప్రణవము నుచ్చరించి పరమాత్మను ధ్యానించి, దేహమును విడచువాడు అక్షర పరబ్రహ్మమును పొందునని శ్రీకృష్ణ భగవాను లుపదేశించిరి. అయితే ప్రణవమును ధ్యానించుట కెవరర్హులు? ఎవరు అర్హులు కారని దీనియం దేమియు చెప్పియుండలేదు. కాని ప్రణవధ్యానమునకు యోగ్యతమాత్ర ముపదేశించియున్నారు. అదేమన, అన్ని యింద్రియములను స్వాధీనమం దుంచుకొని మనస్సును భగవంతునియందు నిలిపి ఓంకారము నుచ్చరించి, దేహమును విడుచువాడు, గురిని లక్ష్యముంచి విడువబడిన బాణమేలాగున లక్ష్యమున జొరబడునో, ఆలాగున బ్రహ్మమును పొందునని భగవదుప దేశము. ఈ ఓంకారధ్యానము జేయుటకు ఫలాని జాతివారు. లేక ఫలాని కులమువారు. లేక ఫలాని దేశమువారు లేక ఫలాని ఆశ్రమములో నుండు వారు, లేక స్త్రీలు లేక పురుషులు అను భేదమేమియు జెప్పక అంత్య కాలమున ముక్తిని గోరువారు పై జెప్పేలాగున నుండిన మోక్షము పొంద వచ్చునని మాత్రమే శ్రీకృష్ణభగవానులు ఉపదేశించియున్నారు: ప్రణవమును ధ్యానించుట కేదైన వర్ణాశ్రమ భేదముండినచో, ఇచ్చోట భగవంతుడు చెప్పకపోవునా? కావున మనకు భగవద్వాక్యము ప్రమాణమా? లేక భగవ త్ప్రీతికి అటంకము గలుగజేయు మానవుల స్వయంకల్పిత వాక్యము ముఖ్యమా? యని విజ్ఞులందరు ఆలోచించుకొనవలెను. ఇంతవరకు భగవద్గీత కూడ అందఱును చదువరాదని చెప్పెడివారుండిరి. దైవకృపవలన అట్టి పాపకాలము కాల గర్భములో కలిసిపోయినందుచే, అవిషయమై యిపు డేమియు చెప్పబని లేదు. ఇక్కాలపుణ్యముచే భగవద్గీత అందఱున్ను చదువ వచ్చునని, లోపల ఇష్టము లేక పోయినను, చెప్పవలసిన కాలమాసన్న మైనందుచే అంగీకరించియున్నారు.

కాని ప్రణవమును మాత్ర *ముచ్చరింపగూడదట! దీనివలన వీరు గీత చదువువారేగాని దానియందు చెప్పినట్లు ఆచరించువారు కారని స్పష్టముగా తెలియదగును. వా రాచరించువారైనచో, ఇతరులతోను ఆలాగున నాచరించవలెనని యేల చెప్పరు? ఎప్పుడు శాస్త్రములనుమాత్రము చదివి దానిలో చెప్పేలాగున ఆచరణ లేకపోయినదో, అప్పుడే భారతదేశము హీనస్థితికి వచ్చినది. చెప్పేలాగున ఆచరించేవారు ఏర్పడిన మాత్రమే దేని

యందేఫలము చెప్పబడియున్నదో అయ్యది ఫలించును. గీతమాత్రము చదువవచ్చునుగాని దానిలో చెప్పినట్లాచరింప కూడదని చెప్పువాక్యమున కేదైన విలువగలదా? దానికన్న గీతచదువ గూడదని చెప్పినచో బాగుండును. దీనికి మించిన అంధవిశ్వాసము లోకములో గలదా? ఇట్టి మూఢ స్వభావము ఇక్కాలమునగూడ ఎచ్చటనో మూలలో దాగియున్నదని వినుటచే ఆశ్చర్యమొందని వారుందురా? వారి యీ మాటలో ఏదైన సత్తుగలదా? ఇది, మీరు గోవును సంరక్షింపవచ్చును, పాలు, పెరుగు ఉపయోగించవలదు; లేక మీరు మంచి ఫలవృక్షములను పెట్టి పోషింప వచ్చును. కాని ఫలములను మాత్రము భుజింపగూడదు అనుట వంటిది. ఈవాక్యములం దెంత సత్యము గలదో వారు వచించు దానిలోను అంతే సత్యము గలదని జనులందరును దృఢముగా నమ్మవలెను. మఱియొక విధముగ గూడ చెప్పువారు గలరు. ఎట్లన, అంత్యకాలమున భగవద్ధ్యానముచేసిన చాలుగదా, ఇప్పటినుండి యేల చేయవలెనని యభిప్రాయము. అంత్యకాలము ఏసమయమున ఎచ్చోట యెప్పుడు గలుగునో యెవరైన చెప్పగలరా? ఏ నిమిషమో, ఎచ్చోటనో చెప్పువారు అరుదు. కావున తలంచి నపుడే అట్టి దైవకార్యములో ప్రయత్నించవలెను. సాగరములో అలలు శాంతించిన తరువాత స్నాన మాచరింపదలంచిన, కాలమేలాగున వ్యర్థమై పోవునో, అలాగున సంసారసంబంధ సమస్త కార్యములు శాంతినొందిన తరువాత ఈశ్వర ప్రార్థన చేసుకొనవచ్చునని తలంచుటయు వ్యర్థమేయగును. సముద్రములోని అలలు ఏకాలమునకైనను శమనము బొందనట్లు సంసారములో గూడ కార్యము లన్నియు పూర్తి అయ్యేడు కాలముండదు.

ఈఅధ్యాయమున ఈశ్లోకము ముఖ్యము.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాంగతిమ్

(8-13)

పరబ్రహ్మవాచకమగు ఓం " అనెడి ఏకాక్షరము నుచ్చరించుచు ఓంకారస్వరూపుడగు పరబ్రహ్మమును (భగవానుని) ధ్యానించుచు దేహము

దేహము విడుచునో యట్టివాడు సర్వోత్తమ మగు ముక్తి పదమును నొందును.

## రాజవిద్యా రాజగుహ్యా యోగము

ఈబ్రహవిద్య విద్యలన్నింటిలోను రాజై యుండుటచేతను, లేక ఇక్ష్వాకువు ఆదిగాగల రాజులందఱును ఈవిద్యననుష్ఠించి రాజ్యపరిపాలన మొనర్చి జీవన్ముక్తి పదమును బొందినందుచేతను దీనికి రాజవిద్యా రాజ గుహ్యాయోగమని పేరువచ్చినది. మఱియు రహస్యము లన్నిటిలోను ఇది అతిరహస్యమైనందు చేతను దీనికి రాజగుహ్యాయోగమని నామధేయము గల్గెను. మఱియు పూర్వీకులగు రాజులు ఈగీతాశాస్త్రసారము నాచరించియే ముక్తిని బొందిరి. కావున నో యర్జునా! నీవున్ను ఈగీతాశాస్త్రానుసారము వర్తించి జీవన్ముక్తి పదమును బొందుమని భగవానులు వచించిరి. ఈపరమ రహస్యమైన బ్రహ్మవిద్య అనాదికాలమునుండి రాజులు అనుష్ఠించుచు వచ్చినదనియు, మధ్య బహుకాలమునుండి నశించిపోయినదనియు, అట్టి క్షయించిపోయిన విద్యనే మఱల ఇప్పుడు ఉద్ధరించుచున్నాననియు శ్రీ భగవానులు నాల్గవ అధ్యాయమున తెలిపియున్నారు. దీనియందలి రహస్యమే మన మోక్షముకొఱకు సర్వసంగ పరిత్యాగము కావలెననియు, ఏకాంత ప్రదేశమున చేరవలెననియు, జటా కాషాయ వస్త్రములు ధరించవలె ననియు, తపస్సుచే శరీరమును కృశింపజేయవలెననియు, యోగముచే నిర్వి కల్పసమాధికొఱకు ధ్యానధారణాదుల నవలంబింప వలెననియు చెప్పు చురుగదా! అట్టి దుస్సాధ్యసాధనలు చేయకనే ఈశ్వరార్పణ బుద్ధితో నిష్కామ కర్మ యోగమనుష్ఠించి, జీవన్ముక్తిపదవి పొందుటలో ఏలాటి సంశయమును లేదని యిందుపదేశించి నందుచే దీనిని రహస్యము లన్నిటిలో మిక్కిలి రహస్యమైనదని చెప్పుటకు కారణమైనది. ఏలన, పైని జెప్పిన కఠినక్రియల నాచరింపకయే వానియొక్క ఫలము నొసంగెడు బుద్ధి చాతుర్యమేమని చెప్ప వచ్చును! అంతేకాదు. పైన చెప్పిన యేకాంతవాసము, యోగాభ్యాసము, తపశ్చర్య మొదలైనవి అందఱకును సాధ్యమైనవికావు. ఈ నిష్కామకర్మ యోగమో, సర్వజనులకును, సర్వకాలములోను, స్త్రీలకును, పురుషులకును, వైశ్యులు, అందఱకును, ఆచరించుటకు సులభసాధ్యమైనది గదా! కావుననే దీనిని రహస్యమని చెప్పిరి. మను, మాంధాతృ. జనక, భగీరథ, ఇక్ష్వాకాది

రాజులందరును రాజర్షులను పేరు బడసినవారే. రాజులై యుండియు రాజ్య పరిపాలన మొనర్చియు, వారు ఋషులయొక్క స్థానమును బొందినవారై యుండిరి. ఋషులనగా ఇంద్రియాతీతమగు జ్ఞానమును బొందినవారనియు, ఇంద్రియాతీతమగు బ్రహ్మపదవి గలిగినవారనియు, ఋక్కులు అనగా వేదముల యర్థమగు పరమాత్మను సాక్షాత్కరించుకొనిన వారైరనియు అర్థము. నాల్గవ అధ్యాయమున, ఇట్టి పరమరహస్యమైన బ్రహ్మవిద్య పూర్వీక రాజులనుష్ఠించుచు వచ్చినదనియు, బహుకాలమునుండి క్షయించి పోయిన దనియు వచించి అట్టి పరమరహస్యమునే నీకు జెప్పెదననియు శ్రీకృష్ణ భగవాను లుపదేశించిరి. అయితే యిట్టి పరమపవిత్రమగు కర్మయోగము నశించుటకు కారణమేమని యనేకులకు సందేహము గలుగవచ్చును

గీతాభాష్యకారులు కొందఱు ఈవిషయ మేమియు దెలుపలేదు. మఱికొందఱు, పరంపరగా అనుష్ఠించువారు లేకపోవుటచే నశించినదని తెలిపిరి. కాని సరియైన సమాధానము దానివలన పూర్తికాదు. దీనియొక్క రహస్యము మహాభారత ఆదిపర్వములో గలదు. క్షత్రియ వంశము పతన మొందుటకును, క్షాత్రధర్మము నశించుటకు కారణ మచ్చోట తెలుపబడినది. ఈకారణము తెలుపకపోయినను, దానియొక్క సంగ్రహార్థమేమన, క్షత్రియ ధర్మ దివ్యోద్యానభూరుహములను శ్రీ పరశురామదావాగ్ని దహింపజేసి నందుచే అప్పటినుండి క్షాత్రవిద్య లన్నియు నశించినవి. శిష్యపరంపరగా అవిద్య నుపదేశించువారు లేకపోయిరి. అందువల్లనే బహుకాలమునుండి కర్మయోగరహస్యము నశించినదని శ్రీ భగవానులు సెలవిచ్చుటకు కారణ మైనది. మఱియు నీ బ్రహ్మవిద్యను పొందుటకు బ్రాహ్మణాది సర్వవర్ణముల వారికి, స్త్రీలకును అధికారము గలదని మాత్రము చెప్పక పాపజన్మముగల వారెవరు గలరో వారికిగూడ అర్హత గలదని నిరూపించుటచే ఈగీతా శాస్త్రము యొక్క అధికారత్వమును నిరూపించినందుచేతను ఇది మిక్కిలి రహస్యముగదా! ఏలన, బ్రహ్మవిద్య కందఱును అర్హులు కారనియు, కొన్ని వర్ణముల వారికి మాత్రమే అధికారము గలదనియు, కొందరు ఆశ్రమస్థులకు మాత్రమే అవకాశ ముండుననియు తెలుపు స్వకపోలకల్పిత గ్రంథము లుండవచ్చును కావున నట్టి పాపము లెవ్వియు దీనియందు లేనందువే ఇది మిక్కిలి పవిత్రమైనది, పాపరహితమైనది, గూఢమైనదని చెప్పుటకు

కారణము. పాపులు పవిత్రులగుట యొక విశేషముగదా! ఇదే దీనిలోగల రహస్యము. ఈ విషయము లన్నియు నీ యధ్యాయమున గలవు. మఱియు ఎంత పాపియైననుగూడ దీనియందు చెప్పినట్లాచరించిన త్వరలోనే పాపరహితుడై పుణ్యాత్ము డగుననియు భగవాను లీయధ్యాయమున నుపదేశించిరి. కావున నీయధ్యాయమునకు రహస్యమని పేరువచ్చెను. ఎంత దారుణ వ్యాధియైనను దివ్యౌషధముచే ఏలాగున నశించునో, ఆలాగున పాపరోగము లన్నియు నీగీతాశాస్త్రపఠనముచే శమించును. దరిద్రునకు నిక్షేపము దొఱకిన యేలాగున దారిద్ర్యబాధారహితుడై శ్రీమంతు డగునో, ఆలాగున పాపహేతువగు దారిద్ర్యము గలవాడును, గీతాపఠన మొనర్చిన పుణ్య శ్రీమంతు డగును, జ్ఞానధనికు డగును. ఈయధ్యాయమం దీశ్లోకము ముఖ్యము.

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః॥　(9-30)

ఎడతెగని భక్తితో నన్ను సేవించువాడు మిక్కిలి దురాచారుడైనను పాపియైనను వానిని శ్రేష్ఠుడనియే తలంచవలెను. ఏలన, ఎప్పుడును ఇతర చింతలు లేక నాయందే నిశ్చయబుద్ధిగల భక్తుడు పవిత్రుడే యగును! భగవద్భక్తి మహిమ యటువంటిది. స్పర్శవేది సంయోగముచే ఇనుము ఏలాగున బంగారమగునో, మఱల నాబంగారము ఇనుము కాజాలదో, అలాగున ఎంతపాపయైనను భగవద్ధ్యాన మహిమచే పవిత్రు డగును. ఇది భగవదాజ్ఞయని అందరు మరువక యుండవలెనని భావము. వాల్మీక్యాది ఋషులే యిందులకు దృష్టాంతము.

## విభూతియోగము

దీనియందు ఈశ్వరవిభూతిని వర్ణించుటవలన ఈఅధ్యాయమునకు విభూతియోగ మని పేరువచ్చినది. ఈశ్వర మహిమాతిశయమునకు గూడ విభూతి యని పేరుగలదు ఈశ్వరశక్తికికూడ ఇట్టి అర్థము, గలదు. ఈ యధ్యాయమున సర్వేశ్వరుని యోగశక్తి అనంతమనియు, ఇది సామాన్య జనులు తెలిసికొన జాలరనియు మనుష్యులకే గాక దేవతలకు సహితము తెలియుట దుస్సాధ్యమనియు శ్రీభగవాను లుపదేశించియున్నారు. ఇందు

వలననే సాకారమూర్తి పూజాదు లేర్పడినవి అనంతుడును, నిరాకారుడును. నగు పరమేశ్వరుని, ఇంద్రియములకు లోబడియుండు మనుజులేగాక దేవతలు సహితము తెలిసికొనుట దుస్తరము. ఎంతవఱకు ఇంద్రియాతీత మగు జ్ఞానము గలుగలేదో అంతవఱకు ఎవరికిని సర్వేశ్వరతత్త్వము పూర్తిగ ఎఱుంగ సాధ్యము కాదు. అట్టి అతీతజ్ఞానము సమాధిస్థితిలో మాత్రమే పొందగలము. అట్టిస్థితి పొందనివారికి పంచేంద్రియములకు విషయములగు ఒకమూర్తిగాని, భావముగాని యేర్పడిన మాత్రమే అవగాహనము చేయుట కును ధ్యానించుటకును సాధ్యపడును. సర్వేశ్వరుని కరుణాస్వరూపుడుగాను, ప్రకాశ స్వరూపుడుగాను, జ్ఞానస్వరూపుడుగాని, వ్యాపక స్వరూపుడుగాను భావించుటయు ఒకవిధమగు మూర్తి పూజలో జేరినదే యగును. ఇట్టి భావ మేదైన చేయనిచో మనస్సునకు నిలుకడ, కలుగదు. ఇది మానసిక పూజ యనబడును: లేక మనోధ్యాన మనియు చెప్పవచ్చును. భగవద్విభూతి అనంతమైనదైనను సామాన్యజనులు తెలిసికొనుటకై కొన్ని ముఖ్యములగు పవిత్రములు మాత్రమీ యధ్యాయమున తెలుపబడినది. మఱియొక విశేషార్థము కూడ ఇట తెలియజేయబడినది. దైవిక గుణములగు సత్యము, జ్ఞానము. శాంతము, కరుణ. విరక్తి, తపస్సు మొదలైనవి యెవరి యందైనను, ఏదేశమందైనను, ఏకులమందైనను, ఏమతమందైనను కనుపిం చునో, అవన్నియు భగవత్స్వరూపములుగా నెరుంగవలెననియు, అట్టి వారెవ రైనను వారిని భగవద్విభూతి భూషితులుగ చూడవలెననియు నుపదేశింపి యున్నారు. మఱియు నీ చరాచర జగత్తంతయు భగవత్స్వరూపముగానే చూడదగినదనియు, అలాగున చూచుటకు శక్తిలేనివారికి మాత్రమే ప్రత్యేక మొక స్థలముగాని, రూపముగాని, వస్తువుగాని యేర్పడిన వనియు వివేకులు జ్ఞాపకములో నుంచుకొనవలెను. స్త్రీలను కొందరు హీనులుగ దలంతురు. భగవద్విషయమునకు భగవత్ జ్ఞానమునకును గూడ వారనర్హులని చెప్పుదురు. ఓహో! ఇదెంత పొరబాటు. భగవదాశయమున కిది విరుద్ధమైనది, ఏలన ఈఅధ్యాయమున శ్రీభగవంతుడే స్త్రీలయందు ఏడు సుగుణములతో నేను నివాసము చేయుచున్నానని అనుగ్రహించియున్నారు, 34వశ్లోకము చూడుడు స్త్రీలలోగల (1)కీర్తి (పుణ్యకర్మలచే గలిగెడు విఖ్యాతి) (2)లక్ష్మి(పవిత్రశోభ (3) ప్రేమపూరిత వాక్కు (4) స్మృతి (ధర్మకార్య మాచరింపవలెనను

జ్ఞాపకము (5) మేధ (పుణ్యాపుణ్యవివేచనా సామర్థ్యము) (6) ధైర్యము (7) క్షమ (ఓరిమి)= యీ యేడుగుణములతో గూడి స్త్రీలలో పరమాత్మ నివసించుచున్నాడని అనతిచ్చియున్నారు.

'కీర్తిశ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా'

ఇట్టి పుణ్యస్వరూపలగు నారీమణులకు భగవంతుడనుగ్రహించిన గీతాశాస్త్రమునుకూడ వారలకు చదువుట కర్హతలేదని చెప్పుట భగవదాజ్ఞను ఉల్లంఘించిన దోష్యమును చేయుటయని అర్థముగదా! అట్టి దానివలన అనర్థమే గల్గునుగాని సార్థకమెట్లు గల్గును?

గీతా మాహాత్మ్యమున, కర్మబద్ధులై దుఃఖ మనుభవించు జీవకోట్లకు దేనివలన కర్మశాంతియు, పరమపదప్రాప్తియు గల్గునని యడిగినది శ్రీభూదేవిగదా! అట్టి భూదేవికిగదా భగవంతుడు శ్రీగీత నుపదేశించెను. ఈ భూదేవియు స్త్రీవర్గములో చేరిన వారుగదా! ఈవిషయమై యిదివరలో వ్రాసియుండు భగవద్గీతయొక్క ఋష్యాదిన్యాసములో విస్తారముగ గనందగును. అయితే భగవంతు డనుగ్రహించిన యిట్టి పుణ్యగుణము లన్నియు నారీమణులు సంరక్షించుకొనవలెను. లేనిచో భగవంతు డిచ్చిన దివ్యత్వమును పోగొట్టుకొనినవారే యగుదురు. అందువలన భగవత్ప్రీతి దూరులగుటయేగాక లోకనిందకును పాత్రులగుదురు.

మఱియు నీయధ్యాయమున నొక గొప్పరహస్యము నుపదేశించియున్నారు. దైవగుణములు ఎవరియందు గన్పించునో, ఆగుణములు భగవత్స్వరూపమునకు సంబంధించినవని, ఆవశ్యముగా వానిని గ్రహించుకొన వలసినదని భగవద్వచనముండియు జనులు దానిని మరచిపోవుచున్నారు, కావున ఏదేశమున, ఏజాతియందైనను ఇహలోకమునకు సంబంధించిన వనియు, పరలోకమునకు సంబంధించినవియును, నగు విద్యగాని జ్ఞానముగాని యుండిన, అవశ్యముగా వానిని భగవదంశముగ దలంచి యంగీకరించవలెను. భగవద్గుణములు అనంతములు, భగవద్జ్ఞానమును అనంతము. ఇంతవఱకు వ్యక్తమైనదేగాక యింకను కల్పాంతము వరకు ఎంతయో జ్ఞానము పాంచభౌతిక సంబంధమైనదిన్ని, అప్రాకృతమైనదిన్ని ఒక్కొక్క

దేశములో ఒక్కొక్క కాలములో అభివ్యక్తము కాగల్గును. ఏలన, వేదమనంత మనియు, భగవద్విభూతి యనంతమనియు శాస్త్రములలో గన్పించుచున్నది. కావున ఎచటెచట భగవద్విభూతి గన్పించునో, అచటచట భగవద్భావము గలుగచేసికొనవలెనని శ్రీభగవాను ఉపదేశించిరి.

ఈ యధ్యాయమున ఈశ్లోకము ముఖ్యము.

యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీ మదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్॥
(10-41)

ఈశ్వరసంబంధమైనదియు, చైతన్యయుక్తమైనదనియు, అత్యం తోత్సాహముతో గూడినదియునగు వస్తుసమూహ మేదేదిగలదో, అదంతయు నా తేజస్సుయొక్క అంశమువలన గలిగిన దానినిగనే నీవు తెలిసికొనుము.

పై జెప్పిన దైవగుణములు ఎవరెవరియందు గన్పించినను అవి భగవదంశమని తలంచి అంగీకరించుకొనవలెనని భగవంతు డుపదేశించిన ఈభావము చాల విశాలమైనది. కనుకనే శాస్త్రవేత్తలు, "అన్త్యాదపి పరం ధర్మం"-"అమేధ్యాదపి కాంచనం" అని తెలిపిరి అనగా శ్రేష్ఠమైన ధర్మము అంత్యజునినుండియు, సువర్ణము మాలిన్యము (మలము) నుండియు గ్రహిం చినను దోషములేదని తెలిపిరి. ఆహా! యెంత విశాలభావము!

## విశ్వరూప సందర్శన యోగము

విశ్వరూప యోగమని చెప్పక విశ్వరూప సందర్శనయోగమని చెప్పుటచే భగవంతునియొక్క విశ్వరూపము లెస్సగా చర్చింపబడిన యోగ మని దీనికి పేరు. విశ్వరూప సాక్షాత్కారము ఈయధ్యాయమున జూపి నందుచే దీనికి విశ్వరూప సందర్శన యోగమను పేరు గల్గినది. భగవద్దర్శన మనిగాని, భగవత్ ప్రత్యక్షమనిగాని, భగవత్సాక్షాత్కారమనిగాని చెప్పక, విశ్వరూపసందర్శనమని చెప్పుటలో గొప్పరహస్యము గలదు. వేదశాస్త్రము యొక్క కొసలో, ఈజగత్తంతయు భగవత్స్వరూపమనియు, బ్రహ్మమయ మనియు, మాయవలన ఆసద్భావమును ఎవరున్ను కనుగొనజాలకున్నార నియు భగవాను ఉపదేశించియున్నారు. "ఏకమేవాఽద్వితీయం" అని చెప్ప

శ్రుతివాక్యమే యిందుకు ప్రమాణము. అయితే అట్టి అప్రాకృతమగు దివ్య దర్శనము మాయచే నావృతమగు హృదయముగలవారికి దర్శింపసాధ్యము కాదనియు, మాయయొక్క ఆవరణము భగవత్కృపవలననే తొలగవలెననియు, అప్పుడే దివ్యదృష్టి గలుగుననియు ఈయధ్యాయమువలన తెలియదగినది. భగవత్కృప గలుగుటకు నిష్కళంకమైన భక్తియే ముఖ్యసాధనమని యుపదేశించిరి. శ్రీకృష్ణ భగవానుని దేహమందే అర్జునుడు చతుర్ముఖ బ్రహ్మను, దేవతలను, ఋషులను, ఆదిత్యులను, యక్షులను, గంధర్వులను, రాక్షసులను, మానవులను పశ్వాది తిర్యగ్జంతువులను వెయ్యేల, లోకమంతయును చూడడమైనది. కావున ఈజగత్తంతయు వాసుదేవమయమని 7-వ అధ్యాయమున చెప్పిరి. ఏకత్వమున అనేకత్వమును కల్పించుట మాయయొక్క పనియైయున్నది అట్టి అవిద్య నశించి "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అను శ్రుతివాక్యము గోచర మగును. ఇదే దీనిలో గల ముఖ్యవిషయము.

రెండవది, యజ్ఞాదిక్రతువులచేగాని, వేదాధ్యయనాదులచేగాని మోక్షముగలుగదనియు, అనన్యభక్తియొక్క దానివలననే యీశ్వర సాక్షాత్కారము సిద్ధించుననియు సెలవిచ్చియున్నారు. ఇదే కారుణ్యమయుడగు శ్రీకృష్ణ భగవానునికి జీవరాసులలో గల వాత్సల్యము, ఏలన, యజ్ఞములు చేయుటకున్ను, వేదములు పఠించుటకున్ను, దానములు చేయుటకున్ను, తపస్సులు సల్పుటకున్నూ అందఱకు అనుకూల ముండదు. అనన్యమైన భక్తి గలిగి సర్వేశ్వరస్మరణ హృదయములలో గలిగియుండుట ప్రతివారికి సాధ్యమైన పనియే గాని, భారమేమియు దీనియందులేదు. శ్రద్ధయు, పవిత్రతయు గలిగినవాలును,

మూడవది మానవులు నిమిత్తమాత్రులనియు, సమస్తమును సర్వేశ్వరశక్తి వలననే జరుగుచున్నదని తలంచి నిస్సంగత్వము వహించి భగవదర్పిత హృదయము గల్గియుండవలెనని తేలుచున్నది. కనుకనే అర్జునునితో నీవు నిమిత్తమాత్రుడవే గాని సమస్తక్రియలును నావలననే జరుగుచున్నవని చెప్పుటకు హేతువైనది. అయితే సమస్తము భగవదాజ్ఞానుసారము జరుగుచున్నదని తలంచి పురుషప్రయత్నము నుపేక్షించి యుండ

వలెనా? గాదు తాను చేయవలసిన కృత్యములను నిర్వహించుట ఈశ్వరాజ్ఞయై యున్నది లేనిచో ఎప్పటికిని జీవులు కృతార్థులు కాజాలరు. మఱియు సమస్తము భగవదిచ్ఛానుసారముగా జరుగుచున్నదని స్వయముగా తెలిసి కొనెడు జ్ఞానము కలుగవలెనుగదా! అర్జునునకు ప్రాకృతదృష్టి వదలి అప్రాకృతమగు దివ్యదృష్టి గలిగిననుడే సమస్తమును భగవత్స్వరూప ముగా గోచరమైనది ఇట్టిస్థితి యూహచేగాని తర్కముచేగాని పొందదగినది కాదు. అనుభవముచే పొందదగినది అందులకై అవిద్య నశింపవలయును. దీనియందీ శ్లోకము ముఖ్యము.

మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ॥ (11-55)

"ఓ యర్జునా! ఎవడు ఈశ్వరార్పణబుద్ధితో సత్కర్మలజేయుచు, ఈశ్వరునే పరమశరణ్యము నమ్మి, భగవద్భక్తిగలవాడై దేనియందును సంగములేక, ఏప్రాణియందును వైరబుద్ధి లేకయుండునో అతడే నన్ను బొందును గాని యన్యులు గాదు"

## భక్తియోగము

దీనియందు భక్తిని మిక్కుటముగా జెప్పినందుచే దీనికి భక్తియోగ మని పేరువచ్చినది. దీనిలో సగుణభక్తియు, నిర్గుణభక్తియు ఉపదేశింప బడెను. వీనిలో ఏది శ్రేష్ఠమని ప్రశ్నరాగా, ఏదైననుసరే శ్రద్ధయను సుగుణముతోగూడి నిరంతరము భగవచ్చింతన గల వాడెవడైనను వాడే శ్రేష్ఠుడని శ్రీభగవంతు డుపదేశించెను. దేహాభిమానము. కులాభిమానము, ఆశ్రమాభిమానము, విద్యాభిమానము అధికారాభిమానము, రూపాభిమానము మొదలగు దేహసంబంధ బంధనము గలవారికి మోక్షప్రాప్తి గలుగుట ప్రయాసమని యుపదేశించిరి. ఇట్టి యభిమానము ఆత్మను కనుపడనీయక కప్పివేయుచుండును, మఱియు జ్ఞానయోగమే అన్నిటికంటె శ్రేష్ఠమని తెలిపి, అట్టి జ్ఞానయోగమునకు శక్తి చాలకపోయినచో ధ్యాన సమాధి యోగముల నుపదేశించిరి. దానికిన్ని సమర్థత లేనివారికి భక్తియోగము నుపదేశించిరి. అనన్యమగు భక్తియోగమును శీలించుటకు సమర్థతలేనిచో, నిష్కామ

కర్మయోగము నాచరించిన బాలునని తెలిపిరి. దీనికి సమర్థతలేని పక్షమున ఎవరైనను సత్కర్మ లాచరించువానిని చూచి సంతోషపడినను సద్గతి గల్గునని వచించిరి. కాని తాను చేయుటకు ఇష్టములేక, యెవరైనను చేయు దానిని చూచి అసూయ పడకుండుటయు, ఆటంకము కలుగ జేయకుండుటయుకూడ పుణ్యమని యానతిచ్చిరి. కావున సత్కర్మలకు ఆటంకముచేసి నరకము పాల్పడకుండ చూచుట శ్రేయస్కరము.

భగవద్భక్తుల కుండవలసిన సుగుణము లన్నింటిని బాగుగ నీయధ్యాయమున తెలిపియున్నారు. గీతాపారాయణము చేయువారు మొదటనుండి ప్రారంభించక అనగా ప్రథమాధ్యాయమునుండి యారంభముచేయక, ఈ పన్రెండవ అధ్యాయమునుండి మొదలు పెట్టుట మంచిదని పరంపరానుభవముగల పెద్దలు చెప్పుదురు. ఇది పారంపర్యధర్మమని కూడ తెలిపెదరు అట్లయిన విఘ్నములు కలుగవనికూడ వచింతురు· ఈఅధ్యాయమున అమృతసమానములైన వాక్యములు గలవు. మఱియు నీయధ్యాయ శ్లోకములు చాల చిన్నవి. అనుష్టుప్ ఛదస్సుతో గూడినవి. అంతియే గాక యిఱువది శ్లోకములు మాత్రమే యిందుగలవు. మొదటి యధ్యాయము దుఃఖవార్తలతో కూడినది, అది దుఃఖమును గురించిన కథలు గలదగుటచేతను శ్లోకములు చాల పెద్దవగుటచేతను, యెక్కువ శ్లోకము లుండుటచేతను, క్లేశమే దానియందు వివరింపబడియుండుట చేతను పై విధమున జెప్పుటకు కారణమైయుండవచ్చును.

శ్రీమద్భగవద్గీత యంతయును 4 భాగములలో నిమిడియున్నవి ఇది (1) కర్మయోగము ఇది మూడవ అధ్యాయమున గనందగును. (2) భక్తియోగము, ఇది ద్వాదశాధ్యాయమున వివరింపబడినది. (3) ధ్యానయోగము (అభ్యాసయోగము), ఇది ఆఱవ అధ్యాయమున నుపదేశింపబడెను. (4) జ్ఞానయోగము, ఇది పదునాల్గవ అధ్యాయమున గనందగును. తక్కిన అధ్యాయములన్నియు వీటిలో నంతర్భూతములే మఱియు ఈగీత "తత్త్వమసి" అను మహావాక్యమునే యుపదేశించుచున్నదనియు మొదటి ఆఱు అధ్యాయములు "తత్" అను ఈశ్వరుని గుఱించియు రెండవ ఆరు అధ్యాయములు"త్వం" పదముగు జీవుని గూర్చియు, మూడవ ఆఱు అధ్యాయములు "అసి" అను ఐక్యపదమును గూర్చియు నిరూపించుచవని

విజ్ఞులు దెల్పిరి. అనగా జీవేశ్వరైక్యమే గీతయొక్క సారమని మహనీయుల యభిప్రాయము.

అన్ని యోగములున్ను, అన్ని విద్యలున్ను ఒకరియందుండవు. అవన్నియు సర్వేశ్వరునియందు మాత్రమే నిండియుండును. జీవుల సంస్కారము ననుసరించి భక్తియోగమందుగాని, కర్మయోగమందుగాని, ధ్యానయోగమందుగాని, జ్ఞానయోగమందుగాని మనస్సు ప్రవర్తించును. కావున భక్తులు ఈ భక్తియోగమును, నిష్కామకర్మయోగులు మూడవ అధ్యాయమును, ధ్యానయోగులు ఆఱవ అధ్యాయమును జ్ఞానయోగులు పదునాల్గవ అధ్యాయమును ముఖ్యముగ పఠింపతగినది ఒక్కొక్కరును ఈనాల్గు యోగములలోని ఒక్కొక్క దానియందు అధిక్యము గల్గియుండినను తక్కిన మూడు యోగములను మిశ్రరూపములుగ గల్గియుండవలెను ఒకటి ముఖ్యముగాను తక్కినవి గౌణముగాను నుండుటయే పవిత్రధర్మమగును. అట్లుగాక భక్తియోగమందుగాని, కర్మయోగమందుగాని ధ్యానయోగమందుగాని, జ్ఞానయోగమందుగాని యాధిక్యము గల్గియుండినను తక్కినవాటిని నిందించుట చాల సంకుచితభావమే యగును. ఏయోగమవలంబించినవాడైనను ఈద్వాదశాధ్యాయమున చెప్పియుండు దైవగుణము లందఱును గలిగియుండవలయును.

ఈ నాల్గుయోగములును సనాతనములు. వీటిలో ఏ యోగము ఏ కాలమున క్షయించునో దాని నుద్ధరించుట కొఱకు ఒకడు భూలోకమున నవతరించును. అప్పుడు దానికే యాతడాధిక్య మిచ్చును. ఇదే దీనిలోగల పరమరహస్యము. మఱియొక కాలమున ఇంకొకయోగము క్షీణించినపుడు దానిని పునరుద్ధరించుటకొఱకు మరియొక దివ్యపురుషు డావిర్భవించును. ఆమహనీయుడు దానివనలంబించి దాని కగ్రస్థాన మిచ్చును. ఈలాగున కాలచక్రము తిరుగుచుండును, ఇది అనాది ధర్మము. అనంతకాలము వఱకు ఈలాగుననే జరుగుచుండును, ఒక రాజ్యపరిపాలనమందు చతురంగబలముండును, వారందఱున్ను రాజ్య సంరక్షణయందును, అధికారమందును సమానులై యుందురు,వారిలో వైద్యశాస్త్రనిపుణులు-మేమే ముఖ్యులము,మేము లేనిచో రోగములనుండి జనుల నెవరు రక్షింపగలరు? అనియు, విద్యాశాఖవారు—మేమే అధికులము. అందరకును విద్యచెప్పి బాగుపరచు భారము

మేమే, విద్య లేనిచో మనుజులకును జంతువులకును ఏమిభేదము? అనియు, శత్రువులనుండి దేశమును సంరక్షించువారగు సైన్యాధిపతులు-మేమే దేశ సంరక్షకులము, మేము లేనిచో దేశమును శత్రువులు ఆక్రమింతురు అనియు, నాల్గవవారగు మంత్రివర్గము-మంచిచెడ్డలను విచారించి న్యాయ బద్ధముగ మేమే రాజ్యపరిపాలన మొనర్చుచున్నారము. మేము లేనిచో జనులు అన్యాయ పరులై ప్రపంచమును నాశమొనర్తురు. వైద్యుల న్యాయాన్యాయములను, సేనాధిపతులుకార్యాకార్యములను విద్యాధికుల మంచిచెడుగులను మేమే విచారణచేయు వారమగుటచే, మేమే యధికులమనియు నిట్లు చెప్పబూనిన అదెట్లుండునో. పై విషయమున్ను ఆలాగుననే యుండును. ఇతి యెంతయో వివేకదూరమనియు, ఇది కేవలము అవివేకపూరిత వచనమనియు జను లెఱుంగు విధమున మేమధికులమని చెప్పువారిని గూర్చియు వివేకులు తలంతురు. లేక శరీర కార్య నిర్వహణములో నేనే ముఖ్యమని కన్నును, నేనే యెక్కువని చెవియు, నేనే ప్రధానమని నోఱును, నేనే యధికమని ముక్కును వచించి పోట్లాడుకొనిన అది యెంత సామరస్యముగా నుండునో, అట్లనే కరచరణాదులును దంతములునుకూడ మాత్సర్యమును ప్రకటించిన ఆదేహ స్థితి యెట్లుండునో, పైదానిచే లోకమునకు కలిగెడు ఫలితమున్ను ఆలాగుననే యుండును. కావున నట్టి యంధకారములో పడిపోగూడదని తలంచి శ్రీకృష్ణభగవానులు జీవకోట్ల సంస్కారము ప్రకారము ఈనాల్గు యోగముల నుపదేశించిరి.

అందఱకును ఆత్మశుద్ధి, ఇంద్రియనిగ్రహము. జీవకారుణ్యము, దైవ భక్తియు. నిరంతర పరమేశ్వరధ్యానమున్ను సమానముగానే యుండ వలెను, అయితే యిచ్చట భక్తులకొక సందేహము కలుగవచ్చును. అదేమన, పుణ్యకర్మాదులను ఫలాపేక్షలేక ఈశ్వరార్పణ బుద్ధితో చేయుటచే ఆత్మ శుద్ధిగల్గి జ్ఞాన ముదయమై మోక్షము కలుగుట నిజముగ నుండవచ్చును. కాని యోగ, సమాధి, తపస్సులవల్ల గలిగెడు ఆత్మశక్తియు, దివ్యప్రజ్ఞయు యోగసిద్ధులును వీరికిగూడ గలుగునాయని, దీనికి సమాధానమేమన, నిష్కామకర్మయోగము ఈశ్వరార్పణ బుద్ధితో చేయుచు రాగారాగా ఆత్మ యొక్క ఆవరణములు తొలగిపోయి స్వరూపజ్ఞానముగల్గి ముక్తిగలుగుట నిక్కము కాని యోగసమాధుల చేతను, తపోనిష్ఠాదులచేతను గలిగెడు

అప్రాకృతదైవశక్తి మాత్రము గలుగుట దుస్తరము. ఏలన,అనేక మహర్షులు దివ్యప్రభావము గలవారు, తపస్సువల్లను, యోగాభ్యాస మహిమవల్లను, అట్టి అతీంద్రియ జ్ఞానముగలవారైరి. కాని యోగము తపస్సు ఇవన్నియు నిర్విఘ్నముగ ఫలసిద్ధి గలుగవలసియుండిన, చిరకాలము పుణ్యకర్మలు ఈశ్వరార్పణ బుద్ధితో తప్పక చేయవలసియుండును. లేనిచో యోగసమాధులకు అర్హత గలుగదు ఇదే యిందులోగల రహస్యము, వైరాగ్య, బోధోపరతుల ఫలములనుగుఱించి పంచదశియందు తెలుపబడినది. ఒక్కొక్క దానివల్ల ప్రయోజన మవుట ప్రత్యేకముగా చెప్పబడినది. వానినందు గాంచవచ్చును ఈ యధ్యాయమున ఈశ్లోకము ముఖ్యము,

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥
(12-20)

ఎవరు ఈశ్వరునే పరమగతియని నమ్మి, మోక్షప్రదమగు ఈ యమృతవాక్యములను నేను చెప్పిన విధమున ఆచరించి శ్రద్ధతో నడచుకొనుచున్నారో, అట్టి భక్తిగలవారు నాకు మిక్కిలి ప్రియులు.

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

క్షేత్రమనగా శరీరము. క్షేత్రజ్ఞుడనగా జీవుడు. ఈ రెంటియొక్క విభాగము దీనియందు గలిగియుండుటచే దీనికి క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమని పేరువచ్చినది ఆత్మ యెటువంటిది? అనాత్మస్వరూపమెట్టిది అని తెలుసుకొనవలెనని భగవదాశయము. కొందఱు ఆత్మానాత్మ విచారము భక్తులకు గాని, నిష్కామ కర్మయోగులకుగాని అవసరము లేదని వాదింతురు. శ్రీ భగవానుల యభిప్రాయ మట్లుగాదు. భక్తి గలిగినను ఆత్మ యిటువంటిది, అనాత్మ ఇటువంటిది ప్రకృతి యిటువంటిది పురుష డిటువంటివాడని తెలియకపోయిన ఆత్మయందు నిత్యబుద్ధియు అనాత్మయం దనిత్యబుద్ధియు గలుగదు. కావుననే 'నాయొక్క భక్తులుగూడ దీనిని తెలిసికొనియే ముక్తిని పొందుచున్నారు' ని 19–వ శ్లోకమున భగవానుడు చెప్పెను.

మఱియు దీనియందు మొదట ఆఱు ప్రశ్నలను అర్జునుడు అడిగి యున్నాడు. (1) ప్రకృతి యనగా నెట్టిది? (2) పురుష డనగా ఎవడు? (3) క్షేత్రమనగా నెటువంటిది? (4)క్షేత్రజ్ఞుడెట్టివాడు? (5) జ్ఞానమనగా దేనికి పేరు? (6) జ్ఞేయమనగా నేమి?—ఈ ప్రశ్నలలో ఆఖరునగల ప్రశ్నలు రెండును ముఖ్యములు. కనుకనే పై ప్రశ్నలలోని మొదటి నాల్గింటికిని సామాన్యముగా అర్థము చెప్పి, తుది రెండు ప్రశ్నలకు విశేష ముగా అర్థము చెప్పుటకు కారణము. ఇచట జ్ఞానమునే జ్ఞేయమనియు, జ్ఞానమునే ఆత్మజ్ఞానమనియు దలంపక జ్ఞాని కుండవలసిన సుగుణములను జ్ఞానమనియు, దైవసాక్షాత్కారమును జ్ఞేయమనియు గ్రహించుకొనవలెను. ఇట జ్ఞానికి ఉండవలసిన ధర్మములు ఇఱువది చెప్పియున్నారు. ఈగుణములు గలవాడే జ్ఞానియని తెలిసికొనవలెను. ఈగుణములకు భిన్నములగు ప్రకృతి గుణములు ఎవనియందు గన్పించునో వానిని అజ్ఞాని యనియే నిశ్చయించ వలెను. సాధకులు గూడ తమయందు శ్రీభగవాను డుపదేశించిన జ్ఞాన గుణములకు భిన్నములగు ప్రాకృతిగుణము (దుర్గుణము) లుండిన వానిని అవిద్యా గుణములని యెఱింగి అట్టి దుష్టగుణములను రహిత మొనర్పవలెను.

మఱియొక రహస్య మీ యధ్యాయమున గలదు. అదేమన, జ్ఞానికి ఉండవలసిన అమానిత్వాదులు ఇఱువది సుగుణములు పూర్తిగా గలిగి యుండినను తమపని పూర్తియైనదని సాధకులు తలంపరాదు. జ్ఞేయమగు బ్రహ్మసాక్షాత్కారము గలిగిన మాత్రమే అమృతత్వము గలుగునని శ్రీ భగవాను లుపదేశించిరి. జ్ఞానగుణములు పూర్తి అయిననే జ్ఞేయములో ప్రవేశించుటకు అర్హత గలుగును వీనిలో ఏదైన నొకటి పూర్తిగ లేనిచో జ్ఞేయమునకు అర్హత లేదని గ్రహించవలయును. ఏదైన యున్నతోద్యోగము నకై కావలసిన పరీక్షలలో నుత్తీర్ణులు కానిచో. ఆపదవికి జనులెట్లు యోగ్యులు కారో అలాగున బ్రహ్మవిద్యయందును ఇట్టి నియమము గలదు. కనుకనే అర్జునుడు మొదట జ్ఞానము నడిగిన తరువాత జ్ఞేయము నడుగుటకు కారణమైనది.

భగవానుడు కూడ జ్ఞానము నుపదేశించిన తరువాత జ్ఞేయమగు బ్రహ్మము నుపదేశించెను. అట్లుగాక మొదటనే నీతిని, నిష్ఠలను ఉపదేశింపక బ్రహ్మము నుపదేశించువారు త్రైలము, వర్తి. ప్రమిదయు మొదట సమర్పక

దీపమును వెలిగింపువారి చందమున నుందురు. ఆ దీపము నిలుచునా? తైలాదులు నూడును సిద్ధపరచిన తరువాత బ్రహ్మజ్ఞానజ్యోతిని వెలిగింపిన అది వెలుగుచుండును. తైలాదిత్రయముచే దీపము వెలిగించినను గృహాంత రాళములందు. ఏదైన కిటికీలద్వారాగాని తలుపులద్వారాగాని గాలి వచ్చిన దీప మాఱిపోవును. అపుడు గాలి వలన దీపమునకు అపాయము గలుగునని తెలిసిన ఆద్వారము నెట్లు మూసివేయుదురో, అలాగున శమద మాదులు గలిగి బ్రహ్మోపదేశము సిద్ధించినను, విక్షేపాదివిషయవాసనలు గలుగుచుండిన అట్టివానినుండి విముక్తినొందుటకు, తగిన ప్రయత్నములు చేసికొని ధ్యానధారణాదులను, మననిదిధ్యాసములను బాగుగ నభ్యసింప కొనవలెను. దీనికే జ్ఞానయజ్ఞియని పేరు. మనమొక పరీక్షకు చదువుచుండు నపుడు కొన్ని పాఠములలో నుత్తీర్ణులై మఱికొన్నిటిలో తప్పినచో, మఱు సంవత్సరము వాటినేలాగున పూర్తిచేయుదుమో, అలాగున బ్రహ్మనిష్ఠుల కుండవలసిన సుగుణములలోను కొఱతగలిగిన మఱియొక జన్మలో ఆ కొఱతను పూర్తి చేసికొనిననే మోక్షపదముక కర్హత గలుగును. ఇట్టివారే చిన్న కాలమునుండి విరక్తులై బ్రహ్మనిష్ఠగల వారుగ జన్మింతురు. కడచిన జన్మలో ఏ ప్రతిబంధముబుగలిగి మోక్షము లభింపకపోయినదో, అట్టి ప్రతి బంధము లేవియులేని యుత్కృష్టజన్మము ఈశ్వరకృపచే గలుగును. దీని యందేలాటి సందేహమును లేదు. జీవించియుండగనే, జీవు డివడనుంఢగనే, నిశ్శేషవాసనారాహిత్యము గలిగి మనుజుడు తాను బ్రహ్మ సుఖము నొందవలయును. "నాయందు ప్రకృతిదోషమంతయు నశించినది. నేను నిత్యసుఖమును పొందితిని, నేను అఖండ జ్ఞానస్వరూపు డను; ప్రకృతిగాని, ప్రకృతిదోషములుగాని యిప్పుడు నాయందు ఏమాత్రము కనుపింపుటలేదు. అంతయు శాంతమయము, జ్ఞానమయము, పుణ్యమయము, ఆనందమయము" అను బోధ కలుగవలెను. ఏలాగున రోగియైనవాడు ఔషధ సేవచే ఆరోగ్యము గలుగునపుడు 'నాబాధలన్నియు పోయినవి. ఇపుడు ఏలాటి దుఃఖమును లేదు, ఆరోగ్యముగానున్నాను' అని చెప్పునో, అలాగున అజ్ఞానము నశించిన జ్ఞానికూడ ప్రకృతివలన గలిగెడు దుఃఖము లన్నియు నశించినవాడై యుండును కావుననే మోక్షదశయందు అతిహర్షము కలుగునని శ్రుతివాక్యములయొక్క సారము. నిశ్శేషశోకశాంతియు

అప్పుడు సిద్ధించునని శాస్త్రములు చెప్పెడి రహస్యము. ఆకలి దప్పికలచే మండుమండు ఎండలో తపించుచు ఎడారిలో ప్రయాణము చేయువాడు చల్లని నీడయు,శీతలోదకమును, తృప్తిగ మంచిభోజనమును పొందిన, ఏలాగునపూర్ణ తృప్తుడై యుండునో, ఆలాగున తాపత్రయాగ్నిచే తపించి సంసారమను ఎడారిలో ప్రయాణముచేయు జీవికిగూడ మోక్షసుఖము గలుగునపుడు పూర్ణ తృప్తి గల్గును, కనుకనే నిశ్శేషదుఃఖనివృత్తియు నిరతిశయ సౌఖ్యమున్ను ముక్తిదశయందు గలుగునని వచించుటకు కారణము. తక్కిన సౌఖ్యము లొకవేళ గల్గినను క్షణకాలములో నశించిపోవును. ఈకైవల్యసుఖమునకు పతన మనునదియే లేదు. ఎన్ని యుగములు గాని, కల్పములు గాని పోయి నను దానికి క్షయము గలుగదు,

ఈ యధ్యాయమందీ శ్లోకము ముఖ్యము.

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥ (13-28)

ఎవడు బ్రహ్మాదిస్తంబపర్యంతముగల సమస్త ప్రాణులందును, సచ్చిదానంద లక్షణములు గలవాడై సమానముగనుండునో, వస్తు సముదాయము నశించు చున్నను ఎవడు నాశము నొందడో, అట్టి పరమేశ్వరుని సమస్తములలోను సమానముగా జూచువాడే నిజముగ జూచువాడు. తక్కినవారలు నేత్రములు గలవారైనను నేత్రములు లేనివారితో సమానులే! పాంచభౌతికమగు ఈదృష్టి పంచభూత సముదాయ వస్తువులను మాత్రమే చూడగల్గును. ఆత్మ (బ్రహ్మ) పంచభూత విలక్షణము గాన దానిని చూడవలెననిన దివ్యదృష్టి గలుగవలెను అనగా ఆత్మయొక్క ఆవరణము లన్నియు తొలగవలెను.

జ్ఞానము, అనగా జ్ఞానికుండవలసిన గుణములు సంపూర్ణముగ గలిగి యున్నను జ్ఞేయమును పొందనిచో అమృతత్వము గలుగదని ఈ యధ్యాయ మున భగవంతుడు విస్పష్టముగా చెప్పుటచే ఈజ్ఞేయపదమును గూర్చి బాగుగా యోచింపదగియున్నది. ఇప్పుడు చాలామంది జనులు, ఏదైన కొంత పరోపకారము చేయుటచేతను, కొన్ని సత్కర్మల నాచరించుటచేతను, కొంత లోకసేవ యొనర్చుటచేతను, కొంత సదాచార నిష్ఠ గలిగియుండుట చేతను తాము ధన్యులమైతిమనియు, దానికంటె పరమైనది, పొందదగినది,

లేదనియు తలంచి సంతుష్టు లగుచున్నారు. దానివలన తృప్తి బొందక జ్ఞేయమగు బ్రహ్మమును అనగా ఆత్మసాక్షాత్కార స్వరూపమును అనుభవములోనికి తీసికొని వచ్చుటకై చూడక కృతకృత్యుల మయితి మని తలంప వలదనియే భగవదాశ యనూ. అయితే యిపుడు కొంత పరోపకారము చేత తాము అందఱికంటె శ్రేష్ఠులమైతిమని తలంచుటకు కారణమేమన, అంత మాత్రమైనను సత్కర్మచేయు వారిక్కాలమున అరుదైరి. అంతియేగాక జ్ఞేయమగు బ్రహ్మమునందు స్థితి గల్గిన బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు తాపసోత్తములు యోగనిష్ఠులు ఇపుడు మిక్కిలి అరుదైపోయినందు చేతను ఇట్టి అభిప్రాయము వీరికి గలుగుటకు కారణమైనది.

ఎట్లన్న, ఒక దేశములోను వృక్షములేలేవు. అచ్చోట ఆముదపుచెట్టు గొప్ప మ్రాను అని తలంచి జనులు గర్వపడుదురు. మఱియు ఇంకొక దేశమున పాములే లేవట. అచట భూనాగము (ఎఱ్ఱ) అదిశేషుడుగా తలంపబడునట! ప్రస్తుతము మనయొక్క దేశస్థితియు ఈలాగున పరిణమించినది.

## గుణత్రయవిభాగయోగము

మూడు గుణములచే జీవు డెట్లు బద్ధుడగునో అవిషయమును గూర్చి చెప్పినదగుటచే ఈఅధ్యాయమునకు గుణత్రయవిభాగ యోగమని పేరు వచ్చినది. గీతయందు దింత ప్రాముఖ్యముగల అధ్యాయము మఱియొకటి లేదు. ఇది జ్ఞానయోగమున జేరినది. బాల మేధాసంపత్తిగల వారికి మాత్రమే ఇది అర్థమగును. చిత్తశుద్ధియు, ఏకాగ్రతయు, గల వారలకు, విద్యలేనప్పటికిని ఇది అర్థము కాగల్గును. మహాపండితులైనను అంతఃకరణ శుద్ధియు. చిత్తైకాగ్రతయు, సంయమమున్ను లేనిచో ఇది అర్థము కాదు. నేత్రము గలవారు విద్యలేనివారైనను ఏలాగున సూర్యుని జూడగల్గుదురో, నేత్రహీనులైనవారు ఎంత శాస్త్రపాండిత్యము గల్గినవారైనను యేలాగున చూడజాలరో, బ్రహ్మవిద్యయొక్క రహస్యమున్ను ఇట్టిదే. ఇది కఠినభాగ మగుటచే మొదటి శ్లోకములో శ్రీభగవానులు "ఇది జ్ఞానము లన్నిటిలోను ఉత్తమజ్ఞానమనియు, ఋషులందఱును ఇట్టిజ్ఞానము గలవారగుటచేతనే యీజన్మలోనే ముక్తిని బొందిరనియు చెప్పుటకు కారణము. ఈశ్వర

స్వరూపమగు ఆత్మకు మాలిన్య మెవ్విధమున గల్గినది! దేనివలన ప్రకృతి యందు బంధింపబడినది? మఱల ఎట్లు ఈమాయా మాలిన్యమునుండి తొలగును? ఏలాగున దానికి ప్రకృతిబంధమునుండి విముక్తి గల్గును? ప్రకృతిదోషము నశించి విముక్తినొందిన జీవు డేలాగున నుండును? ప్రకృతిదోషము నశించుటకు ముఖ్యసాధన మెద్ది? ఎవరెవరు ఏ యే గుణము లతో గూడియుండిరో యెట్లు తెలియును? ఏయే గుణము గల్గియుండునపుడు దేహమును వీడిన ఏయే లోకమును జెందును, మఱల అతనికి యే జన్మము గలుగును?జీవన్ముక్తుని లక్షణ మెటువంటిది?ఈమున్నగు విషయములన్నియు నిందు విశదముగా తెలుపబడినవి స్వయముగ తెలిసికొను సమర్థత లేనివారు. గొప్పమేధాసంపత్తి గలవారును, ఆత్మజ్ఞానులును నగు వారివద్ద ఈ అధ్యాయమును తెలిసికొనుట యే మేలు

దీనియందు శుష్క వేదాంతమునకు తావులేదు, ఏలన, గుణములు ఇంద్రియములకు స్వభావములనియు, నీవు సాక్షిగా నున్నట్లు తలంచిన చాలుననియు, అట్టి న యేకార్యము చేసినను బంధము లేదనియు చెప్పెడు. వాక్య మసత్యప్రలాపమని యీ అధ్యాయము భేరీనాద మొనర్చి చెప్పు చున్నది. ఇది సత్యవేదముయొక్క నిజార్థము. గుణములు ఇంద్రియములకు స్వాభావికములు గావనియు, అవి కర్మసంస్కారము ననుసరించి ఆగంతుక ముగవచ్చి చేరినవనియు, అట్టి దోషములు రహితములు కావలయుననియు, శ్రీభగవాను లుపదేశించిరి. ఈ విషయము రెండవ అధ్యాయములోగల— "మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ" అను శ్లోకము వ్యక్తీకరింపబడినది. ఆగంతుక మనగా మధ్య వచ్చి చేరునది. ఎట్లన. వస్త్రముయొక్క నిజరూపము తెలు పైనను, రంగులచే అనేక వర్ణములుగ గన్పించును. అది అసలు వస్త్రము యొక్క స్వభావము కాదనియు, రంగులచే గలిగినదనియు ఎట్లు గ్రహించు చున్నామో, అలాగున జీవునియొక్క స్థితినిగూర్చియు ముముక్షువులు తెలిసి కొనవలెను. ఎటువంటి రంగువస్త్రమైనను ద్రావకములో వేసి, ఉడకబెట్టి ఉతికిన, రంగులన్నియు వదలిపోయి, తెలుపువర్ణము తేలునట్లు, దైవ చింతనలో మగ్నులై, ధ్యానములో మునిగి, భవదోషము గలుగనీయక చూడవలెనని యీ అధ్యాయ ముపదేశించుచున్నది. ఇందు మూడు గుణములు మాత్రమే చెప్పిరేగాని విశుద్ధగుణమును చెప్పలేదని కొందఱు తలంచవచ్చును.

గుణత్రయాతీతుని లక్షణము ఈ అధ్యాయమున చెప్పియుండుటచే, అట్టి సందేహము కలుగుటకు అవకాశము లేదు. భగవద్భక్తి యను ద్రావకములో జీవుని శుద్ధ మొనర్పవలెనని యీ అధ్యాయమున అఖరున భగవాను లుపదేశించిరి. కావున నిర్మలమైన భక్తియొక్క దానివల్లనే ప్రకృతిదోషము లన్నియు తొలగి,జీవకోట్లు భగవత్ప్రాప్తిని బడయగలరు. కావున ముముక్షువు లందరున్ను, భక్తులందరున్ను, తక్కిన వారందరున్ను ఈ ప్రకృతి గుణములలో ఏవి తమయందు గలవో విచారించుచు, వానిని కనిపెట్టి, అట్టి దోషములు తమయందు లేకుండునట్లు చూడవలెను. ఈ అధ్యాయమున ఈశ్లోకము ముఖ్యము.

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే॥
(14-20)

"దేహముకలుగుటకు కారణభూతమైన సత్వరజస్తమోగుణములను దేహి యెపుడతిక్రమించునో, అప్పుడతడు జన్మమృత్యుజరా దుఃఖములచే విడువబడి మోక్షము నొందును.

## పురుషోత్తమ ప్రాప్తి యోగము.

పురుషోత్తము డనియు, భగవంతుడనియు, పరమేశ్వరుడనియు పరబ్రహ్మమనియు చెప్పినను నొకే యర్థము అట్టి సర్వేశ్వరుని పొందుటకు తగిన పద్ధతి యీ అధ్యాయమున చెప్పబడినందున దీనికి పురుషోత్తమ ప్రాప్తియోగమని పేరు వచ్చినది. ఈ అధ్యాయములో చెప్పినట్లాచరించు వారికి పరమపద ప్రాప్తిగలుగును. అనగా మోక్షము సిద్ధించును. అదేపురుషోత్తమ ప్రాప్తియనియు, భగవదైక్యమనియు తెలియదగును. అనుష్ఠానపరు లందరును ఈ అధ్యాయమును భోజనకాలమున పఠించి భుజింతురు. అట్లు చేయువారలకు మహాపుణ్యము గలుగుననియు, పఠించనివారు భక్తితో వినుచుండినను పుణ్యప్రాప్తి నొందుదురనియు అనాదినుండియు వదంతి గలిగియున్నది. దానికి కారణము గలదు. గీతలో 18 అధ్యాయములుండగా ఈ అధ్యాయమును మాత్రమేల పఠింపవలయును? ఇతర అధ్యాయములలో

దేనినైన భోజనసమయములో పారాయణము చేయరాదా, యని సందేహము గలుగవచ్చును సన్యాసు లందఱును భోజనకాలమున దీనిని పారాయణ చేయుదురు. సన్న్యాసులు మాత్రముగాక బ్రహ్మనిష్ఠులందరున్ను ఆలాగున నాచరింతురు దానికి కారణమేమన 14వ శ్లో॥ లో భగవంతుడీ లాగున నుపదేశించియున్నారు.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥

నేనుజఠరాగ్ని స్వరూపుడనై ప్రాణుల దేహముల నాశ్రయించి ప్రాణాపానవాయువులలో గూడుకొన్న వాడనై ప్రాణికోట్లు భుజించెడు (భక్ష్యభోజ్యలేహ్యచోష్యములనియెడు) నాల్గువిధములగు అన్నమును పచనము చేయుచున్నాను.

ఇది బ్రహ్మనిష్ఠులకును, పరమభక్తులకు చాల ముఖ్యమైన శ్లోకము. ఇయ్యది భోజనకాలములోగూడ. పంచప్రాణములకు పంచజ్ఞానేంద్రియ ములకు; పంచ కర్మేంద్రియములకు, పంచతన్మాత్రలకు, ఆత్మవిలక్షణ స్వరూపమని భావనచేసికొనుట కొఱకే యగును. లేక యీ జీవసంజ్ఞలతో ప్రకాశించువాడు కేవలము భగవత్స్వరూపుడే, అట్టి ఆత్మైక్యానుసంధాన పరులై యుండవలెనను అర్థము దీనియందు స్ఫురించుచున్నది. మఱియు భోజనకాలమున నీయధ్యాయము పారాయణచేయు విషయమై శ్రీకంఠ శివాచార్యులు వ్రాసిన గీతాభాష్యమందు కారణము చెప్పబడెను. అట్లు ఒక్క అధ్యాయమునకేగాక ప్రతి అధ్యాయమునకు పారాయణ ఫలమున్ను, దానికి కారణమున్ను నిరూపించియున్నారు. ఈవ్యాస మతిసంక్షిప్త విషయ మగుటచే దానిని ఇట వ్రాయలేదు.

దీనిలో మొదటనే ప్రపంచవృక్షముయొక్క వర్ణన చేయబడినది. ఇట్టి సంసారవృక్షమును నఱికి వేసినమాత్రమే జననమరణ దుఃఖములు నశించి, జీవుడు మోక్షము నొందగల్గును. ఆవిషయము లన్నియు దీనిలో విశదీకరింపబడియున్నవి. ముఖ్యముగా సంసారవృక్షము అనగా అజ్ఞాన వృక్షము ఎట్టిదో, దానిని నఱకెడి గొడ్డలి యెట్టిదో, ముముక్షువులు తెలిసి కొనదగినది. వృక్షము లన్నింటికిని మూలము క్రిందుగాను, అగ్రముపై

గాను నుండును. ఈ సంసార మహావృక్షమునకు మొదలు పై భాగమునను, అగ్రము క్రిందిభాగమునను నుండునని శ్రీ భగవానులు వర్ణించిరి. ఇది యాశ్చర్యకరము! ఈలాగున ఎచ్చటనైన యుండునా? ఇదియే దీనిలోగల మర్మము. ఆత్మచింతకులందఱున్ను పరమ భక్తులందఱున్ను ఈరహస్య మును తెలిసికొనవలెను. స్వయముగా తెలిసికొన శక్తిలేనివారు ఉత్తమ గురువులవలన నైనను గ్రహించుకొనవచ్చును. కనుకనే ప్రారంభములోనే "ఊర్ధ్వమూలమధశ్శాఖ" మని ఆరంభించిరి. ఈవ్యాసములో దేనికిని ప్రమాణ శ్లోకములు వ్రాయగూడ దని తలంచబడమైనది ఏలన. గ్రంథము పెరిగి పోవును అయినను ఇది అమూల్య విషయమగుటచేతను, ముముక్షువులు ముఖ్యముగా తెలిసికొనదగిన దగుటచేతను శ్రుతిస్మృతులందుగల రెండు వాక్యములు మాత్రము వ్రాయతలంచబడమైనది. ఆ సంసారవృక్ష మెటు వంటిదో యిట వర్ణింపబడుచున్నది

అవ్యక్తమూల ప్రభవ స్తస్యై వానుగ్రహోత్థితః।
బుద్ధిస్కన్ధమయశ్చైవ ఇన్ద్రియాన్తరకోటరః॥
మహాభూతప్రశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా।
ధర్మాధర్మ సుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః॥
ఆజీవ్యస్సర్వవృక్షాణాం బ్రహ్మవృక్షస్సనాతనః।
ఏతద్బ్రహ్మవనం చైవ బ్రహ్మ చరతి నిత్యశః॥
ఏతచ్ఛిత్వా చ భిత్వా చ జ్ఞానేన పరమాసినా।
తతశ్చాత్మరతిం ప్రాప్య యస్మాన్నా వర్తతే పునః॥

"అవ్యాకృతము (మూలప్రకృతి లేక మాయ) అనెడు వేరు నుండి పుట్టి, యావేరు గట్టిదగుటంజేసి క్రమముగా విస్తరించి పెరుగుచున్నదియు, బుద్ధియనెడు మ్రానుగలదియు' నేత్రేంద్రియాది రంధ్రములే తొఱ్ఱలుగా గలదియు, పృథివ్యాది పంచభూతములే పెద్దకొమ్మలుగా గలదియు, శబ్దాది విషయములే యాకులుగా గలదియు, ధర్మాధర్మము లనెడు మంచిపుష్ప ములు గలదియు, సుఖదుఃఖ పుణ్యపాపము లనెడు పండ్లుగలదియు, వృక్షము పక్షులకువలె, సమస్త ప్రాణులకు జీవనాధారమైనదియు, చిరకాలమునకు బ్రహ్మజ్ఞానము గలిగిన పిమ్మట పోవునది యగుటబట్టి బహు

పురాతనమైనదియు బ్రహ్మమే యధిష్ఠానముగా గలదగు ఈ సంసారమనెడు వృక్షమే పరమాత్మకు విహారస్థానమగు వనమైయున్నది.

అవ్యక్తమనియు, అవిద్యయనియు, ప్రకృతియనియు, ప్రధానమనియు, మాయయనియు; అజ్ఞానమనియు చెప్పినను నొకేయర్థము.

"ఓం తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః. ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోఽన్నం. అన్నాత్పురుషః" (తైత్తిరీయోపనిషత్తు.)

ఆత్మశబ్దవాచ్యమును, సత్యజ్ఞానానందస్వరూపమునగు ఆ పరబ్రహ్మమునుండి సమస్తభూతములకు నవకాశము నిచ్చుచున్న ఆకాశము పుట్టినది ఆకాశమునుండి వాయువును, వాయువునుండి అగ్నియు, అగ్నినుండి జలమును జలమునుండి పృథివియు. పృథివినుండి తరుగుల్మలతాదులును, సమస్తసస్యముల స్వరూపములుగా గల ఓషధులును పుట్టినవి ఆయోషధుల వలన అన్నము పుట్టినది. రేతోరూపముగా పరిణమించిన ఆయన్నమువలన శిరస్సు, హస్తము మొదలైన అవయవములతో గూడిన యాకృతిగల పురుషుడు పుట్టెను.

భగవంతు డుపదేశించిన యిది చాలా రహస్యమైనది. మూల ప్రకృతి నుండియే యీసృష్టి ప్రారంభమైనదనియు, అట్టి మూలావిద్యను ఛేదించిన మాత్రమే అజ్ఞానవృక్షము నశించుననియు, ఈశ్వరసాక్షాత్కార జ్ఞానమువల్ల మాత్రమే దానికి వినాశము గల్గుననియు. వచించిరి. భోజనకాలములో నిట్టి పవిత్రపారాయణవల్ల అందఱిమనస్సు ఈశ్వరవిషయములో మగ్నమై యుండును. అప్పుడు భుజించెడి అన్నాది పదార్థము లతి పవిత్రములై యుండును. అట్టి అన్నపానాదులచే హృదయము చాలా నిర్మలత్వము నొందును. భోజనసమయములో ఎవడెట్టి భావము గలిగియుండునో, అట్టి గుణ మాతనికి తప్పక గలుగునని దివ్య దృష్టి గలవారి ఆశయము. కావుననే మంత్రపూతముగా నొనర్చి భుజింపవలయునని చెప్పెడి రహస్యము. అట్టి దివ్యమంత్రము బు జపించవలసి యుండుటచే ఇతరములగు వ్యర్థవాక్యములు గాని తలంపులుగానిచేయుట కవకాశముండదు. ఋషులందఱును మంత్రము అను సృష్టించుట కిదియే కారణము కనుకనే భోజనము కొంత రహస్య

స్థలములో చేయవలెననియు ఆ సమయములో మాట్లాడగూడదనియు ఏర్పఱచిన రహస్యము స్వయముగా దైవభావము గలిగియుండుట సామాన్యులకు దుస్తరమని తలంచి మంత్రము లేర్పఱచిరి. కాలమహిమచే ఇప్పుడట్టి మంత్రములను జప మొనర్చి భుజించువారు అరుదైరి ఒకవేళ కొందఱు ఉచ్చరించుచుండినను మనస్సులో ఈశ్వరభావము లేకపోవు చున్నది. అందువల్లనే అట్టి అన్నాదులు దుష్పరిణామముబొంది, వానివల్ల యేర్పడు స్త్రీపురుష శుక్ల శోణితములు అశుద్ధములై, అందువల్ల పుట్టెడు బిడ్డలు యశస్సును ఓజస్సును లేనివారగుటకున్నూ, అధర్మప్రవర్త కులగుటకున్నూ, అసుర ప్రకృతిగల వారగుటకున్నూ కారణమగుచున్నది. మంత్రమును మాత్ర మొకవేళ ఉచ్చరించుచుండినను భావము లేకపోయిన అదిన్ని అంతఫలమును గలుగ జేయదని జ్ఞాపకముంచుకొనవలెను. కనుకనే వాచ్యవాచకముల యైక్యము గలిగియుండవలెనని చెప్పెడు రహస్యము. వాక్యమునకన్న భావమే గొప్పదైనను అట్టిమంత్రము లేనిచో భావము కూడ చేయరని తలంచి కరుణామూర్తులగు పరమఋషులు మంత్రములను కూడ పఠించవలెనని నిర్ణయించిరి కలికాలమహిమచే ఇది ఆచరించువారే లేకపోయిరి. ఈ యధ్యాయమున ఈశ్లోకము ముఖ్యము

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః॥

ధ్యానాదులచే బ్రహ్మస్వరూపమును దెలిసికొనుటకు ప్రయత్నము చేయుచున్న ధ్యానయోగులు (జ్ఞానులు) తమ యందున్నట్టి ఈయాత్మను దర్శించుచున్నారు. ధ్యానభజనాది ప్రయత్నములు చేయుచున్నను చిత్తశుద్ధి లేని అవివేకులు ఈయాత్మను తెలిసికొనజాలకున్నారు.

## దైవాసుర సంపద్విభాగయోగము

ఈ యధ్యాయమున దైవసంపత్తును గుఱించియు, అసురసంపత్తును గూర్చియు విస్తారముగ చెప్పుటచే దీనికి దైవాసురసంపద్విభాగయోగమని పేరు గల్గినది. దైవసంపత్తనగా దైవగుణములనియు, అసురసంపత్తనగా అసురగుణములనియు గ్రహించతగినది. కావున ముముక్షువులు అసుర

స్వభావములు తనలోనుండిన, కనిపెట్టి ఒకేసారి విడిచిపెట్టుటగాని, లేక ఒక్కొక్క దానిని క్రమముగ త్యజించుటగాని చేయవలెను. తీవ్రవైరాగ్యము గలవారు ఒకేసారి విడువవచ్చును కొంచెము మందవైరాగ్యమున్న కొంచెము బాధనున్నగలవారు ఒక్కొక్క దానిని క్రమముగ ఉపేక్షించి పరిశుద్ధు లయ్యేలాగున ప్రయత్నించవలెను ఆ పైన ఒకవేళ పైజెప్పిన సుగుణము లన్నియు తనలో పూర్తిగ లేనిచో, వాటినిన్ని త్వరలో ఒకటొకటిగా సంపాదించుకొనవలయును. చెడువిత్తనమునకు చెడ్డఫలమే గిలుగునట్లు అసురస్వభావముగలవారికి దుఃఖముచే గలుగును. ఇహమందును అలాగే యుండును; పరమందును అదేప్రకారముగ గలుగును. ఇదేరీతిగా మంచి బీజము వేయువారికి మంచి ఫలములున్ను గలుగును ఈ కార్యములో శ్రద్ధ నుంచక తపస్సుగాని, భక్తిగాని, సత్కర్మలుగాని చేయుచుండినను దైవకృప కలుగదు. జ్ఞానముదయించదు. కనుకనే భగవంతుడు దైవికగుణములు గలవారికి మాత్రమే మోక్షము గలుగుననియు, రాక్షసగుణములు గలవారికి నరకము ప్రాప్తించుననియు నుపదేశించిరి. ఇది ఈశ్వరునియొక్క నియతిగా నున్నది దానిని పరమేశ్వరుడు మార్చుకొనడు. అసురగుణమే తామసస్వభావ మనియు, పైశాచిక లక్షణ మనియు గ్రహించవలెను. దైవగుణమునకే సాత్త్వికగుణమనియు, ఈశ్వరవిభూతి యనియు పేర్లు, కర్మఫలప్రాప్తి సర్వేశ్వరుని నియతి యగుటచే కొందఱు పరమభక్తులై యుండియు కొన్ని కష్టములకు పాత్రులగుచున్నారు. ఇది యెపుడో చేసిన పాపకర్మఫలమని ముముక్షువులు గ్రహించదగును. అలాగున ప్రస్తుతము కొందఱు దుష్టకృత్యములు చేయువారైనను భాగ్యవంతులుగా కనబడుచున్నారు. అదిన్ని వారు ఎప్పుడో చేసిన సుకృతఫలవిశేషమని తెలియదగును.

అయితే యీపైన జెప్పిన రెండును బాహ్యఫలమును గుఱించియే. బాహ్యమునవే మనకిట్లు గాన్పించును. ఏలన సుఖమునకు మనస్సే స్థానమగుటచే మనశ్శుద్ధి గలవాడు దరిద్రుడైనను గొప్ప ఆత్మశాంతి సౌఖ్యమును పొందుచుండును, ధనవంతుడైనను ఆత్మసంస్కారము శుద్ధముగా లేనిచో దుఃఖములో మునుగవలసియుండును. మాయవల్ల జ్ఞాననేత్రము మూయబడియుండుటచే కర్మయొక్క గతిని. ఎవరును తెలిసికొనజాలకున్నారు. అయినను అనుమాన, ప్రత్యక్షములద్వారా కారణములేక కార్యము

గలుగదని యూహించుకొనవలయును. ఒక్క అడవిప్రదేశమును మంచి పుష్పోద్యానముగ చేయవలసిన ఏలాగున కంటకాది సమస్త వృక్షములను సమూలముగ ఛేదించి తీసివైచి ఉత్కృష్టములగు వృక్షములను పెట్టి పెంచుదురో, అలాగున హృదయారణ్యములోగల దుర్గుణములను, దుస్స్వభావములను, దుర్వృత్తులను, దుష్ప్రవర్తనలను, దుర్మార్గములను, దుష్ట విచారములను అన్నింటిని నిర్మూలన మొనర్చి ఆ స్థానములో సత్యము, శాంతము, దయ, విరక్తి, భక్తి, జ్ఞానము మొదలగు సుగుణములను పెట్టి జాగ్రత్తగా పెంచవలెను. అపుడు మాత్రమే నిత్యానందమును, పరమ శాంతియు జీవులకు కలుగును. ఇదియే భగవంతు డుపదేశించిన విద్యాసారము. కర్షకులు ఫలపుష్పాదులను పెట్టిపోషించు తోటమాలులున్న ఏలాగున వారిభూములలో అప్పుడప్పుడు ఉద్భవించెడు గడ్డి మొదలైన వానిని తీసివేయుచుందురో, అలాగున హృదయాంతరాళములో జన్మ జన్మాంతరములనుండి కలుగుచు వచ్చిన సంస్కారములను నశింపచేయ వలెను. కాని అవి అతిసూక్ష్మములుగా నుండుటచే సంపూర్ణముగా ఒకేసారి నశింపచేయుటకు సాధ్యముకాదు. కావున అవి ఆవిర్భవించినపుడెల్ల అట్టి దుర్గుణములు ప్రకృతిసంబంధములని తలంచి తీసివేయుచుండవలయును. కంటకాదితృణవృక్షములు తీసవేయబడనిచో, అవి అసలు పైరును, ఫల వృక్షాదులను అణచివేసి దుర్బల మొనర్చును. అలాగున ప్రాకృతగుణము లుండిన అవి ఆత్మజ్ఞానఫలమును సన్నగిల్ల చేయునని సాధకులు సదా జ్ఞాపకము చేసికొనవలెను, రోగియైనవాడు ఏ యేవస్తువులు భుజించవచ్చునో, ఏయే పదార్థముల విడువవలయునో యెఱింగి జాగ్రత్తగ వర్తింపవలసి యున్నట్లు భవరోగులగు జీవులున్న తగని గుణములను విడిచిపెట్టి తగిన గుణములను సంపాదించుకొనవలెను. అట్లుకానిచో ఎంత శ్రేష్ఠౌషధమైనను పథ్యము సరిగా చేయనిచో ఆరోగ్యము కలుగనట్లు ఎంత గొప్ప గురువునద్ద నుండి యుపదేశము నొందినను భవరోగము నశింపదు. ఆత్మశాంతి గలుగదు. ఈ తత్త్వమంతయు భక్తులు ఈ యధ్యాయమున గ్రహించుకొన వచ్చును.

మఱియు మంచివృక్షమునకు లేప్రాయమున పురుగులు పట్టెడు స్వభావ మెట్లుండునో, మఱియు జాగ్రత్తతో కనిపెట్టి వాని నెట్లు తీసివేయ

వలసియుండునో, అలాగున్న అధ్యాత్మజ్ఞాన నిష్ఠలో ప్రథమమున విఘ్నము లనేకములు గలుగవచ్చును. కాని వాటిని కనిపెట్టి రహిత మొనర్చుచుండ వలెను. జన్మాంతర సుకృతవిశేష మెక్కువగా గలవారికిని, ఈశ్వర కృప గలవారికిని ఎక్కువ ప్రతిబంధము లుండవు. కాని తక్కినవారికి పతనము గలుగుటకు కారణము లనేకములు గలవు

అందు విషయవిరక్తి లేకయుండుట యొకటి. విషయవిరక్తి కలుగుట చాల కష్టము. ఏలన, ప్రపంచముయొక్క సంసృతియంతయు దానిపై నిబిడముగా బంధింపబడియున్నది. కాలచక్రగమనమంతయు దానిలోనే అమర్చబడియున్నది. సృష్టియొక్క క్రమమంతయు దానిలోనే ఇమిడి యున్నది. అది లేనిచో ప్రపంచమే లేదు. అత్యధిక గురు భక్తియు, దైవ భక్తియు పుణ్యబలమునుగల జీవునిమాత్రమే అది యెక్కువగ బాధింపక చిన్నగా విడివిపెట్టును. కావున సత్కర్మలును, సదా చారములును, ఆత్మ విచారమును, సదా కలిగియుండేలాగున చూడవలెనని మహనీయులు చెప్పెడు రహస్యము. దీనియందీశ్లోకము ముఖ్యము.

యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥
(16-23)

ఎవడు శాస్త్రవిధినుల్లంఘించి తన యిష్టానుసారమే ప్రవర్తించునో, అట్టివాడు (కార్య) సిద్ధిని బొందడు. (ఇహలోకమున) సుఖమును బొందడు, (మరణాంతరమున) మోక్షము నొందడు.

## శ్రద్ధాత్రయ విభాగ యోగము

సత్త్వ రజస్తమోగుణములు మూడున్ను మానవులయం దెట్లు అణగియున్నవో, అవి యేలాగున ఆత్మను ప్రేరణచేయునో, ఈమున్నగు విషయములు ఈ యధ్యాయమున వివరముగా జెప్పబడినందుచే దీనికి శ్రద్ధాత్రయ విభాగయోగమని పేరువచ్చినది. దీనిలో చెప్పిన గుఱుతులను కనిపెట్టిన ఎవరు యేస్వభావము గలిగియుందురో తెలిసికొన వచ్చును.

జన్మాంతరసంస్కారము ననుసరించి అంతఃకరణ మేర్పడి యుండును దానిలోగల జీవుడున్ను అలాగుననే ప్రవర్తించును.

అయితే జీవులు పూర్వజన్మ సంస్కారము ననుసరించియే ప్రవర్తించు చుందురని చెప్పినది నిజమైనచో ప్రవృత్తి మార్గములోనుండు జీవుడు నివృత్తి మార్గములోనికి ఎట్లు రాగల్గును? రజస్తమోగుణములుగల మానవులు సత్వగుణములోనికి ఎట్లు ప్రవేశింప గల్గుదురను సందేహము సామాన్యులకు కలుగవచ్చును. సరి, అట్టైన ధర్మముల నుపదేశించెడు వేదశాస్త్రములున్ను, జ్ఞానము నుపదేశించెడు పుణ్యాత్ములున్ను, వ్యర్థులై పోవుదురుగదా యని శంకింపబనిలేదు. జీవులయొక్క నైజస్వభావము దైవాంశ మగుటచేతను, శుద్ధజ్ఞాన స్వరూప మగుటచేతను, సహజముగ ఆనందస్వరూప మగుటచేతను, ప్రతిజీవికి ఉత్తమసుఖము పొందవలెనను తలంపు గలుగుటచేతను, జీవులు చైతన్యస్వరూపమగుటచేతను - త్రోవ దప్పిన బాటసారికి మంచిమార్గమును జూపిన అతడేలాగున దాని ననుసరించి పోవుచుండునో, లేక మంచి ఆహారము దొరకక ఆకులు అలములు గడ్డలు కాయలు మొదలైన వానిని తిని జీవించువారికి ఉత్తమ భోజన పద్ధతి యేర్పడిన, వెంటనే యెట్లు మార్చుకొనెదరో అలాగున ధర్మమార్గము తెలియక సంకటపడు నట్టివారికి ధర్మశాస్త్రమున్ను, ధర్మబోధకులున్ను ఉపయోగపడుదురు ప్రజ్ఞావంతులు తమలోగల రజోగుణతమోగుణ దోషము లను విడిచి సత్త్వగుణములోనికి వచ్చుటకు మార్గ మేర్పడును. రోగులైన వారు రోగశాంతి పొందుటకు ఏలాగున ఆహారమును మార్పుచేసికొని ఆరోగ్యపదార్థములను భుజింతురో, అలాగున ప్రాజ్ఞులగు జీవులకున్ను ఉత్తమగతిని గలుగజేసికొనుటకు అవకాశము గలుగును. కనుక్క గుణ దోషమును తెలిపెడు పవిత్ర శాస్త్రములున్ను, జ్ఞానము నుపదేశించెడు పుణ్యపురుషులును వ్యర్థులు గాజాలరు.

ఈ యధ్యాయమును బాలా జగరూకతతో చదువవలసిగొండును. అట్లైన మాత్రమే వారు తమయొక్క స్థితిగతులను తెలిసికొనుటకు సాధ్య పడును. ఇతరుల స్థితిగతులను కూడ తెలిసికొనుటకు అవకాశము గల్గును. మూడుగుణము లని చెప్పినను, మూడుశ్రద్ధలని చెప్పినను అర్థమొక్కటియే మూడు గుణములను గురించి 14-వ అధ్యాయమున చెప్పినందువే ఇచ్చట

మూడువిధములగు శ్రద్ధలని చెప్పుటకు కారణమైనది. కావున ముముక్షువులు తమలోగల రాజస తామస శ్రద్ధలను కనిపెట్టి వాటిని రహితమొనర్చి శ్రద్ధగలిగి వర్తించేలాగున చూడవలెను. దీనితోను తృప్తి నొందక శ్రద్ధా త్రయాతీతమగు శుద్ధజ్ఞాన స్వరూపస్థితిలో నిలుకడ చేసికొనవలయును.

అది యీ మూడు విధములగు శ్రద్ధకంటె విలక్షణము, అది శివము, ఆనందము, అమృతము, శాశ్వతము అయితే సాత్త్వికశ్రద్ధ నవలంబించి అచ్చోటకు ప్రయాణముచేసిన మాత్రమే ఆ స్థానములోనికి వెళ్ళగలము. ఈ మార్గము సుగమము. అచ్చట ప్రకృతు లన్నియు ప్రయాణమునకు అనుకూలముగానే యుండును. మార్గము చాలా ప్రసన్నముగాను, ప్రశాంతముగాను ఆనందముగాను నుండును. రజోగుణ తమోగుణములు గలవారి మార్గములు కంటకావృతములు భయంకరజంతుసంకీర్ణములు. ఎచ్చటను ప్రతిబంధములే కన్పించును. ఒక్క మూరెడుదూర మేగిన మూడు మూరల క్రిందకు జారిపడిపోవును, మార్గము మహాదుర్గమము. అవరోధములు మెండు. కనుకనే పాపముగలవారు మోక్షమార్గములో ప్రవేశించినను అనేక పతనములు, సంకటములు. రోగబాధలు మొదలైనవి కలుగును. ఇవన్నియు ఈశ్వర భక్తిచేతను. పుణ్యకర్మల ఫలముచేతను, పరిశుద్ధ వ్రతములచేతను దాటవలెను. రాజభటులచే నిరోధింపబడిన మార్గముయొక్క పురోభాగమునకు ఏలాగున వెళ్ళవలెనో, కాని రాజాజ్ఞను సంపాదించినచో ఇంతకు పూర్వము నిరోధించినవారే యెంతో ఉపకారపరులై మార్గావరోధము తొలగించి ఏలాటి ఆపత్తులను గలుగజేయక సన్మార్గముగుండా తీసికొని పోవుదురో, అలాగున ఈశ్వరకృపయొక్క ఫలమును గూర్చియు నెరుంగవలెను ఈశ్వరకృపగల్గినచో అప్పుడు సత్త్వగుణశ్రద్ధ గలవారు పోయ్యెడు త్రోవలో కలుసుకొనెదరు అప్పటినుండి మఱల కష్టమేమియు నుండదు, పైవారివలె శాంతియు సౌఖ్యమును వీరికికూడ లభించును. ఈ యధ్యాయమందీ శ్లోకము ముఖ్యము.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః
(17-3)

ఓ యర్జునా! సమస్త ప్రాణులకును వానివాని పూర్వజన్మసంస్కారములతో గూడిన యంతఃకరణమునకు దగిన శ్రద్ధయే కలుగుచున్నది. ఎవడెట్టి శ్రద్ధగలవాడో వాడట్టి శ్రద్ధతో గూడినవాడే యగును

## మోక్షసన్న్యాసయోగము.

ఈ అధ్యాయమున మోక్షముయొక్కయు, సన్న్యాసముయొక్కయు లక్షణములు విస్పష్టముగా చెప్పబడినందున దీనికి మోక్షసన్న్యాస యోగమని పేరుగలిగెను. మఱియు త్యాగశబ్దముయొక్కయు సన్న్యాసశబ్దముయొక్కయు అర్థము దీనిలో నిరూపింపబడినది. సమస్త కర్మలయొక్కయు, సర్వానుష్ఠానములయొక్కయు పర్యవసానము మోక్షమగుటచేతను ఈ గ్రంథము ఈఅధ్యాయముతో సమాప్తినొందుటచేతను దీనికీపేరు వచ్చినది. మఱియు అన్ని ఆశ్రమముల అంతిమ స్థానమగునది తురీయాశ్రమమగుటచేతను. అట్టి తురీయాశ్రమము ముక్తిని గలుగ జేయునదగుటచేతను, ఈ అధ్యాయము అట్టి తురీయస్థితిని అనగా మోక్షమును తెలుపునదగుటచేతను, ఇచట మోక్షమని, సన్న్యాసయోగమని రెండుపేర్లు ఒకటిగా గూడియున్నవి. బ్రహ్మచర్యాది మూడాశ్రమములున్ను సరిగా అనుష్ఠించుచు వచ్చిన ఏలాగున యత్యాశ్రమమునకు స్వయముగ అర్హత గలుగునో, ఆలాగున ఇదివఱకు శ్రీభగవాను ఉపదేశించిన 17 అధ్యాయములున్ను సరిగా ఆచరించుచు వచ్చిన సన్న్యాసాశ్రమావస్థయున్ను దానివల్ల మోక్షమున్ను చేకూరునని ఈ పేరుయొక్క గూఢార్థమైయున్నది. దానివల్ల అన్నియాశ్రమములును అంత్యమమున సన్న్యాసాశ్రమమును స్వీకరించవలెనని గోచరమగుచున్నది. అట్లుగానిచో నిర్విషయ నిస్సంకల్ప నిస్సంగత్వస్థితి జీవకోట్లకు గలుగుట దుస్తరమని బోధించు శ్రుతివాక్యములను జ్ఞప్తిలో నుంచి కరుణామూర్తియగు శ్రీభగవంతుడు ఈ యధ్యాయమునకు ఈ నామధేయమొసంగినాడు. భగవదాశయమున్ను ఇదే యగుటచే గీతామహోపదేశమును పొందిన శ్రీ అర్జునుడున్ను, ధర్మరాజాదులున్నూ, అంత్యకాలమున సమస్తమును పరిత్యజించి సన్న్యాసాశ్రమము స్వీకరించి (తాపసవేషమునుధరించి) మహాప్రస్థానమున ప్రవేశించిరి. పాండవుల మహాప్రస్థానము స్వర్గారోహణము మొదలగు భాగములను మహాభారతమును చదివిన విస్పష్టము కాగలదు.

అంతేగాక త్యాగశబ్దముయొక్క లక్ష్యమున్ను సన్న్యాసశబ్దము యొక్క లక్ష్యమున్ను ఒకటేయని ఈ యధ్యాయమున నిశ్చయముగ స్థిరపరచిన విషయము సామాన్యముగాదు ఇది చాల అగాధవిషయము. ఇది పరమప్రాప్తిని కలుగజేయునదగుటచే ఈ యధ్యాయమున "సర్వ ధర్మాన్ పరిత్యజ్య"-అను చరమశ్లోకము నుపదేశించిరి. శ్రీవైష్ణవ సాంప్ర దాయులకు దీనికంటె ముఖ్యమైనది మఱియొకటిలేదు తిరుమంత్ర మెటు వంటిదో ఇదిన్ని వారికి అటువంటిదే అని యర్థము శ్రీరామానుజాచార్యుల వారు దీనికి గొప్ప భాష్యము వ్రాసియున్నారు. సన్న్యాసమునకు కేవలము శిఖాచ్ఛేదన, కాషాయవస్త్రధారణ కావలయునను అర్థము కాదనియు, సర్వ కర్మఫల త్యాగమే అర్థమనియు దీనియందు నిరూపింపబడినది. ఇట్టి అమోఘ విషయమును సమన్వయపఱచుట సామాన్యమైన పనిగాదు

మఱియొక అర్థముకూడ దీనికి గలదు అదేమన, మోక్షసన్న్యాస యోగమని చెప్పుటచే మోక్షమును కూడ సన్న్యసించవలెనను అర్థము స్ఫురించుచున్నది. ఇంతవఱకు 17 అధ్యాయములలో జెప్పిన సమస్త విషయములున్ను మోక్షముకొఱకే యైయుండగా? ఆఖరున అట్టి మోక్షమును గూడ వదలిపెట్టుమనుట యెంత విపరీతముగా నున్నది! ఒక ప్రభువు తనదగ్గరనుండు కింకరులతోను, సేవకులతోను – నేను చెప్పేలాగున ఆచరించిన మీకోర్కె లన్నియు నిర్వహింప బడగలవని, చెప్పి తనయొక్క సమస్త కార్యములను చేయించుకొని. ఆఖరున–మీకు ఏయే కోర్కెలను నిర్వహించెదనని చెప్పియున్నానో ఆ కోర్కెలనుగూడ ఇప్పుడు విడిచి పెట్టుడు అనగా ఏమియు ఇచ్చుట లేదు ) -అని వచించిన అది యెటువంటి మాటయో ఇదిన్ని అటువంటిదే?.

ఓహో! భగవంతుడుకూడ ఇట్టి మోసకృత్యము గలవాడా! దీనియొక్క రహస్యమదిగాదు. 17 అధ్యాయములవరకు ఉపదేశించిన వాక్యముల ప్రకారమనుష్ఠించినచో మోక్షమున్ను స్వయముగానే గలుగునను ఉద్దేశ్య మును లోపల నుంచుకొనియే ఈయధ్యాయమునకు మోక్షసన్న్యాసమని నామధేయ మిడిరి. మోక్షము కావలెనను సంకల్పము ఎవనికి గల్గును? మోక్షము పొందనివానికేగదా! ముక్తుడైన పిదప యిక మోక్షమును కోరవలసిన పనియే మున్నది? ఋణముగలవాడే ఋణవిమోచనమును

కోరును. ఋణము తీయనివానికి ఋణ నివృత్తి గల్గవలెనను చింతయుండదు గదా॥ అలాగున రోగగ్రస్తునకే ఆరోగ్యము గలుగవలెనను విచారము గల్గును. రోగనివృత్తిగల్గి మంచి ఆరోగ్యస్థితిలో నుండువారికి ఇక రోగ విమోచనము గావలెనను చింతలేదు గదా? అట్లనే కారాగృహమున నుండు వారికి దానినుండి విడుదల హొందవలెనను సంకల్పము బాధించుచుండును. కారాగృహమునుండి విడుదలనొందిన తరువాత అట్టి విచారమక్కరలేదుగదా! అలాగున 17 అధ్యాయములలోను బోధించిన ట్లాచరించు వానికి మోక్షమును గూర్చిన విచారము గూడ వదలదగినది, అనగా నట్టివారు జీవన్ముక్తులై రని తాత్పర్యము ఇందు సందేహ మేమియును లేదు.

వేదాంతసారగర్భితమగు మఱియొక్క అర్థముకూడ దీనిలో నిగూఢమైయున్నది. అదే దీనిలోగల పరమరహస్యము ఇది సామాన్య జనులకు గోచరించునది కాదు. అదేమన, అజ్ఞాన దశలోనే జీవుడు తాను బద్ధుడను విచారము గల్గియుండును. గీతలో చెప్పినట్లనుష్ఠించుటచే అజ్ఞానము క్షయించి, జ్ఞానముదయమై, తాను చిత్స్వరూపుడనియు, ఈశ్వరాంశ మనియు, నిత్యుడనియు, ఏ కాలమున్ను తాను బంధావస్థను హొంది యుండ లేదనియు, బోధము గలుగును. అట్టి బంధావస్థ అజ్ఞానమువల్ల తనయొక్క నిజస్వరూపము తెలియకపోయిన భ్రమమాత్రమే యని యపుడు గోచరము గాగల్గును గాన మోక్షాపేక్షనుగూడ సన్న్యసింపుము. అనగా ఉపేక్షింపుము అని చెప్పబడినది. ఇదియే యిందలి రహస్యార్థము. దీనికి సంబంధించిన శ్లోకములు గీతలో అనేకములు గలవు. కాని యే శ్లోకములున్ను దీని యందుకూడదని ముందుగానే నిశ్చయించుటచే వాని నిచట నుదాహరించుట లేదు యథార్థముగ వేదాంతవిచారము అనుభవజ్ఞులగు మహనీయుల దగ్గఱ నుండి శ్రవణము చేసిన, ఆత్మకు ఏ కాలమునను బంధము గల్గియుండ లేదను తత్త్వము గోచరము కాగల్గును. అవిద్యయొక్క మహిమచేతనే జీవుడు తాను నిత్యముక్తుడై యుండియు బద్ధుడనని తలంచుచున్నాడు. ఆ యవిద్యయే వాని కట్టిబుద్ధిని గలుగజేయుచున్నది. స్వప్నములో అనేక విధములగు కార్యములు జరిగినట్లు కనుపించినను జాగ్రదవస్థలోనికి వచ్చినపుడు అవన్నియు ఏలాగున అసత్యములను బోధగల్గునో అలాగున అవిద్యామోహములోనుండు వఱకు మాత్రమే జీవున కట్టి భ్రాంతులన్నియు

గలుగుచుండును. గీతాచార్యు లుపదేశించినట్లు నిష్కామకర్మల నాచరించి నప్పుటచే జీవునియొక్క ఆవరణలు వదలిపోయి వానికి తమయొక్క నిజస్వరూపము గోచరమగుచుండును. కనుకనే 5-వ అ. 16-వ శ్లోకములో అజ్ఞానముచే జ్ఞానము ఆవరింపబడినదియు, జ్ఞానమువల్ల అట్టి ఆవరణము తొలగునపుడు సూర్యునివలె ఆత్మజ్ఞానము స్వయముగ ప్రకాశించుననియు చెప్పుటకు హేతువైనది. అప్పుడు తాను కేవలము ఆ పరబ్రహ్మ యొక్క అంగమే యనియు లేక ఆ పరబ్రహ్మము తాను గానే యుండెననియు లేక పరబ్రహ్మయొక్క ప్రతిబింబము తానుగా నుండెననియు బోధము గల్గును. ఆత్మనుగూర్చి పై జెప్పిన మూడు అభిప్రాయములలో ఒక్కొక్కటి యొక్కొక్క సంప్రదాయమున గలదు ఈ మూడున్ను ఒకే వస్తువుయొక్క అవాంతర భేదములని గ్రహించిన చాలును. మోక్షము పొందవలెనను సంకల్పముకూడ విడువవలెనని చెప్పుటచే మఱల యితర సంకల్పములు కూడదను విషయమై చెప్పవలయునా! సంకల్పము లుండునంతవఱకు ఆత్మ అపూర్ణ స్థితిలోనే యుండును. కొఱతగల హృదయములనుండియే కోరిక లుద్భవించును. అదిన్ని గాక ప్రకృతియొక్క శుద్ధభాగము గాని, అశుద్ధ భాగముగాని అంతఃకరణములో నుండునంతవఱకు సంకల్పము లుద్భవించుచుండును. అది శుద్ధప్రకృతియైనచో శుద్ధసంకల్పములున్ను, మలినప్రకృతియైనచో అశుద్ధసంకల్పములున్ను పుట్టుచుండును. ఈరెండు ప్రకృతులున్ను సాక్షాత్ శుద్ధజీవునియందుండవు. కావున ఆ దశలో సంకల్పములు గలుగవు. అప్పుడు తాను ఏ సంకల్పముగాని, బంధములు గాని, మాయామోహములుగాని లేనివాడనియు కేవలము నిత్యస్వరూపుడనియు. జ్ఞానైకనిలయుడనియు, స్వయంప్రకాశుడనియు బోధముగలుగును. ఏ కాలములోను ప్రకృతి తనలో గూడియుండలేదనియు, తాను కేవలము అఖండజ్ఞాన స్వరూపియై యుండెననియు తెలివి గల్గును. ఇదివఱకు గల్గిన యవస్థలన్నియు సంకల్పమహిమవల్లనే యేర్పడినవనియు, ఈ కాన్పించు నామరూపములు మాయవలన కల్పితములనియు, సత్యముగా ఏకాలమున గాని మాయయు మాయామహిమయు ఉండి యుండలేదనియు సద్బోధముదయమగును. ఇట్టి పరబ్రహ్మజ్ఞానస్థితియే ముక్తియని వేదాంతులున్నూ అంతయు భగవన్మయమని పరమభక్తులున్నూ, అనుభవమును పొందగలరు.

అట్టివారి జన్మము ధన్యము వారికి మఱల జన్మము గలుగదు. కలిగినను బంధనము౦డదు. జ్ఞానులలో లోకోద్ధారణ కొఱకు మాత్రము కొందఱు అవతరించవచ్చును. అట్లైనను సదా శివము,ఆనందము, అమృతమను భావము గలిగి యుందురు ఇట్టి దివ్యావస్థ పరమపావన స్థితి యని చెప్పదగును.

ఈ పదునెనిమిదవ అధ్యాయము సామాన్యము కాదు. ఇది ఇంతవఱకు చెప్పుచువచ్చిన అధ్యాయము లన్నింటియొక్క సారము దీనిని ప్రత్యేకముగ ఒక అధ్యాయమని తలంపక అన్ని అధ్యాయముల సారమని గ్రహించదగును. అంతేగాక. ఆయా అధ్యాయములలో చెప్పదలంచిన విషయములందు ఏయే కొఱత యుండెనో, అదంతయు ఈ అధ్యాయములో పూర్తి చేసి యున్నారు. కనుకనే 14-వ అధ్యాయములో జెప్పిన త్రిగుణములను గూర్చియు, 17-వ అధ్యాయములో నుపదేశించిన శ్రద్ధాత్రయమును గూర్చియు ఈ యధ్యాయమున మఱల నుపదేశించుటకు కారణమైనది.

మఱియు "నైష్కర్మ్యసిద్ధి," యనగా నిష్కామకర్మచే పొందవలసిన ఈశ్వరప్రాప్తి ఈ యధ్యాయములోనే తెలిపినారు. నిర్వాణమున్ను. నిర్వికల్పసమాధియు దీనిలోనే యుపదేశింపబడినవి. 49-వ శ్లోకమునుండి 54-వ శ్లోకమువఱకు చూడుడు. బ్రహ్మనిష్ఠులు గ్రహించి ఆచరణలో నుంచదగిన అంశము లన్నియు సంక్షిప్తముగ నిచ్చోట నుపదేశింపబడినవి. ఇదే గీతయొక్క ప్రాణము దీనిని ఎల్లప్పుడున్ను మనస్సులోనుంచి అనుష్ఠించు వారికి మఱియొక ప్రమాణ మవసరములేదు.

పరమపవిత్రమును, మోక్షమార్గ కవాటమును తెరచునదియునగు చరమ శ్లోకము (66-వ శ్లో.) చూడుడు ఇక ఈవిషయమై యెక్కువగ చెప్పబూనలేదు. ఒక్క రహస్యమును మాత్రము చెప్పి దీని నుపసంహరించెద. అదేమన-ఏ గ్రంథమైనను, ఏ శాస్త్రమైనను, ఏ మంత్రమైనను పఠించునప్పుడు దానిని ప్రపంచములో మొదట నుపదేశించిన వారియందు ఎంతటి భక్తివిశ్వాసములు గలిగియుందురో, అంతే అర్థము, అంతఫలము, అంతే మహిమ అభ్యాసకులకు గలుగును. ఇది సత్యము. కావున శ్రీకృష్ణపరమాత్మ యందును, శ్రీగీతాశాస్త్రమందును మీకెంత భక్తివిశ్వాసములుండునో అంతే ఫలమును పొందగలరు ఇది నిజము.

సర్వేశ్వరుని ప్రియపుత్రులారా! పుత్రికలారా! ఈగీతాశాస్త్రమును ఈశ్వరసంతానమగు మీరందఱును చదివి సంసారదుఃఖమును రహిత మొనర్చుకొని మోక్షమును పొందవచ్చును. పరమేశ్వరసృష్టి యగు శోభాయ మాన సూర్యప్రకాశమున్ను, చంద్రునియొక్క శీతలమైన చంద్రికయు, ప్రాణమును గలుగజేయు వాయువున్ను, ఓషధులనువృద్ధి చేసెడు మేఘజల మగు వృష్టియు, సర్వజనులకు ఏలాగున సమానముగా జగదీశ్వరునిచే సృష్టింపబడినవో, ఆలాగున తాపత్రయముల రహిత మొనర్చి ఇహమందును పరమందును నిత్యసుఖమును గలుగచేయు యీగీతాశాస్త్రమును అందఱును పఠించి పాపవిమోచనమొంది జీవితమును ధన్యము గావించుకొనవచ్చును. ఈవిషయమై శ్రీభగవాను లీ యధ్యాయమున ఉపదేశించిన 68, 69 శ్లోకములే ప్రమాణములు. "భగవద్భక్తులకు అతిపావనమగు ఈశాస్త్ర మును ఎవ రుపదేశింతురో వారికి సమానమైన పరమభక్తుడు మఱియొకడు నాకు మూడు లోకము లందునులేడు, ఉండబోడు, ఉండియుండలేదు" అని శ్రీభగవానులే ప్రతిజ్ఞ చేసి చెప్పియుండగా మఱల మీకు ఏల సందేహము గలుగవలయును?

స్వయముగానో లేక యితరుల వాక్యములను వినియో, మీలో కొందఱు తామద్వైతులుగారనియు, పాపులనియు తలంచుటయు తలంప జేయుటయే యిట్టి పతనమునకు కారణమైనది. ఆత్మవేత్తలని తలంచెడు కొందరు, తమలోను ఇతరులలోనుగల చైతన్యమగు ఆత్మను మఱచి జడమగు దేహమునకే యాధిక్యము నిచ్చినందుచేతనే ఈ దేశమింత హీనదశకు వచ్చినది. అట్టి జడభావము బలపడినందుచేతనే మీలో వెలుగు చుండు దైవము మఱుగుపడిపోయినది. సర్వజీవరాసులలోను భగవంతుడగు నేను వెలుగుచున్నాననియు, అందఱిలోను నేను సమానముగా నున్నాననియు గీతలో భగవాను లుపదేశించిన వాక్య మెచటనో యంతర్ధాన మొందినది. గుణమునుగూర్చిగాక కేవలము కులమునుబట్టియే వర్ణములను నిర్ణయించి మానవుల యభివృద్ధికి ఏలాటి మార్గమును లేకుండ చేసినందువలననే ఆర్యుల సంతానమగు ఈ మానవులు కేవలము పరులకు బానిసలై అనార్యుల పీఠిక వచ్చిపోయిరి.

అయినను, పాతపడిన దుర్బలమైన త్రాటితో దేనినైన గట్టినను కొంతకాలమున కది జీర్ణమై పోయినట్లు తెగిపోవునట్లు అసత్యమైన బంధనముచే ఎంతబలముగా బంధింపజూచినను నిలుచునా? కల్పితమగు దేహమునకే వర్ణముల గల్పించినందుచే, అవి యిప్పటికి జీర్ణములై పోయి జనులు వారివారి శక్తి ననుసరించి ప్రవర్తింప దొడగిరి. జనుల యభివృద్ధి విషయమై తగు రాజ్యపరిపాలన లేకపోయెను. ఏలన, ప్రభుత్వమతము వేఱుగాను, ఈ జనులమతము వేఱుగానుండుటచేతనే అట్లు కలుగుటకు కారణమైనది. జనులను ధర్మమార్గములో నడుపువారు జగద్గురువులు. అనగా మతాధిపతులు, వీరి వాక్యములలో జనులకు విశ్వాసము బొత్తిగ లేకపోయెను. ఏలన, సన్న్యాసులకు తగిన తపస్సున్ను, యోగమున్ను, జ్ఞానమున్ను, వీరిలో చాలామందికి క్షీణదశకు వచ్చెను. యోగమునకు బదులు దేహసౌఖ్యమును పోషింపదొడగిరి ఇక వీరి వాక్యములకు విలువ యెచట నుండి వచ్చును? ఆత్మశక్తియుండిన కాలములో వీరి వాక్యములను దైవ వాక్యములుగా జనులు విశ్వసించిరిగాయుండిరి. అప్పుడు వీరికి మంచి నిగ్రహానుగ్రహశక్తి గల్గియుండెను, అంతేగాక వీరు ప్రజలను తమబిడ్డలవలె జూచుచుండిరి. మానవుల యభివృద్ధికొఱకు వీరు సదా విజ్ఞానము నుపదేశించుచుండిరి. ఇప్పుడు గౌరవము కొఱకును, అధికృత కొఱకును, సన్మానము కొఱకును, వాదప్రతివాదములు చేయుటయేగాక న్యాయస్థానములకుగూడనెక్కదొడంగిరి. అంతేగాక తమసౌఖ్యమునే చూడదొడగిరి. అందుచే వీరు సామాన్యమనుజులవలెనైరి. ఇప్పుడు దీపమారిపోయిన రాత్రివలె లోకములో అంధకారము ప్రవేశించెను. దానికే అంధవిశ్వాసమని పేరు. ఇక లోకోద్ధారణ మెపుడు గలుగునో, అపుడు మాత్రమే జనుల ఆత్మయొక్క ఆవరణములుపోయి దివ్యజ్ఞానము ప్రకాశించును. కావున తపస్సంపన్ను లేర్పడి, అధ్యాత్మజ్ఞానము బాగుగగల వారలు తగిన ప్రదేశములలో పుణ్యాశ్రమముల స్థాపించి, యోగ్యులైన జిజ్ఞాసకులకు తగిన సాధనలు, దివ్యవిద్యలు నేర్పి ఆత్మశక్తి నభివృద్ధిపఱచిన మాత్రమే, తెగిపోయిన వంతెనను మఱల శుద్ధపఱచినట్లుండును. అప్పుడు మంచిదారి యేర్పడునుగావున అందఱును ఆమార్గమునవే నడువగలరు.

ఇప్పుడు దేశముయొక్క స్థితి గొల్లవాడులేని గొఱ్ఱెలగుంపురీతియైనది అనేక పుణ్యపురుషులు జన్మించినదియు, అనేక తాపసోత్తములు తపస్సు చేసినదియు, అనేక మహర్షి పుంగవు లుద్భవించినదియు, అనేక ధర్మాత్ములు జీవించినదియు· అనేక కరుణాస్వరూపు లవతరించినదియు, అనేక పుణ్యవతు లగు నారీమణు లుద్భవించినదియునగు ఈ పుణ్యభూమిపై పరమేశ్వరుడు కరుణించినమాత్రమే జనులు కృతార్థులగుదురు. పరమేశ్వరానుగ్రహము నొంది యొక దివ్యపురుషుడు భూలోకమున నవతరింపవలసిన కాల మిపుడా సన్నమైనది వేరుగతి యేమియు కన్పించుటలేదు. ముఖ్యముగా జనుల యొక్క ఆత్మోన్నతి కావలసియుండినచో మానవులయొక్క గుణములకే అధిక్యతగలదని సర్వజనులకు తెలిసేలాగునను, వారి హృదయమున బాగుగ నాటేలాగునను బోధ ప్రారంభింపవలెను. అట్టి గుణము గలవారలకు తగిన యోగ్యతను కల్పింపవలయును. అప్పుడే లోకోద్ధారము కాగలును. ఈ అధ్యాయమున ఈ శ్లోకము ముఖ్యమైనది.

సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

(18-66)

"సర్వధర్మములను విడనాడి నన్నొక్కనినే శరణుపొందుము, నేను నిన్ను అన్నిపాపములనుండి విడిపించెదను, శోకింపకుము—

శ్రీభగవద్గీతాధ్యాయములను గురించిన

విషయము సమాప్తము.

ఓం తత్ సత్.

లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్రీ పారాశర్య ముద్రాక్షరశాల, శ్రీ వ్యాసాశ్రమము.

# విజయ ఘోషలు



దైవమతము ప్రతిష్ఠిత మగును గాక !
కరుణామతము వృద్ధి నొందును గాక !
శాంతిమతము స్థాపిత మగును గాత !
సత్యమతము స్థిరప్రతిష్ఠ నొందును గాక!
ధర్మమతము ఉద్ధరింపబడును గాక !
ఋషిమతము వర్ధిల్లును గాత !
స్వాతంత్ర్యమతము జయించును గాక !
జ్ఞానమతము వ్యాపక మగును గాక!

చరాచర సుఖాభిలాషి.



శ్రీ మలయాళ సద్గురు అధిష్ఠాన మందిరం, శ్రీ వ్యాసాశ్రమం''